కపిలగోశతము నుత్తమవేదవిప్రులకు దానము చేసిన పుణ్యాతిశయమును బహుయాగాచరణ ఫలమును కలుగును. రాజరాజు కాలమునకుముందే పంపకవి కన్నడమున భారతమును విక్రమార్జున విజయ మనుపేర రచించెను. 7, 8 శతాబ్దులలో పెరుందేవనారను కవి యరవమున భారతమును దేశీయములైన వెంబాపద్యములలో రచించెనట. రాజరాజు దేశభాషా రచితములైన యీ రెండు భారతములను వినియుండెను. అతనికిఁ దెలుఁగులోఁగూడ దానిని రచింపఁజేయవలెనను కుతూహల ముదయించియుండును. అదియునుగాక పురాణములు పెక్కు శివునో, విష్ణువునో ప్రశంసించుచుఁ, సాంఘికములై యుండినట్లు కన్పించును. అట్లుకాక వేదార్థమును గథోపాఖ్యానములద్వారా ప్రపంచించుచు సర్వధర్మ సమన్వయ సంధానదక్షమై యలరారునది మహాభారతము. అందుచే రాజరాజు తనమిత్రుఁడు, ఉభయ భాషాకావ్యరచనాభిశోభితుఁడునైన నన్నయను భారతమును దెనుఁగున రచింపుమని కోరియుండెను.

"జననుత ! కృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు" మని రాజరాజు నన్నయను భారతమును దెనుఁగున రచియింపుమని యడిగిన విధము గూఢార్థభూయిష్ఠమై యున్నదని కొందఱు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. మహాభారతము పంచమవేదమని ప్రసిద్ధివడసినది. కృష్ణద్వైపాయనుఁడు దానిని సంస్కృతమున రచించుటకు వేదార్థోపబృంహణమే ప్రధానకారణము. పంపకవి జైనమతావలంబి యగుటచే దానిని కన్నడమున వ్రాయునప్పుడు కథాంశములందువలెనే మతసిద్ధాంతములందును బుద్ధిపూర్వకముగా కొన్నిమార్పులు కావించెను. పాండవులందఱిలో నర్జునున కధిక ప్రాధాన్యమొసంగి తనప్రభువైన యరికేసరికతనితో నభేదాధ్యవసాయము కల్పించుటయు, శ్రీకృష్ణుని భగవత్త్వమును మఱుఁగుపుచ్చి సామాన్యమానవునిగాఁ జిత్రించుటయు, వ్యాసాదియతులను వర్ణించునప్పుడు జైన సంప్రదాయము ననుసరించుటయు నతఁడు కావించిన ప్రధానములైన మార్పులని చెప్పుదురు. రాజరాజు సంస్కృత భారతమునకును కన్నడ భారతమునకును గల యీ వ్యత్యాసమును గుర్తించియే నన్నయతో "వ్యాసునిచేఁ జెప్పఁబడిన భారతమున నిబద్ధమై నిరూపితమైన యర్థము స్పష్టమగునట్లుగా, అనఁగా వ్యాసముని మహాభారతతత్త్వనిరుద్ధముగా" తెనుఁగున భారతము రచింపుమని ప్రత్యేకముగాఁ జెప్పియుండెనని విమర్శకులు భావించుచున్నారు. మఱియు నర్థమేర్పడునట్లుగాఁ దెనుఁగున రచింపుమనెనేకాని యథాతథముగా ననువదింపుమని యతఁడు కోరియుండలేదనియు వా రూహించుచున్నారు. ఈ పద్యమింత సాభిప్రాయముగా రచితమయ్యెనో లేదో చెప్పలేము కాని యందీభావములు స్ఫురించుచుండుటలో మాత్ర మసత్యము లేదు.

రాజరాజు తన్ను భారతమును దెనుఁగున రచింపుమని కోరఁగనే నన్నయ యట్లేయని యామోదసూచకముగాఁ దలయూపియుండలేదు. తెనుఁగుభాష స్వయంసంపూర్ణముకాక యవిస్తృతమును అవ్యవస్థితమునై యున్న యాకాలమున నందు భారతమువంటి మహాకావ్యమును రచింపఁ బూనుట యెంతక్లేశకరమో యాతఁ డెఱుంగును. అందుచే నతఁడు 'దుర్గమార్థజల గౌరవభారత భారతీసముద్రముఁ దఱియంగ' నీదుటకు విధాతకైనను శక్యముకాదనఁ

దన మాట వేఱుగాఁ జెప్పనేల యని వినయమున తన యసమర్థతను సూచించెను. "అమలిన తారకే" త్యాది పద్య మాతని వినయసంపదను, నిరహంకారతను జక్కగా వెల్లడి చేయుచున్నది. కాళిదాసు రఘువంశమున మొదట 'మందః కవియశఃప్రార్థీ' యని చెప్పి తరువాత 'అథవా కృత వాగ్ద్వారే' అని తెల్పినట్లు నన్నయయు పిమ్మట "అయినను దేవా! నీ యనుమతంబున విద్వజ్జనుల యనుగ్రహంబునం జేసి నానేర్చువిధంబున నిక్కావ్యంబు రచించెద" నని యంగీకార మును వెల్లడించెను. తిక్కన "నానేర్చిన భంగిఁ జెప్పి" యనుటకు నన్నయగారి "నానేర్చు విధంబున" ననుమాట యొజ్జబంతి. ఇరువురును సత్త్వమూర్తులును వినయసముద్రులునగుట నట్లనఁజాలిరి. నన్నయ 'ఇక్కావ్యంబు' నని చెప్పుటనుబట్టి యతఁడు సంస్కృతమున నితిహాస మాత్రముగా నున్నదానిని దాను కావ్యముగా సంతరింప నెంచె నను భావము సూచించెనని విమర్శకులు చెప్పుచున్నారు.

పిమ్మట నన్నయ "హరి హరాజ గజాననార్క షడాస్య మాతృసరస్వతీ గిరిసుతాదిక దేవ తాతతికి"ని, గురుపద్యవిద్యకునాద్యుఁడైన వాల్మీకికిని, భారతరచనాధురంధరుఁడును భూరియశో విరాజితుఁడునైన వ్యాసునికిని నమస్కృతు లొనరించినట్లును, సత్సభాంతర సరసీవనంబులను గొని యాడినట్లును వర్ణింపఁబడినది. ఇచ్చటి పద్యములు తరువాతఁ గావ్యాదిని జేయఁబడు నిష్టదేవతా పూర్వకవి స్తోత్రములకు మూలములని చెప్పఁ దగియున్నవి. నన్నయ యిటఁ ద్రిమూర్తులను వారి భార్యలను మాత్రమేకాక యర్కషడాస్యులనుగూడఁ బేర్కొని యుండెను. త్రిమూర్త్యా త్మకుఁడగుటచే నర్కుని, తన ప్రభువునకును దద్వంశీయులకును నుపాస్యదైవమగుటచే షడాస్యుని నతఁ డిచ్చటఁ బేర్కొనియుండును. పూర్వకవులలో వ్యాసవాల్మీకులనుదప్ప మఱి యితర సం స్కృతకవులనుగాని దేశభాషాకవులనుగాని యతఁడు స్మరించియుండలేదు. ఇతర సంస్కృత కవుల నతఁడు స్మరింపమికిఁ గారణమేమో తెలియదు. కాని దేశభాషా కవుల స్మరింపకుండుటకు హేతు వప్పటి కతని మన్నన కెక్కి స్మరణార్హులైన వారెవ్వరును వెలసి యుండలేదేమో యని యూహింపవచ్చును. ఒకవేళ నట్టి వారుండినచోఁ దరువాతఁ గావింపఁబడిన సభాపురస్కారము నందే వారి సన్నుతియు నంతర్భవించి యుండెనేమో! సత్సభలనఁగాఁ బండిత పరిషత్తులని యర్థము ఆ రోజులలోఁ గవుల రచనల గుణాగుణముల నిర్ణయించుటకును, భాషాసారస్వతాభ్యుదయ. మార్గములను సూచించుటకును గొన్ని విద్వత్పరిషత్తులు నెలకొల్పఁబడియుండును. నన్నయ పర్వసంగ్రహము చెప్పుసందర్భమున "సకలసూరిసభారమ్యంబగు తృతీయపర్వము" 'స్త్రీపర్వంబు పదునొకండగు పర్వమునా వెలియు సుకవి పండితసభలన్" అని పండిత సభలను బేర్కొనుట యీ విషయమును బలపఱుచుచున్నది. అసలిట్టి విద్వత్సంఘముల నెలకొల్పు సంప్రదాయము దక్షిణ దేశమునఁ జిరకాలమునుండియు నున్నట్లు కనిపించును. ప్రాచీనకాలమునఁ దమిళదేశము నందు భిన్నభిన్న కాలములలో భిన్నభిన్న ప్రదేశములందు నెలకొల్పఁబడిన మూఁడు సంఘము లనుగూర్చి నక్కీరర్ అగప్పొరల్ కు వ్రాసిన వ్యాఖ్యానములో వివరించియున్నాఁడు. మఱియు నాంధ్రదేశమున శాతవాహనులకాలము నుండియు బౌద్ధమతము వేయాని ప్రజాదరము నంది యుండెను. అందు బౌద్ధసంఘములకును సంఘారామములకును నమితమైన ప్రాధాన్య మున్నది. ఆ కాలమున వానిని జూచి మతమునకువలెఁ గవితాపాండితీప్రకర్షలకును అభ్యు

దయము కలిగించుటకై కొన్ని సంఘములను స్థాపించి యుందురు. నన్నయవంటి ప్రముఖ విద్వత్కవు లందఱికిని అందు స్థానముండియుండును. నన్నయ సత్సభాంతరములం గొనియాడి నక్రమము వానిగుణవిశేషములను, అతనికి వానిపైఁగల గౌరవమును వ్యక్తమొనరించుచున్నది.

అవతారికయందలి తుదిరెండు పద్యములును మిక్కిలి ముఖ్యములైనవి. ఇందు మొదటిది నన్నయ కాతని సహాధ్యాయుఁడైన నారాయణభట్టు తోడ్పడిన విషయమును, రెండవది నన్నయ కవిత్వమందలి గుణవిశేషములను దెల్పుచున్నవి. నన్నయ నందంపూడి శాసనమున నారాయణభట్టు కవితాపాండితీప్రతిభలను రమ్యముగా వర్ణించియున్నాఁడు. అతఁడు కేవల కవియుఁ బండితుఁడును మాత్రమేకాక రాజనీతి ధురంధరుఁడుకూడను. కొంత కాలమతఁడు పశ్చిమచాళుక్య చక్రవర్తియైన త్రైలోక్యమల్ల దేవరకు మంత్రియై యుండినట్లు క్రీ. శ. 1055 లో నతని కూఁతురు కుపను దాక్షారామమున వేయించిన శాసనమువలనఁ దెలియుచున్నది. రాజరాజు 1051 లో బశ్చిమ చాళుక్యులతో సంధిఁజేసికొన్న సందర్భమున నతఁడుకూడఁ గొంతవఱకుఁ దోడ్పడియుండును. అతని కవితాపాండిత్యముల కలరియో యతఁ డొనరించిన సాహాయ్యమును స్మరించియో రాజరాజతనికి నందంపూడి నగ్రహారముగా నొసంగి గౌరవించెను. అతఁడు పెక్కు భాషలలోఁ గవియుఁ బండితుఁడునై యుండినను అతఁడు రచించిన గ్రంథమేదియు నిప్పుడు లభించుట లేదు. "పాయకపాకశాసనికి" అను పద్యమున నన్నయ అతఁడు తన కూరక "తోడయి నిర్వహించె" నని చెప్పెనేకాని యాతోడ్పాటు స్వభావ మెట్టిదో చెప్పియుండలేదు. అందుచే నన్నయ రచించిన భారతభాగమున నారాయణభట్టు వ్రాసిన పద్యములుకూడఁ గొన్ని కలవనియు, నావిషయము వెల్లడియైనచోఁ దనకీర్తికి లాఘవముకల్గునను నీర్ష్యాబుద్ధితో నన్నయ దాని నడఁచి యాతఁడేదో తోడ్పాటు కావించెననిమాత్ర మస్పష్టముగాఁ జెప్పి యూరకుండె ననియుఁ గొందఱు తలంతురు. కాని నన్నయ నిత్యసత్యవచనత్వమును, సుజనత్వమును బురస్కరించుకొని చూచినను, అతఁడు నందంపూడిశాసనమున నారాయణభట్టును బ్రశంసించినవిధమును బురస్కరించుకొని చూచినను ఆ తలంపు యథార్థమైనట్లు తోఁపదు. అదిగాక భారతమును దెనుఁగున రచింపుమని రాజరాజు నన్నయ నొక్కనినే కోరియుండెను గాని యిరువురిని గోరియుండలేదు. నన్నయకు నిజముగా నట్టిదురూహయే యుండినచో నాతఁ డాతని నామమే స్మరింపకుండియుండును. ఆ పద్యము మిత్రునియెడ నాతనికిఁ గల కృతజ్ఞతాదర భావములను బుష్కలముగా విశదముచేయుచున్నది. "పాకశాసనికి భారతఘోరరణంబునందు నారాయణు నట్లు" అను నుపమయందలి సామర్థ్యమునుబట్టి కొందఱు భారతసంగ్రామమున నర్జునునకుఁ గృష్ణుఁడాయుధముపట్టక, అనిచేయక వాఙ్మాత్రమైన సాహాయ్యము చేసినట్లు నారాయణభట్టును నన్నయకు గంటము పట్టక తాళపత్రమును ముట్టక వాక్సాహాయ్యమును మాత్రమే కావించి యుండుటను నన్నయ సూచించెనని చెప్పుదురు. ఇట్టి గూఢార్థమునుకూడ నన్నయ యుద్దేశించెనని చెప్పుట యుక్తముకాదు. అతఁ డట్లే యుద్దేశించి యుండినచో నా పద్యము నిందయే యగునుగాని నుతి కాఁజాలదు. నరనారాయణులకును, దనకును నారాయణభట్టునకును గల సన్నిహిత స్నేహసంపదను సూచించుటకే నన్నయ యా యుపమానమును వాడియుండును. నారాయణభట్టు నన్నయకుఁ గావించిన సాహాయ్య మెట్టిదో నిశ్చయించుటకాధారము లు లేకు

న్నను ఊహించుట కవకాశమున్నది. అప్పటికిఁ దెలుఁగులో నాదర్శము లని చెప్పఁదగిన కావ్యము లేమియు లేమిచేతను, పదచ్ఛందోవిస్తృతులుకాని వ్యాకరణమర్యాదకాని లేక భాష య స్తవ్యస్తముగా నుండుటచేతను అందు మహాభారతమువంటి యుదాత్తకావ్యమును రచించుటెట్లా యని నిరుత్సాహపడుచుండిన నన్నయ కాహవరంగమున నర్జునునకు నారాయణుఁడువలె నారాయణభట్టు బుజముతట్టి ప్రోత్సాహ మొసంగియుండును. అట్టి సమయములలోఁ బ్రోత్సాహమునకుఁగల విలువ యింతింతనరాదు. ఆకాలమున సంస్కృతభాషావిద్వాంసులే రాజాస్థానములఁ బండితులుగాఁ బరిగణింపఁబడుచుండిరి. ఆ పండితులకు దేశభాషలన్నను అందలి కవిత్వమన్నను అంత గౌరవాదరము లుండెడివికావు. అందుచే దేశభాషయైన తెలుఁగునఁ గావ్యము రచించుటకును, అందును బంచమవేద మను ప్రశస్తిగాంచి పవిత్రముగా భావింపఁబడుచుండిన భారతమును దెలుఁగున రచించుటకును పండితులుకాని పూర్వాచారపరాయణులుకాని సమ్మతించియుండరు. అట్టియెడ భారతము కన్నడభాషలో నంతకుముందే రచితమైయుండుటను, అట్టి కావ్యమును దెలుఁగులో రచించు టప్పు డత్యావశ్యకమై యుండుటను సూచించి నారాయణభట్టు వారిని బ్రసన్నులఁ గావించి మిత్రుఁడైన నన్నయకు వారివలన నెట్టి యాటంకమును లేకుండఁజేసియుండును. మఱియు వ్రాయఁబోవు కావ్యమునఁ దత్సమపదములు వాడవలయునా, దేశ్యములు వాడవలయునా, మణిప్రవాళము వాడవలయునా, దానిని సంస్కృత కావ్యములవలెఁ గేవలపద్యమయముగా సంతరింపవలయునా చంపువుగా సంతరింపవలయునా అను విషయమునఁగూడ నతఁడు కన్నడకవుల మార్గమును జూపి నన్నయకుఁ గల సందేహమును దీర్చియుండును. అదిగాక సంస్కృత భారతము గహనము వంటిది. అందు ధర్మతత్త్వనీతి ప్రసంగములును, గావ్యకళాదృష్టితోఁ జూచినచోఁ బ్రధానకథాగమనమున కాటంకము కలిగించు ననవసరఘట్టములును, బునరుక్తులును హెచ్చుగాఁ గనవచ్చుచుండును. వానికిఁ దోడ నెడ నెడ ప్రక్షేపములు కూడఁ జొచ్చియుండును. భారతమును దెలుఁగున రచించు సందర్భమున నేభాగములను విడువవలెను ఏ భాగములను సంక్షిప్తములు కావింపవలయును, ఏ భాగముల నుచితవర్ణనాదులచేఁ బెంపుచేయవలయును, ఏభాగముల నౌచిత్యపోషణమునకును దేశకాలపాత్రానుగుణ్యమునకును ఇంచుక మార్చవలయును మున్నగు సమస్యల నెంతపండితుఁడైనను ఒక్కఁ డేకాకియై సర్వజనాంగీకారముగా పరిష్కరించుట కష్టసాధ్యము. ఇట్టియెడలఁగూడ మహాపండితుఁడు కవీంద్రుఁడునైన నారాయణభట్టు నన్నయకుఁదగిన సలహానొసగియుండును. అట్లే నన్నయ యాంధ్రీకరణవిషయమున నితర పండితులు వివాదములను లేవనెత్తినప్పుడతఁడండయై మిత్రునికి బాసటగా నిల్చియుండును. ఇదంతయు నారాయణభట్టు నన్నయకుఁ గావించిన తోడ్పాటును గుఱించిన యూహామాత్రము. ఇట్టి విద్వన్మిత్రుల తోడ్పాటును ప్రభువైన రాజరాజునవలంబమును లేకయుండినచో నారోజులలో నన్నయ మహాభారతమును దెలుఁగున రచించుట యసాధ్యకార్యమై యుండును.

సాధారణముగాఁ బలువురు నన్నయ మహాభారతము నాంధ్రీకరించి తనప్రభువైన రాజరాజున కంకితము కావించెనని చెప్పుచుందురు. కాని యాంధ్రమునఁ దరువాత వ్రాయఁబడిన పెక్కు కావ్యములందలి యవతారికలందువలె నీభారతావతారికలోఁ బోషకుఁడైన రాజరాజు

కవిని గావ్యము రచించి తన కంకిత మిమ్మని యడిగినట్లు కాని, నన్నయ యందు కంగీకరించి కావ్యరచన కారంభించినట్లుకాని, కృతిపతివంశవర్ణనపద్యములుకాని, షష్ఠ్యంతములుకాని, కృతిపతి కభ్యుదయపరంపరాభివృద్ధిగాఁ గావ్యము నుపక్రమించుటకాని కానరావు. నన్నయ యెచ్చటను రాజరాజు తనకృతికిఁ బతియని చెప్పియుండలేదు. కాని యాశ్వాసాద్యంతములందలి పద్యము లట్టి యభిప్రాయమును గలిగించుచున్నవి. పాల్కురికి సోమనాథుఁడు తన ద్విపదకావ్యముల కిష్టులైన వారిని శ్రోతలుగా గ్రహించినట్లు నన్నయ రాజరాజును శ్రోతగా భావించి యుండెనేమో !

## భారతాంధ్రీకరణము - వైదికమతోద్ధరణము

రాజరాజు నన్నయను మహాభారతమును దెనుఁగున రచింపుమని కోరుటకును, నన్నయ దానిని రచింపఁ బూనుటకును దేశభాషాసముద్ధరణముతోపాటు వైదికమతోద్ధరణమును గొంత వఱకుఁ గారణమై యుండునని పలువురు విమర్శకుల యభిప్రాయము. నన్నయ మహాభారత రచనకును మతోద్ధరణమునకును ఎట్టిసంబంధమును లేదనియు, రాజరాజు నన్నయను భారతము రచింపుమని కోరు సందర్భమున నట్టి యభిప్రాయము వ్యక్తము చేసియుండలేదని యుఁ జెప్పువారు కూడఁ గొందఱు లేకపోలేదు. కాని రాజరాజు వాచ్యముగా నట్టి యభిప్రాయమును వ్యక్తముచేసి యుండకపోయినను మహాభారతాంధ్రీకరణ ప్రయత్నమున కదికూడఁ గారణమై యుండె ననుటకుఁ గొన్ని యాధారములు కానఁబడుచున్నవి.

నన్నయకుఁ బూర్వ మాంధ్రదేశమున బౌద్ధజైనమతములు మిక్కిలి ప్రచారము పొంది యుండెను. కుమారిలభట్టు జైన బౌద్ధ మతసిద్ధాంతములను దీవ్రముగా ఖండించి పూర్వమీమాంసా పద్ధతిని బ్రతిష్ఠాపింప యత్నించి యుండెను. జైనులును బౌద్ధులును నూరకుండక దేశభాషలు నేర్చుకొని తమతమ మతముల మాహాత్మ్యమును సామాన్యప్రజలందుఁ బ్రచారము చేయుచు వైదికమతమునుండి వారిని తమ మతములోనికిఁ బరివర్తనము కావింప యత్నించుచుండిరి. వారిప్రయత్నములు సఫలము లగుచుండె ననుటకు రాజరాజుతండ్రియైన విమలాదిత్యుఁడు పరమబ్రహ్మణ్యుఁ డయ్యుఁ జివరికాలమున జైనమతము నవలంబించుట యొక దృష్టాంతము. వైదికమతాభిమాని యైన రాజరాజు జైన బౌద్ధమతస్థుల ప్రయత్నముల నారసి, వారి ప్రచారముచే వైదిక మతమునకుఁ గలుగుచున్న హాని పరిశీలించి, సామాన్యజనులకుఁ గూడ వైదిక మత మహత్త్వము నెఱిఁగింపఁదలంచియే పంచమవేదమైన మహాభారతమును దేశభాషలో రచింపఁ జేయుటకు వాంఛించియుండును. భారతము వినవలె నను కుతూహలము, అది తనవంశమునఁ బూర్వులైన పాండవోత్తముల చరిత్ర వివరించు గ్రంథమగుట, తచ్ఛ్రవణమున బహుయాగముల ఫలము లభించుటయను, వానితోపాటు భారతమువలన వైదిక మతోద్ధరణము కలుగు నను నాశకూడ నాతని నా ప్రయత్నమునకుఁ బ్రోత్సహించియుండును.

రాజరాజు కన్నడమున పంపకవి రచించిన విక్రమార్జునవిజయమును స్వయముగాఁ జదివినను జదువకపోయినను అందలి విశేషములనుగూర్చి వినియుండును. పంపఁడు జైనమతావలంబి

యగుటచే భారత కథయందామతమున కనుకూలముగాఁ గొన్ని మార్పులు కావించియుండెను. రాజరాజున కావిషయము ఖేదముకలిగించి యుండును. అందుచేతనే యతఁడు భారతమును దెనుఁగున రచింపఁజేయుటకుఁ బూని నన్నయతో "కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడఁదెనుఁగున రచియింపు" మని ప్రత్యేకముగాఁ జెప్పియుండెను. "అది పంపభారతమువలె ససమగ్రమును, మూలభిన్నమును, మతాంతరానుకూలమునుగాక సమగ్రమును, మూలార్థప్రతిపాదమును, వైదికమతానుగుణమును గావలెనని" యాతని యభిప్రాయమై యుండును.

వైదికమతము ననుసరించి కర్మమార్గమైనను జ్ఞానమార్గమైనను మానవుని మోక్షలక్ష్యమునకుఁ గొనిపోఁజాలును. కర్మమార్గమున వేదములకును, దచ్చోదితములైన కర్మములకును అధిక ప్రాధాన్యమున్నది. ఆరెండును బ్రాహ్మణాధీనములు. నన్నయ భారతమును రచించుచు మూలమున లేని పట్టులఁ గూడఁ బెక్కుచోట్ల వేదములను, వేదవిధులను, విప్రులను బ్రత్యేకశ్రద్ధతోఁ బ్రశంసించుట చూడ నాతని మానసమున వైదికమతోద్ధరణ భావము కూడ నిండియుండెనని తోఁచకమానదు. అతఁ డాశ్వాసాంతములందు రాజరాజును బ్రశంసించుచు వాడిన విశేషణములు కూడ నీవిషయమును బలపఱుచుచున్నవి. అతఁడు మూలమందు విస్తృతములుగా నున్న వేదయజ్ఞాదుల ప్రశంసలను దగ్గించినట్లు కొన్ని లేకపోలేదు. కాని యట్టివానిసంఖ్య చాల స్వల్పము. అచ్చట నాతఁ డట్లు చేయుటకుఁ గారణ మూహించుటకు వీలగుచున్నది. నన్నయ రచనలోఁ గన్పట్టు కొన్ని భాగములు – అందును అమూలకములైనవి – భారత రచనకును వైదిక మతోద్ధరణమునకును సంబంధ ముండెనని రుజువుచేయుచున్నవి.

## నన్నయ యాంధ్రీకరణ విధానము

సాధారణముగాఁ గవిత్రయమువారి యాంధ్ర భారతమునుగూర్చి చెప్పునప్పు డది వ్యాసుని సంస్కృత భారతమున కనువాదమని చెప్పుట పరిపాటి. వారు కథాకథనక్రమమున సంస్కృతభారతము ననుసరించినమాట నిజమే యైనను భావవర్ణనాదుల విషయమున మూలమును గేవల మనువదించుటతోఁ దృప్తిపడక కొన్ని చేర్పు మార్పులు కావించి స్వతంత్రమార్గము నవలంబించియుండిరి. వారు మూలమును బాగుగాఁ బఠించి, యందలి తత్త్వమును జీర్ణము చేసికొని, యనవసరములనితోఁచిన భాగములను దగ్గించి, యవసరమని తోఁచినపట్లఁ వర్ణనాదులను బెంచి, యనుచిత మని తోఁచినచోట్ల నన్యథాకల్పనము కావించి యది యొక స్వతంత్ర మహాకావ్యమా యనునట్లు సమర్థతతో సంతరించినారు. అందుచే మూలమును జెంతనుంచుకొని యందలి శ్లోకములన్నియుఁ గ్రమముగా నాంధ్రమున ననూదితములైనవా యని పరిశీలించు వారికి నిరాశ కలుగక మానదు. ఆంధ్రమునందలి యనువాద విధానమును కథానువాదము, భావానువాదము, పదానువాదము అని ముత్తెఱంగుల వింగడింపవచ్చును. అందుఁగవిత్రయము వారిది కథానువాదపద్ధతి. వారు మూలమునందలి కథనుమాత్రము విడువక స్వప్రతిభానుగుణముగా వర్ణనాదులు కావించుచుఁ దమ యనువాదము నొక విశిష్టమార్గమున వెలయించిరి.

కవిత్రయమువారికి వ్యాసుని యెడ గురుభావ మున్నది. అతని దయవలననే తాము కవుల మైతిమని భావించినవారు వారు. అందుచే వా రేవైన మార్పుచేర్పులు కావించినచో నవి తా మతనికంటెఁ గవిత్వమునందుఁగాని ప్రతిభాపాండిత్యములందుఁగాని యధికుల మను నహంకారముతోఁ గావించినవి కావు. అవి దేశకాల భేదముచేతను దృష్టిభేదముచేతను నేర్పడినట్టివి. వ్యాసుఁడు కవిత్రయమువారికంటె సుమారు రెండువేల సంవత్సరములు పూర్వముండినవాఁడు. తననాఁటికి వేదభాష సామాన్యజనులకు దురవగాహనమైపోవుటచే వేదనిక్షిప్తములైన ధర్మనీతితత్త్వాదులను గథోపాఖ్యానములద్వారా సర్వజనసుబోధములు కావించు నుద్దేశముతో నతఁడు లౌకికిభాషలో మహాభారతమును రచించెను. అందుచే నతని రచనలోఁ గావ్యకళాదృష్టికంటెఁ బౌరాణిక నైతికదృష్టిహెచ్చు. అయ్యును అందు మహాకావ్యలక్షణములు పుష్కలముగా గోచరించుట యతని మహానుభావత్వముచేత. కవిత్రయమువారు నీతిధర్మములతోపాటు కావ్యకళకుఁ గూడ సమాన ప్రాధాన్య మొసంగినవారు. మఱియుఁ దమనాఁటి సాంఘికాది సంప్రదాయములకు విరుద్ధములుగాఁ దోఁచిన విషయములను దేశకాలోచితముగా మార్చుటకు వెనుదీసినవారు కారు. రాజరాజు నన్నయను గృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారత బద్ధనిరూపితార్థమేర్పడునట్లుగాఁ దెనుఁగున రచింపుమని యడుగుటయు, నన్నయ యిక్కావ్యంబు రచియించెద ననుటయుఁ, దిక్కన యమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు చేసెద ననుటయు, ఎఱ్ఱన తద్రచనయకా నారణ్యపర్వశేషము పూరించెద ననుటయు వారు మూలమును యథాతథముగా ననువదించుటకుఁ గాక తదర్థవివరణమునకుమాత్రము యత్నించిరనియు, దానిని గావ్యముగా రూపొందింప నుద్దేశించిరనియు వ్యక్తము చేయుచున్నవి. అందుచేఁ గవిత్రయమువారిది కేవల స్వతంత్ర రచనయుఁ గాదు కేవలానువాదమును గాదు. అది స్వతంత్రమైన యనువాదము.

వ్యాసరచిత మహాభారతము వ్యాసుని నాఁటినుండి నన్నయ నాఁటివఱకు నొకేరూపమున నుండెనని చెప్పుటకు వీలులేదు. అది పలుకారణములచే దేశకాలభేదముల ననుసరించి యనేక ప్రక్షేపవిక్షేపములకు గుఱి యైనది. గ్రంథము సర్వభారతీయులకును పూజనీయమైన దగుటచే దానిప్రతులు వివిధరాష్ట్రములలో వివిధలిపులలో వివిధరూపములతో వెలసియున్నవి. వానిని ప్రధానముగా దాక్షిణాత్యవర్గము, ఔత్తరాహవర్గము అని రెండు వర్గములుగా విభజింపవచ్చును. ఒక్కొక్క వర్గమునందు మరల భిన్నభిన్నపాఠము లుండవచ్చును. కొన్నిచోట్ల నుత్తరదక్షిణపాఠముల సమ్మేళనముతోఁగూడిన ప్రతులును ఉండవచ్చును. వివిధములుగానున్న యీ ప్రతులలో వ్యాసభారతమున కేది సన్నిహితమైనదో, నన్నయ దేనిని గ్రహించెనో చెప్పుట కష్టసాధ్యము. అందుచే యాదృచ్ఛికముగా లభించిన యేదోయొక మూలమును గ్రహించి కవిత్రయమువారి భారతమును దానితోఁబోల్చి 'వారిచ్చట మూలమునకు మెఱుఁగుపెట్టిరి ఇచ్చట మూలభావమునకు భంగము కలిగించిరి' యని చెప్పుట యుక్తముకాదు. వారి యనువాదవిధానమునుగూర్చి యాలోచించునప్పుడు వా రేప్రతి ననుసరించిరో నిశ్చయించుట ప్రథమకర్తవ్యము.

నన్నయ ఆదిపర్వారంభమునఁ దాను గ్రహించిన భారతమున నేపర్వమున నెన్నెన్ని శ్లోకము లున్నవో లెక్క యిచ్చి యున్నాఁడు. దానినిబట్టి యాతఁ డన్ని శ్లోకములుగల యేదో

యొక ప్రతి ననుసరించెనని చెప్పవచ్చును. కాని ఆ ప్రతి అతనికాలమునఁ బ్రచారమందుండిన ప్రతులలో నొక్కటియో, లేక యాతఁడా ప్రతులనన్నిటిని బరిశీలించి స్వయముగా ననువాదమునకై కూర్చుకొన్న ప్రత్యేకప్రతియో చెప్పఁజాలము. అతఁడే ప్రతిని గ్రహించినను దాని పుత్త్రిక యిప్పటివఱకు యథాతథముగ వచ్చియుండెనని చెప్పుటకును అవకాశము లేదు. అతఁ డిచ్చిన లెక్కలోఁగల యన్నిశ్లోకములే కల ప్రతి యేదియు నిప్పు డుత్తరదక్షిణ వర్గగతములైన వానిలోఁ గనిపించుటలేదు. పూనాయందలి భండార్కరు ప్రాచ్యపరిశోధన సంస్థవారి యాజమాన్యమున సంస్కృత భారతమునకు విమర్శాత్మకమైన సంపుట మొకటి ముద్రింపఁబడినది. వారు పరిశీలించిన వివిధలిపులతోఁగూడిన వివిధప్రతులలో నన్నయ యనుసరించిన ప్రతి పుత్త్రిక చేరినదో చేరలేదో చెప్పఁజాలము. నన్నయ దాక్షిణాత్యుఁడగుటచే దక్షిణాత్యవర్గమునకుఁ జెందిన ప్రతినే యొకదానిని గ్రహించి యనువాద మారంభించియుండునని సామాన్యముగా నూహింపవచ్చును. కాని సభాపర్వము విషయమున మాత్రము భీష్ముఁడు శిశుపాలునితో శ్రీకృష్ణుని మాహాత్మ్యమును దెల్పుటకై చెప్పిన సుమారు ద్విసహస్రశ్లోకపరిమితమైన భాగమును నన్నయ స్పృశింపక విడిచివేయుటచేతను, అది దాక్షిణాత్యప్రతులందు మాత్రముండి యౌత్తరాహ ప్రతులలోఁ గానరాకుండుటచేతను అతఁ డుత్తరప్రతినే యనుసరించెనేమో యని యనుకొనవలసి వచ్చుచున్నది. మఱియు నుత్తరప్రతులలో మాత్ర ముండి దక్షిణప్రతులలో నెచ్చటను గనరాని భాగముల యనువాదములును అతని రచనమున నచ్చటచ్చటఁ గనవచ్చుచున్నవి.

నీలకంఠుఁడు మహాభారతమునకు భారతభావదీప మను వ్యాఖ్యానము రచించుచు నవతారికలో

బహూన్ సమాహృత్య విభిన్నదేశ్యాన్
కోశాన్ వినిశ్చిత్యచ పాఠ మగ్ర్య
ప్రాచీం గురూణా మనుసృత్య వాచ
మారభ్యతే భారతభావదీపః

అని తాను విభిన్నదేశ్యప్రతులను బరిశీలించి పాఠనిర్ణయము కావించినట్లు చెప్పి యున్నాఁడు. నన్నయయు నట్లే దాక్షిణాత్యవర్గమునకుఁ జెందిన యేదో యొక ప్రతిని, అందును తెలుఁగు లిపిలో వ్రాయఁబడినదానిని, ప్రధానముగా గ్రహించి, భిన్నదేశములకుఁ జెందిన యితర ప్రతులనుగూడఁ బరిశీలించి, వానినిబట్టి యందుఁ గొన్ని మార్పులు చేర్పులు కావించి తన యనువాదమునకు మూలము నేర్పఱచుకొని యుండెనని భావించుట యుక్తముగా నుండును. ఆ మూలము కాని దాని పుత్త్రికకాని యిప్పుడు లభించు ననుకొనుట కవకాశములేదు. అందుచేఁ గవిత్రయము వారి యనువాదము బాగోగులనుగూర్చి చర్చించునప్పుడు వారు మూలముగా గ్రహించిన ప్రతి యేదై యుండు నను విషయమును దృష్టిలోనుంచుకొనవలసిన యక్కఱ యెంతైన నున్నది. దీని యావశ్యకమును నిరూపించుట కొక్క యుదాహరణ మొసంగెదను. ఆంధ్ర భారతమున యయాతి చరిత్ర ముందును దుష్యంతోపాఖ్యానము తరువాతను ఉన్నవి. నిజమున కా కథల క్రమ మట్లే యుండవలయును. కాని కొన్ని యుత్తరప్రతులలోఁ దొలుత దుష్యంతోపాఖ్యాన

ముసు దరువాత యయాతి చరిత్రయుఁ గాననగుచున్నవి. వీనినిమాత్రము చూచి కథాక్రమ
మున నుచితమైన మార్పుచేసి నన్నయ మూలమున కెంతో మెఱుఁగు చేకూర్చెనని చెప్పుట పరి
పాటిగా నున్నది. కాని యిట్లుచెప్పుట వ్యాసభగవానునియెడ నపరాధము కావించిన ట్లగును.
వలయన దాక్షిణాత్యప్రతులు పెక్కింట నాకథాక్రమ మట్లే యున్నది.

భండార్కరు ప్రాచ్యపరిశోధనసంస్థవారి సవిమర్శసంపుటమును మూలముగా గ్రహించి
యితరప్రతులలోని పాఠములను గూడ దృష్టిలో నుంచుకొని నన్నయ యనువాదవిధానమునందలి
ప్రధానాంశముల నిట సంగ్రహముగా సూచింప యత్నింతును. నన్నయ లెక్క ననుసరించి ఆది
పర్వమునందలి శ్లోకములసంఖ్య 8884. తెలుఁగునఁగల గద్యపద్యములసంఖ్య 2091. దీనినిబట్టి
సంస్కృతభారతము తెలుఁగున నాల్గవ వంతునకుఁ దగ్గింపఁబడినదని తోఁచును. కాని సంస్కృ
తమునందలి అనుష్టుప్ శ్లోకములకును తెలుగునందలి పద్యగద్యములకును బరిమితిలోఁ జాల
వ్యత్యాస ముండుటచే సంస్కృత భారతము తెలుఁగున సగమునకుఁ బైఁగాఁ దగ్గింపఁబడినదని
స్థూలముగాఁ జెప్పవచ్చును. మూలమునందలి వర్ణనములను, ప్రశ్నోత్తరములను, సంభాషణ
లను నన్నయ చాలవఱకు సంక్షేపించుటయే యీ తగ్గుదలకుఁ గారణము. ఇవిగాక ధర్మతత్త్వ
నీతివిషయకోపన్యాసములును, పురనదీయుద్ధరాజగుణపాలనములును వ్యక్తినామముల
పట్టికలును, బునరుక్తులును అతఁడు సంక్షేపించిన యంశములలో ముఖ్యములైనవి. ఈ సంక్షేపము
వలనఁ బ్రధానకథాగమనమున నెచ్చటను అంతరాయము కలుగక నుండుటయేకాక అనవసర
విషయ విస్తరణము తగ్గుటచే దానికిఁ బ్రసన్నత యేర్పడినదనికూడఁ జెప్పవచ్చును.

౧ నన్నయ సంక్షేపించిన భాగములు.

ఉదంకుఁడు నాగలోకమున నిరువురు స్త్రీలను, ఆర్వురు కుమారులను, ఒక్క దివ్యపురు
షుని గనినపిమ్మట "సతాన్ సర్వాన్ తుష్టావ ఏభిర్మంత్రవాదశ్లోకైః" అని నాలుగు శ్లోకములు
వ్రాయఁబడినవి. నన్నయ వానిని "విపులార్థవంతంబులైన మంత్రంబుల నతిభక్తి యుక్తుఁడై
స్తుతియించిన" అని యొక్క వాక్యమున సంగ్రహించెను. సూర్యకిరణముల వేఁడిమి తాఁకి
మూర్ఛిల్లిన పుత్త్రులను గాంచి కద్రువ చేసిన యింద్రుని స్తుతి మూలమున విస్తృతముగా నున్నది.
నన్నయ "నరసుర సిద్ధకింపురుషే" త్యాదిపద్యమొక్కటి మాత్రము వ్రాసి యూరకుండెను.
( ౨-46 ).

ఆదిపర్వమునందలి 84 వ అధ్యాయములో అష్టకాదులు యయాతి నడిగిన ప్రశ్నలను
నన్నయ మిక్కిలి సంగ్రహించెను. అతఁడు ప్రశ్నలన్నియు విడిచి సమాధానములు మాత్రమే
యయాతిచేఁ జెప్పించెను. పిమ్మట నతఁడు "అని యయాతి యష్టకాదు లడిగిన వాని నెల్ల సంక్షేప
రూపంబునఁ జెప్పి యయు" (3-223) నని తాను బుద్ధిపూర్వకముగా సంక్షేపించినట్లు సూచించి
యుండెను.

పుత్త్రులు లేరని దుఃఖించు పాండురాజునకు కుంతి దుర్వాసుఁడు తనకిచ్చిన మంత్రము
సంగతి సవిస్తరముగాఁ జెప్పినట్లు మూలమున నున్నది. (113 అధ్యా 31—38) ఈ వృత్తాంత

మంతకుముందే విపులముగాఁ జెప్పఁబడి యుండుటచే నన్నయ యా పునరుక్తిని దొలఁగించి" కుంతిభోజు నింటఁ దన కొండుకనాఁడు దుర్వాసుఁ డిచ్చిన మంత్రంబు తెఱంగు పతి కెఱింగించి" (౪-141) అని చక్కఁగా సంగ్రహించెను.

అర్జునుఁడు గురుదక్షిణగా ద్రుపదుని గట్టి తీసికొని వచ్చినప్పుడు ద్రోణునికిని అతనికిని జరిగిన సంభాషణమును (128-7-11) నన్నయ సంగ్రహించుటయేకాక "వీరెవ్వరయ్య ద్రుపద మహారాజులె" (౬-81) యను సముచితమైన పద్యము వ్రాసి యచ్చటఁ జాల వన్నె చేకూర్చెను.

సభాపర్వారంభమున మయుఁ డుండఁగనే కృష్ణుఁడు ధర్మజాదులను వీడ్కొని యరిగెనని మూలమునందలి 2 వ అధ్యాయము విపులముగా వర్ణించుచున్నది. ఇక్కడ కృష్ణుఁడు పాండవులను విడిచి యరుగుటలో నంత విశేషము లేకపోవుటచేతను, రాజసూయయాగానంతరము కృష్ణుఁడు పాండవులను విడిచి యేగు వృత్తాంతము మరల వచ్చును గావునను నన్నయ దానిని "అంత నారాయణుఁడును పాండవుల వీడ్కొని పితృదర్శన లాలసుండై ద్వారవతీ పురంబున కరిగె" (౧-8) అని యొక్క వాక్యమున సంగ్రహించి చెప్పివైచెను.

రాజసూయయాగసందర్భమున నేయేరాజులు వచ్చి ధర్మజుని సేవించిరో వారిపేరు లన్నియు మూలమున (1-18-27) విపులముగాఁ బేర్కొనఁబడినవి. నన్నయ యా పేర్లన్నియు విడిచి "అయ్యుదయాస్తాచలసేతు శీతనగ మధ్యోర్వీపతుల్" (౧-18) అని చక్కఁగా సంగ్రహించి యా సంగ్రహించుటలో వచ్చిన రాజుల యపరిమితత్వమును గూడ సూచించెను.

సభాపర్వమందలి 54 వ అధ్యాయమున ధర్మరాజొక్కొక్క వస్తువునే యొడ్డి దానిని వర్ణించి "తేన దీవ్యామ్యహం త్వయా" యని యనుచుండుటయు, శకుని "జితమిత్యేవశకుని ర్యుధిష్ఠిరమభాషత'యని తాను జయించితి నని పలుకుటయుఁ బలుమాఱులు కానవచ్చును. నన్నయ ధర్మజుఁడొడ్డిన వస్తువుల నన్నింటిని వచనమున నొక్కచో (౨-177) సంగ్రహించి "ఒక్కొక్క యొడ్డునన యొడ్డియోటువడె"నని మూలమునందలి పునరుక్తిని వర్జించెను.

ధర్మరాజు జూదమున నొక్కొక్క యొడ్డునే యోడుచుండుటఁ గాంచి విదురుఁడు ధృతరాష్ట్రునికి దుర్యోధనుని బహిష్కరించియు, శకుని నతని రాజ్యమునకుఁ బంపివేసియుఁ గురువంశమును గాపాడుమని 55, 56 అధ్యాయములలో నుపదేశించియుండెను. నన్నయ యీవిషయము నంత "ఇంకనైన నుపేక్షింపక యీ దుష్టద్యూతము వారింపు" మనువాక్యముతో (౨-184) సంగ్రహించెను.

అరణ్యపర్వ తృతీయాధ్యాయమున ధౌమ్యుఁడు ధర్మజునకుఁ జెప్పెనని వైశంపాయనుఁడు జనమేజయునకు సూర్యాష్టోత్తరశతమును జెప్పియుండెను. నన్నయ యందలి నామము లన్నిటిని జెప్పక "సూర్యుం డర్యముండు భగుండను నివి మొదలుగాఁగల నామంబుల యష్టోత్తరశతంబు విధియుక్తంబుగా నుపదేశించె"నని (౧-41) సంగ్రహించెను.

మూలమున 133 వ అధ్యాయములో నష్టావక్రుఁడు జనకుఁడడిగిన ప్రశ్నలకు సమాధాన మొసఁగినట్లున్నది. నన్నయ వానినన్నిటిని విడిచి "జనకభూపాలుని సంప్రశ్నములకెల్ల నేర్పడ నుత్తరం బిచ్చి" (3-250) అని మాత్రము చెప్పియుండెను.

నహుషుఁడు ధర్మజుని ప్రశ్నలకు సమాధానము లొసంగినపిమ్మటఁ దానాతనిగొన్ని ప్రశ్నలడిగి సమాధానము పొందినట్లు మూలముననున్నది (178అ) నన్నయ యాధ్యాత్మికము లైన యాప్రశ్నోత్తరములు విడిచి ధర్మతనయుం డతనివలన నధ్యాత్మరహస్యంబు లిమ్ముగా నెఱింగి వృకోదరుం దోడ్కొని నిజాశ్రమమునకు వచ్చెనని (8-133) యావిషయమును సంగ్రహించెను.

ఇట్లే నన్నయ మూలమున నధ్యాయము మారునప్పుడెల్ల సాధారణముగాఁ గనవచ్చు జనమేజయుని ప్రశ్నలను వైశంపాయనుఁడు వానికెల్ల సమాధానము చెప్పెదఁ ననుటను, పెక్కు చోట్లఁగల పేర్లకు సంబంధించిన ప్రత్యేక ప్రశ్నోత్తరములను సంగ్రహించివైచెను. మూలమందు పెక్కుకథలును విషయములును రెండేసిమార్లు చెప్పఁబడియున్నవి. అందొకటి సంగ్రహపాఠము రెండవది విస్తృతపాఠము, జరత్కారువృత్తాంతము (13 అధ్యా; 41-44 అధ్యా.) పరీక్షిద్వృత్తాంతము (36-40 అధ్యా; 45, 46 అధ్యా.) యయాతికథ (ఆది-31 అధ్యా.) ఋష్యశృంగునికథ (అర-110 అధ్యా.) మున్నగున విట్టివి. నన్నయ యిట్టి పునరుక్తులను దొలగించి వానినెక్కడఁజెప్పుట యుచితముగా నుండునో యక్కడనే యొక్కసారి చెప్పుచుండును. "లోమహర్షణపుత్రః ఉగ్రశ్రవాః...ఋషీనభ్యాగతానుపతస్థే" అను నారంభము మూలమునఁ బ్రథమచతుర్థాధ్యాయములు రెండింటి మొదటనున్నది. నన్నయ యిందలి రెండవదానిని విడిచివైచెను.

*౨. నన్నయ పూర్తిగా విడిచివైచిన భాగములు.*

ప్రధానకథతో సంబంధములేనివియు, తత్త్వవిషయ బహుళములును, అనుచితములును అగు కొన్ని భాగములును నన్నయ యనువదింపక విడిచివైచెను. అందుఁగొన్ని యాతఁడు చూచిన సంస్కృతప్రతిలో లేకుండుటకుఁగూడ నవకాశమున్నది.

మూలమున యుద్ధములోఁ బాండవులు జయించుచుండఁగా ధృతరాష్ట్రుఁడు సంజయుని దనచెంతకుఁబిల్చి దుర్యోధనుని దుశ్చేష్టలనుగూర్చి విచారించి, 'యదాశ్రౌష'మను పదములాదిగాఁగల యేఁబదియైదు శ్లోకములలోఁ గౌరవపాండవోదంతమునందలి యొక్కొక్కఘట్టమునే తెల్పుచు నప్పుడే తనకు జయమునం దాశపోయెనని చెప్పి విచారించిన భాగమొకటున్నది. దీనిని యదాశ్రౌష పర్వమని పిల్చుచుందురు. ఇది ప్రక్షిప్తమని కొందఱి యభిప్రాయము. ఉత్తర దక్షిణ ప్రతులన్నింట నిది యిప్పుడు కానవచ్చుచున్నది. నన్నయ మూలములో నిది యున్నదో లేదో తెలియదు. కాని యతఁడీ సంగ్రహ కథాకథనమును బూర్తిగా విడిచివైచెను.

సంస్కృతభారత తృతీయాధ్యాయమున ఉపమన్యువు, ఆరుణి, వేదుఁడు అనుముగ్గురు ధౌమ్యశిష్యుల వృత్తాంతమున్నది. నన్నయ వేదునే పైలుఁడని పేర్కొనెను. జనమేజయునికి

సర్పయాగాచరణబుద్ధి కలిగించిన యుదంకుఁ డీతని శిష్యుఁడు. ఈకారణముచే నుదంకునకును దద్గురువునకును భారతకథతో సంబంధమున్నది. కాని వేదుని సహపాఠుల వృత్తాంతమునకు దానితో నెట్టి సంబంధములేదు. అందుచే నన్నయ ధౌమ్యశిష్యుల వృత్తాంతమును విడిచివైచెను.

దుష్యంతుఁడు శకుంతలను దిరస్కరించు సందర్భమున మేనకా విశ్వామిత్రులనుగూడ దూషించినట్లు మూలమందున్నది. అట్టి దూషణము దుష్యంతుని శీలమునకు లాఘవమునాపాదించునని కాఁబోలు నన్నయ యా భాగమును విడిచివైచెను.

మూలమున శిశుపాలుఁడు భీష్ముని భూలింగపక్షితోఁ బోల్చిఁ యతఁడు తృతీయాప్రకృతి యని నిందించినట్లున్నది. భీష్మునియెడ నా యుపమానము కాని వర్ణన కాని యుచితములు కాక పోవుటచే నన్నయ విడిచివైచెను.

పాండవవైభవమును జూచి దుర్యోధనుఁ డీసు వహించి కృశించినప్పుడు శకుని నీవు "పాండవులనుగూర్చి యీర్ష్యవహించుట తగదు. వారు తమ భాగధేయమును దామనుభవించుచున్నారు, నీకు వీరులైన సోదరులును, ద్రోణాది సహాయులును బలువురున్నారు. వారి తోడ్పాటుచే నీవు సర్వవసుంధరను జయింపు" మని ధర్మ్యమైన యుపదేశమిచ్చి యోదార్చినట్లు మూలమున వర్ణింపఁబడినది. అట్టి నీత్యుపదేశము సహజకుటిలుఁడైన శకుని ప్రకృతికి విరుద్ధమగుటచే నన్నయ విడిచివైచెను.

అరణ్యపర్వమందలి 25 వ అధ్యాయమునఁ బాండవులు కామ్యకవనమునుండి ద్వైతవనమునకు బ్రయాణమైనప్పు డచ్చటి బ్రాహ్మణులును పౌరులును దుఃఖించినట్లు వర్ణింపఁబడినది. ఈభాగము సరిగాఁ బాండవ వనగమనసమయమందలి పౌరుల దుఃఖానుభావమునే పోలి యుండుటచే నన్నయ పునరుక్తి యేలయని విడిచివైచెను.

అరణ్యపర్వమందలి 47వ అధ్యాయమున జనమేజయుఁడు వైశంపాయనుని బాండవులు వనమం దేమి భుజించిరో తెల్పుమని యడుగనతఁడు పాండవులు వనములోనేమేమి తిని యెట్లు కాలము పుచ్చిరో తెల్పుచు

> వానేయంచ మృగాంశ్చైవ శుద్ధైర్బాణైర్నిపాతితాన్
> బ్రాహ్మణానాం నివేద్యాగ్ర మభుంజన్ పురుషర్షభాః

అని వర్ణించెను. తననాఁటికి మాంసభోజనము బ్రాహ్మణులకునిషిద్ధమై పోవుటచేఁ గాఁబోలు నన్నయ యాభాగమును విడిచివైచెను.

మూలమున సౌగంధికాపహరణకథలో హనుమంతుఁడు భీమునికిఁ ద్రయీవార్తా దండనీతులనుగుఱించియు నాలుగువర్ణములవారి ధర్మములను గూర్చియుఁ జెప్పినట్లు కలదు. (149-31-40). ఈభాగము కథ కనవసర మగుటచే నన్నయ విడిచివైచెను.

173 వ అధ్యాయమున భీమ నకుల సహదేవులు విజృంభించి దుర్యోధనుని జంపుటకై యెగుదుమని చెప్పినట్లున్నది. అప్పటికింకను బండ్రెండేండ్లు కాలేదు. ఈ యసమయవిజృంభణమును వర్ణింప నేలయని నన్నయ యీభాగమును విడిచివైచెను.

౫. నన్నయ పెంచిన భాగములు.

అనువాదసందర్భమున నన్నయకావించిన పెంపు నైదువిధములుగా విభజింపవచ్చును. i మూలమున లేని వర్ణనములు చొప్పించుట ii అమూలకములైన భావములు వెల్లడిరిచుట iii మూలమునందలి యొకపదమునో పదసమూహమునో యాధారముగా గ్రహించి యందలి భావమును విపులీకరించుట iv మూలమున లేని యలంకారములను బ్రవేశపెట్టుట v వ్యక్తులను గాని వస్తువులనుగాని వర్ణించుపట్ల విశేషణముల నధికముగా వాడుట.

i ఉదంకుఁడు నాగరాజులను స్తుతించుసందర్భమున నైరావతరాజుల యొక్కయుఁ దక్షకుని యొక్కయు స్తుతులుమాత్రమే కనవచ్చును. (3-139-145) నన్నయ నాగరాజులైన యనంతవాసుకుల స్తోత్రములనుగూడఁ జేర్చెను. (౧-104-105)

విశ్వకర్మ ఖాండవప్రస్థమునఁ బాండవులకై నిర్మించిన రమణీయమైన పురమును నన్నయ పదిపద్యములతో వర్ణించెను. ఇందలి భావములొండు రెండు మూలమునఁగూడనున్నను ఈవర్ణనమంతయు నన్నయకల్పితమే యని చెప్పవచ్చును. ఈవర్ణనము తరువాతి ప్రబంధములలోఁ గనవచ్చు పురవర్ణనముల కాదర్శమై మిక్కిలి హృద్యముగను గంభీరముగను ఉన్నది.

కద్రూవినత లుచ్చైశ్శ్రవమును జూడనరిగినప్పటి సముద్రవర్ణనమును, పాండురాజు మరణమునకు ముందున్న వసంతర్తు వర్ణనమును నన్నయ కల్పించినవే.

సభాపర్వమందు భీమార్జున నకులసహదేవులు నాలుగుదిక్కులను జయించినపిమ్మట నాప్తమంత్రి ప్రేరితుఁడై ధర్మజుఁడు రాజసూయయాగ మొనరింప నుత్సహించెనని మూలమందున్నది. ఈసందర్భమున నన్నయ యాప్తమంత్రులు చెప్పిన కోశసమృద్ధిని (౧-27౪) వచనమున రమ్యముగా వర్ణించెను.

కిరాతార్జునీయ సందర్భమునఁ గిరాతుఁడు శివుఁడని యెఱింగిన పిమ్మట నర్జునుఁడు తన యపరాధమును క్షమింప వేఁడుకొన్నట్లు మూలమందు నాల్గు శ్లోకములున్నవి. ( 0-57-60) నన్నయ యాప్రార్థనతోపాటర్జునుఁడు కిరాతుని స్తుతించినట్లొక దండకమునుగూడఁ గల్పించెను (3-325)

ధర్మజుఁడు నహుషప్రశ్నలకు సమాధానముచెప్పి భీమునితో నాశ్రమమునకు వచ్చిన పిమ్మట నన్నయ వర్ణించిన వర్షాశరత్కాలవర్ణనమందలి పెక్కుభావము లతఁడు కల్పించినవే.

ii నన్నయ మూలమున లేని భావములను వ్యక్తము చేయుచు నాయాసందర్భములఁ గల్పించి వ్రాసినపద్యము లనేకములున్నవి. శంతనుఁడు యోజనగంధిని జూచి మనోజబాణ సంతానహతాత్ముఁడౌటకుఁ గారణమైన యామెసౌందర్యమును వర్ణించుపద్యమును (౩-171) లాక్షాగృహదహనానంతర ముదయమున వచ్చి జనులు పాండవులు దగ్ధులైరని భ్రాంతిపడి దుఃఖించిన పద్యమును (౬-164) ఖాండవ వన దహనమునకు ముం దర్జునునకు విహారాభిలాష కల్గించిన ఘర్మసమయవర్ణన పద్యమును (౮-230) నారదుఁడు హరిశ్చంద్రుని మహిమా

తిశయమును వర్ణించుచుఁ జెప్పిన పద్యమును (స-౧-౩౬) భీష్ముఁడు కృష్ణుని యర్ఘ్యగ్రహణార్హతను సమర్థించుచుఁ జెప్పిన కారణములను దెల్పు పద్యములును (౨-27, 28) హంసవలన నన్యోన్య గుణరూపము లెఱింగి మనఃప్రభవానల బాధ్యమానులైన నలదమయంతుల వర్ణించు పద్యమును (అ. ౨-24) ధర్మరాజు నహుషునకు వృత్తప్రాశస్త్యమును దెల్పు సందర్భమందలి వృత్తవిత్తభేదప్రతిపాదకమైన పద్యమును (అ. ౬-139) నన్నయ స్వకపోలకల్పితములైనట్టివే.

(iii) నన్నయ మూలమందున్న యొక పదమునో పదములనో యాధారముగా గ్రహించి యందలి భావములను విపులీకరించుచు వ్రాసిన పద్యములు పెక్కున్నవి. మేనక విశ్వామిత్రుని యాశ్రమమున కరుగు సందర్భమున మూలమందు.

ఏవము క్తస్తయా శక్రః సందిదేశ సదాగతిమ్
ప్రాతిష్ఠత తదాకాలే మేనకా వాయునాసహ (ఆ. 79-5)

అని మేనక వాయువుతోఁగూడ బయలుదేఱినట్లున్నది నన్నయ దానినాధారముగాఁగొని,

చల్లని దక్షిణమారుత, మల్లి వికెంచెఁ దగిలి యాలనాథ
మ్మల్లి కుసుమాంగరాగ స, ముల్లసనసుగంధి యగుచు మునివరుమీఁదన్ (ఆ. ౬-40)

అని మలయమారుత ప్రసారమును జక్కగా వర్ణించెను.

అగ్నిభృగుశప్తుఁడై తాను ప్రతిశాపమీఁగల్గియు నట్లు చేయకుండుటకు "మాన్యాస్తు బ్రాహ్మణామమ" అనునది హేతువుగాఁ జెప్పెను. నన్నయ యీహేతువును "అడిచినఁ దిట్టినన్మఱి మహాపరుషంబులువల్కి యల్కతో బొడిచిన నుత్తమద్విజులు పూజ్యులు వారల కెగ్గుసేసినం జెడు నిహాముం బరంబు నిది సిద్ధముగావుతెఱింగి భక్తినెప్పుడు ధరణీసురోత్తములఁ బూజలఁ దన్పుదు నల్లనొడుదున్" (ఆ. ౧-138) అని వివరించెను.

దేవయాని పుత్రులఁ గాంచినపిమ్మట సంప్రాప్తయౌవనయైన శర్మిష్ఠ "ఋతుకాలశ్చ సంప్రాప్తో నచమేస్తిపతిర్వృతః (ఆ. 77-6) అని శోకించినట్లు మూలమందున్నది. నన్నయ యా ఋతుకాల సంప్రాప్తిని

అసదృశయౌవనం బిదియనన్యధనంబగు నొక్కొ నాకు ని
క్కుసుమ సముద్భవంబుననగోచర దుర్గమ దుర్గవల్లరీ
కుసుమ సముద్గమంబగునొకో పతిలాభము లేమిఁ జేసి యొ
ప్పెసఁగఁగ దేవయాని పతి నేమి తపంబొనరించి కాంచెనో (ఆ 3-170)

అనిసరసముగా వర్ణించెను.

అర్జునుఁడు ద్వాదశమాసికవ్రతము సల్పు సందర్భమున విప్రసహితుఁడై కళింగదేశమును; మహేంద్రపర్వతమును, గాంచి సముద్రతీరము ననుసరించి మణులూరు పురమున కరిగెనని మూలమందున్నది. పిమ్మట నతఁడు గోదావరిలో స్నానము చేసెనని చిన్నవాక్యమున్నది(గోదావర్యాం తతః స్నాత్వా). నన్నయ దీనిని బురస్కరించుకొని "దక్షిణగంగ నాఁ దద్దయు నొప్పిన"

ఆది. ౮-139) యను సీసమునఁ దన ప్రభువైన రాజరాజనరేంద్రునిచేఁ బాలింపఁబడు వేగీదేశ విభవమును దనివితీర వర్ణించి తన దేశాభిమానమును బ్రకటించెను.

సభాపర్వమున శిశుపాలుఁ డాగ్రహమున సభ వీడి వెడలినప్పుడు ధర్మజుఁ డాతని బట్టు వలుచుచు వెంటఁ జని "వేదతత్త్వేన కృష్ణంహి భీష్మశ్చేదిపతే భృశమ్" (స. 35-5) అని చెప్పినట్లు మూలమున నున్నది. నన్నయ కృష్ణుని గుణగణములను

అదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాఁడు వే
దాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైనవాఁడు లో
కాదిత్రిలోకపూజ్యుఁడని యాత్మనెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని యుక్తమకాకిది యేమి దోసమే (స. ౨-18)

అని లెస్సగా వివరించెను.

నలుఁడు ఋతుపర్ణుని నగరమున వార్ష్ణేయ జీవలులతో నివసించుచు సాయంసమయము లందు,

క్వను సా క్షుత్పిపాసార్తా శ్రాంతా శేతే తపస్వినీ
స్మరన్తీ తస్య మందస్య కం వా సాద్యోపతిష్ఠతి (అ. 64-10)

అని యామెను గూర్చి తలంచుచుండినట్లు మూలమందున్న భావమును నన్నయ "ఇభరాజ గమన! నీవెందులకరిగి" తిత్యాది సీసమున (అర ౨-132) హృద్యముగా వివరించెను.

(iv) మూలమున నలంకారరహితములై విషయమునుమాత్రము ప్రతిపాదించు శ్లోకము లను నన్నయ సాలంకారములుగా సంతరించి పౌరాణికమైన సరళశైలికిఁ గావ్యోచితమైన ప్రౌఢి కలిగించిన పట్లనేకము లున్నవి.

శమంతపంచకాక్షౌహిణీ కథనసందర్భమున మూలమందు "శస్త్రభృతాంవరః" పరశు రామః క్షత్రియాన్ "జఘానామర్ష చోదితః" అని వ్రాయఁబడినది. నన్నయ దానిని

త్రేతాద్వాపరసంధి నుద్ధతమదాంధీభూత విద్వేషిజీ
మూతోగ్రశ్వసనుండు రాముఁడలుకన్ ముయ్యేడుమాఱుల్
ప్రీతిన్ వైరిధరాతలేశ్వరులఁ జంపెం బల్విరన్ దీర్ఘని
ర్ఘాతక్రూర కుఠారలూన నిఖిలక్షత్త్రోరు కాంతారుఁడై (ఆ. 11-78)

అని రూపకాలంకారముతోఁ జక్కఁగా వివరించెను.

శుక్రుఁడు కచునికి సంజీవని నుపదేశించిన పిమ్మట నతఁడు తదుదరము చీల్చుకొని "ఉదయాద్రిదరీముఖమున నుదితుండగు పూర్ణహిమమయూఖుఁడు" పోలె బయటికి వచ్చె ననియుఁ, దరువాత నతనిచేఁ బునర్జీవితుఁడైన శుక్రుఁ" డుచ్చారణదక్షుచేత నభిహితంబగు శబ్దంబునట్లపోలె" వెలింగె ననియుఁ జెప్పినప్పుడు నన్నయ వాడిన హృద్యములైన యుపమాన ముల మూలకము లైనట్టివే. (ఆ. 3-126-127)

పాండవులు సభాగతులై యుండ వారిని జూచుట కరుదెంచిన నారదుని మూలము "నారద స్సుమహాతేజాః" (5-2) అని వర్ణించినది. నన్నయ

నీరజమిత్రుఁడేల ధరణీగతుఁడయ్యెడునొక్క యంచు వి
స్మేరమనస్కులై జనులు మెచ్చి నిజద్యుతి చూచుచుండఁగా
నారదుఁ డేగుదెంచె గగనంబుననుండి (౧-22)

యని చక్కని యుత్ప్రేక్షతో దానిని వివరించెను.

నలోపాఖ్యానమందలి "చనుప యిట్టిపాటఁ బెనువరి యవినీతు నిరియుఁబోలె నడఁగి విరిసి చనియె" ననియు "ఉరుతరసార్థప యోరాశి హస్తియూథాగస్త్యచేఁ బీతమయ్యె మఱియు" (౨-113) అనియు నన్నయ వాడిన యుపమారూపకము లతఁడు కల్పించినవే. ఇట్లే నలుఁడు హంసను బట్టుకొనఁగా "దాని విడిచిపోవఁగా నోపక ఱచుచు నంతరిక్షమునను హంసలెల్లఁ బిండుగట్టి తిరుగుచుండె వాతోద్ధూతశారదాభ్రశకలచయమువోలె" (౨-13) వని నన్నయ వ్రాసిన పద్యమందలి యమూలకమైన యువమాన మా హంసలయాకృతినే కాక సంఘీభావమునుగూడఁ జక్కగా వెల్లడి చేయుచున్నది.

నన్నయ పెక్కుచోట్ల నీతిబోధకములైన యర్థాంతరన్యాసములను గల్పించి వ్రాసెను. "గురుకార్యనిరతులగు సత్పురుషుల కగుటరుదె యధికపుణ్యఫలంబుల్" (ఆ ౧-119) "పెద్దల చరితంబుల్పలకు నెఱుఁగ శక్య మె యెందున్" (స ౨-10) "ఎట్లయేని గూర్తు రింతులు మాకని విశ్వసించువారు వెడఁగు లెందు" (అ ౩-390) మున్నగున విందుకుఁ దార్కాణములు.

(ii) వ్యక్తులను వర్ణించునప్పుడును వారిని దొల్తగాఁ బ్రవేశపెట్టునప్పుడును నన్నయ మూలములో లేని విశేషణములు వాడుచు వారిస్వరూపమును పఠితలకు ముందే వ్యక్తము చేయుచుండును.

తీర్థయాత్రాం పరిక్రామన్నపశ్యద్వైపరాశరః (ఆ-57-56)
గతమదమత్సరుండు, త్రిజగద్వినుతుండు, వసిష్ఠపౌత్రుఁడు
న్నతమతి, శక్తిపుత్త్రుఁ, డఘనాశనఘోరతపోధనుండు,సు
వ్రతుఁడయి తీర్థయాత్రచనువాఁడు, పరాశరుఁడన్మునీంద్రుఁడు. (ఆ-3-36)

ద్రౌపద్యాః ప్రేక్షమాణాయాః సవ్యమూరు మదర్శయత్ (స-63-12)
అమ్ముదితన్ విభీతహరిణాక్షిఁ, గలాపవిభాసికేశభారమ్మున నొప్పుదాని
(స-౨-247)

అజగామ మహాయోగీ వ్యాస స్సత్యవతీసుతః (అ-37-20)
వారల పుణ్యోదయమున వారిజభవనిభుఁడు లోకవంద్యుఁడు వచ్చెం
బారాశర్యుఁడు ధర్మశరీరుఁడు కృష్ణాజినోత్తరీయుఁడు ప్రీతిన్. (అ. ౨-272)

౮. మూలమునందొకొక్కొకప్పుడు కథలు హఠాదారబ్ధములై యుండును.

ఒక కథకును దానితరువాతి కథకును సన్నిహితసంబంధము కనఁబడదు. ఒకేకథయందలి సన్నివేశములు పరస్పరాసంబద్ధములుగాఁ గనిపించును. అట్టియెడ నన్నయ వానికిఁగల పరస్పర సంబంధమును, వానికచ్చటఁగల స్థానమును సూచించుచు, అసంబద్ధతను దొలఁగించుచు నొకవిధమైన యవిచ్ఛిన్నతను గలిగింప యత్నించుచుండును. ఇట్లే నన్నయ యన్నదమ్ములయు దిక్పాలాదులయుఁ బేర్లు చెప్పునప్పుడును, ఇతర సందర్భములందును మూలమున లేని క్రమమును బాటించుటకుఁ బ్రయత్నించును.

౯. నన్నయ కావించిన అన్యథాకల్పనలు.

మూలమందలి కథాంశములను నన్నయ తనకుచితమని తోఁచినట్లు మార్చి వ్రాసినచోట్లు కొన్ని యున్నవి. అట్లే మూలమునందలి విషయ మనౌచిత్య యుక్తముగాఁ దోఁచినపట్ల నతఁడన్యథాకల్పనముచేసిన యంశములును గొన్ని కనిపించును. ఇట్టిపట్టుల నన్నయ నిజముగా మూలమునకు వన్నె చేకూర్చెనని చెప్పుటలో నతిశయోక్తి లేదు.

కశ్యపుడు పుత్రకామేష్టి చేయు సందర్భమున వాలఖిల్యు లింద్రుని శపించిన వృత్తాంతము మూలమున మునులు ప్రశ్నింపగాఁ సౌతి చెప్పినట్లున్నది. (1–27) నన్నయ గరుడాగమనమునకు ముందు స్వర్గమునఁగలిగిన యుత్పాతములకుఁ గారణము తెల్పుచు దానిని బృహస్పతియే చెప్పినట్లు వర్ణించెను. (ఆ. ౨–83) ఇచ్చట నీ వృత్తాంతమును బృహస్పతి చెప్పుటయే యుచితముగా నున్నది.

ఉదంకుఁడు నాగకులమెల్లఁ దనకు వశమగునట్లు చేయుమని దివ్యపురుషుని బ్రార్థింప నతఁడు "ఏతమశ్వమపానే ధమస్వ" అని చెప్పినట్లు మూలమందున్నది. ఇది యశ్లీలముగాఁ దోఁచుటచే నన్నయ యతఁ "డీయశ్వకర్ణాధ్మానంబు చేయు"మని యాదేశించినట్లు మార్చెను.

శర్మిష్ఠాదేవయాన్యాదులు వనమునఁ గ్రీడించుచుండ నింద్రుఁడే వాయువై వారి వస్త్రములను గలఁచినట్లు మూలమందున్నది. (ఆ. 73–4) ఇంద్రుఁ డట్లు చేయుటయం దౌచిత్యము లేమిచే నన్నయ "సురకరువలిచేతం బేరితంబులయి" యావస్త్రములు కలసెనని మార్చి వ్రాసెను.

శకుంతల దుష్యంతునిచేఁ దిరస్కృతయై "నాకోరిక నెఱవేర్పనిచో నీతల నూఱుబ్రద్దలగుఁగాక" (ఆ. 68–35) అని పల్కినట్లు మూలమందున్నది. పతివ్రతయైన శకుంతల యట్లనుట యుచితముగామిచే నన్నయ దానిని విడిచి వైచెను.

మూలమున మాద్రి పాండురాజుకొఱకై విస్తారధనముచేఁ గొనఁబడెనని చెప్పఁబడినది. (పాండోరర్థేపరిక్రీతాధనేన మహతా తదా: ఆ. 105–5) నన్నయ ధనవిషయము విడిచి "మఱియు మద్రరాజతనయ మాద్రి యను దాని మహోత్సవంబునఁ బాండురాజు" వివాహమాడెనని మాత్రము చెప్పియుండెను.

మూలమునఁ గుంతి ధర్మజాదులను గన్నపిమ్మట మాద్రి పాండురాజుతోఁ జెప్పిన వాక్యములలో సపత్నీమాత్సర్య మెక్కువగా గోచరించుచున్నది. (ఇదంతు మే మహద్దుఃఖం తుల్యతాయామపుత్రతా... స్తంభోహి మే సపత్నీత్వా ద్వక్తుం కుంతిసుతాం ప్రతి 115-3-6). నన్నయ యామాత్సర్యమును దొలఁగించి

కోరినకోర్కికిం దగఁగఁగుంతి సుతత్రితయంబు గాంచెఁ గాం
ధారియు నక్కడన్ సుతశతంబు ముదంబొనరంగఁ గాంచె నేఁ
బోరచి యాడుపుట్టువునఁ బుట్టి నిరర్థకజీవనైతి సం
సారసుఖావహం బయిన సత్సుతజన్మముఁ గానఁబోలమిన్ (ఆ-౫-128)

అని యామెవిచారమునకు సంసారసుఖావహమైన సత్సుతజన్మము కానఁబోలమియే కారణమని చెప్పియుండెను.

మూలమున ద్రోణుఁ డన్నసాధకునితో "అంధకారేఽర్జునాయాన్నం న దేయం తే కథంచన" (ఆ. 123-2) అని చెప్పినట్లున్నది. అర్జునుఁడు చీకటిలో బాణము వేయ నేరకుండవలెనని ద్రోణుఁ డభిప్రాయపడినట్లు దీనివలనఁ దెలియుచున్నది. ద్రోణునికర్జునునియెడ నిట్టి యీర్ష్యాభావముండెనని తలంచుట కాధారములు మృగ్యము. ద్రోణుని శీలమునకుఁ గళంకము నాపాదించు నీవిషయమును నన్నయ మార్చి "అర్జునునితోడి విద్యామత్సరంబున" నశ్వత్థామ యన్నసాధకునితో నట్లు చెప్పినట్లు వ్రాసియుండెను.

తిలోత్తమ బ్రహ్మయానతిపై సుందోపసుందుల కడకరుగుచు దేవసభకుఁ బ్రదక్షిణ మొనర్ప శివుఁడు తత్సౌందర్య దిదృక్షుడై యామె యేదిక్కునకున్న నాదిక్కునకుఁ దిరిగి చతుర్ముఖుఁ డయ్యెనని మూలమందున్నది. (208-26) నన్నయ శివుఁడు చతుర్ముఖుఁ డయ్యెనని వ్రాయక "తద్రూపసౌందర్య దర్శనలోలుఁడై యజుఁడు నాలుగుదిక్కులయందుఁ దనకుఁ గావించుకొనియె ముఖంబు" లని తెల్పి మూలమునందలి యసంగతత్వమును దొలఁగించెను.

సహదేవుఁడు దక్షిణదిగ్విజయము చేసినసందర్భమున మాహిష్మతీ పురమం దగ్ని పారదారికుఁడై దండితుఁడైన వృత్తాంతము చెప్పఁ బడినది. మూలమున నగ్ని మాహిష్మతీపురమున కరుగుటకుఁ గారణమేమియుఁ దెల్పఁబడి యుండలేదు. నన్నయ "జాతవేదుండు విప్రుండయి వేదాధ్యయనంబు సేయుచు మాహిష్మతీపురముననుండి ప్రమాదవశంబునఁ బారదారికుండయ్యె" నని చెప్పి వేదాధ్యయనాసక్తియే యతఁడచ్చటి కరుగుటకుఁ గారణమనియు నతని పారదారికత్వము ప్రమాదజనితమనియు సూచించెను. ఆ సందర్భముననే మాహిష్మతీపురమందలి స్త్రీలు స్వైరిణులు కావచ్చునని యగ్నియే వరమిచ్చినట్లు మూలమందున్నది. (స. 28-24) నన్నయ యగ్ని మాహిష్మతీపురాధిపున కతఁడు కోరిన వరమొసంగి "ఇప్పురంబు నింతు లెంతయు మనోజరాగిణులు కావున వీరల స్వైరిణీవృత్తి యెల్లకాలము సహింపవలె" నని ప్రతివరముగా నడిగి యాతనిచే నంగీకరింపఁ జేసెనని వ్రాసి యుండెను.

భీమ జరాసంధులు పోరుసందర్భమున మూలమందు బలి శక్రునివలె జరాసంధుఁడు భీమునిఁ దాఁకెనని చెప్పఁబడినది. బలియే యింద్రుని జయించినట్లు పురాణము లందుండుటచే నీయుప మానమున భీముని భవిష్యజ్జయము సూచింపఁబడుటలేదు. అందుచే నన్నయ దానిని మార్చి "సింహగజేంద్రములట్లు, వజ్రపర్వతములయట్లు, ఘోరతరవాసవవృత్రులయట్లు" లిద్దఱును బోరిరని వ్రాసియుండెను.

పాండవు లడవి కరుగునపుడు నకులుఁడు పాంసూపలిప్త సర్వాంగుఁడును సహదేవుఁడా విప్తముఖుఁడునై చనిరని మూలము వర్ణించుచున్నది. నన్నయ సహదేవుఁ డధోవక్త్రుఁడై యరిగినట్లు మార్చి వ్రాసెను. వారట్లేగుటకు సూచింపఁబడిన కారణములు మూలమునఁ గంటె ననువాదమున నుచిత తరములుగా నున్నవి.

అర్జునుఁ డింద్రలోకమునుండి తిరిగి వచ్చినపిదపఁ దా నస్త్రముల సంపాదించినవిధము సోద రుల కెఱింగించెను. ధర్మరాజంత వానిని జూడఁగోర నర్జునుఁడు మఱునాఁడు చూపెదనని చెప్పి నట్లు మూలమందున్నది. నన్నయ యది యర్జునిని భ్రాతృభక్తికి లాఘవమాపాదించునదిగా నుండుటచే "మఘవసుతుఁడు వేఱువేఱ చూపె వేలుపులిచ్చిన యస్త్రశస్త్రములు నిజాగ్రజునకు" నని వెంటనే చూపినట్లు వర్ణించెను.

ఇంద్రసురభిసంవాదమున సురభి బలముగల యెద్దులతో బలహీనములైనవానిని బూన్చి జనులు లాంగలాకర్షణాదులొనరించుచు నసమర్థములైన తన యపత్యముల బాధించుచున్నారని తెల్పి దుఃఖింప నింద్రుఁడు బాగుగా వర్షము కురియించి కర్షకుల కార్యమునకు విఘ్నమాచ రించెనని మూలమందున్నది. (అ. 10-18) ఇంద్రుఁడు దుర్బల బలీవర్దముల బలముడుపవలెను గాని యధికవర్షము కురియించి తాత్కాలికముగాఁ గర్షకులకు విఘ్నమాచరించుటవలన నేమి లాభము? అందుచే నన్నయ యింద్రుఁడు వర్షమునఁ దృణవర్ధనము గావించి దుర్బల బలీ వర్దములకు బలము గావించెనని వ్రాసియుండెను.

అర్జునుఁడు నివాతకవచులతోఁ బోరునప్పుడు వారు తమ యస్త్రములన్నియు వమ్ము కాఁగాఁ జివరకిఁదిమిరబాణమేసిరనియు, నప్పుడు భయపడుచున్న మాతలినూఱడించి యర్జునుఁడు మోహినియను నస్త్రమాయను బ్రయోగించెననియు మూలమందున్నది. నన్నయ తిమిరబాణ ప్రభావమును మాపుట కస్త్రమాయనుగాక సూర్యబాణమేయుట యుచితముగా నుండునని తలంచి యట్లు మార్చివ్రాసెను.

ఔచిత్యపరిపోషణమునకై నన్నయ కావించిన యిట్టిమార్పులు పెక్కున్నవి. విస్తర భీతిచేఁ గొన్నిమాత్రమే యిట యుదాహరింపఁబడినవి.

౬. యథామూలానువాదములు.

నన్నయ మూలశ్లోకములను యథాతథముగా ననువదించిన పట్లును అనేకము లున్నవి. రెండుమూఁడు మాత్ర మిచ్చట సూచింతును.

జ్ఞాతయో యస్య నైవస్యుః విషమాః కులపాసనాః
పజీవేత్సుసుఖం లోకే గ్రామే ద్రుమ ఇవైకజః (అ. 188-24)

కులపాంసనులయి యహితంబులుసేయుచునుండు చుట్టములఁ బొందకయి
మ్మలనుండువాఁడ పుణ్యుఁడు వెలయఁగ గ్రామస్థితైకవృక్షముపోలెన్. (౬-181)

అగ్నిహోత్రఫలావేదా దత్తభుక్తఫలంధనమ్
రతిపుత్రఫలాదారాః శీలవృత్తఫలంశ్రుతమ్. (స. 5-79)

దారసంగ్రహంబు ధరణీశ! రతిపుత్రఫలము, శీలవృత్తఫలము శ్రుతము
దత్తభుక్తఫలము ధనము, వేదములగ్నిహోత్రఫలము అనియు నెఱుఁగు. (స. ౧-51)

అల్పోఽపిహ్యరిరత్యన్తం వర్ధమానపరాక్రమః
వల్మీకో మూలజ ఇవ గ్రసతే వృక్ష మంతికాత్. (2-50-24)

అల్పుఁడయ్యు మనుజుఁ డతివరాక్రమమున పేర్మిఁ దరతరంబ పెరుఁగుచున్న
వాఁడు ద్రుమానిమొదలి వల్మీక మూత్రమానిఁ జెఱుచునట్లు చెఱుచుఁ బగఱ. (స. ౨-144)

మూలమునందలి యుపమేయమునఁ గర్మపదము కానరాదు. నన్నయ దానినిబూరించి భావమునకు వన్నె చేకూర్చెను.

తథాబ్రువతివాయౌతు పుష్పవృష్టిః పపాతహ
దేవమందుభయో నేదు ర్వవౌచ పవనశ్శివః (అ. 75-15)

కురిసె మరుద్వచనానంతరమున సురపుష్పవృష్టి తడయక, వించెన్
సురదుందుభినాదంబులు, కరము ప్రసన్నుఁడయివీచె గంధవహుండున్ (అ. ౨-27)

నన్నయ యాదిసభారణ్యపర్వములందలి యనువాదమును బరిశీలించిచూడ నది మూలమున కుత్తరోత్తరాధిక సన్నిహితముగా నున్నట్లు కన్పించును. అరణ్యపర్వమందలి విషయము కల్పనల కెక్కువగాఁ దావిచ్చునదికాదు. అందుచేనందలి యనువాదమెక్కువ మూలానుసారిగానున్నది. సాధారణముగాఁ బద్యభాగములందుఁగంటె గద్యభాగములం దనువాదము మూలమున కెక్కువ దగ్గఱగాఁ గానిపించును.

౭. పంస్కృత భారతమునుండియే వస్తువును గ్రహించి కాళిదాస భారవి మాఘ శ్రీహర్షు లభిజ్ఞాన శాకుంతల కిరాతార్జునీయ శిశుపాలవధ నైషధాదులను రచించిరి. వారందఱును నన్నయకుఁ బూర్వులే. వారికావ్యములను నన్నయ చదివియుండుటలో నచ్చెరువులేదు. అందుచేతనే వారికావ్యములందలి కొన్నిభావము లాకథలను రచించువట్ల జ్ఞాతముగనో అజ్ఞాతముగనో నన్నయ యనువాదమునఁ బ్రవేశించినవి.

అసంశయం క్షత్రపరిగ్రహక్షమా
యదార్య మస్యా మభిలాషి మే మనః (అభి. ౧-21)

ఇది మునికన్యయేని మఱి యేలొకో యీలలితాంగియందు నాహృదయము తద్దయుం దగిలె... (ఆది. ౪-80)

వ్రజన్తి తే మూఢధియః పరాభవం
భవన్తి మాయావిషు యే న మాయినః
ప్రవిశ్య హి ఘ్నన్తి శఠా స్తథావిధా
నసంవృతాంగా న్నిశితా ఇవేషవః (భారవి ౧-30)

ధర్మదూరులైన ధార్తరాష్ట్రులయం దధర్మ మేమి సేయు ధరణినాథ
నికృతిపరులయందు నికృతి సేయనివారు వారినికృతి సేసి వధ్యులండ్రు (౧-226)

అకృత్రిమప్రేమరసాభిరామం
రామార్పితం దృష్టివిలోభి దృష్టం
మనఃప్రసాదాంజలినా నికామం
జగ్రాహ పాథేయ మివేంద్రసూనుః (భార. ౩-37)

"పాంచాలరాజపుత్త్రి దనస్నేహలాలస విలోలాపాంగ
విలోకనంబులం బార్థు గృహీతపాథేయుం జేయుచుఁ
దద్వియోగతరళం బైన హృదయం బెట్టకేనియు
నొక్కింత సేసికొని యుండె." (అర. ౧-286)

కన్నడమున పంపమహాకవి నన్నయకుఁబూర్వమే విక్రమార్జునవిజయమను పేర భారతమును రచించెను. నన్నయ నారాయణభట్టు సాయమున దానినిగూడఁ బఠించి యుండును. అందుచే పంపభారతమునందలి ఛాయలుకూడ నన్నయభారతమునఁ గొన్ని యెడలఁ గనిపించును. "పంపని భారతమును భట్టారకుని భారతరచనమునుబోల్చి చూచినప్పుడు రెండుగ్రంథములను రచించినవాఁ డొకరేనా యన్నంత పోలిక కనిపించు"నని యా యిరువురు కవుల రచనలను బరిశీలించిన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు సుజాతపత్రికలో వ్రాసియున్నారు. ఇందుఁ గొంత సత్యము లేకపోలేదు. భావములయందును, పదప్రయోగమునందును, పద్యముల యెత్తుగడలందునుగూడఁ గొన్ని యెడల వారిరువురి రచనలలో సన్నిహితసాదృశ్యము గోచరించుచున్నది.

"లలితపదం ప్రసన్నకవితాగుణ మిల్లదె వృణ్ణు పేర్దిచె
ల్గళకృతిబంధముం" (ప్రథ. 12)

ఇందలి ప్రసన్నగుణ, కవితా లలితపదములే నన్నయ ప్రసన్నకథా కవితార్థయుక్తికిని అక్షరరమ్యతకును దారి చూపినవని భావింపవచ్చును.

"అవని పతివ్రాత మణిమకుట కిరణద్యోతితపాదం" (ప్రథ–16)

"అఖిలక్ష్మాపాలమౌళి మణికిరణాపాళిత మణిమయూఖ రంజితచరణం" (ప్రథ–18)

ఇట్టి సమాసములే యించుక మార్పుతో నన్నయ రాజరాజసంబోధనలలోఁగూడఁ గనవచ్చు చున్నవి.

పాండురాజు మాద్రిని గూడుటకు ముందు నన్నయ కావించిన వసంతవర్ణనమునకును, కణ్వాశ్రమమును వర్ణించు "శ్రవణ సుఖంబుగా" నిత్యాది సీసమునకును, వ్యాసవర్ణనమునకును (అది ౪–239) మూలములని యూహింపఁదగిన పద్యగద్యములు సంస్కృత భారతమునఁ గాక పంప భారతమున నున్నవి. ఇట్లే సమాసఘటనమందును, పద్యముల యెత్తుగడలందును వారి రచనలలో నెడనెడ సాదృశ్యము కానఁబడుచుండును.

నన్నయపై సంస్కృత భారతముతోపాటు కొన్ని సంస్కృత కావ్యముల యొక్కయు, పంపాదుల రచనలయొక్కయుఁ బ్రభావ ముండుట నిజమేయైనను అతఁ డప్రతిమప్రతిభావంతుఁ డగుటచే నేభావములనైనను స్వాయత్తముచేసికొని, యౌచిత్యము పాటించుచు, ననువాదమును నైతము స్వతంత్రకావ్యముగా సంతరించి తరువాతి యాంధ్రీకర్తల కాదర్శప్రాయుఁ డయ్యెను.

## నన్నయ కవితారీతి

నన్నయ భారతరచనమున నైతికదృష్టియేకాక కావ్యకళాదృష్టియును గోచరించు చుండునని యిదివఱకుఁ జెప్పఁబడినది. కథాకథన, వర్ణనవిధాన, రస పాత్రపోషణాదులం దాతని రచన మూలముతోఁబోల్చి చూచినఁ గొంత వైలక్షణ్యము కలిగియుండును. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" యను పద్యమున వ్యాసుఁడు సంస్కృతభారతము నెట్లు విశ్వజనీనతాభాసురముగా రచించియుండెనో నన్నయ తెల్పియున్నాఁడు. అందలి లక్షణములు పెక్కు మూలమునకు వలె నతని రచనకును అన్వయించును. అందలి మహాకావ్యత, సర్వలక్ష్య సంగ్రహత యను లక్షణములు మూలానువాదములు రెండింట గోచరించుచున్నను అవిషయమున మూలము కంటె ననువాదమునకే ప్రశస్తి యెక్కువయని చెప్పినచో నత్యుక్తియుండదు.

## నన్నయ భారతావతారికలో

సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకవితార్థయుక్తిలో
నారసి మేలునా, నితరు లక్షర రమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితా రచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్ (౧–26)

అను పద్యమునఁ దన కవిత్వమందుండు ప్రధానగుణములను బేర్కొనియున్నాఁడు. ప్రసన్నకథాకవితార్థయుక్తి, అక్షరరమ్యత. నానారుచిరార్థ సూక్తినిధిత్వము అనునవి యా గుణములు. "ప్రసన్నకథాకవితార్థయుక్తి" అను సమాసమునకు 'ప్రసన్నకథాకవితార్థయుక్తి' అను పాఠాం

తరమున్నది. దీనినే పలువురు విమర్శకులు గ్రహించియున్నారు. పంపభారతమున ప్రసన్న కవితాగుణ మను పదము వాడఁబడి యుండుటచే నీ ముద్రణమున కవితాపదముతోఁగూడిన పాఠమే గ్రహింపఁబడినది. అప్పు డా సమాసమునకుఁ బ్రసన్నమైన కథాకవితయందలి (కథా కవిత్వమునందలి) యర్థముయొక్క కూడిక యని యర్థము చెప్పవచ్చును. 'కవిత' పాఠమును గ్రహించినచోఁ బ్రసన్నములైన కథలందుఁ గూర్పఁబడిన యర్థముయొక్క కూడిక యనునర్థము వచ్చును. కొంచెమించుమించుగా రెండర్థములును సమానములే. కథాకవిత యను పద మిప్పుడు ప్రచారములో నున్నది. దానికిఁ గథా ప్రధానమైన కవిత్వము (Narrative poetry) అని యర్థము. నన్నయకుఁ బూర్వ మేదో యొకవిధమైన కవిత్వముండినను గథారూపమైన కవిత్వ ముండినట్లు కనఁబడదు. అట్టి కవిత్వమునకు నన్నయయే శ్రీకారము చుట్టెను. అయభిమానము తోడనే యతఁడు కథాకవితాపదమును వాడియుండెనని కొందఱు చెప్పుదురు. కావచ్చును. ప్రసన్నపదమును గథా, కవితా,ర్థములు మూఁడింటికిని విశేషణము చేయవచ్చును. అప్పుడు ప్రసన్నములైన కథలయొక్కయు, ప్రసన్నమైన కవిత్వముయొక్కయు, ప్రసన్నమైనయర్థము యొక్కయుఁ గూడికయను నర్థముకల్గును.

ప్రసన్నమనఁగాఁ బ్రసాదగుణముతోఁగూడినదని యర్థము. ప్రసాదగుణమును సంస్కృత-లాక్షణికులలోఁ గొందఱర్థగుణముగాను, కొందఱు శబ్దగుణముగాను, కొందఱుభయాత్మకము గాను, గొందఱు రసగుణముగాను జెప్పియున్నారు. వారాగుణమునకిచ్చిన నిర్వచనములను సమన్వయించి చూచినచో ప్రసిద్ధార్థములు, ఝటితత్యర్థసమర్పకములు, సప్రయోజనములునైన పదములను గలిగియుండుటే ప్రసాదగుణమని స్పష్టమగును. దీనినిబట్టి యాయాసందర్భములందు సప్రయోజనములైన విషయములమమాత్రమే చెప్పుచు, నేకమాత్రశ్రవణముననే లోనియర్థము వ్యక్తమగునట్లుచేయుట నన్నయ కవితాప్రసన్నతకు లక్షణమని చెప్పవచ్చును. ఈలక్షణమునే కథలకుఁగూడ నన్వయించినచో వానికిఁ బ్రధానకథతోఁ గల సంబంధమును వివరించుచు. ప్రయోజనరహితములైన సందర్భముల నుజ్జగించుచు, విన్నంతమాత్రమున నందలి తత్త్వమును స్ఫురింపఁజేయుట కథాప్రసన్నత యని తెలియవచ్చును. ఆర్థికప్రసాదమనఁగా నర్థవైమల్య మనియు, వైమల్యమనఁగాఁ బ్రయోజనమాత్రపరిగ్రహమనియు వామనుఁడు నిర్వచించి యున్నాడు.

ఓజోమాధుర్యములవలెఁగాక ప్రసాదము సర్వరస సాధారణమును సర్వరస సమర్పకము నైన గుణము. శబ్దార్థగతమైన స్వచ్ఛతచే శుష్కకాష్ఠములం దగ్నివలెఁ బ్రసాదగుణము సహృదయ హృదయములందు వెంటనే వ్యాపించును. అది రసగుణమగుటచేతను, సర్వరస సాధారణమగుటచేతను ప్రసన్నములైన కథాకవిత్వములను నప్పుడందలి నానారసమయత్వము వ్యంజితమగుచున్నది. ఈవిధముగా ప్రసన్నకథా కవితార్థయుక్తి యనుపదమును నన్నయ రసదృష్టితోఁ బ్రయోగించెనని చెప్పవచ్చును. సంస్కృతభారతమున రసదృష్టికన్న ధార్మికదృష్టి మిన్న. నన్నయరచనలో నట్లుగాక రసమునకే యధికమైన ప్రాధాన్యము. రసమునకుఁగాక కేవల కథానిర్మాణమునకే ప్రాధాన్యమొసంగుట మహాకవిత్వ లక్షణముకాదు. "ఇతిహాసాదేవ

తత్సిద్ధేః." అందుచే ప్రసన్న పదప్రయోగముచే నన్నయ స్వీయకథా కవిత్వములు రసానుగుణములై యుండునని సూచించినట్లు భావింపవచ్చును.

ప్రసన్నత నాత్మగతము, అంగగతము అని రెండువిధములుగా విభజింపవచ్చును. ఆత్మగతమైన ప్రసన్నత రసభావసంధిగను, అంగగతమైనది తద్వ్యంజకశబ్ద సంబంధిగను ఉండును. వానినే నన్నయ వరుసగా అర్థయుక్తియనియు, అక్షరరమ్యత యనియుఁ జెప్పియుండెను. అతని కవిత్వమున నీరెండును బుష్కలముగానున్నవి. అక్షరరమ్యత నాతని శైలినిగూర్చి చెప్పునప్పుడు వివరింతును.

నన్నయ తన్నుగూర్చి 'నానారుచిరార్థసూక్తినిధి'యను విశేషణమును వాడుకొనియుండెను. సూక్తులనఁగా సుభాషితములు. ఇవి సార్వకాలికములును సార్వజనికములును. కావ్యమునకు రసానందజనకత్వము ప్రధాన ప్రయోజనమనియు నుపదేశ మానుషంగిక ప్రయోజనమనియు లాక్షణికు లంగీకరించియున్నారు. అందుచేఁ గవులు వ్యంగ్యముగను వాచ్యముగనుగూడ నుపదేశాత్మకములైన పెక్కు సూక్తులను దమ కావ్యములలోఁ జొప్పించుచుందురు. భారతమునందిట్టి సూక్తులనేకములున్నవి. ఇప్పటికిని బెద్దలు తమ యుపదేశములకుఁ బ్రామాణికత్వము కలిగించుటకై యందు భారతసూక్తుల నుద్ధరించుచుండుట మనము వినుచుందుము.

నన్నయ భారతము ననువదించునప్పుడు మూలమందు లేకపోయినను దనరచనలో నెడనెడ నర్థాంతరన్యాసాలంకారపూర్వకముగాఁ బెక్కు సూక్తులను జొప్పించియుండెను. అవియన్నియుఁ గథాప్రకరణ సంబద్ధములైనవి. అట్లుగాక యతఁడు విడివిడి పద్యములలోఁ బ్రత్యేకముగాఁగూడ వ్యక్తముచేసిన సూక్తులుకూడ నున్నవి. కావలసినవారు వానిని వల్లించి యాయాసందర్భములం దుచితరీతి వాడుకొనవచ్చును. అవి స్వయంసంపూర్ణములై యుండుటచే వాని నుదాహరించునప్పుడు కథాసంబంధమునకై తడవుకొనవలసిన యక్కఱ యుండదు. నన్నయ యుద్దేశపూర్వకముగనే వాని నట్లు రచించియుండును.

మతిఁ దలఁపఁగ సంసారం
బతిచంచల మెండమావు లట్టుల సంప
త్ప్రతతు లతిక్షణికంబులు
గతకాలము మేలువచ్చు కాలముకంటెన్ (అ. ౫-159)

మున్నగు పద్యము లట్టివి. నన్నయ సాధారణముగా నిట్టిసూక్తులను గందములందే పొదుగుచుండును. ఆదిసభాపర్వములందుఁగంటె నరణ్యపర్వమున నిట్టి వెక్కువగానున్నవి. నన్నయ సూక్తులు రుచిరార్థములైనవి. అనఁగా నవి యర్థగంభీరములై మనోహరములుగా నుండును. "హితం మనోహారిచ దుర్లభం వచః" అని భారవి చెప్పియుండెను. హితమనోహరత్వము లొక్కచోఁ గూడియుండుట యరుదు. నన్నయసూక్తు లారెండుగుణములకుఁ బట్టుఁగొమ్మలై చదివినకొలంది చదువవలెనను నుత్సాహము కలిగించుచుండును.

నన్నయసూక్తులు కొన్ని సార్వజనికము లయ్యు ప్రత్యేకథాసందర్భమున నెంతో గంభీరార్థమును వెల్లడి చేయుచుండును. నలుఁడు దమయంతి నడవిలో విడిచి వెళ్ళినతరువాత హామె యతనికై వెదకివెదకి యాతఁడు గానరామిచే దుఃఖించుచు,

వగవఁగ సాంగోపాంగము
లగు నాలుగువేదములయు నధ్యయనము పొ
ల్పుగ నొక సత్యముతో నెన
యగునే యెవ్వియును బోలవటె సత్యంబున్ (అ. ౨-48)

అని పలికి యుండెను. ఇది పైకి సత్యముయొక్క మహత్త్వమును జెప్పుచున్నట్లున్నది. కాని పరిశీలింప సాంగోపాంగచతుర్వేదాధ్యయనముతోఁ గూడిన నలుని పాండిత్య విశేషమునుగూడ వ్యంగ్యముచేయుచున్నది. నన్నయసూక్తుల రుచిరార్థత్వమున కిది చక్కనిదృష్టాంతము.

సూక్తులనఁగా సామెతలు, నానుడులు, జాతీయములు, నీతులు, సుందరదేశోక్తులు అనియు విశాలార్థమును జెప్పవచ్చును. నన్నయకవిత్వ మిట్టివానితోఁ గూడ నొప్పారుచు నతని నానారుచిరార్థసూక్తినిధిత్వమును సార్థక మొనరించుచున్నది.

## నన్నయ కథాకథన కౌశలము

మహాభారతమునం దనేకములైన యుపాఖ్యానము లున్నవి.గరుడోపాఖ్యానము,యయాతి చరిత్ర, శకుంతలోపాఖ్యానము, నలోపాఖ్యానము మున్నగునవి నన్నయరచనయందలి ముఖ్యములైన యుపాఖ్యానములు. భారతము నందలి యుపాఖ్యానములలోని కెల్ల వీని కధిక ప్రచార ప్రఖ్యాతు లున్నవి. అందు కాయుపాఖ్యానములందలి సహజరామణీయకముతోపాటు నన్నయ కథాకథన కౌశలము కూడఁ గారణమని చెప్పుటలో నతిశయోక్తి యుండదు కథలను బాతకజన హృదయరంజకములుగా సంతరించుటలో నతనికిఁ గల ప్రతిభ ప్రత్యేకమైనది. అందు చేతనే ప్రసన్నకథా కవితార్థయుక్తి నతఁడు తనకావ్యగుణములలోఁ బ్రధానమైన దానినిగాఁ బేర్కొనియున్నాఁడు. కథకనవసరములును, గథాగమనమున కాటంకము కలిగించునవియు నగు వర్ణనములను నీతిధర్మతత్త్వవివరణములను దగ్గించియు, పునరుక్తములైన కథాభాగముల నుచితరీతి నొకచోట సమ్మేళనము కావించియు, నుపాఖ్యానములకుఁ బ్రధానకథతోఁ గల సంబంధమును విశదీకరించియు, మూలమున వేఱువేఱు అధ్యాయములలో స్థలాంతరములందుఁ జెప్పఁబడిన విషయముల నుచితసందర్భములందుఁ జొప్పించియు, గూఢములైన కథాంశముల నుచితమైన వ్యాఖ్యానముచే సువ్యక్త మొనరించియు, విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావముల వర్ణనముచే స్థాయిభావమున కుత్కర్ష కలిగించి రసమును బోషించియు నతఁడు తాను రచించిన కథలకుఁ బ్రసన్నత నాపాదించి యున్నాఁడు. ఈవిధానమంతయు నాతఁ డనువాదము చేయు నప్పుడు వహించిన మెలఁకువను గూడ సూచించుచున్నది.

సుకన్య సఖులతో వనమున విహరించుచుఁ బుట్టనుండి చ్యవనుని కన్నులు మెఱయు చుండఁగా నవి విలసత్ఖద్యోతప్రభ లనుకొని పుట్ట గ్రొప్పించి చూచెను. ఆమె కేమియుఁ గనఁబడ

లేదు. సేనలకు మూత్రపురీషనిరోధము కలిగెను. సుకన్యవలన విషయ మంతయు నెఱింగి శర్యాతి పుట్ట దగ్గఱకు వచ్చి కృశాంగుఁడైన చ్యవనునిగాంచి, యాతనికిఁ దనకూఁతునిచ్చి సైన్యనిరోధముఁ బాపు కొని యరిగెను. పుట్ట గ్రొప్పించినప్పుడు చ్యవనుఁడు సుకన్యకుఁ గనఁబడకుండుటకును దరువాత శర్యాతికిఁ గనఁబడుటకును గారణమేమి ? మొదటఁ జ్యవనుఁ డలిగి నిమీలితనయనుఁడయ్యెను. అప్పుడు నికటవల్లీగుల్మములు పైఁ బ్రాకియుండుటచే నాతఁ డేర్పడకయుండెను. శర్యాతి వచ్చినప్పు డాతఁడు కన్నులు తెఱచియుండెను. అప్పుడాతఁడు దృష్టిగోచరుఁ డయ్యెను. పై ప్రశ్నకు సమాధానముగా నన్నయకావించిన వ్యాఖ్యానమిది. ఇట్లే తపస్వియైన చ్యవనుఁడు సుకన్యను బరిగ్రహింపఁ గోరుట కామె తండ్రి చెప్పి నట్లైయుఁగక పుట్ట గ్రొప్పింపలేదనియు నతిశయరూపయౌవనగర్వితయై యట్లుకావించె ననియు, నాగర్వము నడంచుటకే చ్యవనుఁడట్లు కోరియుండె ననియు నన్నయ వ్యాఖ్యానించియుండెను.

శంతనుఁడు యమునాతీరమున వేఁటలాడుచు నపూర్వసురభిగంధ మాఘ్రాణించి యది వచ్చినదిక్కున నేగి యోజనగంధిని గాంచెను. పిమ్మట నన్నయ

"దానిశరీరసౌరభము, దానివిలోల విలోకనంబులున్
దానిమనోహరాకృతియు, దాని శుచిస్మితవక్త్రకాంతియున్
దానివిలాసముం గడు ముదంబునఁ జూచి"

యాతఁడు మనోజబాణసంతానహతాత్ముఁ డయ్యె నని వర్ణించెను. ఇందు వర్ణ్యములైన శరీర సౌరభాదు లుద్దీపనవిభావములు. విలోకనము లనుభావములు. అమూలకమైన యీవర్ణనము గావించి నన్నయ రతియను స్థాయిభావమున కుత్కర్ష నాపాదించెను. ఇట్లే యయాతి దేవయానికి నూతినుండి పైకిఁ దీయునపుడు నన్నయ "ఉన్నమద్గళదురుఘర్మవారికణక్రమ కరాబ్జముపట్టి" యని సాత్త్వికభావమైన స్వేదమును వర్ణించి యచ్చటి శృంగారమున కుత్కర్ష కలిగించెను.

నన్నయ తాను రచించిన కథ లన్నిటియందు నేదోయొక పరమార్థమును నిక్షేపించుచుండును. మూలమునఁ నస్ఫుటస్ఫురితముగానున్న దాని నతఁడు తనరచనలోఁ బ్రస్ఫుటము గావించి పాఠకుల హృదయములకు హత్తుకొనునట్లు చేయుచుండును. సవతి విషయమున నీర్ష్యాకపటము లవలంబించి కద్రువ తనతనయులను దానే శపించుకొనవలసి వచ్చుటచే నాలక్షణము లెంత దుష్టములైనవో గరుడోపాఖ్యానమువలన వెల్లడియగుచున్నది. "నీగర్వము నిన్నింత సేసె"నని యింద్రుఁడు యయాతితో నన్న మాట యాకథయందలి పరమార్థము. సుందోపసుందోపాఖ్యానము "ఇంతుల నిమిత్తమున ధృతిమంతులుఁ బొందుదురు భేదమతి" యను విషయమును బోధించుచున్నది. భార్య యధికదుఃఖరోగార్తున కెల్లౌషధ మగునో, పురుషునందు దోషపుంజంబు నెఱిఁగియు నెక సహించు నిల్లాలు కాలాంతరమున నెట్లభీష్ట భోగము లందఁ జాలునో నలోపాఖ్యానము తేటతెల్లము కావించుచున్నది. ఋశ్యశృంగునికథ వలన "విలాసినుల సహాలాప సహాసన సహాయానములు బంధనములుకావే" అను సత్యము

వ్యక్తము చేయఁబడినది. ఈవిధముగా నన్నయకథ లన్నింటియందు జనులకు శిరోధార్యములైన యుపదేశములు వివరింపఁబడి యున్నవి.

నన్నయ రచించిన కథలలోఁ గొన్ని రాజులకును గొన్ని ఋషులకును, గొన్ని ధర్మతత్త్వమునకును సంబంధించినవి. వైదికములు లౌకికములునైన కథలుకూడఁ గొన్ని గలవు. భిన్నవస్తుకములైన యీకథలను జెప్పుటలో నతఁడు భిన్నశిల్పవిధానముల నవలంబించి యుండెను. యయాతి సుకన్యోపాఖ్యానములనాతఁడు వ్యంగ్యరీతిగను, నల దుష్యంతోపాఖ్యానములను గథాప్రధానములుగను, రురు ఋశ్యశృంగుల కథలను మనస్తత్త్వసంబంధులుగను దీర్ఘతమ వ్యుషితాశ్వుల వృత్తాంతములను ధర్మతత్త్వోపదేశకములుగను, సర్పయాగ భృగు వృత్తాంతములను వైదికకర్మప్రధానములుగను నడపించెను. సుందోపసుందుల కథలో స్త్రీవిషయమైన కలహమునకును గరుడోపాఖ్యానమున సవతుల యీర్ష్యాద్వేషములకును బ్రాధాన్య మొసంగఁబడినది. అరణ్యపర్వమునందలికథలు పెక్కు తీర్థక్షేత్రమాహాత్మ్యబోధకములైనవి.

నన్నయ కథలను రచించు నప్పు డంగాంగిభేదమును జాగరూకతతో గమనించుచుండును. ఉపాఖ్యానముల నతివిస్తృతముగా వర్ణించి ప్రధానకథకుఁ గాని, యుపాఖ్యానములందలి యంగవస్తువును విస్తరించి యంగి వృత్తమునకుఁ గాని యాతఁ డెప్పుడును లాఘవము కల్పింపఁడు. గరుడోపాఖ్యానము నందలి యమృత మథనవృత్తాంతమును, విభావసు సుప్రతీకుల వృత్తాంతమును, యయాతిచరిత్రకు మూలమైన కచదేవయానుల వృత్తాంతమును నాతఁడు సంగ్రహించుట యీదృష్టి తోడనే. ఈవిధముగనే యంగిరసము మరుగుపడునట్లుగా నాతఁ డంగరసముల నెప్పుడును విస్తృతముగా వర్ణింపక వానిని సూచ్యమాత్రములు కావించుచుండును.

కథాకథనమున రెండు ముఖ్యపద్ధతు లున్నవి. అందొకటి కవి తటస్థుఁడై యిట్లు జరిగెనట్లు జరిగెనని చెప్పు కథనపద్ధతి. రెండవది పాత్రల సంభాషణముల మూలమునఁ గథను నడపించు నాటకపద్ధతి. వీనిలో నన్నయది ప్రధానముగాఁ గథనపద్ధతి తిక్కనగారిది నాటకపద్ధతి.

నన్నయ నల దుష్యంతోపాఖ్యానాదులగు పెద్దకథలను స్వతంత్రకావ్యములా యన్నట్లు తీర్చి దిద్దెను. అట్లే భారతకథ యందలి ప్రధానఘట్టములుకూడ నాతని రచనలో నుచితములైన యుపక్రమోపబృంహణోపసంహృతులతోఁ గూడి చక్కని ఖండకావ్యములవలె శోభిల్లుచుండును. నలోపాఖ్యానము హంసదౌత్యము, నలదౌత్య స్వయంవరములు, ద్యూతము, వనగమనము, పునస్సమాగమము, రాజ్యసంపాదనము అను ప్రధానవిభాగములతోడను, వస్త్వైక్యముతోడను గూడి నన్నయ కథానిర్మాణశిల్పమును లెస్సగా వ్యక్తము చేయుచున్నది. సభాపర్వమునందలి కథయంతయు సభాద్వితయముతో సన్నిహితసంబంధముకల్గి యాపర్వమున కానామము నన్వర్థముకావించుచున్నది. మయుఁడు కృతజ్ఞతాపూర్వకముగా నొక సభ నిర్మించి పాండవుల కొసంగుట, నారదుఁ డరుదెంచి దాని యపూర్వసౌందర్యమును వర్ణించుట

ధర్మజుఁడందు రాజసూయయాగ మొనరించుట, దుర్యోధనుఁడు దానివైభవమును గాంచి యసూయకెరయగుట, ధృతరాష్ట్రుఁ డాతని కింకొక సభ నిర్మించియిచ్చుట, అందు ద్యూత ద్రౌపదీవస్త్రాపహరణములు జరుగుట, పునర్ద్యూతము, తత్ఫలముగాఁ బాండవులు వనమున కరుగుట యందలి ప్రధానాంశములు. ఈవిధముగా నందలి రెండాశ్వాసములందు రెండు సభలును గథాంశముల కాటపట్టులై వస్త్వైక్యమును సంఘటించుచున్నవి. అస్త్రవిద్యాప్రదర్శన మునఁ గర్ణుఁడు కౌరవపక్షము నవలంబించుట, కుంతి ప్రత్యభిజ్ఞచే నాతని గుర్తించుట యనునవి ప్రధానాంశములు. నన్నయ పంచమాశ్వాసమును గౌరవులు భీమునిబలమును అర్జునుని ధనుర్విద్యాకౌశలమును దలంచి మనమున వందురుచుండి రను విషయముతోడను అస్త్రవిద్యా ప్రదర్శనవృత్తాంతమును గర్ణుని సహాయుఁగాఁ బడసి దుర్యోధనుఁ డర్జునువలని భయముచెడి బొమ్మనఁ జేయిడి హాయిగా నిద్రపోయె నను విషయముతోడను ముగించి యుండెను. ఈరెండు ముగింపులను సమన్వయించి చూచిన నస్త్రవిద్యాప్రదర్శనవృత్తాంత మే ప్రయోజన ముతోఁ గూర్పఁబడెనో తెలియవచ్చును. కుంతి బాల్యమునఁ గర్ణుని గంగలో విడిచి వైచిన పిమ్మట మరల నాతనిఁ జూచుట యీఘట్టముననే. మధ్యకాలమున నామె మానసమున నేమి మథనపడెనో నన్నయ చెప్పియుండలేదు. అందుచే నాతఁ డీసందర్భమున కుంతి కధికమైన ప్రాధాన్య మొసంగెను. ఈవిధముగా నతఁడు ప్రధానకథాఘట్టములం దైనను, ఉపాఖ్యానము లందైనను ఆదిమధ్యావసానముల నెంతో శిల్పరమణీయముగ సంతరించుచుండును.

నన్నయ కథాంశముల నన్నిటిని వాచ్యముగా వెల్లడింపక కొన్నిటిని పాఠకుల యూహలకు విడిచిపెట్టుచుండును. అతఁడు కొన్ని కథాంశములను మాత్రము వివరించి యవి యట్లు జరుగుటకు హేతువేమో తెల్పఁడు. దానిని బఠితయే యూహించుకొనవలయును. ఇట్లు కథను వ్యంగ్యముగా నడపు పద్ధతి నన్నయ కథానిర్మాణమునఁ బ్రదర్శించు శిల్పవిశేషములలో నొకటి. ఇట్టి శిల్పము నాతఁడు పెక్కుకథలలోఁ బ్రదర్శించెను. ఒక్కయుదాహరణము మాత్ర మొసంగెదను. పాండురాజు శతశృంగమున నున్నతఱి నొక యమావాస్యనాఁడు బ్రహ్మను గొల్వ నరుగుచుండిన మునుల వెనుక భార్యాద్వయసమేతుఁడై తానును విషమ ప్రదేశములఁ జననారంభించెను. ఋషు లది చూచి "వీర లతి లలితమృదులాకారలు, గిరివిషమ గహనగహ్వరముల రానేరరుకావున నిట చనుదేరక నిలువుండ యివియు దేవపథంబుల్" అని వారించిరి. ఆమాట లాలించి పాండురాజు "స్వర్గద్వారం బనపత్యులు గాన నోపరకెు మును లయ్యున్. నేనపత్యుఁడ నేమి చేయుదు" నని దుఃఖించెను. ఋషులు పాండురాజు ననపత్యతను గూర్చి యేమియు ననియుండలేదు. వారన్నమాటలకును బాండురా జనపత్యతను గూర్చి దుఃఖించుటకును సంబంధము కనఁబడదు. కాని వీరు లలితమృదులాకార లనుటలో నతని భార్యల సంతానరాహిత్యమును, ఇవి దేవపథములనుటలో సంతానరహితులు స్వర్గమునకు వచ్చుటందుఁగల యనర్హతయు ధ్వనించుచున్నది. అట్లే శర్మిష్ఠ దేవయానిని నూతఁద్రోసి నిర్భయముగా వెడలిపోవుటకును, దేవయాని విలసత్కూపఘనవల్లి యన్నిష్టసఖ నూది యాకూపముననే యుండి పోవుటకును గారణములను నన్నయ చక్కఁగా వ్యంగ్యము చేసి యుండెను.

నన్నయ కథలలో నే పాత్ర కెంత ప్రాధాన్య మీవలయునో యూహించి యాపాత్ర కంతే ప్రాధాన్య మొసంగి రచన కావించి దానిని బఠితలు గ్రహించుటకై తగిన సూచనలు చేయుచుండును. పాండవ కౌరవుల వైరమునకుఁ బ్రధానకారణమైనది ద్యూతము. ద్రౌపదీ పరాభవము దానిపరమావధి. ఈ ఘట్టమున ద్రౌపది కధికమైన ప్రాధాన్యమున్నది. నన్నయ యావిషయమును సూచించుచు ద్యూత కథాద్యంతములందు ద్రౌపదిని గేంద్రముగాఁ జేసి వర్ణనము సాగించియున్నాఁడు. ఇట్లే శకుంతలోపాఖ్యానమందలి "ఇది మునికన్యయేని మఱి యేలొకో యీ లలితాంగియందు నాహృదయము తద్దయుం దవిలె" "ఇది మునినాథకన్య యని యెంతయు నిస్పృహావృత్తి నున్న నాహృదయము...మదనబాణ పరంపర కిప్పు డుండె నాస్పదమయి" యను రెండు పద్యములును సమానారంభములు కలిగి యచ్చటి కథాప్రవాహముపైఁ గట్టఁబడిన వంతెనకటునిటుఁగల సమానరూపములైన యాధార స్తంభములవలెనున్నవి.

నన్నయ కథాకథన శిల్ప చమత్కృతిని కళాప్రపూర్ణ శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారి "నన్నయగారి ప్రసన్న కథాకవితార్థయుక్తి" యను గ్రంథమునఁ జూడఁదగును.

నన్నయ కథచెప్పుచు నాయాఘట్టములందుఁ గొన్ని పదములకు వాక్యములకు నమిత మైన ప్రాధాన్య మొసంగి యవి యాఘట్టముల కాయువు పట్టులవంటి వగుటచే వానిని రెండు మూఁడుసార్లు పునరుక్తములు కావించుచుండును. ఋశ్యశృంగోపాఖ్యాన మందలి 'ప్రబోధించి' యనుపదమును, యయాతిచరిత్రయందలి "యుద్ధరించి" యను పదమును, గాంధారీ వివాహ ఘట్ట మందలి సుబలుఁ డన్న" ఆరాజునకు గాంధారి నిచ్చితి"నను వాక్యము నందలి భూతకాల మందున్న క్రియాపదమును బరికించిన నీవిషయము తేటతెల్లము కాఁజాలును.

నన్నయ కథనంతను ఆయావిషయములు జరిగిన ప్రదేశములను బట్టి కొన్నిఘట్టములుగా విభజించి, ఘట్టము మార్పును "అట, ఇట, అంతనిక్కడ" అను పదములతో సూచించుచుండుట నాటకము లందలి రంగవిభజనమును బోలియుండును. నలుఁడు దమయంతి నడవిలో విడిచి యరిగిన పిమ్మట నామె మేల్కాంచి, కడుంగడు దుఃఖించి చివరికిఁ జేదిపురమున కరిగెను. ఇంతవఱకును దమయంతి వృత్తాంతమును జెప్పి నన్నయ తరువాత నలునివృత్తాంతము చెప్ప నారంభించెను "అట నలుండు దమయంతిం బాసి దారుణారణ్యమున నరుగువాఁడు ముందట" నని రంగము మార్పును సూచించెను. నన్నయ పెక్కుకథలందు నాటకీయ చమత్కారము నెంతో రమణీయముగా సంఘటించెను. సుభద్ర యతియే యర్జునుఁ డని యెఱుంగక యాతని నర్జునుని గూర్చి ప్రశ్నించుట, భీముఁడు సౌగంధిక సరోవరమున కేగుచు దారిలో నడ్డముగాఁ బడియున్న హనుమంతునితో నాతండు హనుమంతుఁ డని యెఱుంగక హనుమంతుని పరాక్రమమునే ప్రశంసించుచుఁ బ్రసంగించుట యిందుకు నిదర్శనములు.

నన్నయ కథలు చెప్పుచు నచ్చటచ్చట ధ్వని పూర్వకముగా భావికథాంశసూచన మొనరించుచుండును. ఉదంకుఁడు జనమేజయునితో తక్షకునిఁ గూర్చి చెప్పుచు "ప్రల్లదుఁడైన యొక్క కులపాంసను చేసిన దానఁ దత్కులం బెల్లను దూషితంబగుట యేమి యపూర్వ (ఆ ౧-125) మని తెల్పియుండెను. దుష్టుఁడైన దుర్యోధనుని దౌర్జన్యముచేఁ గౌరవకుల

మంతయు నాశనమై పోవునను కథాంశ మిందుఁ జక్కగా సూచితమగుచున్నది. కుమారాస్త్ర విద్యాప్రదర్శన సందర్భమున భీమదుర్యోధనుల గదాయుద్ధము "భావిపాండవ కౌరవ్యరణాభి సూచన పటిష్ఠంబయ్యె ఘోరాకృతి" నని వర్ణించెను. నిజమున నాసమయమునకుఁ బాండవ కౌరవ రణముయొక్క ప్రసక్తియే లేదు. ఇట్లే యాతఁడు భవిష్యద్భారతయుద్ధమును పెక్కు సందర్భములందు సూచించియుండెను. నలుఁడు దమయంతితో నడవిని సంచరించుచు నామె కేయేమార్గ మెచ్చటెచ్చటికిఁ బోవునో యెఱింగించెను. (అర ౨-౭౮). ఇట్లెఱింగించుటకుఁ గారణమేమి? ముం దాతఁ డామెను విడిచి పోవలసి వచ్చును. అప్పు డామె విదర్భాపురమున కేగి పుట్టినింట సుఖముగా నుండవలయు నని యతనియూహ. అందుచే నాతఁ డామె కా మార్గములన్నియు నిర్దేశించెను.

అరణ్యపర్వ మంతయుఁ గథోపాఖ్యానములతోడను, నీతి ధర్మ వివరణములతోడను గూడియుండును. ఇవేవియు మూలరచనమున మొదట నుండి యుండవనియుఁ దరువాత నెవ్వరో వాని నందందుఁ జేర్చియుందు రనియుఁ గొందఱు విమర్శకుల యభిప్రాయము. కాని భారతేతి హాసనిర్మాణ క్రమమును బరిశీలించి చూచినచో నవి మూలప్రణాళికయందే యుండె నని స్పష్టమగును. "కాలవ్యవధానగోపనమునకై నీతికథోపాఖ్యానములను బ్రవేశపెట్టు పద్ధతి కథ నక్రమమున కంతరాయము కలిగింపకుండుటే కాక సూక్ష్మవివరములతోఁ గూడిన కథాభాగ మునకును సత్వరముగా ముగించి వేయఁబడిన కథాభాగమునకును గల ప్రతియోగమును బాఠ కులకుఁ గనబడ నీయకుండ ప్రముఖాంశ విరహితములైన వత్సరములందలి వృత్తాంతములను గూడ నానందముతోఁ గూడఁ బఠించుట కనువు కలిగించు ననియు, పాశ్చాత్య కవివర్యుఁడైన హోమరు కూడ ముఖ్యాంశ విరహితమైన కాలముయొక్క గమనమును మఱుఁగు పఱుచుటకై సంభాషణములను ఉపాఖ్యానములను దఱచు ప్రవేశపెట్టుచుండుననియు" పిసానీ యను విమర్శకుఁడు చెప్పిన విషయ మెంతయు యుక్తియుక్తముగా నున్నది. అరణ్యపర్వమందలి కిరాతార్జునీయ కాలకేయ నివాతకవచ వధవృత్తాంతము లర్జునుని యతిలోకపరాక్రమమునకును సౌగంధికాపహరణ వృత్తాంతము భీముని ప్రియసాహసత్వమునకును, అజగరోపాఖ్యానము ధర్మజుని ధర్మజ్ఞతకును నిదర్శనములై యతిమనోహరముగానున్నవి. కృష్ణుఁడు చెప్పిన సౌంభ కాఖ్యానము వీరరసపూరితమై యద్భుతముగా నున్నది, ఇంక నలోపాఖ్యానము భారత మందలి యుపాఖ్యానముల కెల్లఁ దలమానికమై నన్నయ కథాకథన శిల్పమును వేయివిధముల వెల్లడి చేయుచున్నది.

## నన్నయ వర్ణనలు

నన్నయ వర్ణనలు మితములును, సహజములును, ఉదాత్తములునై రమణీయములుగా నుండును. సభాపర్వ మందలి దివ్యసభల వర్ణనమును, గరుడోపాఖ్యాన మందలి సముద్ర వర్ణనమును, ఆదిపర్వాష్టమాశ్వాసమందలి యింద్రప్రస్థ ద్రౌపదీవివాహవర్ణనములును, అరణ్యపర్వ మందలి వర్షాశరద్వర్ణనములును ఇందుకుఁ దార్కాణములు. అతఁడు దేనిని వర్ణించినను దానికి సంబంధించిన వివిధాంగములను సమగ్రముగా వివరించి దాని సుస్వరూపమును బఠితలకు సాక్షా

త్కరింపఁ జేయుచుండును. అతనిచే వర్ణితులైన వ్యక్తులును బశుపక్ష్యాదులును జీవముతోఁ గూడి మన యెదుట నడయాడుచున్నట్లు కానిపింతురు.

"మృదురోమములును, శంకు నిభ కర్ణముల్, మెత్తని వలుద
పొదుఁగును, నిడుద చన్నులును, గుఱుచలై బొలుచు కొమ్ములును
సదమలశరదిందు శంఖ నిభమైన ఛాయయుఁ గలుగు
మొదవిది" నందిని వర్ణనము (ఆ. ౭-99)

"హ్రస్వపీనగ్రీవు, నవనతాయతహను
నతిచపలస్వభావాభిరాముఁ
దనుమధ్యకటిచక్రు దహనకటాకార
తామ్రోష్ఠు నతిదృఢ దశనకరజు"
హనుమద్వర్ణనము (అ. 3-319)

మున్నగు పద్యము లందుకు నిదర్శనములు. నన్నయ వ్యాసుని వర్ణించిన చోట్లనెల్ల నతని కపిల గడ్డమును, గవిలజడలను, గవిలకన్నులను, నల్లని దీర్ఘతనువును, గమండలువును బేర్కొని యతని దివ్యమూర్తిని బఠితల యెదుటఁ బెట్టుచుండును. నన్నయ యేడెనిమిదిచోట్ల స్త్రీవర్ణనము కావించెను. ఆవర్ణనము లన్నియుఁ బరిమితములై యౌచిత్యభాసురములై యొప్పారు చుండును. గిరికకు మృగమాంసము పెట్టుమనిన పితృదేవతల యాదేశము ననుసరించి వసురాజు మృగవధార్థము వనమున కరిగి,

పలుకుల ముద్దును గలికి క్రాల్గన్నుల
తెలివును వలుద చన్నుల బెడంగు
నలఘుకాంచీపద స్థలముల యొప్పును
లలితాననేందుమండలము రుచియు
నళినీలకుటిల కుంతలముల కాంతియు
నెలజవ్వనంబున విలసనమును
నలస భావంబునఁ బొలుపును మెలుపును
గలుగు నగ్గిరికను దలఁచి తలఁచి (ఆ. 3-27)

రక్తుఁడై యామెయందుఁ దనహృదయము లగ్నమొనరించెనని నన్నయ వర్ణించెను. ఈవర్ణనమున గిరికయంగముల భౌతికాకారమునకుఁ గాక వానియందలి కాంతి సౌందర్యముల కధిక ప్రాధాన్య మీయఁబడినది. పాండురాజు మరణమునకు ముందు "చారుసువర్ణహాసి నవచంపక దామయు" (ఆ౹౹ ౫-141) ఇత్యాది పద్యమున వసంతకుసుమాలంకార శోభితయైన మాద్రిని నన్నయ మిక్కిలి సహజముగా వర్ణించెను.

నన్నయ వర్ణనవైఖరి వర్ణ్యముల యేకైకస్థితివిన్యాసమునుమాత్రమే జిత్రించు చిత్రకారుని రచనాపద్ధతిని బోలియుండును. తిక్కన యట్లుగాక వర్ణ్యముల ప్రతిక్షణ చాంచల్యమానదశావిపర్యయమును వర్ణింప యత్నించుచుండును.

చనుదెంచి యమ్మహాజనపతి ......
తత్కూపమున విలసత్కూపఘనవల్లి యన్నిష్టసఖనూది యున్నదాని
గురుకుచయుగముపైఁ బరువడిందొరఁగెడు కన్నీరు పూరించుచున్నదాని
.........దేవయానిఁగనియె. (ఆ. ౩-140)

ప్రాంశుజాలములు పైఁ బ్రాకినఁ గరము రూక్షములగు మూర్ధ్వాలకములదాని
.........దమయంతిఁ జూచి (అ. ౨-102)

అలఘుఫణీంద్రలోకకుహరాంతరదీప్తమణిస్ఫురత్ప్రభావలిఁగలదాని
.........గాంచి రరవిందనిభానన లమ్మహోదధిన్ (ఆ. ౨-28)

మున్నగు పద్యములందలి 'దాని, దాని' యను సర్వనామయములతో ముగియు విశేషణము లొక్కస్థితియొక్క వివిధ భంగిమలను జక్కగా సూచించుచున్నవి. ఇందలి భావములను గ్రహించి యొక్కొక్కదానికొక్కొక్క రమణీయ చిత్రమును జిత్రింపవచ్చును. ఇట్లే కణ్వాశ్రమ వర్ణనమందలి "శ్రవణసుఖంబుగాసామగానంబు" లిత్యాది పద్యమాయాశ్రమముయొక్క యొక భావమందలి సంపూర్ణచిత్రమును, పాండవుల వనగమనక్రమమును విదురుఁడు ధృతరాష్ట్రునకుఁ జెప్పునప్పటి "వదనసరోజంబు వస్త్రాంతమునఁ గప్పికొని యేగె ధర్మనందనుఁడు మఱియు" (స. ౨-301) ననుపద్య మాదృశ్యము సమగ్రస్వరూపమును లెస్సగాఁ బ్రదర్శించు చున్నవి.

నన్నయ వర్ణ్యములకు సంబంధించిన వివిధాంగములను వివరించి తదనుగుణమైన వాతావరణమును గల్పించుచుండును. కణ్వాశ్రమమును వర్ణించు సందర్భమున ఏచి, తనర్చి, తలిర్చిన వివిధవృక్షములను, ఆజ్యహావిర్ధూతధూమలతాతతులను, వేదధ్వనులను బేర్కొనుటయు, వర్షర్తువును వర్ణించు నప్పుడు జలదధ్వాన దర్దురస్వరములను, నవతృణశిలీంధ్రసురగోపములను, వర్షధారలను బేర్కొనుటయు, వారణావతమును వర్ణించునప్పుడు వీధులను, సౌధములను, జనసమృద్ధిని సూచించుటయు, రాజసూయయాగమును వర్ణించునప్పుడు వేదవిప్రాశీర్వాదవాదిత్రమహానాదములను బ్రకటించుటయు నిందుకు నిదర్శనములు. యాగాశ్రమ వివాహములను వర్ణించు నప్పుడు వైదికకర్మలకును, తీర్థక్షేత్రములను వర్ణించునప్పుడు వాని పావిత్ర్య మాహాత్మ్యములకును నన్నయ ప్రాధాన్యమొసంగుచుండును.

దమయంతి మదనతాపమును సఖులామెతండ్రికిఁ దెల్పునప్పటి "కలహంస పలికిన పలుకులు గణియించు వడి దాని పోయిన వలనుసూచు" (అర. ౨-28) ననుపద్యమును ఆదిపర్వాష్టమాశ్వాసమందలి యింద్రప్రస్థపురవర్ణనమందలి పద్యములను గంభీరభావబంధుర

ములును, అలంకారికములును నన్నయ భావనాపటిమకు నిదర్శనములునై యలరారుటయే కాక తరువాతి కవులకుఁ బెక్కువిధముల నాదర్శప్రాయములుకూడఁ గాఁజాలినవి.

నన్నయ కావించిన యుద్ధవర్ణనములలో నరనారాయణులు రాక్షసులతోఁ బోరుటయు, భీముఁడు బకహిడింబకిమ్మీరులతోఁ బోరి వారిని వధించుటయు, సౌగంధికాపహరణసందర్భమున యక్షరాక్షసులతోఁ బోరుటయు ముఖ్యములైనవి. ఇవియన్నియుఁ గొంచెమించుమించుగా నొకేమాదిరిగా నున్నవి. సౌంభకాఖ్యాన, కిరాతార్జునీయ, నివాతకవచసంహరణాదులగు సందర్భముల వర్ణింపఁబడిన యుద్ధము లత్యంతభీకరములును, అపూర్వములునై యద్భుతము నావహించుచున్నవి.

నన్నయ యేడెనిమిది చోట్లఁ బ్రకృతివర్ణనములు కావించెను గాని యందొండురెండు తప్ప మిగిలినవన్నియు నేకద్విపద్యపరిమితములై చిన్నవిగా నున్నవి. ఆయన కావించిన వసంత, గ్రీష్మ, వర్షా, శరద్వర్ణనములు ప్రకృతిశోభాకరములును, నాలంకారికములునై యొప్పారు చుండుటచే తరువాతి ప్రబంధములందలి వర్ణనములకొజ్జబంతులని చెప్పఁదగియున్నవి. ఈప్రకృతి వర్ణనలన్నియు నతని లోకజ్ఞతను, పరిశీలనపాటవమును జాటుచున్నవి.

నన్నయ సాధారణముగా వర్ణనములకు సీసములను, వచనములను వాడుచుండును. అతఁడు భగీరథచరిత్రమున హిమవంతమును వర్ణించుచు నది రమణీయభయానకంబై యుండెనని తెల్పియుండెను. ఈవిశేషణ మానగచక్రవర్తి జూచునప్పుడు జనులకుఁ గల్గు భయాశ్చర్యములను జక్కఁగా వ్యక్తము చేయుచున్నది. తిక్కన దీని ననుసరించియేఁ కాఁబోలు యుద్ధములు చారుభీషణములై యున్నట్లు వర్ణించుచుండును. ఈవిధముగా నన్నయ వర్ణనములు గాంభీర్య మునకును, ఉదాత్తతకు, సహజతకును నెలవులై పరిమితములయ్యుఁ బరమ సుందరములై పరిఢవిల్లు చుండును.

## నన్నయ రసపోషణ

భారతము నానాకథోపాఖ్యానసంకీర్ణమగుటచే వివిధరసాశ్రయమై విలసిల్లుచుండును. అందలి ప్రధానరసము శాంతము. దానికి న్యూనతకాని విచ్ఛిత్తికాని కలుగకుండ నంగరసములను బోషింపవలయును. నన్నయ యీవిషయము నెఱింగి యాయాసన్నివేశములం దాయారసముల నుచితరీతిఁ బోషింప యత్నించియున్నాఁడు. వస్త్రాపహరణ సందర్భమున ద్రౌపది కృష్ణుని దలంచినఘట్టము భక్తిరసపరిపోషణమునకును, శిశుపాలుఁడు కృష్ణునాక్షేపింప సహదేవుఁడు క్రుద్ధుఁడైన ఘట్టమును, దుశ్శాసనుఁడు వలువలొల్చునప్పుడు కుపితుఁడై భీముఁడు శపథములు పల్కినఘట్టమును రౌద్రరసపరిపోషణమునకును మిక్కిలియనువైన ఘట్టములు. అంగిరసాపేక్షచే నన్నయ యిచ్చట వానిని విపులముగా వర్ణింపక సూచించి మాత్రము విడిచి వైచెను.

నన్నయ రచనలో భావనిగ్రహము సర్వత్ర కనవచ్చుచుండును. అతఁడెచ్చటను భావమును బొంగిపొరలునట్లు వర్ణింపఁడు. కర్ణుని గంగలోవిడుచునప్పటి సన్నివేశమును నన్నయ

యొట్టిన లిరువురును వర్ణించిన విధము పరికించిన నీవిషయము తేటతెల్లమగును. ఉదంకుఁడు జనమేజయుని మితహితసత్యవాక్య అనిసంబోధించుటయు, పూరునకు యయాతి సభలలో హితమును బరిమితమునగునట్లుగాఁ బలుకవలయుననిబోధించుటయు నాతనికిహిత మితత్వములపైఁ గల యాసక్తిని వెల్లడిచేయుచున్నవి.

నన్నయ యుద్ధవర్ణనములు రౌద్రవీరముల కాస్పదములు. అందును సౌంభకాఖ్యాన నివాతకవచసంహారములం దా రసములత్యుదాత్తముగాఁ బోషింపఁబడినవి. పాండవవనగమన సందర్భమునఁ గుంతి విలపించునప్పుడు కరుణరసమును, అమృతమథనసందర్భమున నద్భుత రసమును, భీముఁడు బకాసురకళేబరమును నగరద్వారమున విడుచుసందర్భమున బీభత్సమును, కణ్వాశ్రమవర్ణనసందర్భమున శాంతమును తపతీసంవరణులయు, గంగాశంతనులయు, శకుంతలా దుష్యంతులయు వృత్తాంతములను వర్ణించుపట్ల శృంగారరసమును జక్కఁగా వర్ణితములైనవి. ఊర్వశి యర్జునుని వలచినసందర్భము శృంగారాభాసమునకును నలోపాఖ్యానము కరుణరసమున కును ఆకరములై యున్నవి. ద్రౌపది యర్జునుని వరించి నపిమ్మట స్వయంవరాగతులైన రాజులు ద్రుపదుని మార్కొన నతఁడు బ్రాహ్మణుల మఱువు చొచ్చెను. ఆసందర్భమున బ్రాహ్మణులు దండాజినములెత్తి ప్రతిబలంబుపై వైవఁదొడంగుట హాస్యరసస్ఫోరకమై యున్నది. ఇట్లే ఋశ్యశృంగుఁడు వేశ్యను ఋషికుమారుఁడనుభావముతో వర్ణించిన ఘట్టముత్తరరామచరితము నందలి ఋషికుమారుల హయవర్ణనమువలె హాస్యరసపూరితమైయున్నది. నన్నయ యితిహాస మునకుఁ గావ్యత్వము కల్పింప యత్నించినవాఁడగుటచే నాయాఘట్టముల విభావాను భావాదులను జక్కఁగా వర్ణించి యాయారసముల నుచితరీతిని బోషించి యున్నాఁడు.

## నన్నయ పాత్రపోషణము.

నన్నయ పాత్రపోషణమున సిద్ధహస్తుఁడు అతఁడు భారతమునందలి సర్వపాత్రల గుణశీల స్వభావములనుగూర్చియు బాగుగా మననము చేసినవాఁడగుటచే నాయాఘట్టములందు వానిని సుస్పష్టరేఖలతోఁ దీర్చిదిద్దియున్నాఁడు. ఔదాత్తగాంభీర్యము లాతని పాత్రలయందలి సామాన్యలక్షణములు, ధృతరాష్ట్రునికిఁ బాండవులయెడఁగల వాత్సల్యాభాసమును, దుర్యోధనుని యీర్ష్యాదౌష్ట్యదురభిమానములను, శకునికైతవమును, దుశ్శాసనుని ధౌర్త్యమును, విదురుని ధర్మయజ్ఞతను, భీష్ముని సమత్వమును, ధర్మజుని ధర్మతత్పరతను, కృపద్రోణుల తాటస్థ్యమును భీమార్జునుల భ్రాతృభక్తిని శ్రీకృష్ణుని ధర్మరక్షణపరాయణత్వమును అతఁడు చక్కఁగా వర్ణించెను. ఆతని "స్త్రీపాత్రలు పాతివ్రత్యమునకుఁ బట్టుగొమ్మలు; గరువతనమున కిరవులు; భారతనారీత్వము గొన్న బంధురమూర్తులు." గాంధారిపాతివ్రత్యమును, కుంతియుదాత్తతా పుత్త్రప్రేమలును, దమయంతి పత్యనురాగలోకజ్ఞతలును, దేవయాని గడుసుఁదనమును, సుకన్య యౌవనచాపల్యపాతివ్రత్యములును అతనిరచనలో సమగ్రస్ఫూర్తితో వర్ణింపఁబడినవి. అతఁడు ద్రౌపదీపాత్రమునెంతో నేర్పుతోఁ జిత్రించెను. సభాపర్వముననామె ధర్మజ్ఞతయు ననన్యాదృశమైన గృహిణీత్వమును జక్కఁగా వర్ణింపఁబడినవి. రాజసూయయాగసందర్భమున

నామె సకలభూములనుండివచ్చిన పేదలను సాధులను స్వయముగాఁ బరిశీలించి, వారికన్నము పెట్టి, వారందఱును గుడిచినపిమ్మటఁగాని తానుభుజింపకుండెనఁట! ఇది యామె–యుత్తమ గృహిణీత్వమునకుఁ దార్కాణము. దుశ్శాసనుఁడు తన్నుసభకీడ్చుకొనివచ్చినప్పుడు కోపలజ్జా పరవశయై పల్కిన పల్కు లామె సత్యమైన యాగ్రహావేశమును ధర్మశీలతను వ్యక్తము చేయుచున్నవి. ఇట్లే యామె నీతి ధర్మజ్ఞతలను నన్నయ పెక్కుచోట్లఁ బ్రకటించియుండెను. "ఆమె ప్రకృతి మానవభామినికాదు. పరమపతివ్రత, అయోనిజ, ధర్మరత, తపస్విని" అనిధృతరాష్ట్రుఁడన్న వాక్యములు (స ౨. 255) సత్యశోభితములు.

నన్నయ సాధారణముగా నాయాపాత్రలను దొలుతఁ బ్రవేశపెట్టునప్పుడే వారి శీల స్వభావములందలి ప్రధానాంశములను విశేషణములతో వెల్లడిచేయు చుండును.

ఉదంకుఁడు గురుహితకార్యధురంధరుఁడు.
జనమేజయుఁడు మితహిత సత్యవాక్యుఁడు.
గరుడుఁడు బలవన్నిజదేహసముజ్జ్వల ప్రభాధూత పతంగతేజుఁడు.
జరత్కారుఁడు నియమవంతుఁడు బ్రహ్మచర్యపరిపాలకుఁడు.
కచుఁడు నియమవ్రతశీలుఁడు.
దుష్యంతుఁ డనంతసత్త్వుఁడు.
యయాతి వాసవప్రతిముఁడు అనఘచరితుఁడు యౌవనగర్వితుఁడు.
భీష్ముఁడాత్మవిజ్ఞానంబునందు సనత్కుమారాదుల
యట్టివాఁడు, అనఘమూర్తి.
ధృతరాష్ట్రుఁడు బలవన్నాగాయుతబలయుతుఁడు,
ప్రజ్ఞాచక్షుఁడు.
పాండురాజు గుణరత్నాంబుధి.
కుంతి వినయాభిమానవివేక సౌజన్యాది సదమల
గుణరత్నజన్మభూమి, పరమపతివ్రతాభరణాభిశోభిత.
ధర్మజుఁ డతిస్థిరధర్మమూర్తి.
భీముఁ డుత్తమ స్థిరజవసత్త్వమూర్తి.
కవలవారు సూర్యేందు ప్రకాశతేజులు.
అర్జునుఁడు స్థిరపౌరుషుఁడు.
ద్రోణగాంగేయులు ధర్మార్థవిత్తములు, తథ్యవాదులు, మధ్యస్థవిమలమతులు.
ఖలుఁడు బృహద్రథాత్మజుఁడు గర్వితుఁడు.
నలుండనవరతాతిప్రియుఁడు.
ఋశ్యశృంగుఁడు వేదాంతవేది.
సుకన్య సద్యస్సంజాత బుద్ధిసంభ్రమ.
భీముఁడు ప్రియసాహసుఁడు.
మున్నగునవందుకు నిదర్శనములు.

నన్నయ కొన్నిచోట్లఁ బ్రతియోగముచేఁ బాత్రలయందలి పరస్పర విరుద్ధగుణశీలములను వ్యక్తముచేయుచుండును. ఆదిపర్వమునఁ బాండవులు హస్తినాపురమున కరుదెంచిన వెంటనే యతఁడు పాండుకుమారులు వినయాన్వితులనియుఁ గౌరవు లుద్ధతులనియు సూచించెను. సుయోధనుఁడు పాండవులకు మయుఁడిచ్చిన సభను జూచి సహింపనోపక కృశుఁడు వివర్ణుఁడు నయ్యెను. దుర్యోధనునకై ధృతరాష్ట్రుఁడు కట్టించిన సభచూచి ధర్మజుఁడు మెచ్చెను. ఇట్లే గరుడోపాఖ్యానమునఁ గద్రూవినతలశీలములందలి వైరుద్ధ్యము చక్కగాఁ బ్రకటింపఁబడినది. ఈవిధముగా నన్నయ పాత్రల శీలచిత్రణమునఁ బ్రదర్శించిన నేర్పత్యంత ప్రశంసాపాత్రముగానున్నది.

## మనస్తత్త్వ నిరూపణము.

నన్నయ తనరచనమున నెడనెడ మానవుల మనస్తత్త్వమునే కాక తిర్యక్కుల చేష్టాస్వభావాదులను గూడఁ జక్కగా నిరూపించియున్నాఁడు. బకాసురవధఘట్టమున పాండవులు నివసించియున్న బ్రాహ్మణునియింటికి బకునికాహారము పంపు వంతు వచ్చుటచే నాయింటియందలి బ్రాహ్మణుఁడు, అతనిభార్య, కూఁతురు బకునికాహారముగా నేనుబోయెద నేనుబోయెదనని పల్కుచు దుఃఖించుచుండిరి. ఆసందర్భమున వారికన్నీళ్ళు తుడుచుచు "బాలుఁడొక్కఁడు కొండొకకోల నేతఁ బట్టుకొని యేను రక్కసుఁ గిట్టి చంపి చులకగా వత్తు మీరేడ్వ వలవ"దని పల్కి వారి నోదార్చె నని నన్నయ వ్రాసినవ్రాఁత యెంతో సహజరమణీయమై యున్నది. ఇది యారక్కసుని బలమును గాని తన సామర్థ్యమును గాని యెఱుఁగని యా బాలుని యమాయికత్వమును, దల్లిదండ్రులు దుఃఖించుచుండఁగాఁ జూచి యతఁడు పొందిన మనోవ్యథను జక్కగా సూచించుచున్నది.

దుర్యోధనుఁడు ద్రౌపదిని సభలోనికిఁ దోడ్కొని రమ్మని దుశ్శాసనుని బంపిన సమయమున నామె భయమునఁ గడు నడుంగి గాంధారి యొద్దకునేగె నని నన్నయ వర్ణించెను. స్త్రీలు తమకు మానభంగభీతి యుదయించి నప్పు డన్యస్త్రీలమఱుగు సొచ్చుట సహజము, ఆ సహజస్వభావమిచ్చట లెస్సగాఁ బ్రదర్శింపఁ బడినది.

నిద్రపోవుచున్న దమయంతిని విడిచిపోఁబోవు నప్పుడు నలుఁడు పొందిన మనస్థితిని నన్నయ నిసర్గసుందరముగా వర్ణించెను.

కలిదమయంతిఁబాసమకట్టు సతిం బతివాయ నోపఁడా
లలనను దీర్ఘసౌహృదబలంబున నిట్టుల రెంటఁ జేసి య
న్నిలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగతకారియైన యు
య్యేలయును బోలె నూఁడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చితాత్ముఁడై (అర ౨-78).

ప్రియురాలిని విడిచి పోవు నప్పుడు ప్రియుఁడు పొందు మనోవ్యథయు, నాతఁడు గతాగతకారియైన యుయ్యేలవలె ముందువెనుకల కూగులాడుటయు నిందు మనోహరముగా వర్ణింపఁ బడినది.

నలుఁ డుద్యానవనమున విహరించుచు నొకహంసను బట్టుకొనెను. అప్పు డితరహంసలు "దానిని విడిచి పోవఁగా నోప కఱచుచు నంతరిక్షమునఁ బిండుకట్టి తిరుగుచుండె" నని

(అర. ౨-13) నన్నయ పతిస్వభావము నెంతో సహజముగాఁ బ్రదర్శించెను. ధర్మజుఁ డింద్రప్రస్థమున రాజ్య మేలుచుండఁగా దొంగ లొకవిప్రుని హోమధేనువు నపహరించిరి. అప్పు డావిప్రుఁ డాక్రోశించుచు నర్జునునితో,

వదలక ముచ్చుల వధియించి నాహోమధేనువుఁ గ్రమ్మఱఁ దెచ్చియిమ్ము
జనసుత దాని వత్సంబు నిన్నటఁగోలె నుడుగక యఱచు చున్న యదియు

(అ. ౮-118)

అని పల్కి గోవత్సము స్థితిని వర్ణించెను. ఇది యావత్సము తల్లి యెడఁబాటునఁ బొందిన యల జడిని లెస్సగా వివరించుచుఁ గరుణరసమును గుమ్మరించుచున్నది. ఇట్లే నన్నయ పెక్కుచోట్లఁ బాత్రల మనఃపరిస్థితిని నేర్పుతో వర్ణించి తనలోకజ్ఞతను మనస్తత్త్వ పరిశీలన పాటవమును బ్రకటించెను.

## నన్నయ యౌచిత్యపరిపోషణము.

"అనౌచిత్యాదృతేనాన్య ద్రసభంగస్యకారణ" మ్మను నానందవర్ధనుని సిద్ధాంతమును విశ్వసించినవాఁ డగుటచే నన్నయ తనరచనలో నౌచిత్య పరిపోషణ విషయమున నత్యంత శ్రద్ధ వహించెను. యయాతిచరిత్రమున శర్మిష్ఠా దేవయానులు యయాతిదేవయానిని పెండ్లాడుటకు ముందొకసారియుఁ దరువాత నొకసారియు వనవిహారమున కరిగియుండిరి. నన్నయ మొదటిసారి రాజకూఁతురైన శర్మిష్ఠకును, రెండవసారి యామె రాజ కుమారియయ్యును దాసియగుటచే దేవయానికిని బ్రాధాన్యమొసంగియుండెను. దమయంతి యడవులలో నిడుమలుపడి పుట్టినింటి కరుదెంచిన పిమ్మట నలాన్వేషణమునకై పెక్కుయత్నములు కావించెను. ఆమెయాసమయమునఁ దానేమిచేయనెంచినను దండ్రితోఁగాక తల్లితోఁ జెప్పి యామెయనుమతినందియే చేయుచుండెను. రాజగృహములందు వయసువచ్చినస్త్రీలు తల్లి తోడఁదేకాని తండ్రి కెదురుపడి మాటాడరను మర్యాద నెఱింగినవాఁడగుటచే నన్నయ యాయౌచిత్యమునిట చక్కగా పాటించెను. అట్లే వికృతాంగుఁడైనను బాహుకుఁడు నలుఁడేయని గుర్తించి దమయంతి యావిషయము తల్లి కెఱింగించెను. అయ్యు నాతఁడు నలుఁడని తేటతెల్లముగు వఱకు నామె యతనితోఁ బ్రత్యక్షముగా మాటాడక యాతఁడు వినునట్లుగా నలుఁడొనర్చిన నిర్దయచేష్టలన్నియుఁ బ్రథమపురుషమున వివరించెను. అప్పుడు శోకాకులుఁడై బాహుకుఁడు తననంతయును వెళ్లడిచేసెను. ఈసందర్భమున నన్నయ యవలంబించిన పద్ధతి మిక్కిలి యౌచిత్య వంతముగా నున్నది.

నన్నయ యసభ్యములు ధర్మేతరములునైన విషయములు చెప్పవలసివచ్చినప్పుడు వానిని వాచ్యముగా జెప్పక సూచ్యమాత్రములుకావించి యౌచిత్యమును బాటించుచుండును. పరాశరుఁడు బాలకన్యక వసుపుత్రియు బ్రపతవయని దివ్యదృష్టిచే నెఱింగినపిమ్మటనే తనవలపు నామె కెఱింగించెను ఇచ్చట నాకవిశృంగార ప్రసంగమును వర్ణింపక నన్నయ "తనయభిప్రాయ మెఱిఁ

గించె"నని వ్రాయుటయెంతో సత్యముగానున్నది." "అయ్యయాతియొడంబడి శర్మిష్ఠకు నభిమతం బొనరించె" ననియు, నర్జునుఁ డులూపి "మనోరథంబునలిపి యారాత్రి నాగభువనంబున వసియించె" ననియు, నన్నయ యచ్చటి సంభోగవృత్తాంతములను సూచ్యమాత్రములు కావించుట యౌచిత్య దృష్టితోడనే. కిరాతుఁడు వనమున నొంటరిగానున్న దమయంతినిగాంచి కామనిశాతశరాహతుఁడై యనాగరికుఁడయ్యును "నిజహృదయంబెఱిఁగించె లతాంగి కనింద్యచరిత్రకు వేడుకతో" నని వ్రాయుట నన్నయ యౌచిత్యపరిపోషణమునకుఁ బరాకాష్ఠ. ఇట్లు శృంగార విషయములనేకాక యధర్మ్యవిషయములనుగూడ నన్నయ మిక్కిలి సంక్షేపముగా సూచించుచుండును. విదురుఁడు ధృతరాష్ట్రువిధాతృని యోగమునకొడంబడి, ద్యూతార్థమై ధర్మజుని గొనివచ్చుటకై యింద్రప్రస్థమునకరిగి, కుశలప్రశ్నానంతర మతనికి "నిజాగమన ప్రయోజనం బెఱింగించె"నని మాత్రము నన్నయ వ్రాసి యూరకుండుట యిందుకు దృష్టాంతము.

## నన్నయలోకజ్ఞత.

నన్నయ 'తనకులబ్రాహ్మణు' నను పద్యమునఁ దాను లోకజ్ఞుఁడనని చెప్పుకొనెను. అతఁడు తనరచనలో నీలోకజ్ఞతను బలుచోట్లఁ బ్రదర్శించి యుండెను, యయాతి దేవయానిని "నీవెవ్వరిదాన వేల యీవిపినాంతరకూపమున నున్నదాన"వని యడుగనామె "ప్రమాదవశమున నిమ్నోన్నతంబడి యున్నదాన నన్నుద్ధరింపు"మని వేఁడుకొనెను. ఆమె యందుఁ బ్రమాదవశమునఁ బడియుండలేదు. నిజముచెప్పినచో న్యూనతకలుగునని యామెయట్లు చెప్పియుండెను. దుశ్శాసనుఁడు ద్రౌపదికట్టిన పుట్టములొల్చునప్పుడు వివిధవర్ణములైన వస్త్రములామె జఘనమున విరాజిల్లుచుండెనని మూలమందున్నది. నన్నయ "మున్నపనీతమైన తద్వస్త్రంబునట్టి నలువ లలితాంగిజఘనమండలమునఁ బాయక యొప్పుచుండె"నని వ్రాసియుండెను. పుట్టములు వివిధవర్ణములైనచో నొకటి తొలఁగింపఁబడి రెండవదివచ్చునంతలో నగ్నత భాసిల్లుట కవకాశముండుటచే లోకజ్ఞుఁడైన నన్నయ యవన్నియు నొకేరకమైన వస్త్రములని మార్చి వ్రాసియుండెను. అడవిలో దమయంతి నజగరము మ్రింగఁగాఁ గిరాతుఁడు దాని వదనము వ్రయ్యఁ దలిగెను. దమయంతి సజీవయై బయటికరుదెంచెను. కిరాతుఁడప్పుడామె నోదార్చి సమీపసరోవర స్నాతను గావించెను. స్నానముచేసి వచ్చునప్పటి యామెసౌందర్యమును నన్నయ సహజముగా వర్ణించెను. కొండచిలువ మ్రింగినప్పుడు దమయంతి మేనినిండదానిలాలలయంటుకొనియుండును. అదిపోవుటకే కిరాతుఁడామెను స్నాతఁగావించెను. స్నానవిగతలాలయై ప్రకాశించు దమయంతి సౌందర్యము కిరాతుని గామనిశాతశరాహతు నొనరించెను. నలచరిత్రలోఁ జనువ తెల్లవాఱు జామునఁ బయనముసాగించి యెండయెక్కునప్పుడు చెట్లనీడ విశ్రమించెననియు, దమయంతి నలునిరథఘోష విని యది నలునిరథమేయని గుర్తించెననియు వర్ణించుట నన్నయలోకజ్ఞతకు నిదర్శనములు.

## నన్నయశైలి - అక్షరరమ్యత

నన్నయ తనకవితాగుణములలో నక్షరరమ్యతను గూడఁ బేర్కొనియుండెను. అన్ని యక్షరములధ్వనియు నొక్కమాదిరిగానుండదు. కొన్నియక్షరములు పరుషములు, కొన్ని

యక్షరములు సరళములు. ధ్వన్యాలోకమున నేయేయక్షరము లేయేరసములను ప్రకాశింపం జేయఁజాలునో చెప్పఁబడియున్నది. కేవలమృదులాక్షరఘటితములైన పదములచేతనే యక్షర రమ్యత యేర్పడునని తలంపరాదు. అదిపదముల సారళ్యపారుష్యములపైఁగంటె రసాను గుణత్వముపై నెక్కువగా నాధారపడియుండును. "నలదమయంతులిద్దరు మనఃప్రభవానల బాధ్యమానలై సలిపిరిదీర్ఘవాసరనిశ" లనుపద్యమున నెంతయక్షరరమ్యత యున్నదో "అని విని జరాసంధుండు సటాసముత్పాటనకుపితకుంజరవైరియుంబోలెఁ బటుకుటిలభ్రుకుటిఘటిత నిటలుండగుచు" నిత్యాది గద్యము నందును నంతే అక్షరరమ్యత యున్నది.

పదముల యన్యోన్యమైత్రియే శయ్య యనఁబడును. మాలాకారుఁ డేపూవు తరువాత నేపూవు కూర్చిన మాల దర్శనీయముగా నుండునో యెఱిఁగి పూవులను గూర్చునట్లు కవి యేపదముతరువాత నేపదము కూర్చిన శ్రవణసుభగత్వ మేర్పడునో యెఱింగి రచన సాగింప వలయును. "పొసఁగ ముత్తెపుసరుల్ పోహళించినరీతిఁ దమలోన దొరయు శబ్దములుకూర్చి" కవిత రచింపవలెనని పింగళిసూరనచెప్పుట కిదియే కారణము. ఒండొంటితోఁ బొందిపొసఁగి యుండుపదములకూర్పుచే హృద్యమైన శయ్యయేర్పడును. అక్షరరమ్యత యందొక యంగము. నన్నయకవిత్వ మక్షరరమ్యతకును మనోహరశయ్యకును బట్టుఁగొమ్మ.

పతదుర్వీధరధాతునిర్ఝరజలాభంబై (ఆది. ౨-24) అను పద్యమునందలి ర్వ, ర్ఝ మున్నగు నక్షరము లోజోగుణమును సూచించుచు రౌద్రబీభత్సములను జక్కఁగాఁబోషించుచున్నవి. "గంగనిజాంగదీప్తులెసగంజనుదెంచి లతాంగి సంతతోత్తుంగపయోధరద్వితయ" అనుపద్యమున బిందుపూర్వకగకారములకూర్పు సౌకుమార్యమును "అన్నసహదేవ! నీవును నన్నలతో సరిగెదయ్య" (స. ౨-288) యనుపద్యమునందలి పృథక్పదత్వము మాధుర్యగుణమును "నిండు ఁబు నవ్యనవనీతసమానము" (ఆ. ౧-100) వంటిపద్యములందు శ్రవణమాత్రముననే అర్థ ప్రత్యయము కలిగించు శక్తిప్రసాదగుణమును వ్యక్తముచేయుచు నాయాసందర్భములందలి ముల నుచితరీతి పోషించుచున్నవి. రసానుగుణముగాఁ బదవర్ణములను వాడుటయందు నన్నయకుఁ గల నేర్పనన్యసామాన్యమైనది. ఈనేర్పేయాతనిరచనకు శయ్యాసౌష్ఠవమును, అక్షరరమ్యతను సమకూర్చినది.

నన్నయకుఁ బూర్వమాదర్శప్రాయములనఁదగిన తెలుఁగుకావ్యము లేవియులేనికారణమున నాతఁడు సంస్కృతకావ్యములను, పొరుగుదేశమున కన్నడకవులురచించిన కావ్యములను మార్గదర్శకములుగా గ్రహించియుండును. అప్పటికిఁ గన్నడమున వెలసినకావ్యములు తత్సమ బహుళములై మార్గపద్ధతిని రచింపఁబడియుండెను. నన్నయయుఁ గొంచెమించుమించుగా నామార్గమునే యనుసరించెను. అతఁడు సంస్కృతమున మహాపండితుఁడు. తెలుఁగున నప్పటి కున్న పదసంపద చాలతక్కువ. ఉన్నపదములనన్నిటిని బరిశీలించి యాతఁడే వానికి సుస్థిరమైన రూపమొసంగియుండెను. అందుచే నతనిరచనలో దత్సమపదములును సంస్కృతసమాసములును హెచ్చుగా గోచరించుచుండును. అయ్యును నాతఁడు పాండిత్యప్రదర్శనమునకై మాఱుమూల పదములనెప్పుడును వాడక మృదుమధురములును శ్రావ్యములునైన పదములనే తఱుచు

వాడియుండుటచే నాతనిరచన సర్వత్ర ప్రసన్నతాగుణముతో నిండారియుండును. నన్నయవలె మందరబంధములు, అక్లిష్టాన్వయములు నగునట్లుగా సమానములను గూర్పఁగల వారరుదుగాఁ గనిపింతురు.

ఆతని పద్యములుకొన్ని నాదసౌందర్యమునకు నిధులై వేదఋక్కులవలె ధ్వనించుచుండును. ఉదంకుఁడు నాగరాజులను స్తుతించిన పద్యములును (ఆ. ౧-104-107) వర్షాశర, త్సముద్రవర్ణనపద్యములును ఇందుకు నిదర్శనములు. అతనిరచన శ్రవణసుభగమైన ధారాశుద్ధికిని నిరర్గళమైనగమనసౌందర్యమునకును నెలవై యుదాత్తరమణీయముగా సాగిపోవుచుండును.

ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్త్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరిభావి మదోత్కటమున్న రేంద్ర పూ
జోన్నయనోచితంబునయి యొప్పెడు నన్నయభట్టుకుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్.

అనియెఱ్ఱన నన్నయను భద్రజాతికుంజరముతోఁ బోల్చుట యాతనిరచనయందలి గమన సౌష్ఠవమును దృష్టియందిడుకొనియే.

"నన్నయరచనమున సంస్కృతవాక్యయోజన పెక్కుచోట్లఁగానఁబడుచుండును. ఆతఁడు సంస్కృతమునవోలె విశేషణములను విశేష్యములకు ముందును వెనుకనుగూడ వాడుచుండును. విశేషణవిశేష్యములకు నడుమ నొక్కొక్కప్పుడితరపదముల వ్యవధానము గోచరించుచుండును. అట్టియెడఁగూడ నాతనిపద్యములందలి యన్వయమేమియుఁ గ్లేశకరముగానుండదు. సంస్కృతమునవలె యత్తదర్థకశబ్దముల ప్రయోగముతోఁగూడిన వాక్యము లాతనిరచనలోఁ బెక్కుచోట్లఁ గానిపించును. ఇట్టివాక్యములాతని పద్యగద్యములు రెండింటను గోచరించును."

నన్నయరచనమున నప్రయత్నసిద్ధములైన యలంకారములెడనెడఁ గానవచ్చుచుండును. ఉత్ప్రేక్షాతిశయోక్త్యులకంటె నం దుపమారూపకార్థాంతరన్యాసస్వభావోక్తుల సంఖ్య హెచ్చు. "సాత్యవతేయవిష్ణుపదసంభవమై" (ఆ. ౧-72) "అమితాఖ్యానకశాఖలం బొలిచి" (ఆ. ౧-65) "ఆనారాయణపాండవేయగుణ" (ఆ. ౩-21) మున్నగుపద్యములు సంపూర్ణరూపకములతోఁగూడి మనోహరములుగా నున్నవి. అతఁడు వాడిన అర్థాంతరన్యాసములు పెక్కతఁడు కల్పించినట్టివే. అవియన్నియు నీతిబోధకములై రమ్యములుగానుండును.

తలవఁడకఁదొడఁగె, నింద్రియములగర్వమడంగెఁ నంగములువదలె వళీ
పలితంబులయ్యె, వగరును దలఁమేరును నుక్కిసయును దలకొనుదెంచెన్. (ఆ. ౩-191)

జననుత దానివత్సంబు నిన్నటఁగోలె నుడుగక యఱచుచున్నయదియు (ఆ. ౮-118)

మున్నగునవాతని స్వభావోక్తులకుఁ దార్కాణములు. సందర్భోచితములును, భావస్ఫోరకములునైన యుపమలనాతఁడు పెక్కుచోట్ల వాడియుండెను.

"అగ్నిశిఖయుఁబోలె నంటను డాయను జూడరానియట్టి శుభచరిత్ర" (దమయంతి) (అర. ౨-90)

"అర్ధరాత్రమునప్పుడందులకేతెంచె గజయూధములు జలకాంతఁజేసి యంబుధివిమలతోయంబు లాస్వాదింపఁజనుదెంచు జలధరసమితియట్ల" (అర. ౨-10)

"విగతజీవుఁడై పడియున్న వేదమూర్తి
యతనిచేత సంజీవితుఁడై వెలింగె
దనుజమంత్రి యుచ్చారణదక్షుచేత
నభిహితంబగు శబ్దంబునట్లపోలె" (ఆ. ౩-137)

మున్నగునవి రమ్యములైన యాతని యుపమాలంకారములకు నిదర్శనములు.

నన్నయ మూఁడునాలుగుచోట్లఁ జక్కనిశ్లేషాలంకారములనుగూడ వాడియుండెను.

"ఉద్యానవనంబుంబోలె బహువిద్రుమలతాలంకృతంబైనదాని, నాటకప్రయోగంబునుం బోలె ఘనతరపాత్రశోభితరంగరమ్యంబైనదాని, దివంబునుంబోలె నహిమకరభరితంబైనదాని, సముద్ర"ఇత్యాదివర్ణనమునందలి శ్లేష సభంగము నభంగమునై రమణీయముగానున్నది.

"వసువులు రుద్రులు వసుహీనవిప్రులక్రియ దక్షిణాశ్రితులైరి క్షితి" (ఆ. ౨-99) ఇట దక్షిణాశ్రితులైరనుమాటలు వసురుద్రులకు వసుహీనవిప్రులకుఁగూడ నన్వయించుచున్నవి.

"అలఘుతరంబులై .........తత్పురీభవనముల్ హిమశైలముఁబోలియున్నతిన్" (ఆ. ౮-72) "భూసతికిందివంబునకు" (అర. ౪-41) అనురెండుపద్యములందు విశేషణములు శ్లేషమహిమచే నుపమానోపమేయములు రెండింటితో నన్వయము కలిగి యున్నవి.

అర్థాలంకారములవలెనే శబ్దాలంకారములుకూడ నన్నయరచనలో నచ్చటచ్చటఁ గనిపించును. అవియు నప్రయత్నసిద్ధములైనవే.

"వడిఁబడియెఁ బిడుగులుడుగక వడఁకె మహీతలము'' (అర. ౩-369)

"తడయకపుడు వానిమెడగ్రుంగఁ బిడికిటఁ
బొడిచెననుర ముడిఁగి పడియెఁ బుడమి'' (ఆ. ౩-396)

పైరెండుపద్యములలో దకారవృత్త్యనుప్రాసము మొదటిదానప్పిడుగులపాటును, రెండవదాన ముష్టిఘాతములధ్వనిని సూచించుచు రమ్యముగానున్నది.

"అలఁపొలఁడు కుఱుచచేతులు
నొలవశరీరంబుకలిగి నొరులకుఁ జూడం
గొలఁగాకుండియు మన్మథు
నొలపులఁ బడియెడినితండు యువతిప్రియుఁడై" (ఆ. ౨-134)

అనుపద్యమునందలి అకారపునరావృత్తియు హ్రస్వాతర శాఖాబాహుళ్యమును నలుని వికృతాకారమును లెస్సగా సూచించుచున్నది.

ఘోరవనమునవీరుఁ గిమ్మీరుఁడను సురారి నిశ్చలభీకరాకారుఁబట్టి
పోరవధియించినట్టి సమీరజునకు భూరిభుజునకు మార్కొనువారుగలరె.

అనుపద్యమున దీర్ఘపూర్వరేఫపునరావృత్తి తేటగీతిలోఁగూడఁ బ్రాససౌందర్యమును గూర్చుచు రమణీయముగానున్నది.

నన్నయ కొన్నిచోట్ల శబ్దములకుఁగల యర్థద్వయసామర్థ్యమును బురస్కరించుకొని చక్కనిచమత్కారమును గల్పించుచుండును.

"అన్నలుఁడు విమోహరజ్జులఁబెనంగి గతాగత
కారియైన యుయ్యేలయనుబోలె''　　　(అ. ౨-78)

ఇచ్చట విమోహమనఁగా విశేషమోహమనియు, విగతమోహమనియు రెండర్థములు చెప్పుకొన్నఁగాని నలుఁడు గతాగతకారియైన యుయ్యేలవలె వెనుకకు ముందుకుఁ గూడఁబోవుటను సమర్థించుట కవకాశముండదు.

ఇట్లే యస్త్రవిద్యాప్రదర్శనసందర్భమున కర్ణార్జునులు ద్వంద్వయుద్ధమొనర్చుచుండఁ గృపుడు వారినడుమ నిల్చి కర్ణునితో "నీదువంశమును, దల్లిని, దండ్రిని, జెప్పు చెప్పినన్ దొరయగునేని నీకెదిరి దోర్బలశక్తినితండుచూపెడిన్'' (అ. ౬-44) అనిపల్కెను. ఇచ్చట దొరయనుశబ్దమునకు రాజు,సాటి యను రెండర్థములును ఉన్నవి. దుర్యోధనుడు రాజను నర్థమునుగ్రహించి కర్ణునంగరాజ్యమునకుఁ బట్టాభిషిక్తునొనరించెను.

శివుఁడర్జునునకుఁ బాశుపతాస్త్రమొసంగి యంతర్హితుఁడయ్యెను. అప్పుడు "ధనంజయ ప్రవరుకరమ్మునన్ వెలుఁగుపాశుపతాస్త్రముఁజూచి" దేవదానవాదులుభయమందిరని నన్నయ ధనంజయప్రవరశబ్దమునువాడెను. ధనంజయుఁడనఁగా నగ్ని, విష్ణువు అనునర్థములు కూడ నున్నవి. ఇచ్చట పాశుపతాస్త్రలాభముచే నర్జునుఁడు ధనంజయులలోఁ బ్రవరుఁడయ్యెనను నర్థము స్ఫురించుచున్నది.

నన్నయపదములను సాభిప్రాయముగావాడిన చోట్లనేకములున్నవి. "సుతజలపూరితంబులగునూతులు నూటికంటె సూనృతవ్రత యొకబావిమే'' (ఆ. ౪-93) అనుచో సూనృతవ్రత శబ్దమును, అస్త్రవిద్యాప్రదర్శనసందర్భమున మూలమున వృకోదరశబ్దముండఁగా దుర్యోధనుఁడు "అనిలజ నీకిట్లనిపల్కను దలఁపను నగుసె'' యని భీముని సంబోధించుచువాడిన అనిలజశబ్దమును, "అలలితాంగియందు హృదయంబులు దృష్టులునిల్పి పాండుభూపాలతనూజపంచకము పంచశరాహతిఁబొందె'' ననుచోటఁగల పంచకపంచశరశబ్దములును, జరాసంధవధ సందర్భమునఁగల వాతసుతుండువీచె ...తృణఖండనముండగుచుండ మాగధున్ (స. ౧-209) అనుపద్యమునందలి వాతసుత తృణఖండ శబ్దములును, దుర్యోధనుఁడగ్నిలోఁ బడుదుననుటకు "సర్వభక్షుచే

[illegible]" (స ౨-137) యనిచెప్పునప్పటి సర్వభక్షశబ్దమును, "ఇది ప్రళయాగ్ని పోలె నెసఁగెల్లను గప్పుచు విస్ఫులింగములు వదలక వాయుసారథిజవంబునఁ దానిటవచ్చె" (ఆ. ౮-304) అనుచోటఁగల వాయుసారథిశబ్దమును నన్నయ సాభిప్రాయపదప్రయోగమునకు నిదర్శనములు.

నన్నయ యాయాసందర్భముల వాడుచుండు పదములు జాతీయములును, భావగంభీరములునై పదౌచిత్యమును బ్రదర్శించుచుండును.

తన్ను సభలోనికిఁ గొనిపోవచ్చిన ప్రాతికామిని జూచి ద్రౌపది "మున్ను తనన్నోటువడి... గ్రన్ననఁ దన్నోటువడియెనో యన్న! నాకెఱుఁగఁ జెప్పు" మని అన్నశబ్దమును బ్రయోగించుట యెట్టి నిస్సహాయస్థితికైనఁ జాలిపుట్టించునదిగా నున్నది.

సాంబశాల్వయుద్ధమునఁ బ్రద్యుమ్నుఁడు మూర్ఛితుఁడైనప్పుడు దారుకతనయుఁడు రథమును యుద్ధభూమికిదూరముగాఁ దోలుకొనిపోయెను. ప్రద్యుమ్నుఁడు మూర్ఛదేఱి సూతునితో

విక్రమము విడిచి సమరా
ప్రక్రాంతుఁడనయిన నన్ను బలదేవుఁడునుం
జక్రధరసుతులు, సుజనులు,
నక్రూరాదులును నేమియనినగరె సభన్ (ఆ. ౧-171)

అనిపల్కెను. ఇచ్చటి నేమియనినగరె అనుప్రయోగము మాటలతోఁ జెప్పనలవికాని గంభీరార్థమును సూచించుచున్నది.

అర్జునుఁడు గురుదక్షిణగా ద్రుపదునిఁ గట్టి తీసికొనివచ్చినప్పుడు ద్రోణుఁడతనిఁ జూచి

నీ రెవ్వరయ్య ద్రుపదమ
హారాజులె యిట్లు కృపణులై పట్టుపడన్
మీ రేకివలసె, నహహా మ
హారాజ్యమదాంధకారమది వాసెనొకో (ఆ. ౬-89)

అనిపల్కెను. ఇది నాటకోచితమై ద్రోణుఁడు కావించిన హేళననెంతో ధ్వనిగర్భితముగాఁ బ్రకటించుచున్నది.

ద్రౌపది సభలోనికివచ్చి నేను దాసినా అదాసినా చెప్పుఁడని సభాసదులనడుగ భీష్ముఁడు "అవ్వా! నీప్రశ్నమునకుత్తరం బియ్యధిష్ఠిరుండు సెప్పవలయు" ననుచు నవ్వాయని సంబోధించుట యతనికామెయెడఁగల వాత్సల్యమును జక్కగా సూచించుచున్నది.

కొన్నిచోట్ల నన్నయ పద్యగద్యధోరణి యచ్చటివ్యక్తులు పద్యమయములైన యుపన్యాసములిచ్చుచున్నారా యనుతలఁపు కలుగఁజేయుచుండును. ఆస్తీకుఁడు సర్పయాగమును నివారింపఁజేయుటకై కోరుచు జనమేజయుని స్తుతించిన పద్యములను, కృష్ణుని నిందించుచు శిశుపాలుఁడు పల్కినపలుకులను ఇందుకు దార్కాణములు.

సాధారణముగాఁ గావ్యములందలి శైలి కథనశైలి, వర్ణనశైలి, సంభాషణశైలి అని మూఁడు తెఱఁగులుగా నుండును. కవులందలి రచనలందు నీమూఁడు తెఱఁగులును గాన వచ్చును. కాని యొక్కొక్కరి కొక్కొక్క దానియందభిమానము హెచ్చుగా నుండును. నన్నయ రచనలోఁ గథనశైలి హెచ్చు. అతఁడు కథకుఁడు కథను జెప్పునట్లుగాఁ దటస్థుఁడై కథోపాఖ్యానములను నడపించుచుండును. అతని రచనమున వర్ణన సంవాద శైలులు కూడ నచ్చటచ్చట లేకపోలేదు. సభా,వర్ష,శర,దింద్రప్రస్థవర్ణన సందర్భములును సౌగంధికాహరణ మందలి హనుమద్భీమ సమాగమ సందర్భమును ఇందుకు వరుసగా దృష్టాంతములు.

నన్నయ అరణ్యపర్వాశ్వాసాంతములందు "అని జనమేజయునకు వైశంపాయన కథితంబైన పుణ్యకథ యతిరమణీయంబుగాను'' (అ. ౧-399) ''రమ్యంబుగను'' (అర. ౨-353) ''రమ్యంబుగ'' (అర. ౩-397) అని రమ్యరమణీయ శబ్దములను వాడియున్నాడు. సభాపర్వ ప్రథమాశ్వాసాంతమున "రసోత్కటముగ" అనుపదమును ఆదిపర్వతృతీయాశ్వాసాంతమున "అనంతపుణ్యఫలాయత్తముగాఁగ" అనుపదమును గలవు. ఆదిసభాపర్వములాద్యంత రమణీయ ములుగ నుండును. అరణ్యపర్వమున సౌంభకాఖ్యానము, నలోపాఖ్యానము, కిరాతార్జునీయము, ఋశ్యశృంగకథవంటి రసవద్ఘట్టము లచ్చటచ్చట మాత్రమే వచ్చును. అయినను అరణ్యపర్వా శ్వాసాంతములన్నింట నతఁడు రమ్యపదమునో రమణీయపదమునో వాడుట కందలి కథలను వ్రాయునప్పు డాతఁ డమితమైన శ్రద్ధవహించుటో, తీర్థాదివర్ణనములపట్లఁ గల్గు శుష్కతను విరానముచేయ నెంచుటో కారణమై యుండును. నన్నయ ఆదిపర్వమును రచించి దానిని వేంగీపరిషత్తునకువినిపించి యుండుననియు, నందలి పండితులు కావ్యము రమణీయార్థ ప్రతిపాదకముగా నుండవలెనని నిర్ణయించి యుందురనియు, నందుచే నన్నయ తాను తరువాత రచించిన యాశ్వాసముల చివర రమ్య రమణీయ శబ్దములను వాడియుండుననియు కళా ప్రపూర్ణ శ్రీవిశ్వనాథ సత్యనారాయణగా రభిప్రాయపడుచున్నారు.

## నన్నయ రచనయందలి భాషావిశేషములు.

నన్నయ తనకాలమున శిష్టవ్యవహారమందుండిన పదములను, దనకుఁ బూర్వము శాసనములందు వాడఁబడిన పదములను బాగుగాఁ బరిశీలించి, యందు శ్రవణ సుభగములైన వానిని గ్రహించి, లేనివానిని బరిహరించి. సంస్కృతమునుండి పెక్కుశబ్దములను గ్రహించి, వానిని దెలుఁగున నేరూపములతో వాడవలయునో నిశ్చయించి భారతరచనమును గావించెను. ఈవిధముగాఁ దెలుఁగుభాషకు మొట్టమొదట రూపసౌష్ఠవము తీర్చి దిద్దినవాఁడు నన్నయయే. అట్లు చేయుటలో నతఁడు చూపిన ప్రతిభ యప్రతిమానమైనది. ఆప్రతిభయే యతని విపుల శబ్దశాసనబిరుదమున కర్హునిఁ గావించి యుండును. అతని ప్రయోగములు తరువాతి యాంధ్ర కవులకును వైయాకరణులకును వైదికప్రయోగమువలెఁ బరమ ప్రమాణములును లాక్షణిక ములునై విలసిల్లినవి.

విస్తరభీతిచే నన్నయ రచన యందలి భాషావిశేషముల నన్నిటిని వివరింపక ముఖ్యము లైన కొన్నిటిని మాత్రమే యిచటఁ బేర్కొందును.

పేర్వాదిశబ్దములకచ్చుపరమైనప్పుడు టుగాగమమువచ్చిన రూపములాతని రచనలోఁ గానరావు. "విప్రసతికినూఱువేఁడజన్వరము" అనుచో చనును అను క్రియయందలి ను ప్రత్యయమునకేకాక ప్రకృతి యందలి ఉత్తునకుఁ గూడ లోపము వచ్చినది. నన్నయ ఉండునది అను విధ్యర్థక రూపమును ఉన్నది యనునట్లుగాఁ గూడ వాడియుండెను. "దుర్జనయోధవరులకడ నుండకున్నది"ఇదిబహుళః ఉండునకుఁబూర్వరూపమైన ఉను అనుదానినుండి యేర్పడియుండును. అయి + ఉ = అయియు ననురూపము పొందవలెను. నన్నయ అయియందలి ఇకారమును లోపింపఁజేసి అయ్ + యు = అయ్యు అనురూపమును వాడియున్నాఁడు. అతఁడు ఓటమి, అనతి అనువాని యందలి యిత్తునకచ్చుపరమగునపుడు సంధి చేసియున్నాఁడు. "ఓటమెడఁదలేక — అనతిచ్చినట్లు"యనునవి యుదాహరణములు. ధైర్యాశక్తికిన్నరుదుగ (అర. ౧-322) అనువ్రాత ప్రతి పాఠమున ద్రుతద్విత్వసంధి కనవచ్చుచున్నది.

నన్నయ రచనలో అర్ఘ, ధర్మశబ్దముల యత్వమునకుత్వమును మీఁదవువర్ణమును గనవచ్చుచున్నవి. అర్ఘువు, ధర్మువు. మిత్రపాత్ర శబ్దములు నన్నయభారతమునఁ బుంలింగతుల్యములుగానే వాడఁబడినవి. మిత్రము, పాత్రము అను రూపములందుఁ గానరావు. ప్రేమ, కర్మ, జన్మ మున్నగు ువర్ణవిరహిత రూపములను నన్నయ యెచ్చటను వాడియుండలేదు. మన్ను, బయలు, ప్రొద్దు, మున్నగు శబ్దములను నన్నయ యనౌపవిభక్తికములుగా వాడియున్నాఁడు.

నన్నయ దీర్ఘపూర్వలోపథములు కాని శబ్దములకుఁ గూడఁ గొన్నిటికి బహువచనమున రువర్ణము చేర్చియున్నాఁడు. అల్లురు, నెయ్యురు,మల్లురు. అతఁడు గుఱిచి,చేసి(చేత)మై,పొంటె అనువానిని గూడ విభక్తి ప్రత్యయములుగా వాడియున్నాఁడు. తదర్థమను పదము నతఁడు చతుర్థ్యర్థమునఁ బ్రయోగించి యున్నాఁడు. అతని రచనలో కొఱకు అను ప్రత్యయము మృగ్యము. కై,కయి అను ప్రత్యయములున్నవి. అవి కు + అయి అనువానికలయికచే నేర్పడె ననుటకు "అనఘ మామామశకుని నాకై కడంగి" యను ప్రయోగము దృష్టాంతము. నన్నయ సమానాన్వయముగల శబ్దము లనేకము లున్నప్పుడు తో, తోడ అనుప్రత్యయములను దుదిపదమునకే చేర్చుచుండును. ఆపగాతనూజుఁడఖిల బాంధవులయు బ్రాహ్మణులయుఁ దోడఁ భానుని ఘుఁడు" (ఆ. ౮-216) ఇచ్చట తోడకు వ్యస్త ప్రయోగమని చెప్పవచ్చును. నన్నయ భారతమున అందు వ్యస్తముగా స్థలార్థమునఁ బెక్కుచోట్ల వాడఁబడియున్నది. "అతిథివై వచ్చి నీవు మాయందుఁ గుడిచి" "అరిగి ముందఱున్న యందయుండి" మున్నగునవి దృష్టాంతములు.

నన్నయ ఉత్తమపురుషైకసర్వనామముగా ఏను అను రూపమునే విరివిగా వాడియుండెను. బహువచనమున ఏము మేము అనురెండురూపములును అతని రచనలోఁ గనవచ్చుచున్నవి. అతఁడు, వాఁడు, వీఁడు, అది అను సర్వనామములను నీచార్థమునఁగాక సామాన్యార్థమునవే వాడుచుండును. ద్రౌపది, దమయంతి మున్నగు వారిని జెప్పునప్పు డతఁడు అది యను సర్వనామమునే ప్రయోగించును. అతఁడెవ్వరైన ననునర్థమున స్త్రీపురుషోభయ సూచ

కముగా ఎవ్వేని అను పదము వాడుచుండును ఇది ఎవ్వరు + ఏని అనుపదములు కలసిన రూపము కావచ్చును. "నీవెయ్యేని నొక్కవేల్పు నారాధించి (ఆ. ౫-18)"

నన్నయ మహద్వాచకముగా ఒక్కరుఁడు అను రూపమునే వాడును. ఒకఁడు అనునది అతని రచనలో నమహద్వాచకములకే వాడఁబడినది. ముద్రితప్రతులలో ఒకఁడు మహద్వాచకముగాను ఒకటి అమహద్వాచకముగాను గనవచ్చుచున్నవి. అతఁడు కొంత, ఒకానొక అను నర్థములందు కొండొక యనురూపమును వాడియున్నాఁడు. మొదటి యను ప్రయోగము నన్నయ రచనలోఁగానరాదు. మొదలిటి, మొదలింటి అను రూపములున్నవి. నన్నయ యైదనుట కేనను పదమునే వాడును. "ఏనుప్రకారంబులయితి" మున్నగు ప్రయోగములవలన నది కళగానే కనఁబడుచున్నది. ఎనిమిది కెనమ యను రూపమును దొమ్మిదికిఁ దొమ్మయను రూపమును గనవచ్చుచున్నవి. వేయి శబ్దమునకు వే యనునది మూలరూపము. దీనిపై సముచ్చయార్థకమైన ఉ చేరుటచే వేయు అను రూపమేర్పడినది. నన్నయరచనలో మహన్మహాతీవాచకములను జెప్పు సంఖ్యావాచకములపై వురు అనునదే కాని గురు, మంది అనునవి కానవు. పూరణార్థమున సంఖ్యావాచకములకతఁడు అవ అను వానినిగాక అగు, అవు అనువానినే వాడుచుండును. ముద్రితప్రతులలో అవ యనునదియుఁ గనవచ్చుచున్నది. పెక్కురను రూపముకు బదులు నన్నయ పెక్కండ్రు, పెక్కండ్రురు అనువానిని వాడుచుండును. ఎల్లరు అను రూపము నన్నయ భారతమున లేదు.

నన్నయ భారతమున కలఁడు, కలరు అనునవి భవిష్యత్కాలసూచకములుగాఁ గాక సామర్థ్యార్థద్యోతకములుగా వాడఁబడినవి. అవి కొన్నిచోట్ల స్వతంత్రమైన అన్వయముతోఁ గూడి తుమున్నర్థకముల కవ్యవహితపదములుగాఁ గాక వ్యస్తముగాఁ గూడ వాడఁబడినవి. "ఒరులుగలరెకర్ణునోర్వ". కేతన ఆంధ్రభాషాభూషణమున దీవెన కెడము, కావుత, కాత అనునవి ధాతువులకుఁ జేరునని వ్రాసియున్నాఁడు. ముద్రిత భారత ప్రతులలో ఎడు,త ప్రత్యయములే కనఁబడుచున్నవి. కాని వ్రాతప్రతులలో 'ఎడమని' అను రూపములేకాని 'ఎడుమని' యను రూపములు కనవచ్చుట లేదు. ఒప్పదయ్యెడున్, నమ్మనేర నయ్యెదను మున్నగు ప్రయోగములను బట్టి నన్నయ భూతంబున ఆజీకి లాశిర్థమైన అగు ధాతురూపములను కూడ నను ప్రయుక్తములు కావించెనని తెలియుచున్నది. అతని రచనమున తొట్టు ధాతువు యొక్క క్త్వార్థక రూపమొక్కటే కనవచ్చుచున్నది. ఇప్పుడు తుమర్థకములపై నుపక్రియలుగా వాడఁబడు వలయు, పోలు అను ధాతువు లతని రచనలో స్వతంత్రముగాఁ దుమున్నర్థకములకు ముందును వెనుకనుగూడఁ గనవచ్చుచున్నవి. "సాధురతువలయుఁజేయ" (అర. ౧-30.) అతఁడు కలవు, కలఁడు, కలరు మున్నగు వానిని కలిగియుందువు, కలిగి యుండును అను నర్థములందు వాడియుండెను. "నీవు బుద్ధిగలవేని వీరిని విడిచి (అర. ౩-391). నన్నయ వలచు ధాతువుయొక్క అమహద్వ్యతిరేక తద్ధర్మరూపమును రాదు, తగదు అను నిషేధార్థములందు తుమున్నర్థకములపై వాడుచుండును. ఈవలవదే క్రమముగా వలదు,వద్దుఅను రూపములను బొందినది. నన్నయ తుమున్నర్థకరూపములను భావార్థకములుగా వాడుచుండుననుటకు "అమలినతారకానముదయం

ములనెన్నను...నేరఁబోలునే"వంటి ప్రయోగములు దృష్టాంతములు. అతఁడు ఉత్తరమించు అను ధాతువును వాడియుండెను. ర్యాలి శాసనమందలి తూర్పించు అను రూపమును బట్టి యిచ్చట ఉత్తరము అను మువర్ణాంతరూపము మీఁదనే ఇంచు ప్రత్యయము చేరినట్లు తోఁచుచున్నది.

ఇహపరము లను సంస్కృతావ్యయములు నన్నయ రచనలో విశేష్యములుగా వాడఁబడినవి. అతఁ డుపమావాచకమగు పోలెన్ అను నవ్యయము నవధారణసముచ్చయాంతపదముల మీఁదనే వాడుచుండును. యథాశక్తి, యథాక్రమము అను నవ్యయీభావసమాసము లతని రచనలో విభక్త్యంతములుగాఁ గనవచ్చుచున్నవి. ఏని యను దానికి నేని యను హలాదిరూపము కూడ నున్నది. భావార్థమున టవర్ణమునకు బదులు డు అను దానిని వాడినరూపములు నన్నయ రచనలో రెండుమూఁడు గోచరించుచున్నవి. "వానిహీనుంగాఁజేయుడునాకుఁ జతుర్వర్గము". చేయు డనఁగాఁ జేయుట యని యర్థము. నన్నయ కొన్నియవ్యయములను విశేషణములుగా వాడియున్నాఁడు. "ప్రణమిల్లికరంబుభక్తితోన్."

నన్నయభారతమునఁ దచ్ఛబ్దానుప్రయోగముతోఁగూడిన ధాతుజవిశేషణములు విశేష్యములతరువాత వాడఁబడుచుండుట విరివిగాఁ గానవచ్చును.

అతనికూఁతురు సుకన్యయనునది (అర. ౩-176)

ద్రౌపదేయులను...సుఖసుప్తులైనవారి వధించుటయు (ఆది. ౧-51)

నన్నయ అగు అను సమాపకక్రియ లేకుండనే పెక్కువాక్యములను రచించియుండెను. అతనికిముందున్న శాసనములలో నిట్టివాక్యములు పెక్కుకనిపించును. నిండుమనంబునవ్యనవనీతసమానము-పలుకుదారుణాఖండలశస్త్రతుల్యము- రెండును రాజులందువిపరీతము. (ఆ. ౧-100)

కొన్నియెడల నతని వాక్యములలో ధాతుజవిశేషణపూర్వములైన విశేష్యములే క్రియాకార్యము నొనరించును. ఇది నాచేసినమర్యాద. (ఆ. ౭-271)

సంస్కృతసంప్రదాయమును బట్టి నన్నయ యత్తదర్థకములతోడను, యదాతదా, యథాతథార్థకములతోడను గూడిన వాక్యములు పెక్కు రచించియున్నాఁడు.

చదలఁబతులామిషం బెట్లుభక్షించు నట్లుదివిరి యెల్ల
వారును భక్షింతు రర్థవంతు (అర. ౧-37)

నీ కభివాంఛిత మెయ్యది దానిఁజెపుము (ఆ. ౧-109)

నన్నయభారతమున కర్మణ్యర్థకవాక్యము లచ్చటచ్చటఁ గానవచ్చును.

వాఁడుతనయుఁడనంబడునే (ఆది. ౩-199)

పరమసుఖోపాయంబునఁబరసంపద చేకొనంగఁబడునేని (స. ౨-142)

అతఁడు చే,చేత ప్రత్యయములను గర్తృపదములకుఁజేర్చి సంస్కృత త ప్రత్యయాంతరూపములను గూడ కర్మణ్యర్థమున వాడుచుండును. "బ్రహ్మచేత ననుజ్ఞాతుండై" మున్నగునవి యుదాహరణములు.

నన్నయ దీర్ఘ వాక్యములనడుమఁ బ్రత్యక్షవచనములను గూడఁ జొప్పించుచుండును.

అని కద్రువ వినతంజూచి "చూడవె యల్లయతిధవళంబైన...నల్లనైయున్నయది" యనిన విని వినత నగి నీవేకన్నులంజూచితేయక్క...(ఆది. ౨-31)

నన్నయ రచనలో వచనమున ముగియనివాక్య మొక్కొక్కప్పుడు తరువాతి పద్యములోనికిఁ గొనసాగుచుండును. (ఆది. ౧-131)

కపిలగడ్డము,కపిలజడలు,కపిలకన్నులు,కఱకంఠుఁడు మున్నగునవి అనింద్యగ్రామ్యములని చిన్నయసూరి తెల్పియున్నాఁడు. "అవసరజ్ఞుండయి"ఇత్యాదిపద్యమునఁ బ్రాసస్థానమందు "కపిలగడ్డంబు" అనుపదము వాడఁబడుటచే నందలి పదము కవిలయేకాని కపిలకాదని ప్రౌ. వ్యా. కర్తసూచించెను. సూరిప్రకారము నన్నయ పవలకుఁబ్రాస యంగీకరించెనని భావింపవలయును. గర(ళ)కంఠశబ్దభవము కఱకంఠశబ్దమని ప్రౌ. వ్యా. కర్త అభిప్రాయము. సురకరువలియను సమాసమందలి సుర శబ్దము దేశ్యమేకాని సంస్కృతము కాదు.

## నన్నయఛందోవిశేషములు

నన్నయకుఁ బూర్వమందలి శాసనములలో తరువోజ,మధ్యాక్కర,సీసము,గీతము మొదలగు దేశిపద్ధతికిఁజెందిన పద్యములే కనవచ్చుచున్నవి. అతఁడు సంస్కృతమందలి పెక్కుపదములను దెలుఁగున నెట్లు వాడుకొనవలయునో నిశ్చయించి గ్రహించినట్లే శ్రవణసుభగములైన కొన్నిసంస్కృతవృత్తములను గూడ గ్రహించి వానికిఁతెలుఁగునకు సహజమైన యతిప్రాసలు చేర్చి భారతమున వాడియున్నాఁడు. ఈవిషయమునఁ గూడ నతనికి కన్నడకవులైన పంపాదుల రచనలు మార్గదర్శకములై యుండును. అతఁడు వ్రాసిన పద్యగద్యముల మొత్తము 3983. అందుపద్యములు 2487. అందుకందములు 1219. సీసములు 251. చంపకమాలలు 240. తేటగీతలు 177. మధ్యాక్కరలు 59. అతఁడు దేశీయ పద్యభేదములకంటె సంస్కృతవృత్తభేదములనే యధికముగా వాడియుండెను.

సంస్కృతమున పృథ్వీవృత్తమునందు 9 వ యక్షరము యతిస్థానము. నన్నయ దానిని 12 వ యక్షరమునకు మార్చెను. శ్రీనాథపెద్దనలు పృథ్వీవృత్తములో యతివిషయమున సంస్కృతనియమమునే పాటించిరి. నన్నయ పద్మకవృత్తమునందు 8వ యక్షరమున యతివేసెను అప్పకవ్యాదులందు 11 వ యక్షరమును యతిస్థానముగాఁ జేర్కొనిరి. నన్నయ మానినీవృత్తమునందు 13 వ యక్షరము నొక్కదానినే యతిస్థానముగా పాటించెను. తిక్కన కొన్నిచోట్ల 13 వ యక్షరముననే యతివేసినను గొన్నిచోట్ల మూఁడుయతులను బాటించెను. కవిజనాశ్రయము యతిత్రయమునే చెప్పినది. అప్పకవి నన్నయ మార్గమునే యనుసరించెను. కవిరాజ

విరాజితమున నన్నయ 14వయక్షరమును యతిస్థానముగాఁ బాటించెను. తిక్కన కొన్నిచోట్ల నందు మూఁడు యతులను వేసియున్నాఁడు. లాక్షణికులందఱును యతిత్రయమునే నిర్దేశించి నారు. నన్నయ యర్జునుఁడు శివుని స్తుతించినప్పు డరణ్యపర్వమున నొక దండకము వ్రాసెను. ఇందు పెక్కు త గణములును జివర నొక్కగురువును నున్నవి.

పూర్వాంధ్రకవులలో నన్నయయెఱ్ఱనలు తప్ప మఱెవ్వరును మధ్యాక్కరలను వాడి యుండలేదు. ఎఱ్ఱనకూడ వాని నొక్క అరణ్యపర్వశేషమున మాత్రమే వాడియుండెను. ఆంధ్ర లాక్షణికులందఱును ఎఱ్ఱననునుసరించికాఁబోలు అందు చతుర్థగణాదినే యతిస్థానముగా నిర్ణ యించినారు. నన్నయ పంచమగణాదిని యతి వేసియుండెను. అతనికిఁ బూర్వముండిన శాసన ములలోఁ గూడ యతి యట్లేయున్నది. నన్నయ రచించిన మధ్యాక్కరలలోఁ గొన్నింట గణములతీరు కొంతవ్యత్యస్తముగా నున్నది. అట్టివి 16 పాదములున్నవి. అర్థమునకుఁగాని నన్నయభాషాప్రయోగపద్ధతికిఁగాని వైరుద్ధ్యము సంభవింపకుండ నించుకమార్పు గావించి వీనిలోఁగొన్నింటికి లక్షణానుగుణ్యము సంపాదింపవచ్చును.

"భూపాల నీకు నిక్కమలియందుఁ బుట్టిన సుతుఁడు" మున్నగు నైదాఱు పాదముల విషయము బాగుగాఁ బరిశీలింప వలసియున్నది.

కవిజనాశ్రయమున సీసము సమము విషమము అని ప్రధానముగా రెండు తెఱఁగులుగా విభజింపఁబడినది. ఇందు సమసీసమున మరల నైదువిధములు చెప్పఁబడినవి. ఈవిధముగా దానిని బట్టి సీసము లాఱువిధములు. కావ్యాలంకారచూడామణి యీయాఱింటినే పేర్కొనెను. అనంతుఁడు దశసీసభేదములను జెప్పియున్నాఁడు, అప్పకవి సమసీసమును, విషమమం దాఱు భేదములను మొత్త మేడువిధములు చెప్పి వానిని నన్నయభారతమున వాడినట్లును ఇతరకవులు సమసీసము నొక్కదానినే వాడినట్లును జెప్పియున్నాఁడు. కాని నన్నయ భారతమున అవకలి ప్రాససీసము, అక్కిలివడిసీసము, వృత్తప్రాససీసము అను మూఁడువిధములే గోచరించుచున్నవి.

సీసపాదములను (1) 8 చోట్లయతినియమముకలవి (2) 8 చోట్లప్రాసనియమముకలవి (3) పూర్వార్ధములప్రాసము, పశ్చిమార్ధములయతికలవి (4) పూర్వార్ధములయతి పశ్చిమార్ధ ములప్రాసకలవి అని ప్రధానముగా నాలుగు రకములుగా విభజింపవచ్చును. ఇట్లే గీతములను (1) 4 పాదములందు యతినియమముకలవి (2) 4 పాదములందు ప్రాస నియమముకలవి (3) బేసిపాదములందు యతి సరిపాదములందు ప్రాస కలవి (4) బేసిపాదములందుప్రాస, సరిపాదములందు యతి కలవి యని నాలుగు రకములుగా విభజింపవచ్చును. ఈరెండును కలిసి నప్పుడు మొత్తము 16 సీసభేదము లేర్పడును. నన్నయ వానిలో 13 భేదములను వాడి యున్నాఁడు. అతని సీసములు 251 లో ఆటవెలఁదులతోఁగూడినవి 225. తేటగీతులతోఁ గూడినవి 26.

సంయుక్తయతి విషయమున సంయుక్తాక్షరములలో నేయక్షరమున నైన యతి వేయ వచ్చునని లక్షణము చెప్పుచున్నది. నన్నయ యిందుఁ గొన్ని విశేషనియమములను బాటించి యున్నాఁడు.

తిక్కన క్షకారమునకు నన్నయ కకారమునకు సంబంధించిన యక్షరమునే యతిగా వేయు చుండును. అతఁడు జ్ఞకారమునకు చఛ, జ, ఝ, శషసలతోనే యతివేయును. నణలతోఁగాని కఖగఘలతోఁగాని యతి వేయఁడు. రేఫసంయుక్తములైన యక్షరములలో నతఁడెప్పుడును నన్యహల్లునకే యతిమైత్రి కూర్చుచుండును. త్మ మున్నగు త్రిహల్కముల నక్షరములకు యతి వేయవలసివచ్చినప్పు డతఁడు తుదిహల్లునకే ప్రాధాన్య మొసంగుచుండును. చతుర్థి విభక్తి ప్రత్యయమైన కై అనునది కు + ఐ అనువాని కూడిక యగుటచే నందు నన్నయ యచ్చునకే యతివేయుచుండును. అతని రచనమున నచ్చటచ్చట నఖండయతులు కనవచ్చుచున్నవి. పర్వం, బకడున్ మేలనఁగ శాంతిపర్వము వెలయున్ (ఆ. ౧-57) కొనినాగపురమున కొనరంగఁజని మున్నగున విందు కుదాహరణములు. దుః, ఖ—బునై నెడ విమోహమును బొంది(అర. ౪-127) అనుచోట ఃఖ యందలి విసర్గమునకును హకారమునకును యతి వేయఁబడినది.

ద్రుతమునకు మకారము పరమగుచో నేర్పడు ద్విత్వమకారమునకును సహజమకార ద్విత్వమునకును నన్నయ ప్రాసవేసియున్నాఁడు. (కమ్మనిలతాంతములకు మ్మొనసియాడు). "కాదనకిట్టిపాటి...సంబోధనఁ జేసిచేసి' యనుచో స్వవర్గజప్రాసమున్నది. నన్నయ రేఫఱకార ములకుఁ బ్రాస వేసియుండలేదు.

కం. తలరఁగ రేణుక క్రథన
ప్రవిహప్రరుజాశ్వకృంత వదనఖులను (ఆ. ౨-100)

ఈకందమున క్రథనయందలి క్రను దేల్చి పలుకవలెను. లేనిచో గణభంగము చేకూరును.

నన్నయ యాశ్వాసాంతములం దొక్కొక్క కందపద్యముతో పా టొక్కొక్క వింతవృత్త మును గూడ వాడియున్నాఁడు. కందము నతఁడు నీతిధర్మములనుదెల్పు సందర్భములఁ గూడ వాడుచుండును. ఉత్సాహవృత్తము నాతఁడు కథలో రెండుచోట్ల వాడియుండెను. ఆ రెండు సందర్భములు నుత్సాహసూచకములైనట్టివే. మధ్యాక్కర యందలి గమనము మందముగా నుండును. నన్నయ దానిని దుఃఖక్లేశవర్ణనమునకు వాడియుండెను. అతఁడు సీసములను వర్ణ నములకును, కథాకథనమునకును, వస్తుస్థలవ్యక్తినామపట్టికలు చెప్పుటకును దఱుచుగా విని యో గించుచుండును. అతని రచనలో తరలామత్తకోకిలములు సంభాషణ సందర్భమందును, స్రగ్ధరా మహాస్రగ్ధరలు వీరరౌద్రరససందర్భములందును లయగ్రాహి వర్ణనసందర్భములందును, వాడఁ బడినట్లు గోచరించును. అతఁడు రసహీనములైన శుష్కవిషయములను జెప్పవలసివచ్చినప్పుడు సాధారణముగా వచనము వ్రాయును. అతఁడు కొంచెమించుమించుగా సీసములను వచనములను సమానప్రయోజనమునకై వాడినట్లు కనిపించును.

నన్నయ "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" ఇత్యాది సీసపద్యమున వ్యాసుని సంస్కృత భారతస్వరూప వైవిధ్యమును జక్కగా నుల్లేఖించెను. అందుఁ బేర్కొనఁబడిన లక్షణములన్నియు నాంధ్రమహాభారతమునకుఁ గూడ ననువర్తించును. కావ్యేతిహాసత్యతా గౌరవమునఁ దెలుఁగు భారతమునకున్న ప్రశస్తి యద్వితీయమైనది. దానినాపద్ధతిలో మొదట నారంభించి మార్గదర్శి

మైనవాఁడు నన్నయభట్టారకుఁడు. తరువాత వెలసిన యాంధ్రకవివర్యుల కందఱికి నాతఁడు గురుప్రాయుఁడు. వారెవ్వరును ఆమహనీయుని స్తుతింపకుండఁ గావ్యరచన కారంభించి యుండలేదు. లౌకిక సంస్కృతవాఙ్మయమునకు వాల్మీకిమహర్షి యెట్టివాఁడో యాంధ్రవాఙ్మయమునకు నన్నయ యట్టివాఁడు. వాల్మీకి ఋషియై కవియయ్యెను. నన్నయ కవియై ఋషియయ్యెను. 'నానృషిఃకురుతేకావ్య'మ్మనుసూక్తి వారిరువురియెడను సమానముగ నేవర్తించును. సంస్కృతసరస్వతికి వాల్మీకియు నాంధ్రసరస్వతికి నన్నయయయు మొట్టమొదటఁ దీర్చిదిద్దిన కావ్యాకృతులెంత సుందరములైనవో యంతపవిత్రములైనవి; ఎంత క్లిష్టములైనవో యంత యుదాత్తములైనవి. "ఋషివంటినన్నయ రెండవవాల్మీకి" యన్నకవిసమ్రాట్టులవాక్కు సత్యశోభితమైనట్టిది. తనప్రతిభాకవితాసౌందర్యములచే నన్నయ యాంధ్రులను, ఆంధ్రకవిలోకమును నధమవర్ణులఁ గావించినాఁడు. తిక్కన యన్నట్లతఁడాంధ్రకవిత్వవిశారదుఁడు; శ్రీనాథుఁడన్నట్లు కవితాపట్టాభిషిక్తుఁడు; మారనయన్నట్లు విద్యారమణీయుఁడైన యంధ్రకవితాగురువు; అహోబలుఁడన్నట్టు లాంధ్రవాక్ప్రకట కవిత్వకల్పతరురాజము బీజము. అతని కతఁడేసాటి.

"వేయివిధంబులందుఁ బదివేవురుపెద్దలు సుప్రబంధముల్
వ్రాయక చెప్పిరందు రసబంధురభావభవాభిరామధా
రేయులు శబ్దశాసనవరేణ్యులు నాఁగఁబ్రశస్తికెక్కరే
యేయెడ నన్నపార్యుగతి నిద్దర నట్టి మహాత్ముఁ గొల్చెదన్"

ఉస్మానియావిశ్వవిద్యాలయము
హైదరాబాదు
20—1—69

దివాకర్ల వేంకటావధాని

# ఎఱ్ఱా ప్రెగడ

ఆంధ్రమహాభారత కవిత్రయములో చివరివాడైన ఎఱ్ఱనమహాకవి కడవాడుకాని కడవాడు. కాలమునుబట్టి యాతడు నన్నయతిక్కనల తరువాతివాడైనను కవిసమాజమునందు అభ్యర్హితత్వములో కడపంక్తివాడుకాడు. కవిత్రయములో నీతనిస్థానమును నిరూపించుచు బ్రహ్మశ్రీ వెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ రామోపాఖ్యానవిమర్శనములో కల్పించిన ఉపమానము మిక్కిలి హృద్యముగానున్నది. "అట్లాంటిక్కు" మహాసముద్రముంబోలు నన్నయ వాఙ్మయాభివృద్ధిని, పసిఫిక్కుమహాసముద్రముంబోలు తిక్కనవాఙ్మయాబ్ధిని, హిందూమహాసముద్రముంబోలిన ఎఱ్ఱన వాఙ్మయాంబుధికలిపి సమీకరణమొనర్చినది. "నన్నయకవితను అట్లాంటికుమహాసముద్రముతోను తిక్కనకవితను శాంతమహాసముద్రముతోను పోల్చువిషయమై అభిప్రాయభేదముండవచ్చును. పసిఫిక్కు మహాసముద్రము విశాలతరమైనది. తిక్కనవాఙ్మయాంబుధి విస్తృతతరమైనది. అంతవరకు యుక్తముగనే ఉన్నది. కాని అట్లాంటికుమహాసముద్రము తుపానులకల్లోలమునకు పుట్టినిల్లని భౌగోళికులు చెప్పుదురు. నౌకావిపత్తులకు ముఖ్యస్థానము. పసిఫిక్కుమహాసముద్రము దానితో పోల్చినప్పుడు శాంతినిలయమని భావింపబడుచున్నది. కావుననే దానికి శాంతమహాసముద్రమని పేరుచెల్లినది. అన్వయకల్లోలము తిక్కనసోమయాజి కవిత్వమునందు అధికమని పెద్దలుచెప్పుదురు. నన్నయరచన "ప్రసన్నకథాకవితార్థయుక్తమైనది"కదా. అన్వయనౌకావ్యసనభూయిష్ఠమైన తిక్కనకవితనే అట్లాంటికుమహాసముద్రముతో అభేదము కల్పించిన రమ్యతరముగానుండునేమో! అదియట్లుండె.

ఎఱ్ఱాప్రెగడ రచించినగ్రంథములు — భారతారణ్యపర్వశేషము, నృసింహపురాణము, రామాయణము, హరివంశము. ఈకవి తిక్కనసోమయాజితరువాత ఏబదిసంవత్సరములకు జీవించియుండునని కందుకూరి వీరేశలింగముపంతులుగారు వ్రాసిరి. ఎఱ్ఱనగ్రంథములుయాను పూర్విని గూర్చియు ఆతని జీవితపరిధినిగూర్చియు స్వల్పవివాదములు గలవు. వానిని మున్ముందు సంగ్రహముగ స్పృశింతును.

ఎఱ్ఱనకువేయబడిన ప్రెగడశబ్దము ఔపచారికముగనే భావింపవలెను. ఆయనయెన్నడును రాజకీయ కార్యభారము వహించి అమాత్యుడుగా నుండలేదు. ఎఱ్ఱన నియోగిబ్రాహ్మణుడు. ప్రెగడశబ్దమునకు ప్రెగ్గడఅనునది పూర్వరూపముగా దోచును. 'దగ్గరకొండెమునెప్పుడు ప్రెగ్గడపల్కులకు'అని సుమతీశతకము. ప్రెగ్గడశబ్దమును 'పేరు+కడ' పేరుగడ, పేర్గడ, వర్ణవ్యత్యయముచేతను సమీకరణముచేతను ప్రెగ్గడగను ఊహింపవచ్చును. ఇచ్చట 'కడ'శబ్దము ఏడుగడ మున్నగువానియందువలె శరణ్యము, ఆశ్రయము అనునర్థమునిచ్చునదిగాతోచును. పేరుగడ అనగా పెద్దదిక్కు. రాజ్యమునందలి ముఖ్యాధికారి, అమాత్యుడుఅనురీతిని అర్థపరిణామము జరిగియుండవచ్చును. నలుగడశబ్దమునందును దిక్కుఅనునర్థమే యున్నది. ప్రెగ్గడతేల్చి పలుకుటచే ప్రెగడ యగును.

## కవివంశము - కాలము.

ఎఱ్ఱయకవితండ్రి సూర్యకవి. తల్లి పోతమాంబ. వీరిది శ్రీవత్ససగోత్రము. ఎఱ్ఱనార్యుని తాత యెఱపోతసూరి. ఎఱపోతసూరి తండ్రి బొల్లన. ఈతనిజనకుడు భీమమంత్రి. భీమనమంత్రి వెలనాటిచోడునిచే మన్ననల నందినవాడు. వెలనాటిచోడు లిరువురు గలరు. రాజరాజనరేంద్రుని కుమారుడైన కులోత్తుంగరాజేంద్రచోడుడు తనమాతామహరాజ్యమైన తమిళదేశాధిపత్యమును అభిమానించి, ఆంధ్రదేశపరిపాలనను మొదట తనకుమారులకును, తరువాత తనయిష్టభృత్యులైన వెలనాటిచోడులకును వదలిపెట్టెను. భీమనమంత్రిని గౌరవించిన వెలనాటిచోడు డీవంశములోనివాడే. రెండవవెలనాటిచోడుడు క్రీ. శ. 1170–80 ల నడుమ పరిపాలించినవాడు. భీమనమంత్రికిని ఎఱ్ఱాప్రెగడకవికిని నడుమ నాలుగుతరముల వ్యవధియుండుటచే ఈకవీశ్వరుడు క్రీ. శ. 1280 ప్రాంతమున జన్మించెనని యూహింపబడినది. అనగా కవిబ్రహ్మ తిక్కనసోమయాజీ చరమదశయందీతడు బాలుడైయుండియుండును. ఎఱ్ఱయకవి రెడ్డిరాజ్యస్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డి (1323–49) యాస్థానము నలంకరించెను. వేమారెడ్డికిముందే యీతడు దివంగతుడగుటచే 1345 ప్రాంతమున నది జరిగియుండునని భావించినచో ఎఱ్ఱాప్రెగడ జీవితకాలము షుమారు 1280–1345 అగుచున్నది. ప్రోలయవేమారెడ్డి మల్లవరశాసనము (1325) అమరావతీ శాసనము (1345) ఆధారముగా ఎఱ్ఱాప్రెగడ హరివంశరచనము 1325–45 సంవత్సరముల నడుమ జరిగియుండునని బ్రహ్మశ్రీ చాగంటిశేషయ్యగారు చక్కగానిర్ణయించియున్నారు.

ప్రోలయవేముని పెద్దకుమారుడు అనపోతారెడ్డికాలపు *కొల్లూరు తామ్రశాసనములో (1364) ఎఱ్ఱయయొకరు దానప్రతిగ్రహీతలలో పేర్కొనబడియున్నాడు. ఈతడు హరివంశ

---

*ఈశాసన గ్రంథపాఠము ఆంధ్రేతిహాసపరిశోధకమండలివారిచే ప్రకటింపబడిన రెడ్డిసంచికయందు ఒకటవ అనుబంధము 21 పుటనుండి ముద్రితమైయున్నది. దీనికాలము శా. శ. 1286. క్రీ. శ. 1364. శాసనకాలమునకు సంబంధించిన శ్లోకము అనుబంధము 28 పుటలో వేరుగా ఈయబడినది. ఆశ్లోకమిట్లున్నది

శాకాబ్దే ఋతురంతిభాస్కరమితే శ్రీశోభకృద్వత్సరే
మాఘేచోత్తమమాసి పుణ్యదివసే చార్ధోదయేపర్వణి
సందద్యాదనపోతరాట్పురవరం కొల్లూరుకృష్ణాతటే
శ్రీరామేశ్వరయజ్వవేదవిదుషాం భోగాష్టకైస్సంయుతాం"

ఈశాసనమునందొక విశేషముకలదు. అనపోతారెడ్డి చేసిన దానమునకు ఆతనితమ్ముడు అనవేమారెడ్డి కొంతభూమినిచేర్చి తానును దానముచేసెను. అక్కడిమాటలివి. "యీరాజుతమ్ముడు అనవేమభూపతి మజ్జసాలకె వేమూరి తూర్పుపొలానను పదిహేనుపుట్లక్షేత్రమున్నూ".

ఇక యెఱ్ఱాప్రెగడప్రశంస వచ్చినసందర్భము "యఱ్ఱయప్రగడగారికి తాడినగరపు పొలమున ఇరువుట్టి ౫౭, వేమూరిపొలాన ౫౦ బెరసి కేసరిపాటి ౫౩ కండ్రికె"

ఈశాసనమునందు పెక్కు బ్రాహ్మణ విద్వత్కుటుంబములు వారి ఇండ్లపేళ్ళతోను గోత్రములతోను పేర్కొనబడినవి.

కృతికర్తయేయని కొందరు భావించి ఆతనిచరమదశను 1364 సంవత్సరమువరకును పొడిగించుచున్నారు. దీనిసత్యాసత్యములు ఊహపైమాత్రమే ఆధారపడి యుండుటచే నింతకుమించి చెప్పజాలము. ప్రబంధపరమేశ్వరుని సాహిత్యజీవితము 1345 సంవత్సరమునకుతరువాత వ్యాప్తి నందినట్లు కాన్పింపదు.

ఎఱ్ఱనార్యునకు ప్రబంధపరమేశ్వరుడనియు, శంభుదాసుడనియు బిరుదములుకలవు. ప్రబంధపరమేశుడనుబిరుదు అరణ్యపర్వశేషోన్నయముచే కలిగినట్లు కవి తన నృసింహపురాణమున సూచించియున్నాడు. ఈశ్వరభక్తుడగుటచే శంభుదాసుడను లక్షణాభిధేయము కలిగెనట. ఈయన శివగురువు శంకరస్వామియతీంద్రుడు. శివభక్తుడయ్యును ఎఱ్ఱనార్యుడు "బరఁగిన గోవిందగుణాదరసంభృతసౌమనస్యధన్యుఁడు." శివకేశవాభేదమును పాటించిన యద్వైతసుస్థిర నిలయుడు. తాను ధర్మైకతత్వరాత్ముడైనట్లు అరణ్యపర్వాంతపద్యమున మహాకవి నుడివినాడు. ప్రోలయవేమారెడ్డి యీకవిని ప్రశంసించినవిధము అర్థవంతముగానున్నది.

సకలభాషాకవిత్వవిశారదుఁడవు
సాధుసమ్మతుఁడవు నిత్యసౌమ్యమతివి
భవ్యుడఁవుగాన నీమీఁదఁ బరఁగఁబక్ష
మేను గలిగియుండుదు నెప్పు డెఱ్ఱనార్య

హరి - పీఠిక.

## కవినివాసస్థానము.

ఎఱ్ఱనార్యునిపూర్వులు వేగినాటియందుండినవారు. తాతయైన ఎఱపోతసూరి 'వేఁగినాటఁ గరావర్తివృత్తిమంతుఁడు' అని నృసింహపురాణమున నీతడు వర్ణించియున్నాడు. కరావర్తి యొకగ్రామ మనియు దానికీతడు కరణమువంటి యుద్యోగి కావచ్చుననియు కొందరూహించినారు. కరావర్తి - కరావర్తి - పన్నులువసూలుచేయు రాజకీయోద్యోగమనియు, ఎఱపోతసూరి యట్టినైయోగికుడనియు కొందరు భావించిరి. ఎఱ్ఱనార్యుని తొలివయస్సు పాకనాటి యందలి గుడ్లూరులో కడచినట్లు అరణ్యపర్వశేషాంతమునందలి పద్యమువలన తెలియవచ్చుచున్నది. ఎఱ్ఱనయో ఆతనితండ్రి సూరనార్యుడో పాకనాటియందు గుడ్లూరులో స్థిరనివాస మేర్పరచుకొనిరి. ఇచ్చటిదైవము నీలకంఠేశ్వరస్వామి. అరణ్యపర్వశేషరచనముచే కవితా ప్రసిద్ధి నందియున్న ఎఱ్ఱనార్యునకు ప్రోలయవేముని సోదరుడైన మల్లారెడ్డితో పరిచయమును ఆతనియాశ్రయమును లభించెను. మల్లారెడ్డి మహాసమర్థుడైన సేనానియై అన్నగారిపక్షమున పెక్కురాజకీయభారములు వహించుచుండెను. ఈకాలమునకాతడు చెదలువాడనగరమునందు సేనాధ్యక్షుడుగానుండుటచే ఎఱ్ఱాప్రెగడకూడ ఆనగరమునకు నివాసము మార్చియుండును. ఎఱ్ఱాప్రెగడయింటిపేరు చెదలువాడవారని కొందరు పేర్కొనుటకిది యాధారమై యుండును. విప్రనారాయణచరిత్రమును వ్రాసిన చెదలువాడమల్లనకవి, తాను ప్రబంధపరమేశ్వరుని వంశము లోనివాడనని చెప్పుకొనుచు, ఆతడుచెదల్వాడనిలయుడనని వాకొనెను. ఎఱ్ఱనార్యునియింటి పేరు చెదలువాడఅయినను కాకున్నను ఆతడుచెదల్వాడనిలయుడనుట విశ్వసనీయము. కొంతకాలము

నకు మల్లారెడ్డి యీకవీంద్రుని తనయాగ్రజునకు సమర్పించగా ప్రోలయవేము డీతనిచే రామాయణహరివంశములను చెప్పించుకొనెను. ఈకాలమునందు కవి రెడ్డిరాజ్యమునకు మొదటి రాజధానియైన యద్దంకియందు నివసించియుండును. చెదలువాడ, అద్దంకినగరములు గుండ్లకమ్మ నదీతీరముననున్నవి. గుడ్లూరుగ్రామము కందుకూరుతాలూకాలో నున్నది. ఎఱ్ఱాప్రెగడ వారను వంశనామమిప్పుడు ఆంధ్రనియోగులందు సుపరిచితముగానున్నది. వీరికీయింటిపేరు ఎఱ్ఱనార్యునుండివచ్చెనేమో. పోతాప్రెగడవారును ఉన్నారు. వీరు బమ్మెరపోతరాజుగారి పేరున గృహనామమేర్పరచుకొనిరో తెలియదు. ఇట్లే విస్సాప్రెగడ మున్నగు ప్రెగడశబ్దయోజితములైన ఇంటిపేళ్ళు పెక్కుగలవు.

## కవిరచనలు – వానియానుపూర్వి.

ఎఱ్ఱనార్యుడు నాలుగుగ్రంథములు రచించినట్లు తెలియుచున్నది. ఆరణ్యపర్వశేషము, నృసింహపురాణము, రామాయణము, హరివంశము వీనిలోరామాయణ మిప్పుడు బొత్తుగా లభించుటలేదు. లాక్షణికులైన కూచిమంచి తిమ్మకవియు, కస్తూరిరంగకవియు ఎఱ్ఱాప్రెగడ రామాయణములోనివనిచెప్పి కొన్నిపద్యము లుదాహరించియున్నారు. ప్రస్తుతము లభించు భాస్కరరామాయణమునందు ఎఱ్ఱనార్యునిపద్యములు కొన్నికలవని కొందరు భావించుచున్నారు. ఎట్లైనను ప్రధానగ్రంథము నష్టమగుట యాంధ్రభాషకు పెద్దలోపము. ఈకవీంద్రుడు కవిసర్పగారుడమను ఛందోగ్రంథము రచించెనని చెప్పుదురుగాని దానికాధారము కనబడలేదు. రామాయణముతోగూడిన నాలుగుగ్రంథములును ఏక్రమములో వ్రాయబడినవి యను సంశయముపై విమర్శకులందు తీవ్రవాదోపవాదములుకలవు. ఈకవి లక్ష్మీనృసింహపురాణమునందు ఆరణ్యపర్వశేషమును, హరివంశమునందు రామాయణమును పేర్కొనెను. ఇట్లీతనిగ్రంథములు రెండు జంటలుగా విడివడుచున్నవి. అరణ్యపర్వశేషము – నృసింహపురాణము ; రామాయణము – హరివంశము. ఈజంటలలో నేదిపూర్వము, ఏదిపరము నను అంశముపైననే వివాదము కేంద్రీకృతమైనది.

తమతమ వాదములను సమర్థించుకొనుటకై విమర్శకులు చేసిన యూహలును ప్రౌఢవాదములును పెక్కుగలవు. ఆరణ్యపర్వశేషము వ్రాయుట శుభావహముకాదనియు, నన్నయభట్టునకు మతిభ్రమణ కారణమైన యీ గ్రంథభాగమును ఎఱ్ఱనార్యుడు తొలుదొల్త చేపట్టియుండడనియు, కావున హరివంశ రచనానాంతరమే దీనిని వ్రాసియుండునని వీరివాదము. లక్ష్మీనృసింహపురాణము నీతడు అహోబల నృసింహదేవునకు అంకితమిచ్చెను. ఏరాజునకును అంకితము చేయలేదు. రామాయణ హరివంశములను ప్రోలయవేమారెడ్డి యభ్యర్థనపై చెప్పియున్నాడు. కవులు సాధారణముగా తమ జీవితారంభమున నరస్తుతి చేసి, కావ్యములు రాజులకంకితమిచ్చి, జీవితావసానదశయందు వైరాగ్య చిత్తవృత్తికలవారై ఈశ్వరాంకితముగ కావ్యములు వ్రాయుచుందురు. ఈ న్యాయమునే ఇక్కడకూడ అనువర్తింపజేసినచో రామాయణ హరివంశములు తొలిరచనలనియు, ఆరణ్యపర్వ లక్ష్మీనృసింహ పురాణములు ఎఱ్ఱనార్యుని చరమదశా కావ్యములనియు స్థాపింపబడునని వీరినమ్మకము. ఇది సంభావ్యముగనే ఉన్నను

కవులందరి విషయమున నిది వర్తించునను నియమము ను లేదు. ఒక్కొక్క కవికి లబ్ధప్రతిష్ఠుడగు వరకును రాజాశ్రయము లభింపకపోవచ్చును. ఎఱ్ఱనార్యుని విషయమున నిట్లే జరిగియుండ వచ్చును. ఈ మహాకవి సౌమ్యమతియనుట ప్రత్యక్షరసత్యము. ఆర్భాటముతోగూడినవాడు కాడు. తన జన్మస్థలమైన గుడ్లూరుగ్రామమున నివసించుచు, మహాకవులైన నన్నయ తిక్కన గార్ల సాహిత్య తపస్సును సంభావనతో చింతించుచు కాలము గడపినవాడు.

నన్నయ తిక్కనలయం దీతనికి పరమప్రామాణ్యబుద్ధికలదు. దీనినాతడు అడుగడుగునకు తేటపఱచుచుండును. హరివంశమునందలి 'ఉన్నత గోత్రసంభవము' 'తన కావించిన సృష్టి' మున్నగు కవిస్తుతిపద్యము లిందుకు తార్కాణము. ఇంతటితో తృప్తిపడక నిర్మత్సరుడైనయెఱ్ఱ నార్యుడు తిరిగి తనసద్భావమునిట్లు వెల్లడిచేసినాడు.

"నన్నయభట్ట తిక్కకవినాథులుచూపిన త్రోవ పావనం
బెన్నఁ బరాశరాత్మజమునీంద్రుని వాఙ్మయ మాదిదేవుఁడౌ
వెన్నునివృత్త మీవు కడువేడుకతో విను నాయకుండ వి
ట్లెన్నియొ సంఘటించె మదభీప్సితసిద్ధికి రాజపుంగవా" హరివంశము.

నన్నయ తిక్కనలయందింత గౌరవాతిశయము కలవాడగుటచే ఎఱ్ఱనార్యుడు తన కవిత్వప్రారంభదశయందే వారి వాఙ్మయమైన ఆంధ్రమహాభారతము ఈషదసంపూర్తిగా నున్న దని గుర్తించి, దానిని పూరించి వారి నారాధింపగోరుట మిక్కిలి సహజము. సాహసించి యట్లే చేసి కవిత్రయమునందు పూజ్యస్థానమును సంపాదించుకొనెను.

పెద్దలయందరి సమ్మాన్యభావమే యీతనిని అరణ్యపర్వశేషరచనానంతరము లక్ష్మీ నృసింహ పురాణకథనమునకు ప్రేరేపించినది. తిక్కనామాత్యునకు తన పితామహునందువలెనే ఎఱ్ఱనార్యునకు తన తాతయగు ఎఱపోత సూరియందు మిక్కిలి గౌరవము. తన పేరివాడను నభిమానము తాతకు తనయందుగలదని యెఱ్ఱనభావము.

"ననుఁదన పేరివాఁడని మనంబున నెప్పుడు నాదరించుటల్
బనిచె గుణప్రసిద్ధియును భవ్యసమృద్ధియుఁ జేయు పుణ్యపుం
బనియఁట, మత్పితామహుఁడు ప్రాక్తనసంయమితుల్యవర్తనుం
డనఘయశుండు పూర్ణపురుషాయుషజీవితధన్యుఁ డిమ్మహిన్".

ఆంధ్రమహాకవులలో తండ్రులమీదకన్న తాతలమీద కొంచెము ఎక్కువ మొగ్గుచూపిన వారు తిక్కన యెఱ్ఱన శ్రీనాథులు. తన తాతయాదేశానుసారము ఎఱ్ఱనార్యుడు నృసింహ పురాణమును చెప్పి ముగించెను. ఇంతలో నీతని కవితాసౌరభము ప్రజలయందును ప్రభుమంది రములందును వాసింపగా, ప్రోలయవేమారెడ్డి తమ్ముడైన మల్లారెడ్డి మన కవీశ్వరుని ప్రతిభను విని యాతనిని చేరదీసెను. అతడే యెఱ్ఱనార్యుని 'అతతశ్రీతోడన్ సముపేతు' జేసెనట. మల్లారెడ్డి యేలకో ఈతనిచే నేకావ్యమును చెప్పించుకొనలేదు. దీనికి ముఖ్యకారణము మల్లా రెడ్డి శూరుడై కృచ్ఛములైన పెక్కు రాజకార్యములందు నియుక్తుడగుచుండెడివాడు. స్థానము

నుండి స్థానాంతరమునకు పోవలసినవాడగుచుండెను. రాజకార్యవశమున నీతడొకప్పుడు కురుమలూరియందును, చెదలువాడయందును, మోటుపల్లియందును వసింపవలసినవాడయ్యెను. కావ్యానుశీలనము, కావ్యశ్రవణము చేయుటకు వలసిన స్తిమితత్వము లేనివాడగుటచే ఎఱ్ఱనార్యునిచే ప్రబంధములు చెప్పించుకొనక యగ్రజుని యాదరపోషణములనందుటకై ప్రోలయ వేమారెడ్డికే యర్పించెను. రెడ్డిరాజ్యపు మొదటిరాజధానియైన యద్దంకిని చేరినపిమ్మటనే యెఱ్ఱనార్యుడు రామాయణ హరివంశములను నిర్మించెను.

ఎచ్చటనున్నను నన్నయ తిక్కనల మార్గమునవలంబించి పరాశరాత్మజమునీంద్రుని వాఙ్మయమును తెలుగులో వ్రాయుట యెఱ్ఱనార్యుని మహాసంకల్పము. అందును హరివంశము "భారత పరాంశమని బుధులు చెప్పుదురు". సంసారమునందు స్తిమితమేర్పడగనే యెఱ్ఱనార్యుడు తన పూర్వసంకల్పము ననుసంధించి హరివంశమును వ్రాసి ముగించుటలో జీవితభానుడస్తాద్రిపై నాసీనుడయ్యెను. జన్మయుద్ధన్యమయ్యెను. హరివంశమువంటి పారావార గాంభీర్య సదృశ కవిత్వస్ఫూర్తికల మహారచనానంతరము ఎఱ్ఱనార్యుడు తిరిగి కలముపట్టుటకు ఉత్సహింపడనియే భావింపవలెను.

కావున అరణ్యపర్వశేషము, లక్ష్మీనృసింహపురాణము, రామాయణము, హరివంశము ఇదియే యెఱ్ఱనార్యుని కావ్యముల యానుపూర్వియని నేనును భావించుచున్నాను.

ఎఱ్ఱనార్యునిగ్రంథములలో ప్రకృతము మనకు అరణ్యపర్వశేషముమాత్రమే ప్రస్తుతమగుటచే దానినిగురించి కొంచెము విస్తరించి సమాలోచనచేయుదును. అరణ్యపర్వపూరణ విషయమై విద్వల్లోకమునందు కొంతవివాదము బయలుదేరినది. ఈ రెండువర్గములను శిథిలపూరణవాదులు, స్వతంత్రరచనావాదులు అని సౌకర్యమునకై పిలుతము. శిథిలపూరణవాదులు అనగా నన్నయయే అరణ్యపర్వమునంతయు వ్రాసెననియు, అది యేకారణముననో నాల్గవ యాశ్వాసమునడిమినుండి నష్టముకాగా ఎఱ్ఱనార్యుడా శిథిలభాగములను పూరించుటమాత్రము చేసెనువారు. స్వతంత్రరచనావాదులనగా, నన్నయ అరణ్యపర్వమును పూర్తిచేయకయే దివంగతుడయ్యెననియు, తిక్కనసోమయాజి విరాటపర్వమునుండి యారంభించి రచనచేసియుండగా అమిగిలిపోయిన యరణ్యపర్వభాగమును ఎఱ్ఱనార్యుడాంధ్రీకరించి, 'నన్నయ తిక్కనల మహోద్యమమును పూర్తిచేసెననియు విశ్వసించువారు. ఇప్పుడు పెక్కుమంది స్వతంత్రరచనామతమునే ఆదరించుచున్నారు. శిథిలపూరణవాదమునకు విద్వదామోదము అంతగా లేదు. కందుకూరివీరేశలింగముపంతులుగారు, చాగంటిశేషయ్యగారు మున్నగువారు స్వతంత్రరచనావాదులు. నడకుదుటి వీరరాజుపంతులుగారును ఇటీవల శ్రీమాన్ వేదాల తిరువెంగళాచార్యులుగారును శిథిలపూరణవాదమును సమర్థించినవారు.

శిథిలపూరణవాదస్వరూప మిట్లున్నది. పూర్వకవులలో పెక్కురు అరణ్యపర్వమంతయు నన్నయ కర్తృకముగాసూచించిరి. ఉదాహరణకు తిక్కనసోమయాజి

"ఉ॥ దాదిఁదొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుండొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" విరా-1-6

అనిలిఖించెను. మారన మార్కండేయపురాణమునందు "భారతసంహితన్ మును త్రిపర్వములెవ్వఁడొనర్చెనట్టి...నన్నయభట్టుఁగొల్చెదన్" అనిస్తుతించెను.

నన్నయను స్తుతించినవారు పలువురిట్లే చెప్పుచు వచ్చిరి. లాక్షణికుడై బహుగ్రంథపరిశీలనముచేసిన అప్పకవియు నిట్లేనుడివెను.

"ఆమూడుపర్వములలో
నామాన్యుఁడు నుడువు తెనుఁగు ఒనరిచికొని కృతుల్
దామ రచించిరి తిక్కన
ధీమణి మొదలైన తొంటి తెలుఁగుకవీంద్రుల్"

శబ్దశాసనమహాకవి చేసినప్రయోగములనే ప్రమాణముగభావింపవలెనని కవిరాక్షసుడను లాక్షణికుడు నియమముచేసెనట. ఈసందర్భమును చెప్పుచు అప్పకవి పైరీతినివ్రాసెను. తిక్కనాదులు నన్నయభట్టారకుని స్తుతించుఘట్టములలో నాతడువ్రాసిన గ్రంథభాగమును సవివరముగ పేర్కొనుట సంభవింపదు. వారివాక్యములను సామాన్యసంవాదములుగానే గైకొనవలెనుగాని ప్రత్యక్షరకథనముగా తీసికొనరాదు. తాళపత్రప్రతులన్నింటను అరణ్యపర్వము నాల్గవయాశ్వాసములోని 'శారదరాత్రులు' అనుపద్యముతో నన్నయకవిత్వము ముగిసినట్లు సూచనకలదు. *స్ఫురదరుణాంశురాగరుచి (ఆ-4-142) యనుపద్యమునుండి యెఱ్ఱాప్రెగడకవిత్వమని వ్రాయబడియున్నది. సమస్తతాళపత్రగ్రంథసాక్ష్యమును మూకఉమ్మడిగా అవిశ్వసనీయమని త్రోసిపుచ్చుటకు ఆధారములేదు. విజ్ఞలోకమునందు పరంపరగావచ్చుచున్న విశ్వాసమునకు తాళపత్రకథనము నిదర్శనము.

ఇంతేకాక ఎఱ్ఱనార్యుడు స్వయముగ నేమిచెప్పెనో దానిని మనము పాటించితీరవలెను. ఆతడు నిత్యసౌమ్యమతి. ఉదారశీలముకలవాడు. తానుచేయనికార్యమును తనునిర్వహించినట్లు ప్రగల్భములు పలుకువాడుకాడు

"ఎఱ్ఱనార్యుండు సకలలోకైకవిదితుఁ
డయిననన్నయభట్ట మహాకవీంద్రు
పరమహారమ్యతాంశ ప్రశస్తిఁదన్న
జెందుటయు సాధుజనహర్ష సిద్ధిఁగోరి (ఆ-7-4[illegible])

క. ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంతదోఁప దద్రచనయకా
నారణ్యపర్వశేషము
పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగాన్" (ఆ-7-[illegible])

---

*ఎఱ్ఱనార్యునికవిత్వ మీపద్యముతో నారంభించుచున్నట్లు అప్పకవి కంఠోక్తిగా వాకొనియున్నాడు. (అప్ప-4-73) గ్రంథాదియందు నగణముండుట శుభప్రదమని చెప్పుచు ప్రబంధపరమేశ్వరుడు 'స్ఫురదరుణాంశు'పద్యముతో నారంభించెనని వివరించెను.

నన్నయభట్టునందుగల పరమగౌరవముచే ఆతనియనుగ్రహమే (నన్నయప్రతిభయందలిలేశము) తనయందుసంక్రమించి తనచేత అరణ్యపర్వశేషమును చెప్పించెనని యెఱ్ఱన చెప్పుచున్నాడు. అట్లు రచించుటయందు నన్నయరీతినిగూడ కొంతవఱకు పొందుపరచగలిగితినని గర్వించు చున్నాడు. నన్నయరచించిన అరణ్యపర్వాంత్యభాగములను చెదలు తినివేయగా, కీటజుష్టమైన పద్యములనుమాత్రము పూరించినచో నెఱ్ఱనార్యు డింత వినయగంభీరముగా నుడివియుండునా? మఱియు తనకు ప్రబంధపరమేశ్వరబిరుదము ఆరణ్యపర్వశేషపూరణముచే లభించినట్లు కవి వేరొకచో సూచించియున్నాడు.

"ఉన్నతసంస్కృతాది చతురోక్తిపదంబులఁగావ్యకర్తవై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁడనంగ నరణ్యపర్వశే
షోన్నయమంధ్రభాష సుజనోత్సవమొప్పఁగ నిర్వహించితే
నన్నయభట్ట తిక్కకవినాథులకెక్కిన భక్తి పెంపునన్" — నృ. పు.

కవిప్రోక్తములై యసందిగ్ధములైన యీవాక్యములను త్రోసిపుచ్చుటకు కారణము కాన్పింపదు. శిథిలపూరణవాదులు 'శేషోన్నయనము' అనుపదబంధమును బహుధా అన్వయించి యెఱ్ఱన అరణ్యపర్వభాగమును స్వయముగ వ్రాయలేదనియు, క్రిమిదష్టభాగములను నేర్పుతో విలిఖించె ననియు సాధించుటకు యత్నింతురుకాని అదియంతయు ప్రౌఢవాదము. వారితర్కశౌండీర్య మును స్థాపింపజాలునేమోకాని నన్నయ అరణ్యపర్వమునంతను ఆంధ్రీకరించెనని స్థాపించుటకు చాలదు. చెదలు తినిన కతిపయాక్షరపూరణమాత్రముచే లోకము ఎఱ్ఱనార్యుని మహాభారత కవిత్రయములో నొక్కనిగా సంభావించియుండదు.

కావున చిరకాలానురతమైన విద్వజ్జన విశ్వాసముమేరకు మనమును ఆరణ్యపర్వములో నన్నయ వ్రాయజాలక విడిచినదానిని శంభుదాసమహాకవి వ్రాసి ధన్యుడయ్యెననియే విశ్వ సింతము. అరణ్యపర్వములో నీతడు రచించినభాగము మూడున్నరయాశ్వాసములు, సుమారు 1600 గద్యపద్యములు. ఇదియొక చిన్నప్రబంధమంత యున్నదనుటలో సందేహములేదు. ఎఱ్ఱనకు పూర్వమిట్టి చిన్నచిన్న గ్రంథములను గ్రంథభాగములను వ్రాయుట విరివిగాలేదు. కాని బొత్తుగాలేకపోలేదు. తిక్కనామాత్యుని నిర్వచనోత్తరరామాయణము, కేతనదశకుమార చరిత్రము ఉండనేయున్నవి. నన్నెచోడుని కుమారసంభవము వీనికన్న విస్తృతికలది. అందు ప్రబంధపుపోకడలు స్ఫుటముగానున్నవి. ఎఱ్ఱనార్యునిగ్రంథభాగము అప్రయత్నముగనే ఋతువర్ణనతో ఆరంభించి ప్రబంధలక్షణవంతమైనది. పరిమితమైన విస్తృతి చూచియు, ప్రబంధోచితవర్ణనతో యెత్తుగడ చూచియు సారస్వతేయులు దీనిని ప్రబంధమేయని సంభావించి యుందురు. అది యెఱ్ఱనకును సమ్మతమేఅయినది. అప్పటికి పుట్టిన చిన్నప్రబంధములలో నిది తలమానికమని భావించి లోకమీతనిని ప్రబంధపరమేశ్వరుడని భూషించి యుండవచ్చును.

విపులశబ్దశాసనుడు నన్నయభట్టు. ఎఱ్ఱనార్యుడింకను యువకవి. మహాకవిత్వ ప్రాంగణము నందు కాలూదుటకు ఉత్సహించుచు సంకోచించుచున్నవాడు. యువకవియని ఎందుకను

చున్నాము అనగా అరణ్యపర్వశేషము నీతడు క్రీ. శ. 1310-20 ల నడుమ వ్రాసియుండవలెను. నృసింహపురాణమును ఈకాలముననే ముగించియుండును. ఎఱ్ఱనజన్మకాలము క్రీ. శ. 1280 ప్రాంతమని యూహించియున్నాము కనుక ఆరణ్యపర్వ, నృసింహపురాణ రచనాకాలమున కీతడు శ్రీనాథుడు పేర్కొన్న నిండుజవ్వనమునందున్నాడు. తిక్కనసోమయాజి 'మహాకవిత్వ దీక్షావిధి'ని ప్రాయము వ్రాలుకాలముననే అందుకొనెను. మహాభారత రచనాప్రారంభ ముహూర్తమున కితడు పరిణతవయస్కుడై నాడు. నన్నయభట్టుకూడ మహాభారత రచనా ప్రారంభకాలమునకు పండబారువయస్సుకలవాడైనట్లు తోచును. ఆతడప్పటికి 'అవిరళ జపహోమతత్పరుడు'గదా. వీరితో పోల్చినపుడు ఆరణ్యపర్వశేషపూరణమునాటికి ఎఱ్ఱనార్యుడు యువకుడే. కావుననే నన్నపార్యుడు నిర్వహించిన మహాగ్రంథమును తాను చేబట్టుటకు అధికారముకలదా? యని శంకించుచు, నన్నయభట్టు 'సరససారస్వతాంశప్రశస్తి' తన్నుచెందిన దని విశ్వాసమువహించి, భయముతోను ఆత్మప్రత్యయముతోను ముందుకు దూకినాడు శంభుదాసుడు.

ఆరణ్యపర్వమును పూరించుటకు సంకల్పించునప్పుడు ఎఱ్ఱనార్యుని చిత్తవృత్తి యెట్లుండెను? నన్నయ తిక్కనలమీదిభక్తిచేత వారు అసమగ్రముగా విడిచిన యరణ్యపర్వ భాగమును వ్రాసి, వారారంభించిన మహోద్యమమును సంపూర్తినొందించుట. ఇందుకు తన కర్తృతకలదో లేదోయను వెఱపు. నన్నయభట్టు సారస్వతతపస్సులో లేశభాగము తన్నుసంక్రమించి తనచేత ఆమహాకార్యమును సేయించుననువిశ్వాసము. వినయశీలుడగుటచే ఎఱ్ఱనార్యుడు కర్తృత్వబాధ్యత తనమీద పెట్టుకొనదలపలేదు. బమ్మెరపోతరాజు భాగవతరచనాసందర్భమున భావించినట్లే ప్రబంధపరమేశ్వరుడును తలపోసియుండును.

పలికెడిది భాగవతమట
పలికించెడివాఁడు రామభద్రుండఁటనే
పలికినభవహరమగునఁట
పలికెద వేఱొండు గాథఁ బలుకఁగనేలా.

"నన్నయ తిక్కనలు చూపినత్రోవ పావనంబు" అని యాతని నిశ్చయము—అందుచేత భారమంతయు శబ్దశాసనుమీద నిడి సాగిపోవదలచినాడు. ఇప్పుడాతని లక్ష్యములిట్లున్నవి. సాధు జనహర్ష సిద్ధికోరుట. తత్కవితారీతియు కొంతదోవ—అనగా నన్నయ భట్టారకుని రచనా విధానమును సాధ్యమైనంతవరకు అవతరింపజేయుట. కవీంద్రకర్ణపుటపేయముగా కవిత్వము చెప్పుట. ఈ మూడవ లక్ష్యము మొదటిదైన సాధుజనహర్షమునందు గతార్థము కాలేదాయని తోపవచ్చును. కొంచెము భేదమును మన మూహింపవచ్చును. మహాభారతము ధర్మప్రధానమైన గ్రంథము కావున అది యసమగ్రముగ నుండిపోయెనే యని కించపడువారు సాధుజనులని మనము సంభావింపవచ్చును. అది పూర్తియైనచో వీరు హర్షింతురు. ఇంక రసదృష్టితోను ఔచిత్యదృష్టితోను పరికించి తలలూచువారు కవీంద్రులు. వీరినికూడ మెప్పించుటకు ప్రబంధపరమేశ్వరుని యత్నము. లేదా నన్నపార్యుడు తనకవితాలక్షణములుగా పేర్కొన్నవానితో నివి సంవదించునని భావింపవచ్చును.

"సారమతిన్ గవీంద్రులు ప్రసన్నకథా కవితార్థయుక్తిలో
నారసి మేలునా నితరులక్షర రమ్యతనాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు"

ఎఱ్ఱనార్యుడు చెప్పిన సాధుజనులు ప్రసన్నకథాకలితార్థయుక్తిని గోరువారు. అక్షరరమ్యత నాదరించువారు కవీంద్రులు. ఇట్లుభయవర్గములవారిని ఆనందింపచేయు భవ్యలక్ష్యముతో అరణ్యపర్వశేష రచనకు నడుముకట్టినాడు శంభుదాసుడు.

'తత్కవితారీతియు గొంతతోప' అను మాటలయందలి సముచ్చయార్థముచే అస్మదీయ కవితాప్రాగల్భ్యమునుగూడ కొంత చవిచూపుదునను యుక్తసంకల్పము ఆకులచాటు పూవువలె తొంగిచూచుచుండవచ్చును. అంతమాత్ర మాత్మవిశ్వాసము లేనివాడైనచో ఎఱ్ఱనార్యుడు మహాభారత పూరణమునకు సాహసింపగలడా? అట్లుకానిచో నిచ్చటి సముచ్చయార్థముచే తనకు ద్వితీయకవితా గురువైన కవిబ్రహ్మ తిక్కన సోమయాజి కవితారీతినిగూడ కొంత ప్రదర్శింతునని వ్యంగ్య విలసనముచే సూచించి యుండవచ్చును. నన్నయ తిక్కనల మార్గములను రెండింటిని ప్రతిబింబింపచేయుచు, తనస్వకీయ స్వతంత్రకవితారీతిని వెలయించుచు రచనచేయనెంచినవాడు ఎఱ్ఱనార్యుడు. "కేవలతయానుసర్పత్యుభేచ యేయమ్ యథాతథమ్ భాషా"అని యాంధ్రభాషనుగూర్చి యాంధ్రశబ్ద చింతామణియందు వాగనుశాసనుడు నుడివినదానితో దీనిని పోల్చవచ్చును. సంస్కృత ప్రాకృతములు మూలముగా గలదియైనను ఆంధ్రభాష తన ప్రత్యేకతను నిలుపుకొనుచునే వర్ధిల్లినట్లు నన్నయ తిక్కనల కవితారీతులను కొంతవఱకనుసరించియు స్వతంత్ర గమనముకలది ప్రబంధపరమేశ్వరుని సరస్వతి. నన్నపార్యుని మూడవకవితా లక్షణమైన "నానారుచిరార్థసూక్తినిధి" త్వమున్నది. దీనిప్రశంస రాలేదేమని లోపవచ్చును. ఎఱ్ఱనార్యుని కవితలో నీగుణము ప్రధానముగా నున్నదని శ్రీనాథుడు మనకు తెలియజేసినాడు.

"పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరునితేర సూక్తివైచిత్రికొక్కొక్కమాటు"కాశీఖండము.

'తద్రచనయకా నారణ్యపర్వశేషము'ను ఎఱ్ఱనార్యుడు పూరించుటలోని యుద్దేశమేమై యుండును? అరణ్యపర్వము వ్రాయుచుండగా నన్నయభట్టు వేములవాడ భీమకవి శాపగ్రస్తుడై దివంగతుడయ్యెనను వాడుక లోకములో నుండుటచే తనకును అట్టియశుభప్రాప్తికలుగునని భయపడి నన్నయపేరనే శేషగ్రంథభాగమును వెలయించెనని చెప్పుదురు. ఈప్రవాదము అప్పకవినాటికేకలదు. శుభాశుభగణముల వివరించుచు (4–73) నగణమునుగూర్చి యాతడిట్లు వ్రాసినాడు. "నగణం బమృతాంధోనాథ దేవతాకంబుగాన సకలభోగప్రదంబని నలోదయంబునందు "స్యాదయసదా"యని కాళిదాసుండును, అరణ్యపర్వావశిష్టంబునందు భీమకవి శాపభయంబున జనమనాగోళి" స్ఫురదరుణాంశురాగరుచి" యని శంభుదాసుండును," విజ్ఞుడైన శంభుదాసమహాకవి యిట్టి ప్రవాదములకు చెవియొగ్గియుండెనా? యని సందేహము జనించును. ఎట్టివారును తమ సమకాలమునందలి విశ్వాసములకు అతీతులు కాకపోవచ్చును. అయినను వారు కావ్యశూరులును స్థితప్రజ్ఞులును అగుటచే మూఢవిశ్వాసములకులోనయి సత్కార్యాచరణము

నుండి విరమింపరు. ఈనీతినే యెఱ్ఱనమహాకవి మనకు బోధించినవాడాయెను. పాముకాటు చీరతో తుడిచినంతమాత్రమున పోవునా? పేరుమార్చి నన్నయపేర వ్రాసినంతమాత్రమున భీమకవి శాపప్రభావము పరాస్తమగునని శంభుదాసుడు భావించియుండునా? అందుచేత నన్నపార్యునియందలి భక్త్యతిశయముచేతను, ఇది తనతొలిరచనయగుటను, గ్రంథభాగము మహాభారత సమగ్రకావ్యదృష్ట్యా మిక్కిలి చిన్నదగుటచేతను దీనిని తొంటికవీంద్రునిపేరనే చెల్లనిమ్మని నిశ్చయించి ఎఱ్ఱన తన నిర్మత్సరస్వభావమును ప్రకటించినవాడయ్యెనని మనము విశ్వసించినను తప్పుకాబోదు.

నన్నపార్యుని కవితారీతిని ఎఱ్ఱనఎట్లు కొంతలోపింపజేసెనో విశ్లేషించిచూతము. నన్నయ కవితాగుణమైన ప్రసన్నకథాకవితత్వమును ఎఱ్ఱనార్యుడు వ్రాసిన పరీక్షితుడనురాజు చరిత్రయందు (3-4-318) చూడనగును. కథను ప్రసన్నముగా అనగా నవాంతరకథాసంశ్లిష్టత లేకుండ నడపుటయు, సంగ్రహకథనము, సులభస్ఫూర్తికల రసాలంకారవిన్యాసము - ఇవి ప్రసన్నకథా కవితత్వలక్షణములుగా భావింపవచ్చును. నన్నపార్యుని రురుడుప్రమద్వరకథ, తపతీసంవరణుల కథ - ఇట్టివి ప్రసన్నకథాకథనమునకు లక్ష్యములుగా చెప్పవచ్చును. ఎఱ్ఱనార్యుని పరిక్షితుని వృత్తాంతమునందివి చక్కగా సమ్మేళనము నొందినవి. సంవరణునివలెనే పరిక్షితుడును వేటకు బోయి యొకలతాంగి నరణ్యమునందు చూచి యామెను ప్రేమించెను. అంతవారికిట్లు సంభాషణ నడచెను.

"ఎవ్వరిదానవంబుజదళేక్షణ యేకతమిట్లు లేల నీ
వివ్వనభూమియందుఁ జరియించెదు నావుడుఁ దండ్రిపంపునం
దివ్వనభూమియందుఁ జరియించెద నవ్వరుఁగోరి కన్య నే
నెవ్వరిదానఁగావలయు నేర్పడఁజెప్పుము రాజనందనా"

పరిక్షితుడాకన్యను తనదానినిచేసికొనెను. కాని యొకపూర్వనియమముచే నామె మడుగునందు మునిగి మాయమయ్యెను. రాజు తద్వియోగమును భరింపలేక మడువునందలికప్పలు తన ప్రియకాంతనపహరించెనని కనలి, ఎక్కడ మండూకములు కనబడినను చంపవలెనని యనుచరుల కాజ్ఞాపింపగా వారు నిర్దయులై భేకవధ గావింపజొచ్చిరి. ఈసన్నివేశము రురుడు పాములను జంపువృత్తాంతమును బోలియున్నది. మండూకనాయకుడెట్లో పరిక్షితునొప్పించి కప్పలవధను నిలుపుజేయించెను. సహస్రపాదుడనుముని రురునిట్లే సర్పఘాతమునుండి విరమింపజేసెను. కరుణాత్మకమై సంయమనముతోగూడిన సంగ్రహకథనమునకు సావిత్రీసత్యవంతులకథను పేర్కొనవచ్చును.

ప్రబంధపరమేశ్వరుని 'యక్షరరమ్యతా'గుణమును అడుగడుగునకు మనము ప్రత్యక్షీకరింతుము. అక్లిష్టమై సంభాషణాత్మకమైన వచనరచనయందీతడు తిక్కననుమించును. నన్నయకీడగును. ఇంద్రుడు కుమారస్వామితో విన్నవించుట (3-5-227) "ఏను దేవేంద్ర పదవినుండ నోడుదునెట్లనిన భవదీయతేజోవిశేషంబులు సూచి విస్మితులై కొందఱు నీకు నింద్ర

పదవియందు వేడ్క పుట్టినట్లుగా నేమేనిం జెప్పినావలనం గొఱగామి కల్పించి నీకును నాకును భేదంబుసేయం జూతురు దానంజేసి నీవు కుపితుండవయి నాయెడంగృపదప్పిన నెవ్వారికి వారింప నలవిగాదు." ఎట్టినార్యుని విశేషకవితాలక్షణముగా శ్రీనాధుడుగ్గడించిన సూక్తివైచిత్రిగూడ ఎడనెడ భాసించుచునేయుండును. ఈలక్షణమును సామెతలు, అర్థాంతరన్యాసములు, నానుడులు మున్నగువానిప్రయోగమునందేకాక మృదుమధురము చమత్కారవంతమునైన సంభాషణ శైలియందును చూడదగును. "వేడ్కనూనినవాఁడు దోసమెఱుంగునే" (3-4-339), ఎరవు సతమగునే (3-4-346) కొఱవిగొనివెత్తినే తలగ్రోఁకికొనఁగ (3-5-20) పతికార్యసిద్ధిసలుపు, జనులకీచనవెందును జనునకాదె (3-7-10) అతిశయముగబుద్ధిమంతుఁడగు బుధసేవన్ (3-7-428) రాక్షసాంగనలతో సీతాదేవిపలికిన తెంపుమాటలు

"అమ్మలార మీవలసినయట్లచేయుఁ
డింకనేటికిఁ దడయంగ నేను రాము
దప్పనొండొకపురుషుఁ జిత్తమునఁ దలఁప
నింతనిజము నాకును జీవితేచ్ఛలేదు" (3-6-592)

ప్రబంధపరమేశ్వరుడు తిక్కనసోమయాజి పలుకుబళ్ళను, రచనారీతులను, కవిత్వపు మెలకువలను తరచు జ్ఞప్తికి తెచ్చుచుండును. మునిపత్నులయెడ అగ్నిదేవుని కామవికారము ద్రౌపదియెడ కీచకునివర్తనమువలె నున్నది.

"అతివలు దన్నుఁజేరుటకు నాసపడుంబోరిఁ జేరుచోటనా
యతవిలసచ్ఛిఖాగ్రముల నల్లనవారలనంటుఁ గౌతుకం
బతిశయమై తదంగలతలాదటఁ గౌఁగిటఁజేర్పఁగోరుఁ గం
పితధృతియై కలంగుఁ గడుఁ బెల్లగు రాగరసంబుముంపఁగాఁ" (3-5-187)

ప్రసిద్ధమైన తిక్కనపద్యము - కలగెం దోయధిప్రకంబు గిరివర్గంబెల్ల నూటాడె. ఇత్యాది రచనకు దీటుగా కుమారస్వామి ప్రళయభైరవారావ భీషణంబుగా నార్చుటను ఎట్టనవర్ణించెను.

"కులశైలంబులుగ్రక్కదంగదలె దిక్కుల్ వ్రయ్య
లయ్యెన్ మహీవలయంబంతయు దద్దిరందిరిగె" (3-5-208)

అరణ్యమునందున్న ద్రౌపదినిజూచి సైంధవుడామెను మోహించి యనుచరుడైన కోటికాస్యుడనువానిచే సందేశమంపెను. వాడీసందర్భమున పలికినమాటలు సింహాబలునిప్రలాపమును దలపించును.

"పొలఁతి నీదుజీవితేశ్వరుఁడగు సుఖజీవితాత్ముఁ
డెవ్వఁ డబల నీనామమపై యింపుమిగులు
శబ్దమెయ్యది నాకు నిజంబుసెప్పుము" (3-6-151)

ద్రౌపది సైంధవుని భంగించిన విధముకూడ ఆమె కీచకుని వెఱపించినవిధముగనే యున్నది. (3-6-174 నుండి). పరిహాసమాడినట్లు వ్యంగ్యరీతిని మెత్తగా మందలించుటయు నీతడు తిక్కన వద్ద నేర్చిన మెలకువయే.

ద్రౌపది సత్యభామతో నన్నమాటలు

"మనసొప్పదు పురుషోత్తము
వనితవుగాఁదగవు నీవు వనరుహనయనా"
అని మేలంపుఁజందంబున దానివివేకహీనత యెఱుకపడ నాడి" (3-5-234

పాత్రలసంభాషణమునకును వారిచేష్టలకును పొత్తుకలుపు పద్ధతికూడ తిక్కన పెట్టిన యొరవడియే. ఘోషయాత్రకు పోవుటకై ఉపాయములాలోచించు దుర్యోధనాదులకు రాత్రియంతయు విచారింపగా నొకఉపాయముతట్టెను.

"అంతఁబ్రహసితముఖులై
ఒండొరులచెయి సఱచినవ్వుచు నమ్మువ్వురుం
దక్షణంబ సమంగనామధేయుండైన గోపాలకు
నొక్కనిం గఱపికొని" (3-5-359)

నన్నయకవితారీతిని తోపింపజేయుటకై ఎఱ్ఱనార్యుడవలంబించినపద్ధతులలో శబ్దశాసనుని ఛందోమార్గములనవలంబించుట యొకటియని చెప్పవచ్చును. ముఖ్యముగా నన్నయసీసములు, ఆటవెలదులు. తేటగీతులగతులను ప్రబంధపరమేశ్వరుడు బాగుగా పాటించెను. సీసములరీతులను గూర్చి అనంతామాత్యుడు, అప్పకవి మున్నగువారు వేర్వేరువిధానములను సూచించిరి. అనంతామాత్యుడు పదిరకముల సీసములను కల్పింపగా నన్నయభారతమునందు సప్తవిధ సీసములున్నట్లు అప్పకవివ్రాకొనెను. ఒకేప్రాసాక్షరమును 24 స్థలములందును పాటించినచో సర్వతః ప్రాససీసమని యనంతునిమతము. అనగా నాలుగుపెద్దపాదముల 8 దళములందును, ఎత్తుగీతి లేక ఆటవెలది 4 పాదములందును దళమునకు రెండుస్థానములచొప్పున 24 స్థానములలో నొకటేయక్షరము ప్రాసముగానున్నచో అది సర్వతఃప్రాససీసమనుట. ఇట్టియేకాక్షర ప్రాసములు 12 స్థానములలోనున్నచో అక్కిలిప్రాససీసమనియు, 6 చోట్ల ఒకేప్రాసాక్షర మున్నచో సమప్రాసీసమనియు అనంతుడు వ్యవస్థచేసెను. సమప్రాససీసమందు పెద్దపాదములలో 4 చోట్లను, గీతమునందు బేసిపాదములరెంటను ప్రాసయతియుండునట. అన్నిస్థలములందును వడినియమముగలది అక్కిలివడిసీసమని యాతడు పేరిడెను. ఇంక అప్పకవి దీనిని మఱియొక విధముగా దెల్పెను. యతిగాని ప్రాసనియమముగాని సీసమంతటనున్నచో సమసీసమనియు, ఎనిమిదడుగులందు ప్రాసనియమమున్నచో సర్వతఃప్రాససీసమనియు నాతడు నిర్దేశించెను. ఆరంభములయందు ప్రాసనియమముగలది అక్కిలి ప్రాససీసమనియు, మొదట నేయక్షరము వడి స్థానముననున్నదో తుదవఱకును దానినే నిల్పినచో నది వడిసీసమనియు, పదఖండములయందు ప్రత్యేకయతులు నిల్చినచో అవకలివడిసీసమనియు అప్పకవి చెప్పెను.

ఎఱ్ఱనార్యుడు అరణ్యపర్వశేషములో వాడినసీసములు, గీతలు, ఆటవెలదులును అప్పకవి విధానమునకు దగ్గరగానున్నట్లుతోచును. అరణ్యపర్వము నాల్గవఆశ్వాసమునందు ఎఱ్ఱనార్యుడు 45 సీసములు, గీతములు, ఆటవెలదులు వ్రాసెను. వీనిని విశ్లేషించిచూడగా నాకీక్రిందిమూసలు లభించినవి. య = యతి. ప్రా = ప్రాసము.

| | | |
|---|---|---|
| 1. | య / య | 28 పద్యములు |
| 2. | ప్రా / ప్రా | 6 |
| 3. | య - ప్రా / య - ప్రా | 6 |
| 4. | ప్రా - య / ప్రా - య | 3 |
| 5. | ప్రా - య / య | 1 |
| 6. | య / య - ప్రా | 1 |
| | | 45 |

వీనిలో మొదటిది పెద్దఅడుగులందును గీతి లేక ఆటవెలదియందును యతినియమముమాత్రమే కలది. రెండవరకము అంతటను ప్రాసనియమము కలది. మూడవది పెద్దపాదము మొదటియడుగున యతియు, రెండవకాలమున ప్రాసమును,గీతి1-3 పాదములలోయతియు 2-4పాదములలో ప్రాసయు పాటింపబడినది. (3-4-163) పద్యమును ఉదాహరణముగా గొనవచ్చును. నాల్గవ మూసయందు మూడవదానికి భిన్నముగా పెద్దపాదము మొదటిదళమున ప్రాసయు రెండవ దళమునయతియు, ఎత్తుగీతియందు 1, 3 (బేసిపాదములు)లో ప్రాసయు, 2, 4 (సరిపాదములు)లో యతియు కూర్పబడినవి. ఐదవరకమునందు పెద్దపాదములు పూర్వదళములందు ప్రాస నియమమును, ఉత్తరదళములందు యతియు, ఎత్తుగీతియంతటను యతివిధానమునుకలది. ఆరవ నమోనాలో పెద్దపాదములన్నిట యతియు, ఎత్తుగీతియందు బేసియడుగులయతియు, సరియడుగుల ప్రాసమును పాటింపబడినవి. 3,4 మూసలందలికూర్పు సాధారణముగా స్వతంత్రగీతములు, ఆటవెలదులందే నడచినట్లున్నది. పూర్తిసీసములందీక్రమము విరళవిరళముగానే కన్పించినది. కొన్నిచోట్ల ఈనియమము తప్పినది. కవియట్లు ఉద్దేశించియే వ్రాసెనో పాఠము తప్పినదో తెలియదు. అచ్చటచ్చట అఖండయతిగూడ గోచరించినది. 3-4-146 ; 3-4-182 ; 3-5-3 ; 3-5-33 వంటివి ఉదాహరణములు కాదగును.

మధ్యాక్కరప్రయోగమునందు ప్రబంధపరమేశ్వరుడు నన్నయమార్గము నవలంబింపక స్వతంత్రించెను. నన్నయ ఐదవగణము మొదలయతిని పాటింపగా, ఎఱ్ఱనార్యుడు తనమధ్యాక్కర

లలో నాల్గవగణము మొదట యతినిగూర్చెను. (3-4-310). అప్పకవిలక్షణము శంభుదాసుని ప్రయోగమున కనుగుణముగ నేయున్నది. నన్నపార్యుడు మధ్యాక్కరలను విరివిగ వాడెను. నన్నయభారతభాగమునందు 36 మధ్యాక్కరలుండగా, ప్రబంధపరమేశ్వరుడొకేటి మధ్యాక్కర వ్రాసెను. నన్నయకుపూర్వము, అనగా యుద్ధమల్లుని బెజవాడశాసనమునను, నన్నయ కాలమునందును జాతివృత్తము లనదగిన మధ్యాక్కర, తరువోజ, మున్నగునవి అసక్తితో వాడబడుచుండినట్లుతోచును. ఎఱ్ఱాప్రగడ కాలమున కవివాడుకలోనుండి తొలగినవి. నన్నయకవితా రీతిని కొంత ప్రదర్శింపదలచినవాడుగాన శంభుదాసుడు మచ్చునకొక మధ్యాక్కరరచించెను.

ఎఱ్ఱన భారతభాగములో రెండు మధురాక్కరలు వచ్చినవి. (3-6-352, 3-7-309) నన్నయ మధురాక్కరనొక్కమారే ప్రయోగించెను. (1-4-49) ఈపద్యలక్షణమునందు నన్నయ ఎఱ్ఱనలనడుమ భేదము లేదు. అప్పకవిలక్షణమును వీనికనుగుణముగ నేయున్నది. నన్నయ 12 తరువోజలను, ఎఱ్ఱన రెండుతరువోజలను రచించిరి.

నన్నయప్రయోగములను దలపించు మఱికొన్నింటిని గుర్తించుచున్నాము.

1. షష్ఠీనగాగమము – కర్మమునఫలంబు (3-4-168) ప్రళయంబునకీడు (3-4-230). ఒకవిభక్తికి వేరొకవిభక్తి ప్రయోగించుట. చతుర్థికిషష్ఠి. విలాపమునేసెవారికిన్ (3-5-355). తృతీయకుసప్తమి. తంత్రీవంపునందివ్వనభూమి (3-4-323)

2. శబ్దప్రయోగము – అకారాంతనపుంసకములమీద 'ము'వర్ణవిరహము. వాదము– వాదు (3-4-201) ధర్మము – ధర్మువు నన్నయయందే కలదు. ఎఱ్ఱనార్యుడు దీనిని సమాసమందు కూర్చెను. వనితాధర్మువు (3-7-332) 'వా'ప్రతి గకారమునకువకారము ఎలుగులుఅనుటకు ఎలువులు. (3-7-39) నేము అనునుత్తమపురుష బహువచనరూపము స్ఫుటముగా నొకచో గాన్పించుచున్నది. "దేవనేమండఱము" (3-7-14). దేశ్యనిత్యసమాసవిభ్రాంతి కుదాహరణము. 'ఉక్కఱ'యను శబ్దప్రయోగమునందు కాన్పించుచున్నది. హాల్లునకు 3-6-320 పద్యమును అచ్చునకు 3-6-345 పద్యమును చూడనగును. జటాయుశబ్దమునకు జట+ఆయు అనునట్లు పదచ్ఛేదము 3-6-346లో కన్పించుచున్నది. ఇదివువర్ణవిరహితరూపముతో ప్రయోగింపబడినది. జటాయునెఱుంగనెయంచు.

రేఫసంయుక్తమైనప్పుడు తత్పూర్వాక్షరము గురువుకాకుండుట. "గాండీవపవన ప్రేరిత" ఇచ్చటనకారము గురువుకాలేదు. ఇట్టివిధానము నన్నయకును సమ్మతమైనట్లు ముందు పేర్కొనిన మధ్యాక్కరనుండి యుదాహరింపవచ్చును. "అన్నప్రదాతయును భయత్రాత" 1-4-49 ఇచ్చట రేఫసంయుక్తపూర్వాక్షరము గురువగుటయు కాకుండుటయు వైకల్పికమనితెలుచున్నది. అన్నప్రదాతయన్నప్పుడు–న్న–గురువగుటయు, భయత్రాతయన్నప్పుడు–య–గురువుకాకుండుటయు చూతుము. పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతుపన్ను–3-5-416లో శంభుదాసుడును రేఫసంయుక్తపూర్వమును గురువుగాప్రయోగించెను. 'ఛ' సంయుక్తవర్ణమునకు ఎఱ్ఱయకవి 'చ'కారముతో మైత్రిచూపినాడు. 'చరితమత్యంత ధర్మసూక్ష్మంబుకరము' 3-5-3. నన్నయ

క్షుకారమునందలి కంఠ్యాక్షరముతోనే మైత్రి ప్రదర్శించెనందురు. 'క్షత్రియవంశ్యులై ధరణిఁగా పగఁబుట్టిన'అని శబ్దశాసనునిప్రయోగము. విశేష్యముతరువాత విశేషణముల ప్రయోగమును 3-4-318లో చూడనగును. ఇంద్రజిత్తునకు - ఇంద్రజి - యనుప్రయోగము 3-7-121 లో కవి చేసినాడు.

ఎఱ్ఱనార్యునకుఁ లుంటాకప్రయోగమునందు ప్రీతి. దీనినాతడు రెండుమార్లు వాడెను. లంకాలుంటాకుఁడుద్యల్ల ఘుతర-3-7-91, అఖిలలోకలుంటాకుఁడు-3-7-153. లుంటాకశబ్దము శాసనకవిత్వమునందును కాన్పించుచున్నది. కాకతిగణపతిదేవుడు చౌండసేనానియను వీరునకు 'ద్వీపిలుంటాక' అనుబిరుదు ప్రసాదించెనట. చౌండదండనాథుడు సముద్ర ద్వీపములనుండి రత్నములు తెచ్చి గణపతిచక్రవర్తి కోశాగారమును నింపినందులకై యాతనికీబిరుదములభించెను.

3. ధాతుప్రయోగములు - అనుభవింపఁజాలివి 3-4-171 అనుభవింపవలసినవియనుట. మీరుదివ్యులరు 3-4-180 జననంబునొందినారరువంటివి. ఎఱిఁగింపకుండు వాఁడయ్యెమదిన్ 3-6-51, నమ్మగనేరనయ్యెదన్ 3-7-460. ఇచ్చట అగుధాత్వనుబంధప్రయోగము. ఇట్టిరచన నన్నపార్యునకు సహజము, నొంచినట్టిదయ్యెడు 3-7-215 నొప్పించినట్లగుచున్నది. వర్తమానార్థమున తద్ధర్మము, ఆశీరర్థకమైన 'ఎడు'వర్ణకము బహువచనకర్తలతో నన్వయించుట. అశ్వినుల్ భువనములర్క-చంద్రులును బుత్త్రక నిన్ గృపఁ గాంచుచుడెడున్ 3-7-348. 'మరగు'ధాతువు ఎఱ్ఱనలో మంచియర్థమునందున్నది, భర్తబాగుగమరగన్ 3-5-316. నేడీధాతువు నింద్యార్థమున వాడబడుచున్నది. కర్మార్థకప్రయోగము - పత్యంబపల్కంబడున్-3-4-190.

ప్రబంధపరమేశ్వరుని కవిత్వకళ-ఈయనకవిత్వము సహజమై, ఉచితాలంకారరంజితమై, భావపుష్టికలిగి, అత్యుక్తులకు వెట్టిమొట్టి ఉత్ప్రేక్షలకును దూరమై, ఆర్షరీతికి సన్నిహితముగానే ఉండును. రసానుగుణమైనరీతిని వచరించుటకైకాబోలు కొన్నిసందర్భములలో నీమహాకవి ఓజోగుణయుక్తమైన రచనచేయును. ఈగుణము నన్నయయందుకంటె తిక్కనసోమయాజి యందును, తిక్కనను ఒరవడిగాపెట్టుకొన్న శంభుదాసునియందును బాగుగాకనబడును. ప్రబంధపరమేశ్వరుడు లోకజ్ఞుడు. ప్రకృతిని చక్కగాపరిశీలించి సానుభూతితో వర్ణింపగలవాడు. గంటమునెత్తికొనుటతోనే 'స్ఫురదరుణాంశురాగ'అని మనోజ్ఞశరత్కాలవర్ణనచేసినాడు. ఈతడు రామోపాఖ్యానమునందు మాయలేడిని వర్ణించినవిధము (3-6-327) మిక్కిలిసహజముగనున్నది. దానివివిధచేష్టలకు అనుగుణముగ వివిధక్రియలను వాడుట చమత్కారహేతువుగనున్నది. ఈకవి చేసిన పంపాసరోవరవర్ణనము లలితసమాసఘటితమై సుందరముగనున్నది. (3-6-364) పంపా సరస్సునందు గృహస్థధర్మముల నారోపించుట కడునొంపుగానున్నది. నాటకమునందు పతాకాస్థానకము రసోత్కటహేతువగునట్లే ప్రబంధమందును ఒక్కొక్క ప్రకృతివర్ణనము తత్సన్నివేశ గతరసదీప్తికి ప్రజ్వలనహేతువగును. సత్యవంతుడు కతిపయక్షణములలో యమపాశబద్ధుడు కాబోవుచున్నాడు. తనకురాబోవుప్రమాదము నాతడెరుగడు. ప్రియురాలిని రంజింపజేయుటకై లలితసుందర ప్రకృతిదృశ్యముల నాతడామెకు చూపుటకు ఉత్సుకుడగుట విధివైపరీత్యమునకును రసార్ణవకల్లోలమునకును పతాకస్థాయి.

కమనీయకమలినీకల్లోలవీథులఁ
  గదలురాయంచలగతుల యొప్పు
బహుపుష్పపల్లవప్రకర చిత్రితములై
  తనరారు తరులతాతతులసొంపు

ప్రియుఁడు వేలువేల ప్రీతిమైఁజూపుచుఁ
జెప్పుచును జనంగఁజిగురుఁబోఁడి
గనుచు వినుచు నిర్వికారసల్లాపమిం
పార నతని తెఱఁగు నరయుచుండె. (3-7-213)

తారతమ్యజ్ఞానముచేతగూడ భావసంక్షోభము రసప్రదీప్తియు గలుగుట ఎఱ్ఱనార్యుడు చక్కగా గుర్తించెను.

ధరణినాథతనయు తనువునఁ బ్రాదేశ
పరిమితాత్ముఁడగుచుఁ బ్రజ్వరిల్లు
జీవు వెడలఁదిగిచి చెచ్చెరనతిదీర్ఘ
భయదపాశనికరబద్ధుఁ జేసి (3-7-219)

జీవుడు ప్రాదేశమాత్రుడనుటచే మహాకవి సంప్రదాయజ్ఞానము సూచితమైనది. యమపాశము భయదదీర్ఘమనుటచే తారతమ్యస్ఫురణయు జనించి యొడలు జలదరించును. సావిత్రీసత్యవంతుల కథానిర్వహణమునందు ఎఱ్ఱనార్యుని యుత్తమకవిత్వకళ ద్యోతకమగుచున్నది.

ధర్మవ్యాధోపాఖ్యానమునందు మహావేదాంతార్థములను శంభుదాసకవి సుగమము చేసెను.

రామోపాఖ్యానమునందలి విశేషాంశములను స్వర్గీయ పెండ్యాలసుబ్రహ్మణ్యశాస్త్రిగారు విపులముగా చర్చించినారు. వాల్మీకిరామాయణములోలేని నూతనాంశములెన్నియో దీనియందు గలవు. అందులోకొన్ని - రావణకుంభకర్ణాదుల పూర్వజన్మవృత్తాంతము; వాలిసుగ్రీవులు యుద్ధము చేయుచుండగా హనుమంతుడు సుగ్రీవుని హారాలంకృతునిచేయుట, త్రిజటాకథాసందర్భమున అవింధ్యుడను వృద్ధరాక్షసునివృత్తాంతము మున్నగునవి. సీతయగ్నిప్రవేశముచేసినట్లు ఎఱ్ఱనవ్రాయలేదు. రామాయణసన్నివేశములనుగూర్చి విభిన్నకథనములు ప్రాచీనమునుండియు వాడుకలోనుండునట్లు తోచును.

ఎఱ్ఱనార్యుని లోకజ్ఞానసంపత్తి శ్రీరాముడు వారధికట్టుసందర్భమున కన్పించుచున్నది. ఎఱ్ఱనకు నౌకావిజ్ఞానము పరిచితము. సముద్రమును ఓడలపై దాటవచ్చునని యొకరుచెప్పగా రాముడిట్లు ప్రత్యాఖ్యానముచేసెను. "మీరుచెప్పినది యుపాయమేఅయినను, ఇంతయసంఖ్యాకమైన వానరసేనకు తగినకలములు తెప్పలుయెట్లు లభించును? ఒకవేళలభించినను నూరుయోజనముల విస్తృతిగల మహార్ణవమునుదాటుచో శత్రువులు తరుణముచూచి మనమీదపడి నిర్మూలము చేయరా? క్షుద్రవణిగ్జనములవలె భీరులమైన మనము తెప్పలో సముద్రముదాటుదుమా"? అని

రాఘవుడనెను (3-7-46) రాముని మాట యెట్లున్నను ఎఱ్ఱాప్రెగడ కాలమునందు ఆంధ్రుల నౌకావిజ్ఞానము మిన్నగానే ఉండెను. మల్లారెడ్డి ఓడ దొంగలను నిర్జించి మోటుపల్లి రేవును పునరుద్ధరించుట మున్నగు అంశములు మన కవీంద్రునకు బాగుగా పరిచితములు. కావుననే అట్లు వ్రాయగలిగెను.

ఆరణ్యపర్వశేషమును ఎఱ్ఱనార్యుడు రాజరాజనరేంద్రునకే అంకితమొనర్చెను. రాజరాజును గూర్చి నృపనారాయణబిరుదాంకభీమ, సోమాన్వయరత్నాకరహిమధామ, మహాకావ్య రసప్రయోజనారాధమతీ మున్నగు సంబోధనలు చేసెను. కాని యీతనికి రాజరాజనరేంద్రుని గూర్చి ప్రత్యక్షజ్ఞానము లేమిచే నన్నయననుసరించియే ఈవిశేషణములు వేసెనని చెప్పవచ్చును. ఐనను శంభుదాసుడు ప్రయోగించిన ఒకవిశేషణము ఔత్సుక్యమును కలిగించుచున్నది. "విచిత్రాలంకారోజ్జ్వల కవితాలాపకలాప" యను సంబోధనముచే రాజరాజనరేంద్రుడు స్వయముగ కవియా యని సందేహము జనించును. రాజులను యువతీమన్మథులన్నట్లే కవిత్వచతురు లనుటకూడ ఔపచారికమే కావచ్చును. ఇచ్చట నొకవిచిత్రాంశమును పేర్కొనవలసియున్నది. ఆంధ్రమహాభారతమును రాజరాజనరేంద్రుడే వ్రాసినట్లు కొండొక శాసనము నుడువుచున్నదని డాక్టరు చిలుకూరు నారాయణరావుగారు ఒక్కచో వ్రాసియుండిరి. ఈప్రవాదము ప్రబంధపరమేశ్వరుని చెవినిపడియుండునా! ఆతడు దానినేమియు పాటింపలేదనియు నన్నయ భారతకర్తృత్వమునం దాతనికెట్టి సందియమును లేదనుట నిశ్చయము.

శివపదాబ్జ సంతతధ్యానసంసక్తచిత్తుడయ్యు గోవిందగుణాదరసంభరితుడును, ప్రబంధపరమేశ్వరుడయ్యు తనకంటె పూర్వులైన మహాకవులకు ఎడతెగని శుశ్రూషచేసినవాడును, రాజాదరమునొందియు నిత్యసౌమ్యమతియు అయిన ఎఱ్ఱనమహాకవీంద్రుడు తాను ధన్యుడై తనభాషయైన యాంధ్రభాషను పునీతముచేసెను.

కీలక సంవత్సర
పుష్యబహుళ ఏకాదశి
మంగళవారము

ఖండవల్లి లక్ష్మీరంజనం.
14-1-1969

# సాధనసామగ్రి

అ. ఉ. వి. సంఖ్య 64. ఆరణ్యపర్వము. సంపూర్ణము. ఇందు 280 పత్రములున్నవి. అచ్చటచ్చట కొలఁదిగా పాడయినను స్థితి బాగుగానున్నది. బహుళః 150 సంవత్సరములకు పూర్వపు ప్రతికావచ్చును. నిజామాబాదు మండలమునందలి దోమకొండ గ్రామమునుండి గ్రహింపఁబడినది. దీనిని శ్రీ అమరేశం రాజేశ్వరశర్మగారు బహూకరించిరి.

ఆ. ఉ. వి. సంఖ్య 205. ఇందు సభా, ఆరణ్యపర్వములు పూర్తిగానున్నవి. మొత్తము 264 పత్రములు గలవు. స్థితిమంచిది. ప్రథమాశ్వాసము చివర "ప్లవంగనామ సంవ్వాత్సర ఆషాఢ బ॥ ౧౦ శుక్రవారంరోజున శ్రీమహాభారత సభాపర్వం ఆరంభించి ప్లవంగ సంవ్వాత్సర శ్రావణ శు॥ ౩ శుక్రవారంరోజున రాత్రి రెండుఘడియలు అయినసర్కి దాశారునరశింగరావు ఆత్మార్థఙ్ఞం కొరకు ప్రథమాశ్వాసము వ్రాసుకొనెను" దీనికి సరియగు ఇంగ్లీషు తేది 29-9-1847. ఇట్లే ఆరణ్యపర్వ ప్రథమాశ్వాసాంతమున గూడ తేదీ యివ్వఁబడినది. "ప్లవంగ ఆశ్వీజ బహుళ" 3 జయవారం రోజు సాయంత్రం సరికి పూర్తియైనది." ఈ తారీఖు 26-10-1847 కి సరియైనది. ఇట్లే సప్తమాశ్వాసాంతము వరకు తేదీ లివ్వఁబడినవి. ప్రతి. గౌతమీ లైబ్రరీ. రాజమండ్రి. వారిది.

ఇ. ఉ. వి. సంఖ్య 173. అరణ్యపర్వము సమగ్రము. 269 పత్రములు. ప్రతి మంచిస్థితిలో నున్నది. "ప్రమాదినామ సంవత్సర ఫాల్గుణ శు॥ 7 ఆ॥ న మీవాడ్రేవు కామయ్యగారు వ్రాశిన ప్రతినుంన్న క్రమానను శ్రీమహాభారతములో ఆరణ్యపర్వము వడ్డాదివెంకయ్య కొమాళ్లు నరసింహ్వులు వ్రాయించుకొనెను"అని లేఖకుడు గ్రంథాంతమున లిఖించెను. దీనికి సరియగు ఇంగ్లీషు తేది. 5-3-1854. 'భవ్యచరిత్రుండు' అను సీసపద్యమున గుడ్లూరుకు బదులు 'గుంటూరు' అని యున్నది. 115 వ కమ్మ రెండవప్రక్కను "యింతట నుంచ్చి యర్రాప్రగడగారు చెప్పిన ఆరణ్యపర్వము" అనికలదు. ఆంధ్రసాహిత్యపరిషత్తు కాకినాడ.

ఈ. ఉ. వి. సంఖ్య 174. ఆరణ్యపర్వము. సమగ్రము. 133 కమ్మలు. ప్రతిమంచిది. చక్కని వ్రాఁత. మంచిస్థితిలోనున్నది. గ్రంథాంతమున "సౌమ్యనామ సంవ్వాత్సర భాద్రపద శుద్ధ సప్తమీ శుక్రవారంవరకు పిశిపాటి తిమ్మయ్యశాస్త్రుర్లగారి కొమారుడు వెంకటదాసు భారతం ఆరణ్యపర్వము సంపూర్ణముగా వ్రాసుకొనెను"దీనికి సరియగు ఇంగ్లీషు తేది. 24-8-1849. ఆ. సా. ప. కాకినాడ.

ఉ. ఉ. వి. సంఖ్య 127. ఆరణ్యపర్వము సమగ్రము. 120 కమ్మలు. గ్రంథమచ్చటచ్చట శిథిలమయ్యును చక్కని వ్రాఁత గలిగియున్నది. ఆ. సా. ప. కాకినాడ.

ఊ. ఉ. వి. సంఖ్య. 176. ఆరణ్యపర్వము. సమగ్రము. 231. కమ్మలు. నత్తం వేంకటేశయ్యర్ గారు కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తు వారికిచ్చినది. ప్రతి మంచిస్థితిలోనున్నది. వ్రాత చక్కనిది. శుభకృతునామ సంవత్సర పుష్య శు॥ 15 ఇందువారం కోకవరం వెంకట్రామయ్య ఆరణ్యపర్వం"అని గ్రంథాంతమునగలదు. ఇది 16-1-1843తో సంవదించును.

ఎ. ఉ. వి. సంఖ్య 177. ఆరణ్యపర్వము. సమగ్రము. 268 కమ్మలు. ప్రతి మంచిస్థితిలోనున్నది. వ్రాతచక్కనిది."సౌమ్యనామసంవత్సర శ్రావణ బ॥ ౧౦ సోమవారంవర్కు జాలాంత్రపు కృష్ణంరాజుగారి ప్రతినుంన్న క్రమానను ఆరణ్యపర్వం సంపూర్ణంగా మల్కిపల్లి జోగి రాజు ఖాసాకువ్రాశెను. శ్రీకుడుపూరు నీలకంఠేశ్వరాయనమః" అని గ్రంథాంతమున గలదు. దీనికి సరియైన తేది 13-8-1849. ఆ. సా. ప. కాకినాడ.

ఏ. ఉ. వి. సంఖ్య 178. ఆరణ్యపర్వము. సమగ్రము. ప్రతిమంచిది. వ్రాలుచక్కనివి. 257 కమ్మలు. గ్రంథాంతమున అక్షయనామ సంవత్సర ఆశ్వీజ బ॥ ౨ గురువారం వర్కు జొంన్నలగడ్డ వ్యాసులుగారి పెద్దకొమారుడు కామయ్య స్వంత్తముకు శ్రీ పార్వతీ పరమేశ్వరార్పణముగా వ్రాసుకొనెను. ఆ. సా. పా. కాకినాడ.

ఐ. ఉ. వి. సంఖ్య. 179. ఆరణ్యపర్వము. సమగ్రము. 226 కమ్మలు. ప్రతి ప్రాంతదై జీర్ణావస్థలోనున్నది. చివరికమ్మలు చూర్ణములైనవి. వ్రాంత మంచిది. ఆ. సా. ప. కాకినాడ.

ఒ. ఉ. వి. సంఖ్య 180. ఆరణ్యపర్వము. సమగ్రము. 291 కమ్మలు. ప్రతిక్రిమిదష్టము. వ్రాంతమంచిది. తృతీయాశ్వాసాంతమున "శ్రీ చిమట రంగన్న తిరుగావ్రాశినాడు"అని యున్నది. ఆ. సా. ప. కాకినాడ.

ఓ. ఉ. వి. సంఖ్య 182. ఆరణ్యపర్వము. సమగ్రము. 258 కమ్మలు. దేవగుప్తాపు భారద్వాజముగారు కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తువారికి యిచ్చినది. ప్రతిమంచిది. స్థితి బాగున్నది. వ్రాలుచక్కనివి. 2. వ ఆశ్వాసము చివర "కాళయుక్తి సంవత్సర శ్రావణ బ॥ ౧౩ ఆదివారం సర్కి రాజశ్రీ రావుసూరయ్యగారి శల్వుప్రకారం వక్కలంక చెలమయ్య వ్రాశి యీ గ్రంథం దాఖలుచేశెను."అని కలదు. గ్రంథాంతమున "కాళయుక్తి సం॥ రఆశ్వయుజ బ॥ ౫ బుధవారం సర్కి ఆరణ్యపర్వం సాంతంగా రాజశ్రీ పిఠాపురం కాపురస్తులు రావుకరప సూరయ్యగారికి రాజశ్రీ చెలికాని వెంకట్రాయనింగారు వ్రాశి శ్రీపరబ్రహ్మార్పణంగా యిచ్చినారు" (27-10-1858) అని కలదు. ఆ. సా. ప. కాకినాడ.

ఔ. ఉ. వి. సంఖ్య. 183. ఆరణ్యపర్వము. సమగ్రము. 255 కమ్మలు. కొద్దిగా క్రిమిదష్టము అక్కడక్కడ కొన్నికమ్మలు పోయినవి. "పింగళినామ సంవత్సర వైశాఖ బ॥ ౨ సోమవారం వరకు మామిడిపూడి గోవిందాచార్యులు గండవరం వెంకట్రామరెడ్డిగార్కి వ్రాసియిచ్చిన ఆరణ్యపర్వం చతుర్థాశ్వాసం సంపూర్ణం"అని చతుర్థాశ్వాసాంతమున లేఖకునిచే వ్రాయఁబడినది. ఇది 11-5-1857 తో సరిపోవును. ఆ. సా. ప. కాకినాడ.

క. ఉ. వి. సంఖ్య 184. అరణ్యపర్వము. ఇందు చతుర్థ, సప్తమాశ్వాసములు సంపూర్ణముగా లేవు. (చతుర్థ–9 వచనమునుండి 79 వ వచనమువఱకు, సప్తమ 170 వ పద్యము తరువాతిభాగము, లుప్తములు. ఆ. సా. ప. కాకినాడ.

ఖ. ఉ. వి. సంఖ్య 532. సంస్కృత ఎకాడమీ ప్రతి. 302 కమ్మలు. ఇందు ఆది, సభా,అరణ్య పర్వము చతుర్థాశ్వాసమునుండి చాలకమ్మలు పోయినవి. పంచమాశ్వాసపు కమ్మలు చాలపోయినవి. ఆదిపర్వాంతమున "శోభకృతునామసంవత్సర భాద్రపద బ॥ ౧౩ శుక్రవారం మూడోయామంవరకు ప్రతిలో వున్నక్రమాన పాలవాయి చల్లయ్య గజం అచ్చన్న తమ్ముడు లక్ష్మీనరసుకు వ్రాసియిచ్చిన భారతం" అనియున్నది.

గ. ఉ. వి. సంఖ్య 186. అరణ్యపర్వము. సమగ్రము. 263 కమ్మలు. అంకెలుగల భాగము క్రిమిదష్టమైనది. తారణనామసంవత్సర ఆశ్వియుజ శు. ౭ స్థిరవారం వుదయమై పది ఘడియలకు రెండో ఆశ్వాసము సమాప్తః. వ్రాతమంచిది ప్రతిమంచిది. 29–9–1824. ఆ. సా. ప. కాకినాడ.

ఘ. ఉ. వి. సంఖ్య 187. అరణ్యపర్వము. సమగ్రము 286 కమ్మలు. ప్రతిమంచిది. మొదటి భాగమును పురుగుకొట్టినది. "సాధారణనామ సంవత్సర నిజవైశాఖ శు॥ ౧౩ లు శుద్ధి సూర్యనారాయణ వశ్ని అరణ్యపర్వం సప్తమాశ్వాసం"–అని లేఖకుని వివరము. 1850. ఆ. సా. ప. కాకినాడ.

చ. ఉ. వి. సంఖ్య 192. అరణ్యపర్వము. స్త్రీశాంతి అరణ్యపర్వములు సమగ్రముగానున్నవి. ద్వితీయాశ్వాసము చివర.

చ. పొలుపగు శర్వరాబ్దమున బొందిన చైత్రకకృష్ణపక్షమం। ద్దలిదగు సప్తమిందగినదా కవివారమునాటి కొప్పగా। లలితపదారువేల పృథులాహ్వయముఖ్యుడు పిచ్చనాఖ్యుడు త్కలిక లిఖించె భారతము కాననవాసకథా ప్రపంచమున్॥ శ్రీమదభ్యుదయామీకలియు గాద్యంత ప్రమాణ...చ్చకానాం తస్యతృతీయ్యశాలివాహనశకస్య గతాబ్దాః యేక సహస్ర సప్తశత చతుషష్ఠి సంవత్సరాః మయాలిఖ్యంతే. ఆకులు 24.

"శారదరాత్రులు" తర్వాత యిక్కడికి నన్నయభట్టుగారి కవిత్వముసరి...యిటమీదట చదలవాడ యెఱ్రాప్రెగ్గడగారి కవిత్వము. చన్పకం" అని కలదు. పంచమాశ్వాసము చివర.

"యొనరగ శార్వరాబ్దమున యొప్పుగ చైత్రమునందు శుక్లపక్షనమరియుండు దుర్గయధి కారదినంబున గూడియున్న మిత్రుని యధివారమందు సుకరంబుగ పిచ్చనమంత్రి భారతం। బ్బునను నరణ్యపర్వమును పుణ్యానిదైదవఖండ వ్రాశితిం". అనికలదు. 8–2–1840. ప్రతి వాయలపాడు శ్రీకన్యకాపరమేశ్వరీ దేవాలయమువారిది. ప్రతిమంచి స్థితిలోనున్నది.

జ. ఉ. వి. సంఖ్య 213. ఆరణ్యపర్వము. అసమగ్రము. షష్ఠాశ్వాసము వఱకుకలదు. ప్రతి మంచిస్థితిలోనున్నది. షష్ఠాశ్వాసముచివర" మన్మథనామ సంవత్సర ఫాల్గుణ శు॥ ౪ స్థిరవారం యీడూరి వెంకటశివుడు చిట్టాప్రగడ మల్లయగార్కి వారి మాతృకనున్న క్రమానను ఆరణ్యపర్వంలో షష్టమాశ్వాసం శ్రీ రామార్పణంగా వ్రాశియిచ్చెను". గౌతమీగ్రంథాలయము. 20-2-1836. రాజమండ్రి.

ఝ. ఆంధ్ర విశ్వవిద్యాలయము. సంఖ్య T. 1111. N. 18.3 అరణ్యపర్వము. సమగ్రము. 170 కమ్మలున్నవి. ప్రతిలో చివర కొన్ని ఆకులులేవు. వ్రాత యొకతీరుననున్నది. తప్పు లున్నవి. తుదినిట్లున్నది. ఆనందనామ సంవత్సర జ్యేష్ఠ శు॥ ౨ ఆదివారంవరకు అవసరాల శాయన్నకుమారుడు వెంకటాచలం అరణ్యపర్వం దండెన కొండలరాయడుగారి ప్రతినున్న క్రమాన." 28-5-1854.

ట. తంజావూరి సరస్వతీమహాల్ ప్రతి. డి. నెం. 74 తెలుగు నెం. 43. ఆరణ్యపర్వము. అస మగ్రము. సప్తమాశ్వాసము కడపట పదిపద్యములులేవు వ్రాలుమంచివే శైథిల్యమత్య ధికము. తప్పులంతగాలేవు. ప్రజోత్పత్తి నామసంవత్సర భాద్రపద బ॥ ౧౨ లు జొన్నల గడ్డ నాగరాజు కొమారుడు రాజన చరికొండఅయ్యవరాజుకు అరణ్యపర్వమందు రెండో ఆశ్వాసం కృష్ణార్పణంగాను వ్రాసి సమర్పించె.

ఠ. అడయారు దివ్యజ్ఞాన సమాజమందిరమువారి గ్రంథాలయము. సంఖ్య 75054. సభా ఆరణ్యపర్వములు. "స్వభాను మార్గశీర్ష బ॥ తదీయ స్థిరవాసరంసర్కి" 20-12-1823. ఇది దక్షిణదేశపుప్రతి "తిండివనం సీమలో పేరుంబాక నివాసియైన అల్లూరి వేంకటపతిరెడ్డి కుమారుడు ముద్దు వేంకటపతిరెడ్డికి వ్రాశియిచ్చినది".

డ. అడయారు దివ్యజ్ఞాన సమాజమందిరమువారి గ్రంథాలయము. సంఖ్య. 75066. సభా ఆరణ్యపర్వములు. కమ్మలు 50. ప్రతిసమగ్రము. వ్రాతమంచిది. 'అక్షయవైశాఖ బ॥ ౫ బుధవారంవర్కు' అని సభాపర్వాంతమునగలదు. తేది. 7-5-1806. 'మానవెల్లి కాంతయ్యవ్రాలు.' అని అరణ్యపర్వాంతమునగలదు.

త. ఉ. వి. సంఖ్య 175. అరణ్యపర్వము. సమగ్రము. 234 కమ్మలు. ప్రతిచక్కనిది. చివర రెండు కమ్మలు పోయినవి. వ్రాయసగాని వివరములులేవు. ఆ. సా. ప. కాకినాడ.

ద. ఉ. వి. సంఖ్య 185. అరణ్యపర్వము సమగ్రము. 196 కమ్మలు. "శ్రీమదద్దంకి తిరుమలా చార్య గురవేనమః వర్తమాన వ్యావహారిక చాంద్రమాన విరోధినామ సంవత్సర చైత్ర బ॥ ౭ యిందువారంవరకు కొమరగిరి నారయ్య అరణ్యపర్వం సంపూర్ణముగా ఆత్మార్థం వ్రాసుకొనెను" అని గ్రంథాంతమునగలదు. దీనికి సరియగు తేది. 27-4-1829 వ్రాత మంచిది. ప్రతిస్థితి బాగున్నది.

120. తే. బకహిడింబులు హతులైనఁ [1]బనివిపనివి, యఱచి [2]శోకింపఁ గానక యమపురమున
కరిగి తక్కట [3]రాక్షస యనుచుఁ [4]దెరువు, వాయఁ బావని దత్కళేబరము వైచె.

121. వ. ఇట్లు ధర్మరాజువచనంబునఁ గిమ్మీరు నక్రమంబున [1]వధియించి తద్వనవా
సులకు రాక్షసభయం బుడిపిన మహావీరు నమ్మారుతాత్మజు ధర్మార్జున
నకుల సహదేవులును ధౌమ్యాది మహీసురవరులును బ్రశంసించి రని విదు
రుండు [2]గిమ్మీరువధ సెప్పిన విని [3]ధార్తరాష్ట్రులకు [4]హృదయదలనం బయ్యె
నిట పాండవులు గామ్యకవనంబున నుండునంత.

*యాదవపాంచాలాదులు పాండవులకడ కేతెంచుట*

సం. 3 – 13 – 1

122. సీ. వసుమతీరాజ్యంబు[1]వలన [2]నిరస్తులై మునివృత్తి నత్యుగ్రవనములోన
నవయుచుఁ బాండుభూనాథనందను లున్న[3]వారని విని యతిక్రూరమతుల
ధృతరాష్ట్రసుతుల [4]నిందించుచుఁ బాంచాలయాదవ వృష్టి [5]భోజాంధు లెల్ల
నచ్యుతప్రముఖులై యప్పాండవులకడ కేతెంచి శోకపరీతులగుచు

ఆ. నున్న నధికధర్మ[6]యుక్తుఁ డుపేంద్రుండు, నికృతిఁ జేసి పాపనియతబుద్ధిఁ
బాండవులకు నట్లపాయంబు సేసిన, ధార్తరాష్ట్రులకును దద్దయలిగి.

---

120. ఈపద్యము ట ప్రతిలో లేదు. 1. బనవివనవి – కొన్నిప్రతులు. 2. శోకించి – వ. ఓ. ఔ. జ. ల. స. 3. రాక్షసాయనుచు – డ. 4. యి(ని)రువువాయ – డ.

121. 1. జంపి – పెక్కుప్రతులు. 2. గిమ్మీరవధ – ఠ. త. 3. ధృతరాష్ట్రునకు – వా; ధార్తరాష్ట్రులకు – శ. ష. శ. కొన్నిప్రతులు; ధృతరాష్ట్ర ధార్తరాష్ట్రులకు ; ఈ. ఎ. ఐ. క. ఝ. త. 4. హృదయచలనంబయ్యె – కొన్నిప్రతులు; హృదయ శల్య చలనంబయ్యె – డ; హృదయ దవానలంబయ్యె – గ.

122. 1. లందు నిరస్తులై – ఠ. 2. విముక్తులై – ఒ. 3. వారనినియతి నాక్రూర మతుల – డ. 4. నిందించుచు యాదవవృష్ణి భోజాంధకవీరు లెల్ల – ఉ. 5. భోజాదు లెల్ల – ఒ. ఔ. చ. ఠ. 6. యుక్తినుపేంద్రుండు – ఆ. ద. ల.

123. క. [1]అనిఁ గర్ణ శకుని దుర్యో, ధన దుశ్శాస[2]న నవాస్త్రధారాపాతం
బునఁ దృప్తిఁబొందు వసుధాం, గన రాక్షస కాక గృధ్రగణములతోడన్.

124. క. అవినీతుల[1] వధ్యులఁ గౌ, రవపాంసులఁ జంపి ధర్మరాజునకుఁ గురు
[2]ప్రవరున కొస[3]రింతమ యీ, యవనీరాజ్యాభిషేక [4]మవిజితశక్తిన్.

125. వ. అని యు[1]గాంత్య[2]కాలకుపిత[3]కృతాంతాకృతి నున్న జగన్నాథు జనార్దనుం బ్రశాంతచిత్తుం జేసి యర్జునుం డతని నిట్లని [4]కీర్తించె.

126. ఆ. పూజ్యుఁడవు పురాణపురుషుండ[1] వీశుండ, వప్రమేయుఁడవు చరాచరంబు
లయినభూతరాసు లచ్యుత నీయంద, పుట్టునిలుచు లయముఁ బొందు[2]చుండు.

127. వ. నీవు దొల్లి గంధమాదనంబునం గందమూలఫలాశనుండవై పదివేలేండ్లు తపంబు సేసి పుష్కరంబున[1] నేకాదశసహస్రవ[2]ర్షంబులు జలంబు లాహారంబుగా నుండి [3]ప్రభాసం బనుతీర్థంబున దివ్యసహస్రవర్షంబు లేకపాదస్థితుండవయి యుండి బదరీవనంబునం [4]బవనంబు భక్షించుచు నూర్ధ్వబాహుండవయి యేకపాదంబున ననేక సహస్ర వర్షంబులు నిలిచి [5]సరస్వతీసత్త్రంబున

---

123. 1. అనుగర్ణశకుని – డ. 2. నుల,యస్త్రధారా – కొన్నిప్రతులు.

124. 1. లవంద్యులుకౌరవ–డ. 2. ప్రవరునకు నిత్తునెంతయు, నవనీ – డ. 3. రించెదనీయవనీ–అ. ల. స; రింపుద(దు)మీ యవనీరాజ్యంబునెల్ల నవహితయుక్తిన్–శ. వ; రింపుదమీ – వీ; రింతుమునీయవనీ – ఐ. చ. త ద. 4. మవహితబుద్ధిన్ – ఔ. డ. వ; మవహితశక్తిన్, మపజితశక్తిన్, మవహితయుక్తిన్ – అని పాఠములు.

125. 1. గాంతకాల – కొన్నిప్రతులు. 2. కాల – కొన్నిప్రతులలో లేదు. 3. వృత్తి నున్న జగన్నాథు – ఉ. ఠ. 4. స్తుతించె, స్తుతియించె – అని పాఠములు.

126. 1. వధికుండవప్ర – ఇ. ఎ. ఝ. ద. వ; వాద్యుడవప్ర – ఈ. ఐ. త; వీశ్వరుండవప్ర – డ. 2. నెందు – పెక్కు ప్రతులు.

127. దశసహస్ర వర్షంబులు – డ. ద. 2. వర్షంబులు నిలిచి జలంబు లాహారంబుగా – ఏ. ఓ. గ. ఘ. ఠ. 3. ప్రభాస తీర్థంబునందు – కొన్ని ప్రతులు. 4. దత్ఫలంబులు భక్షించుచు – ఏ. ఓ. జ. శ.; బదరీ ఫలంబులు భక్షించుచు – గ. ఠ. డ; దత్ఫలంబులు బవనంబు సరస్వతీ చక్రంబున నపాకృతసంగుండవై కృష్ణా జినోత్తరీయా (స)ం గుండవై నియమ కృశీకృతాంగుండవై వంద్రెండువేల వర్షంబులు – స. 5. సరస్వతీ చక్రంబున – ఉ. ఊ. ఏ. ఒ. ఓ. ఔ. గ. ఠ. శ. మ; సరస్వతీ తీరంబున – అ. చ. డ. ద. ధ. ఇచ్చట సంస్కృత మూలము ఆసీః కృష్ణ సరస్వత్యాం

[6]నవకృష్ణోత్తరాసంగుండ వై [7]నియమకృశీకృత శరీరంబుతోఁ [8]బంద్రెండు వర్షంబు లశేషవ్రతంబులు సలిపిన తపో[9]నిధానంబవు నిఖిలలోకశైత్రుండ వయి చైత్రరథంబున [10]నుత్తమక్రతువు లనేకంబులు సేసి యొక్కొక్కక్రతువు నకు నూఱేసి[11]లక్షలు సువర్ణంబులు దక్షిణ లిచ్చిన యజ్ఞపురుషుండవు తపో [12]యజ్ఞంబులు రెంటను సమృద్ధతేజుండవయి దైత్యదానవేంద్రుల వధియించి యింద్రునకింద్రత్వం [13]బేకాధిష్ఠితంబు సేసిన లోకప్రభుండ [14]వదితికింగశ్యపు నకు నుదయించి యింద్రానుజుండ వై [15]త్రివిక్రమంబునం[16] ద్రిజగంబుల నభివ్యాపించిన విశ్వ[17]రూపధరుండవు.

128. క. నరక శిశుపాలు రాదిగ, ధరణీకంటకుల [1]నధికతరదర్పులఁ బ
ల్వుర వధియింపఁగ మహి నవ, తరించిన [2]మహాత్ముఁడవు [3]నుతస్థిరశక్తిన్.

129. క. [1]అనృతము మదమును మత్సర, మును గ్రోధము [2]ననువికారములు వోరయునె [3]ని
న్ననుపమగుణముల నీకొరు, లెన[4]పోల్పఁగఁ [5]గలరె సురమునీంద్ర ప్రణుతా.

---

సత్రేద్వాదశ వార్షికే. 6. నపాకృత సంగుండవై – ఇ. ఏ. ఝ. ద; కృష్ణాజి నోత్తరీయాంగుండవై – వ; కృషాజినోత్తరీయాంగుడవై – ఏ. ఓ. ల; నజినోత్తర వాసుండవై – శ. ష; నపాకృతోత్తరాసంగుండవై – వీ. 7. నియమకృశ శరీరంబుతో – ఉ. ఏ. ఒ. ఓ. ఔ. జ. ఝ. ఠ. వీ. శ. ష; నియమకృశీభూత – చ. 8. బంద్రెండువేలేండ్లు – కొన్నిప్రతులు. 9. నిధానుండవు – ఉ. ఘ. శ. ష. 10. నుత్తరక్రతువు – ఈ. ఐ. జ. త. 11. లక్షల – కొన్ని ప్రతులు. 12. యజ్ఞంబుల సమృద్ధ తేజుండవై – కొన్ని ప్రతులు; యజ్ఞంబుల సమిద్ధ తేజుండవై – చ. ఠ. 13. బునిరాకులంబు – ఉ. ఘ. చ. ట. 14. వదితి కశ్యపులకు – కొన్ని ప్రతులు. 15. విక్రమాకారంబున – త. 16. లఁ (లం) ద్రిజగంబుల – వీ. సూ. 17. రూపుండవు – ఉ. ఊ. ఘ. ల.

128. 1. నోర్చి దర్పితులను – పెక్కు ప్రతులు; నధికదర్పితులనుబ, ల్వుర – ఇ. గ. ల; నోర్చిదర్పాఢ్యుల – జ. 2. ఘనుండనీవు ధన్యుడ – ఈ. ఐ. 3. నుత స్థిత శక్తిన్ – డ; నుతసితశక్తిన్ –స.

129. అనృతంబు మదము మత్సర – ఈ. ఐ. త; అనయము మదము – ఔ. 2. దుర్వికారమును బోరయునె – ల. వీ. శ. ష. పెక్కుప్రతులు. 3. ని,న్నును వర గుణముల నీకొరు, లెనయే పోల్పంగ సుర మునీంద్ర ప్రముఖుల్ – డ. 4. గెల్వగ – ఊ. 5. లేరుసుర – ఇ. ఏ. ఓ. ఘ. ఝ.

130. వ. అని కృతాంజలి యయిన ధనంజయుం జూచి దనుజభంజనుం డి ట్లనియె.

131. తే. నరుఁడు నారాయణుం[1]డునాఁ బరగు నాది, మునుల మిద్దఱ
[2]మందు నీవనఘ నరుఁడ
వేను నారాయణుండ ననూనశక్తి, యుతులమై మర్త్యయోనిఁ
బుట్టితిమి [3]పేర్మి.

132. తరువోజ. నిరతంబు[1]గా నేను నీవను భేదనియమంబు [2]లే దైక్యనిష్ఠయ మనకు
నిరువురకును నీకు నిష్టుండ నాకు నిష్టుండు మఱి నీకనిష్టుండ నాకుఁ
గరమనిష్టుం డట్లుగా నమ్ముమనుచు ఘనభుజుల్ భువనోపకారైకమతులు
హరియు నర్జునుఁడుఁ బ్రియంబుతోఁ[3] దగిలి యన్యోన్య[4]హితభాషు
లగుచుండు నంత.

*ద్రౌపది శ్రీకృష్ణునితోఁ దనపరిభవంబు సెప్పి దుఃఖించుట*

**సం. 3 _ 13 _ 42**

133. వ. అఖిలరాజలోకపరివృతుండయి యున్న నారాయణు [1]నొద్దకువచ్చి ద్రుపద
రాజపుత్త్రి ముకుళిత[2]కరాంబుజ యయి[3] యిట్లనియె దేవా నిన్ను [4]నాది
ప్రజాసర్గంబునఁ బ్రజాపతి[5]వని యసితుం డయిన దేవలుండును సత్యంబువలన
[6]యజ్ఞం బుద్ధరించుటం జేసి నిత్యసత్యమయుండ వయిన యజ్ఞ[7]పురుషుండ వని

---

131. 1. డనబరగు - పెక్కుప్రతులు. 2. మిందునీవనఘ - ఆ. ఓ.. ఝ. 3 నెమ్మి- అ. ఆ. ఢ. వ.

132. 1. గా నాకు నీకును భేద - ఉ. ఘ. ర; నాకును నీకును భేద - ఇ. 2. లేకున్కి నిక్కము మనకు - శ. ష. 3. నబొందియన్యోన్య - ఉ; డాసి - ఈ. ఐ. త.. 4. గుణహితులగుచుండిరంత - అ. ఎ. ఏ. ఓ. ఝ. డ. ద; హితభాష లాడుచో నంత; హితభాషలాడుచున్నంత - అని పాఠములు.

133. 1. నకు ద్రుపద రాజపుత్రి - పెక్కుప్రతులు. 2. కరాంజలియయి - ఈ. ఐ త. 3. యిట్లనియె దేవానిన్ను - డ; నిన్ను నాదిప్రజా - వా. పెక్కుప్రతులు. 4. నాదిప్రజాపతి - పెక్కుప్రతులు; నాది స్వర్గంబునఁ బ్రజాపతి-గ. శ. ష. 5. యని యసితుండైన - పెక్కుప్రతులు. 6. యజ్ఞంబులం(లు)బుట్టించుటం జేసి - పీ. శ. ష. పెక్కుప్రతులు. ఇచ్చట సంస్కృత మూల మిట్లున్నది. సత్యాద్యజ్ఞోసి సంభూతః కశ్యపస్త్వాం యథాబ్రవీత్. 7. పురుషుండని - పెక్కు ప్రతులు.

కళ్యపుండును శిరంబున దివంబును బాదంబుల మేదినియును [8]లోచనంబుల సూర్యుండును నవయవంబుల [9]లోకంబులు నభివ్యాపించుటం జేసి సర్వమయుండ వని నారదుండును నక్షయజ్ఞాననిధి వని సర్వమునిముఖ్యులును జెప్పిరి.

134. మధ్యాక్కర.

[1]అని ననివృత్తులై పుణ్యచరితులై యాత్మప్రబోధ
వినిహితచిత్తులై సర్వధర్మార్థ[2]విదులయి తృప్తిఁ
దనరెడు [3]రాజర్షి వరులకును యోగధరులకు సాధు
జనులకు గతి నీవ నిత్యకారుణ్య సర్వశరణ్య.

135. వ. [1]నీయంతఃకరణప్రవృత్తి కగోచరం బెద్దియు లే దయినను నాపడిన[2]పరాభవం బెఱింగించెద.

136. సీ. పార్థివప్రభుఁ డైన పాండుమహీపతి కోడల నయి యుద్ధకుశలు లయిన
[1]పాండుతనూజుల భార్యనై పూజ్యుఁడ వైన నీ[2]యనుజనై యధికశక్తిఁ
బరగు ధృష్టద్యుమ్ను భగిని నై ధృతరాష్ట్రుపట్టిచే సభఁ [3]దలపట్టి యీడ్వఁ
బడి పాపకర్ముచేఁ బరిధాన మొలువంగఁబడి దారుణం బైన పరిభవంబు

ఆ. [4]పడితినట్టి నన్నుఁ బాండవుల్ సూచుచు, నుండి [5]రొరులువోలె నుక్కుఁదక్కి
యాపగాతనూజుఁ డాదిగాఁ గలవృద్ధ, బంధుజనులు సూచి పలుక రయిరి.

---

(వ) లోపము. 8. లోచనంబుల లోకంబులును నభి - అన్నిప్రతులు; సూర్యుండును నవయవంబులు - అనునది పెక్కింట లేదు. దీనికి మూలమును గానరాకున్నది. 9. లోకసంచయంబు నభి వ్యాపించుటం జేసి - ల.

134. 1. అనితరవృత్తులై - ఓ. ల; అనిన నివర్తులై - కొన్ని ప్రతులు; అనఘ నీకిష్టులై- డ; అనఘ నివృత్తులై - బొ. 2. వేదులై - కొన్ని ప్రతులు. 3. రాజవరులకు ఋషియోగధరులకు - శ. ష.

135. 1. అనిపలికి నీయంతఃకరణ - త; నీ యంతఃకరణ వృత్తి - కొన్నిప్రతులు. 2. పరిభవం - కొన్ని ప్రతులు.

136. 1. పాండవవీరుల - పెక్కుప్రతులు. 2. సఖియునై - ఊ. ట. శ. ష. చెలియలి (ల) నై - అ. ఎ. ఒ. చ. 3. లోన - ఈ. ఐ. త. 4. పడినయట్టినన్ను - కొన్ని ప్రతులు; పడితినట్లు, పడితినిట్టినన్ను - అని పాఠములు. 5. రుక్కఁడంగి యొరుల వోలె - కొన్నిప్రతులు; నొరులవలెను నుక్కుఁదరిగి - డ.

137. క. [1]శరణనినవారిఁ గరుణా, కరు లయి రక్షించు పురుషకారాన్వితు[2]లే
శరణని యఱచిన [3]నాలిం, బర భీమార్జునుల బాహుబల మేమిటికిన్.

138. వ. భ్రాతృపుత్త్ర బంధుజనంబులు నాకుం గలిగియు లేనివా రయి రట్టి[1]యెడం గర్ణుండు నన్నుం జూచి నగియె.

139. ఆ. [1]కర్ణు[2]నగవు లోకగర్హితుం డగు దుస్స, సేను[3]చెయిదికంటె శిఖియపోలె
నడరి నామనంబు నతి[4]దారుణక్రియ, నేర్చుచున్న యది మహీధరుండ.

140. వ. [1]తొల్లి వేదాధ్యయనంబు సేయుచు [2]బాలకేళీవినోదంబుననున్న కాలంబునఁ బ్రమాణకోటియందు సుప్తుం డయిన భీమసేను నంటఁ గట్టి గంగ మడువునం [3]ద్రోపించియు విషంబుఁ బెట్టియు విష[4]సర్పంబులంబట్టి గఱపించియు జననీసహితు[5]లైన యేవురను వారణావతంబున లక్కయిల్లు సొనిపి యందు దహనంబుఁ [6]బ్రయోగింపం బంచియు ననేకంబు లైన యపకారంబులుసేసి యిప్పుడు దుర్యోధనుం డధర్మద్యూతంబున రాజ్యంబు నపహరించి రాజలోకసమక్షంబునం దమ్ము నిరాకృతులం జేసినను బరాక్రమపరాఙ్ముఖులైన పాండవులు [7]నాపడినపరిభవంబు [8]నెట్లు దలఁగెదరని బాష్ప[9]ధారాస్నపితపయోధర యయి పాణిపల్లవంబున నయనపమ్మార్జనంబు సేయుచున్న పాంచాలిం జూచి వాసుదేవుం డి ట్లనియె.

---

137. 1. శరణనువారిని - కొన్ని ప్రతులు. 2. లై - కొన్ని ప్రతులు. 3. వారింపర - ఇ. ఈ. ఐ. ఔ. క. ఠ. డ. త. ద. స.

138. 1. యవసరంబున - పెక్కు ప్రతులు.

139. 1. కణగి సకలలోక గర్హితుండగు దుస్ససేను చెయిదికంటె - ఓ. ప్రతియందీపాఠము మార్జినునం దధికముగా నీయఁబడినది. 2. వలుకు - కొన్ని ప్రతులు. 3. చెయ్వి కంటె, చేతకంటె - అని పాఠములు. 4. దారుణాకృతి - వీ. శ. ష. కొన్ని ప్రతులు.

140. 1. తొల్లి ధనుర్వేదాధ్యయనంబు - ఈ. త. ఒ. 2. జలకేళీవినోద - కొన్ని ప్రతులు. 3. దోఁచియు - ఓ. జ. శ. ష. 4. సర్పంబులంబట్టి గరపించి - కొన్ని ప్రతులు; సర్పంబులం గరపించి - వా. కొన్ని ప్రతులు. 5. లైనయార్వురను - ల. శ. ష. కొన్ని ప్రతులు. 6. దరికొలుపం బంచియు, దరికొలిపియు - అని పాఠములు. 7. నాపడిన పరిభవంబు - ఈ. ఐ. క. చ. ఠ; నాపరిభవంబు - వా. కొన్ని ప్రతులు. 8. నెట్లుడిగెద రని - శ. ష; నెట్లు తీర్చెద రని - ఆ; నెట్లు దలంగుదు రని - ల. 9. ధారార్ద్రీపీనపయోధర - డ. ద; ధారాప్లుత పీన - ఆ. ఇ. ఝ; ధారానిభృత పయోధరయై - వీ. శ. ష.

141. చ. [1]తనుకుచు నున్న నీహృదయతాపనిమిత్తమునన్ సురేంద్రనం
దను పటుబాణపాతహతిఁ దద్ధృతరాష్ట్రబలంబు మృత్యుసా
దనమున కేఁగుఁ జుమ్మిదియ తథ్యము నా వచనంబు దప్ప ది
వ్వననిధు లేడు నింకిన దివంబును రాత్రియు సంచలించినన్.

142. వ. అనిన నర్జునుండు ద్రౌపదిం జూచి యి ట్లనియె.

143. ఉ. ఈపురుషోత్తముండు మన కిందఱకుం గుశలం[1]బు సేయుచుం
బాపకలంకపంకములఁ [2]బాయఁగఁ జేయుటఁ జేసి దుర్మదో
ద్దీపితశత్రు[3]సంహతి హతిం బరమార్థము పొందు నేల సం
తాపము[4]నీకుఁ జేయఁగఁ [5]ద్రిధామజయోన్నతి గల్గి యుండఁగన్.

144. వ. అనిన[1] సక్రోధుం డయి ధృష్టద్యుమ్నుం డి ట్లనియె.

145. క. [1]వినయవిహీనుల దుర్యోధనదుశ్శాసనులఁ బవనతనయుఁడు రాధా
తనయుని[2] నరుఁ డేఁ గుంభజు, ననిఁ జంపుదు మేల [3]వగవ నంబుజనేత్రా.

146. వ. అని యందఱు ద్రుపదరాజపుత్త్రి నాశ్వాసించి రంత నచ్యుతుండు ధర్మ
రాజున కి ట్లనియె.

147. తే. ద్వారవతినుండియే[1] యుయుధానువలన, [2]ధారుణీశ యింతయు
విని తత్క్షణంబ
[3]యరుగుదెంచి యాపన్నుఁడ వైననిన్నుఁ, జూచి దుఃఖోపహత
[4]మనస్కుండ నైతి.

---

141. 1. తనరుచునున్న – పెక్కుప్రతులు.

143. 1. బొనర్చుచుం – ఇ. ఈ. ఉ. ఐ. ఘ. త. 2. బాపుచునుండుట, పాచుచు
నుండుట – అని పాఠములు. 3. సంఘము హతిన్ – కొన్నిప్రతులు; లోకవితతిన్
బరిమారుతు ముల్లమేల సం, తాపము – శ. ప. 4. బొందఁ జేయఁగ – శ. ప.
కొన్నిప్రతులు. 5. విధాతృనియోగము గల్గియుండగన్ – టొ. స; వృథావిజయో
న్నతి – ల. ప.

144. 1. సక్రోధుం డయి – వీ. శ. ప. శ.

145. 1. వినుమాహీనుల – జ. స. 2. నరు డేను గుంభజు నని – కొన్నిప్రతులు; నరుం డే
గుంభజు – ర. 3. వగచె దంబుజనేత్రీ (వదనా) – పెక్కు తాళపత్రప్రతులు

147. 1. నే యుయుధానువలన – కొన్నిప్రతులు. 2. దనర విని యున్నయంతన – ఈ.
ఐ. త. 3. వచ్చి వనవాసఖేదతనొచ్చు నిన్ను – ఈ. ఐ. త. 4. చేతసుండ
నైతి – పెక్కుతాళపత్రప్రతులు. రూపము విచారణీయము.

148. వ. అయ్యవసరంబున నేను మీయొద్ద నుండమిం జేసి యిట్టి దుర్వ్యసనంబు సంభవిల్లెం[1] గామజంబు లైన స్త్రీ ద్యూత మృగయా పానంబు లను నాలుగు దుర్వ్యసనంబులం బ్రవర్తిల్లకుండఁ [2]బ్రతిషేధింపవలయు నందును విశేషంబుగా[3] ననర్థమూలం [4]బయినపాపద్యూతంబుఁ బరిహరింపనినాఁడు పాపం బగు నని హేతుదృష్టాంతంబులు సూపి కృప ద్రోణ విదుర గాంగేయులం దోడు సేసికొని యాంబికేయు నొడంబఱిచి దుష్టద్యూతంబు సర్వప్రకారంబుల వారింతు.

149. క. [1]వలచి [2]హితంబునఁ బథ్యముఁ, బలికినఁ జేకొనని ధర్మబాహ్యుల నవివేకుల నిగ్రహింతు మీ కెగ్గులు [3]మత్సాన్నిధ్యమున నగునె యెయ్యెడలన్.

*-: కృష్ణుఁడు ధర్మరాజునకు సౌంభకాఖ్యానంబు సెప్పుట :-*

సం. 3 _ 15 _ 1

150. వ. ఏను సముద్రతీరంబున సాల్వుతోడం బదినెలలు[1] యుద్ధంబు సేసి వాని వధియించు[2]పొంటె నక్కడ మసలితి నది గారణంబుగా మీకు దుర్వ్యసనావసరంబున నలబ్ధసన్నిధానుండ నయితి ననిన నది యెట్లని యుధిష్ఠిరుం డడిగిన నాతనికి సౌంభకాఖ్యానంబు సవిస్తరంబుగాఁ గృష్ణుం డిట్లని చెప్పె నీ యజ్ఞంబు[3]న నర్ఘ్యనిమిత్తంబున [4]ననహిష్ణుండయినశిశుపాలుండు [5]నాచేత నిహతుం డగుట విని వానితమ్ముండు సాల్వుం డనువాఁడు [6]తద్వ్యథ[7]ప్రవ

---

148. 1. వించెం - అ. ఇ. ఏ. ఔ. 2. బ్రతిపాదింపవలయు - పీ. శ. ప. పెక్కుప్రతులు. 3. గాన ధర్మమూలంబైన - శ. ప. స; గావున ధర్మానర్థమూలం బైన పావద్యూతంబు - త. డ. 4. బయిన ద్యూతంబు - వా; బయిన పాపద్యూతంబు- పెక్కుప్రతులు.

149. 1. వలనుగ - ఏ. ఓ. ల; తలఁచిహితంబు - ఐ. త. శ. ష. 2. హితంబును - పెక్కుప్రతులు. 3. జేసిన ధార్తరాష్ట్రకులనెయ్యెడలన్ - ఊ. గ. స.

150. 1. మహామత్సరంబున యుద్ధంబు - అ. ఇ. ఎ. ఝ. ల. వీ. 2. చుండియక్కడ - శ. ప; చోటనక్కడ - డ; నిమిత్తంబక్కడ, బూనియక్కడ - అని పాఠములు. 3. నం దర్ఘ్యనిమిత్తంబున - కొన్నిప్రతులు. 4. ననహ్యుంబైన - ఈ. ఐ. ఘ. చ. డ. త. ద. ల; సాహసుం డయిన - కొన్నిప్రతులు. 5. నాచేత హతుం డగుట- డ. 6. తద్వైర - అ. 7. ప్రవర్ధితక్రోధుం డయి - కొన్ని ప్రతులు.

ర్తితక్రోధుం డయి కామగమనం బయిన తన [8]సౌంభకం బను [9]నగరంబుతో సన్నద్ధుం డయి వచ్చి ద్వారవతీపురంబు [10]నవరోధించి.

151. చ. ప్రతినరపాలకాలు శిశుపాలు బలాధికుఁ జంపి దర్పసం
[1]హితుఁ డగుచున్న [2]వృష్ణిఖలుఁ [3]డెక్కడ [4]నెక్కడ నాతనిం జయో
న్నతి [5]వెలయంగఁ జంపెద రణంబున నంచు [6]నలంఘ్యవిక్రమో
ర్జితుఁడయి దాని చుట్టు విడిసెం జతురంగమహాబలంబుతోఁ.

152. క. మేలగు [1]తత్పుర బాహ్యవి,శాలోద్యానముల [2]తాల సాల సరళ హిం
తాల తమాలావలి ని,ర్మూలితముగఁ జేసెఁ దచ్చమూసామజముల్.

153. వ. మఱి తృణ[1]జలధాన్యసమిత్సమృద్ధంబయి [2]శతఘ్నిప్రముఖానేకయంత్రంబుల నలంఘ్యపరిఘాప్రాకారంబులను నపారబలరక్షితఘనకవాటచతుర్గోపురంబులను [3]లబ్ధప్రభూతవేతనప్రహృష్టపుష్టధృష్టవీరసుభటసంకులంబులను నపరిమితగజ[4]తురంగశతాంగంబులను బ్రదీప్తాలాతశాతశరచక్రతోమరపరశుపాశాంకుశ[5]కూటంబులను [6]వీరయోధారూఢవిశాలాట్టాలకంబులను

---

8. సౌభ - వీ. మూలమునందు సౌభ అనియే కలదు. శాల్వస్య నగరం సౌభం గతోఽహం భరతర్షభ. చిత్రశాలప్రతి. పుట. 30. వనపర్వ. 9. నరదంబుతో — ఊ. ఓ. ఘ. 10. నిరోధించి - కొన్నిప్రతులు.

151. 1. వృతుడగుచున్న — జ; హితులగుచున్న కృష్ణబలులెక్కడ — ఆ. ఇ. ఎ. ఝ. 2. కృష్ణఖలుఁడె — వీ. శ. ష. పెక్కుప్రతులు. 3. డెక్కటికేగినదాడిమై — ఆ. ఇ. ఎ. ట. ద. 4. డాగిన — ఊ. చ. 5. వెలుగంగ — కొన్నిప్రతులు. 6. నతర్క్య, నసహ్య, నవక్ర - అని పాఠములు.

152. 1. తత్పురి — ఆ. ఒ. త. శ. ష; తత్పురమార్గ విశాలోద్యాన — స. 2. లోన చలదళతరుహింతాలి — ఓ; కేళిశైలములను హిం — ఔ; లోనచందనతరు హిం — గ. అ; దానిశైలములను హిం — ద; లోనజలదళతదుపాం, తైలాతమాలతతి — ఈ. ఐ. త.

153. 1. కాష్ఠనానాధాన్య - ఈ. ఐ. ఘ. త. 2. శతఘ్ని, పరు[షగ్ని]షాగ్ని ప్రము ఖానేక — కొన్నిప్రతులు. 3. లబ్ధప్రభూతవేతన — వీ. శ. వ. ప్రతులలోలేదు. 4. తురంగంబులను బ్రదీప్తాలాత — కొన్నిప్రతులు; తురంగసహితంబును — కొన్నిప్రతులు. 5. ముఖ్యసాధనంబులను — అ. 6. విహారదోర్యుధవిశాలాట్టాలక —

నొప్పి పరుల కసాధ్యం బయిన [7]ద్వారవతి భేదింప [8]నేరక దాని వెలిం [9]ప్రపాచైత్యదేవాయతన వల్మీకంబు[10]లు వర్జించి సమతలప్రదేశంబున[11] నిబిడంబుగా శిబిరసన్నివేశంబు [12]సేసి నిత్యంబు నుపద్రవంబు సేయుచున్న [13]సౌంభకవిజృంభణంబునకు సహింపక సమరసంరంభంబున సర్వాయుధ సన్నద్ధు లయి.

154. క. ఉద్యద్బలులు గుమారులు, విద్యాధరసములు పురము వెలువడిరి రక్షై
కోద్యములు [1]చారుదేష్ణుఁడు, ప్రద్యుమ్నుఁడు సాంబుఁడును
విపక్ష[2]జిఘాంసన్.

155. మణిభూషణము.

[1]రామవిక్రముఁ డజేయుఁ డరాతి గజావలీ
సామజాహితుఁడు సాంబుఁడు సాల్వచమూపతిన్
[2]క్షేమవృద్ధి యనువాని నకృత్రిమసాహసో
ద్దాముఁ దాఁకె శరధారల ధారుణిఁ గప్పుచున్.

---

పీ. శ. ష. 7. ద్వారావతి - కొన్ని ప్రతులు. 8. నోపక - ఓ. డ. ద. 9. ప్రభూతచైత్య- ఆ. ఉ. చ. డ. 10. లునిర్మూలంబులుచేసి - ఈ. ఐ. త. 11. నిలిచి నిబిడంబుగా - డ; విడిసి - ఇ. ల. 12. సేయించి - ఈ. ఐ. గ. త. 13. సౌంభకు విజృంభణంబునకు - కొన్ని ప్రతులు; సౌభ- పీ. మూలభారతమునందు సౌభ అనురూపము మాత్రమే కనఁబడుచున్నది. సౌంభక అను రూపమునకు ఆకరము కాన్పించలేదు.

154. చారుధేష్ణుడు - శ. ష. పెక్కు ప్రతులు. మూలము మాత్రము చారుదేష్ణుఁడనియే ఉన్నది. చారుదేష్ణశ్చసాంబశ్చ ప్రద్యుమ్నశ్చ మహారథః. పి. పి. ఎస్. ప్రతి. పుట. 85. ఆరణ్యపర్వ. 2. జిగీషన్ - అ. ఇ. వ. స.

155. 1. ఈ మణిభూషణ వృత్తము స్థానమున. ఇ. ఎ. క. గ. డ. ద. స. ప్రతులలో ఈ క్రింది యుత్పలమాల కనఁబడుచున్నది. ఆహవవిక్రముండు (నునజేయుడు) న సహాయు డరాతిగజావలీ సమా౽జాహితుడైన సాంబుడును సాల్వచమూపతి క్షేమ వృద్ధియు, న్నాహవకేలి దాకిరి మహార్ణవవీచుల భంగిరై భుజో,త్సాహసమేతులై కడగి సైన్యము వెక్కసమంది చూడగన్.

నన్నయ రచనగా తోచుటలేదు. రెండవ పాదమునందు అఖండ యతి యను కొనవలెను. 2. క్షేమమూర్తి యను వాని - శ. ష. క్షేమవృద్ధి అను పేరునకు క్షేమధూర్తి, క్షేమమూర్తి అను రూపములు భండార్కరు ప్రతిలో కాన్పించుచున్నవి. పుట. 57, శ్లోక 11, ఆరణ్యకపర్వ.

156. క. జాంబవతేయు బృహద్విశి, ఖంబులకున్ [1]బెదర కెదిరి ఘనుఁడేసె రణా
గ్రంబున నాతనిపై నవి, లంబితుఁడై క్షేమవృద్ధి లక్షశరంబుల్.

157. వ. వాని[1]యేయుశరంబులనేర్పునకు సహింపక సాంబుండు జాంబూనద[2]పుంఖంబు లయిన విశిఖంబులం దదీయరథాశ్వమర్మంబుల నేసిన నవి [3]మర్మ[4]భేదవేదనలం [5]దలరి యతివేగంబున రణంబు వెలువడ రథం బీడ్చుకొన్ని సారథికి వశంబుగాక పఱచె నట్లు సాల్వచమూపతి సమరవిముఖుం డయిన.

158. స్వాగతము.

వేగవంతుఁ డనువీరుఁడు సాంబున్, వేగవంతుఁ డయి వీఁక[1]ను దాఁకెన్
వేగబాణపదవీతతులన్ ది, గ్భాగ[2]ముల్ విశిఖపంజరముల్ గాన్.

159. ఆ. [1]సాంబుఁ బాయు మనుచుఁ జారుదేష్ణుం డగ్గి, వేగవంతుఁ [2]దాఁకి వీఁకతోడ
వానిమస్తకంబు వ్రయ్యంగ[3] వడి గదం, బొడిచె రుధిరవారి[4]పూర మొలుక.

160. వ. ఇట్లు చారుదేష్ణు నిష్ఠురగదా[1]ఘాతంబున వేగవంతుండు విగతజీవుం డయి [2]నిర్ఘాతపాతభిన్నోన్నత గిరిశిఖరంబునుంబోలె నేలఁ ద్రెళ్ళినం జూచి విచింత్యుం డనువాఁ [3]డవిచింత్యవిక్రముం డయి.

---

156. 1. వెరవకెదిరి – క. డ; చెదర – స.

157. 1. పరాక్రమంబునకు – కొన్ని ప్రతులు. 2. మయంబులయిన – డ. 3. మర్మవేదనలందలరి – కొన్ని ప్రతులు. 4. క్షత వేదనలం దెరలి – శ. మ. 5. తల్లడిల్లి – క.

158. 1. నెదిర్చెన్ – గ. శ. మ. 2. మెల్లశరపంజరములుగాన్ – శ. మ. వ. – కొన్ని ప్రతులు.

159. 1. సాంబునేయ జూచి చారుదేష్ణుండగ్గి – అగ్గి అనుటకు బదులు పెక్కు ప్రతులలో తప్పుగా అరిగి యనియున్నది. 2. దాకెవీకతోడ – పెక్కు ప్రతులు. 3. గదగొని పొడిచె – ఇ. ఉ. ఏ. ఓ. డ. ద. 4. పూరితముగ – ఇ. ఔ. డ. ద.

160. 1. ఘాత పాతంబున – ఔ. వీ; ఘాత వేగంబున – ఊ. చ; పాతంబున–ద; ఘాతపాత వేగంబున – అ. 2. కులిశపాత – శ. మ. 3. డచింత్యవిక్రముడయి – పెక్కు ప్రతులు; డవంధ్య విక్రముఁడయి – వీ.

161. తే. చారుదేష్ణుపైఁ గడువాఁడిశరము లేసె, నతఁడు కార్ముకహస్తుఁడై [1]యాక్షణంబ
వానిపై నభిమంత్రించి వహ్నిబాణ, మేసె [2]నుగ్రస్ఫులింగంబు [3]లెసఁగఁ జదల.

162. క. అనలాస్త్ర మట్లు వక్షముఁ, గొనిన విచింత్యుండు [1]గూలెఁ గుతలం బద్రువన్
ఘను వానిఁ జూచి హాహా, స్వన[2]ము లెసఁగ సాల్వసేన సంక్షోభించెన్.

163. వ. సాల్వుండు నిజసేనాసంక్షోభం [1]బుడిచి సర్వాయుధ[2]సనాథం బయినరథం బెక్కి యాదవకుమారవాహినిపయి [3]నెత్తి యేయుచు[4] వ్రేయుచుం బొడుచుచుఁ బ్రతిబలంబు నెల్ల నాయుధమయంబుగాఁ జేయుచున్న వాని కలిగి.

164. సీ. హంసవర్ణోత్తమహయములఁ బూనినరథ మెక్కి కాంచనరమ్యయష్టి
సంభృతమకరధ్వజం బొప్ప బద్ధగోధాంగుళిత్రాణుఁడై [1]యతులశాత
సాయకావలిఁ జేసి సాల్వుఁ బిల్చుచు వానిమీఁదఁ బ్రద్యుమ్నుఁ డమేయ బాణ
వర్షంబు గురిసిన వాఁడును వానిపైఁ గడువాఁడి[2]శరముల గడఁగి యేసె

ఆ. నధికవీరు లయిన యయ్యిద్దఱకు నస్త్ర, కోవిదులకు బోరు ఘోరమయ్యెఁ
దద్ద భయమువొంది తద్ద్వారకాపురి, సౌంభకముల[3] జనులు సంభ్రమింప.

165. క. అనిమొన సాల్వుఁడు ప్రద్యు, మ్నునిశాతశరాలివిద్ధమర్ముం డయి పె
ల్చన మూర్ఛపోయి పడియెం, దనరథముపయిన్ ధరిత్రి దల్లడపడఁగన్.

---

161. 1. యక్షణంబ – డ. 2. ననలస్ఫులింగంబు లెసగజదల – ఓ. ఝ. 3. లెగసె జదల – ద.

162. 1. ద్రెళ్ళి, ద్రెళ్ళ – అని పాఠములు; వడియె గుంభిని యద్రువన్ – చ; వడియె కువలయ మద్రువన్ – క. ఠ. 2. మెసగఁగ – కొన్నిప్రతులు.

163. 1. బుడిపి – పెక్కుప్రతులు. 2. సన్నద్ధంబయిన – కొన్నిప్రతులు; సమేతంబయిన, భరితంబయిన – అని పాఠములు. 3. నెత్తి – కొన్నిప్రతులలో లేదు. 4. వైచుచు – పెక్కుప్రతులు.

164. 1. యతినిశాత–ఆ. ఇ. ఝ. 2. బాణముల్ – వా. కొన్నిప్రతులు; శరములు – ఈ. ఉ. ఐ. గ. ఘ. త. శ. ష. 3. జనులు–వీ. శ. ష. కొన్నిప్రతులు; వారు సంభ్రమింప – ఒ. ఔ. ల; (సౌభకముల) వారు సంభ్రమింప – ల.

166. ఉ. [1]అంతన మూర్ఛదేఱి [2]కలుషానలదీప్తముఖుండు సౌంభకుం
డంతకదండదారుణము లైన శరంబుల రౌక్మిణేయు ది
గ్దంతిబలాఢ్యు నేయుడు నతండును మూర్ఛితుఁడయ్యె వాని [3]సం
భ్రాంతిఁ దదీయసారథి యపాస్తరణాంతరుఁ జేసెఁ జెచ్చెరన్.

167. వ. ఇట్లు మూర్ఛితుం డయిన ప్రద్యుమ్నుం దోడ్కొని చని రణంబు[1]నకు దూరంబుగా నరదంబు నిలిపికొని [2]దారుకసుతుం డున్నంత [3]నొక్కింత ప్రొద్దునకు మూర్ఛదేఱి ప్రద్యుమ్నుండు సూతున కిట్లనియె.

168. క. ఘోరాహవరంగమునకు, దూరముగా [1]నన్ను నిట్లు దోడ్కొని తేరఁ
దారుకసుత నీకుచితమె, వీరారంభంబు సూచి వెఱచితె చెప్పుమా.

169. వ. [1]మఱియు సారథిం జూచి విహ్వలమానసుం డయి యి ట్లనియె.

170. క. సమరవిముఖత్వమును రణ, విముఖులఁ జంపుటయు శరణు వేఁడిన రక్షిం
పమియును యాదవవంశో, [1]త్తముల కుఁగలనయినఁ[2]గలవె దారుకతనయా.

171. క. విక్రమము విడిచి సమరా, పక్రాంతుఁడ నయిన నన్ను బలదేవుఁడునుం
[1]జక్రధరుండు కుమారులు, నక్రూరాదులు[2]ను నేమియని నగరె సభన్.

---

166. 1. అంతట – ల. 2. కుపితాంతకరూపధరుండు – క. 3. విభ్రాంతి – అ. క; సుద్భ్రాంతి – ఈ. ఐ. త.

167. 1. నకనతి దూరంబుగా – పెక్కుప్రతులు. 2. దారకసుతుండు – శ. ష. పెక్కుప్రతులు. కాని మూలము దారుకిః అని యున్నది. రణాదపహరత్తూర్ణం శిక్షితో దారుకిస్తథా. చిత్రశాలాప్రతి. పుట. 34. వనపర్వ. 3. కొండొకసేపునకు, కొంత ప్రొద్దునకు, ఒక్కింత తడవునకు – అని పాఠములు.

168. 1. నిట్లు నన్ను – అ. ఉ. ఐ. ఘ. ఝ.

169. 1. ఈ వచనము పెక్కు ప్రతులలో లేదు.

170. 1. త్తములకుఁగల నయినఁ గలవె దారుకతనయా – వీ. శ. ష. శ; త్తములందివి గలవె చెపుమ – వా. కొన్ని ప్రతులు. 2. వినగదారక తనయా – కొన్ని ప్రతులు.

171. 1. జక్రధరుండు కుమారులు – ఈ. ఐ; జక్రధరుండును ననుజులు – ఒ. క. చ. ఠ; చక్రధరసుతులుననుజులు – వా. కొన్ని ప్రతులు. 2. యిదేమియని – అ.

172. వ. చెట్ట సేసి తింకనయినఁ జెచ్చెర సాంబ చారుదేష్ణు [1]లున్నచోటికి సాల్వాభిముఖంబుగా రథంబు [2]వఱపు మనిన సారథి యి ట్లనియె.

173. క. [1]రథి కిమ్ము గానియెడ సా, రథి [2]ధృతిమెయిఁ గావవలయు రథియును దక్షా
రథిఁ గావవలయు [3]రథిసా, రథులు పరస్పరశరీరరక్షకు లగుటన్.

174. ఆ. సాల్వబాణవిగత[1]సత్త్వుఁడ వైన ని, న్నిట్లు [2]దెచ్చితిని సహిం[3]ప వలయు
నారథాశ్వముల[4] ఘనస్యందనము నిదె, చూడు మనుచు [5]సూతసూనుఁ డపుడు.

175. వ. సవ్యాపసవ్యవిచిత్రమండల[1]గతుల నాక్షణంబ సాల్వునకు నప్రదక్షిణంబుగా రథంబు వఱపిన [2]దాని సహింపక సాల్వుండు మూఁడమ్ముల సారథి నేసి మఱియు రాక్షసమాయ ననేకశరంబులు ప్రద్యుమ్నుపై నేసిన.

176. క. అమ్మాయాశరములు భ, గ్నమ్ములుగాఁ [1]జేసి తన్ము[2]ఖమ్మునఁ దద్వ
[3]క్షమ్మున నొక్కట[4]బ్రహ్మా, స్త్రమ్మును బ్రద్యుమ్నుఁ డేసె దారుణభంగిన్.

---

172. 1. లున్నయెడకు - క. డ. 2. పోనిమ్మని - కొన్ని ప్రతులు; వారనిమ్మని - ఒ. ఔ.

173. 1. రథి నిమ్ముగాని - డ. 2. కెమ్మెయిగావవలయు - స. 3. సారథిరథులు పరస్పర - కొన్ని ప్రతులు.

174. 1. సత్త్వుడవైన - పెక్కు తాళపత్ర ప్రతులు; సంజ్ఞుఁడవైన-ఉ. ట. వా. వి. శ. ష. 2. దెచ్చుటకు సహింప - కొన్ని ప్రతులు. 3. పు దీని - కొన్ని ప్రతులు. 4. న నాసత్వమును వీని - ఈ. ఐ. త. 5. పెరిగి సూతుడవుఁడు, చెలఁగి సూతుఁ డపుడు - అని పాఠములు.

175. 1. మార్గంబుల నక్షణంబ- పెక్కు ప్రతులు; ప్రచారం బుల - ఈ ఐ. త. 2. వాని సహింపక - ఈ. ఊ. ఐ. త. శ. ష.

176. 1. నేసి — పెక్కుప్రతులు. 2. ఖంబును — కొన్నిప్రతులు. 3. క్షమ్మను — ఈ. ఐ. జ. 4. బ్రహ్మాస్త్రమునను — పెక్కుప్రతులు.

177. వ. ఇట్లు బ్రహ్మాస్త్రపీడితుం డయి సాల్వుండు [1]మూర్ఛవోయి రథంబుపయిం బడిన [2]వాని వెండియు నొక్కదివ్యబాణంబు నేయ సమకట్టిన నంతరిక్షంబున హాహా[3]రవంబు [4]లెసఁగె నంత దేవగణప్రేరితు లయిన [5]నారదమారుతులు ప్రద్యుమ్ను పాలికి వచ్చి యి ట్లనిరి.

178. తే. వీఁడు నీచేత వధ్యుండు గాఁడు మున్న
కేయ కుండుము వీని నారాయణుండు
మొనసి వధియించు నని పల్కి వనజగర్భుఁ
డనినఁ బ్రద్యుమ్నుఁ డేయక [1]యనఘుఁ డుండె.

*—: సాల్వుఁడు ప్రద్యుమ్నునిచే బాధితుండై మరలిపోవుట :—*

సం. 3 — 20 — 26

179. వ. అంత సాల్వుండును [1]నివృత్తుం డయి [2]ద్వారకాపురియవరోధం బుడిగి తన సౌంభకం బెక్కి క్రమ్మఱి చనియె నంత నీయజ్ఞంబు [3]నిర్వృత్తం బయిన నే నరిగి [4]బలభగ్నీకృత పాదపవనంబులదాని [5]ననభిజ్ఞాతద్వారదేశంబులదాని నస్వాధ్యాయస్వాహా[6]కార మహీసురాగారం బయినదాని నపేతభూషణ యోషిజ్జనంబులదాని ద్వారవతిం జూచి [7]యాహుకాత్మజువలన నంత వృత్తాంతంబును నెఱింగి సాల్వుం జంపికాని యిప్పురంబు సొరనొల్లనని

---

177. 1. మూర్ఛితుండై — కొన్నిప్రతులు. 2. వెండియు నొక్క దివ్యబాణం బేయ సమకట్టిన — ఈ. ఐ. త. 3. కారంబులు, ధన్వులు — అని పాఠములు. 4. చెలంగె నంత — డ. 5. నారదపర్వతులు — కొన్నిప్రతులు. కాని మూలము నారద మారుతులు అనుపాఠమునే సమర్థించుచున్నది. నారదం ప్రేషయామాసుః శ్వసనం చ మహాజవమ్.

178. 1. యనఘు యరిగె — డ; యనఘు యుడిగె — వీ.

179. 1. విగతసైన్యుండయి, సమరవిరతుండై — అనిపాఠములు. 2. ద్వారవతీ నిరోధం బుడిగి — వీ. శ. ష; ద్వారకాపురనిరోధంబు — కొన్ని ప్రతులు. 3. నిర్వర్తితంబైన—గ. జ. వీ. శ. ష; సంపూర్ణంబయిన — ఈ. ఐ. త. 4. బలభగ్న పాదప — వీ. శ. ష. 5. భగ్నద్వారదేశంబులదాని — శ. ష. 6. కారస్వధా కార మహీసుర — ట. వా. వీ; కారమహీసుర — శ. ష. పెక్కు ప్రతులు. 7. హృదికాత్మజమ్ — కృతవర్మాణమ్. అని మూలము. ఆహుకుఁడు ఉగ్రసేనుని తండ్రిగా కాన్పించును.

నిశ్చయించి దీని నప్రమాదులరై రక్షించుకొని యుండుండని బలదేవాదులం బంచి యప్పుడ ప్రయాణభేరి నఱవంబంచి కృతస్వస్తి[8]వచనపురోహితప్రముఖ బ్రాహ్మణవరులకు నమస్కరించి [9]శైబ్యసుగ్రీవంబు లనువాహనంబులం బూనిన దివ్యరథం బెక్కి.

180. ఆ. పాంచజన్యరవముఁ [1]బంచమహాశబ్ద, రవముఁ జెలఁగె దిశలు సెవుడువడఁగ
నొలసి జనుల దీవనలు [2]మించె రమ్యమై, గరుడకేతనంబు గ్రాలెఁ జదల.

181. వ. అట్లసంఖ్యాతచతురంగసైన్యంబులతో నరిగి గిరి వన సరోవర సరిద్దేశంబులు గడచి[1] మార్తికావతదేశంబున కరుగునంతకు ముందర సాల్వుండు సౌంభ కారూఢుం డయి సముద్రకుక్షిదేశంబునకుం బోయిన.

182. క. ఏనును వానిపిఱుందన, మానక చని తచ్చమూసమాజముతోడఁ
భూనాథ రణము సేసితి, నానానిశితాస్త్రవర్షణ[1]వ్యాప్తముగన్.

183. క. వీరు లగుసాల్వయోధుల, నారాచావళులు గప్పె నారథము పయిఁ
[1]సారథిఁ దురంగములపయి, చారుధ్వజ యష్టిపయి నసంఖ్యాతముగన్.

184. వ. [1]వాని నెల్ల నస్మదీయగోచరంబులు గాకుండ [2]ననేకాయుత[3]శరంబు లేసి సాల్వసైన్యంబుతో మహాయుద్ధంబు సేసిన.

---

పుట. 24-25. 8. ర(వ)చనులైనపురోహిత – వి. శ. ష. 9. సైన్యసుగ్రీవ – అత్యధికసంఖ్యాకప్రతులు. భం. ప్రతియందు సైన్య సుగ్రీవ అనికలదు. మేఘపుష్ప వలాహకయుక్తంబైన – పెక్కుప్రతులు.

180. 1. బంచమహావాద్యరవము – ఈ. ఐ. త. వి. శ. ష. మూలమునందు పంచమహాశబ్ద (వాద్య) ప్రశంస బొత్తుగాలేదు. పంచమహాశబ్ద ప్రశంస నన్నయకాలమున నుండెనా? 2. వించె – డ.

181. 1. మార్తికావత – వి. శ. ష. మూలమిట్లున్నది. సరాంసి సరితశ్చైవ మార్తికావత మాసదమ్. పారశీక. వార్తికావతి, వార్తిక, ఆనర్తక – అను పాఠములు గలవు. శర్కరావత – ష.

182. 1. వ్యాజమునన్ – కొన్నిప్రతులు; వ్యాసమునన్ – ఈ. ఐ. త.

183. 1. సారథిమీద తురంగమచారుధ్వజతతులపై నసంఖ్యాత – వి. శ. ష. పెక్కుప్రతులు.

184. 1. దొరి(ర)ఁగిన వాని నెల్ల – వి. శ. ష. 2. ననేక శకలంబులుగా నేసి – డ. 3. శరంబులదునిమి – ఏ. ఓ. జ. ల.

185. మ. అవనీనాథ తదాహవాంతరమునం దస్మత్కరాకృష్టశా
ర్ఙవినిర్ముక్తనిశాతసాయకశతాగ్ర[1]చ్ఛిన్నమై దైత్యదా
నవదేహప్రకరంబు వాత[2]విధుతార్ణఃపూర్ణసంఘూర్ణితా
ర్ణవకుక్షిం బడియెం గపిప్రవరసైన్యక్షిప్తశైలాకృతిన్.

186. చ. ఘనతరదైత్యదానవనికాయకళేబరపాతఘట్టనం
దనరి యుగాం[1]త్యకాలచలితంబునుబోలెఁ బయోధి [2]మ్రోసె న
ద్వనధిరవంబుకంటె ననివారితమై [3]చెలఁగెన్ మదీయవా
హిని భటసింహనాద హయహేషిత సింధురబృంహితధ్వనుల్.

187. వ. అట్టి మదీయ[1]సేనోత్సాహంబును నిజసేనాక్షీణతయుం జూచి సహింపక సాల్వుండు [2]వెండియు సౌంభకారూఢుం డయి నాతో మాయాయుద్ధంబు సేయ [3]సమకట్టి.

188. సీ. పరశుపాశాంకుశ కరవాలశూల ముద్గరములు నామీఁదఁ దెరలఁ గురిసె
[1]నేనును గడఁగి యద్దానవుశస్త్రముల్ వాయంగఁ జేసితి మాయఁజేసి
వెఱవక సాల్వుండు వెండియు నామీఁదఁ బరుషశిలావృష్టిఁ గురిసె వరుస
నమరఁ దమఃప్రకాశములతో దుర్దివసుదినశీతోష్ణముల్ గదియఁజేసి

ఆ. దితిసుతాధముండు శతసూర్యశతచంద్ర, శతసహస్ర[2]విష్ణుతతులు వెలుఁగ
గగనతలము [3]సేసెఁ బగలిది రేయిది, యని యెఱుంగ నయితి మనములోన.

---

185. 1. చ్ఛన్నమై – డ. 2. కలుషార్ణః పూరసంఘూర్ణితా – వీ. శ. ష; విధురాంభః పూర్ణ – ఇ. స; విహతార్ణఃపూర్ణ – అ. త; నిహతార్ణఃపూర్ణ – గ. జ. ల. విధుతార్ణఃపూర్ణ – వా.

186. 1. తకాల – ఈ. ఎ. ఐ. త. 2. మ్రోసినన్ – డ; మ్రోసెతద్వనధి – వ. 3. యెగసెన్, యెసగెన్, నెగడెన్, నెఱసెన్ – అని పాఠములు.

187. 1. సేనాసముత్సాహము – అ. ఆ. ఇ. ట; సేనామహోత్సాహము – కొన్ని ప్రతులు. 2. వెండియు – కొన్ని ప్రతులలో లేదు. 3. గడంగి, దొడంగి – అని పాఠములు.

188. 1. నస్త్రముల్ నేనును నడఁగించి దానవు శా – శ. ష; నస్త్రము నేనును నడరి యద్దానవుల్ –శ; నేను గడంగి య ద్దానవునస్త్రముల్ – ల. 2. దీప్తితతులు – ఆ. ద. ల; వహ్నితతులు – ఈ. ఐ. త, 3. గప్పె – ఉ. చ.

189\. క. మనుజేంద్ర సర్వమాయా, పనోదనం బయిన యగ్నిబాణంబున న
[1]ద్దనుజవినిర్మితమాయా, వినివర్తనఁ జేసితిని [2]సవిస్మయమతినై.

190\. వ. అట్టియవసరంబున ద్వారవతినుండి యాహుక[1]ప్రేషితుం డయి యొక్కరుం డతిత్వరితగతిం బఱతెంచి సాల్వుచేత నక్కడ వసుదేవుండు పట్టువడియె నీవెవ్వనితోడం గయ్యంబు సేసెదు క్రమ్మఱి చని పురంబు రక్షించుకొను మనిన విని [2]యదరిపడి మహాబలపరాక్రము లయినబలదేవాదులు రక్షించు కొని యుండ వసుదేవుఁ డేల పట్టువడు నిదిపోలదని సంశయించుచు విమనస్కుండ నయి యుండు నంత.

191\. సీ. పుణ్యా[1]కర్మంబులు వొలిసిన నుర్వికి [2]బ్రీతి నేతెంచు యయాతివోలె
భూషణదీప్తులు వొలియంగ వివృతకేశాంబరుండయి సౌంభకంబు [3]వలనఁ
[4]బఱతెంచు వసుదేవుఁ బాపనిశాచరబలపీడ్యమాను దవ్వులన కాంచి
యత్యంత[5]మోహాశోకాంధుండ నయిన నాహస్తంబువలన విస్రస్తమయ్యె

ఆ. శార్ఙ్గమప్రియావసన్నదేహుండనై, యుడిగి రథముమీఁదఁ బడితి నేను
దానిఁ జూచి భయము దగిలి మత్సైన్యంబు, దల్లడిల్లి [6]యులిసెఁ బెల్లురేఁగి.

192\. వ. అంత [1]నెంతయుం బ్రొద్దునకుఁ దెలిసి సాల్వుసౌంభకంబున వసుదేవుం గానక దాని మాయగా నెఱింగి పదంపడి మాయావి యయిన సాల్వుం జూచి వాని పయి నలిగి యే నేసిన నయ్యసురయు సౌంభకంబు నదృశ్యం బగుటయు.

---

189\. 1. ద్దనుజ వినిర్మిత.........సవిస్తరమతినై — శ. ష. స; ద్దనుజ నినిర్మిత — డ. 2. సవిస్తరమతినై - కొన్నిప్రతులు.

190\. 1. ప్రేరితుండయి - కొన్నిప్రతులు. 2. యుదరిపడి - కొన్నిప్రతులు.

191\. 1. ఫలంబు — క. జ. 2. బ్రీతినేతెంచు యయాతివోలె — పెక్కుప్రతులు; నేతెంచునట్టి యయాతివోలె - వా. వీ. 3. నడుమ - ఇ. ల. 4. బడుతెం(దెం)చు వసుదేవు - ఇ. ఎ. గ. ఝ. ద. వీ. సం. సూ. 5. శోకమోహార్తుం డయిన - జ. ల; శోకమోహాత్ముండ నైన - డ; శోకమోహాంధుండనై - పెక్కుప్రతులు. 6. యవిసె - కొన్ని ప్రతులు.

92\. 1. కొంతప్రొద్దునకు - కొన్నిప్రతులు.

193. క. అసురుల యాక్రోశధ్వను, లెసఁగెం బదిదిశల నంత నేనును దద్రా
క్షసులఁ గతాసులఁ జేసితిఁ, బ్రసభంబున శబ్దభేది బాణప్రతతిన్.

194. వ. అంత సాల్వుండును దనసౌంభకంబుఁ బ్రాగ్జ్యోతిషంబుఁ జేసి తాను [1]దానవుం డయి [2]పర్వతవర్షంబు నాపయిం గురిసిన.

195. ఆ. పరుషవిషమభూరిపాషాణభీషణ, గిరులు వచ్చి నన్నుఁ దెరలఁ [1]గప్ప
వజ్రబాణమేసి వాని నన్నింటిని, బాచి యున్న నన్నుఁ జూచి యపుడు.

196. క. దారుకుఁ డిట్లనియె మహో, వీరు నుపేక్షింపఁ దగునె వీని[1]ని మాయా
ప్రారంభు నుపేక్షింప ర, పారపరాక్రములు పోర[2]ప్రాకృతునైనన్.

197. వ. అనిన వానిపలుకులు విని [1]యలిగి యనలజ్వాలాకరాళం బయి ప్రతికూల రాక్షస [2]యక్ష గంధర్వ దైత్య దానవభస్మసాత్కరణ దారుణం బయిన చక్రంబు నభిమంత్రించి సౌంభకంబు పయి వైచిన నది యుగాంతకాల పరివేషభీషణం బయిన రవిమండలంబునుంబోలె గగనంబునం బఱచి సౌంభక మధ్యంబునం బడిన.

198. చ. తడయక ఘోరదర్శన సుదర్శనపావకుచే దహింపఁగా
బడి పరమేశ్వరోగ్రశరపావకదగ్ధపురత్రయాభమై
యొదరి ధరిత్రిమీఁదఁ బడియెం [1]జెడి సౌంభక మంత సాల్వుఁడుం
బడియె మదీయచక్రపటుపాతరయంబున రెండువ్రయ్యలై.

---

194. 1. మానవుండయి – శ. వ. 2. శిలాకలాపలాపితలతాగుల్మ వల్మీకమహాపాదపం బగు పర్వతవర్షంబుకురిసిన – గ. వ.

195. 1. గప్పె – పెక్కు ప్రతులు.

196. 1. నధర్మ ప్రారంభు – ఈ. ఉ. ఐ. ఔ. ఘ. ఠ. త. 2. ప్రాకృతునయినన్ – ల. వీ. శ. ష. స; ప్రాకృతులైనన్ – పెక్కు ప్రతులు; బలియుఁడు వీనిన్–గ. వా.

197. 1. యలిగి – కొన్ని ప్రతులలో లేదు. 2. యక్ష (గంధర్వ) – అ. క. ప్రతులలో లేదు.

198. 1. వడి – కొన్ని ప్రతులు.

-: పాండవులు ద్వైతవనంబునకు వచ్చి యుండుట :-

సం. 3 - 23 - 42

199. వ. అని యిట్లు సాల్వుం దనచంపిన విధంబుసెప్పి చక్రధరుండు పాండవుల వీడ్కొని సుభద్రాభిమన్యులం గాంచనరథం బెక్కించుకొని తోడ్కొని ద్వారవతి కరిగె ధృష్టద్యుమ్నుండును బ్రతివింధ్యాదు లయిన ద్రౌపదేయులం దోడ్కొని ద్రుపదుపురంబునకుం జనియె నిట పాండవులును రథంబు లెక్కి యాయుధంబులు ధరియించి యింద్రసేనాదిమూలభృత్యు [1]లిరువ దుండ్రు ముందటరా ననేకసహస్రబ్రాహ్మణవరులతో ద్వైతవనంబున కరిగి రంత ధర్మరాజు [2]తమ్ముల కిట్లనియె.

200. మధ్యాక్కర.

ఇది మహోగ్రాటవి సింహ శర భోరగేంద్ర శార్దూల
మదగజాకీర్ణంబు దీనిలోన నేమఱకుండ వలయు
నదియునుంగాక [1]పరప్రయోగమాయలు గల వెఱిఁగి
[2]మది నుండునది [3]యన్న నన్న కిట్లను మఘవనందనుఁడు.

201. వ. బ్రహ్మ[1]విదులును దపోవృద్ధులైన బ్రాహ్మణులును నఖిలలోకద్వారంబుల నప్రతిహతు లయిన నారద ద్వైపాయనాదిమునివరులును నీచేత నుపాసితు లయి నీకుశలంబ కోరుచుండుదురు భవ[2]త్ప్రతాపం బెల్ల[3]వారిని రక్షించు నిద్వనంబు సకలకాల కుసుమఫలభరిత వనస్పతి శాఖాశిఖారూఢ మయూరకీర కోకిలాలాప మధురంబును బక బలాక కోక కారండవ సారస రమ్యమధుకర

---

199. 1. లిరువది వేలు - కొన్ని ప్రతులు; మూలము. ప్రేష్యాఃపురో వింశతిరాత్త శస్త్రాః. 2. భీమున కిట్లనియె - ఇ. ట.

200. 1. పరప్రయోగమాయలు - ఔ. క. జ. ర. త. వీ. శ. ష. సం. శ; రహస్య ప్రయోగమాయలు - కొన్ని ప్రతులు; వరప్రయోగ - వా. కొన్ని ప్రతులు. 2. మది నుండు మనయన్న కిట్లనియె పవమాన నందనుండు - ల. 3. యన్న నిట్లనియె పవమాన నందనుండు-గ.

201. 1. విదులయిన తపోధన బ్రాహ్మణులను వృద్ధులు నఖిలలోక - వా; విదులును దపోవృద్ధులైన బ్రాహ్మణులును నఖిలలోక - కొన్ని ప్రతులు. 2. భావంబెల్లవారికి - కొన్ని ప్రతులు. 3. వారికి రక్షణీయం బిద్వన - వీ. శ. ష. కొన్ని ప్రతులు.

సౌమ్యసరోవరసంకులంబును విమలశీతలజలప్రవాహానదీశోభితంబును మహర్షి గణసేవితంబును నై యొప్పుచున్నయది యిందుండుదమని లలితలతావితా నాదిరమణీయంబు లయిన వృక్షమూలంబుల నేవురు వేఱువేఱ నివాసంబులు నేసి నియతాత్ములయి యిష్టంబున దేవపితృకార్యంబులు నేయుచుం దమ్ముఁ జూడ వచ్చిన మహామునులకు బ్రాహ్మణులకు మనఃప్రియంబు లయిన యాహారంబులు వెట్టుచు ద్వైతవనంబున నుండు నంత.

202. క. పాండవుల కడకు ధర్మవి, దుండు తపోదహనదగ్ధదురితౌఘుఁడు మా ర్కండేయుం డనుమునినా, థుం [1]డంతేవాసిగణముతోఁ జనుదెంచెన్.

203. వ. ఇట్లు వచ్చి వారలచేత నర్చితుం డయి వనవాసక్లేశదుఃఖితు లయిన పాండ వులను ద్రౌపదిం జూచి యమ్మార్కండేయుం డి ట్లనియె.

204. సీ. పితృ[1]నిదేశమ్మునఁ బృథివీశ్వరత్వంబు, విడిచి సానుజుఁడై పవిత్రచరిత జానకిఁ దోడ్కొని చని వనంబున నున్న రఘుకులనందను రాముఁ దొల్లి చూచితి నిపుడు భూసురవంశ[2]పోషకు సాధుజనస్తుత్యు సత్యధర్మ నిత్యు ధర్మజు రమణీయకీర్తిప్రియు, శమవంతుఁ జూచితి సగరభరత

ఆ. నల యయాతి వైన్య నాభాగు లాదిగా, నాదిరాజులెల్ల నధికధర్మ సత్యయుక్తిఁ జేసి [3]సకలలోకంబులు, వడసి భాగధేయ[4]భాగు లయిరి.

205. వ. పాపసౌబలప్రయుక్తుం డయిన ధార్తరాష్ట్రు నట్లు ధర్మువు దప్పిన వా రెవ్వరును లేరు మీరు ధర్మనిత్యులగు సత్యవ్రతులరు గావున మీకిష్టసిద్ధి యగు నని మార్కండేయుం డరిగిన నపరసంధ్యోపాసనాసీనుం డయిన ధర్మరాజును సాయంహోమార్థప్రజ్వలితజ్వలనంబు లయిన యనేకసహస్ర బ్రాహ్మణాగ్నిహోత్రంబులం జూచి బకదాల్భ్యుం డను మహాముని యిట్లనియె.

---

202. 1. డంతర్వాసిమునులతో — ఇ. ఎ. ఝ; డంతట తపసిగణముతో — వ.

204. 1. నియోగంబున — ఉ. చ. 2. పోషణు — పెక్కు ప్రతులు. 3. పర్వ — పెక్కు ప్రతులు. 4. భాగ్యులైరి, భాక్కులైరి — అని పాఠములు.

206. ఉ. భూమిసురోత్తముల్ ప్రకృతి[1]పుణ్యవిధాయులు వీరు ఋగ్యజు
స్సామపరాయణుల్ పరమసాధుచరిత్రులు మీకు సంతత
ప్రేమమునన్ [2]శుభోన్నతులు [3]వెంచుచు నుండుటఁ జేసి సద్గుణో
ద్దా[4]మ యరణ్యవాస మిది దద్దయు నొప్పెడు మాకుఁ జూడఁగన్.

207. వ. బ్రాహ్మణానుగ్రహంబునం జేసి తొల్లి వైరోచనాదు లనేక కాలంబు లక్షయ లక్ష్మీవిభవు లయి సముద్ర[1]నేమిభూచక్రంబు రక్షించిరి[2] యనిలసహాయుం డయిన యగ్నిదేవుం డరణ్యంబులు దహించు నట్లు బ్రాహ్మణసహాయుం డయిన మహీశుండు శత్రువర్గంబు నిశ్శేషంబుసేయు వినీతుం డయి విప్రుల చేత [3]ననుశాసితుం [4]డయిన రాజునకు నలబ్ధలాభాదిత్రితయంబు సంపన్నం బగు బ్రాహ్మణరహితుం డయి ధర్మహీనుం డయిన రాజును బ్రజ [5]వలవదు ప్రజానురాగంబు లేనివానికి రాజ్యంబు [6]సుస్థిరంబు గానేరదు మీరు బ్రాహ్మణప్రియులరు [7]ధర్మనిత్యుల రెప్పుడును మీ కభ్యుదయం బగు ననిబకదాల్భ్యుం డరిగినఁ బాండవులుం దమయిష్టంబున నుండి దుఃఖోపశమనంబు లయిన కథలు సెప్పు[8]కొనుచున్న [9]యవసరంబున ద్రౌపది ధర్మరాజున కి ట్లనియె.

---

206. 1. పుణ్యవిధేయులు – ఊ. ఏ. ఓ. గ. జ. డ. ద. వ. స. శ. పుణ్యవిధానులు – కొన్ని ప్రతులు. 2. సుఖోన్నతులు – అ. ఏ. ఔ. డ. త. 3. పెన్పుచు, పెంపుచు – అని పాఠములు. 4. యరణ్యవాసమిది – అ. ఆ. ఇ. ఊ. ఎ. ఒ. క. చ. ఝ. ల; మరణ్యవాసమిది – వా. కొన్ని ప్రతులు.

207. 1. ముద్రిత, మేఖల – అనిపాఠములు. 2. రనిల – పెక్కు తాళపత్ర ప్రతులు. 3. నధిష్ఠితుండైన, శిక్షితుండైన, ననుష్ఠితుండైన – ల. స. పెక్కు తాళపత్ర ప్రతులు. 4. డయిన రాజునకు వర్గచతుష్టయంబు సంపన్నంబగు – జ. శ. ష. 5. లబ్ధలాభాది చతుష్టయంబు – డ. ల. పెక్కు ప్రతులు. ఇచ్చట మూలమునందు త్రితయమేకలదు. అలబ్ధలాభాయచలబ్ధస్యవృద్ధయే, యథార్హతార్థ ప్రతిపాదనాయ – చిత్రశాలాప్రతి. పుట. 46. వనపర్వ. 6. పొందదు, వొందదు – పెక్కు ప్రతులు. 7. సుచిరంబు – కొన్ని ప్రతులు. 8. బ్రహ్మణ్యులరు – ఏ. ఓ. ఔ. ద; లబ్ధిధర్ములరు – ల. 9. చున్నచో – కొన్ని ప్రతులు. 10. యవసరంబున – పెక్కింటలేదు.

-: ద్రౌపదీ ధర్మరాజుల సంవాదము :-

సం. 3 _ 28 _ 2

208. ఆ. వృద్ధు గొడుకుపలుకు విని [1]క్రూరుఁడై పాప, బుద్ధిఁ జేసి మిమ్ము భూతలంబు
వెలువరించి రాజ్యవిభవంబు గొని యిప్పు, డలుకసెడి
సుచిత్తుఁ డయ్యె నొక్కొ.

209. ఆ. అద్దురాత్మహృదయ [1]మది యయః పాషాణ, నిష్ఠురంబు
ధర్మ[2]నిధుల మిమ్ము
నట్లు గొడుకు లెగ్గు లాడంగఁ బోయిన, [3]వలదనండ కలహవాంఛఁ జేసి.

210. సీ. విమలహర్మ్యంబుల విహరించువారలఁ [1]బ్రియమహార్హాసనశయనరతులఁ
జందనాగురులిప్తచారుసర్వాంగుల నతనరనాథసేవితుల మిమ్ము
[2]వనమునఁ గ్రుమ్మరువారిఁ గాఁ గుశబృసీశయనాభిరతులఁ గా నియతరూక్ష
భూరేణుధూసరీభూతవిగ్రహులఁ గా[3] ద్రుతవన్యమృగనిషేవితులఁ గాఁగ

ఆ. నిట్లు సూచి చూచి యే నెట్లు చిత్తోప, శాంతి[4] సేయుదాన సకలభోగ
విషయవిరతిఁ జేసి విధియును ధృతరాష్ట్రు, నట్లు మీకు నహితుఁ డయ్యె నొక్కొ.

211. క. భవదాజ్ఞానిగళంబునఁ, దవిలి పరాక్రమము విడిచి ధరణీశ్వర నీ
యవరజు లిడుమలఁ [1]బడి కడుఁ, జివికిరి చెఱఁబడిన సింహశిశువుల[2]భంగిన్.

212. ఆ. పరనరేంద్రమకుటపద్మరాగద్యుతి, నరుణ మగు భవత్పదాబ్జయుగము
పరుషధా[1]తుశిలలపై నిప్పు డరుగుట, నరుణ మయ్యెఁ బర్వతాంతరముల.

---

208. 1. క్రూరహృదయుఁడై నీతిమాలి మిమ్ము భూతలంబు — ల.

209. 1. మత్త్యయః పాషాణ — ల; మరయంగ నాయస నిష్ఠురంబు — జ. వీ. శ. ష.
2. విదులమిమ్ము — ఆ. ఇ. చ. ఝ. 3. వలవదనఁడ (డు) కలహ — వీ. శ. ష. స.
పెక్కు ప్రతులు; వలదనండు — అ. ఔ. డ. ద.

210. 1. ప్రియమృదులాసన — కొన్ని ప్రతులు. 2. వనముల — వీ. ఒ. ఔ. త. ల.
3. నుద్ధత వన్యమృగ — శ. ష. 4. వడయుదాన — కొన్ని ప్రతులు.

211. 1. గుడుచుచు — ఆ. ఎ. ఝ. ద. ల. 2. పోలెన్ — పెక్కు ప్రతులు.

212. ధాతుశిలలపై — వీ. శ. ష. పెక్కు ప్రతులు; దారుశిలలపై — వా. శ.

213. క. [1]అనవరతసౌఖ్యసంపదఁ, బెనుపొందుచు నుండు మీకు భీకరకాంతా
రనివాసాయాసంబుల, ననఘా యిబ్భంగి నవయ నలమట వొడమెన్.

214. వ. నిత్యంబును బదివేవురు [1]బ్రాహ్మణులు బ్రహ్మవిదులు బసిండి [2]తళిగల నిష్టాన్నంబులు గుడిచి తృప్తు లయినం దద్భుక్త[3]శేషం బుపయోగించుచుండు నీకు వన్యమూలఫలాశనంబు లుపయోగించుచు వన్యులయందుఁ గ్రోధంబు విడిచి యునికి యుచితంబు గాదు.

215. సీ. పదివేలగజముల బలమున విలసిల్లు ననిలసుతుండు గాఱడవిలోనఁ
గ్రుమ్మరి కాయలుఁ గూరలు దిని పేదవడినఁ జూచియు దీర్ఘబాహుయుగళుఁ
డయ్యును బాహుసహస్రంబు కలిగిన యర్జునుకంటె బలాఢ్యుఁ డగుచు
[1]నేకవేగంబున నేనమ్ము లొక్క యమ్మేసినవిధమున నేయ నేర్చు

ఆ. నర్జునుండు వనమృగావలిఁ గలిసి [2]యి, ట్లున్నఁ జూచియును సుఖోచితాత్ము
లైన కవలు దీనులై యున్నఁ జూచియు, నుపశమంబుఁ దాల్చి యుండఁ దగునె.

216. వ. క్షమయును దేజంబును నయ్యయికాలంబులఁ బ్రయోగిం[1]ప నేరని రాజునకుం బ్రజానురాగప్రతాపంబులు లే వను నీయర్థం బితిహాసంబున వినంబడు క్షమాతేజంబులలోన నెయ్యది విశేషంబు దానిన[2] నిర్ణయించి చెప్పు మని బలింద్రుండు దొల్లి తన పితామహుండయిన ప్రహ్లాదు నడిగిన నాతండు బలీంద్రున కి ట్లనియె.

---

213. 1. ఈ పద్యము పెక్కు తాళపత్ర ప్రతులలో లేదు.

214. 1. బ్రహ్మవిదులైన బ్రాహ్మణులు - ఆ. జ; బ్రహ్మవిదులకు, బ్రాహ్మణులకు - కొన్ని ప్రతులు. 2. పెళ్ళెరంబుల - పెక్కు ప్రతులు; పళ్ళియల - ఆ. స. 3. శేషామృతంబు - అ. ఆ. ట.

215. 1. నరయవేగమున నేనమ్ములు - శ. ష. 2. యిట్లుండఁ జూచియు - పీ. శ. ష. కొన్ని ప్రతులు.

216. 1. పనిరాజునకు - కొన్ని ప్రతులు. 2. నచేసెద చెప్పుమనిన - పెక్కు ప్రతులు.

217. ఆ. క్షమయ తాల్చి యుండఁ [1]జన దెల్లప్రొద్దుఁ దే, జంబ
తాల్చి యుండఁ జనదు పతికి
సంతతక్షముండు సంతతతేజుండు, నగుట దోష మందు [2]రనఘమతులు.

218. వ. [1]అది యెట్లనిన నిత్యక్షమాన్వితుం డయినవానికి భృత్యులు వెఱవక యవమానంబు సేయుదు రర్థంబులయం దధికృతు లయినవారలు ధనంబు లపహరించి దర్పంబు సూపుదురు మఱి నిత్యతేజోధికుం డైనవాఁ డతిక్రూరదండంబున సర్వజనసంతాపంబు సేయుచు గృహగతం బైన సర్పంబునుంబోలె నెప్పుడు నుద్వేగకరుం డగుం గావునఁ గాలోచితంబులుగా [2]క్షమాతేజంబులు [3]గల్పించునది [4]యథాకాలకల్పితక్షమాతేజుం డైనవానికి నుభయలోకసిద్ధి యగు నని బలీంద్రప్రహ్లాదసంవాదంబు సెప్పి వెండియు ద్రౌపది యి ట్లనియె.

219. తే. [1]ఆది నపరాధ మొక్కటి యైన నదియు
నల్ప మైనను [2]క్షమియించు నదియుఁ గాక
చెనసి యప[3]రాధములు పెక్కు సేయుచున్న
పాపకౌరవ్యులకు సహింపంగ నేల.

220. క. ఇది తేజంబున కవసర, ముదితక్రోధుండ వగుమ యొక్కించుక దు
ర్మదు లగుసుయోధనాదుల, నదయుల వధియింతు రుగ్రులై నీ[1]తమ్ముల్.

---

217. 1. గాదెల్లప్రొద్దు – పెక్కు ప్రతులు; జనదెల్లప్రొద్దు – వా. 2. రార్యజనులు–ఉ; రవనిపతికి – కొన్ని ప్రతులు.

218. 1. అదియెట్లనిన – పీ. శ. ష. కొన్ని ప్రతులు; ఎట్లనిన – వా. కొన్ని ప్రతులు. 2. ప్రయోగించునది – కొన్ని ప్రతులు. 3. యథోచిత – ఇ. ఎ. ఝ.

219. 1. అరయ నపకారమొకఁడైన నదియు నల్ప, మైనక్షమియించునదిగాక యలయ కిపుడు – పీ. శ. ష; అరయ నపకార మొక్కటియైన నల్ప, మైన శమియించు నదిగాక యలయకిపుడు – స; అధిప యపరాధ మొక్కండయైనన – ప; ఆది, అనుటకు, అరయ అనుపాఠము ఏ. ఓ. గ. జ. ఝ ప్రతులందుకలదు. 2. శమియించు – కొన్ని ప్రతులు. 3. కారములు – కొన్ని ప్రతులు.

220. 1. య[illegible]జుల్ – పెక్కు ప్రతులు.

221\. వ. అనిన ధర్మరా జిట్లనియె.

222\. సీ. క్రోధంబు పాపంబు గ్రోధంబుననచేసి యగుఁ [1]జువ్వె ధర్మకామార్థహాని
గడుఁ గ్రోధి గర్జంబు గానండు క్రుద్ధుండు గురునైన
నిందించుఁ గ్రుద్ధుఁడైన
వాఁ డవధ్యులనైన వధియించు [2]మఱి యాత్మఘాతంబు
సేయంగఁ గడఁగుఁ గ్రుద్ధుఁ
డస్మాదృశులకు ధర్మానుబంధుల [3]కిట్టి క్రోధంబు దాల్చుట గుణమె చెపుమ

ఆ. యెఱుకగలమహాత్ముఁ డెఱుకయ న్జలముల,నార్చుఁ గ్రోధమనుమహానలంబు
గ్రోధవర్జితుండు గుఱుకొని తేజంబు, దాల్చు దేశకాల తత్త్వ మెఱిఁగి.

223\. క. క్షమ గలవానికిఁ బృథ్వీ, సమునకు నిత్యంబు [1]విజయసంసిద్ధి యగున్
[2]క్షమి యైనవాని భుజవి, క్రమము గడుఁ వెలయు సర్వకార్యక్షమమై.

224\. వ. తేజః[1]ప్రభవంబు లైన [2]యమర్ష దాక్షిణ్య శౌర్య శీఘ్రత్వంబు లను నాలుగు గుణంబులు క్షమావంతునంద వీర్యవంతంబు లగుఁ దొల్లి కశ్యపగీత లైన గాథలయం దీయర్థంబు వినంబడు వినుము వేదంబులు యజ్ఞంబులు శౌచం బును సత్యంబును విద్యయు ధర్మువు సచరాచరం బయిన జగ మంతయు క్షమయంద నిలిచినవి తపస్స్వాధ్యాయయజ్ఞకర్తలయు బ్రహ్మవిదులయుం బడయు పుణ్యగతులు క్షమావంతులు వడయుదు రదియునుం గాక కృష్ణ ద్వైపాయన భీష్మ విదుర కృప ద్రోణ సంజయ ప్రభృతులు నాయుపశ మంబ కీర్తింతు రుపశమహీనుం డయిన దుర్యోధను కారణంబున ధార్త రాష్ట్రుల కెల్లం బ్రళయం బగు ననిన ద్రౌపది వెండియు ని ట్లనియె.

---

222\. 1. జూవె – ఇ. ఈ. ఐ. త. 2. తుదినాత్మఘాతంబు – డ. 3. కట్టిక్రోధంబు– కొన్ని ప్రతులు.

223\. 1. నర్థసంసిద్ధి, ధర్మసంసిద్ధి – అని పాఠములు. 2. క్షమియైనవాని – ప. ఓ. ౫. జ. ల. వీ. శ. ష; క్షమయైన – వా. స; క్షముఁడైనవాని – ఆ. ఈ. ఉ. ఒ. ఔ. క. ఘ. చ. ఝ. ఠ. డ. త. ద.

224\. 1. ప్రభావంబులైన – కొన్ని ప్రతులు. 2. ఇచ్చట మూలమిట్లున్నది. దాక్ష్యం హ్యమర్షశ్శౌర్యంచ శీఘ్రత్వమితి తేజసః, గుణాం క్రోధాభిభూతేన నశక్యాః ప్రాప్తుమంజసా, దాక్ష్యం – కర్మసుకౌశలమ్; చిత్రశాలాప్రతి. ఫుట. 50. వనపర్వ.

225. మధ్యాక్కర.

క్షమయందు చిత్తంబు నిల్పి నిర్గతకల్మషబుద్ధిఁ
గ్రమమున ధర్మువునంద వర్తిల్లు కరుణాత్మ నిన్ను
[1]సమర ధర్మంబు రక్షించుఁ బ్రీతితో నని శత్రులందు
[2]సమబుద్ధి [3]సేయంగఁ జనునె నీకు నజాతశత్రుండ.

226. ఆ. ధర్మ[1]దూరులైన ధార్తరాష్ట్రులయం[2]ద, ధర్మ వేమి సేయు ధరణినాథ
నిక్కృతిపరులయందు నిక్కృతిసేయనివారు, వారి నిక్కృతిఁ జేసి వధ్యు లండ్రు.

227. క. ఆర్యులకు విహీనతయు న, నార్యుల కున్నతియుఁ జేసి [1]యవినీతుఁడవై
కార్యము దప్పితి నీకు న, నార్యులు చుట్టములె యార్య [2]లరులె విధాతా.

228. వ. అని [1]విధాతృని ధర్మువు నాక్షేపించు ద్రౌపదిం జూచి ధర్మరా జి ట్లనియె
నాస్తికుల[2]యట్లు ధర్మాభిశంకినివై దైవదూషణంబు సేసెదు శిష్ట[3]చరితం
బయిన ధర్మంబు [4]నధిక్షేపించుచున్న దుర్మతికిం బ్రాయశ్చిత్తంబు లేదు
ధర్మువు దప్పక నిత్యులై జీవించుచున్న మైత్రేయ మార్కండేయ వ్యాస
వసిష్ఠ నారదప్రభృతులం బరమ[5]యోగధరులం బ్రత్యక్షంబ చూచెదము వీ
రెల్ల నన్ను ధర్మపరుం డని మన్నింతు రన్య లన్యాయంబు సేసి రేనియు
నే నేల ధర్మువు దప్పుదు.

---

225. 1. సమరధర్మంబురక్షించుఁబ్రీతితో నని శత్రులందు–ల. వీ. శ. ష; సమరంగధర్మువు రక్షించుఁబ్రీతినని శత్రులందు – వా. శ. పెక్కు ప్రతులు. ఈపాఠమున మధ్యాక్కర లక్షణము సమన్వితము కాలేదు. 2. శమబుద్ధి — కొన్నిప్రతులు. 3. సల్పంగ – వీ.శ. ష.

226. 1. హీనులైన – ఐ. ఘ. త. 2. యందుధర్మువేమి – అ. ఆ. ఐ. క. గ. జ. ఝ. త. ల. వీ.

227. 1. నీతిమెయింగార్యము – ఈ. ఐ. త. 2. లన్యులె చెపుమా – ఔ. న.

228. 1. విధాతను – కొన్నిప్రతులు. 2. యట్లధర్మసంశీలినివై – శ. ష. కొన్ని ప్రతులు; యట్లధర్మసంసేవినివై — ఒ. ల; యట్లధర్మాతిశంకినివై — ట. డ. ద. 3. సేవితంబయిన – వీ. శ. ష. 4. నతిక్రమించు, శంకించు – అని పాఠములు. 5. యోగివరులంబ్రత్యక్షంబ – ఘ. చ. ల.

229. క. ధీరమతియుక్తిఁ జేసి వి, చారింపఁగ నిక్కువంబు సర్వజనస్వ
ర్గారోహణసోపానం, [1]బారఁగ ధర్మంబ చూవె [2]యతిరమ్యాంబై.

230. వ. తపస్స్వాధ్యాయబ్రహ్మచర్యదానధర్మయజ్ఞంబు లను పుణ్యకర్మంబు [1]లఫలంబు లగునేని వీని [2]నేల ఋషిగణంబులు సేవింతురు నీజన్మంబును ధృష్టద్యుమ్నుజన్మంబును [3]బుణ్యకర్మఫలసద్భావంబునకు నిదర్శనంబులు గావె మఱి[4] పుణ్యకర్మఫలంబులు గలయట్ల పాపఫలంబులును గలవు తొల్లి బ్రహ్మ దనపుత్రులకుం గర్మఫలసద్భావంబు సెప్పె నందుఁ గశ్యపుండు ధర్మప్రబోధనంబునం జేసి [5]పుణ్యఫలప్రాప్తుం డయ్యె విధాతృనియోగంబునం బుణ్యపాపఫలంబు సంప్రాప్తం బగు విధాతృనను గ్రహంబుననకాదె పుణ్యకర్మంబులు ప్రవర్తించి[6] మర్త్యు లమర్త్యత్వంబును బొందుదు రనిన విని ద్రౌపది యిట్లనియె.

231. ఆ. కర్మఫలము [1]లేదు కర్మఫలాప్తికిఁ, గారణంబు [2]విధియుఁ గాదనంగ
నంత యెఱుక [3]లేనె యార్తనై విధి[4] చెయ్ది,[5] కలసి పలికితిం బ్రియంబుదప్పి.

232. ఆ. వేదశాస్త్రములును [1]విధివిధానములును, నప్రమాణ [2]మనుదురాత్మకులకుఁ
బుణ్యగతులు లేమి భూనాథ యెఱుఁగని, దానఁ గాను ధర్మతత్త్వయుక్తి.

---

229. 1. బారయ – కొన్నిప్రతులు. 2. యంబురుహాక్షీ – జ; యంబుజనేత్రా – శ. ష.

230. 1. లకుఫలంబులేదగునేని – వీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. నేలదేవఋషి గంధర్వగణంబులు – వీ. శ. ష. పెక్కు ప్రతులు. 3. బుణ్యకర్ముల సద్భావంబునకు – ల. 4. పుణ్యకర్మఫలం – పెక్కు ప్రతులు; పుణ్యఫలం – వా. కొన్ని ప్రతులు. 5. ధర్మప్రబుద్ధుండయ్యె – శ. ష; ప్రవృత్తిధర్మంబునడపె – ఏ. ఓ. క. జ. ఝ. 6. మహాత్ము లమర్త్యంబు బొందిరి – ఊ. న.

231. 1. లందు, నందు — అని పాఠములు. 2. విధియ — ఓ. ఔ. ల. 3. వేఱ — ఏ. ల; లేనియార్తనె – అ. త; లేనియాత్మనె – ఆ. ఔ; లేనియట్టినే – జ. ఎన్. బి. అట్టిఁడు, అట్టిరువంటి రూపములు పరిచితములేకాని, ఉత్తమపురుషమున అట్టిను, అట్టిమువంటి రూపములు వినరాలేదు. 4. చేతనలసి – వీ. శ. ష. పెక్కుప్రతులు; చేతకడలి – ఈ. ఐ. ఔ. ఘ. త.

232. 1. వివిధదానంబులు – పెక్కుప్రతులు. 2. ము లదయాత్ములకును – ఈ. ఐ. ఘ. త; ములు హతాత్ములకును – ఔ.

233. వ. తొల్లి [1]నీతిమంతు లయిన బ్రాహ్మణులు మదీయజనకునకుం [2]జెప్పంగ వింటి నెఱుకగలవారికిం గర్మంబు గర్తవ్యంబు [3]గర్మరహితు లయి స్థావరంబుల యట్లు జనులు జీవింపనేర రల్పఫలంబు లైనను గర్మంబుఁ బ్రవర్తించుచున్నవారిం జూచెదము [4]దైవమానుషంబులు గర్మఫలప్రాప్తికి నిమిత్తంబులు[5] పురుషుండు మనంబున నర్థసిద్ధి నిశ్చయించి కర్మంబునందుఁ గృతోత్సాహుండు గావలయు నట్టివానికి దైవంబు సహాయం బయి కర్మసిద్ధి గావించు.

234. మధ్యాక్కర.

తిలలందుఁ దైలంబు [1]గాష్ఠములయందుఁ [2]దిరముగా నగ్ని
[3]గలుగు ఎఱింగి యుపాయపూర్వము గడఁగి తత్సిద్ధి
యలయక యుత్సాహవంతుఁడు వడయు నట్లనుత్సాహ
[4]మొలసి దైవపరుఁ డిది వడయంగను నోపునె [5]యెందు.

235. మధ్యాక్కర.

కడు నిమ్ముగా దున్ని బీజములు సల్లి కర్షకుం డున్నఁ
దడయక వర్షంబు గురిసి కావించుఁ దత్ఫలసిద్ధి
నడుమఁ బర్జన్యుఁ డనుగ్రహింపనినాఁ డేమి సేయుఁ
గడఁగి చేయం గలవానిఁ జేయును గాక కర్షకుఁడు.

---

233. 1. ధీమంతులైన – కొన్నిప్రతులు. 2. జెప్పంబోయిన, జెప్పుచుండ – అని పెక్కుప్రతులు. 3. ధర్మ – ఒ. గ. 4. మానుషబలంబు – ఐ. త. 5. బు గాదెపురుషుండు – కొన్నిప్రతులు.

234. 1. గాష్ఠంబునందు – పెక్కు తాళపత్రప్రతులు. ఈపాఠమున మూఁడింద్రగణముల తరువాత సూర్యగణము వచ్చుట విశేషము. 2. దెల్లముగనగ్ని – ఏ. ఓ. ల. 3. గలుగు ఎఱింగి యుపాయపూర్వము గడఁగి తత్సిద్ధి – శ. ష; గలుగు ఎఱిఁగి యుపాయపూర్వమునఁ గడఁగి తత్సిద్ధి – వా. సూ. పెక్కుప్రతులు. 4. మొలసి దైవపరుఁడై దీని – ల: మొలసి తానర్థితోపీని వడయంగనోపునెయందు – ఈ. ఐ. త. 5. చెపుమ – కొన్నిప్రతులు.

236. వ. కర్మఫలంబులు దైవమానుషసిద్ధంబు లయినను బురుషోత్సాహసముపార్జితంబు లయిన నవి సుస్థిరంబు లయి సురక్షితంబు లయి వర్తిల్లు [1]ననీహమానుం డయి దైవపరుం డయినవాఁడు నీరిలోని యానపాత్రంబునుం బోలె [2]నవసన్నుండగుం గావునఁ గర్మఫలసిద్ధి నిశ్చయించి యుత్సాహవంతుండ వయి నీయనుజుల[3]పరాక్రమంబునం బరుల జయించి మన [4]యందలి [5]యర్థకృశత్వం బపనయింపు మనిన యాజ్ఞసేని వచనంబుల కను[6]గుణంబుగా భీమసేనుండు ధర్మరాజున కి ట్లనియె.

-: భీమసేన ధర్మరాజుల సంవాదము :-

237. మ. పితృపైతామహ మైనరాజ్య [1]మరినిర్భేద్యంబు గాండీవిచే
నతిగుప్తంబు [2]బలారి కైనను [3]నహార్యం బిట్టిదానిన్ [4]సుదు
ర్మతి నన్యార్థముసేసి నీకుఁ జనునే మర్త్యేశ యుగ్రాటవిన్
వ్రతముల్ సల్పుచు [5]ధర్మలేశ[6]చరణవ్యాసక్తి [7]ని ట్లుండఁగన్.

238. క. ఆమిషము సింహములచే, గోమాయువు గొన్నయట్లు కువలయరాజ్య
శ్రీ మనచేఁ గొని కౌరవుఁ, డేమని తలఁచు నొకో బుద్ధి నిష్ఠులుఁ దానున్.

239. క. [1]దుర్మతులను దుర్జనులను, ధర్మస్థితి [2]నోర్వఁ [3]దగునె ధరణీశ్వర దు
ష్కర్ము లగుధార్తరాష్ట్రుల, పేర్మి యడంగింపఁ [4]గడఁగు పృథుభుజశక్తిన్.

---

236. 1. నిహతమానసుండై - ఎ. ల. 2. నాపన్నుండగు - ఏ. ఒ. ఓ. గ. జ. ఝ. వ. 3. విక్రమబలంబున - శ. ష. 4. యందుల - కొన్నిప్రతులు. 5. యర్థకార్శ్యత్వము - ఇ. ఉ. ఘ; యర్థకార్శ్యంబు - ఐ. త; యనాథత్వంబు - ఆ. ఎ. క. ఝ. ఠ; యనర్థశాంతిత్వంబు - గ. ద. డ. 6. రూపంబుగా - కొన్నిప్రతులు.

237. 1. మది నిర్భేద్యంబు, మతి నిర్భేద్యంబు - అని పాఠములు. 2. పురారికైనను - అ. ఆ. ఎ. ఒ. ఝ. 3. నహార్యం - అ. ఆ. ఉ. చ; నసాధ్యం ఈ. ఐ. త. పీ; నవార్యం - వా. శ. ష. కొన్ని ప్రతులు. 4. నదుర్మతి - కొన్ని ప్రతులు. 5. ధర్మవేవనచర వ్యాసక్తి - ఇ; ధర్మవేషధరణ వ్యాసక్తి - జ. 6. ధరణవ్యాసక్తి - పీ. శ. ష. 7. మైనుండగన్ - ఝ.

239. 1. దుర్మదులను - అ. ఇ; దుర్మతులగుదుర్జనులను - చ. జ; 2. నొంపదగదె - అ. 3. నగునె - కొన్ని ప్రతులు. 4. దగును - ఇ. ఈ. ఐ. త.

240. వ. [1]ధర్మకామప్రభవం బయి సర్వార్థసాధనం బయిన యర్థంబు విడిచి మిత్త్రుల కప్రియంబు నమిత్త్రులకు హర్షంబునుంగా మునివృత్తిం జేకొని [2]ధర్మువు ధర్మువ వనుచు [3]ధర్మువునందు [4]చిత్తంబు నిలిపి [5]దుర్బలునట్లు నిర్వేదింపం దగునె.

241. ఆ. బాహుబలము [1]మెఱసి పగులసంపదలు సేకొనంగ [2]లావు లేని కుత్సితుండు నియతదుఃఖవృత్తి నిర్వేద[3]పరుం డగుం,గాక నీకుం దగునె కౌరవేంద్ర.

242. చ. నరనుత నీయనుజ్ఞం గొని నాండ విరోధుల నెల్ల బోరిలో
సరభసవృత్తి నుక్కడంగం జంపితిమేని మహోగ్రకాననాం
తరముల నుండకుండ నతిదారుణదుర్మృగ[1]సంగమంబునం
[2]బొరయక యుండంగా మనకుం [3]బోలు నమందమనఃప్రియంబుగన్.

243. క. సమయాతిక్రమభీతిని, [1]క్షమాయుతుల మైన మనలం గౌరవులు పరా
క్రమహీనులుగాం [2]దలంతురు సమరోత్సాహంబు విడిచి [3]జడమతి నున్నన్.

---

240. 1. ధర్మకామార్థ ప్రభావంబులను సర్వార్థ సాధనంబులయిన యర్థంబుల – ఝ. శ. ష; ధర్మకామార్థ సాధనంబులయిన యర్థంబుల – డ. 2. ధర్మువుధర్మువనుచు– శ. ష. మున్నగు ప్రతులలో లేదు. 3. ధర్మంబునందు బుద్ధినిలిపి – అ. ఉ. స. 4. బుద్ధినిలిపి – పెక్కు ప్రతులు. 5. దుర్బలునట్లు నిర్వేదింపందగునె – పీ. శ. ష; దుర్మనుజునట్లు నిర్వేదింపం దగునె పెక్కు ప్రతులు; దుర్బలునట్లుండందగునె – వా.

241. నెఱపి – శ. ష; నెఱసి – పీ. 2. లేనియట్టి, నేర్పులేని – అని పాఠములు. 3. హతుండగుగాక – పెక్కు ప్రతులు.

242. 1. సంకులంబునన్ ల. 2. బొరయకయుండగా గలుగు బొందదు వైరిమనః ప్రియంబొగిన్ – ఏ. ఓ. క. ల. స. శ; బొరయకయుండగాం గలుగం బోలునె వైరిమనః ప్రియంబొగిన్ స. 3. బోలదె వైరుల కప్రియంబుగన్ – ఉ; బోలదె శత్రుల కప్రియంబుగన్ – పీ.

243. 1. క్షమసంయుతులైన మనల – ఈ. ఉ. ఐ. ఘ. త; క్షమయుక్తులమైన మనల – ఆ. క. చ. జ. ద. శ. ష; క్షమవంతులమైన మనల – ఝ. 2. పగతురు – ఉ. ఊ. ఘ. చ. ఠ. శ. ష. 3. జవమరియున్నన్ – ఆ. ఏ. ఒ. ఓ. ఝ. ల. స; జితమతినున్నన్ – గ. యతిభంగము.

244. తే. తగిలి నిత్యంబు [1]నేకాంతధర్మ[2]నిరతుఁ, డగుట యుక్తమె పురుషున కట్టివాని
వెలయ [3]నర్థకామంబులు విడుచుఁ బ్రాణ,విగతు సుఖదుఃఖములు
రెండు విడుచునట్లు.

245. సీ. ధర్మకామంబులు [1]దఱుగంగ నర్థార్థి యగువాఁడు పతితుఁ[2]డా నర్థసేవ
నర్థార్థముగఁ జేయు నతఁ డుగ్రవనములో గోరఁ[3]సేయు నక్కుమతిఁబోలు
నర్థధర్మములకు హానిగాఁ గామార్థి యగునాతఁ డల్పజలాశయమున
జలచరం [4]బెట్టు ల జ్జలములతోఁ జెడు నట్లు కామంబు[5]తో హానిఁ బొందు
ఆ. నర్థధర్మములు మహాబ్ధిమేఘములట్టు, లుభయమును బరస్పరోదయమ్ము
లిట్లుఁ గాఁ ద్రివర్గ మెఱిఁగి [6]సామ్యమున సే,వించువాఁడు సర్వవిత్తముండు.

246. వ. భవదాచరితం బైన యీ[1]ధర్మం బర్థకామంబులక కాదు నీకును నీ బాంధవులకును బాధాకరంబు దాన యజ్ఞసత్పూజలు గావింప నర్థహీనున కశక్యంబు జగంబులు ధర్మమయంబులు ధర్మువునకు మిక్కిలి యొం డెద్దియు లేదయినను నర్థార్థంబు గానిధర్మువు క్షత్త్రియుల కయుక్తంబు.

247. ఉ. [1]శత్త్రుల నాజి నోర్చుటయు సర్వభయంబులఁ బొంద కుండఁ గా
ధాత్త్రిఁ బరిగ్రహించి యుచిత[2]స్థితిఁ గాంచుటయుం బ్రియంబుతోఁ
బాత్త్రుల కర్థ మీగియును బ్రాహ్మణపూజయుఁ [3]జువ్వె యుత్తమ
క్షత్త్రియధర్మముల్ [4]సుగతికారణముల్ [5]విపులార్థమూలముల్.

---

244. 1. నేకార్థధర్మశీలుఁడగుట – ఈ. ఉ. ఐ. ఘ. త. 2. శీలుఁడగుట – ట. ఠ. డ. పీ. శ. ష. 3. నర్థకామంబులు – అ. ఆ. ఈ. ఐ. ఓ. క. జ. ఝ. త. ల. వీ; ధర్మకామంబులు – వా. శ. ష. కొన్ని ప్రతులు.

245. 1. దలఁగంగ – ఝ. వీ. శ. ష. 2. డై యర్థసేవ – శ. ష. పెక్కు ప్రతులు. 3. సేయని కుమతిఁబోలు – ఇ. ఊ. స. శ. 4. బెట్లుతజ్జలములతో – కొన్ని ప్రతులు. 5. చేహానిఁబొందు – జ. శ. ష. 6. సౌమ్యమున సేవించువాఁడు – కొన్ని ప్రతులు.

246 1. ధర్మార్థకామంబులు నీకకాదు – కొన్ని ప్రతులు. ఈపాఠమున నీకును అను మాటలు పొసగవు.

247. 1. శత్రుల – శ. శర. ష. సం; శత్త్రుల – వా. శ. నాల్గవపాదమందలి క్షత్త్రియ శబ్దవ్యుత్పత్తినిబట్టి మిగిలిన పాదములందలి శత్రు,ధాత్రి. పాత్రులు. శబ్దములందును ద్విత్వతకార రేఫమును వావిళ్ళమున్నగు కొన్ని ప్రతులు చేర్చినవి. వ్యుత్పత్తిని బట్టి యిట్టివర్ణక్రమమునకు ఆకరము కలదాయని విచారింపవలెను. 2. తంబుగ – ఈ. ఐ. త. 3. జూవె – అ. ఉ. ఝ. 4. సుకృతికారణముల్ – అ. ఇ. ఎ. ఝ. వ. 5. వరపుణ్యమూలముల్ – అ; విపులార్థవంతముల్ – క.

248. వ. కేవలధర్మాచరణంబు శత్రుజయంబునకు సాధనంబు [1]గాదు నికృతి పరుల యందు నికృతియు వలయుఁ బూర్వభ్రాతలైన యసురుల నమరులు నికృతినకాదె నిర్జించిరి కావున నీవు సమయధర్మరక్షణవ్రతం బుడిగి శత్రువుల జయింప నుద్యోగింపుము.

249. క. జయ[1]శీలి వైన నీకుం, బ్రియ మొనరింపంగ నున్న పృథుయశులు [2]సుదా
శ్రయు లగుదురు సృంజయ కేకయ యదు పాంచాలురాదిగాఁగల
సుహృదుల్.

250. తే. మిత్త్రసంపన్నుఁ[1]డైన నమిత్త్రు మిత్త్ర,బలముతోడ [2]భేదించి దోర్బలముఁ [3]జలముఁ
గలిగి దేశబలంబును గాలబలముఁ, గలుగువాని కసాధ్యంబు గలదె యెందు.

251. తే. బలముగలవానిఁ[1]బలువురు బలవిహీను, లొక్కటైకూడి [2]నిర్జింతు రుత్సహించి
మధువుఁగొన[3]నుత్సహించినమనుజుఁ బట్టి,కుట్టినిర్జించు [4]మధుకరకులమునట్లు.

252. వ. [1]శూద్రాన్నంబునందలి దుగ్ధంబునుం బోలె దుర్యోధను రాజ్యంబు [2]దూష్యం బగుటఁ బౌర జానపద బ్రాహ్మణవరులు నీ కనురక్తు లయి భవద్రాజ్యంబ వలచి యుండుదురు దీని నేల యెడ సేసెదు సర్వాయుధ[3]సనాథం బైన రథం బెక్కి గజపురంబున కభిముఖుండ వై విజయప్రయాణంబు [4]సేయుము.

---

248. 1. గాదు నికృతిపరులయందు నికృతియువలయు – వీ. శ. ష. కొన్ని ప్రతులు; గాదు నికృతివలయు – వా. కొన్ని ప్రతులు.

249. 1. శీలుఁడవగు నీకుం, శీలుఁడవని నీకుం, శీలుఁడైన నీకుం – అని పాఠములు.
2. భవాశ్రయులగుదురు – అ. ఇ. ఎ. క. ఝ.

250. 1. డైనయమిత్త్రు – ఉ. ల; డైనయ (న) మిత్త్రబలము బలముతోడ – శ. ష.
2. బోరించి – ఈ. ఐ. ఘ త. 3. మెరయ, వెలయ – అని పాఠములు.

251. 1. తోహీనబలులు పలువురొక్కటైకూడి – ఇ. ఈ. ఉ. ఐ. ఘ. త. 2. నిర్జింప నుత్సహింత్రు – ఓ. గు. తి; నిర్జింప నుత్సహించి – ఈ. ఏ. ఐ. ఓ. ఝ. త; వధియింతురుత్సహించి – ఉ. 3. నిశ్చయించిన – కొన్నిప్రతులు. 4. మధుమక్షి కులము – ఈ. ఏ. ఐ. ఓ. ఔ. క. ఘ. ఝ. త. తి. ద. ల; మధుపసంకులము – గ.

252. 1. శ్వదృతియందలి – వా; శూద్రాన్నంబునందలి – అత్యధికసంఖ్యాకప్రతులు. మూలమిట్లున్నది. శ్వదృతౌక్షీరమాసక్తమ్, బ్రహ్మావావృషలేయథా. 2. దూషితం బగుట – పెక్కుప్రతులు. 3. సన్నద్ధంబైన, సమృద్ధంబైన – అని పాఠములు. 4. చేయుమిది విజయప్రారంభమున కవసరంబు – ఈ. ఉ. ఐ. ఘ. త. వ.

253. మ. ప్రణుతక్షాత్త్రగుణంబు విక్రమము దర్పం బేర్పడన్ విక్రమ
క్షణదానం బొనరింపు మీక్షణమ విఖ్యాతంబుగా సంగరాం
గణమధ్యంబునఁ జేయు మర్జునబృహద్గాండీవ[1]నిర్ముక్తమా
ర్గణధారావళి ధార్తరాష్ట్రకదళీకాంతారవిచ్ఛేదమున్.

254. క. [1]బహువాహసుభటహస్తికసహితులు బలవంతు లని విచారింపకు నీ
యహితులు మద్బాహుగదా, నిహతికి [2]మార్కొనఁగఁ బోర నిలువంగలరే.

255. క. అరివరుల [1]నోర్చి సాగర, పరివృతభూచక్ర మెల్లఁ బాలింపు ప్రజా
పరిపాలనంబుకంటెను, ధరణీశ విశేష [2]మొండు [3]ధర్మువు గలదే.

256. వ. రాజ్యపదస్థుం డైన క్షత్త్రియుండు భూరిదక్షిణంబు లైన యజ్ఞంబుల దేవ
బ్రాహ్మ[1]ణులం దృప్తులం జేసి బ్రాహ్మణులకు నగ్రహారంబులు గోసహ
స్రంబులు నిచ్చి దురితంబులవలనం బాసి తమోవిముక్తుం డైన చంద్రుం
డునుంబోలె వెలుంగు ననిన భీమసేనునకు ధర్మరాజిట్లనియె.

257. ఉ. నీవచనంబు [1]ధర్మ్యము వినీతము నీతియుతంబు నిష్టసి
ద్ధ్యావహ మత్యుదార మిది యైనను [2]నిష్ఠ దలంపఁగా విచా
రావస[3]రాప్తికిన్ విషయ మైనది కార్య[4]ఫలంబు లెల్ల స
ద్భావమునన్ విచారసులభంబుల యండ్రు విచారపారగుల్.

---

253. 1. ముక్తోగ్రమార్గణ - ల. శ. ష. కొన్ని ప్రతులు.

254. 1. బహుఘోటసుభటహస్తిక - శ. ష. బహువాహసుభటహస్తికస. పెక్కుప్రతులు; బహురథగజవాహనభట - వా. సం. 2. మార్కొనుచుఁబోర - ఈ. ఐ. త; మార్కొనను - ఉ. ఘ.

255. 1. గెల్చి - శ. ష. 2. మొకఁడు - ఓ. ల. 3. ధర్మము - త. సం.

256. 1. ణులకుదృప్తిచేసి - పెక్కుప్రతులు; ణవృత్తినడిపి తృప్తిజేసి - స.

257. 1. ధర్మమును నీతియుతంబు నభీష్టకార్యసి,ద్ధ్యావహ - ఇ. ఈ. ఉ. ఐ. ఘ. త; ధర్మమువినీతము నీతియుతం బభీష్టసిద్ధ్యావ - శ. ష. 2. నీవు - శ. ష. పెక్కుప్రతులు. 3. రోక్తికిన్ విజయ - వీ. శ. ష. కొన్నిప్రతులు. 4. భరంబులెల్ల - అ. ఆ. ఊ.

258. క. వనమునఁ బండ్రెం డేండ్లును, జనపదమున నెఱుఁగ కుండ సరి నొకవర్షం
బును [1]జలుపఁ బూని సత్యము, దనరఁగఁ [2]జేసితిఁ బ్రతిజ్ఞ దగ వృద్ధసభన్.

259. చ. అలఘుగుణంబులం దధికుఁ డైనమహాత్ముఁడు రాగకోపమా
యలఁ బడి యక్షమావివశుఁడై యచిరాంశులతావిలాసచం
చల మగులక్ష్మి కాసపడి సత్యము ధర్మువుఁ దప్పి సత్సభా
వలిఁ దగువారియొద్దఁ దగువాఁ డయి [1]సద్విధి నుండ నేర్చునే.

260. వ. [1]ఏ నెట్లును సత్యసమయం బతిక్రమింప నోప [2]శుభోదయకాలంబుఁ [3]బ్రతీక్షించి [4]యుండుము రాజ్యంబులుఁ బుత్త్రులును ధనంబును యశంబును సత్యంబునకు సమంబులు గా వనిన భీమసేనుం డి ట్లనియె.

261. ఆ. అంతకుండు జనుల [1]కాసన్నుఁడై యుండ, నిమిషమాత్ర మేని నిశ్చయింపఁ
దగని జీవనంబు దద్ద సుస్థిరముగాఁ, జేసి కార్య మెడయుఁ జేయఁ దగునె.

262. వ. శరీరికి మరణంబు నియతంబు మరణంబునకు ముందర వైరంబు దీర్పనివానిజన్మంబు నిరర్థకంబు సకలరాజసమక్షంబునం బరులచేత నట్లు మన పడిన పరిభవంబునకుం బ్రతీకారంబు సేయునంతకు రేయునుం బగలును నాహృదయంబు[1] దపించుచుండు నాకంటె నర్జున నకుల సహదేవులుం గుంతీదేవియు [2]నంతస్తాపంబున నెంతయు సంతప్తు లగుచున్నవారు.

263. క. వీరల దుఃఖము దీర్పక, క్రూర నికారు లగు రిపులకును ముదముగ మ
గ్గారణ్యములో ధర్మువుఁ, గారుణ్యముఁ దాల్చి యునికి కార్యమె నీకున్.

---

258. 1. జరుపఁబూనిసత్యం, బెనయగఁ జేసితిఁ బ్రతిజ్ఞవృద్ధులసభలోన్ – స. 2. ప్రతిజ్ఞ సేసితి ? సరిపడలేదు – పెక్కుప్రతులు.

259. 1. సజ్జనుఁడుండ నేర్చునే – పెక్కు ప్రతులు.

260. 1. ఏనెట్లునుసమయభంగంబుసేయ – ఈ. ఐ. త. 2. సుఖోదయకాలంబు – డ.స. 3. పరీక్షించియుందము – కొన్ని ప్రతులు. 4. యుండుదుము, యుండెదము – అని పాఠములు.

261. 1. కాసన్నమైయుండ(యున్న) – ఈ. ఎ. ఐ. ఘ. ఝ. త.

262. 1. దహించుచుండు – కొన్ని ప్రతులు. 2. నత్యంతసంతాపంబున నెంతయు – పెక్కు ప్రతులు.

264. వ. ఇది [1]బ్రాహ్మణధర్మంబు గాని క్షత్త్రియధర్మంబు గాదు మనుప్రణీతంబు లైన రాజధర్మంబులు [2]నీ యెఱుంగని యవి లేవు [3]శత్రు [4]సంహారంబు సేయనినాఁ డత్యంతహాని యగు నట్లుం గాక.

265. తే. వనము[1]నందుఁ బండ్రెండు సంవత్సరంబు, లుండ నేర్చితి మేనియు నొరు లెఱుంగ కుండ నజ్ఞాతచర్యయం దొక్కదివస, మైన [2]నుండఁగ నేర మెట్లనిన వినుము.

266. వ. ఆబాలవృద్ధప్రసిద్ధుండ వైన పార్థివసూర్యుండ వైన నిన్నును సింహ[1]సంహననులైన నీతమ్ములను నెఱుఁగనివారు లేరు మన గూఢభావంబు మేరు[2]వు నిగూఢభావంబునుం బోలె నఘటమానం [3]బిట్లేని నివ్వనవాసక్లేశం బెన్నఁడును మనకుఁ బాయ నేరదు మన మిప్పు డివ్వనమునఁ బదుమూఁడు మాసంబులు [4]సలిపితిమి సంవత్సరప్రతినిధిగా మాసంబులు [5]సేసికొనుట యెందునుం గలయదియ దీన ధర్మవిరోధంబు లేదు విజయారంభంబున కిది యవసరం బనిన భీమసేనుపలుకులు విని నిశ్వాసవ్యాకులిత[6]ముఖుండై పెద్దయుం బ్రొద్దు చింతించి ధర్మరాజిట్లనియె.

267. క. క్రమమునఁ బాండిత్యపరా, క్రమ[1]దర్పములందుఁ గడుఁ బ్రగల్భుండవు మ ధ్యమ నీచెప్పినయది కా,ర్యమ యయినను ధీరబుద్ధివై విను మనఘా.

268. వ. [1]అల్పోపాయం బైన కార్యంబు [2]సాహసారబ్ధం బైనను దోషంబు లే దిది మహాకార్యంబు సాహసక్రియాసాధ్యంబుగాదు సువిచారితం బై సిద్ధిం బొందు విచారపూర్వారబ్ధకార్యంబునకు దైవంబును ననుకూలం బగుం గావున నిమ్ముగా విచారింప వలయు.

---

264. 1. బ్రాహ్మ్యశ్రీ - శ. ష. 2. నీవయెరుంగుదు, నీవెరుంగుదువు - అని పాఠములు. 3. శత్రువర్ధనంబున నత్యంతహానియగు - పెక్కుప్రతులు. 4. సంహారనిరసనంబున - గ. శ. ష. స; సముత్సాహంబున నత్యంతహానియగు - అ. ఆ. ఎ. జ. ఝ.

265. 1. లోనను(లోపల) బండ్రెండువత్సరంబులుండ - కొన్నిప్రతులు; 2. నుండంగ - కొన్ని ప్రతులు.

266. 1. సదృశులైన - వా. పెక్కుప్రతులు; సంహననులైన - వీ. శ. ష. 2. వు నిగూహనంబునుంబోలె - కొన్ని ప్రతులు. 3. బట్లైన - కొన్నిప్రతులు. 4. చెలిపితిమి - శ. ర. 5. చేకొనుట - కొన్ని ప్రతులు. 6. మానసుండై ముఖంబున వివర్ణంబు దోపచిన్నంబోయి - స.

267. 1. దర్పములందు - అ. ఆ. ఇ. ఎ. ఝ. ర; గర్వములందు - వా. కొన్నిప్రతులు; గుణసంపదల - ఏ. ఓ. ఔ. క. జ. డ. ద. ల.

268. 1. అల్పీయం బైన - వా; అల్పోపాయం బైన - పెక్కుప్రతులు. 2. సాహస క్రియారంభంబునను - కొన్నిప్రతులు.

269. సీ. శూరులు ధృతరాష్ట్రసుతులు దుర్యోధనాదులు దురా[1]ధర్షు [2]లందొఱును మనకు
[3]నాతతాయులు మఱి యంగభూవిభుఁడును భూరిశ్రవుఁడు మద్రభూమి పతియు
నాదిగాఁ గలవీరు లవిజేయవిక్రము లొలసి తత్సహాయులై యున్నవారు
మనచేత [4]జితు లైన మనుజేశు లెల్లను జని సుయోధనుచేత సత్కరింపఁ

ఆ. బడి కడంగి వానిప్రస్తవంబున నాజి, వేచి ప్రాణములను విడువ నున్న
వారు వార లెల్ల వసుధఁ బ్రసిద్ధులు, వినఁగ నస్త్రశస్త్రవిద్యలందు.

270. క. వినవయ్య కర్ణగర్వం, బని నాతఁ డభేద్యకవచుఁ డగుటయు విలునే
ర్పును నతనిబాహువిక్రమ, మును దలఁచిననాఁడు గన్ను [1]మొగుడదు నాకున్.

271. వ. మఱియు భీష్మ ద్రోణ కృపాచార్యులు సము లయ్యును వారియొద్దన యున్నవారు వార లపారదివ్యాస్త్రవిశారదులు వారల వోర్చి కాని దుర్యోధను నిర్జింపం బోల దని విచారించు[1]సమయంబున.

-: కృష్ణద్వైపాయనుఁడు ధర్మరాజునొద్దకు వచ్చుట :-

సం. 3_37_20

272. క. వారల పుణ్యోదయమున, వారిజభవనిభుఁడు లోకవంద్యుఁడు వచ్చెం
బారాశర్యుఁడు [1]ధర్మశ,రీరుఁడు గృష్ణాజినోత్తరి[2]యుఁడు ప్రీతిన్.

273. వ. ఇట్లు వచ్చి పరమ[1]భక్తిపరు లైన పాండవులచేతం బూజితుండై కృష్ణద్వైపాయనుండు ధర్మరాజున కిట్లనియె.

---

269. 1. సదులు ముందుగను మనకు – కొన్నిప్రతులు; ధర్షులుద్ధురులు మనకు – ల. స. చారులు దుష్టసత్వు – ఏ. ఓ. ఝ. ఎన్. బి – అందొఱు అనురూపము ఛ. కవి. ప్రతులలో గూడ కలదు. 2. లెందులను మనకు – జ. శ. ష. 3, నావగేయుండును నంగాధిరాజును – పెక్కుప్రతులు. 4. నిర్జితుల్ – ఈ. త.

270. 1. మొగుడదు – పెక్కుప్రతులు; మూయదు – అ. ఇ. ఎ. ఝ. వా. సం. సూ;

271. 1. చున్నంత – పెక్కు ప్రతులు.

272. 1. పుణ్య – అ. ఇ. ఎ. ఝ. ల. 2. యముతోడన్ – కొన్నిప్రతులు.

273. 1. భక్తిప్రణతులైన – కొన్నిప్రతులు.

274. క. వీరు లగుభీష్మ కుంభజ, శారద్వత కర్ణు లమితసత్త్వులు వారిం
బోర [1]వధియించు టెంతయు, భారం బని యున్న నీదు [2]భర మెఱిఁగిమదిన్.

275. ఆ. దాని నపనయింపఁగా [1]నిప్డు వచ్చితి, నధికయోగలబ్ధ మతిరహస్య
మీ విశేషవిద్య సేవింపఁగాఁ బార్థుఁ, బనుపు మితఁడు దీనఁ బడయు సిద్ధి.

276. వ. అని ధర్మతనయు నేకాంతప్రదేశంబునకుం దోడ్కొని చని సత్యవతీసుతుండు విధిదృష్టవిధానంబునం బ్రతిస్మృతి యనువిద్య నుపదేశించి దీనిశక్తి నర్జునుం డధికతపోవీర్యవిభవుండై [1]యింద్ర యమ వరుణ కుబేరాదిదేవతలను నీశ్వరునిఁ బ్రత్యక్షంబు సేసికొని వారల[2]వలన దివ్యాస్త్రంబులు వడసి శత్రువుల జయించు మఱి యివ్వనంబు భవచ్చిరనివాసంబునం జేసి విరళఫలకుసుమపాదపంబై మృగకు[3]లోపరోధియై యొప్పుకున్నయది యొక్కచోటన పెద్దకాలం బునికి యెవ్వరికిం బ్రీతిజననంబు గాదు కావున నొండువనంబున [4]కరుగునది యని చెప్పి యమ్మునివరుం డరిగినఁ[5] దద్వాక్యముదితులై ద్వైతవనంబు వాసి పాండవులు బ్రాహ్మణవరులతోన కామ్యకవనంబున కరిగి సరస్వతీతీరంబునందు నివాసంబు సేసి కొండొకకాలం బుండ నొక్కనాఁ డజాతశత్రుం డర్జునుఁ జూచి యి ట్లనియె.

277. క. [1]సాధితశాత్రవు లగు భీ, ష్మాదులయం దధిగ శాస్త్రయం బయ్యెఁ [2]జతుః
పాదం బగుచున్న ధను, ర్వేదము బ్రాహ్మణులయందు వేదముపోలెన్.

---

274. 1. పరిమార్చు టెంతయు – అ. ఎ. ఏ. ఝ. 2. భయమెఱిఁగి – పెక్కుప్రతులు.

275. 1. నేను – ఆ. ఎ. శ. ష; నిటవచ్చితి – ఇ.

276. 1. రుద్ర – కొన్నిప్రతులు. 2. చేత – ఓ. క. ఝ. 3. ల విరోధియై, లావరోధియై – అని పాఠములు. 4. కరుగుండని – పెక్కుప్రతులు. 5. దద్వాక్యసముత్థితులై – కొన్నిప్రతులు.

277. 1. సాధిత – ఆ. ఈ. ఐ. ఘ. ర. డ. శ. ష; సాదిత – వా. కొన్ని ప్రతులు. 2. చతుష్పాదంబగు – అ. ఆ. ఈ. ఊ. ఎ. ఏ. ఏ. ఓ. క. జ. ర. డ. త. ల. స. మూలమునందు చతుష్పాద అనియే యున్నది. ధనుర్వేదశ్చతుష్పాద ఏతేష్వద్య ప్రతిష్ఠితః ఆదాన సంధాన విసర్గ సంహారాశ్చత్వారః పాదాయస్య – చిత్రశాలాప్రతి.

278. వ. [1]అయ్యది మహనీయం బయి దివ్యమంత్రకలితం బయి వారలకు సన్నిహితం బగుఁ గావున.

279. క. వారలు దుర్యోధనుచే, నారాధితు లిష్టసత్క్రియ[1]ల నగుట రణ
ప్రారంభ మయిన నెదిరెడు, [2]వార పరాక్రాంతులై యవశ్యము మనతోన్.

280. వ. దివ్యాస్త్రవిదులైన వారల నోర్చునట్టి యుపాయంబు గృష్ణద్వైపాయనుండు ప్రసాదిం[1]చె నీవిద్య నీవు ప్రతిగ్రహించి కవచకార్ముకప్రాసఖడ్గధరుండవై యన్యుల కజేయుండవై యుత్తరదిక్కున కరిగి తపో[2]యోగ[3]బలంబున నింద్రుఁ బ్రత్యక్షుంబు సేయుము తొల్లి వృత్రునకు వెఱచి వేల్పులు తమయాయుధంబులు బలంబులు నింద్రునందు సమర్పించి రవి యెల్ల నీకుఁ దత్ప్రసాదంబున నగు మఱి యింద్రు నుపదేశంబున నీశ్వరు నారాధించి తదనుగ్రహంబున నిష్టసిద్ధివడయు మిది వేదవ్యాసు నుపదేశం బని.

281. క. ధృతినియమవ్రతునకు దీ, క్షితునకుఁ బార్థునకు విగతకిల్బిషునకు ధ
ర్మతనూజుఁడు ప్రీతిఁ బ్రతి, స్మృతి నుపదేశించెఁ దా నమిత్ర[1]జిగీషన్.

282. వ. అర్జునుండును నయ్యోగవిద్యాగ్రహణప్రభావంబున నధికతేజోమూర్తియై దివ్యాస్త్రలాభార్థం బగ్రజుచేత ననుజ్ఞాతుండై విధి[1]విహితహోమసంతర్పితవీతిహోత్రుండును బ్రాహ్మణకృత స్వస్త్యయనుండును నై ధౌమ్యాది మహీసురవరులను భ్రాతృవరులను వీడ్కొని తపంబున కరుగ సమకట్టిన.

---

278. 1. ఈ వచనము అధిక సంఖ్యాక ప్రతులలో లేదు.

279. 1. లనగుట – ఘ; లుసల్పరణ – వా. పెక్కు ప్రతులు. 2. వార పరాక్రాంతులై– పెక్కుప్రతులు; వారు పరాక్రాంతులె – వా. కొన్ని ప్రతులు.

280. 1. చి చెప్పెనీ – వా. కొన్నిప్రతులు; చెనీ – కొన్నిప్రతులు. 2. యోగంబున – కొన్ని ప్రతులు. 3. బలంబున నింద్రు – వా. కొన్నిప్రతులు;

281. 1. జిఘాంసన్ – పెక్కుప్రతులు

282. 1. విహిత – పెక్కు ప్రతులలో లేదు.

283. సీ. ఆతని గాండీవహస్తు నక్షయబాణతూణీరయుగళు నుత్తుంగ[1]భుజునిఁ
గనకవర్మా[2]వృత[3]ఘనతరతనుఁ జూచి పొంగి యంత ర్హితభూతములును
బ్రాహ్మణప్రవరులుఁ [4]బార్థుని మనమునఁ దలఁచినయర్థంబు దడయ కిష్ట
[5]సంసిద్ధి [6]యయ్యెడు సర్వవిఘ్నములును శాంతిఁ[7]బొందెడుమని సంతసమునఁ

ఆ. బలికి రంతఁ దరుణి పాంచాలి బీభత్సు, కడకు [8]నరుగుదెంచి కమల[9]నేత్ర
యర[10]జయార్థ మరుగు నాతని యుత్సాహ, మెఱిఁగి యిట్టు లనియె
నిందువదన.

284. క. అవ[1]మానాసహ మగు నీ, యవమత క్షత్త్రియకులంబునం దిం కిట పు
ట్టువు గాకుం[2]డెడు [3]తక్షమ, మవు బ్రాహ్మణకులమునంద యయ్యెడు
నాకున్.

285. చ. అరికృతదుష్ప్రరాభవమహార్ణవమగ్నుల మమ్ము [1]నందఱం
గరుణ సముద్ధరింపుము జగన్నుత యన్యులు పూనఁ [2]గాని యీ
భరము వహింపఁ [3]బూనిన యపారగు[4]ణోన్నతు నిన్ను దిక్కులున్
[5]దరణియు సోముఁడున్ నభము ధాత్రియు గాడ్పును గాచుచుండెడున్.

---

283. 1. వఱు – పెక్కు తాళపత్రప్రతులు. 2. వృతు – ద. 3. ఘనతేజుఁగనుగొని – గ. స; ఘనతేజునింజూచి – డ. 4. పార్థ నీమనమున – ఎ. శ. స. 5. సాధ్యమ య్యెడు గాక – చ. 6. పొందెడు – కొన్నిప్రతులు; యగుగాత – శ. ష. 7. బొందెడమని – పెక్కుప్రతులు. 8. నేఁగుదెంచి – కొన్నిప్రతులు. 9. నేత్రి – శ. పెక్కుప్రతులు. 10. జయార్థియైనయాతని – ఉ.

284. 1. మానసహాముగా నీయవమ – క. జ. ఝ. శ. ష; మానముపొందెడి నీయవమ– ఆ. ఏ. ఓ. ల. స. 2. డెడమఱతమవు – ఎ. ఏ. ఓ. ల. 3. తక్షమమవుబ్రాహ్మణ – శ. ష; సత్తమమవు బ్రాహ్మణ – వా. సం. సూ. కొన్నిప్రతులు.

285. 1. నిందఱం – కొన్ని ప్రతులు. 2. రాని – ఏ. ఓ. ఝ. 3. బూను నిరపాయ గుణోదయు – డ; బూనిన యపార గుణోదయు – జ. ఓ. గ. ద. 4. గుణాన్వితు వా. కొన్నిప్రతులు; గుణోన్నతు – పెక్కుప్రతులు. 5. దరణియు – ల. శ. ష; ధరణియు – వా. సం. కొన్నిప్రతులు.

286. వ. అని [1]దీవించి పాంచాలరాజపుత్త్రి [2]దనస్నేహలాలసవిలోలాపాంగవిలోకనంబులం బార్థుఁ [3]బరిగృహీతపాథేయుం జేయుచుఁ ద[4]ద్వియోగతరళంబైన హృదయం బెట్టకేనియు నొక్కింత సేసికొని యుండె మఱి పార్థుండునుం బూర్వోత్తరదిశాభిముఖుండై యొక్కరుండ యరిగి యైంద్రయోగ[5]శక్తి నిఖిలభూతదుర్నిరీక్ష్యుం డగుచు హిమశైల గంధమాదనంబు[6]లనతిక్రమించి,

287. ఉ. వీరుఁడు యోగవిద్యయును విల్లును దోడుగ నింద్రకీల మ
భూరినగంబు[1]పైఁ గడఁగి పోవఁగఁ బోయినఁ బోవ కుండు ము
గ్రారివిభేది నీ వను మహామధురధ్వని [2]వించె వానికి
[3]బోరన నంతరిక్షమునఁ బొల్చె నిరంతరపుష్పవృష్టియున్.

288 వ. దానికి విస్మయం బంది చనువాఁడు ముందట నొక్కవృక్షమూలంబున నున్నవృద్ధబ్రాహ్మణు బ్రహ్మతేజోధికు [1]నవిరతయమనియమకృశీభూతశరీరుం గని నమస్కరించి తత్సమీపంబున విశ్రమించియున్న నప్పార్థుం జూచి బ్రాహ్మణుం డి ట్లనియె.

289. క. ఎందుండి వచ్చి [1]తయ్యా య, నిందిత తేజుఁడవు ధర్మ[2]నియతుండవు నీ
కిందుండ నేల సిద్ధిం, బొందితి జేకొను మభీష్ట[3]పుణ్యాఫలంబుల్.

---

286. 1. పూజించి – ఈ. ఐ. త. 2. యతిస్నేహ – అ. జ. ఝ. 3. గృహీత సంతోషామిత పాథేయుం – స; బరితోషామితపాథేయుం – ఘ. 4. వియోగాతురంబైన – అ. ఆ. ఎ. ఝ. ల; వియోగక్లేశతరళంబైన – ఠ. 5. శక్తినఖిల – పెక్కుప్రతులు 6. లుగడచి – గ. శ. ష.

287. 1. నుం గడచి పోవగ – ఏ. ఒ; పైగడచిపోవఁగ – ఈ. ఐ. ట. గ. డ. ద. ల; పైనడచి – అ. ఆ. ఇ. ఎ. ఘ. ఝ. స. 2. వీచె – పెక్కుప్రతులు. 3. బోరని, భోరున – అని పాఠములు.

288. 1. నవిరళయమ – కొన్నిప్రతులు.

289. 1. తన్న – కొన్నిప్రతులు. 2. నిరతుండవు – కొన్నిప్రతులు. 3. పుణ్యా – పెక్కుప్రతులు; భూరి – వా.

290\. క. ఇది శాంతతపస్వుల కా, స్పద మిందుఁ గృపాణ కవచ బాణాసన సం
పద దాల్చి యుండ [1]నేటికి, విదితక్షత్త్రియకులుండ వే నీ వనఘా.

291\. వ. [1]పిత[2]హర్ష క్రోధు లైన బ్రాహ్మణు లుండెడు పుణ్యనివాసంబున నాయుధం
బులు ధరియించి [3]యుండ వలవదు వీని విడువు మని [4]నిషేధించిన [5]నవ్విఘ్న
వచనంబు[6]లకు సంచలింపక యున్న యాతని ధైర్యంబునకు మెచ్చి సహ
స్రాక్షుండు నిజరూపంబుఁ జూపి యతని కి ట్లనియె.

292\. ఆ. ఇష్టమైన వరము లిచ్చెదఁ బ్రీతితో, వేఁడు మనిన నమరవిభున కపుడు
గరము భక్తిఁ బ్రొక్కి కరములు [1]మొగిచి యి, ట్లనియెఁ
బురుషవృషభుఁ డర్జునుండు.

293\. వ. దేవా నాకిష్టం బైన వరంబు భవత్ప్రసాదంబున దివ్యాస్త్ర[1]లాభంబ యగిన
నది యేమి [2]గహనంబు దానిన యిచ్చెదఁ బుణ్యలోకంబులు దేవత్వంబును
సర్వకామంబులు వేఁడు మనిన నర్జునుం డి ట్లనియె.

294\. సీ. దివిజాధినాథ నా కవి యెల్ల నేటికిఁ బరమాస్త్రలాభంబ కర మభీష్ట
మరులు సేసిన మహాపరిభవక్లేశంబు [1]వాపంగ నోపక యేపు[2]టడవి
నురుదుఃఖితుల సహోదరుల నందఱఁ బెట్టి చనుదెంచి మిన్నక చనిన నన్నుఁ
[3]దగువారు జగములోఁ దెగడరే నావుడు సుతునకుఁ బ్రీతుఁడై శతమఖుండు

ఆ. గరుణ నిట్టులనియెఁ బరమాస్త్రలాభంబు, నీకు నిష్టమేని లోకవంద్యు
గరళకంఠు [4]నీశుఁ బరముఁ బ్రసన్నుఁగా, వేగచేయు మధిక యోగశక్తి.

---

290\. 1. నేలకొ – ఇ. ఈ. ఐ. త.

291\. 1. విజిత, విగత, రహిత – అని పాఠములు. 2. కామ – ఏ. ఓ. క. డ. ల. 3. యునికి ( యిది ) విరుద్ధంబు – ఏ. ఒ. ఓ. గ. జ. డ. 4. బోధించిన – వీ. శ. ష. కొన్ని ప్రతులు; భేదించిన – కొన్ని ప్రతులు. 5. నవ్విఘ్నవచనంబు – పెక్కు ప్రతులు; నవ్విప్ర – వా; నవి విఘ్నవచనంబులని చలింపక – స. 6. లకు చలింపకున్న – కొన్ని ప్రతులు.

292\. 1. మోడ్చి – జ. ట; ముకుళించి – గ.

293\. 1. లాభంబు గావలయుననిన నదియేమి – వీ. శ. ష. 2. గగనంబు – ఇ. ఈ. ఐ. ఘ. డ. త. ద.

294\. 1. కడగివాపక లేక యడవిలోన – ల; నార్పంగ కడగి యీాయడవిలోన – ఉ. 2. వెడలి – ఇ, ఈ. ఐ. త. ష. 3. పగవారు – ఝ. 4. నీకు – గ. ఝ. ద.

295. వ. అట్లేని నిఖిలలోకపాలనహితుండై యీశ్వరుండు నీయభిమతం బొనరించు నని సహస్రలోచనుండు లోచనాగోచరుండైన నర్జునుండును దద్వచనంబున సమాహితచిత్తుండై హిమశైలశిఖరంబున కరిగి వివిధకుసుమఫలవృతంబు లను విమలనిర్ఝర[1]జలంబులను గమలకుముదకల్హారకలహంససంకులపంకజా కరంబులను రమ్యంబైన తపోవనంబునందుఁ బరమేశ్వరు[2] నుద్దేశించి తపంబు సేయం దొడంగిన.

296. క. సురదుందుభినాదంబు[1]లు, సురపాదపసంభవప్రసూనసుగంధో
త్కర[2]వాసితపవనము [3]వి, స్తరిల్లె [4]నాతనికి హృదయసమ్మద మెసఁగన్.

297. వ. అందు మనోవాక్కాయకర్మనియతుండై పరమేశ్వరుం దనచిత్తంబున నిలిపి [1]నిరంతరత్రిరాత్రోపవాసంబుల నొక్కమాసంబుఁ జలిపి ద్విగుణిత త్రిరాత్రోపవాసంబుల రెండవమాసంబుఁ జలిపి పక్షోపవాసంబుల [2]మూఁడవ మాసంబు సలిపి యూర్ధ్వబాహుండై యేకపాదాంగుష్ఠాగ్రంబున నిలిచి వాయు[3]భోజనంబు సేయుచు నాలవమాసంబు సలిపి యి ట్లతిఘోరతపంబు సేయుచున్న యర్జునుం జూచి యందలి ఋషులు విస్మయం బంది యీశ్వరు పాలికిం జని యి ట్లనిరి.

298. ఉ. భూరిబలుండు పాండవుఁ డపూర్వతపం బొనరించుటం దదీ
యోరుతపఃప్రభావ దహ[1]నోత్థితధూమచయంబు లంబుదా
కారములై వనాంతరము గప్పె జగత్త్రయనాథ తత్తపో
భారము సర్వజీవుల కపారభయావహ మద్భుతం బిలన్.

---

295. 1. ప్రవాహంబులను – కొన్ని ప్రతులు. 2, గురిచి, గూర్చి, గురించి – అని పాఠములు.

296. 1. ను – కొన్ని ప్రతులు. 2. వాసిత – స; వాహిత – వా. కొన్ని ప్రతులు; వాహిపవనములు – శ; వాహిని పవనము – వ; వాహిపవనమును – వీ. 3. విస్తర మయ్యెను నతని హృదయ సమ్మతకరమై – శ. వ.

297. 1. ఇచ్చట మూలమిట్లున్నది. పూర్ణేపూర్ణే త్రిరాత్రేతు మాసమేకంఫలాశనః, ద్విగుణేన హికాలేన ద్వితీయం మాసమత్యయాత్. 2. మూడగుమాసంబు – ఉ బ. 3. భక్షుండై, భోజనుండై – అని పాఠములు.

298. 1. నోద్గత – కొన్ని ప్రతులు.

299. వ. ఆతని యభిమతంబుఁ బ్రసాదించి తత్తపోభారంబు [1]వారింపు మనిన వారల పలుకులు విని పరమేశ్వరుండు దరహసితవదనుం డగుచు వానియభిప్రాయంబె నెఱుంగుదు నిష్టవరప్రసాదంబున వానికి మనఃప్రియంబుఁ జేసెద మీరు మీయాశ్రమంబుల కరిగి సుఖం బుండుం డని యప్పుడు.

*-: ఈశ్వరుఁడు గిరాతవేషంబున నర్జునునొద్దకు వచ్చుట :-*

సం 3 - 40 - 2

300. సీ. కాంచనవర్ణాపఘనుఁడై [1]మహోన్నతకార్ముకహస్తుఁడై [2]గాలకంఠుఁ
డెఱుకురా జయ్యె [3]నద్రీంద్రతనూజయు వనచరీభావంబు [4]వఱలఁ దాల్చెఁ
గుఱుచచేతులు మిడిగ్రుడ్లును [5]గడుకొన్న తఱటులు మఱి [6]చెంచుఁ [7]దలలు [8]నమర
దడవిండ్లు సేపట్టి తడయక యెఱుకులై యార్చుచు భూతమ్ము లాత్మసతుల.

తే. నెఱుకు సతులఁ గావించి యయ్యెఱుకురాజు
ముందటం బక్కియల నొక్క మొగిన [9]నిలిచి
రంత వేఁట నెపంబున నంధకారి
గదలె దద్వన మెల్ల గ్రక్కదలుచుండ.

301. చ. [1]అలబల మంది [2]యందుల మృగావలియున్ విహగంబులున్ భయా
కులగతిఁ బొంది మూఁగలును గుంటులుఁ జీకులు నైన యట్టులై
యులియక యున్నచో నడఁగి యుండఁ గిరాతబలంబుతోడఁ బిం
[3]గలనయనుం డుమేశ్వరుఁడు గవ్వడి డాయగ వచ్చెఁ జెచ్చెరన్.

---

299. 1. పసంహరింపుడనిన - అ.

300. 1. ఘనోన్నత - కొన్ని ప్రతులు. 2. గరళ (ల) కంఠు - ఇ. ఈ. ఉ. ఏ. ఐ. ఓ. ఔ. క. గ. ఘ. డ. త. ద. ల. 3. గిరీంద్ర, శైలేంద్ర - అని పాఠములు. 4. దనరదాల్చె - పీ. శ. ష; నొనరదాల్చె - అ. ఔ. గ. 5. గరు (ర) కైన తనువులు - అ. ఓ. క. గ. జ. ఝ. ల. 6. చింకితలలు - ఏ. ఓ. గ; చుంచు దలలు - జ. సూ. 7. దనములలర - పీ. శ. శర ష. 8. నొప్ప - కొన్ని ప్రతులు. 9. నడచు, చుండగా వేటనెపమున సుందరముగ గదలె. డ. ఇచ్చట నఖండయతిగా గ్రహింపవలెను.

301. 1. అలబలమంది - ఉ. ఎ. ప. ఓ. ఝ. ద. ల; అలుగులమంది - వా. శ. ష. కొన్ని ప్రతులు; అలుగులమంది - పీ. సూ. (అలుగులము = సంక్షోభము) 2. యందలి కొన్ని ప్రతులు; (కాననమునందు మృగావలి విహంగముల్ ?)- ప. ఓ. ఔ. గ. ఝ. ల. 3. గళనయనుం డుమేశ్వరుఁడు - సం.

302. వ. అంత నీశ్వర[1]చోదితుం డయి మూకుం డను దైత్యుండు సూకరంబై భీకరాకారంబున బీభత్సు [2]వధియింప సమకట్టి పయిం బఱతెంచిన.

303. క. అనఘుండు దాని దవ్వులఁ, గని ఘనుఁ డయి పాండవుండు గాండీవగుణ ధ్వని సేయుచు డాసినఁ [1]జెల్చన [2]యేయఁ గడంగి నిలిచె సంరంభమునన్.

304. వ. అదియును [1]నాతుణంబ యేసిన యమ్మునుంబోలె నతివేగంబు[2]న నాసన్నం బైన దాని నేయ కేయకు మని యెఱుకురాజు వారించినను వానివచనం బాదరింపక.

305. చ. పటువిశిఖంబునం ద్రిదశపాలతనూజుఁడు పంది నేసె [1]ము
న్నట పరమేశ్వరుండును రయంబున దానిన [2]యేసె నిట్టు లొ
[3]క్కొ్కటఁ బడియెఁ హరార్జునుల ఘోరశరంబులు పందిపైఁ గుభృ
త్తటముపయిఁ బడిం బడు న[4]దభ్రగమహాశను లట్లు మ్రోయుచున్.

306. క. [1]హరుశరమును నరు శరమును, సరి నిరుపక్కియ[2]లు దాఁకి జవ మఱి శరసం భరమునఁ దిరిగె వరాహము, శరనిధి[3]మథనమునఁ దిరుగు శైలము పోలెన్.

---

302. 1. బోధితుండయి – గ. ఘ. ట. ద. శ. ష. 2. భేదింప – చ. పీ. శ. ష.

303. 1. జెలుచన – కొన్ని ప్రతులు. 2. నేయఁగ – కొన్ని ప్రతులు.

304. 1. నఘణంబయేసిన – పెక్కు ప్రతులు. 2. నదానాసన్నంబైన – వా; ననాసన్నం బైన – పెక్కు ప్రతులు.

305. 1. తోనట, దానట – అని పాఠములు. 2. మున్నయేసెనొ,క్కొట – అ. ఇ. ఈ. ఎ. ఐ. ఔ. క. ఝ. త. ద. 3. క్కట బడియెన్ ...... గాఢశరంబులు – అ. ఆ. ఎ. ఓ. ఔ. ఝ. న. 4. దారమహాశనులట్లు – ఛ. ఉదగ్ర యను పాఠము – ఆనం. గణ.

306. 1. ఈ పద్యము: అ. ఇ. ఈ. ఎ. ఏ. ఓ. క. గ. ఘ. జ. ఝ. ట. ఠ. ద. ప్రతులలో లేదు.
హరుశరముల నరుశరముల నిరుపుర శరములను గాఢ నిష్ఠుర మగుచున్
జిర జిర దిరిగె వరాహము శరనిధి మథనమున దిరుగు శైలము పోలెన్.
2. లనాటజవ – ఇ. ఈ. ఐ. త; 3. మధ్యమునదిరుగు – ఇ. ఈ. ఐ. త.

307. వ. ఇట్లిద్దఱచేత శరవిద్ధుం డై మూకదైత్యుండు సూకరరూపంబు విడిచి నిజరూపంబు[1]తోడ నదృశ్యుం డయ్యె నంత నర్జునుండు విస్మితుండై ముందట నత్యున్నతచాపధరు మేరుశిఖరాకారు నపారకిరాతపదాతిసమేతు నభినవయౌవన[2]వనచరీసహస్రపరివృతు నొక్క పురుషుం గని నీ వెవ్వండవు మనుష్యగోచరంబు గాని యివ్వనంబునఁ బ్రియవని[3]తానుగతుండ వయి యేల [4]క్రుమ్మరియెదు మఱి[5] నాయేసిన మృగంబు నేసి మృగయాధర్మ[6]విరోధం బేల చేసితి నిన్ను నిప్పుడ నానిశితబాణజాలంబుల పాలు సేసెద ననిన నగుచు నాతనికి నయ్యేఱుకురా జిట్లనియె.

308. ఆ. ఏను నామృగంబు నేసితి నది మదీ,యాస్త్రనిహత మయ్యె [1]నవికలముగఁ
జనునె నీకు లేని శౌర్యసంపదఁ జెప్పి,కొనఁగ [2]మదము మిగిలి గుజనునట్లు.

309. క. పలుకుల [1]నొప్పదు బీరము,గల[2]వేని రణంబు సేయఁ గడఁగుము నీ దో
ర్బల మిప్పుడ [3]యుడిపెద నని, [4]తలరక యేయుచుఁ బినాకి తాఁకెఁ గిరీటిన్.

310. వ. అంత.

311. చ. ప్రతిబల[1]దర్పభంజనుఁడు పార్థుఁడు దారుణబాణవర్ష ము
[2]న్నతి నతివీరుఁ డై [3]కురిసినం బరముండు మహాంబువృష్టిఁ బ
ర్వతము [4]గ్రహించునట్లు [5]బలవంతుఁడు దాని గ్రహించి పోర న
[6]క్షతతనుఁ డయ్యె వాని నతిగర్వితుఁ బార్థుఁడు సూచి [7]యాత్మలోన్.

---

307. 1. తోట – కొన్నిటలేదు; తోనదృశ్యంబయ్యె – కొన్నిప్రతులు. 2. వనచర సహస్ర – శ. ష. కొన్నిప్రతులు. 3. వనితాజన సంగతుండవయి – ఉ; వనితా సంగతుండవయి – ఈ. ఐ. త. 4. ద్రిమ్మరియెదు – ఇ. ఈ. ఐ. త. 5. యేనేసిన – శ. ష. కొన్నిప్రతులు. 6. విరుద్ధంబేల – కొన్నిప్రతులు.

308. 1. నది నెపమున (గ) – అ. ఆ. ఉ. ఎ. క. ఝ. ద. వీ; నది కతమున – కొన్నిప్రతులు; ననుచు నకట – శ. ష. 2. మదమునలుకంగుజను (?) – వా; మదము – వలుక – పెక్కుప్రతులు; మదము మిగిలి కుజను – ఔ.

309. 1. చెప్పకు బీరము – ట; చెప్పక బీరము – ఎ. ఝ; నొప్పదు బీరముగలవేని–మూ. 2. దేని – పెక్కుప్రతులు. 3. యడచెద – కొన్ని ప్రతులు. 4. తలగక – వీ. శ. ష; తలకక – ఇ. ఈ. ఉ. ఐ. త.

311. 1. గర్వ – గ. వీ. ష. 2. న్నతిగురియింప నీశుఁడును నాశరవృష్టి ననేక వృష్టి – ఢ. అఖండయతిగానున్నది. న్నతగతిధీరుఁడై – శ. ష. 3. కవిసినం బరముండు – ఛ. 4. గ్రసించునట్లు – ఏ. ఔ. ఛ. 5. దనబాహుల వానిగ్రహించి – అక. ఒ. ఛ. 6. క్షతతముఁడయ్యె – ఛ. 7. యల్కతోన్ – ట.

312. చ. ఇతఁడు సురేంద్రుఁ డొండెఁ బరమేశ్వరుఁ డొండె[1] ధనేశుఁడొండెఁ గా
కతులబల[2]ప్రభావయుతుఁ డన్యుఁడు గాఁ డొరుఁ డైన మద్భుజా
వితతధనుర్విముక్తశరవేగము ఘోర సహించి యిట్టు ల
క్షతుఁడు సమూర్జితుండు నయి కంపముఁ బొందక యుండ నేర్చునే.

313. వ. నాయేసిన యపారదుర్వారనారాచంబు లవివేకియందుఁ బ్రయుక్తంబు
లయిన సుభాషితంబులుంబోలె వీనియందు నిష్ఫలంబు లగుచున్నయవి.

314. ఆ. ఎఱుకు నన్ను నుఱక యేసిన [1]శరములు, నెఱకులాడి నాకు నిశితదివ్య
విశిఖతతులయట్లు వేదన [2]గావించు, టిది యపూర్వ మీతఁ డెవ్వఁ డొక్కొ.

315. వ. ఇప్పర్వతంబు దైవనివాసంబు గావున నితండు కిరాతరూపప్రచ్ఛన్నుం
డైన [1]యెవ్వని యొక్క దివ్యపురుషుండు గావలయునని యశనికల్పంబు
లయిన దివ్యశరంబు లయ్యెఱుకుపయి నేసి యర్జునుం డక్షయబాణంబు
లైన తనతూణీరమ్ములయం దమ్ములుగానక ఖాండవదహనంబునాఁ డగ్ని
దేవుఁడు నాకిచ్చిన యక్షయశరధు లిప్పుడు [2]యుగాంతకాలరిక్తంబు లైన
శరధులుంబోలె నున్నయవి యిది యేమి యద్భుతంబో యనుచు నలిగి
గాండీవం బెత్తికొని యెఱుకు పయిం బఱచి.

316. క. అపహృతగాండీవుఁడు నై, యపరిమితక్రోధహృదయుఁ డన్నరుఁడు పరం
తపుఁ డెఱుకు మస్తకంబునఁ, గృపాణపాతంబుఁ జేసెఁ [1]గిట్టి కడంకన్.

317. క. [1]అదియు వృథయైనఁ బార్థుఁడు, వదలక వృక్షముల రాల వైచెను రణదు
ర్మదు వనచరు నవి యెల్లం, దదంగముల నడఁగె నద్భుతంబుగ నంతన్.

---

312 1. ధనేశుఁడొండె – అత్యధిక సంఖ్యాక ప్రతులు; దినేశుఁడో – వా. ఇచ్చట మూలము కోఽయం దేవో భవేత్సాక్షాద్రుద్రో యక్షః సురోఽసురః. 2. ప్రతాప – ఇ. ఈ. ఉ. ఏ; ఐ. గ. త.

314. 1. యమ్ములు – పెక్కు ప్రతులు; ములుకులు – కొన్ని ప్రతులు. 2. గావించె నిదియపూర్వ – పెక్కు ప్రతులు; రూపించె – గు. ష.

315. 1. యెవ్వఁడేనొక్క – ఇ. ఈ. ఐ. త. 2. యుగాంత్యకాల – అ. ఉ. ఘ. చ. ఝ. వీ. శ. ష.

316. 1. గినిసి – ల. శ. ష. స; క్రీడి – గ. డ.

317. 1. ఈపద్యముతరువాత గ. వీ. శ. ష ప్రతులలో, దానంగోపించి, అనువచనముకలదు.

318. క. హరుఁ బెనఁగి పట్టుకొని భీ,కరబలుఁ డర్జునుఁడు ముష్టిఘాతంబుల సం
గర మొనరించెను వనచర,వరు లాతని శౌర్యగౌరవ[1]ముఁ [2]బొగడి రెదన్.

319. క. తన దివ్యగాత్రమునఁ న,ర్జునుగాత్రనిపీడఁ జేసె శూలధరుం డం
తన మూర్ఛవోయి పీడిత,తనుఁడై పార్థుండు ధరణితలమునఁ బడియెన్.

320. వ. అంత

321. చ. వరదుఁడు పార్థుశౌర్యవిభవంబున కాతని ధైర్య[1]వృత్తి[2]కి
న్నరుదుగ మెచ్చి సన్నిహితుఁ డయ్యె జటామకుటేందురేఖయుం
గరమున శూలముం గరళ[3]కాలగళంబు బృహద్గజాజినాం
బరముఁ దృతీయలోచనముఁ బన్నగహారము నొప్పుచుండఁగన్.

322. వ. ఇట్లు విరూపాక్షుండు నిజరూపంబుతో నర్జునునకు సన్నిహితుండై [1]అర్జునా
[2]క్షత్త్రియు లొరు లెవ్వరు నీయట్టి శౌర్యధైర్యవం[3]తులెందును లేరు నీతపః
క్షాత్త్రగుణంబులకు మెచ్చితి నీకోర్కి సఫలంబు [4]సేసెద దేవాసుర[5]మానుషం
బైన జగం బంతయు నీవ జయింతు[6]నాస్వరూపంబు సూడు మని దివ్యదృష్టి
[7]యిచ్చినం జూచి పార్థుండు గృతార్థుం డయి [8]దండప్రణామంబు సేసి.

---

318. వంబులు పొగడన్ - శ. ష. 2. లు నుతింపన్ - ఇ. ఉ.

321. 1. శక్తికిన్ - ఉ. చ. ట; యుక్తికిన్ - కవి. 2. కిన్నరుదుగ - అనం. ఊ. ఎ. ఏ. ఒ. ఓ. ఔ. క. గ. గు. చ. ట. శ. ష. సం; కట్లరుదుగ - వా; కందరుదుగ - అ. ఇ. ఈ. ఉ. ఐ. ఘ. త. 3. కంఠము నొప్ప - ఒ.

322. 1. అర్జునా - పెక్కు ప్రతులలో లేదు. 2. క్షత్త్రియవరులెవ్వరు - అ. ఈ. ఐ. త. 3. తులు లేరు - వా; తులెందును లేరు - ఆ. వీ. శ. ష. 4. సేసెద దేవాసుర- పెక్కుప్రతులు; సేసెద సహదేవాసుర - వా. 5. మానవంబైన - అ. ట. క. ఝ. 6. నా విశ్వరూపంబు - అ. ఆ. ఇ. ఈ. ఎ. ఐ. ఒ. ఔ. ఘ. ఝ. త. ద. 7. యొసంగినం - ఇ. ఈ. ఐ. ఘ. త. 8. దండ నమస్కారంబు చేసి - పెక్కుప్రతులు; పులకితాంతరంగుండగుచు సర్వాంగాలింగితోర్వీతలంబగు దండప్రణామంబు లొనరించి - వీ. శ. ష. ఇచ్చట మూలమున సర్వాంగాలింగితమహీతలంబగు అనుదానికి ఆధారము లేదు. సజానుభ్యాం మహీం గత్వా శిరసా ప్రణిపత్యచ, చిత్రశాలా ప్రతి. పుట. 74.

323. క. వరదు సురాసురవందితుఁ, గరుణాకరు హరుఁ [1]బినా[2]కకరుఁ గరిచర్మాం
బరు [3]శంకరు గిరిజాసుం,దరు నిట్లని సంస్తుతించెఁ దద్దయు భక్తిన్.

### అర్జునుఁడు పరమేశ్వరుని స్తోత్రము సేయుట

సం. 3 – 40 – 56

324. దండకము. శ్రీకంఠ లోకేశ లోకోద్భవస్థానసంహార[1]కారీ పురారీ మురారి ప్రియా చంద్రధారీ మహేంద్రాదిబృందారకానందసందోహసంధాయి పుణ్యస్వరూపా విరూపాక్ష దక్షాధ్వరధ్వంసకా దేవ నీదైవతత్త్వంబు భేదించి బుద్ధిం బ్రధానంబు గర్మంబు విజ్ఞాన మధ్యాత్మయోగంబు సర్వ క్రియాకారణం బంచు నానాప్రకారంబులన్ బుద్ధిమంతుల్ విచారించుచున్ [2]నిన్ను భావింతు రీశాన సర్వేశ్వరా శర్వ [3]సర్వజ్ఞ సర్వాత్మకా నిర్వికల్ప ప్రభావా భవానీపతీ నీవు లోకత్రయీవర్తనంబున్ మహీవాయు[4]ఖాత్మాగ్ని సోమార్కతోయంబులం జేసి కావించి సంసారచక్రక్రియాయంత్రవాహుండవై తాదిదేవా మహాదేవ నిత్యంబు నత్యంతయోగస్థితిన్ నిర్మల జ్ఞానదీప ప్రభాజాలవిధ్వస్త[5]నిస్సార సంసారమాయాంధకారుల్ జితక్రోధ రాగాది[6]దోషుల్ యతాత్ముల్ యతీంద్రుల్ భవత్పాదపంకేరుహధ్యాన [7]పీయూషధారానుభూతిన్ సదాతృప్తులై నిత్యులై రవ్యయా భవ్యసేవ్యా భవా భర్గ భట్టారకా భార్గవాగస్త్యకుత్సాది నానామునిస్తోత్రదత్తావధానా లలాటేక్షణోగ్రాగ్ని భస్మీకృతానంగ భస్మానులిప్తాంగ గంగాధరా నీ ప్రసాదంబునన్ సర్వగీర్వాణగంధర్వులున్ సిద్ధసాధ్యోరగేంద్రాసురేంద్రా దులున్ శాశ్వతైశ్వర్యసంప్రాప్తులై రీశ్వరా విశ్వకర్తా సురాభ్యర్చితా నాకు నభ్యర్థితంబుల్ ప్రసాదింపు కారుణ్యమూర్తీ త్రిలోకైకనాథా నమస్తే నమస్తే నమః.

---

323. 1. మహీశు గరిచర్మధరున్ గిరిజా ప్రాణమనోహరు నరుదుగ నీశ్వరుని నిట్టులని నుతియించెన్ – డ; 2. కి గరిచర్మధరున్, గిరిజా సమేతు గుణసుందరు నీశ్వరు–గ; కి గరిచర్మ వర్మాంబరు – ఇ. ఈ. ఐ. త. 3. గిరిజేశ్వరు పన్నగధరు నిట్లని ప్రస్తుతించె – చ. ట. వీ. శ. ష.

324. 1. కారిపురారీ మురారిప్రియా – వీ. శ. ష. కారీ మురారిప్రియా – వా; కారీ పురారీ ముకుందప్రియా – పెక్కు తాళ పత్ర ప్రతులు. 2. నిన్నె – కొన్ని ప్రతులు. 3. నిర్విఘ్న సర్వాత్మకా – ఈ. ఐ. ఔ. త. 4. ఖాంతాగ్ని – శ. ష. పాఠము విచారణీయము. 5. విస్తార – డ. 6. దూరుల్ – శ. ష. 7. పీయూష – ఈ. ఐ. త. ల; డిండీర ధారానుభూతిన్ – వా. శ. ష. సం. కొన్ని ప్రతులు.

325. వ. అని యిట్లు స్తుతియించి కృతాంజలియై కిరీటి వెండియు నిట్లనియె.

326. క. ఎఱుకని యెఱుఁగక [1]నీకుఁ, [2]మఱకువ [3]నెదిరితిని దీని మఱువుము [4]నన్నుం గఱ[5]కంఠా క్షమియింపుము, నెఱి నెవ్వ[6]రి కెఱుఁగ నగునె నీ చరితంబుల్.

327. వ. అనిన యప్పార్థుం [1]గరుణారసప్రీతివిస్తారితవిలోకనామృతమ్మున సంతర్పితుం జేసి నగు[2]చు నీశ్వరుండు వాని చేయి వట్టుకొని ధనంజయా నీచేసిన వ్యతిక్రమంబు[3] క్షమియించితి నతిమానుషం బైన నీపరాక్రమంబునకు మెచ్చితిఁ బూర్వ[4]జన్మంబున నీవు నరుం డనుదేవర్షి వి నారాయణసఖుండవు నరనారాయణు లనంగా మీరిద్దఱు [5]బదరీవనంబున ననేకాయుతవర్షమ్ములు తపమ్ముఁ జేసిన మహా[6]వీర్యవంతులరు [7]మీతేజంబున జగమ్ములురక్షితమ్ములగుచున్నయవి యిగ్గాండీవమ్ము దొల్లియు నీయదియ దీననచేసి శక్రాభిషేకమ్మునాఁ డసురుల జయించి తది యిప్పు డక్షయ శరధులతోడ మదీయమాయాగ్రస్తం బయ్యె నీగాండీవమ్మును నక్షయశరధులు నీ కిచ్చితిం గొను మింక నీ కిష్టం బైన వరమ్ము వేఁడు మిచ్చెద ననిన నర్జునుం డిట్లనియె.

328. క. త్ర్యంబక నాకు నభీష్టవ, రంబుఁ బ్రసాదించెదేని రౌద్రము దివ్యాస్త్రం బనఁ బరగిన పాశుప, తంబుఁ బ్రసాదింపు మిందుధర దయతోడన్.

---

326. 1. నిన్నున్ మరువక (మరకువ) మార్కొన్న తప్పు మన్నించిననున్ - ఈ. ఉ. ఐ. గ. త; మిమ్మున్ - ల. శర. సూ. 2. మరువక, మఱవక - అని పాఠములు. 3. నెదురైతి - అ. ఆ. ఒ. ఘ. డ. ఝ; మార్కొన్న తప్పు మఱువుము (మఱవుడు). 4. నాకున్ - క. సం. గు. ల. వీ శ. శర. ష. నెదిరించి నాఁడ - తి. నాకుం - కొన్నిప్రతులు; దీనిం - జ. తి. 5. కంఠా క్షమియింపుము - అను పాఠమే నన్నయ ప్రయుక్తమై యుండునని సంహితా సర్వస్వము. - సంపు 1. పుట. 39. 6. రునెరుగ గలరె - ఏ క; డునెఱుఁగ గలఁడు నీచరితంబున్ - తి.

327. 1. గారుణ్యవిస్తారిత లోకనామృతమ్మున - డ; కరుణావిస్తార విలోక నామృతమ్మున - శ. ష; కరుణామృత విస్తారిత విలోకనమ్మున - ఘ. 2. చు నార్యామనోహరుండగు నీశ్వరుండు - ఐ. త. 3. సహించితి - ఆ. ఉ. ఏ. క. జ. ల. 4. దేహంబున - ఈ. ఉ. క. చ. డ. త. 5. బదరికాశ్రమంబున - డ. 6. తపోనిధానులరు - ఘ. త. శ. ష. 7. మీకతమ్మున - శ. ష.

329. వ. ఇదియును బ్రహ్మశిరం బనునస్త్రంబును యుగాంతకాలంబునందుఁ [1]ప్రయుక్తమ్ములై జగత్సంహారమ్ము సేయు దీనివలన నభిమంత్రితమ్ములై యనేక శతసహస్రసంఖ్యల శూలంబులు గదలు నాశీవిషంబుల యట్టి యమ్ములు నుద్భవిల్లు నని విందు నీకారుణ్యమ్మున దీనిం బడసి దైత్య దానవ యక్ష రాక్షస పిశా చో[2]రగమ్ముల జయింతు నతివీరు లైన భీష్మద్రోణాదులను జయింతు[3]సహజకుండలుం డైన కర్ణుని వధియింతు ననిన నీశ్వరుండునుం గరుణించి విశుద్ధాత్ముండైనపార్థునకు మంత్రధ్యానజపహోమపూర్వకంబుగా సంధాన[4]మోక్షణ సంహారసహితంబుగాఁ బాశుపతాస్త్రం బిచ్చి దీనికి నసాధ్యం బెద్దియును లేదల్పులయందుఁ బ్రయుక్తం బైన [5]జగత్సంహారము సేయు.

330. క. దీనివిధానం బెఱుఁగం, గా నింద్రకుబేరవరుణ కాలాదులకుం
దా నతిగహనం బనినను, మానవులకు నెఱుఁ[1]గు టఘటమానము గాదే.

331. వ. ఈ దివ్యబాణమ్మున నీ వఖిలలోకమ్ములు జయింతు వని కౌంతేయునకు వరం బిచ్చి పురాంతకుం డంతర్హితుం డయ్యె నంత.

332. చ. అవిరళసూర్యమండలసహస్రసమప్రభమై ధనంజయ
ప్రవరు కరమ్మునన్ వెలుఁగు పాశుపతాస్త్రముఁ జూచి దైత్య దా
నవ సుర యక్ష రాక్షస [1]గణమ్ము గరమ్ము భయమ్ముఁ బొందె నం
దవనియు దిర్దిరం దిరిగె నబ్ధిశిలోచ్చయ[2]సంచయంబుతోన్.

---

329. 1. ప్రయుక్తంబై – కొన్ని ప్రతులు. 2. రగగణమ్ముల జయింతు నతి వీరులైన – పెక్కు ప్రతులు; రగంబులజయింతు నతివీరులైన – శ. ష; రగమ్ములనతివీరులైన– వా. కొన్ని ప్రతులు. 3. కవచతనుండైన – ఉ. ఎ. జ. ఝ; పుట్టు కవచుండైన– ఈ. ఐ. త; సహజకవచ కుండలుండైన – ఊ. శ. ష; ఇచ్చట మూలము. సూత పుత్రేణ చరణే నిత్యం కటుకభాషిణా; చిత్రశాలాప్రతి. పుట.74. వనపర్వ. 4. మోక్షణోపసంహార – ఎ. 5. జగద్దహనంబు – జగద్దాహంబు – అని పాఠములు.

330. 1. గ నఘటమానము – అ. ఎ. ఏ. ఝ. వీ.

332. 1. గణంబు గరంబు భయంబువొందె – పెక్కు ప్రతులు. 2. సంయుతంబుగన్–ఎ.

333\. క. [1]త్రిణయనగాత్ర[2]స్పర్శనమున [3]నిజగాత్రము పవిత్రమును ముక్తాఘం
బును నతితేజోవీర్యం, బును నైనఁ బృథాసుతుం డు[4]ముదితుం డగుచున్.

334\. క. మంటి హరుదేహ మంటం, గంటి నుమాధీశు [1]నసురకంటకహాను [2]ము
క్కంటిఁ [3]గళకంఠుఁ జూడం, గంటిఁ గృతార్థుండ నైతిఁ గడుఁ బుణ్యమునన్.

335\. క. ఇమ్మల ధర్మజునకు జన, సమ్మతునకు రిపుజయంబు సకలమహీ రా
జ్యమ్ము సమకూ[1]రె నేఁడు ఘ, నమ్ముగ సర్వప్రయోజనమ్ములతోడన్.

*-: ఇంద్రుఁడు దేవగణంబులతో నర్జునునకుఁ బ్రత్యక్షం బగుట :-*

సం 3 - 42 - 5

336\. వ. అని సంతుష్టహృదయుం డై యున్నంత.

337\. సీ. హరుచేత సంప్రాప్తవరుఁ డయ్యెనరుఁడని యెఱిఁగి యింద్రుండు ధనేశ ధర్మ
వరు[1]ణేశ్వరులతోడ సురగణసహితుఁడై దివ్యవిమానముల్ [2]దివమునందు
వెలుఁగంగఁ గౌరవ[3]కులవీరు పాలికి వరదుఁడై గరుణతో వచ్చె నట్టి
యవసరమ్మున ఘనరవ[4]గభీరం బైన మధురవాక్యమున ధర్మప్రభుండు

ఆ. ప్రీతి నిట్టు లనియె బీభత్సునకు ధర్మ, నిత్యపాండుపుత్ర నీకు మెచ్చి
వరము లిచ్చు వేడ్క వచ్చిరి నెయ్యు[5]రై, యమరనాథుఁ
[6]దొట్టి యమరు లెల్ల.

---

333\. 1. త్రినయన - అ. ఎ. ఔ. త. వీ; త్రిణయను - అ. ఎ. ఛ. 2. స్పర్శనమున - శ. ష. పెక్కు ప్రతులు; స్పర్శంబున - వా. వీ. కొన్ని ప్రతులు. 3. నరు గాత్రము - ఛ. 4. ముదితాత్మకుఁడై - ఛ; మోదితుఁడయ్యెన్ - అ.

334\. 1. నమర కంటకహారు - ఆ. ఇ. ఉ. ఎ. ఒ. ఔ. క. ఝ. డ. ల; నమరకంటక హాను - ఏ; నసుర కంటకహారు - ష; నసుర కంటకు హారు - గ. ఘ. త. శ. సం. 2. శ్రీకంఠు - ద. ఇచ్చట ట. ఠ. ప్రాసము కనబడు చున్నది. ద. ధ. ల ప్రాస వంటిదిగా గ్రహించవలెను. 3. శితికంఠు - ఎ. ఏ. ఒ. ఓ. క. ల; విషకంఠు-ద.

335\. 1. రజేతు - అ; డె - ఎ. ఓ.

337\. 1. ణాశ్వినులతోడ - ఔ. డ. ద. శ. ష. 2. దివిని పెక్కు - ఎ. ఏ. ల. స. 3. తిలకునిపాలికి - ఈ. ఐ. త; వీరునిపాలికి - అ. డ. 4. ఘోష మెసగంగ మధుర - ఉ. చ. శ. ష; గభీరంబుతో మధుర - డ. 5. తై - ఎ. ఐ. ఓ. ఔ. క. గ. ఝ. ఠ. డ. ల. 6. తొంటి - ఇ.

338. వ. వీరలం జూడు మని దివ్యదృష్టి యిచ్చి నీవు నరుం డనుపూర్వ[1]ఋషివి బ్రహ్మనియోగంబున [2]మనుష్యుండవై యుత్తమక్షత్త్రియ కులంబున నుద్భవిల్లితి మఱి సూర్యాంశజుం డైన కర్ణుని దేవ దైత్య దానవ గంధర్వ యక్ష రాక్షసాంశజు లైన రాజులను [3]వధియింతు నీ కక్షయకీర్తి యగు నని దండ[4]ధరుం డప్రతివారణం బైన దండంబు [5]విధియుక్తంబుగా నిచ్చిన.

339. క. ఘోరారి[1]దారుణము లగు, వారుణపాశంబు లిచ్చె వరుణుఁడు మఱి కౌ
[2]బేరాస్త్ర మిచ్చె నపుడు కు, బేరుఁడు విజయునకు సహితభేదికిఁ బ్రీతిన్.

340. వ. ఇట్లు దివ్యపురుషుం డైనపార్థుండు లబ్ధదివ్యదృష్టియై యమర్త్యరూపధరు లైన పితృదేవతలతోడం దనముందట నిలిచిన [1]మహానీలవర్ణుం డైన వైవస్వతుని వైడూర్యవర్ణుండై [2]యర్ణవనదీశైలసేవితుం డైన వరుణేశ్వరుం [3]జాంబూనదవర్ణుండై యక్ష[4]రాక్షస[5]గణంబుతో నున్నకుబేరునిం జూచి వారివలన దివ్యాస్త్రంబులు వడసి వాక్పుష్పఫలజలంబుల నందఱం దృప్తులం జేసి వెండియు.

341. ఆ. అమరగణసమేతు నైరావ[1]ణారూఢు, వజ్రధరుఁ ద్రిలోకవంద్యు నింద్రు
వృత్రశత్రు నమరవిభుఁ జూచి [2]యెద నాది, మునివరుండు నరుఁడు
ముదము నొందె.

---

338. 1. రర్షివి – ఈ. త. 2. మర్త్యుండ వై – అ. ఆ. ఈ ఐ. ఓ. క. ఘ. ఝ. త. 3. జయింతువు, జయింతు – అని పాఠములు. 4. ధరుండు ప్రతిదారణం బైన – ప; ధరుండు ప్రతివారణం బైన – శ; ధరుం డప్రతిదారుణం బైన – ఊ. ఎ. ఒ. జ. ఝ. డ; ధరుం డప్రతిహతం బైన – త; ధరుండు ప్రతిపక్ష విదారణం బైన–ఆ. ట. ల. వీ; ధరుం డప్రతీకారం బైన – ఘ. 5. విధానయుక్తంబు – అ. ఆ. ఒ. ట. శ; విధివంతంబుగా – ఎ. ఏ. జ.

339. 1. వారణం బగు – అ. ఎ. ఒ. ఝ; వారణము లగు – ఏ. చ. జ. శ. డ. వీ. 2. బేరాస్త్ర మర్థి నిచ్చెఁ గుబేరుఁడు – ల. వీ. శ. ప.

340. 1. నీల నిభవర్ణుండైన–అ. ఆ. ఇ. ఈ. ఉ. ఐ. ఒ. ఘ. ఝ. త. ల. 2. యర్ణవనిధి సేవితుం డైన – ఈ. ఐ. ఝ. డ. త. ద. 3. సుధాధవళవర్ణుండై యక్షరాక్షస గణపరివృతుం డైన కుబేరుం జూచి – ఘ. శ. 4. రాక్షస – పెక్కు ప్రతులలో లేదు. 5. గణపరివృతుం డై యున్న – ఈ ఉ. ఐ. త.

341. తారూఢు – అ. ఆ. ఒ. స. 2. యెడదలో మునివిభుండు – శ; యెద నాదిముని విభుండు – ప; మనమున మునివిభుండు – ఎ. ఓ. క. ఝ; యర్థి నామునివిభుండు నరుడు ముదము నొందె – ఇ. ఈ. ఐ. త; యపు డాదిమునివరుండు నరుడు – ఊ; యపు డాదిమునివిభుండు నరుడు – ఔ.

342. ఉ. ఇందుధరప్రసాదమున నిష్టవరంబులు గాంచి [1]బాంధవా
నందవిధాయి యైన నిజనందను [2]దండితశత్రు సద్గుణా
నందితుఁ జూచి వేడ్క నయనంబులు వేయును గన్న తత్ఫలం
బందెఁ బురందరుండు పరమాద్భుతసమ్మద[3]పూరితాత్ముఁడై.

343. వ. ఇట్లు దేవేంద్రుండు ధనంజయుం జూచి సంతసిల్లి నీవు పరమేశ్వరువలనఁ [1]బరమసిద్ధి వడసితివి దేవకార్యంబు దీర్ప నర్హుండవు గాన నారథంబుఁ బుత్తెంచెద నమరావ[2]తికి రమ్ము నీకు దివ్యాస్త్రంబు లంద యిచ్చెద నని దేవేంద్రుండు దేవగణంబులతో నమరావతికి నరిగె నర్జునుండును దద్రథా గమనం[3]బు ప్రతీక్షించుచుండె నంత.

344. సీ. [1]వారిదమార్గంబువలన మహానీలవై జయంతీవిభవంబు [2]వెలయ
నాబద్ధవివిధరత్నావళిప్రభఁ జేసి రమ్యమై రోదోంతరంబు వెలుఁగ
నురునేమిరవమున నుర్వీధరదరీముఖములు ప్రతిశబ్దముఖరితంబు
లగుచుండ నానావిధాయుధంబులు దాల్చి యశనివిద్యుత్సహస్రాభిశోభి

ఆ. తార్క్ష్యసదృశమై మహాజవాశ్వాయుత, వాహ్యమాన మైన వరరథంబు
మఘవునాజ్ఞ జేసి మాతలియుక్తమై, [3]యింద్రతనయుఁ డున్న యెడకు వచ్చె.

---

342. 1. పాండు వానంద – ఎ. చ. ట. స. 2. ఖండిత, మండిత, మర్దిత – అని పాఠములు; దం (మం) డితగాత్రు – ఎ. ఏ. ఓ. ఝ. 3. పూరితాత్ముఁడై – ఉ. ఎ. ఏ. ఒ. క. ల. పీ. శ. ష; బంధురాత్ముడై – ఈ. ఐ. జ. త; మందితాత్ముఁడై – వా.

343. 1. బరమసిద్ధి వడసితివి – చ. శ. ష; బరమాస్త్రసిద్ధి వడసితివి – ఏ. ఓ. ల; బరమసిద్ధితో దేవత్వంబు వడసితివి – వా. కొన్నిప్రతులు; ఇచ్చట మూలము. పరాసిద్ధి మనుప్రాప్తః సాక్షాద్దేవగతింగతః దేవగతిమ్ = దేవానాంపరాయణత్వమ్. చిత్రశాలాప్రతి. పుట. 77. 2. తికిం జనుదెమ్ము – ఈ. ఉ. ఐ. ఘ. త. 3. బవేక్షించి యుండునంత – ఎ. జ. ఝ.

344. 1. వరదివ్యమార్గంబు – ల. స. 2. మెరయ – కొన్నిప్రతులు. 3. కరము వేడ్క నరుని కడకు వచ్చె – ఎ. ఏ. ఓ. డ. ద. ల. శ. ష.

345. వ. మాతలియు నర్జునుఁ జూచి సురాసురకిరీట[1]తటఘటితరత్నప్రభాభాసుర పదుం డైన మహేంద్రుండు మీయయ్యా [2]భవద్దర్శనం బపేక్షించి నిన్ను నమరావతికి రాఁ బనిచె రాజసూయాశ్వమేధశతంబులం జేసిన వారికైనను దుర్లభం బీరథంబు దీని నెక్కు మనిన నర్జునుండును గంగాస్నాన[3]పవిత్రీకృతగాత్రుండై దేవఋషిపితృతర్పణంబులు చేసి మాతలిప్రయుక్తం బైన యాదివ్యరథం బెక్కి.

-: అర్జునుఁ డమరావతికిఁ బోవుట :-

సం. 3_43_46

346. చ. అలఘుతపస్సమాధినియతాత్ములకున్ బహుపుణ్యలోకకాం
తులకు విశుద్ధమానసులకున్ సతతంబును [1]సంశ్రయంబ వై
లలితనిలింపదంపతివిలాసవిహారమహోత్సవంబులుం
గలిగి వెలుంగు రత్నమయకందరసుందర మందరాచలా.

347. వ. [1]నీయందలి పుణ్యతీర్థంబులు సేవించుచు [2]గంగాంబుధౌత[3]స్థలరుహ వనస్పతి ఫలంబు లుపయోగించుచు సుఖం బుండితి నమరావతికిం బోయి వచ్చెద నని మందరనగంబు వీడ్కొని పురందరనందనుండు దేవపథంబున కరిగి.

348. సీ. పరమధర్మస్థితిఁ బ్రజఁ [1]బ్రీతిఁ గాంచిన రాజులకు నుదగ్రరణమునందుఁ
[2]బతుల ప్రస్తవమునఁ బ్రాణముల్ విడిచిన వీరులకును [3]యజ్ఞవిధులఁ జేసి
సురలను వసుమతీసురులను దనిపిన ధర్మాత్ములకు మహాతాపసులకు
నిలయంబు లై రమణీయంబు లగు[4]నట్టి హర్మ్యవిమానసంహతులదాని

---

345. 1. తట – పెక్కు ప్రతులలో లేదు. 2. నిన్నుం దోడుకొని రమ్మని పుత్తెంచె ననవుండు – ట. 3. పరిపూత, పవిత్రిత – అని పాఠములు.

346. 1. సంశ్రయంబ వై – అత్యధికసంఖ్యాకప్రతులు; నాశ్రయంబ వై – వా.

347. 1. అని చూచి నీయందుల పుణ్య – శ. 2. గంగాంబుచ్యోతస్థలీరుహ – స. 3. స్థలీరుహ – ల. శ. ష.

348. 1. బ్రీతిఁ గాంచిన రాజులకు నుదగ్ర–పీ. శ. ష; గాచి నిలిచి (పి) న రాజర్షులకు నుగ్ర – పెక్కుప్రతులు; గాచి యేల్గిన రాజర్షులకు నుగ్ర – వా. 2. బరుల ప్రధనమున – ద. 3. వేదవిధులఁ జేసి – ఎ. ఏ. ఓ. 4. రత్నహర్మ్య – పెక్కు

తే. సకలభువనంబు[5]లం గలసత్పురముల, కెల్ల[6]నెక్కుడనఁదగి శశీందురవుల
దీప్తి లేకున్నఁ దనదైన దివ్యదీప్తి, విస్తరంబున [7]నెప్పుడు వెలుఁగుదాని.

349. వ. మఱియు ననాహితాగ్నులకు నతీర్థసేవకులకు ననృతవాదులకు వేదవిరుద్ధా[1]చారులకు మాంసాహారులకు రణపరాఙ్ముఖు[2]లకుఁ జొరనవిషయంబును, నతిగహ్వరంబును నైనదాని నమరావతిఁ జొచ్చి తద్గోపురసమీపంబున ననవరత[3]గండస్థలగళదవిరళమదజలకుల్యాభిరామంబై నిరంతరనిర్ఝరనీహారనగంబునుంబోలె నొప్పుచున్న నైరావతంబుఁ జూచుచు సురసిద్ధసాధ్య[4]గణంబుతో విద్యాధరాప్సరోగంధర్వకిన్నరజేగీయమానుం[5]డగుచు చనునప్పుడు.

350. క. సకలర్తు [1]సురభికుసుమిత, సుకుమారోద్యాన[2]తరుల నుడియుచుఁ బ్రణయో
త్సుకుఁడై పవనుఁడు పాండవు,నకు నభి[3]ముఖుఁ డయ్యెఁ దన్మనఃప్రియ
మెసఁగన్.

351. క. నరుఁడైన యాదిముని యని, హరిసుతుఁ డని హరిసహాయుఁ డని హరుచేతన్
వరములు వడసినవాఁ డని, సుర లెల్లను వచ్చి పార్థుఁ జూచిరి ప్రీతిన్.

352. వ. అర్జునుండు నయ్యమరావతీవిభవంబు చూచి హర్షించుచు నప్సరోగీయమాన[1]మంగళహితగీతావహితమానసుం డగుచు సిద్ధమునిగణాశీర్వాదంబులు సేకొనుచుం జని మాతలినిర్దేశంబున దివ్యరథావతీర్ణుం డై.

---

ప్రతులు; నట్టి హర్మ్య - డ; రమ్యహర్మ్య - వా. కొన్ని ప్రతులు. 5. లందుల - ఎ. ఏ ఓ. ల. 6. నెక్కు డనదగి శశీందు - ఈ. ఐ. త; నెక్కుడై మఱి - వీ; నుపమానమై దహనేందు - వా. కొన్ని ప్రతులు. 7. నొప్పుచు - ఇ. డ.

349. 1. చారులకు మాంసాహారులకు రణ - పీ. శ. ష. శ. పెక్కు ప్రతులు; చారులకు రణపరా - వా. ఇచ్చట మూలము - పానపై ర్గురుతల్పైశ్చ మాంసాదై ర్వా దురాత్మభిః. 2. లకు నవిషయంబైన దాని - ఇ. ఊ. ఒ. జ. ఝ. ట. త. శ; లకు నతిగహనంబైన దాని - ఏ. ఓ. ఠ. డ. ద. ల. పీ. శ; లకుఁ జొర నగమ్యంబైన దాని - ఆ. చ. శ. ష. 3. విగళదవిరళ - పెక్కు ప్రతులు. 4. గణంబులతో గంధర్వకిన్నర - శ. ష. శ. పెక్కు ప్రతులు. 5. డగుచు - జనునప్పుడు - పెక్కు ప్రతులు; చు నభినవ సౌభాగ్య విరాజమానంబులగు నతిమనోహరవైభవంబు మెఱసి - వా.

350. 1. సురభి కుసుమిత - స. శ; పెక్కు ప్రతులు; కుసుమసౌరభసుకుమార - వా. శ. ష. 2. తతుల - కొన్ని ప్రతులు. 3. మతుడు, గతుడు - అని పాఠములు.

352. 1. మంగళగీతమహితమానసుం డగుచు - పీ. శ. శ; గీతమానిత - చ; గీతసంవాహిత - ల.

353. క. శతమఖునకు భువనావన,రతశీలున కఖిలదేవరాజర్షి సమ
న్వితునకు [1]వజ్రాభీలో,న్నతపృథుభుజునకుఁ గృతప్రణామముం దయ్యెన్.

354. చ. అనిమిషనాథుఁ[1]డుం బ్రచలితాంగదతుంగభుజాయుగంబునం
దనయునిఁ గౌఁగిలించుకొని తత్క్షణజాతనితాంతసమ్మదం
బునఁ బులకాంకితాంగుఁ డయి మున్ను నిజాంక[2]తలస్థుఁ జేసి య
త్యనఘు నిజాసనార్థమున నాదట నుంచెఁ గరంబు నెమ్మితోన్.

355. క. శ్రీ నైరావతకుంభా,స్ఫాలన[1]కర్కశకరములఁ బలుమరును మరు
త్వాలకుఁ డంటుచు నుండె గు,ణాలంకృతుఁ డైన పార్థునంగముఁ బ్రీతిన్.

356. వ. ఇట్లధికవిలాసంబుతో సురవిలాసినీకరకలితచారుచామీకరదండచామరసమీ
రాలోలకుంతలుం డగుచు సురరాజుతో నేకాసనంబున నున్న యప్పార్థుం
బాకశాసనుశాసనంబున దేవగంధర్వసిద్ధవిద్యాధరు లతిప్రీతి [1]నర్చించి రంత.

357. తే. పాకశాసను పనుపునఁ బార్థుఁ డొక్క,మణిమయం బైన మహనీయమందిర
మున
నెలమి గంధర్వసంగీతహృద్యగోష్ఠి, నుండెఁ జెవులకు నుత్సవం బొందు
చుండ.

---

353. 1. వజ్రాభీలోన్నత – ఊ. ఐ. ఒ. గ. ఠ. డ. ద. వీ. శ. ష. స. శ; వజ్రాభి
హితోన్నత – వా. కొన్ని ప్రతులు.

354. 1. డంత రుచిరాంగదతుంగ – ఆ. 2. పద, తట – అని పాఠములు.

355. 1. కర్కశము లైన కరములను మరు, త్వా – శ. ష; కర్కశము లైన పాణులను
మరు, త్వా – వీ.

356. 1. నగ్గించి రంత – ఎ. ఏ. ఓ. ఔ. ద. వీ. శ. ష. స. శ; పూజించి రంత – ఉ. చ.

357. 1. ఊర్వశీ శాపవృత్తాంతము – ఆరణ్యపర్వము ప్రథమాశ్వాసము 357 వ పద్యము
నుండి 388 వ పద్యము వఱకును వ్యాపించియున్న ఈ కథ వివాదాస్పదముగా
నున్నది.

1858 ముద్రితప్రతి (ష) యం దీభాగము కలదు. వావిళ్ళ (వా) ఆనంద (శ)
వీరేశలింగంగారి (వీ) ప్రతులం దీభాగము గ్రంథభాగముగాఁ గైకొనఁబడినది. వావిళ్ళ
అథోజ్ఞాపికయందు ఈ భాగము ఒక్క తాళపత్ర ప్రతి యందును, ఒక్క కాగితపు

358. వ. అంత సూర్యాస్తమయసమయంబునఁ జంద్రుం డుదయించి సాంద్రచంద్రికావి[1]లాసంబున దిగ్వనితల నలంకరించుచుండ నిలింపపతి[2]పంపున సొంపార నూర్వశి యర్జునసంగమకాంక్షం జేసి చంద్రికాధవళదుకూలంబు గట్టి మృగమదకర్పూరకుంకు[3]మోన్మిశ్రిత[4]సుగంధం బలఁది వివిధసురభికుసుమ[5]విసరంబులు ముడిచి మణిమయభూషణాలంకృతయై నిలుకడ వడసిన క్రొమ్మెఱుంగుఁ దీఁగయుంబోలె మణిమయమంజీరఝుళంఝుళనినాదంబును గంకణఝుణఝుణత్కారంబును [6]గటికలాపకింకిణీక్రేంకారంబును మదనాజ్ఞావాద్యఘోషంబునుంబోలె మ్రోయుచుండ మందగమనంబునఁ బురందరనందను మందిరంబున కరుగుదెంచిన నప్పురుషసత్తముండు భయభక్తిసంభ్రమంబులతోఁ బ్రత్యుత్థానంబును దండప్రణామంబునుం జేసి కరకమలంబులు మొగిచి యిట్లనియె.

---

ప్రతియందును కనఁబడుచున్న దని చెప్పఁబడినది. ఆనందప్రతియం దీభాగము ప్రక్షిప్తము కానోపు:నని వ్రాయఁబడినది.

మేము పరిశీలించిన వానియం దీక్రిందితాళపత్రప్రతులలో నీ వృత్తాంతము ఉపలభ్యమగు చున్నది- అ. ఇ. ఈ. ఉ. ఎ. ఏ. ఐ. ఓ. క. చ. ఝ ల. ఈక్రింది ప్రతులలో నీ భాగము కాన్పింపదు - ఆ. ఊ. ఒ. ఔ. గ. ఘ. జ. ట. ఠ. డ. ద. శ.

సంస్కృతమూలమునందు ఊర్వశీశాప వృత్తాంతము పి. పి. ఎస్. ప్రతి, చిత్రశాలా ప్రతి, వావిళ్ళ తెలుఁగులిపి ప్రతులందు గ్రంథ భాగముగా నంగీకరింపఁబడినది. భండార్కరు ప్రతియందీ భాగము ప్రధాన గ్రంథ భాగముగా నంగీకరింపఁబడలేదు. అథోజ్ఞాపికలో నిట్లు వ్రాయఁబడినది.

**" A Passage comprising two Adhyayas and describing the temptation of Arjuna by Urvasi, given in App. I No. 6 is inserted in $K_2$. B. Dc. Dn, $D_1$, 4 – 6 after 192 and in $K_4$, $D_2$, 3 after stanza 8 of this Adhyaya, but in S after Adhyaya 44. There is no reference to this episode in Kshemendra's Bharata manjari. Note the Phalasruti at the end of this interpolation."**

ఆంధ్రమహాభారతమునందలి పర్వానుక్రమణిక, పర్వసంగ్రహభాగములందు ఊర్వశీశాపవృత్తాంతప్రశంస లేదు. విరాటపర్వము ప్రథమాశ్వాసమునందలి 87 వ పద్యమునందు తిక్కనసోమయాజి ఊర్వశీశాపకథను ప్రసంగించియున్నాఁడు.

358. 1. కాసంబున-ఉ. ఎ. ఏ.ఐ. ఓ. క. ఝ. త. 2. పంపున నింపు సొంపార-కొన్ని ప్రతులు. 3. మిళిత గంధం బలంది - కొన్ని ప్రతులు. 4. శ్రీగంధం బలంది- ఇ. 5. విసరంబులు - పీ. శ. ష. పెక్కు ప్రతులు; విస్తరంబులు - వా. 6. రశనా - ఆ. ఇ. ఈ. ఉ. ఎ. ఏ. ఐ. ఒ. క. చ. ఝ. త. ల.

359. క. ననుఁ బుత్త్రస్నేహంబున, మనమున మన్నించి శుభసమగ్రునిఁ జేయం
జనుదెంచి [1]తీవు ముదమున, జనయిత్రీ యేఁ గృతార్థజన్ముఁడ నైతిన్.

360. తే. అనిన నూర్వశి యిట్లను నాత్మనేత్ర,మధుపము లతనిసౌందర్యమధువుఁ గ్రోలు
చుండఁ దమకంబు మీఱి యనూనధర్మ,నిపుణుఁ డగునర్జునునితోడ నెయ్య [1]మొనర.

361. చ. అనుపమశౌర్య నీదుసముదగ్ర[1]గుణంబులు నారదాదిస
న్మునివరు లెల్లఁ జెప్పఁగఁ బ్రమోదమునన్ భవదీయసంగమం
బనిశముఁ [2]గోరుచుం దగఁ బ్రియంబున వచ్చితి [3]నేను గోరఁగా
నను జనయిత్రి వంచు నొక నాయము వల్కెదు వక్రభాషలన్.

362. తే. నీకు నేనాఁటి తల్లిని నిజము సెపుమ, యమరలోకంబు వేశ్యల మైన మాకు
నిట్టి తగవులు నడవ వహీనబాహు,వీర్య యిచ్చట [1]వావులు వెదకఁ [2]జవదు.

363. వ. ఈలోకంబున వనితలుఁ బురుషులు విచ్చలవిడిఁ గ్రీడింతు రిచ్చటి కిది యనిందితం బైనయాచారంబు నీవును ద్రిదివంబునకు వచ్చిన యప్పుడ దివ్యపురుషుండవు గావున నామనోరథంబు సఫలంబుగా మందారమంజులమంజరీమకరందపానమత్తమధుకరగానమనోహరస్థలంబులను మేరుశైలకందరంబులను మందపవనంబులు గల నందనాదివనంబులయందును నితాంతకాంతవికసితకనకారవిందసమధికసౌరభసంవాసితమహానందకందంబు లైన మందాకినీతీరమణిమయవేదికలయందును జంద్రికాసుందరంబు లైన సికతాతలంబులను మఱియు నిర్జరవిహారస్థానంబుల ననవరతసురతకేళీసౌఖ్యాంబుధి నన్ను నోలలార్పు మనిన నిర్వికారధైర్యధుర్యుం డై యర్జునుం డిట్లనియె.

364. క. ఓహో యిమ్మెయి ధర్మ,ద్రోహోక్తులు పలుకఁ దగునె దోసం బదిగా
దే హరి హరి మనమునఁ దగ, వూహింపక నన్నుఁ బలు[1]కు టుచితమె నీకున్.

---

359. 1. తివి ముదంబున – కొన్ని ప్రతులు.

360. 1. మలర, మమర – అని పాఠములు.

361. 1. గుణావళి – సం. 2. గోరుచుండగ ...... వచ్చితి వేమ గోరగా – క. ఝ. ష. 3. నిన్ను గోరగా – ఐ. త; నిన్ను గానగా – చ.

362. 1. వావులు – ల; వావియు – పెక్కు ప్రతులు; వావియే వెదక – వా. 2. జనదు – ఆ. ఇ. ఈ. ఉ. ఎ. ఏ. ఐ. ఓ. క. చ. ఝ. త. ల; జనునె – వా.

364. 1. కనుచితమె – కొన్ని ప్రతులు.

-: ఊర్వశి యర్జును నపుంసకునిఁగా శపించుట :-

365. వ. జగంబులు పుట్టింపను మనుపను సమయింపను గర్తలైన దేవతలకు నెట్లు నడచిన నెగ్గు లేదు నేను గర్మభూమిని జనియించి [1]సత్కర్మపరుండ నైన నాకు నిచ్చటి యాచారం బుచితంబు గాదు మదీయవంశకర్తయైన పురూరవునకుఁ బత్ని వైన కారణంబునను బురందరునకుఁ బరిచర్య యొనర్పు[2]టం జేసియు నాకు జనని వగుట సందియంబు లేదు తల్లీ నన్నుం బుత్త్రి [3]వాత్సల్యంబునం జూడు మనిన మదనబాణపీడితయై కోపారుణితనయనంబుల నర్జునుం జూచి యూర్వశి యేను గామించి వచ్చిన నామనోరథంబు విఫలంబుఁ జేసిన వాఁడవు నీవు మర్త్యలోకంబున మానవర్జితుండ వై మానినీమధ్యంబున నపుంసకుండవై యుండు మని శాపం బిచ్చి నిజగృహంబునకుఁ జనియె నంతఁ బ్రభాతసమయంబునఁ దద్వృత్తాంతం బంతయు విని సురపతి కొడుకున కిట్లనియె.

366. క. నీయట్టి ధైర్యవంతుని, నేయుగముల [1]నైనఁ గాన మెన్నండును ధ
ర్మాయత్తమతివి మునులకు, నీయింద్రియజయము గీర్తనీయము తండ్రీ.

367. తే. [1]అనఘ యూర్వశి యిచ్చిన యట్టిశాప, మనుభవింపంగవలయు నీకవనియందు
నింక[2]మీ పదుమూఁ[3]డవయేఁడు సత్యసరణి నజ్ఞాతవాసంబు సలుపవలయు.

368. వ. అక్కాలంబున నీవు షండరూపంబునఁ బ్రచ్ఛన్నుండ వై రాజకన్యకలకు నృత్యంబు గఱపుచుండి తదంత్యంబున శాప[1]మోక్షంబు వడయు మని యనుగ్రహించె నీయాఖ్యానంబు [2]విన్న పుణ్యపురుషులు సకలదురితవిముక్తు లగుదు రని చెప్పి వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.

---

365. 1. సత్కర్మ పరుండనైన – ఇ. ఈ. ఏ. ఐ; కర్మఠుండనైతి – వా. కొన్ని ప్రతులు. 2. టను – వా. పెక్కు ప్రతులు. 3. స్నేహంబున – ఝ.

366. 1. నెందు, యందు – అని పాఠములు.

367. 1. అన్న – ఈ. ఐ. త. 2. నీ పదుమూఁడవ – ఈ. ఐ. చ. త. 3. డగునేడు, డవునేడు – అని పాఠములు.

368. 1. మోక్షణంబు – ఎ. ఏ. ఓ. 2. విన్న పురుషులకు సకలదురితవిముక్తి యగునని – ఇ. ల.

369. సీ. వజ్రాస్త్ర మాదిగా[1] వరదుఁడై వివిధదివ్యాస్త్రముల్ పార్థున కమరనిచ్చి
తత్ప్రయోగంబులుఁ దద్రహస్యంబులుఁ దన్నివర్తనములుఁ దడయ కపుడ
దయ నుపదేశించి దారుణాహవములం దవిజేయ[2]వీర్యుండ వగుము పేర్మి
నని మహాసౌహార్దుఁడై చిత్రసేనుఁ డన్గంధర్వపతితోడ గారవమున

ఆ. వజ్రధరుఁడు గీతవాద్యనృత్యంబులు, గఱవఁ బంచెఁ బార్థుఁ గడఁగి యిట్టు
లమరనాథునొద్ద నర్జునుం డుండ [3]నే,డేఁడు లరిగె నిట మహీతలమున.

370. వ. అంత నొక్కనాఁడు [1]రోమశుం డనుమహాముని యింద్రునొద్దకు వచ్చి
సురగణపూజితుండై సురేంద్రుతో[2] నేకాసనంబున నున్న యర్జునుం జూచి
యాశ్చర్యం బంది యింద్రున కి ట్లనియె.

371. క. కోరి యనేకయుగంబు ల,పారతపోయుక్తు లైనవారికి బడయ\న్
దూరము నీసభ మఱి నీ,కారుణ్యం [1]బంతకంటె గడు[2] దవ్వెందు\న్.

372. వ. [1]అట్టియందు నీతో నొక్కట నేకాసనం బెక్కి నీరెండవమూర్తి యుంబోలె
నున్న యిమ్మనుజుం డెందులవాఁ డెవ్వఁ డనిన నమ్మునీంద్రునకు దేవేం
ద్రుం డి ట్లనియె.

373. క. నరుఁ డనుమహర్షి యీతఁడు, నరలోకమునందుఁ బుట్టె నాయంశమున\న్
[1]గురుమతిఁ గౌంతేయుఁడు భా,సురతేజుఁ డుపేంద్రసఖుఁడు సువ్వె
మునీంద్రా.

---

369. 1. వరదుండు దివ్యాస్త్ర,ములు పార్థునకు వేడ్క వెలయనిచ్చి - గ. ల; వర
దుండు దివ్యాస్త్ర,ములు పార్థునకు వేడ్క మొనయనిచ్చి - ఎ. ఏ. ఓ. క. న;
2. ధైర్యుండవగుము - ఎ. ఏ. ఓ. ఝ; విజయుండ వగుము - డ. 3. నేడే
డులు - అ. ఆ. ఏ. చ. జ. ద. శ. ష. ఇచ్చట మూల మిట్లున్నది. పురందర
నియోగాచ్చ పంచాబ్దా నవసత్సుఖీ - చిత్రశాలా ప్రతి. పుట. 80.

370. 1. లోమశుడు అని మూలభారతము. 2. తోడనేకాసనంబున రెండవమూర్తియును
బోలె నున్న యర్జును - ఆ; తోడ నొక్కట యేకాసనం బెక్కి రెండవ
మూర్తియుం బోలె నున్న యర్జును - ఉ.

371. 1. బంతకంటె - తి. పెక్కు ప్రతులు; బింతకంటె - వా. కొన్ని ప్రతులు.
2. చోద్య మిలన్ - ఛ.

372. 1. అట్టియిందుల - శ. ష; ఇట్టియందు నీతోడ - ఏ. క. ద. ల; ఇట్టియందు

373. 1, కురుపతి, స్థిరమతి - అని పాఠములు.

374. తరలము. శివుఁడు వీనికిఁ బ్రీతుఁడై దయసేసెఁ బాశుపతాస్త్ర మా
దివిజముఖ్యులతోడ నేనును దివ్యబాణము లిచ్చితిం
దివిరి యీతఁడు మత్ప్రియంబుగ దేవకార్యము దీర్పఁగా
సవినయస్థితి నున్నవాఁడు నిజప్రతాప[1]బలోన్నతిన్.

375. వ. మఱియు [1]వసుమతీఖాతగర్వితు లైన సగరసుతులం దనదృష్టితీవ్రదహనం బునం జేసి దహించిన కపిలుం డనుమహాముని నారాయణుం డయ్యె నట్టి నరనారాయణు లాదిమునులు జగదుపకారులు [2]జగతీభారావతరణకారణు లై దైత్యదానవవధార్థంబు [3]మర్త్యంబునం బుట్టినవారు గావున.

376. క. దేవతలకు నపకారము, గావించిన యన్నివాతకవచులఁ బాతా ళావాసుల దానవుల మ, హా[1]వీరుఁడు వీఁ డభేద్యుఁడై [2]వధియించున్.

377. వ. అని తత్ప్రభావంబు సెప్పి యింద్రుండు రోమశున కిట్లనియె మునీంద్రా నీవు మర్త్యలోకంబునకుం బోయి ధర్మజుం గని యతనికిం దత్సహో దరులకు సంతోషంబుగా నాయొద్దం బార్థుం డున్నకుశలవార్త యెఱం గించి భీష్మద్రోణకర్ణాదివీరుల [1]నోర్చునట్టి దివ్యాస్త్రంబులు [2]వడసె నతండు మీయొద్దకు వేగంబ వచ్చు వగవ కుండుం డని చెప్పి నావచనంబున ధర్మజు నఖిలతీర్థసేవ సేయం బంపు మట్లయిన నపేతదురితుండై [3]యఖిలమహీ రాజ్యంబు వడయు నతండు [4]తీర్థాభిగమనంబు సేయునపుడు [5]నీవాతనికి సహా[6]యుండవు గమ్మని యింద్రుండు రోమశుం బనిచె నిట ధృతరాష్ట్రుం డర్జును దివ్యాస్త్రలాభంబుఁ బారాశర్యువలన నెఱింగి పరమ[7]వ్యాకుల హృదయుం డై సంజయున కిట్లనియె.

---

374. 1. సమున్నతిన్ – ల. వ.

375. 1. వసుమతి నతిగర్వితు లైన – చ. పీ. శ. వ; వసుమతీఖనన – ఓ. జ. ల. స. 2. జగతీభారకారణంబు లైన – డ. 3. మర్త్యులై – శ. వ.

376. 1. వీరుల వీ డభేద్యుఁడై – కొన్ని ప్రతులు. 2. నిర్జించున్ – ఇ. ఝ. ల.

377. 1. జయించు నట్టి – ఎ. డ. 2. వడసినాడు, వడసినవాడు – అని పాఠములు; 3. యశేష – కొన్ని ప్రతులు. 4. తీర్థసేవ – ఉ. ఒ. చ; తీర్థగమనంబు – పెక్కు ప్రతులు. 5. నీవువానికి – అ. ఊ. ఎ. ఏ. ఓ. ఔ. ద. 6. యుండ వగుమని, వై యరుగుమని – అని పాఠములు. 7. వ్యాకులిత – అ. ఆ. ఇ. ఈ. ఐ. ఒ. గ. ఝ. డ. త. ద. ల.

378. సీ. సురసమూహంబుతో సురరాజు నోడించి [1]ఖాండవం [2]బెక్కటి కాల్చియున్న
వీరున కఖి[3]లాబ్ధివృతవసుంధర గల రాజుల నోర్చి పరాక్రమమున
నగ్రజు రాజసూ[4]యాధ్వర మనిచిన యధికసమర్థున కర్జునునకుఁ
[5]ప్రబలసింహమునకుఁ బక్కెర వెట్టినయట్లు దేవతలు నెయ్యంబుతోడఁ

ఆ. బరముఁ దొట్టి పాశుపత మాదిగా దివ్య, శరము లిచ్చి [6]రట్టె శౌర్య మెసఁగ
నట్టినరుఁ[7]డు యోధుఁడై యున్నపాండవ, వరుల [8]జెనయు
నంతవారుఁ గలరె.

379. క. వారికి ధర్మువు దప్పని, వారికి [1]దృఢవచను లైనవారికి విమలా
చారుల కెద్దియుఁ బడయఁగ, దూరమె పాండవులఁ బోలుదురె
వీరు లొరుల్.

380. వ. వారలతో విగ్రహించి దుర్యోధనుండు దన[1]కుఁ దన బాంధవులకు సుహృ
జ్జనంబులకు హాని [2]నేసికొనియె.

381. ఆ. పర్వతములు వజ్ర[1]పాతాహతిని బోక, తక్కునేని నింద్రతనయు[2]దివ్య
నిశితబాణతతుల నిశ్శేష మగు[3]నదఁ, బరులసైన్య మెట్లు బ్రదు[4]క నేర్చు.

---

378. 1. కాండవం బొక్కట – శ. 2. బొక్కట – ఈ. ఐ. ఓ. ఢ త. శ. ష; బొక్కఁడ–వీ 3. లాస్త్రవేదికి – ఎ. ఏ. ఓ. క. ఝ. ల. 4. యాధ్వరం బునిచిన – ఇ. ఉ. ద; యఁబున నిలిపిన – ఎ ఏ. ఓ; యాధ్వరమున నున్చు నధిక – ఈ. ఐ. త; యాధ్వర మునిచిన – పీ. శ. ష. 5 ప్రౌఢ – ఎ. ఏ. ఓ; ప్రౌఢి సింహమునకు – స; ప్రబల– వీ. శర. ప. స ళ; బాచి బార్చి భాతి, బాతి – అను పాఠములు గలవు. అర్థము విచార్యము 6 రట్టి శౌర్య మెసఁగు – పెక్కు ప్రతులు. 7. డజేయుడై యుండ, డధికుడై యుండ, డసాధ్యుడై యుండ – అని పాఠములు. 8. జెనకు నట్టివారు – ఇ. ఉ. డ. వీ. శ. ష.

379. 1. దృఢ, మిత, హిత, నుత, ప్రియ, ఋత (వచనులైన) – అని పాఠములు; మానధనులైనవారికి – ట.

380. 1 కునుం దన బాంధవులకును – ఎ. ఏ. డ. 2. తెచ్చుకొనియె – ఆ. ఘ.

381. 1. పాతాభిహతి బోక – ఆ. ఇ. ఉ. ఒ. ఝ. ఠ. ల; పాతహతిఁ బడక – వీ. శ. ష; పాతనిహతి వెరదక్కెనేని – ఊ; పాతాభిహతివెర – ఠ. 2. చేతి – కొన్ని ప్రతులు. 3. గాక, నాగ – అని పాఠములు. 4. కు బోర – ఇ. ఊ. జ. వీ. శ. ష. ళ.

382. వ. లయకా[1]లోదితసహస్రకరుకిరణబులం జరాచరంబులు దగ్ధంబు లగునట్లు పార్థుబాణంబులం జేసి దుర్యోధనాదులు దుస్సహతాపంబు[2]c బొందుదు రని దుఃఖితుం డైన ధృతరాష్ట్రునకు సంజయుం డి ట్లనియె.

383. క. ఈపున దుర్యోధన దు, శ్శాసను [1]లొగిc బాండవులకు సభలో నెగ్గుల్ [2]సేసిన విని వారల నను, శాసింపcగ [3]వలవ దనcగ జనదే నీకున్.

384. వ. నీ యుపేక్షం జేసి దుర్యో[1]ధనుచేత దుర్ద్యూతపరాజితులై రాజ్యంబు విడిచి పాండవు లరిగి కామ్యకవనంబున నున్నc గృష్ణుం డనేక రాజసమన్వితుం డై వారియొద్దకు వచ్చి నీ కొడుకులు సేసిన [2]నికారంబునకుం గృష్ణా పరిభవంబునకు దుఃఖితుం డై కడు నలిగి మీకు [3]నెగ్గుసేసిన దుర్యోధనాదుల దూషించి గజపురంబున ధర్మరాజు రాజ్యాభిషిక్తుం జేయుదు ననియు రాజసూయంబు సేయునాcడింద్రప్రస్థంబున నైన విభూతికంటె విశేష విభూతి గావింతు ననియు ద్రుపద సృంజయ కేకయ ధృష్టద్యుమ్న బలదేవ సాంబ సాత్యకిప్రభృతుల సమక్షంబునం బలికి సత్యసమయు లైన పాండవులచేత సంరంభనివారితుం డై పార్థుసారథ్యంబునకుc బ్రార్థితుం డయ్యెనని వింటిమి.

385. క. పదు[1]మూడేండ్లుం బోయినc, బదు[2]నాల్గు నేcడు ఘనులు పాండవులు జగ ద్విదితముగ నుత్సహింతురు, వదలక రణమునకుc గేశవ[3]పురస్కృతులై.

---

382. 1. లోగ్ర, లోద్దీపిత – అని పాఠములు. 2. న బొందుదురు – పెకు ప్రతులు.

383. 1. లప్పాండవుల, లాపాండవుల – అని పాఠములు. 2. సేసిన వారలు వారిని శాసింపక వగల బొగుల జనునే నీకున్ – డ. 3. వల దనంగ జనదే మీ (నీ)కున్ – వీ. శ. ష.

384. 1. ధను దుర్ద్యూతంబున, ధనుదుష్టద్యూతంబున – అని పాఠములు; ధనుచేత దుర్ద్యూతంబున – ఈ. ఉ. ఐ. ఒ. త; ధనదుర్ద్యూత – వా. వీ. శ. ష. 2. నిష్కారణ వైరంబునకు – త. ల. న. 3. నెగ్గు సేసిన – ఈ. ఐ. ఒ. చ. త. వీ. శ. ష; నిట్లు సేసిన – వా.

385. 1. మూడేడులు బోవుడు – చ. జ. ర. ల. శ. ష. 2. నాల్గవయేట – జ. ల. శ. ష. 3. ప్రేరితులై – ఎ. ఏ. ఓ. క.

386. క. [1]వరములు వేల్పులచే దు, ష్కరతపమునఁ బడయుదురు జగంబున [2]నొరు లీ
[3]శ్వరుచే వరములు [4]వడసెం, గరుణ ధనంజయుండు దనదుకార్ముకశక్తిన్.

387. వ. అయ్యర్జును దివ్యశరసంఘాతంబును భీమసేను చిత్రగదాఘాతంబును నీ
యుపేక్షానిర్ఘాతంబును గౌరవపరిక్షయంబునకుఁ గారణభూతంబు లనిన
సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె.

388. క. వృద్ధని [1]జాత్యంధుం డని, బుద్ధివిహీనుఁ డని నన్నుఁ బుత్త్రుఁడు బలద
ర్పోద్ధతుఁడై మెచ్చఁ డసం[2], బద్ధంబులె కాని వినఁడు పలికినపలుకుల్.

389. వ. దుర్యోధనుండు [1]దుర్బుద్ధియని యేమి సెప్పవలయు భీష్మద్రోణవిదురాదుల
[2]నాదరింపక కర్ణ[3]శకునుల నాప్తులం జేసికొని వారివచనంబుల నెగడు నే
నేమి[4]సేయుదు నని ధృతరాష్ట్రు[5]డుమిన్నకుండె నిట పాండవులు పార్థు
మసలుటకు దుఃఖితులై.

390. ఉ. పాండవ[1]సింహ మర్జునుఁడు పాండుయశంబు వెలుంగుచుండ నా
ఖండలు దొట్టి నిర్జరనికాయముచేత వరంబు గాంచి యె
న్నం డిట వచ్చునొక్కొ సుజనస్తుతు నాతనిఁ బ్రీతిఁ [2]జూడ నె
న్నం డొకొ [3]కాంతు మంచును మనంబునఁ గోరుచు నుండి రెంతయున్.

---

386. 1. వరములు - అధికసంఖ్యాకప్రతులు; తిరముగ - వా. సం. 2. నరలీ, వారీ - అని పాఠములు. 3. శ్వరు చేత వరము - కొన్ని ప్రతులు. 4. వడసెను - కొన్ని ప్రతులు.

388. 1. జాత్యాంధ్యుండని – డ. 2. సంబద్ధోక్తు లెకాని – ఎ. ఏ. ఓ. ల.

389. 1. దుర్బుద్ధినేమి, దుర్బుద్ధులేమి - అని పాఠములు. 2. సాకర్ణింపక – ల. 3. శకుని దుశ్శాసను (సైంధవు) నాప్తులంజేసికొని – కొన్ని ప్రతులు. 4. సేయువాడ – వీ. శ. ష. 5. దూరకుండె – ఉ. డ.

390. 1. సింహుఁడ – ఓ. ఔ. ఠ. డ. ద. ల. 2. జూచు టెన్నం డొకొ, జూచు టెన్నం డొకొ – అని పాఠములు; తోడ నెన్నం డొకొ – ఔ. ద. వీ. శ. ష. 3. కందు మంచును – ఉ. ఔ. ఘ.

391. వ. అట్టి యవసరంబున యుధిష్ఠిరునకు భీముం డి ట్లనియె.

392. మధ్యాక్కర.

నీ [1]నిదేశంబున నరిగి పార్థుండు నిష్ఠతోఁ దపము
మానుగాఁ జేయుచు నున్నవాఁ డేల మసలెనో రాక
వాని ధర్మస్థి[2]తుఁ బాసి యున్న యివ్వర్షముల్ యుగస
మానంబు లై నవి మనకు నతని [3]సమాగమకాంతు.

393. వ. మఱి పాండవ[1]పాంచాల వీరుల జీవనంబు లాతనియంద నిలిచినవి తదీయ [2]భుజాశ్రయబలంబునం బరుల జయించి ధరణీరాజ్యంబుఁ[3] బరిగ్రహింత మని యున్నవారము గావునం గాలయాపనంబు సేయక యర్జునుం దోడ్కొని తేర జనార్దను[4] రాఁ బనిచి నియోగింపుము.[5]

---

392. 1. నిర్దేశంబున – శ. ప. పెక్క తాళపత్ర ప్రతులు. ఛందస్సు చింత్యము. 2. రు — ల. స. 3. ఇచ్చట నఖండయతి లక్షణము తోచును. దీని నెవ్వరును మార్చలేదు. ఒక్క ప్రతిలో మాత్రము ఇట్లున్నది.

సమ్గమనంబు కాంతు – ఋ. ఉ.

గమనిక – శ. ప. ప్రతులందును, ఇ. ఔ. ౫. తాళపత్ర ప్రతులందును, సమాగమన కాంతున్ – అను పాఠము గైకొనబడినది. ఇచ్చట ఛందస్సు సమన్వయ మగుట లేదు.

393. 1. పాంచాల వీరుల జీవనంబు – శ. ప. కొన్ని ప్రతులు; పాంచాల యోధుల జీవనంబు – ఈ. ఐ. ఘ. త; పాంచాల యాదవ వీరుల – వా. 2. భుజబలాశ్రయంబునం – అ. ఇ. ఒ; భుజబల సంశ్రయంబునం – జ; భుజా [జ] బలంబును – ఆ. ఈ. ఉ. ఎ. ఏ. క. ఘ. త; భుజ బల సంరంభంబు నాశ్రయించి, పరులజయించి సముద్రవేలావలయ వలయితమహీచక్రం బైన రాజ్యంబు – గ. ఠ. ల. స. 3. బనుభవింతమను, బనుభవించి సుఖింత మను – అని పాఠములు. 4, రా బనిచి – పెక్కు ప్రతులలో లేదు.

5. ఈ వచనము తరువాత, ఆ. క. గ. ఠ. ల. స. లయందు ఒక పద్యమును ఒక వచనమును అధికముగా గలవు.

ఘనుఁ డగుచున్న కృష్ణుఁడును గవ్వడియున్ వడిఁ దోడ్పడంగఁ బే
ర్చినను సుయోధనాదులను జెచ్చెర సంగరభూమియందుఁ జు
ల్కన వధియింతు నాదు భుజకల్పిత ఘోర గదాభిఘాత (విభూతి) మ
ర్దన నిజగాత్ర పర్వత పరంపరలున్ గతభస్మమై ( తగభగ్నమై ) చెడన్.

394\. మ. సమయాబ్దంబులకంటె ముందర మహోత్సాహంబునఁ బాహువి
క్రమ మొప్పన్ విజయుండు నే[1]నుఁ దగ సంగ్రామంబులో నేకకా
లము[2]నం దాధృతరాష్ట్రజాధముల నెల్లం జంపి భూచక్రరా
జ్యము సేకొందుము కౌరవేంద్ర మురజిత్స[3]ఖ్యప్రసాదంబునన్.

395\. వ. [1]సత్యభంగ[2]భీతుండవు గావున నీ వింద యుండి పదుమూడేండ్లుం జలిపి పదంపడి కరిపురంబునకు వచ్చి రాజ్యాభిషిక్తుం[3]డ వగుము దుష్టద్యూతంబున మనరాజ్యం బపహరించిన సుయోధనుండు [4]సుచిరప్రతిష్ఠితుండు కాకుండ నిప్పుడ యద్దురాత్ము [5]దూషింతుము నికృతిపరుల నికృతినచేసి నిర్జించినఁ బాపంబు లేదు సర్వప్రకారంబులను శత్రువుల జయించి రాజ్యంబు సేకొనుట రాజులకు విధిచోదితం బైన రాజధర్మంబ యనిన భీమసేను మహాసంరంభంబునకు[6] సంతోషించి ధర్మనందనుం డాతనిం దనపైకిం దిగిచికొని మూర్ధాఘ్రాణంబు సేసి యి ట్లనియె.

396\. తే. అనలునకు గాడ్పు దోడైనయట్టు లింద్ర, తనయునకు నీవు దోడైనఁ
దడయ కాజిఁ
[1]బోరి రిపులకు బ్రతుకంగఁ బోల దైన, [2]ననఘ యిది [3]కోపమునకు
ననవసరంబు.

397\. క. పదుమూఁ[1]డేండ్లుం బోయినఁ, బదపడి పార్థుండు నీవుఁ బరనృపతుల దు
ర్మదుల వధియించి విజయా, స్పదబాహుల రగుఁడు ధర్మపరిరక్షకులై.

---

అని భీమసేనుండు విజృంభించి ధార్తరాష్ట్రుల తోడి కయ్యంబునకు కాలు త్రవ్వుచు (దువ్వుచు) నంతకాకారుండై మఱియు ధర్మతనయు నవలోకించి (య) సాధారణ వచనంబుల నిట్లనియె.

394\. 1. నుజని, నయిన, నునొగి – అని పాఠములు. 2. లోనన్ ధృతరాష్ట్ర – కొన్ని ప్రతులు. 3. ఖ్యాభియోగంబునన్ – పీ. శ. వ; ఖ్యప్రభావంబునన్ – ద.

395\. 1. సమయభంగ – ఈ. ఉ. ఐ. ఔ. ఘ. ర. త. 2. భీరుండవు – ద. 3. డవు గమ్ము – జ. డ. ద. 4. సుప్రతిష్ఠితుండు, సుప్రతిష్ఠుండు – అని పాఠములు. 5. దూషింతము, దూషించెదము – అని పాఠములు. 6. సంతోషిల్లి, సంతసిల్లి – అని పాఠములు.

396\. 1. బోరి – పెక్కు ప్రతులు; బొనగ – పీ. శ. వ; బోర – వా. కొన్ని ప్రతులు. 2. నరయనిది – ఝ. వా. పీ. శ. వ; ననఘ యిది – పెక్కు ప్రతులు. 3. కోపమునకు సమయంబుగాదు – క.

397\. 1. డేడులు – పీ. శ. వ. కొన్ని ప్రతులు.

398. వ. ఏ నెట్లును సత్యభంగంబు సేయుట కొడంబడ నోప నని ధర్మతనయుం [1]డనుజు [2]ననునయించె నని జనమేజయునకు వైశంపాయనకథితం బైన పుణ్యకథ యతి[3]రమణీయంబుగాను.

399. క. బిరుదాంకభీమ భీమే, శ్వరకృత[1]కృత్యప్రసాద సౌజన్యగుణా
భరణ పరగండభైరవ, పరనృపమణిమకుటఘటితపద [2]బుధవినుతా.

400. ఉత్సాహము.
రాజవంశరత్న రాజరాజ దేవ నిత్యల
క్ష్మీజయాభిరామ ధర్మమిత్ర [1]మిత్రవిద్వదం
[2]భోజవనపయోజమిత్ర భూరికీర్తికౌముదీ
రాజితత్రిలోక నిఖిలరాజ[3]లోకపూజితా.

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబునందుఁ బాండవవనప్రవేశంబును, గిమ్మీరవధయును, గృష్ణ పాంచాలాభిగమనంబును, [1]సౌంభకాఖ్యానంబును నింద్రకీలాభిగమనంబును[2], గైరాతంబును, నర్జునతపశ్చరణంబును, నీశ్వరుతోడ యుద్ధంబును, బరమేశ్వరుచేతఁ బాశుపతాస్త్రంబు వడ యుటయును, లోకపాలసందర్శనంబును, స్వర్గ గమనంబును, నూర్వశిశాపంబును, దేవతల [2]వలన దివ్యాస్త్రలాభంబును నన్నది ప్రథమాశ్వాసము.



398. దుఃఖమునకుఁ గోపోపశమనంబుఁ జేసె – ఇ. ఈ. ఐ. ఘ. త. పీ. శ. ష. 2. ననూన యించెనని – అ. ఆ. ఊ. ఏ. ఓ. ఔ. క. ద. ల. కొన్ని వ్రాతప్రతులు. 3. రమ్యంబుగాను – కొన్ని ప్రతులు.

399. 1. నిత్యప్రసాద – కొన్ని ప్రతులు. 2. విబుధనుతా – పెక్కు ప్రతులు;

400. 1. భూరివిద్వదం – ఆ. క. చ. పీ. శ. ష. 2. భోజినీ పయోజమిత్ర – ల. 3. రాజ – అ. ఎ. ఏ. ఓ.

401. గద్యము – 1. సౌభకాఖ్యానంబును – ల. వీ. 2. గైరాతంబును నర్జును దివ్యాస్త్రలాభంబును నన్నది – పెక్కు తాళపత్ర ప్రతులు; అర్జును తపశ్చరణంబు – ఊర్వశీ శాపంబు – మున్నగు నంశములు విడువఁబడినవి. 3. నర్జును దివ్యాస్త్ర – కొన్ని ప్రతులు.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - ద్వితీయాశ్వాసము

—o—o—o—

1. క. శ్రీరమ్యా[1]ధర్మనిత్య
ప్రారంభవిభాసి రాజపరమేశ్వర ఘో
రారిమదకుంభికుంభ వి
దారణ[2]దారుణకృపాణ[3]దక్షిణహస్తా.

సం. 3 - 49 - 29

2. వ. [1]అక్కథకుండు శౌనకాదిమహామునులకుం [2]జెప్పె నట్లు [3]సాంత్వన వచనంబుల భీమసేనునకుం [4]గోపాటోపోపశమనంబు [5]సేయుచున్న ధర్మరాజునొద్దకు బృహదశ్వుం డనుమహాముని వచ్చి విధిదృష్టవిధానంబునం బూజితుండయి విశ్రమించి యున్న [6]నమ్మునివరునకు ధర్మతనయుం డధర్మపరులయిన [7]పరులచేతం దమపడిన [8]నికారప్రకారం బంతయు నెఱింగించి యిట్లనియె.

---

1. 1. నిత్యధర్మ - ఎ. ప. ఐ. ఓ. ఘ. త. 2. సునిశిత - ఎ. ఏ. ఓ. ల. స;విహారణ - ఘ. 3. ధరవర - ట; ధరనిజ - ఈ. ఐ. త.

2. 1. అక్కథికుడు - పెక్కు ప్రతులు. 2. చెప్పినట్లు సాంత్వ - కొన్ని ప్రతులు. 3. శాంత వచనంబుల - పెక్కు ప్రతులు. ఉవాచ సాంత్వయన్ రాజా - 3. 29-25 శ్లో. 4. గోపోపశమనంబు - పెక్కు ప్రతులు. 5. సేయుచున్న యెడ బృహదశ్వుండు - ఈ. ఎ. ప. ఐ. ఓ. త. 6. యమ్ముని - ఆ. ఔ. ఝ. ల. 7. కౌరవులచేతం - ఎ. ఓ. గ. ల. స. శ. 8. నిరాకరణ - ఔ. నిరోధ - ల; పరిభవ - ఆ. ట; నికారంబంతయు - ఊ. జ.

3. క. పుడమియు రాజ్యము బంధుల, విడిచి మృగావలులఁ [1]గలసి [2]విపినంబులలోఁ గడుకొని మాయి ట్లిడుమలఁ, బడిన[3]నృపులు గలరె [4]యొరులు పరమ మునీంద్రా.

4. వ. అనిన [1]నయ్యుధిష్ఠిరునకు బృహదశ్వుం డిట్లనియె.

5. క. దేవసములైన యనుజుల,తో విప్రులతో రథాళితో వచ్చి యర ణ్యావాసము సేసెదు ధర,ణీ[1]వల్లభ నీవు ధర్మనిష్ఠితబుద్ధిన్.

6. క. నర[1]నుతుఁడు దొల్లి నలుఁ డను, ధరణీశుఁడు జూదమాడి తన[2]విభవము పు ష్కరుచేత నోటువడి [3]యొ,క్కరుఁడ [4]కరం బిడుమఁ [5]బడఁడె [6]కాననసీమన్.

-: ధర్మరాజునకు బృహదశ్వుండు నలోపాఖ్యానంబు సెప్పుట :-

7. వ. అనిన [1]నది యెట్లని ధర్మనందనుం డడిగిన [2]బృహదశ్వుం డిట్లని[3]యె నిష ధేశ్వరుం డయిన వీరసేనుని కొడుకు నలుం డను[4]వాఁ డనేకాక్షౌహిణీపతి యనవరతాతప్రియుం డజేయం [5]బైన తనతేజంబున నెల్లరాజుల జయించి బ్రహ్మణ్యుండయి బ్రహోత్తరంబుగాఁ బ్రజాపాలనంబు సేయు[6]చుండ.

---

3. 1. పగిది - ల; గవిసి - ఈ. ఐ. 2. వివృతవనములో - ఉ. 3. నృపులు - పెక్కు ప్రతులు; నరులు - వా. మరికొన్ని ప్రతులు. 4. చెపుమ - ఊ; తొల్లి-ట.

4. 1. ధర్మరాజునకు - పెక్కు ప్రతులు.

5. 1. వర నీవధికధర్మ - అ. ఇ. ఝ. ద. స.

6. 1. వరుడు - పెక్కు ప్రతులు. 2. రాజ్యము - పెక్కు ప్రతులు. 3. యొ,క్క రుడు - ఒ. ల. 4. కడున్నిడుమ - గ. 5. బడియె - అ. ఇ. ఉ. ఎ. ఏ. గుడిచె - గ. 6. కాంతారమునన్ - అ. ఈ. ఎ. ఐ. ఓ. గ. త; కౌరవులలోన్- ఇ. క. ద. ల. స; ? ఘోరాటవులన్ - ఊ. ఘ. స.

7. 1. వినియది యెట్లని - అ. ఆ. 2. అతనికి బృహదశ్వుం - కొన్ని ప్రతులు. 3. చెప్పె - పెక్కు - ప్రతులు; చెప్పఁదొడంగె - క. 4. వాఁడు సత్య వాదియు ననేకా...పతియు ననవర...ప్రియుండునునై - అ. ఈ. ఎ. ఏ. ఓ. క. శ. అతప్రియస్సత్యవాదీ మహానక్షౌహిణీపతిః - 3 - 50 3 శ్లో. 5. బైనతేజంబున - కొన్ని ప్రతులు. 6. చున్నంత - కొన్ని ప్రతులు.

8. సీ. అట [1]విదర్భాధిపుఁ [2]డైన భీముం డను వాఁ డనపత్యుఁడై వ్రతములోలి
సలుపుచు దమనుఁ [3]డ న్సన్మునిఁ బత్నియుఁ దాను నుపాసించి తద్వరమున
[4]దమయంతి యనుకూఁతు [5]దమదాంతదమను ల న్సుతులను సెబడ
విశ్రుత[6]గుణాఢ్యుఁ
డందుఁ గన్యారత్న [7]మగు దమయంతి దానత్యంతకాంతి రూపాభిజాత్య

ఆ. [8]విమల గుణసమృద్ధి [9]వెలుఁగుచు సురసిద్ధ, సాధ్యకన్య లట్టి[10]సఖులునూర్వు
రొలసి తన్నుఁ గొలుచుచుండఁగ మహి నొప్పు, చుండె నధిక
విభవయుక్తి[11]తోడ.

9. వ. [1]అంత.

10. క. నలుగుణములు దమయంతికి, నలునకు దమయంతి[1]గుణగణంబులు జను లి
మ్ముగ్గలఁ బొగడుట నిరువురకును, వెలసె మనోభవవికారవిభ్రమ [2]మెదలన్.

11. వ. ఒక్కనాఁడు నలుఁడు దమయంతీ[1]గుణబద్ధచేతస్కుండై మదనానలంబు
[2]సహింప నోపక [3]ప్రమదవనంబున [4]నుండునంత నంతరిక్షకాంతాహారావళి
యుం[5]బోలె హంసావళి యవనీతలంబున [6]కవతరించిన.

---

8. 1. విదర్భేశ్వరుఁడైన – ఒ; విదర్భాధీశుడైన – అ. ఔ. క. విదర్భావిభుండైన – శ. ష. 2. డగు భీముఁడనియెడు – ల. 3. దన్నంయమి – ల. 4. దమ యంతీం దమందాంతం దమనంచ సువర్చసమ్. 50–9 5. దమనాంత – శ. మ. న. మున్నగు ప్రతులు. దీనికి మూలము కనఁబడలేదు. 6. బలాఢ్యు – ఈ. ఐ. త. 7. మైన యా దమయంతి యత్యంత – కొన్ని ప్రతులు. 8. విపుల గుణ – ఉ; వివిధగుణ – గ. 9. వెలయుచు – ఉ. క. జ. ల. 10. సతులు నూర్వురొలసి – శ. ష. పెక్కు ప్రతులు. 11. జేసి – కొన్ని ప్రతులు.

9. 1. పెక్కు ప్రతులలో లేదు.

10. 1. సద్గుణంబులుజను – ట; శుభగుణమ్ములు జను – చ; గుణము నానాజను – అ. ఎ. ఏ. ఓ. క. 2. మదరన్ – స; మదలన్ – కొన్ని ప్రతులు; ఎదలన్ – ర.

11. 1. గుణానుబద్ధ – కొన్నిప్రతులు; గుణసంబద్ధ – ఉ; గుణానుబంధ – ఝ. ర. 2. శమింప నోపక – స; సైరింపనోపక – స. ల. 3. పురోపవనంబున – ఔ; ప్రమదావనంబున – ఆ. శ. ష. 4. గ్రుమ్మరుచుఁ దంతరిక్ష – అ. ఇ. ఉ. స; క్రుమ్మరుచుండ నంత నంతరిక్ష – ల. 5. బోని – ఈ. ఉ. ఐ. త; బోలె నత్యంత శుభ్రవర్ణశోభితంబై – గ. ఘ. న. ల. 6. కరుదెంచిన, కరుగుదెంచిన — కొన్ని ప్రతులు.

12. ఆ. [1]వీరసేనసుతుఁడు [2]వీరుండు [3]హంసల, నడబెడంగుఁ జూచి నగుచువాని
[4]నెగచి యెగచి [5]యందు నెగయకుండఁగ నొక్క, [6]హంసఁ
బట్టుకొనియె నతిరయమున.

13. ఆ. దాని [1]విడిచి పోవఁ[2]గా నోప కఱచుచు, నంతరిక్ష[3]మునను హంసలెల్లఁ
బిండుగట్టి తిరుగుచుండె [4]వాతోద్ధూత, శారదాభ్రశకలచయముఁబోలె.

14. వ. అదియును దన కర్మ్మనుజేశ్వరుఁ డపాయంబు [1]సేయుంగా [2]వగచి మనుష్య
[3]వాక్యంబుల నిట్లనియె నయ్యా యేను నీకుం బ్రియంబుసేసెద నీహృద
యేశ్వరి యైన దమయంతిపాలికిం బోయి నీగుణంబులు [4]దానికి వర్ణించి
యక్కన్య యన్యుల [5]నపేక్షింపక నీయంద బద్ధానురాగ [6]యగునట్లుగాఁ
జేసెద.

15. క. [1]అనిన విని హంస[2]పలుకులు, దనహృదయంబునకు నమృతధారా[3]పాతం
బునుబోలె [4]నైన నృప[5]నం, దనుఁ డనురక్తుఁ డయి [6]విడిచెఁ
[7]దడయక దానిన్.

---

12. 1. వీరసేను కొడుకు – ఔ. గ. ల. 2. వేడుక – అ. ఆ. ఇ. ద. 3. నలుఁడంత– స. 4. నెగిచియేచి – ల; నెగిచియెగిచి – ఠ. సూ. ఠ. 5. వేడ్కనేయకుండ– ప; వేడ్కనెగయకుండ – ఓ. 6. యంచ – గ. ల.

13. 1. జూచి – ఆ. ఝ. 2. గానేర – ఎ. చ. ఝ. ట; గానక యఱచుచు – ద; గాఁజాలక – ఘ. ల. స. 3. మందుహంస – అ. ఈ. ఐ. ఓ. త. ల. 4. వాత విధూత – గ.

14. 1. సేయునని – పెక్కు ప్రతులు; సేయునోయని – స. క; సేయునకా – చ. ట. ఠ. శ. ష. 2. వెరచి – ఒ. జ. ల; వెఱచి వగచుచు – స; దలచి వెఱచుచు – శ; వగచివెఱచి – ఆ. క. జ. ట. 3. వచనంబుల – పెక్కు ప్రతులు. 4. దానికి – ఈ. ఉ. ఐ. త. ప్రతులలో లేదు; చాల వర్ణించి – ఔ; దానికిఁ బ్రియంబుగా – ల; దానికి వర్ణించి – ఔ; శ. ష. 5. నపేక్షసేయకుండ – ఉ; నపేక్షింపకుండ – ఇ. ప. ఔ. ఠ. 6. యై యుండునట్లు చేసెద – ఔ.

15. 1. అనవిని హంసము పలుకులు – ఠ. 2. వచనము – ఉ. చ. ట. శ. 3. సారం– ఔ. ఘ. స. 4. దనర – ఘ. 5. నందనయందనురక్తు – ట. 6. యనిచె–ఔ. 7. దానిని ప్రీతిన్ ఒ; దద్దయుదానిన్ – స.

16. వ. [1]అంచపిండుతో నదియును [2]విదర్భనగరంబున [3]కుం బఱచి యం దుపవనంబున సఖీజనపరివృతయై యున్న దమయంతి [4]యంతికంబున[5]కు వచ్చి విహరించు [6]చుండె నంత [7]వానిం జూచి పరమ[8]కౌతుకమ్మున.

17. తే. ఒండొరులఁ [1]గడవంగ నయ్యువిదలెల్లఁ, బఱచి యొక్కొక్క-
[2]కలహంసఁ బట్టి[3]కొనఁగఁ
జెలువముగ నందు దమయంతిచేతఁ బట్టు, వడియె నలుచేత
[4]విడువంగఁ బడిన [5]హంస.

18. క. దమయంతికి నలునకు సం, గమకారణదూతయైన కల[1]హంస మనో
జ్ఞమనుష్యవాక్యముల న, ద్దమయంతికి [2]హర్ష మెసఁగఁ దానిట్లనియెన్.

19. వ. నీహృదయేశ్వరుం డైన నలు నొద్దనుండి వచ్చితి నపారపారావార [1]పర్యం తానంతమహీ[2]తలంబునందు నాచూడనిరాజు లెవ్వరులేరు సర్వ[3]గుణసౌంద ర్యంబుల [4]నెవ్వరు నలుం బోలరు.

20. తే. నీవు నలునకుఁ [1]బేర్మితో [2]దేవివైనఁ, [3]గాక నీసముజ్జ్వల[4]రూపకాంతివిభవ
[5]నిత్యసౌభాగ్య[6]భాగ్యాభిజాత్య[7]భద్ర, లక్షణావలు [8]లవి సఫలంబు లగునె.

---

16. 1. హంసపిండు – క. వా. శ. కొన్ని ప్రతులు; అంచపిండు – ఎ. ఏ. ఐ. ఓ. త. 2. విదర్భాపురంబు – వా. శ; విదర్భానగరంబు–ల విదర్భనగరింగత్వా–50 – 21. 3. కుంబరచి – అ. శ. ష; కుంబోయి – ఉ; కుంజని – ఇ. ఘ. ల; కుంబరతెంచి – ఊ. చ. ఠ. డ. 4. పాలికి – శ. ష. 5. కు వచ్చి–పెక్కింట లేదు. 6. చున్నంత వానిం – ఆ. ద; చుండునంత – అ. ల. 7. దానిం – కొన్ని ప్రతులు; నాహంసలం – గ. స; హంసల – శ. ష. 8. కౌతూహలంబున – ఆ.

17. 1. గడవ గనియు నువిద – ఎ. 2. హంసంబు – ఈ. ఐ. త. శ. స. 3. కొనిన – కొన్ని ప్రతులు. 4. తా పట్టుబడిన – ఇ. ఝ. 5. యంచ – స.

18. హంసయు నొప్పు – ఔ. గ. 2. నెనరు పుట్టతగ – గ; హరుష మెసగ – ఠ.

19. 1. పర్వత మహీతలంబు – పెక్కు ప్రతులు; పర్యంతానంతసకల – శ. స; పర్యంత సకల మహీ – ల. 2. వలయంబున – ఈ. ఐ. త; చక్రంబున – ల. 3. గుణరూప సౌందర్యంబుల – పెక్కు ప్రతులు. 4. నెవ్వరు నానలుం – ఔ.

20. 1. బట్టంపు – అ. గ. నెమ్మితో – పెక్కు ప్రతులు; ప్రీతితో – ఆ. ఏ. ఓ. ఔ. క. 2. దేవివైయైన – అ. ఇ. ఉ. ఎ. ఝ. 3. రూఢి నుజ్జ్వలమైన నీరూపవిభవ – స; గాని – ఉ. ల. 4. తను – ఏ. ఓ. 5. నిత్య సత్య సౌభాగ్యాభి – ఒ.గ.డ.ల. 6. భోగాభి – ఇ. ఎ. ఏ. ఓ. ట. 7. పుణ్య – స. పెక్కు ప్రతులు. 8. లివి – ఇ. ఉ. ఘ. ట.

21. వ. నీవు నారీరత్నంబ వాతండు పురుష[1]రత్నంబు గావున మీయిద్దఱసమాగమం [2]బన్యోన్యశోభాకరం [3]బగు ననిన విని సంప్రాప్త[4]హృదయసమ్మదయై దమయంతి దాని కిట్లనియె.

22. మధ్యాక్కర.

ఆరాజుగుణములు నా కెఱింగించి [1]నట్టులు నన్ను
నారాజునకు నెఱింగించి కరుణ నాయందుఁ గావింపు
మారంగ ననుడు నిషధ[2]విషయమున కరిగి యాహంస
వీరసేనజునకు దాని గుణరూప[3]విభవముల్ [4]సెప్పె.

23. వ. [1]అంత.

24. చ. నలదమయంతు లిద్దఱు మనఃప్రభవానల[1]బాధ్యమానులై
సలిపిరి దీర్ఘ[2]వాసరనిశల్ విలసన్నవ[3]నందనంబులన్
నలినదళంబులన్[4] మృదుమృణాళములన్ ఘనసారపాంసులం
దలిరుల[5]శయ్యలన్ సలిలధారలఁ జందనచారుచర్చలన్.

---

21. 1. రత్నంబవుంగావున — ఇ. ఈ. ఏ. ఐ. ఓ. 2. బన్యోన్య సౌభాగ్యశోభన — ఊ. స. శ; బన్యోన్య సౌభాగ్య శోభా — క. జ. 3. బగుంగావున నీకును బ్రియంబుగా, జెప్పవచ్చితిననిన — ఒ; బనిన విని — ఠ. ష. 4. హృదయమై — ఉ. త. శ. ష. (సమ్మద లేదు).

22. 1. నట్టుల — అ. ఝ. ద. 2. దేశమున కరిగి — శ. ష. పెక్కు ప్రతులు. కాని యిచ్చట ఛందస్సమన్వయమగుటలేదు. 3. విభవంబు — ల. గ. 4. బొగడె- ఉ. ఘ; నుడివె — స.

23. 1. ఏ. ఒ. ఔ. గ. ప్రతులలో లేదు.

24. 1. దహ్యమానులై — ఒ; బాధ్యమానులై — స. ల. పెక్కు ప్రతులు; బాధ్యమానలై — వా. 2. తాప విలసద్దివసంబులు నందనంబులన్ — ఔ; వాసరవశస్థితులై శిశిరోపచారముల్ — గ. 3. సౌరభంబులన్ — ఏ. ఓ. ల; చందనంబులన్ — ఝ. 4. దును మృణాళ — ఒ. 5. సజ్జలన్ — కొన్నింట.

25. వ. [1]ఇట్లిద్దఱు నన్యోన్యరూపగుణశ్రవణ[2]సంజాతప్రీతులై యుండునంత నంతః కరణ[3]సంతత[4]మనోజాతసంతాపవివర్ణవదనయైన [5]యాదమయంతిం జూచి భయ[6]సంభ్రమా[7]క్రాంతలై సఖీ[8]జను లెల్ల నక్కోమలివృత్తాంతం బంతయు భీమున కెఱింగించి యిట్లనిరి.

26. సీ. కలహంస పలికినపలుకులు [1]గుణియించు వడి దానిపోయిన[2]వలను చూచుఁ
బలుకదు [3]సఖులతో [4]లలితాంగి మిన్నక యలయుచు నుండుఁ దా
నమదినంబుఁ
జారు[5]విభూషణాహార[6]విహారశయ్యాసన[7]భోగంబు లందు విముఖ
యయి [8]రేయుఁబగలు నిద్రయు [9]నెప్పు డెఱుఁగక దమయంతి
నలుఁడను ధరణినాథు
ఆ. నంద బుద్ధి నిలిపి కందర్పబాధిత, యగుచు నున్నయది ధరాధినాథ
[10]ధరణిపతుల నొరుల నురుగుణాఢ్యుల విన, నొల్ల దెంత విభవయుక్తు లయిన.

27. వ. అనిన విని భీముం డేమి[1]సేయుదు నెవ్విధంబున నమ్మహీపతి [2]నిట రావింప నగు[3]నోయని చింతించుచు సంప్రాప్తయౌవన[4]యైనకూఁతుం జూచి యప్పుడు

---

25. ఇట్లనోన్య — కొన్ని ప్రతులు; ఇవ్విధంబున నయ్యిద్దరు నన్యోన్య — ద; ఇట్లయ్యిరువురు — ల. 2. సంతర్పితులై — ఏ. ఐ. ఓ. త. 3. సంతత — ఈ. ఐ. ఘ. త. ప్రతులలో లేదు; సంజాత — ద. 4. మనోజ సంతాప — పెక్కు ప్రతులు. 5. దమయంతిం — పెక్కు ప్రతులు. 6. సంభ్రాంతలై — అ. ఇ. ఐ. ద. జ. 7. క్రాంత హృదయ లగుచు — శ. ష; క్రాంత హృదయలై — క. చ. వీ. 8. జనంబులెల్ల — అ. గ. చ. జ. వీ. శ.

26. 1. గణియించు — వా. కొన్ని ప్రతులు. 2. వలనఁ జూచు — సం. 1-449. 3. చెలులతో — ఈ. గ. త. 4. పలుమారు లలితాంగి యలయుచు — అ. 5. విభూషణహార — అ. ఉ ఊ. ఐ. జ. ల. 6. శయ్యాది విహార భోగంబుల యందు — ఏ. ఓ. ల. 7. లీలల యందు — ఔ. 8. రేయిపగలు — ఝ. శ. ర. 9. నొప్పు నెరుగదు — కొన్ని ప్రతులు; నెప్పు డెఱుఁగక — శ. శర. ష. సం. మూ. 10. యొరుల ధరణి వరుల — ఔ.

27. 1. సేయువాఁడ — గ. ల. 2. నిటకు — ఘ. ల. వీ. 3. నని — కొన్ని ప్రతులు. 4. యగు — అ. ఇ. ద. ఝ.

28. క. ఆ వైదర్భుఁడు నిఖిలధ, రావలయములోనఁ [1]గలుగు రాజన్యుల నా
నావిషయాధీశ్వరులను, రావించెం దత్స్వయంవరవ్యాజమునన్.

29. క. మనుజేశ్వరు లెల్లను బో, రన దమయంతీస్వయంవరమునకు నొప్పం
జనుదెంచిరి సైన్యస్యం, దనఘట్టన నవనితలము దల్లడపడఁగన్.

30. వ. [1]ఆసమయంబునఁ బర్వతనారదు లనుపురాణమునులు భూలోకం బెల్లం
గ్రుమ్మరి యింద్రలోకంబునకుం బోయిన నింద్రుండు వారిం బూజించి
భూలోకంబునం [2]కుశలం బడిగి యిది[3]యెట్లు ధర్మపరిపాలనపరులై వీరులై
రణనిహతులైన రాజు లక్షయలోకసుఖంబు లనుభవింప నతిథులై యిందు
ల[4]కు నింతకాలం [5]బయ్యు రానికారణం బేమి యని యడిగిన నారదుం
డి ట్లనియె.

31. క. [1]నరసిద్ధసాధ్యవిద్యా, [2]ధరసురకన్యకలకంటె దమయంతియ సుం
దరి దాని సుస్వయంవర, మరుదై వర్తిల్లు చున్నయది యిప్డు మహిన్.

32. క. అందులకు ధరణిఁ గల నృప, నందను [1]లెల్లను ముదంబునం బోయెదు [2]వే
డ్కం దమలోఁ [3]గలహంబు[4]ను, గ్రందును లేకున్న వారు గడునెయ్యమునన్.

33. వ. [1]అనిన [2]నింద్రుండుమ లోకపాలవరులును దదాలోకన కౌతుకంబునం
[3]గనకరత్నరమ్య[4]దివ్యవిమానారూఢు [5]లయి [6]చనువారు ముందట దమ

---

28. 1. బరఁగు — ఉ. ఊ. ఒ. ఔ. క. గ. జ. స. శ.

30. 1. తత్సమయంబున — పెక్కు ప్రతులు; తత్స్వయంవరసమయంబున — అ; అయ్యవసరంబున — ట. 2. కుశలం బడిగి — పెక్కు ప్రతులు; కుశలవార్త యడిగి — వా. వీ. శ. ష. 3. యేల — కొన్ని ప్రతులు. 4. కెంత కాలం బయ్యె — ప్రౌ. వాక్య. 20–21. 5. బయ్యె — వా. కొన్ని ప్రతులు; బయ్యురాని — ఒ.

31. 1. సుర — ఆ. ఊ. చ. 2. ధరకన్యలకంటెఁ జూడ — గ. ల; ధరకన్యలకంటె మిగుల — ఊ.

32. 1. లందఱును — ఏ. ఒ. తి. 2. కోర్కిం — ఈ. ఐ. త. 3. గయ్యంబును — ఈ. శ. ప. 4. లు గ్రందుగ — కొన్ని ప్రతులు.

33. 1. అనిన విని యింద్రుండు లోకపాలవరులుం దానును–ల; లోక పాలురుం దానును– ఉ. ద. 2. నింద్రుం డనల యమ వరుణులతోడ–ఎ. ఏ. ఐ. ఓ. 3. నూత్న రత్న– అ. ఆ. ఎ. ఝ. 4. ఖచిత – ఇ. ఉ. ఔ. ఘ. 5. డయి – ఈ. ఐ. త. 6. భూలోకం

యంతీస్వయంవరంబునకుం బోయెడువాని నాదిత్యులలోన విష్ణుండునుం బోలెఁ దేజోధికుండై నవాని ననన్యసాధారణరూపవిభవంబున రెండవ మన్మథుండునుంబోనివాని నలుంగని యంతరిక్షంబున [7]విమానంబులు నిలిపి భూతలంబునకు వచ్చి వాని కిట్లనిరి.

34. సీ. నిత్యసత్యవ్రత నిషధేశ నీవు మా[1]కమరంగ దూతవై యభిమతంబు
సేయుము నావుడుఁ జెచ్చెర [2]నట్టుల [3]చేయుదు మఱి నాకుఁ [4]జెప్పుఁడు మీర
[5]లెవ్వార లేను మీకిష్టంబుగా దూత నై యేమిసేయుదు ననిన నతని
కమరేశ్వరుం డిట్టులనియె నే నింద్రుండ వీరు దిక్పాలురు విదితయశులు
ఆ. ధరణి నొప్పుచున్న దమయంతి [6]సుస్వయం, వరముఁ జూచువేడ్కఁ వచ్చియున్న
వార మీవు [7]మమ్ము వారిజాక్షికి నెఱిం, గింపు [8]నామధేయకీర్తనముల.

35. వ. అట్లయిన నక్కోమలి మాయందుఁ దన[1]వలచిన[2]వాని వరియించుననిన నింద్రునకుఁ గృతాంజలియై నలుం డిట్లనియె.

36. ఆ. ఎఱిఁగి యెఱిఁగి నన్ను నేకార్థ[1]సముపేతుఁ, బాడి యయ్యె యిట్టి[2]పనికిఁ బనుప
ననిన నుత్సుకుండవై యేల చేసెద, నంటి చేయకుండ నగునె[3]యింక.



---

బునకు వచ్చి — వా. వీ. శ కొన్ని ప్రతులు; చనువారు ముందట — క. జ.
7. దమ విమానంబులు — పెక్కు ప్రతులు.



34. 1. కరయంగ — ఏ. ఓ. చ. ల. 2. నేనట్ల — అ. ఎ. ద. 3. చేసెద — పెక్కు ప్రతులు. 4. జెపుఁడ — కొన్ని ప్రతులు. 5. లెవ్వరు నేను — ఐ. ల. 6 దత్స్వయంవర — ఉ. గ. ల. 7. పోయి — కొన్ని ప్రతులు. 8. మా మదీయ కీర్తనముల — స. మఱి కొన్ని ప్రతులు.



35. 1. వలసిన—కొన్ని ప్రతులు. 2. వారిని — ఒ. ఔ. శ. ష.

36. 1. సమచిత్తు — స. పెక్కు ప్రతులు; సమవృత్తు — చ; సము మీకు — శ. ష; సమవేతు — శ. ర, ప్రౌ. వ్యా. శబ్ద. 115. సం. I. 253. ప్రౌ. శబ్ద. 115.
2. పనియు — పెక్కు ప్రతులు; పనుపు — ఏ. ఝ. ద; పనులు — అ. ఆ. జ.
3. నీకు — పెక్కు ప్రతులు.

37. ఆ. నిన్ను నిత్యసత్యనిరతుఁగా నెఱిఁగియుఁ, గార్యమునకు వలను గలుగు టెఱిఁగి
[1]పనుప వలసె దూతభావ మపేక్షించి, దేవహితము దీనిఁ [2]దీర్పవలయు.

38. వ. [1]ఆయుధీయసురక్షితం బయిన రాజగృహం బెట్లు సొరనగు నని శంకింప వలవదు [2]దమయంతీనివేశంబు ప్రవేశించు నపుడు నిన్నెవ్వరు వారింప [3]నోడుదు రనిన శక్రువచనంబుల [4]నశంకితుండయి నలుం [5]డప్పుడ [6]విదర్భా నగరంబున[7]కుం బోయి యొక్కరుండ దమయంతీగృహంబు సొచ్చిన.

-: నలుఁడు దమయంతియొద్దకు దేవదూతయై పోవుట :-

సం. - 3 - 52 - 10

39. సీ. హంసచేఁ దన[1]వినినంతకంటె[2]ను రూపవిభవాతి[3]శయమున [4]వెలయుదాని
సురకన్యకల [5]యట్టి[6]సురుచిరశతకన్యకాళిచేఁ బరివృత యైనదాని
హృదయేశుఁడైన తన్నెప్పుడు వినుచున్కి [7]నలయ కాశ్వాసిత యైనదాని
దమయంతిఁ జూచి కందర్పశరావిద్ధుఁ డయ్యె [8]నలుం డంత నతనిఁ జూచి

ఆ. యితఁ డపూర్వ[9]మనుజుఁ డెందుండి వచ్చెనో, యనుచు [10]నుదరిపడి లతాంగు లెల్ల
నాసనములు డిగ్గి [11]యప్పు [12]డభ్యుద్గత, లైరి మనములందు [13]హర్ష మెసఁగ.

---

37. 1. పనిచినాము - ఔ. 2. దీర్పు మిపుడు - కొన్ని ప్రతులు; దీర్చు మిపుడు - న; దీర్పు మనఘ - స.

38. 1. ఆయువిద సురక్షితంబయిన - కొన్ని ప్రతులు. 2. దమయంతిగృహము - ల. 3. నోప రనిన - ఈ. ఊ. ఐ. జ. త. ల. 4. నిశ్శంకితుడయి - కొన్ని ప్రతులు. 5. డొక్కరుండ - ర. పీ. ష. 6. విదర్భాపురంబున - వా. శ. కొన్ని ప్రతులు; విదర్భనగరంబునకు - ఏ. ఐ. ఓ. త. ల. 7. కరిగి - పెక్కుప్రతులు.

39. 1. విన్నయంతకంటెను - పెక్కుప్రతులు. 2. సురూప - ఈ. ఉ. ఏ. 3. శయ ముల - కొన్ని ప్రతులు. 4. వెలుఁగుదాని - స. పెక్కుప్రతులు. 5. కంటె - అ. ఊ. ఎ. ద. ఝ. 6. సురుచిరకన్యకావలిచేత బరివృతి కలుగుదాని - ఓ. ల. 7. నలతకు నాస్పదంబైనదాని - ఇ. ఈ. ఏ. ఐ. ఓ. గ. త. ల. 8. నన్నలుఁ డంత - కొన్ని ప్రతులు. 9. మదను - పెక్కుప్రతులు. 10. నుదరిపడి - పెక్కు ప్రతులు; నదరిపడి - వా. 11. యపుడు ప్రత్యుద్గతలైరి - పీ. శ. ష. 12. డభ్యుద్గతులైరి - కొన్ని ప్రతులు. 13. హరుషమెసగ - ర.

40. వ. అంత.

41. క. దమయంతి మనోభవనిభు, నమరేంద్రప్రతిము దినకరాభు [1]సుధారుక్
సము వరుణసదృశు ధనదో,పము [2]నశ్విసమాను నిషధపతిఁ [3]జూచి నలున్.

42. క. వారిరుహా[1]నేత్ర మదన,ప్రేరిత యై లజ్జ[2]యుడిగి ఖీతిల్లక బృం
దారకమూర్తికి రాజకు,మారున కిట్లనియె [3]మందమందమృదూక్తిన్.

43. వ. నీవు మహానుభావుండ వెవ్వండ విందుల కేమికారణంబున నేకతంబ వచ్చితి [1]విది యత్యుగ్రశాసనుండైన మదీయజనకుచేత సురక్షితం బగుట నెవ్వరికిఁ జొరనశక్యంబు దీని నెవ్వరు నెఱుంగకుండ [2]నెవ్విధంబునం [3]జొచ్చితివి నాకు మనోజవేదనావివర్ధనుండ వైన నీతెఱం[4]గెఱింగింపు మనిన దానికి నలుం డి ట్లనియె.

44. ఆ. ఏను దేవదూత [1]నింతి నలుండను, వాఁడ నింద్ర [2]దహన వరుణ యములు
నీస్వయంవరంబు నెమ్మితోఁ జూడంగ, నరుగుదెంచి నన్ను నబల[3]మున్న.

45. క. నీయొద్దకుఁ బుత్తెంచిరి, మాయం [1]దొక్కరు నభీష్టమతి వరియింపం
దోయజముఖిఁ బ్రార్థింపుము, మాయందఱకును బ్రియం [2]బమర్పుము [3]ప్రీతిన్.

---

41. 1. సుధాభృత్సము – కొన్ని ప్రతులు; సుధాభాసము – స. కొన్నిప్రతులు. 2. నశ్వినిసమునినిషధ – కొన్ని ప్రతులు. 3. జూచె – పెక్కుప్రతులు.

42. 1. నేత్రి – తాళపత్రప్రతులు. 2. విడిచి – ఉ; యురివి – ఇ. ఎ. ఝ. ల; యుడివి, యొదవి, యుడిపి—అనియు పాఠములు. 3. మధురమంద – కొన్ని ప్రతులు.

43. 1. వత్యుగ్ర – కొన్నిప్రతులు. 2. నెట్లు చొచ్చితి – ద. 3. జొచ్చితి నాకు – కొన్ని ప్రతులు. 4. గు నెఱుంగవలయు నెఱింగింపు మనిన–కొన్ని ప్రతులు; గువిన వలతు – కొన్నిప్రతులు.

44. 1. నింతేల నలుడను – స; నిమ్మహి నలుఁడను – స. ధనద – పెక్కుప్రతులు. కాని మూలమునందు కుబేరుఁడు లేఁడు "దేవాస్త్వాంప్రాప్తు మిచ్ఛంతి శక్రోఽగ్ని ర్వరుణో యమః" చిత్రశాలాప్రతి పుట 94 వవపర్వ. 3. మున్ను – కొన్ని ప్రతులు.

45. 1. దొక్కరుని మోహామతి–ట. 2. బొనర్పుము–కొన్ని ప్రతులు. 3. నెమ్మిన్–చ. డ.

46. వ. అనిపంచినఁ [1]దత్ప్రసాదంబున నస్త్యలచేత నలక్షితుండనై వచ్చితి నింద్రాదులకుఁ బ్రియంబు సేయు మనిన నవనతవదనయై దమయంతి దొల్లి హంసచేత నలుని విని వానియందు బద్ధానురాగయై [2]నవయుచున్నయది [3]యపు డతని నలుంగా నెఱింగి తద్వచనశ్రవణదుఃఖాయమానమానస యగుచు ని ట్లనియె.

47. తరువోజ. [1]ఏనేడ నింద్రాదు లేడ వారలకు నెప్పుడు మ్రొక్కుదు నేను నీధనమ
భూనాథ నీగుణంబులు హంసచేతఁ బొలుపుగా విని మనంబున నిల్పియున్న
దాన భవన్ని[2]మిత్తమున నిట్లఖిలధారుణి[3]నాథసార్థంబు [4]రావింపఁ
[5]గా నిప్డు వలసె లోకఖ్యాతకీర్తి కరుణించి పతిబుద్ధిఁ [6]గావింపు మిందు.

48. వ. [1]నీవు దీని కొడంబడనినాఁడు రజ్జువిషాగ్నిజలంబులం [2]బ్రాణపరిత్యాగంబు సేసికొందు ననిన దానిం జూచి నలుం డి ట్లనియె.

49. మత్తకోకిలము.

భూరిసత్త్వలు సర్వలోకవిభుల్ విభూతి[1]సమృద్ధులి
ద్ధోరు[2]తేజులు నిన్నుఁ గోరుచు నున్న[3] వా రమరోత్తముల్
వారిపాదరజంబుఁ [4]బోలనివాని నన్ను [5]మనుష్యు సం
సారిఁ గోరఁగఁ జన్నె నీకుఁ బ్రసన్నలై సుర లుండఁగన్.

---

46. 1. దత్ప్రసాదంబున - పెక్కుప్రతులు; దత్ప్రభావంబున - వా. పీ. కొన్ని ప్రతులు. 2. నవయుచు నప్పు డాతని - ల. 3. యప్పు డాతని నెఱింగి - కొన్ని ప్రతులు.

47 1. ఏ నేల నింద్రాదు లేల - స. కొన్నిప్రతులు. 2. మిత్తంబున నఖిల - కొన్ని ప్రతులు; మిత్తంబున నత్యఖిల - ఘ. ఠ. 3. నాధుల తవిలి రావింప - ఔ. 4. గావింప - స. కొన్ని ప్రతులు. 5. గానయ్యెవలసి - కొన్ని ప్రతులు. 6. గా నమ్మ వేలు - ఔ.

48. 1. నీ వొడంబడుము ఒడంబడనినాడు - ఆ. ఇ. ఎ. ఝ. 2. ప్రాణంబులు విడుతు ననిన - కొన్ని ప్రతులు.

49 1. సమగ్రు - కొన్ని ప్రతులు. 2. కీర్తులు - పెక్కుప్రతులు. 3. వారు సురోత్తముల్ - పెక్కు ప్రతులు. 4. జాలని - ఠ. 5. మనుష్య సంసారి - కొన్ని ప్రతులు.

50. క. దేవతల [1]క ప్రియంబులు, [2]గావించు మనుష్యు లధమగతు లగుదు రిలం
గావున [3]వారి కభీష్టము, గావింపుము నన్నుఁ [4]బ్రీతిఁ గావుము తరుణీ.

51. వ. అనిన దమయంతి నయనాంతర్గళితబాష్ప[1]ధారాకలితకపోలయుగళ[2]యగుచుం బెద్దయుం బ్రొద్దు [3]చింతించి నీయభిప్రాయంబునకు నిరపాయం బయిన యుపాయంబు గంటి నింద్రాదులు నాస్వయంవరంబునకు వచ్చెదరేని వారి[4]సన్నిధిన నిన్ను వరియించెద నట్లయిన నీకు[5]నిర్దోషం బగు ననిన నలుండు లోకపాలురపాలికిం [6]బోయి దమయంతి[7]కిం దనపలికినవిధంబును [8]దనకు దమయంతి [9]పలికినవిధంబును జెప్పె నంతఁ బుణ్యతిథినక్షత్ర[10]శుభముహూర్తంబున దమయంతీస్వయంవరంబు [11]ప్రవర్తిల్లిన.

52. ఆ. [1]నలున కాని నలినదళ[2]నేత్ర వరియింప, దట్టి చూత మనుచు నమరవరులు
[3]నలువురును గడంగి [4]నలరూపమున వచ్చి, రాస్వయంవరమున కతి[5]రయమున.

53. వ. [1]అంత.

---

50. 1. కునవకారము – ఉ. ఊ. ఘ. జ. 2. గావించు – కొన్ని ప్రతులు; గావించి – వా. కొన్ని ప్రతులు; గావించిన మనుజు లధమ – కొన్ని ప్రతులు. 3. వారికి నిష్టము – కొన్ని ప్రతులు. 4. గరుణ – గ. ల.

51. 1. ధారాకలితకపోల – వీ. శ. ష; కణకరాళకపోల – వా. మున్నగు ప్రతులు; కరాళ – కొన్ని ప్రతులలో లేదు. 2. యై వగచుచుం – ఇ. ఈ. ఉ. ఘ. చ. ల. 3. విచారించి – కొన్ని ప్రతులు. 4. సన్నిధానంబున – ఘ. 5. సంతోషంబగు– గ; నిర్దోష (త్వ)ంబు – శ. 6. జని – కొన్ని ప్రతులు. 7. తో – ఇ. 8. దమయంతి తనతో – ఇ. 9. ప్రతివచనంబు లిచ్చిన – ఔ; యుత్తరంబులిచ్చిన – ఈ. ఐ. త. 10. శుభముహూర్తంబున – కొన్ని ప్రతులు. 11. ప్రవర్తిల్లె నంత – ఇ. ఉ; ప్రవర్తించిన – జ. ద.

52. 1. నలునికాని యొరుల నలినాక్షి – కొన్ని ప్రతులు. 2. నేత్రి – తాళపత్ర ప్రతులు 3. నలువురనఁ గడంగి – ఊ. 4. నలురూపమున– ఏ. ఓ; నలురూపముల – ల. వీ. 5. ముదమున – పెక్కుప్రతులు.

53. 1. పెక్కుప్రతులలో లేదు; అట్టియెడ కొన్నిప్రతులు.

54. సీ. దమయంతి [1]సితపుష్పదామాభిశోభితహస్తయై చనుదెంచి యంబుజాక్షి
యమ్మహోత్సవదర్శనాగతరాజన్య[2]నివహంబు నీక్షించి నెమ్మితోడ
నలువురు వేల్పులు నలుఁ[3]దొట్టి యప్పుడేకాకారులై యున్న నందు నలుని
నేర్పరింపఁగ నేర కింద్రాదులను నలు నెఱుఁగు నుపాయమింకెద్ది యొక్కొ

ఆ. యనుచు సంశయాకులాత్మయై సురలార, [4]నలు నెఱుంగు విధము నాకుఁ జేయుఁ
డాత్మ[5]రూపధరుల రగుఁడని [6]పరిదేవ, నంబు సేసెఁ దనమనంబులోన.

55. వ. దేవతలు దానిపరిదేవనంబు [1]విని కరుణించి యనిమిషలోచనంబులు నస్వేద గాత్రంబులు నొప్ప నవనీతలంబు ముట్టక యాసన్నులై నిలిచి రంత లోకపాలురును భూలోకంబునఁ గలరాజలోకంబు నవలోకించుచుండఁ బుణ్యశ్లోకుం డయిన [2]నలు ధర్మవిధానంబున వరియించి దమయంతి తదీయస్కంధంబున [3]సుగంధికుసుమదామకంబు వెట్టిన.

56. క. దేవతల సాధువాదము, తో [1]విప్రాశీరవంబుతో బహుతూర్యా
[2]రావంబు[3]లు సెలఁగెను బా, [4]రావారరవంబుఁ బోలె ననివార్యములై.

---

54. 1. నవ - ఉ. 2. విభవంబు వీక్షించి వెలయునంత - శ. ష. 3. దొంటి - ర. 4. నలుని రూపెఱుగగ నాకుఁ - ఘ. 5. రూపధారు లగుడని - డ. 6. పరిదేవ నంబుఁ జేసె నాత్మ నంబుజాక్షి - స; పరివేదనంబు జేసె - డ.

55. 1. నకుం గరుణించి - కొన్ని ప్రతులు. 2. నలుని - కొన్ని ప్రతులు; నలునకుం దదీయస్కంధంబున సుగంధసుమదామంబువెట్టి దమయంతి వరియించె — ట. 3. సౌగంధిక కుసుమదామంబువెట్టిన - స; సుగంధ కుసుమ - పెక్కుప్రతులు.

56. 1; విప్రస్వస్తి రవముతో - ఈ. ఎ. ఏ. ఓ. ఝ. త. ల: విప్రులవేదరవంబుతో - ఆ; విప్రస్వస్తిరవముద్రుతబహుతూర్యారావంబు లెసఁగఁ గడుఁ బా - స. 2. రావంబులు చెలంగె కడు - ...ననివార్యంబై - ఎ; రావమ్ము సెలఁగెఁ గడు...ననివార్యంబై - ల. 3. లెసఁగెఁగడు-ఇ. 4. రావారరవమొ యనగ విరాజితమయ్యెన్ - ఇచ్చట పారావార శబ్దమును, పార + అవార అనునట్లు పదచ్ఛేదముచేసి ఉభయ యతిగా సమన్వయముచేసి కొనవలెను.

-: నలుండు స్వయంవరలబ్ధయైన దమయంతిం బెండ్లియగుట :-

సం. 3 – 54 – 25

57. వ. ఇట్లపూర్వస్వయంవరలబ్ధయైన దమయంతి నత్యంతవిలాసంబుతో వివాహంబైన [1]యానలునకు [2]నింద్రుండు వానియజ్ఞంబులయందు నిజ[3]రూపంబుఁ జూపను నగ్నియు వరుణుండును వాని[4]వలచిన[5]చోటన [6]యగ్నిజలంబులుత్పా[7]దింపను ధర్ముండు ధర్మువునంద వానిబుద్ధి [8]వర్తిల్లను వరంబు లిచ్చి దేవలోకంబున కరుగువా రెదుర ద్వాపరంబుతో వచ్చు కలిం గని యెందులకుం బోయెదవని యడిగిన నింద్రాదులకుఁ గలి యిట్లనియె.

58. తే. అవనిలో దమయంతీ స్వయంవరంబు, [1]విస్తరిల్లుట విని కడు వేడ్కతోడ
నేను దమయంతిచే వరియింపఁ [2]బడుదు, నని [3]తదర్థినై యరిగెద నాసఁ జేసి.

59. వ. అనిన నందఱు [1]నగి నీవందుల కేలపోయెదది [2]ముందర నిర్వృత్తం బయ్యె నక్కోమలి యొరుల నెవ్వరి మెచ్చక నలుం డను[3]వాని వరియించె ననినం గలి కరం [4]బలిగి యన్నలునకు దమయంతికి [5]రాజ్యవిభవపరిత్యాగంబును బరస్పర[6]వియోగంబునుం జేసెదనని నిశ్చయించి [7]వాని నక్షరతుం గా

---

57. 1. నన్నలునకు – ఊ. 2. నింద్రుండు కరుణించి (ప్రసన్నుడై) వాని – కొన్ని ప్రతులు. 3. రూపంబుతో హవిర్భాగంబు గొనను – శ. ష. 4. వలసిన – అ. ఊ. ఔ. 5. యప్పుడ – ఈ. ఏ. ఓ. క. ఝ. 6. యనలోదకంబులనుత్పాదింపను – చ. శ. ష. 7. దిల్లను – ఉ. ఏ. ల. 8. వర్తిల్లను ధనదుండువాని ధనసంచయంబు లక్షయంబులుగాను వరంబు లిచ్చి – శ. ష. స. పెక్కు ప్రతులు. ధనదుడు దమయంతీస్వయంవరమునకు వెళ్ళినట్లు ఆధారము లేదు.

58. 1. విస్తరిల్లంగ – ఏ. ఓ. గ. ఝ. స. 2. గాంతునని – ఉ. ఘ. 3. తదర్థమై – వీ. శ. ష.

59. 1. నొండొరులం జూచి నగి – కొన్ని ప్రతులు; నొండొరుల మొగంబులు చూచి – ఇ. ల. 2. మున్న నిర్వృత్తంబయ్యె – కొన్ని ప్రతులు. 3. రాజును – ఉ; భూపతి – ఇ. ఈ. ఓ. ఐ. త. ఝ. 4. బలిగి యేను రాకమున్నె తీవరపడి నలుండనువాని వరియించెనా మంచిది. ఇంక నాచలంబు మీ రెరుంగ వలె పో పొండు. ఇంక నే నన్నలునకు దమయంతికి – ఔ. 5. రాజ్యపరిత్యాగంబు – ట. వీ. శ. ష. 6. విప్రయోగంబు – ఉ. ఏ. చ: వియోగక్లేశంబును గావించెద – స. కొన్ని ప్రతులు. 7. పలికి వారల వీడ్కొని భూలోకంబునకు వచ్చి యన్నలుని నక్షర

నెఱింగి యక్షంబులం జొచ్చియుండ [8]ద్వాపరుం [9]బనిచి [10]నలుసేయుచున్న [11]యశ్వమేధాదికానేకభూరిదక్షిణమహాక్రతువులయు జపహోమదానాది వివిధ[12]పుణ్యకర్మంబులయుఁ గారణంబునం [13]జొరనవసరంబు గానక యంతరం బన్వేషించుచుఁ బెద్దకాలం [14]బుండి యొక్కనాఁ డతండు కృతమూత్రుండయి జలోపస్పర్శనానంతరంబునం బాదశౌచంబు సేయ మఱచి [15]సంధ్యోపాసనంబు సేసిన నుపలబ్ధావసరుం డయి [16]కలి [17]నలునందుఁ బ్రవేశించి పుష్కరుం డను[18]వాని పాలికిం బోయి తన్నెఱింగించి నీవు నలునితో జూదంబాడి వానిరాజ్యంబును [19]సర్వస్వంబును నొడిచికొమ్మని [20]చెప్పి తానును వానికి [21]విప్రవేషంబున సహాయుండయి యక్షంబులు గొని పుష్కరునితో నొక్కటం జని నలుం గాంచి నీవు [22]మాతోఁ జూదం బాడు మనిన.

60. క. ద్యూతార్థము[1]తత్కృతవా,హూతుఁ[2]డనై జూద మాడ[3]కుండుట ధర్మా
పేతం బని యభిముఖుఁడై, యాతనితో నలుఁడు జూదమాడఁ [4]గడంగెన్.

---

తుంగా నెఱింగి – ఔ. 8. ద్వాపరుం బంచి – ల; ద్వాపరంబుం బనిచి – వా. వీ. పెక్కుప్రతులు. ఇచ్చట మూలము. తలోగతేషు దేవేషు కలిర్ద్వాపర మబ్రవీత్. పుట 97. చిత్రశాలప్రతి. 9. బనిచి తాను నలుండు – కొన్ని ప్రతులు. 10. నలుసేయుచున్న – కొన్ని ప్రతులు. 11. యశ్వమేధాది క్రతువులయు – కొన్ని ప్రతులు. 12. పుణ్య – కొన్ని ప్రతులలో లేదు. 13. జేర నవసరంబు– ఈ. ఏ. త. స; జెరువ నవసరంబు – గ. 14. బుండె నొక్క – శ; బువేచియుండి– ఔ. 15. సంధ్యోపాసనాది క్రియల నిర్వర్తించిన – ల. స. 16. పావకరుం డైన కలి – ఔ. ల. 17. యతనిం బ్రవేశించి – ఔ. ఘ. 18. తద్జ్ఞాతి పాలికిం – ఈ. త. 19. సర్వధనంబును – కొన్ని ప్రతులు. 20. పంచి – అ. జ. స. 21. వృషుండను సహాయుండై –గ. స; వృషుండను పేర సహాయుండై –ల. కలిశ్చైవ వృషోభూత్వా గవాం పుష్కర మభ్యయాత్. పుట 99 చిత్రశాలాప్రతి కలిశ్చైవ వృషోభూత్వా తం వై పుష్కర మన్వయాత్. 49-21 పి. పి. ఎస్. ఇచ్చట నీలకంఠ వ్యాఖ్య ఇట్లున్నది. 'గవాం వృషః – అత్ర గోశబ్దో లక్షితులక్షణయా అక్షశబ్ద వాచ్యేషు పాశేషు వర్తతే, వృషః శ్రేష్ఠః – పాశశ్రేష్ఠో భూత్వా'. 22. నాతో– స. కొన్నిప్రతులు; మాతో – అ. ఎ. ఔ. క. జ. ద. శ; మారాజుతో – వా. కొన్ని ప్రతులు.

60. 1. గాఁగితవా – అ. ఇ. ఎ. 2. తుండై – ఏ. ఐ. ఝ. ల. 3. కుండుట ధర్మోపేతంబని – పెక్కు ప్రతులు. 4. దొడంగెన్ – కొన్నిప్రతులు.

61. క. కలధనము లెల్ల [1]నొడ్డుచు నలయక జూదమున విజితుఁ [2]డగుచుండె నిజా
ప్తులు వారించిన నుడుగక, [3]నలుఁడు కలిప్రేరణంబునను హతమతియై.

62. వ. ఇట్లనేకమాసంబులు దుర్వ్యసనాసక్తుం [1]డయిన యన్నలుండు వివిధవస్తు [2]వాహననివహంబు లొడ్డి పుష్కరున కోటు[3]వడంబోయిన నెఱింగి [4]పౌర బ్రాహ్మణప్రధానవరులు దమయంతీపురస్కృతు లయి వచ్చి వారించి కలి సమావేశ[5]పరవశుండైన యన్నలుచేతం బ్రతిహతు [6]లయి వలుకకుండి రంత దమయంతి చింతా[7]క్రాంతచిత్తయై.

63. ఆ. ఎంత యోటు[1]వడిన నంతియ జూదంబు, నందుఁ దగులుఁ జలము నతిశయిల్లు
నేమిసేయుదాన నిది యెగ్గునకు మూల, మని లతాంగి దుఃఖితాత్మ
యగుచు.

64. సీ. అక్షముల్ పుష్కరునందు వశ్యంబులై యునికియు నలునియం
[1]దొండు [2]విధము
లగుటయు నెఱిఁగి నిజాధీశ్వరున కపజయమ కా లక్షించి సరసిజాక్షి
భర్తయనుజ్ఞ ముఁబడసి [3]వార్ష్ణేయుఁడను సారథిఁ బిలిచి యాస్యందనమున
నింద్రసేనుం డను నిక్కు[4]మారకు [5]నింద్రసేన యన్కూఁతుఁ
జెచ్చెరను దోడు

---

61. 1. నోడుచు – అ. ఈ. గ. 2. డైయుండె–అ. ఇ. ఏ. గ. ఝ. ద. 3. నలుఁడు కలిప్రేరణమున నవహితమతియై – అ. ఆ. ఇ. ఎ. ఏ. ఔ. క. ఘ. ఝ. ద. ఇచ్చట నఖండ యతి చూడవలెను.

62. 1. డయి నలుండు – డ. ల. 2. వాహనంబు లొడ్డి – ఒ. త. డ. 3. వడినం జూచి — ఏ. ట. ఝ. త. ల; వడిపోయిన నెఱింగి — చ. ట. ద. 4. పౌరజన ప్రధాన బ్రాహ్మణ — ల. 5. పరుండైన యన్నలు — పెక్కుప్రతులు. 6. లయి వారింప నలవిగాక పలుక కుండిరంత – ఆ. జ. 7. క్రాంతయై – ఈ. ఉ. ఐ. ఔ. త. ల.

63. 1. వడియె నంతియ — ఆ. ఐ. క. డ.

64. 1. దోడు విధము — గ. డ. ల. 2. గుణము — ఉ. ఘ. వ. 3 పార్ష్ణేయుఁడన్ – శ. ష. పెక్కు ప్రతులు. కాని మూలమునందు వార్ష్ణేయుఁడనియే కలదు. బృహత్సేనే పునర్గచ్ఛ, వార్ష్ణేయమ్ నలశాసనాత్ — చిత్రశాలాప్రతి పుట 99. 4. మారుని — అ. ఆ. ఊ. ఎ. ఝ. 5. నింద్రసేనియు నను — గ.

ఆ. కొని విదర్భ కరిగి గుఱుకొని మద్బంధు, జనులయొద్దఁ బెట్టి [6]చట్ట [7]రమ్మ
[8]యంచు నెమ్మిఁ బుచ్చె [9]నాప్తపురోహిత, మంత్రి బాంధవాభి
మతము[10]గాఁగ.

65. క. నలుఁడును ధరణీరాజ్యము, [1]దలఁగఁగ సర్వంబు నపహృతంబైనఁ గడుం
దలరి దమయంతిఁ దోడ్కొని, వెలువడియె నశేషరాజ్యవిభవచ్యుతుఁడై.

66. తే. [1]పురము వెలి మూఁడహోరాత్రములు వసించి, యున్న నలుపాలికెవ్వరు
నోడి రరుగ
జనవిభుండైన పుష్కరు శాసనమునఁ, గలికృతద్యూతవిద్వేషకారణమున.

67. వ. [1]ఇట్లు సర్వజన సత్కారార్హుం డయ్యును నలుండు [2]విధికృతంబున నెవ్వరి వలనను సత్కారంబు గానక జలంబు లాహారంబుగాఁ దత్పురసమీపంబున దమయంతీద్వితీయుండై [3]యుండి బుభుక్షా[4]పీడ సహింపనోపక హిరణ్యపక్షంబులతోఁ దమముందటఁ దిరుగుచున్న పక్షులంగని [5]యవి భక్ష్యంబు లగునని యప్పక్షులం బట్టికొన సమకట్టి తన [6]కట్టిన పుట్టంబు వానిపై వైచిన నవి పుట్టంబు[7]తోన గగనంబున కెగసి [8]నగుచు విగతవస్త్రుండైన నలున కిట్లనియె.

---

6. చక్క-కొన్ని ప్రతులు; సరగ — బౌ. పీ; సరగనీవు — శ. ష. 7. రమ్మటంచు — శ. ష. 8. మరలిరమ్మటంచు మహితయై తాఁ బుచ్చె మంత్రిబాంధ...—శ. ష; యనుచు ననిచి పుచ్చె — ష; యనుచుఁ బంచి పుచ్చె — అ. ఇ. క. ఘ. చ. ద. 9. వాత్మ— అ. ఒ. 10. బొంది — శ. ష; గూడి — ఉ. ఊ. ఔ. గ. జ. ద; గూడ — ఘ. న.

65. 1. దలువుగ, దలువుగ —స; ధళమును సైన్యంబు నపహృతంబైనఁ గడున్ — బౌ; దలపఁగ — ఈ. ఐ. ఝ. త. ల.

66. 1. పురివెడలి — ఎ. ఏ. ఓ. ల.

67. 1. ఇవ్విధంబున సకల — ఈ. త. 2. విధికృతంబున — ఈ. ఐ. ఓ. త. ప్రతులలో లేదు; దైవకృతంబున — ఊ. 3. యుండి — ఆ. ఒ. ఝ. త. ప్రతులలో లేదు. 4. పిపాసలు — కొన్ని ప్రతులు; వేదన — ఉ. 5. యవి తమకు — ఇ. ఈ. ఉ. ఐ; అప్పక్షులు — ఏ. ఓ. గ. 6. పై — కొన్ని ప్రతులు; పుట్టంబు — ఉ. ఊ. 7. తోడన — ఈ. ఊ. ఏ. ఐ. చ. జ. ద. 8. నగుచు — అ. ఇ. గ. ఝ. ప్రతులలో లేదు.

-: నలుండు దమయంతీ సహితుండై యడవికిఁ బోవుట :-

సం. 3 – 58 – 25

68. తే. నీధనంబును రాజ్యంబు నికృతిఁగొన్న, యక్షముల మేము నీవస్త్ర మపహరింపఁ బక్షిరూపులమై వచ్చి పార్థివేంద్ర, యపహరించితి మని [1]చెప్పి యరిగెఁ బదల.

69. వ. నలుండును వానిం జూచి విస్మయం బంది యీ[1]యక్షంబుల దోషంబునం గాకేమి నాకిట్టి [2]దయ్యె ననుచు దమయంతి కట్టిన పుట్టంబు చెఱంగు [3]గట్టికొనియె నట్లిద్దఱు నేక[4]వస్త్రులయి యొండొరుల మొగంబులు [5]చూచి దుఃఖించుచో నలుండు దమయంతి కి ట్లనియె.

70. క. ఇది దక్షిణాపథంబున, కిదియు విదర్భాపురమున కిది కోసల [1]కి య్యది యుజ్జయినికిఁ దెరువులు, [2]మది నిన్నిటిలోన నరుగ మనకెద్దియగున్.

71. క. అడవులలో[1] నాతోఁ గడు, నిడుమలు పడ[2]నోప వరుగు మిందుముఖి యి ప్పుడు నీబంధుజనంబుల, కడ కనవుడుఁ దరుణి శోకగద్గదయగుచున్.

72. ఆ. అతని కిట్టులనియె నవనీశ నీవును, నేనుఁ జని [1]విదర్భ నిష్టలీల నుండుదము మృగాకులోగ్రవనంబుల, కరుగనేల యిడుమ లందనేల.

---

68. 1. చెల్చ నరిగెఁ బదల – ఘ.

69. 1. యక్ష దోషంబునం గా కేమి – ల. కొన్ని ప్రతులు; యక్ష ప్రకోపంబునం గా కేమి – స; యక్ష కోపంబునం గా కే మి – కొన్ని ప్రతులు. 2. దురవస్థ యయ్యె ననుచు – ఔ; దశయయ్యె ననుచు – ద. 3. గప్పికొనియె – కొన్ని ప్రతులు. 4. వస్త్రపరిధానులై – ల. మున్నగు ప్రతులు. 5. చూచు చున్నచో – కొన్ని ప్రతులు.

70. 1. కున్నది – ఊ. ద, ల; కిల్లిదియు నయోధ్యకు – చ; కిం దిది – ప్రౌ. కార. 25; సం. 2. తుది నిన్నటిలోన – స. ఈ పాఠమున యతి తప్పు చున్నది.

71. 1. నాతోడుతఁ గడు – స; లో నాతోడుత – ల; కడు దుఃఖితయై కడు – ఉ. ట. 2. జాల – ఈ. ఏ. ఐ. స.

72. 1. విదర్భ నింట లీల – ఢ; విదర్భయందులీల – ట.

73. వ. అనిన విని నలుం డవనతాననుండై నీచెప్పినట్లు విదర్భేశ్వరు రాజ్యంబును మనరాజ్యం[1]బ యేను దొల్లి యధికైశ్వర్యయుతుండనై యందులకుం బోయి [2]బంధుజనులకు హృదయానందంబు [3]సేసి యిప్పు[4]డివ్విధంబున సర్వస్వహీనుండనై యెట్లు పోవనేర్తుననిన దమయంతి యిట్లనియె.

74. తే. [1]అధికదుఃఖరోగార్తున కౌషధంబు, సురుచిరంబుగ భార్యయ చూవె [2]యెందు
నొనర భార్యాసమేతుఁడై యున్నవాని, [3]కెంతలయ్యును
నాపద[4]లెఱుకపడవు.

75. క. [1]అలసి నెడ డస్సి నెడ[2]నాఁకలి దప్పియు నైన యెడలఁ గడుకొని ధరణీ
తలనాథ పురుషునకు ని,మ్ముల భార్యయ[3]పాచుఁ జిత్తమున [4]దుఃఖంబుల్.

76. వ. కావున నిది [1]మదనుజీవితయనియును [2]ననువ్రతయనియు ననుకంపనీయ[3] యనియు నన్ను విడువక నాయనుగమంబున[4] కొడంబడుమనిన నట్లు చేయుదుఁ బ్రాణసమాన వైన నిన్నేల విడుతు నోడకుండుమని నలుండు దనదేవి నాశ్వాసించుచు [5]నొక్కటఁ జని[6]విజనం బైన [7]విపినంబున నొక్క సభం గని యందు విశ్రమించి పరుషధూళిధూసరస్థలంబున శయనించి మార్గశ్రమనిమీలితనయనుండై దుఃఖంబునఁ [8]గన్నులువొందకున్న లేచి

---

73. 1. బట్ల యైనను - పెక్కు ప్రతులు. 2. సుహృజ్జనంబులకు - కొన్ని ప్రతులు. 3. చేయుచుండువాఁడ నిప్పుడివ్వి - ఈ. ఐ. 4. డెవ్విధంబున సర్వస్వ హీనుండనై పోవ - ల.

74. 1. అఖిల - వీ. శ. ష. 2. పతికి - ల. 3. కెన్ని యయ్యును - స; కెంత లాపద లయ్యును - చ. వీ. శ. ష. 4. నెడగ గడవు - ఔ.

75. 1. అలయు నెడ డయ్యు నెడ - ఈ. వీ. త. శ. శర; అలసిన యెడ డస్సిన నాకలి - డ. 2. నాకలి దప్పియు - ఈ. ఐ. త; నాఁకలి తృష్ణయు - వా. మున్నగు ప్రతులు; నాఁకలియుఁ దృషయు - వీ. శర. 3. పాపు - అ. ఔ. 4. దుఃఖములన్ - గ. ఝ.

76. 1. మదధీన జీవిత - ఊ. ష. స. శ; మదనన్యజీవిత - ఇ. ఈ. ఐ. త; మదనుజీవిక - ఎ. ఏ. స. శ; 2. సువ్రత యనియు - ఊ. గ. 3. కంపిత - ఊ. ఐ. ట. 4. కు ననుమతుండవు గమ్మనిన - వా. వీ. శ; కు ననుమతుండవు గావలయుననిన విని - ఉ. ఘ. ఐ. న; కొడంబడు మనిన - ఈ. ఏ. ఐ. ఓ. 5. జని చని - అ. ల. 6. నిర్జనంబైన - ఊ. జ. ద. 7. విపినాంతరంబున - కొన్ని ప్రతులు. 8. గన్నులు

తనపాదంబులు[9]యంతికంబున నతిక్లేశపరవశయై[10]నిద్రవోయెడు దమయంతిం జూచి.

77. సీ. [1]ధరణిరాజ్యంబుతో[6] ధనమెల్లఁ బరులచే నపహృతంబగుటయు [2]నాప్తమిత్ర
[3]బంధుజనంబులుఁ బ్రకృతిజనంబులు విడుచుటయును మహావిపినభూమిఁ
[4]బత్నితోఁ దనపరిభ్రమియించుటయు నప్డు దలఁచి శోకించి యుత్తరుణి దొల్లి
మృదుశయనంబున మెలఁతలు మెలపుతో నడుగులొత్తఁగ నిద్ర యనుభవించు
ఆ. కోమలాంగి యిపుడు గుఱుకొని [5]పాంసుల,స్థలము[6]నందు నిద్ర
దగిలినది[7]యుఁ
బంకజాక్షి నాకు భార్యయై [8]యింత[9]దుఃఖంబు వొందె దైవఘటనఁ జేసి.

78. వ. ఏను దీనిదుఃఖంబుఁ జూడనోప నెటయేనియుం [1]బోయెద నిది నన్నుం గానక తన[2]బంధువుల [3]యొద్దకుం బో[8]యి [4]దుఃఖంబులం బొరయ కుండు నని [5]విచారించి పోవ సమకట్టి యక్కోమలి [6]మేలుకొనకుండ [7]మెల్లన దాని[8]వస్త్రంబునర్థంబు [9]సించి తనకుం బరిధానంబు సేసికొని వెలువడి

---

వొందకున్న — అ. ఒ. స; గన్నువొందకున్న — కొన్ని ప్రతులు; నిద్ర కన్నుల వొందకున్న — ఎ. ఏ. ఓ. ల; గన్నుమొగుడకున్న — వా. వీ. 9. యంతికంబున నున్నదాని నతిక్లేశ — ఇ. ఉ; యంతికంబునఁ గ్లేశ — వా. శ. 10. నిద్రంగూడిన — ఈ. ఏ. ఐ. ఓ. త; నిద్రపోయిన — ఝ; నిద్రవోయిన — ఆ. ఊ. ఎ. ఒ. క. ఘ. చ. జ. ద. ల.

77. 1. ధరణియు రాజ్యంబు ధనమెల్లఁ — ఇ. ఝ. ల; ధరణి రాజ్యంబును ధనమెల్లఁ — ఆ. ఎ. ద. 2. నాత్మమిత్ర — చ. ఠ. శ; నార్యమిత్ర — ఘ. 3. బంధు జనంబులఁ బ్రకృతి జనంబుల — కొన్ని ప్రతులు; బంధుల విప్రుల పరిజనంబుల నెల్ల — అ. 4. బత్నితోఁదనదగు భ్రమియించుటయు — సం. II. 150. 5. పాంసుభూ — క. 6. లందు — అ. ఉ. ల. 7. యది — ఏ. ఓ ల. వీ. 8. యింత — పెక్కు ప్రతులు. 9. దుఃఖమునఁబొందె — కొన్ని ప్రతులు; దుఃఖములఁబడియె — ఉ. ఔ. ద.

78. 1. బోయిన — గ. ద. ల. 2. బాంధవుల కడకుం — ఝ. ట. ల. 3. కడకుం — ఉ. ఐ. ఓ. ఔ. గ. ద. 4. దుఃఖపడక యుండునని — కొన్ని ప్రతులు; దుఃఖపడ కుండునని — కొన్ని ప్రతులు; దుఃఖంప కుండునని — అ. 5. విచారించి — కొన్ని ప్రతులలో లేదు. 6. మేలు కనకుండ — ఠ. 7. మెత్తన—అ. ఘ. జ; మెల్లనలేచి — ట. ల. 8. వస్త్రంబు నర్థంబు — అ; వస్త్రంబునందర్థంబు — వా. వీ. మున్నగు ప్రతులు. 9. ప్రచ్చి — ఉ. ఒ. ఘ; పుచ్చి — ల; పుచ్చుకొని — ఊ; గుచ్చి — చ.

[10]కొండొకనేల [11]యరిగి దమయంతి[12]యందు [13]ఘనంబైన[14]తననెయ్యం
బను[15]తీఁగం ద్రెంప [16]నేరక [17]క్రమ్మఱి వచ్చి.

79. చ. కలి దమయంతిఁ బాప [1]సమకట్టు [2]పొరిం బొరి [3]వాయ నోపఁ డా
లలన [4]నుదీర్ణసౌహృదబలంబున నిట్టులు [5]రెంటఁ జేసి య
న్నలుఁడు విమోహ[6]రజ్జులఁ బెనంగి గతాగతకారి [7]యైన యు
య్యేలయునుబోలె [8]నూఁడక యెంతయుఁ బ్రొద్దు [9]వినిశ్చితాత్ముఁడై.

80. తే. బాల [1]నొక్కర్తు నిక్కానపాలు సేసి, [2]నిష్ఠురుండై [3]యే నెట్లు నేర్తుఁబోవ
ననక కలిచేత నాకృష్టుఁడై నలుఁడు, విగత[4]కరుణుఁడై దమయంతి
విడిచి చనియె.

81. వ. అంత దమయంతి మేలు[1]కని పతిం గానక [2]తన[3]వస్త్రార్ధ[4]నికృంతనంబును
జూచి లేచి నలుగడం[5] బరికించి భయశోక[6]వ్యాకులచిత్త యయి.

---

10. కొంతనేల — ఆ. ఇ. చ. ఝ. ట. 11. యరిగి — పెక్కు ప్రతులు; పోయి — వా. వీ. 12. యందుల — ఐ. ఓ. త. 13. ఘనతరంబైన — ఒ. స. 14. తన— పెక్కు ప్రతులలో లేదు. 15. తీవెందింపవేరక — స. 16. నోపక — పెక్కు ప్రతులు. 17. దమయంతి కడకు క్రమ్మఱవచ్చి — ల; యచ్చోటికి క్రమ్మఱివచ్చి — కొన్ని ప్రతులు; క్రమ్మఱి యచ్చోటికి వచ్చి — కొన్ని ప్రతులు.

79. 1. సమకట్టె — ఎ. ల. సూ. 2. పతింబతి; — వా. వీ. శ. పెక్కు ప్రతులు; పొరింబొరి–వాయ. తి. ఛం. కొన్ని ప్రతులు. 3. వాయఁజాల — అ. ఎ. ల. 4. సుదీర్ఘ — శ. ష; యుదీర్ణ — ఈ. ఊ. ఐ. త. 5. రెంటియందున — ఉ. ఒ. ఘ. స. 6. రజ్జున — కొన్ని ప్రతులు; రజ్జువు — కొన్ని ప్రతులు. 7. యయ్యె నుయ్యెల — స. ల. కొన్ని ప్రతులు; యయ్యు నుయ్యెల — కొన్ని ప్రతులు. 8. నూరకయ — ఏ. ఒ. తి; నేరకతఁడంత నొకింత వినిశ్చితాత్ముడై — గ; నూఱకతడెంతయు నంత — ల. 9. వినిశ్చలాత్ముఁడై — ఛం.

80. 1. నొక్కతె — పెక్కు ప్రతులు. 2. నిర్దయుండనై — స. పెక్కు ప్రతులు. 3. పోవంగ నెట్లునేర్తు — ఆ. ఝ; పోవంగనేర్తునెట్లు–అ. ట. 4. మోహుఁడై –ట.

81. 1. కని తన పతిం — వా. వీ. శ; మేలుకొని — ఏ. ఒ. ఓ. ఔ. 2. తన — పెక్కు ప్రతులలో లేదు. 3. వస్త్రార్ధంబు — ఈ. ఏ. ఐ. ఓ. ఔ. ఝ. 4. ని (వి) కర్తనంబును — అ. ఆ. ఊ. ఎ. ఘ. జ. శ. ష. స; కర్తనంబును — ఇ. ఉ. 5. గడలుం — కొన్ని ప్రతులు; గడల — కొన్ని ప్రతులు. 6. వ్యాకులిత — శ. పెక్కు ప్రతులు.

82\. సీ. హా మహారాజ మహామహీరక్షణదక్ష దక్షిణ[1]బాహుదండదండి
తారాతి నిషధరాజాగ్రణి న న్నిట్లు [2]వీతదయుండవై విడిచి [3]చనఁగఁ
దగునె నీ వెన్నఁడు ధర్మువు దప్పనివాఁడవు [4]సూనృతవ్రతర[5]తుండ
వోడకు మని [6]నన్ను నూఱడఁ బలికిన[7]పలు కిట్లు మఱవంగఁ బాడి [8]యగునె

ఆ. పొదలలోన డాఁగి [9]పొడసూప కిట్లేల, యున్నవాఁడ విట్టియుగ్రభావ
మేల నీకు [10]వలసె నెట [11]వోదు నిం కెట్లు, గాంతు నిన్ను
[12]నుగ్రకాననమున.

83\. క. వగవఁగ సాంగోపాంగము, లగునాలుగువేదములయు నధ్యయనము పో
ల్పఁగ నొకసత్యముతో నెన, [1]యగునే యెవ్వియును బోలవఱు సత్యంబున్.

84\. వ. ప్రాణ[1]సమానవయిన నిన్నవశ్యంబును విడువ [2]నని పలికితి [3]సత్యప్రతిపాల
నంబు సేయు మని ప్రలాపించుచుం దనయేకాకిత్వంబునకు [4]నబలాభావంబు
నకుఁ బ్రతిపదన్యాస[5]జాయమానకంటకమృగపన్నగభయంబునకు వగవక
నిజనాథునసహాయత్వంబునకు దుస్సహక్షుత్పిపాసాశ్రమాకులత్వంబునకు
వగచుచు.

---

82\. 1. భుజాదండ – కొన్ని ప్రతులు. 2. విగత – పెక్కు ప్రతులు. 3. పోవ – పెక్కు ప్రతులు. 4. సత్యసువ్రత రతుండ – ట. 5. ధరుండ – గ. ల. 6. నాకు – ఉ. ఘ. 7. పలుకులు – ఒ. వీ. ల; పలుకిప్డు – శ. ష. 8. యయ్య – వీ. శ. ష. 9. పొడయేల సూపక – పెక్కు ప్రతులు; పొడయేల సూపకిట్లున్న – స. 10. నయ్య – కొన్ని ప్రతులు; నయ్యె – కొన్ని ప్రతులు. 11. వోయితిం కెట్లు – ల. స. కొన్ని ప్రతులు. 12. ఘోర – ఈ. ఐ. త.

83\. 1. యగు నెవ్వియు నొండు వోలవట సత్యంబున్ – ఊ. ఎ. ఒ. ఘ. చ. శ. న; యగునే సత్యమును బోలవట యెయ్యవియున్ – ఈ. క. ఝ. త. ల.

84\. 1. సమానవయిన – పెక్కు ప్రతులు; సమానవైన నన్ను – ఏ. ఓ; సమానురాల వయిన – వా. కొన్ని ప్రతులు. 2. నోడ కుండుమని – ఘ. జ. ల. 3. సత్య వ్రత – ఆ. ఇ. ఎ. ఒ. ఝ; సత్యవచన ప్రతి – ల. 4. నబల భావంబు – ఠ. డ. న; బాలభావంబు – ఇ. 5. సంజాయమాన – పెక్కు ప్రతులు.

85. క. అలయుచుఁ బులుఁగులు[1]యెలుఁగుల, కులుకుచు నుగ్రాతపమున
[2]కోపక వృతం
బులనీడల నిలుచుచు [3]నెలుఁ, గులఁ బులులం జూచి భయము[4]గొని
వగ వగచున్.

86. క. ఏచిన [1]పొదలఁ బొరల్పడఁ, ద్రోచుచు [2]ముండ్లకును [3]నల్లఁ
దొలఁగుచు దిక్కుల్
సూచుచుఁ దొడరుచుఁ ద్రెళ్లుచు, లేచుచు లలితాంగి [4]సంచలించుచు నరిగెన్.

87. వ. ఇట్లరుగుచున్న దమయంతి నంతికన్య స్తచరణ యైనదాని [1]నాహారార్థి
యయి యొక్కయజగరంబు పట్టికొనిన నక్కోమలి [2]మెదల నేరక.

88. ఆ. ఇంక నైన నన్ను నేల [1]యాలింపవు, నాకు శరణ మగుము నాథ యనుచు
నఱచుచున్నదానియాక్రందనధ్వని, వినుచు నొక్కయెఱుకు వేగ వచ్చి.

89. వ. [1]తన [2]పట్టిన[3]సురియ న ప్పెనుఁబాముపదనంబు వ్రయ్యం దఱిగిన రాహు
ముఖవిముక్తయైన చంద్రరేఖయుంబోలె [4]నజగరముఖంబువలన వెలువడిన

---

85. 1. పలుకుల – చ. జ. 2. కోర్వక – ద. 3. నెలువులఁ బులులంజూచి భయము
వొంది కడఁగుచున్ – న. 4. గొని వడఁకు నెడన్ – న. మఱి కొన్ని ప్రతులు;
గొని వగచునెడన్ – కొన్ని ప్రతులు; గొనుచు నెడఁదలోన్ – ఏ. ట. ల; గొని
వరచునెడన్ – ఝ.

86 1. పొదలం బొడవడఁ – న; పొదలం బోవడిఁ–ఏ. ట. త; పొదలఁ బొరలవడి – క;
పొదల బడల్పడ – పీ. శ. శర. 2. ముళ్ళకు – ఆ. ఏ. ఝ. 3. నెల్లఁ – న.
4. మదిఁ జలించుచు నరిగెన్ – గ. న; సంచరించుచు – ఊ. శ.

87. 1. నామిషార్థియై – కొన్ని ప్రతులు. 2. మెలంగ నేరక – ఉ. ఘ. ల; మెలఁగి
మెదల నేరక – న; మెలుంగ నేరక – న.

88. 1. పాలింపవు – అ. క.

89. 1. కం. " తనుపట్టిన సురియను న
ప్పెను బామును జంపి తరుణిభీతిలకుండన్
వనచరుఁ డాశ్వాసించెను
మనుజేశ్వర వింటివా – మఱియామీఁదన్ "

ఈ పద్యము 'ఔ' ప్రతిలో అధికముగా నున్నది.
2. కట్టిన – న. పెక్కు ప్రతులు. 3. సుడియ – ఈ. ఐ. 4. నయ్యజగరంబు

యాదమయంతి నాశ్వాసించి తత్సమీపసరోవరస్నాతను వన్యస్వాదుఫలాహార నుం[5]గాఁ జేసి [6]విగతశ్రమం గావించి నీవెవ్వరిదాన విట్లేల యేకతంబ యువ్వనంబున[7]కు వచ్చి తనియడిగి మధురభాషిణి యైనయమ్మగువవలన నంతవృత్తాంతంబు నెఱింగి.

90. కవిరాజవిరాజితము.

రజనికరాననఁ బీనపయోధర రాజితరాజసుతన్ విలస
ద్గజ[1]పతిగామినిఁ జందనగంధిఁ బ్రకాశితకాంతిసమన్వితఁ [2]బం
కజదళలోచనఁ జూచి కిరాతుఁడు [3]కామనిశాతశరాహతుఁ డై
నిజహృదయం బెఱిగించె లతాంగి [4]కనింద్యచరిత్రకు వేడుకతోన్.

91. ఆ. అగ్నిశిఖయుఁబోలె నంటను డాయను, జూడ [1]రానియట్టి [2]శుభచరిత్ర
నెఱుక లేనికఱకు టెఱుక పేక్షించెఁ గా, [3]దనక తనకు నాయు వల్ప[4]మైన.

*—: దమయంతి శాపంబునం గిరాతుండు చచ్చుట :—*

సం. 3 _ 61 _ 34

92. వ. దమయంతి వాని [1]నలిగి చూచి యేను పతివ్రత నై తినేని యిద్దురాత్ముండై న కిరాతుం [2]డిప్పుడ మృతుం [3]డయ్యెడ మని[4]శాపం బిచ్చిన వాఁ డప్పుడ [5]యగ్నిదగ్ధం బై న వృక్షంబునుంబోలె విగతజీవుండై పడియె నట్లు పరమ పతివ్రతాగుణప్రభావంబున.

---

ము ఖంబు వెలువడి - అ. ఇ. ఉ; నయ్యజగరంబు ముఖంబున వెలువడి - కొన్ని ప్రతులు. 5. గాఁ జేసి - కొన్ని ప్రతులలో లేదు. 6. సేదదీర్చి - వి. శ. ష. 7. నేలగ్రుమ్మరి యొదవని - కొన్ని ప్రతులు.

90. 1. వర - ఏ. ఓ. ల. 2. నంబుజ - ఔ. ద. 3. పొల్పుగ కామవిశాత కరాహతుఁడై - ద. 4. కినిద్ధ చరిత్రకు - ఎ.

91. 1. గాని యట్టి - పెక్కు ప్రతులు. 2. సుభగ చరిత - ల. 3. కపుడు - అ. 4. మగుట - ఒ.

92. 1. కలిగి - అ. ఇ. ఉ. గ. చ. ల. 2. డేనుచూడ - కొన్ని ప్రతులు 3. డయ్యెడమని - పెక్కు ప్రతులు; డయ్యెడు మని - వా. వి. శ. ష. మున్నగు ప్రతులు. 4. శపియించిన - ఊ. జ. ల. 5 దవానల, దవాగ్ని - అని పాఠములు.

93. క. [1]బాల హృదయమున నృపశా,ర్దూలు నిజాధీశు [2]నిలిపి దుష్టోరగశా
ర్దూలాఖిలమృగావలి, కోలిన [3]భయ మంద కరిగె నుగ్రాటవిలోన్.

94. వ. [1]మఱియును.

95. సీ. సహకార మత్ప్రియ[1]సహకారుఁ బున్నాగ పున్నాగుఁ దిలక భూభువనతిలకుఁ
జందన బుధహరిచందనుఁ బ్రియతాశోక సుహృజ్జనశోక[2]దమను
[3]వకుళ కులై కదీపకు విభీతక [4]భయోపేతార్తిహరు నలుఁ బ్రీతితోడఁ
[5]గానరే [6]కానలలోన లోకోత్తరు నని [7]మ్రానిమ్రానికి నరిగి యరిగి

ఆ. [8]యడుగునడుగు [9]లెండ [10]బొడవొడఁబొక్కిన, నిర్ఝరాంతరము నిలుచుఁ [11]బిలుచు
[12]గిరుల[13]దరుల[14]యెడల నురు[15]గుహాగృహములఁ, దొంగితొంగి చూచుఁ దోయజాక్షి.

96. వ. ఇట్లు దమయంతి నిజనాథునన్వేషించుచు భీషణారణ్యంబునం [1]ద్రిమ్మరునది [2]ముందట.

---

93. 1. బాలకి మనమున – ఆ. ఈ. ఐ. త. స; బాలిక మనమున – ఏ. ఓ. 2. నునిచి – ఏ ఓ. 3. భయమందు చరిగె – ఉ ఔ. ద.

94. మఱియును – పెక్కు ప్రతులలో లేదు.

95. 1. సహచరు – కొన్ని ప్రతులు. 2. హరుని – కొన్ని ప్రతులు. 3. నకుల – ఈ. ఐ. ట. 4. భయభీతార్తి – పెక్కు ప్రతులు; భయ చిత్తార్తి హరునకు – గ. 5. గానరే మీర లీ కాన లోకోత్తరు – ఒ. ఔ; కానరే, కానరే కాన లోకొత్తరు – వీ. శ. ష. 6. కానలో నానిజేశ్వరునని – గ. ల; కానలో దాన లోకోత్తరు – ద. 7. మ్రాకుమ్రాకున కరిగి – ఈ. ఐ. త. 8. యడిగి – ఎ. ఏ ఓ. ద. 9. లొత్త – అ. 10. బురబుర – కొన్ని ప్రతులు; బొడవడ – స. శ; బొడవడి – ల; బుడబుడ – శ. ర. సూ. 11. బొగ్గొలు – స. మఱియు పెక్కు ప్రతులు; నరిగి – ఈ. ఐ. ఝ. త; బొలుచు – వా. వీ. శ; పిలుచు – ఏ. ఓ. గ. స. 12. తరుల – పెక్కు ప్రతులు; దరుల – ల. 13. గిరుల – పెక్కు ప్రతులు. 14. తరుల – ఐ. త; నదుల – ఈ; గుహల – గ. ల; నరయు – క. జ. 15. లతాగృహముల – ల; గుహాంతరముల – ఏ. ఐ. ఓ. ఝ. వీ. స; గుహాముఖముల – అ. ఆ. ఇ.

96. 1. ద్రిమ్మరునది – కొన్ని ప్రతులు; దిరుగునది – వా. వీ. మున్నగు ప్రతులు. 2. ముందట – కొన్ని ప్రతులలో లేదు.

97. మత్తకోకిలము.

వారిభక్షులు పర్ణభక్షులు వాయుభక్షులు శాకనీ
[1]వారభక్షులు వృక్షమూలనివాస[2]యుక్తులు నై తపం
బారఁ జేయుమహామునీంద్రుల యాశ్రమం [3]బెడఁ గాంచె నం
భోరుహాక్షి పురా[4]సమార్జిత పుణ్యకర్మఫలంబునన్.

98. వ. [1]ఇట్లు మృగవ్యాళతస్కరకిరాత[2]నిరంతరం బయినకాంతారంబునం బుణ్యానదీతీరంబున నొక్కమునిపల్లియం గని యందు వసిష్ఠవామదేవవాలఖిల్యాభృగునారద[3]సదృశు లైన[4]మహామునులం గని [5]నమస్కరించి యున్న నమ్మునులు దమయంతింజూచి యచ్చెరు[6]వడి యవ్వా నీవెవ్వరిదాన వివ్వన దేవతవో దేవభామినివో దివ్యంబైన తేజంబుతో [7]నేకతంబ యేల [8]క్రుమ్మరి యెద వనిన వారలకు దమయంతి యిట్లనియె.

99. క. వినుఁ డేఁ బుణ్యశ్లోకుం, డనఁగ [1]సదాయజ్ఞనిరతుఁ [2]డనఁగ ధరిత్రిం
[3]దనరిన నలుభార్యను స[4], జ్జననుత దమయంతి [5]యన నెసంగినదానన్.

---

97. 1. హారభక్షులు — ఆ. ఝ. ద. శ. ష. 2. సక్తులు — స. పెక్కు ప్రతులు. 3. బొగి — ఇ. ఔ ల. స. ల; బులు — ఒ. 4. కృతార్జిత — కొన్ని ప్రతులు; కృతంబగు — కొన్ని ప్రతులు.

98. 1. ఇట్లు దమయంతి — క. జ. ల. 2. పర్వత నిరంతరంబయిన — కొన్ని ప్రతులు. 3. ప్రభృతులైన — స. 4. మునిప్రవరులకు — కొన్ని ప్రతులు. 5. వారలకు దమయంతి యలయుచు నమస్కరించి — స. 6. వంది — కొన్ని ప్రతులు; 7. నేకతంబయేల — పెక్క ప్రతులు; నేల — వా. 8. క్రుమ్మరుచున్నదానవని యడిగిన—ఇ క. ల.

99. 1. మహాయజ్ఞ — స. 2. దైయీజగతిం — గ. స. 3. దనరు నలుభార్యనెంతయుఁ బనుగొన — గ. స. 4. నేఁ బనుపడి ...... బరఁగిన దానన్ — శ. 5. యనఁగ బరగిన దానన్ — శ; యనఁగఁ జనుదాన నిలన్ — కొన్ని ప్రతులు; యనఁగఁ బరఁగిన దానన్ — కొన్ని ప్రతులు; యనఁగఁ బనియెడు దానన్—ఆం క. జ వ్యా. సం. స; యనఁగ వడిచను దానన్ — ఆ.

217. చ. అమలచరిత్ర నిట్లు దమయంతిఁ బతివ్రతఁ [1]బల్కుఁదే నృపో
త్తమ విను దీనియందు [2]విదితం బగుశీలవిధిఁ [3]సుధాంశుఁడుం
గమలహితుండు [4]నేను నయి కాచితి మొక్కట మూఁడువర్షముల్
గొమరుగఁ దీనిఁ [5]జేకొనుము కోమలి నీకనురక్త [6]నావుడున్.

218. క. కురిసె మరుద్వచనానం,తరమున సురపుష్పవృష్టి [1]దడయక మ్రోసెన్
సురదుందుభినాదంబులు, గరము [2]ప్రసన్నుఁ డయి వీఁచె [3]గంధవహుండున్.

219. వ. ఇ ట్లెల్లవారికి నాశ్చర్యంబుగా వాయుదేవుండు దన్నెఱింగించి దమయంతి పతివ్రతా[1]గుణంబులును బతి[2]యందుల యకృత్రిమానురాగంబునుం జెప్పిన [3]విని నలుండు పరమప్రమోదపరిపూర్ణహృదయుండై తత్క్షణంబ కర్కోటకుం దలంచి వానియిచ్చిన[4]పుట్టంబు[5]పైఁ బెట్టికొని నిజరూపంబు దాల్చిన.

*–: నలుండు నిజరూపంబుతో దమయంతింగూడుట :–*

సం 3 – 75 – 27

220. ఉ. ఆయత[1]బాహుఁ ద[2]ప్తకనకాంచితవర్ణు మనోజరూపు [3]నిం
ద్రాయితు సూర్యతేజు నిషధప్రభు [4]నన్నలుఁ జూచి పద్మప
[5]త్త్రాయతనేత్ర యప్డు దమయంతి గరంబు ముదంబు నొంది ల
క్ష్మీయుత యయ్యె [6]బంధులకు మిత్త్రుల[7]కున్ హృదయప్రియంబుగన్.

---

217. 1. బల్కుచే – అ. ఓ. గ; బల్కెఁదే – ల. 2. విదితంబుగ – ఉ. ల. 3. హిమాంశుడుం – అ. ఆ. ఎ. ల. 4. నేను దగ గాచితి – గ. వీ; నేను నిట కాచితి – ట. 5. గైకొనుము – ఊ; 6. కావునన్ – ట.

218. 1. దగవీతెంచెన్ – ఎ. ఓ. ల; దడయక వించెన్ – క. శ; దడయక వీచెన్ – కొన్ని ప్రతులు. 2. ప్రసన్నముగ – ఓ. చ. ఝ; ప్రసన్నమయి – అ. ఆ. ఎ; ప్రశస్తమయి – ఉ. ఘ. స; ప్రశస్తముగ–కొన్ని ప్రతులు. 3. గంధవహాంబున్–ఘ.

219. 1. గుణంబును – పెక్కుప్రతులు. 2. వలని – ఈ. ఏ. త. 3. విని – కొన్ని ప్రతులలో లేదు. 4. నాగాంబరంబు – ఈ. ఉ. ఐ. ఘ. త. స; యంబరంబు – ఏ. ఓ. ఝ. 5. పయింబెట్టుకొని – ఉ. ఊ. ఒ. ద. స; పయిం గప్పికొని – ఈ. ఏ. ఐ. ఓ. ఝ. ల.

220. 1. బాహుదర్పు – ఉ; బాహుదీప్త – స; బాహునీల – ట. బాహునీలనిహితాంబు–ట; 2. కనకాచల–స. కొన్ని ప్రతులు; కనకామల—స. కొన్నిప్రతులు 3. మేధాయితు — స. కొన్ని ప్రతులు 4. గన్నల–ఈ. ఐ. త. 5. త్రాయత చారునేత్ర దమయంతి — పెక్కుప్రతులు. 6. నెయ్యురకు — అ. ఆ. ఔ. ద. శ. ష. 7. కెల్ల మనః ప్రియంబుగన్ ఈ. ఐ. ఓ. ఝ. త. ల; కెంతయు సంతసంబుగాన్ — ఉ. ఒ. గ. ఘ. చ. ట; కున్ గడు సంతసంబుగాన్ — ఇ. క.

221. వ. ఇట్లు సంగతులైన యయ్యిరువురకు విరహ[1]పరితాపంబుతోడన శరీర మలినత్వంబు వాసెఁ బరస్పరానురాగంబుతోడన [2]విభూషణశ్రీవిశేష విలేపన[3]యోగంబులు [4]విస్తరిల్లె [5]నంత నంతయువిని [6]భీముండు జాతసస్య యైన వసుధ తోయసంప్రాప్తి [7]నాప్యాయిత యైన ట్లజ్ఞాత[8]చర్యుండైన తనపతిం [9]బడసి [10]పరమసంతుష్టహృదయయై చంద్రుతోఁగూడిన [11]రోహిణియుంబోలెఁ బతింగూడి యొప్పుచున్న దమయంతిం జూచి సంతసిల్లి తనపురంబునం [12]దష్టశోభనంబులు దేవగృహంబులయందు విశేష పూజలు [13]సేయించె నట్టిమహోత్సవం బెఱింగి ఋతుపర్ణుండు నలునొద్దకు వచ్చి నీవు నిఖిలలోకపూజ్యుండ [14]వయ్యును నాయొద్దబాహుకుం డనంగాఁ బ్రచ్ఛన్నవృత్తి నున్న నిన్ను నెఱుంగక [15]నీచకర్మంబులయందు నియోగించితి [16]దీని క్షమియించునదియని నలుచేత సత్కృతుండై యశ్వ[17]హృదయోపదేశంబు గొని యయోధ్యకుం జనియె నిట నలుండును [18]విదర్భాపురంబున నొక్కమాసంబు [19]నివాసంబుసేసి విదర్భేశ్వరు వీడ్కొని దమయంతి నందపెట్టి యొక్కరథంబును [20]బదియాఱేనుంగులును [21]నేఁబది గుఱ్ఱంబులు నాఱునూఱు[22]కాల్బలంబులుఁ దనకుఁ దోడుగా [23]నిషధ పురంబునకరిగి పుష్కరుం గని యి ట్లనియె.

---

221. 1. పరి - పెక్కు ప్రతులలోలేదు. 2. భూషణ విశేష యోగంబులు - పెక్కు ప్రతులు. 3. యోగ్యతలు - ఈ. ఐ. త. 4. విలసిల్లె - శ. పెక్కు ప్రతులు. 5. నిది యంతయు విని - కొన్ని ప్రతులు. 6. భీముండు సంతసిల్లె నజాతసస్య - ల 7. నాప్లుత - ఉ; నా పూరిత యగునట్లు యపేత కల్మషుండైన - ఒ. 8. చరితుండైన - ఇ. ఉ. గ. స. 9. గూడి - ఇ. ఉ. ఘ. 10. పరమహృష్ట హృదయయై - క; పరమ సంతుష్టయై - ల, 11. రోహిణి-గ. ల; రోహిణీరాత్రియుం - ఇ. ఐ. రాత్రియుంబోలె - వా. మున్నగు ప్రతులు. 12. దిష్ట - చ. 13. సేయంబంచె నట్టి - ఇ. ఈ. ఏ. ఐ. ఒ. ఓ. ఔ. ల. 14. వై యుండియు - కొన్నిప్రతులు. 15. యశ్వ శిక్షయందు - ఒ; నీచకర్మంబైన యశ్వ శిక్షయందు - ల. 16. దీనికి - ఇ. ఒ. శ. ష; నన్ను - ఔ. 17. హృదయం బుపదేశంబు - ఔ. గ. ద. ల. పి. శ. ష. 18. విదర్భ నొక్క - కొన్ని ప్రతులు. 19. వసియించి - చ; నలిపి విదర్భేశ్వరు - ఉ. ఘ. 20. బదారేనుంగులు - పెక్కుప్రతులు. 21. నెనుబది - పెక్కు ప్రతులు. 22. కాల్వురును - ఉ. 23. నిషధంబున - అ. ఊ; నిషధ దేశంబున - ఉ. ఘ.

222. క. దమయంతి[1]రోయిగా జూదము నీతో నాడఁ [2]గడఁగెదను ధరణీరా
జ్యము నీవు నాకు [3]రోయిడు, మమరఁగ జూదంబు నీకు [4]నభిమతమేనిన్.

223. మత్తకోకిలము.

వీరభోజ్యము [1]సుమ్ము [2]రాజ్యము [3]వించె నీవును నేను దు
ర్వార[4]వృత్తి రథంబు లెక్కి [5]యవంధ్యవిక్రమ [6]మేర్పడన్
భూరి[7]వీరరణం బొనర్తము పోర [8]నోర్చినవాఁడ యి
ద్ధారుణీతలరాజ్యసంపదఁ దాల్చు [9]వీరగుణోన్నతిన్.

224. వ. ఈరెంటిలో నీకెయ్యది యిష్టంబు [1]దానిన కడంగు మనినం బుష్కరుండు రణంబునందుఁ [2]బరాజితుండు గావున నలుం దొల్లియు జూదంబున నోడిచిన వాఁడై యింకను [3]నోడిచి దమయంతిం జేకొని కృతార్థుండ నగుదు నని సంతసిల్లి యేనోటువడితినేని [4]నఖిల[5]మహీరాజ్యంబు నీ[6]యది నీ[7]వోటువడితేని దమయంతి నాయది యని [8]పలికి యొడ్డి నలుతో జూదమాడి యోటువడిన.

225. క. [1]ఘనముగ జంబూద్వీపంబునఁ గలవారెల్ల నెఱుఁగఁ బుష్కరుచేతం
గొనియెఁ బునర్ద్యూతంబున, నన[2]ఘుఁడు నలుఁ డఖిలరాజ్య మత్యున్నతితోన్.

---

222. 1. నొడ్డియును – ఔ; వినాగా – ఝ; రోయఁగా – అ. ఆ. ఉ. చ. జ. శ. ష. అర్థము విచార్యము. 2. దొడఁగెద – ఉ. ఔ. ద; గలిగెదను – సం. 3. నొడ్డుము – ఔ ఘ. 4. నది ప్రియమేనిన్ – ఔ. ల. స; నప్రియమేనిన్ – కొన్నిప్రతులు.

223. 1. సువ్వె – అ; సూవె – ఆ. ఉ. స. 2. ధారుణి – అ. ఇ. ఈ. ఏ. ఐ ఔ. ద. ఝ ల. స. శ. 3. వీక – అ. ఆ. ఇ. ఊ. ఝ. ల; వించె – సం. 2 – 1402. 4. శక్తి – ల. స. కొన్నిప్రతులు. 5. యవార్య – జ. 6. మొప్పగా – ఔ. 7 తీవ్ర – చ. 8. గెల్చిన – చ; నేర్చిన – ఘ. 9. ధీర – శ. ష. ల.

224. 1. దానికింగడంగు – వీ. శ. ష.; దానినచేయు – ఒ. 2. బరాజితుండయ్యును నలుం – ఉ. ఘ. 3. జూదంబాడి – అ. ఆ. ఝ; జూదంబుననోడించి – ఒ. 4. నిఖిల – ఒ. చ. ల. 5. ధరణీరాజ్యంబు – పెక్కుప్రతులు. 6. యదియ – వీ. శ. ర. 7. వోడితేని – ఈ; వోటువడితివేని – అ. ఇ. ఏ. ఔ. 8. పలికి – కొన్నిప్రతులలో లేదు.

225. 1. ఘనమగు – స. 2. ఘనుడునలుం డఖిలరాజ్యగతియున్నతితోన్ – గ; ననఘుఁడు నయ్యఖిల...తితో – స.

226. వ. ఇట్లు జూదంబునఁ బుష్కరు [1]నోడిచి సకలమహీరాజ్యంబును జేకొని నలుండు వాని కిట్లనియె.

227. క. కలిసంప్రాప్తుఁడనై కడు,బల మఱి నీచేతఁ దొల్లి [1]బలవద్ద్యూత
చ్ఛలజితుఁడనైతి [2]నది నీ,బలమని [3]గర్వింప వలదు బలవంతుడవై.

228. వ. నీవు నాపితృవ్యపుత్త్రుండవు నిన్నెద్దియుం జేయ[1]నోపఁ బొమ్మని పుష్కరు విడిచి [2]పుచ్చి పుష్కలంబైన [3]రాజ్యంబుతో [4]నలుం డున్నంత.

229. క. భీమప్రస్థాపితయయి,కోమలి దమయంతి పుత్త్రకులుఁ దానును ల
క్ష్మీమహిమ [1]వెలుఁగుచుండఁగఁ, దామరసదళాక్షి వచ్చెఁ దన[2]పతి కడకున్.

230. వ. అట్లు దన[1]మనోవల్లభయైనదమయంతిం గూడి నలుండు [2]విధివిహితానేకాచరితమఖుండై శతమఖువిలాసంబుతో సకల[3]రత్నయుతంబైన రత్నగర్భాది రాజ్యంబు సేసెఁ గావున నక్షజితుండ నైతి నని వగవ [4]వలదు నీవును దైవమానుషసంపన్నుండవయి శత్రువుల జయించి [5]సకలమహీసామ్రాజ్యంబు వడయుదు వని బృహదశ్వుండు ధర్మరాజునకు నక్షహృదయం బుపదేశించి.

---

226. 1. నోడించి – కొన్ని ప్రతులు; గెలిచి – చ.

227. 1. బలవద్ద్యూతంబుల – శ. ప. 2. నింకను బల మఱి – ఔ. 3. దర్పింప – ఈ. ఐ. త; గర్వింపఁ జనదు – చ. పీ. శ. ష; గంపింప – ఘ.

228. 1. నోడుదు – ఎ. ఔ. ల; నోడకుండుమని పుష్కరు – ఒ. జ; నోడక పొమ్మని – కొన్ని ప్రతులు. 2. పుచ్చి – పెక్కు ప్రతులలో లేదు. 3. రాజ్యవిభవంబులో– కొన్ని ప్రతులు. 4. నలుం డుండునంత – కొన్ని ప్రతులు; నలుం డుండె నంత – కొన్ని ప్రతులు.

229 1. వెలయు – ఉ. 2. పురమునకున్ – స.

230 1. హృదయ – కొన్నిప్రతులు; ప్రాణ – కొన్ని ప్రతులు; హృదయేశ్వరి – ఘ. చ. పీ. శ. ష. 2. విధి విహితానేకమఖుండై – పెక్కు ప్రతులు. ఈజేచ వివి ధైర్యజ్ఞైః విధివత్స్వాప్త దక్షిణైః – 78–౬. 3. రత్నాయతనంబైన – ల. 4. కుందుము – ఘ, చ. పీ. శ ప. 5. సమస్త సామ్రాజ్యంబు – కొన్ని ప్రతులు; సమస్త సామ్రాజ్య సుఖంబు – జ.

231. సీ. ఇన్నలోపాఖ్యాన మెప్పుడు దత్తావధానులై వినువారుఁ దవిలి [1]సభలఁ
జదివెడువారును జగతీశ కలిదోషనిర్ముక్తు లగుదురు నిఖిలపుణ్య
ఫలభాగు లగుదురు జహుపుత్త్రపౌత్త్రాయురారోగ్యధనయుక్తు లగుదు రెల్ల
విషము[2]లకును దుష్టవిషయంబులకు దూరు లగుదురు ధర్మాత్ము లగుదు రుర్విఁ
ఆ. గడుఁ [3]బ్రసిద్ధ మిదియుఁ గర్కోటకుని దమ,యంతిఁ బుణ్యమూర్తి యైన నలుని
[4]ఋజుచరిత్రుఁడైన ఋతుపర్ణుఁ గీర్తింపఁ, గలిభయంబు లెల్లఁ [5]గ్రాఁగు నధిప.

-: ధర్మరాజునొద్దకు నారదమహాముని వచ్చుట :-

సం. 3 – 80 – 1

232. వ. [1]అని చెప్పి బృహదశ్వుం [2]డరిగినం బాండవులు గాండీవి[3]రాకయ కోరుచుఁ
దదాలోకన[4]ప్రీతి నుండు నంత నంతరి[5]క్షం బెల్లఁ దనతేజంబున వెలుంగు
చుండ నారదుండు వచ్చి యనుజసహితుం డైన ధర్మరాజుచేతం
బూజితుం[6]డై యిట్లనియె.

233. ఆ. [1]ధర్మపుత్త్ర నీయుదారచరిత్రకు, ధర్మమతికిఁ దృ[2]ప్తతముఁడ నైతి
నడుగు [3]మిష్టమెద్ది యనినఁ గృతాంజలి, యైయమహీశుఁ డిట్టు లనియె [4]భక్తి.

---

231. 1. భక్తి – కొన్ని ప్రతులు. 2. క్తులును – ఝ. ల. 3. ప్రసిద్ధులైన కర్కో టకుని – ఇ. ల. 4. నుత – వా. వి. సూ. శ; ఋషి – ఇ. ఈ. ఏ. ఐ. ఓ. త. స; ఋజు – అ. 5. గ్రాగుచుండు – కొన్ని ప్రతులు; గ్రాగుననఘ – చ; గ్రాగి పోవు – గ. జ. ల. అ. ఊ. ఒ. చ. శ. ష. ప్రతులలో కర్కోటక కస్య నాగస్య... కలినాశనమ్ అను శ్లోక మధిక పాఠముగా నున్నది.

232. 1, అని బృహదశ్వుం డరిగిన – ఆ. ఒ. ద. శ. ష. 2. డరిగె నిట – ఔ. 3. రాక కోరుచు – కొన్ని ప్రతులు; రాకయె కోరుచు – చ. 4. ప్రీతులై యుండునంత– ఏ. ఐ. ఒ. గ. ఝ. ల; ప్రియులై యుండునంత – చ; ప్రీతి నంతరిక్షంబెల్ల – శ. 5. క్షంబునం దన తేజంబు వెలుంగు — ఉ. ఔ. 6. డై యున్న ధర్మజుచేతం—ల.

233. 1. ధర్మ నీ యుదార కర్మచరిత్రకు — స. 2. దృప్తి దనర నన్ను — గ. 3. మెద్ది యిష్టమనిన — ఇ. ఊ. ఏ. ఐ. ఓ. ఔ. ఘ. చ. త. 4. బ్రీతి — ఇ. ఈ. ఉ. ఏ ఒ. ఓ. చ. జ. త. ల.

234. వ. మునీంద్రా నీవు తృప్తుండవైనం [1]త్రిజగంబులకుం దృప్తియగు నిన్నుం జూ[2]చి కృతార్థుండ నైతి నాకెప్పుడు నొక్క ధర్మసందేహంబు గలదు దాని నిర్ణయించి యానతీయవలయు.

235. చ. ధరణిఁ బ్రదక్షిణంబుగ ముదంబునఁ గ్రుమ్మరి తీర్థసేవనా
పరు లగుచున్నధన్యులు శుభస్థితి [1]నెట్టిఫలంబు [2]నొందఁగాం
తురు బహుతీర్థకీర్తనముతో నెఱిఁగింపుము దీని నావుడున్
నర[3]వరుఁడైన పార్థునకు నారదుఁ డిట్ల[4]ని చెప్పెఁ బ్రీతితోన్.

236. క. [1]ధీరుఁడు భీష్ముఁడు గంగా,[2]ద్వారమునం దొల్లి పితృహితమ్ముగ [3]శుభక
ర్మారంభుఁ డగుచు నుండె న,దారుం డధ్యయనసంతతవ్రతపరుఁడై.

237. వ. అతని పితృ[1]దేవతాభక్తికిఁ బరమ[2]ధర్మచరితంబునకు మెచ్చి తద్దర్శనాపేక్షం [3]బులస్త్యుం డనుమహాముని [4]వచ్చిన [5]నతిభక్తుండయి యాభీష్ముం [6]డమ్మునిఁ గుశపీఠంబున నునిచి [7]యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యతనియడుగులు తల నిడుకొని దక్షిణజానుస్పృష్టమహీతలుం డయి యేను భీష్ముండ భవద్దాసుండ [8]నని ముకుళిత[9]హస్తుం డయి యున్న వానికిఁ బులస్త్యుం డిట్లనియె.

---

234. 1. త్రిలోకంబులు తృప్తినొందు — ఓ. గ. ఘ. ల. 2. బూజించి — ఓ.

235. 1. నేమి — జ. 2. లంద — ఔ. ద. వీ; లైన — శ. ష. 3. నుతుడైన — అ. ఆ. ఝ. వీ. శ. ష. 4. నియెం బ్రియంబునన్ — ఒ.

236. 1. ఈ కందమునకుఁ బూర్వము గ. ల. స. శ. ప్రతులలో నీ పద్యమున్నది.
వినవయ్య నీవు ననువేడిన ప్రశ్నకు నుత్తరంబు డెందం బలరన్
వినిపింతు నీకు నభిమత మనఘా! నే జేయువాడ నధిః ప్రీతిన్.
వీరుడు — ఏ. ఐ. గ. ఘ. చ. త. 2. ద్వారంబున దొల్లి — కొన్ని ప్రతులు. 3. శుభధర్మా — స.

237. 1. దైవ — ఉ. 2. ధర్మాచరితంబునకు—ల; ధర్మంబునకు — ఒ. 3. బులస్త్యుండు వచ్చిన — ఈ. ఐ. చ. 4. యరుగుదెంచిన — ఊ. 5. నతి ప్రీతుండయి — అ. ఎ. జ. ఝ. ల. 6. డమ్మునీంద్రుం గుశ — ఉ ల. 7. యర్ఘ్యజలంబులు తల నిడుకొని తెచ్చి యతని — అ. ఏ. ల; యర్ఘ్యోదకంబులు పాదంబులపై బోసి — ఆ. శ; యర్ఘ్యంబు లిచ్చి యడుగులు — ఔ. గ. 8. నని యర్ఘ్యోదకంబులు పాదంబులపై బోసి పాద్యాది విధుల బూజించి — అ. ఇ. ఉ. ఎ. ఏ. ఒ. ఓ ఔ. గ. ఘ. చ. ఝ. ద. 9. కరకమలుండై — అ. ఆ ఎ. ఝ.

238\. క. పితృ[1]దేవభక్తిఁ బుణ్యవ్రత[2]చర్యను నీవ యెల్లవారికి నత్యు
న్నతుఁ డవు గావున నీచే, ధృతిఁ [3]గానఁగఁ బడితి నేఁ బ్ర[4]తీపకులేశా.

239\. వ. నీయిష్టంబు సెప్పు[1]మే నమోఘదర్శనుండ ననిన భీష్ముండు ముదిత హృదయుం డై మునీంద్రా [2]నాయందు నీకుఁ బ్రసాదబుద్ధి గల[3]దేనిఁ జెప్పు మని.

240\. క. మనుజేంద్ర నన్ను [1]నీయడిగిన యట్ల పులస్త్యుఁ బుణ్యకీర్తను గంగా
తనయుం డడిగిన నతనికి, ననఘచరిత్రునకు నిట్టు [2]లని ముని సెప్పెన్.

241\. సీ. కడఁగి బుద్ధీంద్రియ[1]కర్మేంద్రియంబులయందు సంయతచిత్తులైనవారు
ధృతి నహంకారప్రతిగ్రహాపేక్షలయందు [2]నివృత్తాత్ములైనవారు
[3]నల్పభోజనులు [4]ననారంభకులు [5]నయ్యు నత్యంత[6]సంతోషులైనవారు
సత్య[7]వ్రతులు [8]శుభాచారు లక్రోధను లగుచు ధర్మాన్వితులైనవారు
ఆ. నఖిలతీర్థశతము లాడిన[9]ఫలములు, నఖిలయజ్ఞ[10]విధుల నైన ఫలముఁ
బడయుదురు విహీనభాగ్య [11]దుష్కృతులకుఁ, బరమతీర్థసేవఁ బడయ వగునె.

---

238\. 1. దైవ – అ. 2. చరితల – ఆ. ఓ. ఘ. ల; చరితుడవీవ – ఒ. 3. గావంబడితి – అ. ఆ. 4. తీపకులేశా – ఒ; దీపకులేశ – వా. పీ. మున్నగు ప్రతులు.

239\. 1. నేన – శ. ష. 2. మీకు నాయందు – ఊ. 3. దేని దీనిం జెప్పుమని – గ. ల; దేవి యడిగెద నావతిండని – ఔ.

240\. 1. నీవడిగిన – త. పీ. శ. ష. 2. లమ్మునిసెప్పన్ – ద.

241\. 1. కర్మేంద్రియములందు నవగతచిత్తులైనట్టివారు – ల. స. 2. నప్రీతాత్మ – ఊ. న. శ. 3. నాత్మీయభోజనానారంభకులునునై యత్యంత – స. 4. నైశారంభకులు– అ; ననారంభులయ్యును – ఏ. ఐ. ఓ. ఝ. త; ను నారంభరహితులు – ఉ. ఔ; మ నజినాంబరులునునై యత్యంత – ల. 5. ను నై యత్యంత – కొన్నిప్రతులు. 6. సంతుష్టు – కొన్నిప్రతులు. 7. తపోవ్రతాచారుల క్రోధను లనగ ధర్మా – ఉ. 8. శుభచారు లక్రోధను – ఈ. త; శుభచారిత్రు లక్రోధులనగ – ఏ. ఓ; శుద్ధచారిత్రు ల క్రోధు లనగ – ఐ; శుభాచారు లక్రోధను లనగ – కొన్నిప్రతులు. 9. ఫలములు – వా. పీ. శ. కొన్నిప్రతులు. 10. నిరతు లైనఫలము – ఏ. ఓ. 11. దుఃఖితులకు – స. శ; మున్నగు ప్రతులు.

242. క. [1]తిల గోసువర్ణ దానంబులు నుపవాసములుఁ దీర్థముల [2]సేవయు ని
 మ్ములఁ జేయనివారు దరిద్రులు [3]రోగులు నగుదు రాత్మదోసము పేర్మిన్.

243. క. క్రతుఫలములు వడయఁగ దుర్గతులకు [1]దొరకొనదు తీర్థగమనంబునఁ ద
త్క్రతుఫలము లందుదురు దుర్గతులును నిది మునులమతము కౌరవ[2]వృషభా.

244. వ. తీర్థ[1]గమనఫలం బెల్లపుణ్యంబులకు విశేషంబు దీని వినుము.

245. చ. నమితవిరోధి పుష్కర మనంగ జగద్విదితంబు పుణ్య తీ
ర్థము [1]మునిసిద్ధసేవ్యము ముదంబున నందుఁ బయోజసంభవుం
డమరులతోడ సన్నిహితుఁడై వసియించుఁ [2]ద్రిపుష్కరంబులున్
[3]సమములు వాని నెప్పుడును [4]సంస్మృతి సేసినఁ బాయుఁ బాపముల్.

246. క. పదివేలకోట్లతీర్థము, లుదితములై పుష్కరముల నుండు మునీంద్ర
త్రిదశ[1]వరు లందుఁ జేసిరి, మదిఁ గృతకృత్యులయి [2]తపము
మఖములుఁ [3]బ్రీతిన్.

247. వ. అందుఁ గృతస్నానులై [1]దేవర్షి పితృతర్పణంబులు సేసినవారు దశాశ్వమేధ
[2]ఫలంబులు వడయుదురు [3]కార్తికమాసంబున నొక్కదివసంబు పుష్కరసేవ
సేయుటయు [4]నొక యేఁ డగ్నిహోత్రంబు [5]వేల్చుటయు సమంబు.

---

242. 1. తిలగో-ఉ. 2. నేకమ్ము లిమ్ముల-శ. ష. 3. నిరతమునగు దురాత్మ - వ. శ. కొన్నిప్రతులు; సిద్ధంబగు దురాత్మ - ఈ. ఏ. ఐ. ఝ. త. ద. ల.

243. 1. దొరకొనవు - చ. 2. నాథా - గ. ద. ల. స.

244. గమనంబు పుణ్యంబులకు విశేషంబు - ల. స; గమనఫలంబు యజ్ఞఫలంబులకు విశేషం బిది వినుము - వీ. శ. ష. స; గమనంబయెల్ల - ఐ. ఝ.

245. 1. సురసిద్ధ - ఝ; సురసేవ్యమంచును ముదంబున - అ. 2. ద్రివిష్టపంబులన్ - చ. 3. శమయుత - అ. ఎ. ద. వీ. 4. సన్నుతి - ఈ. ఏ. ఐ. ఓ. ఝ. న. శ; సంస్తుతి - ఆ. ఎ. ఔ. గ. చ. జ. ద. ల. స.

246. 1. మును లందచేసిరి - ఝ. 2. పెక్కు మఖములు-అ. ఎ. వీ. 3. పేర్మిన్-అ.

247. 1. దైవర్షి - ఉ. ఐ. ఔ. గ. 2. ఫలప్రాప్తు లగుదురు - ఔ. జ. 3. మాఘ - వా. కార్తిక్యాంతు విశేషేణ యోఽభిగచ్ఛేత పుష్కరం. 3-80-52. 4. నూఱేం డ్లగ్ని - ఈ. ఎ. ఔ. త. వీ. శ. ష; నూఱేళ్ళగ్ని - ఏ. ఐ. 5. సేయుటయు - పెక్కుప్రతులు.

248\. క. అమరవరులందుఁ బురుషో, త్తముఁ డెట్లు [1]విశేషుఁ డట్ల ధరణిం గల [2]తీ
ర్థములందుఁ బుష్కరత్రిత, యము గరము [3]విశేష మభిమతార్థప్రదమై.

249\. వ. పుష్కరంబునఁ బదియేండ్లు వసియించినవారికి సర్వక్రతుఫలంబును బ్రహ్మ లోకప్రాప్తియు నగు మఱియు జంబూమార్గంబు [1]దండులికాశ్రమంబున నగస్త్య[2]వటం [3]బనుతీర్థంబు[4]లాడి యశ్వమేధఫలంబు వడయుదురు కణ్వాశ్ర మంబును ధర్మారణ్యంబును యయాతి[5]పతనంబునుం [6]జూచిన సర్వపాప క్షయం బగు మహా[7]కాళంబును [8]గోటితీర్థంబును [9]నశ్వమేధఫలప్రదంబులు [10]భద్రవటం [11]బనురుద్రస్థానంబున రుద్రుం బూజసేసి గణపతిత్వంబు వడ యుదురు నర్మదాస్నానంబున దక్షిణసింధుస్నానంబునఁ జర్మణ్వతీ[12]తీర్థ స్నానంబున నగ్నిష్టోమఫలంబు లగు.

250\. క. అనవద్యవసిష్ఠాశ్రమ, మున [1]నొకదివసంబు శాక[2]మూలాశనులై
జను లుండి పడయుదురు బహు, [3]ధనసంపద గోసహస్రదానఫలంబుల్.

251\. వ. మఱి [1]పింగం బనుతీర్థంబు సేవించి శత[2]కపిలగోదానఫలంబు వడయుదు రెండేని నగ్నిదేవుండు ప్రత్యక్షుండై యుండు నట్టి ప్రభాసతీర్థం బాడి యగ్ని

---

248\. 1. విశిష్టు డట్లు – అ. ఊ. ఎ. జ. వీ. స; విశేషమట్లు – ర. ల. శ. కొన్నిప్రతులు. 2. తీర్థములందును బుష్కరతీర్థము గరము – శ. ప; తీర్థములందు బుష్కర త్రిత యము తీర్థవిశేష – ఝ. 3. విశిష్ట – అ.

249\. 1. బదరికాశ్రమంబు – పెక్కుప్రతులు; దండూలికాశ్రమంబ – ల. వీ. శ; దండ కాశ్రమంబు – వా. జంబూమార్గా దుపావృత్తో గచ్ఛే త్తండూలికాశ్రమమ్. 3–80–62. 2. సరంబను – శ. 3. బు ననుతీర్థంబు – ఈ. ల. ప. 4. లాడిన నశ్వ – ఈ. ఊ. ఐ. ఝ; లాడిన వారశ్వ–ల. 5. పథంబునుం – పెక్కు ప్రతులు; తీర్థంబునుం – ఈ. ఐ. త. 6. జూచినవారికి – ఈ. ఘ. ద. ల. 7. నాళం – ఈ; కారం – అ. ఉ; కూలం – ఘ. శ. ష; తీర్థం – చ. 8. గౌరి – ఊ; సర్వ– ఒ; గోతీర్థంబు – ఔ. గ. ఘ. ఝ. 9. నశ్వమేధఫలప్రదంబులు – పెక్కు ప్రతు లలో లేదు. 10. రుద్ర – వా. వీ. శ. పుణ్యస్థాన ముమాపతేః నామ్నా భద్ర వటం నామ త్రిషులోకేషు విశ్రుతం. 3–80–69. 11. బు నను – ఏ. ఘ. శ. వ. 12. తీర్థ – కొన్ని ప్రతులలో లేదు.

250\. 1. నొక్కదినంబు – ఉ. ఔ. గ. 2. మూలాశ్రయులై – ఔ. 3. ధనవంతులు– కొన్ని ప్రతులు.

251\. 1. పింగళంబను – పెక్కుప్రతులు. పింగతీర్థ ముపస్పృశ్య బ్రహ్మచారీ జితేం ద్రియః. వావిళ్ల సంస్కృతప్రతి ఆరణ్య పుట 84. 2. కపిలదాన–పెక్కుప్రతులు.

ష్టోమాతిరాత్రఫలంబు వడయుదురు [3]దుర్వాసునకు విష్ణుదేవుండు వరం బిచ్చుటంజేసి వరదానం బనంబరగినతీర్థం బాడియు సరస్వతీసాగర[4]సంగమం బాడియు [5]గోసహస్రదానఫలంబు వడయుదురు.

252. క. [1]ద్వారవతీపురమునఁ [2]బిం, డారక మనుతీర్థమున [3]బెడంగై ముద్రా
కారంబులై త్రిశూలా, కారములై [4]పంకజములు [5]గానంగఁబడున్.

253. వ. అందుఁ బరమేశ్వరుం బూజించి [1]పాపవిముక్తు లగుదురు సాగర[2]సింధుసంగమ స్నాతులైనవారు [3]వరుణలోకగతు లగుదురు [4]శంకుకర్ణేశ్వరంబున [5]నీశ్వరుం బూజించి దశాశ్వమేధ[6]ఫలప్రాప్తు లగుదురు [7]వసుధారయును వసు సరంబు ననుతీర్థంబు లాడి వసు[8]ప్రాప్తులగుదురు [9]సింధూత్తమస్నానంబున బహుసువర్ణదానఫలం బగు[10]బ్రహ్మతుంగసేవనంబున బ్రహ్మలోకప్రాప్తి యగు శక్ర[11]కుమారివిలోకనంబున శక్రలోకగతియగు [12]శ్రీకుండంబున

---

3. దుర్వాసునకు విష్ణుదేవుండు – వా. వీ. శ. విష్ణో ర్దుర్వాససా యత్ర వరో దత్తో యుధిష్ఠిర . 3-80-81. 4. సంగమ తీర్థంబాడియు – జ. ద. ల. 5. గోదాన సహస్రంబుల నైన యంత సుకృతఫలంబు – స.

252. 1. ద్వారావతీపురమున – ల. స. మూలము. పిండారకే నరస్నాత్వా లభేద్బహు సువర్ణకమ్. వావిళ్ళ సంస్కృత ప్రతి. అరణ్య – పుట 815. 2. బృందారక – పెక్కు ప్రతులు. 3. ముదంబున – కొన్ని ప్రతులు; సుదర్శన ముద్రా – ఒ; నుత స్థితి రుద్రా – ట; బెడంగై చిర లక్ష్మిరమ్యములై ముద్రాకారములై పంకజ ములు – ఘ. చ. శ, ష. 4. సరసిజములు – కొన్ని ప్రతులు. 5. గానగ వచ్చున్ – ద.

253. 1. పాశ – ట. 2. సరస్వతీ సంగమస్థానంబున – ఔ. 3. నాకలోక – శ. పెక్కు ప్రతులు. 4. శంఖ – పెక్కు ప్రతులు; శంభు – ఒ; షణ్ముఖ – ద. 5. శంకరు నర్చించి – కొన్ని ప్రతులు; నీశ్వరు నర్చించి – కొన్ని ప్రతులు. 6. ఫలంబు వడ యుదురు – కొన్ని ప్రతులు. 7. వసుద్వారంబును – శ. ష, శ. కొన్ని ప్రతులు. 8. ప్రాప్తులగుదురు – ఇ. ఒ. ఘ. ఝ. ల; ప్రీతు లగుదురు – ఔ. చ. ద; సంపూర్ణు లగుదురు – శ. ష; ప్రియులగుదురు – వా. వీ. 9. సింధుస్నానంబున – ఔ. ల. 10, భద్రతుంగ – వా. వీ; బ్రహ్మోత్తుంగ – అ. ఆ. ఇ. ఊ. ఎ. ఝ. త. ద. 11. కుమారికా లోకనంబున – పెక్కు ప్రతులు. 12. గిరి కుంజం – చ. ల;

బితామహు[13]నకు నమస్కరించియు సౌవర్ణ[14]రాజతంబులైన మత్స్యంబులు గల [15]విమలం బనుతీర్థంబాడియు వాసవసాయుజ్యంబు వడయుదురు [16]బడబ యనుతీర్థంబున నగ్నిదేవునకు [17]నైవేద్యం బిచ్చిన నది యక్షయంబై పితృదేవతలకుఁ దృప్తిఁజేయు గోసహస్ర[18]దానంబునకు నశ్వమేధ[19]సహస్రంబునకు విశేషంబు.

254. క. దేవిక యనుతీర్థంబున, దేవ[1]సమూహంబుతోడఁ [2]ద్రినయనుఁ డుండుఁ
సేవితమై [3]జనులకు నది, గావించు ననూనధర్మ[4]కామార్థంబుల్.

255. వ. అర్ధయోజన [1]విస్తృతంబై పంచయోజ [2]నాయామంబైన యద్దేవికానదియును[3]గామాఖ్యంబును రుద్రతీర్థంబును యజనయాజనబ్రహ్మవాలుకంబులును బ్రహ్మాదిదేవతల దీర్ఘసత్రస్థానంబైన[4]దీర్ఘసత్రంబును సేవించినవారికి నిష్టసిద్ధియగు [5]వినశనంబనుతీర్థంబున నదృశ్యంబై మేరువునకుం బోవునెడ [6]నాగోద్భేద [7]శివోద్భేద [8]చమసోద్భేదంబుల నెందేని [9]సరస్వతి గానం

---

శ్రీకుంజరం – ఈ. ఎ. త. శ. ప. శ; త్రికూటంబున – ఉ; శ్రీకూపంబున – ఔ. 13. నర్పించి – ఇ. ఉ. ఔ. 14. రజితంబులైన — పెక్కు ప్రతులు; రజితవర్ణంబులైన – ఇ. ఉ. ల; రజిత — రూపము విచార్యము. 15. కపిలంబను — ఊ. శ; 16. మలహారంబను — కొన్ని ప్రతులు; మలహారంబను — న. కొన్ని ప్రతులు. 17. నర్ఘ్యం బిచ్చిన — వా. పీ. శ. చరుం నరేంద్ర పప్తార్చే ర్యథాశక్తి నివేదయేత్. 3—80—106. 18. దానఫలంబునకు — ఒ. ల. 19. సహస్రఫలంబునకు — అ. ల.

254. 1. సహస్రంబు — ఘ. 2. ద్రిణయను — ఎ. జ. ప. శ. 3. యతిజనులకు—న; నరులకు — ల. 4. కామ్యఫలంబుల్ — ట.

255. 1. విస్తారంబై – ఘ. 2. నాయతంబై – ఇ. ఈ. ఐ. ఒ. త. 3. కామ్యాఖ్యంబును – ఎ. చ: 4. దివ్యసత్రంబును – కొన్ని ప్రతులు; వీర్యసత్రంబును – ఈ. ఐ. గ. జ. త. శ; దీర్ఘసత్ర స్థానంబును – వా. 5. నచిరంబను తీర్థంబు – కొన్ని ప్రతులు. 6. గంగోద్భేద – ఈ. ఐ. త; నగోద్భేద – అ. ఊ. ఎ. ఏ. శ. ప; నాగోద్భవ – ఘ. 7. శిలోద్భేద – ల. కొన్నిప్రతులు; మహ్యుద్భేద – ఈ. ఐ. 8. మహ్యుద్భేద – ఎ. త. ల. 9. సరస్వతింగానం – వా. మున్నగు

బడియె నట్టి సరస్వతియందు నభిషిక్తులైన[10]వారు [11]నాగలోకంబు వడయుదురు [12]శశరూపపుష్కరంబులు గల [13]శశయానం బనుతీర్థంబున స్నానంబును[14] గోసహస్రదానంబును సమంబు.

256. మధ్యాక్కర.
[1]ఏమేమ మున్ను [2]పూజింపుదుము రుద్రు నిందని వేడ్క-
[3]తో[6] మునికోటి [4]దారున్న నీశుc డందొలకును బ్రీతి
గా మతిలోc గోటిరుద్ర[5]రూపముల్ గావించె నదియు
భూమిc బ్రసిద్ధమై రుద్రకోటి నాc బొలిచి వెలింగె.

257. వ. అందు రుద్రుc బూజసేసి రుద్రలోకప్రాప్తు లగుదురు.

258. క. నరనుత నైమిశమునc బు, ష్కరముల మూcటను [1]జగత్ప్రకాశితమై యి
ద్ధరణిc గురుక్షేత్రము [2]దు, స్తరదురితౌఘములకెల్ల దవ్వగుచుండున్.

259. తే. అమరలోకనివాసుల యంద్రు విబుధు, లాకురుక్షేత్రవాసుల నదియు వినcగ
నుత్తమంబు [1]దృషద్వతి యుత్తరమునc, దపనతేజ సరస్వతి దక్షిణమున.

260. వ. అక్కురు[1]క్షేత్రశమంతపంచకంబుల నడుమ రామహ్రదంబు నడుమc బితామహు నుత్తరవేది యనంబడు నట్టికురుక్షేత్రంబు [2]ముట్టినవారికిc గురుక్షేత్రంబునకుం బోయెద మనినవారికిc గురుక్షేత్రంబున వసియించెద మని తలంచినవారికి సర్వపాపక్షయం బగుc ద[3]దనంతరమున విష్ణుస్థానంబున

---

ప్రతులు; సరస్వతి గానం – పీ. కొన్ని ప్రతులు. 10. వారు – కొన్ని ప్రతులలో లేదు. 11. నాక – కొన్ని ప్రతులు. 12. రస – శ. కొన్ని ప్రతులు. శశ – ఇ. ఊ. ఏ. ఓ. జ. ద. ట. ల. 13. రసపానంబను – శ. కొన్ని ప్రతులు; రస హ్రదంబను – ఏ. ఓ. శతహ్రదంబు – ల. 14. చేసిన గోసహస్రదానఫలంబు వడయుదురు – ఈ. ఏ. ఐ. జ. ఝ.

256. 1. ఏమ యేమ మును పూజింపుదుము రుద్రు నిందని వేడ్క–శ. ష. 2. పూజింతుము రుద్రు నిందనుచు వేడ్క – చ. 3. నా ముని కోటిదానున్న నీశు డందరకు దా బ్రీతి – అ. 4. దానున్న – పెక్కు ప్రతులు. 5. మూర్తులు – కొన్ని ప్రతులు.

258. 1. జగత్ప్రకాశంబై – ఈ. త. 2. దుస్తర తరదురితౌఘములకు – అ. ఉ. ఊ. శ. ష. స; దుస్తరతర దురితములకెల్ల – ఝ.

259. 1. వృషద్వతి – ఈ. ఏ. ఒ. త.

260. 1. క్షేత్రంబున శమంత – ల. కొన్ని ప్రతులు. 2. మెట్టిన – శ. కొన్ని ప్రతులు; న మట్టిన – కొన్ని ప్రతులు. 3. దుత్తరంబున – కొన్ని ప్రతులు;

విష్ణువు నర్చించిన నశ్వమేధఫలంబగుఁ బారిప్లవం బనుతీర్థమాడి యగ్నిష్టోమ ఫలంబు వడయుదురు పృథివీతీర్థం బాడిన గోసహస్రదానఫలంబగు [4]శాలూకిని యనుతీర్థం బాడిన దశాశ్వమేధఫలం బగు [5]సర్పతీర్థం బాడి [6]యందుఁ దరండకుం డనుద్వారపాలకునిం [7]జూచినవారి కిష్టసిద్ధి యగు నెందేని విష్ణుం డాది[8]వరాహం బయ్యె నట్టివరాహతీర్థం బాడినవారికి నగ్నిష్టోమఫలం బగు నశ్వినీతీర్థం బాడిన రూపవంతులగుదురు జయంతియందు సోమ[9]తీర్థ స్నానంబును గృత[10]శౌచతీర్థస్నానంబును రాజసూయపౌండరీకసమంబు లగ్నివటంబున [11]ముంజవటంబున నీశ్వరుం బూజించి [12]గాణపత్యంబు వడయుదురు [13]యక్షిణీతీర్థమాడి యిష్టఫలంబులు వడయుదురు కురుక్షేత్ర ద్వారంబుఁ బ్రదక్షిణంబు సేసినం బాపక్షయం బగు.

261. క. [1]వీరుండు క్షత్రియులఁ దన, దారుణపరశువున జామదగ్న్యుఁడు రౌద్రా
[2]కారుఁడు వధియించి తదీ, యారుణమున నేనుమడువు లాపాదించెన్.

262. వ. అందుఁ బితృతర్పణంబు సేసినం బితృదేవతలాతనికిం బ్రత్యక్షంబయి నీకిష్టంబైన వరంబు వేఁడు మనినఁ బరశురాముండు వారల కిట్లనియె.

263. తే. క్షత్రవధ సైనపాపంబు గ్రాఁగవలయుఁ, [1]గడఁగి సద్గతియును నాకుఁబడయ వలయు
నివియుఁ బుణ్యతీర్థంబులై యిద్ధరిత్రిఁ, బరగుచుండంగ వలయు మీకరుణఁ జేసి.

---

ద్వైతవనంబున — కొన్ని ప్రతులు; ల. ప్రతిలో లేదు. 4. సాలోకినియను — కొన్ని ప్రతులు; 5. సర్పి — పెక్కు ప్రతులు; సర్పిని — ల; సర్పి — శ. 6. యందుదంతకుండను — వీ. శ; యం దుత్తరకుండను — కొన్ని ప్రతులు 7. బూజించిన — పెక్కు ప్రతులు. 8. వరాహరూపంబయ్యె — కొన్ని ప్రతులు 9. తీర్థవంశ తీర్థ — ల. కొన్ని ప్రతులు. 10. వంశ — కొన్ని ప్రతులు. 11. పంచవటంబు — శ, కొన్ని ప్రతులు; అంజన వటంబున బంచవటంబున — ల. 12. యిష్టఫలంబులు — ల. స. పెక్కు ప్రతులు; యిష్టవరంబులు — ఉ. చ. శ. ప. శ. 13. యక్షిణీ తీర్థమాడి యిష్టఫలంబులు వడయుదురు — పెక్కు ప్రతులలో లేదు.

261. 1. వీరుడయి — ఉ. ఔ. చ. ల. వీ, 2. కారుడయి వధించి — ఔ.

263. 1. కడిగి నాకును సద్గతి గలుగవలయు — వా. వీ. సూ. శ. కొన్ని ప్రతులు ప్రాసయతి నియమభంగము.

264\. వ. అని పితృదేవతలవరంబునం బుణ్యా[1]తీర్థంబులఁ జేసె నట్టిరామహ్రదంబు లాడినవారికి నశ్వమేధఫలంబగుఁ గాయ[2]శోధనం బనుతీర్థంబాడి కాయ[3]శుద్ధు లగుదు రెందేని విష్ణుదేవుండు లోకంబుల నుద్ధరించె నట్టి[4]లోకోద్ధారం బనుతీర్థమాడి కులంబుద్ధరింతురు శ్రీతీర్థంబాడి శ్రీమంతులగుదురు కపిలతీర్థంబాడి కపిలగోసహస్రదానఫలంబుఁ బడయుదురు సూర్యతీర్థం బాడి[5]యందుపవసించిన సూర్యలోకప్రాప్తు లగుదురు [6]గోభవనం బనుతీర్థం బాడి [7]గోసహస్రసమృద్ధు లగుదురు [8]శంఖినీతీర్థంబాడి యుత్తమరూపంబు వడయుదురు యక్షేంద్రతీర్థంబాడి తరండకుం డను ద్వారపాలకుం జూచిన వారు సరస్వతీస్నాతులైనవారు నగ్నిష్టోమఫలంబు వడయుదురు మాతృతీర్థ [9]దర్శనంబునం బ్రజావృద్ధియగు [10]బ్రహ్మావర్తంబును [11]శరవణంబునుం జూచిన సర్వవ్యాధివిముక్తులగుదురు [12]శ్వావిల్లోమాపహం బనుతీర్థంబునం దేకాదశ తీర్థంబులు గల వందుఁ బ్రాణాయామంబుసేసిన విప్రులకు [13]స్వలోమాప నయనం బగు[14]నెఱుకుచేత నేయంబడి కృష్ణమృగంబు లెందేని నొక్కతీర్థంబు సొచ్చి [15]మానుషత్వంబువడసె నట్టి మానుషతీర్థం బాడి సర్వ[16]దురిత విముక్తులై దేవత్వంబు వడయుదురు దానితూర్పున [17]నొక్కయిరవున [18]నాపగయను[19]మహానదిం [20]బితృతర్పణంబు సేసి పితృదేవోద్దేశంబున

---

264\. 1. తీర్థంబులైన రామహ్రదంబు — పెక్కు ప్రతులు. 2. శౌచంబను — ల. శ. పెక్కు ప్రతులు. 3. సిద్ధు - కొన్ని ప్రతులు; సిద్ధియగు నెందేని - కొన్ని ప్రతులు. 4. లోకోద్ధరణంబును - పెక్కుప్రతులు. 5. యందుపవాసంబుచేసిన - ల. పెక్కు ప్రతులు. 6. గోభంబను — కొన్ని ప్రతులు. 7. గోసమృద్ధు — పెక్కు ప్రతులు. 8. శంకినీతటంబున ద్వారపాలకు ననంతు పూజించి — పెక్కుప్రతులు; శంఖినీతలద్వారంబున నరకాంతకుండను ద్వారపాలకు బూజించిన — శ. మ. శ. 9. స్నానంబునం — ల. కొన్ని ప్రతులు. 10. బ్రహ్మతీర్థంబును — కొన్ని ప్రతులు. 11. సరోవరంబునుం — కొన్ని ప్రతులు. 12. లోమాపహంబను — ఈ. ఉ. ఇ. త. శ. ప. శ; లోమాపనయంబను — ల. 13. నుమానసహాయం బగు — శ. మ; రోమాపనయనంబగు — కొన్ని ప్రతులు. 14. నెఱుకులచే — పెక్కు ప్రతులు. 15. మనుష్యత్వంబు — కొన్ని ప్రతులు. 16. పాప — పెక్కు ప్రతులు. 17. మానస — ఉ. ఔ. 18. సురగయ — శ. మ; మానస నగంబును — ఆ. ఎ. ఝ; మానసాపగయను — ఇ. 19. తీర్థంబాడి — ఘ. చ. 20. బిత్రు

నొక్క బ్రాహ్మణునకుం గుడువంబెట్టినఁ గోటిబ్రాహ్మణు[21]లు గుడిచిన ఫలం బగుఁ బితృ[22]దేవతలు దృప్తియు నొందుదురు [23]బ్రహ్మోదుంబరం[24]బు సప్తర్షి కుండంబుఁ [25]గేదారంబును [26]జూచి బ్రహ్మలోకంబు వడయుదురు [27]కపిలకేదారంబుఁజూచి పాపవిముక్తులై యదృశ్యు లగుదురు [28]సరకం బను[29]తీర్థంబాడి కృష్ణచతుర్దశినాఁ డీశ్వరుం బూజించి యెల్ల[30]కోర్కులం బడయుదురు మూఁడుకోట్లకూపహ్రదంబులు గల [31]యి లాస్పదంబనుతీర్థం బాడి పితృతర్పణంబులు సేసినవారికి వాజపేయఫలం బగుఁ [32]గిందానకిం [33]జప్యంబు లనుతీర్థంబు [34]లందుఁ జేసిన దానజపంబు లక్షయంబు లగు నారదతీర్థం బైన [35]యంబాజన్మంబునందుఁ బ్రాణత్యాగంబు సేసినవారు సర్వలోకంబులం బడయుదురు శుక్ల [36]దశమిం బుండరీకం బనుతీర్థంబాడి పౌండరీకఫలంబు వడయుదు రందు వైత[37]రణీస్నాతులై రుద్రునకు నమస్కరించి సర్వపాపవిముక్తు లగుదు రెందేని దేవత లనేకసహస్రవర్షంబులు దపంబుసేసి రట్టి [38]ఫలకీవనంబను తీర్థం బాడి యగ్నిష్టోమాతిరాత్రఫలంబులు వడయుదురు ద్వైపాయనుం [39]డనేక తీర్థంబు[40]లు మిశ్రీకరించుటం జేసి [41]మిశ్రకం బనం బరగిన తీర్థం బాడినవారికి సర్వతీర్థస్నానఫలంబగు వ్యాస

---

తర్పణంబుసేసి — పెక్కు ప్రతులలో లేదు. 21. లకు గుడువంబెట్టిన ఫలంబగు — ఊ. ఐ. 22. దేవతా తృప్తియగు — కొన్ని ప్రతులు; దేవతా ప్రీతియగు — ఈ. ఐ. త. 23. బ్రహ్మోదుంబరం — కొన్ని ప్రతులు. 24. బను మహర్షి కుండంబును — పెక్కు ప్రతులు. 25. కపిల కేదారంబును — ల. 26. జూచినవారు — కొన్ని ప్రతులు. 27. కపిలాశ్వ కేదారంబు — కొన్ని ప్రతులు; కపిలాక్ష కేదారంబు — అ. ఊ. ఎ. ఝ; కపిల జల కేదారంబు — ల. 28. సుకరంబను — కొన్ని ప్రతులు; సురకరంబను — ఊ; సంకరంబను — ఉ; శంకరంబను — ల. 29. తీర్థంబున — పెక్కు ప్రతులు. 30. లోకంబులు — ఈ. ఐ. త. ద. 31. యైంద్ర స్యందనంబను — ల; యింద్రస్యందనంబను — పెక్కు ప్రతులు; యైంద్రాస్యందనంబను — అ. ఎ. 32. జావ్యంబను — శ. ష. ల; బౌష్యంబను — ఊ. ఐ. 33. జావ్యంబను — పెక్కు ప్రతులు. 34. న స్నానంబుచేసిన — కొన్ని ప్రతులు. 35. సభాజన్మంబు—పెక్కు ప్రతులు; సనోజన్మంబు — ఏ. ఓ. ల. 36. చతుర్దశిని — ల. 37. తరణియను తీర్థంబాడి — ఊ. ఎ. 38. బదరీవనం — ఊ; బలయవ్వనం — ఇ. ఝ; సవనం బను — ఔ. ద. శ. ష. 39. డశేష — పెక్కు ప్రతులు 40. లాడి విశ్రమించుటం జేసి — ఇ. ఈ ఐ. ఝ. త. 41. విశ్రామంబనం — ఇ. ఐ. త; శ్రీకరంబనం —

[42]వనంబును [43]మనోజవంబును మధు[44]వటియు ననుతీర్థంబుల నాడిన గోసహస్రప్రదానఫలంబు వడయుదురు కౌశికీ[45]దృషద్వతీసంగమంబున స్నాతులై సర్వపాపవిముక్తు లగుదురు [46]కిందత్తంబునఁ [47]దిలప్రస్థదానంబు సేసి పితరుల ఋణంబు నీఁ[48]గుదు రహస్సుదినతీర్థంబుల నాడి సూర్యలోకప్రాప్తు లగుదురు [49]మృగధూమంబున గంగాస్నాతులై మహాదేవు [50]నర్చించిన మహాత్ము లశ్వమేధఫలంబు వడయుదురు [51]వామనం బనుతీర్థంబాడి వామను నర్చించిన[52]వారు విష్ణులోకప్రాప్తులగుదురు [53]పావనం బనుతీర్థం బాడి కులంబు [54]పవిత్రంబు సేయుదురు [55]శ్రీకుంజంబున సరస్వతీస్నాతులై యగ్నిష్టోమఫలంబు వడయుదురు ఋషు లెందే నుండి [56]యాత్రాపరులై కురుక్షేత్రంబునకుం [57]బోదు రట్టినై మిశ[58]కుంజం బాడి [59]ఋషిపితృ ప్తి సేయుదురు [60]బ్రహ్మతీర్థం బాడి [61]వర్ణాంతరులు బ్రాహ్మణు లగుదురు బ్రాహ్మణు[62]లు బ్రహ్మలోకప్రాప్తు లగుదురు.

**265.** సీ. అనఘుఁడు [1]మంకణుం డను నొక్కబ్రహ్మర్షి తన[2]చేయి వ్రయ్యంగ దర్భఁగొనిన
సాంద్రమై శాకరసం బందు నిర్గతం బగుడును హర్షించి యాడుచున్నఁ

---

కొన్ని ప్రతులు. 42. వచనంబును — కొన్నిప్రతులు; 43. మహాజీవనంబును — ఓ. 44. వటంబను పెక్కు ప్రతులు; వనంబు — ఝ. 45. శత ధృతి సంగ — శ. వ. 46. విదర్భకూటంబున — కొన్ని ప్రతులు; విదర్భకూలంబున — శ. ష. స. కొన్ని ప్రతులు. 47. ఘృత — పెక్కు ప్రతులు. 48. గుదురు సూర్యతీర్థంబాడి—శ. వ; గుదురు తపనయను తీర్థంబాడి — ఈ. ఐ. త. 49. భృగూత్తరంబున — కొన్ని ప్రతులు; భృగూత్తమంబున — కొన్నిప్రతులు; భృగుతుంగంబున — ఊ. శ. వ. 50. నర్చించి యశ్వమేధ — పెక్కు ప్రతులు. 51. వాయనంబను — వా. 52. వారు — కొన్ని ప్రతులలో లేదు. 53. కుల పావనంబను — ఊ. ఒ. ద. శ; పావకంబను — ఉ; కులం పునంబను — వీ. శ. 54. పావనంబు — గ. ల. 55. శ్రీ కుంజసరస్వతీ — ల. కొన్ని ప్రతులు; శ్రీ కుంజరంబున — శ. వ. 56. తీర్థ యాత్రార్థులై — పెక్కు ప్రతులు; తీర్థ యాత్రాపరులై — శ. వ. 57. బోయిరట్టి — పెక్కు ప్రతులు. 58. కుండంబాడి — పెక్కు ప్రతులు. 59. పితృ — ఉ. ల. 60. వర్ణతీర్థం — చ. జ. 61. వర్ణేతరులు — ల. 62. లాడి — పెక్కు ప్రతులు.

**265.** 1. శౌనకుండను – వ. కొన్ని ప్రతులు; సహనకుండనియెడు – ఆ. ఉ. ట. సోరెన్సన్ గారి గ్రంథమునందు మంకణక అనియే కలదు. 2. వ్రేలువేయంగ – ఝ.

జూచి సహింపక సురలును మునులును హారుపాలి[3] కరిగి దేవాదిదేవ
ముని[4]నృత్త మేవిధంబున [5]నివృత్తం బగునట్లుగాఁ [6]జేయవే యనిన
హరుఁడు

ఆ. [7]దపసి రూప[8]మపుడు ధరియించి యమ్మునిఁ, కడకు వచ్చి యేమి
కారణమున
నాడె దేమి విస్మయం బిందుఁ జూచితి, చెప్ప నుచిత మేనిఁ జెప్పు మనిన.

౨౮౬. వ. [1]నా కరంబున శాకరసంబు [2]వెలువడిన [3]విస్మితుండ నయి హర్షించి యాడెద
ననిన [4]నిది యేమి [5]విస్మయంబు దీనిం జూడు మని హరుండు [6]తన యంగు
ష్ఠంబున నంగుళితాడనంబు చేసిన నందు [7]హిమసన్నిభం బయిన భస్మంబు
వెలువడినం జూచి లజ్జితుండయి నీవు పరమేశ్వరుండ వని నమస్కరించి
వేదమంత్రంబుల స్తుతియించి దేవా నీప్రసాదంబున నాకుఁ దపోవర్ధనంబు
[8]గావలయు ననిన నమ్మునివరునకు నీశ్వరుండు గరుణించి నీకుఁ దపోవర్ధన
మగు నేను నీయాశ్రమంబున నుండుదు ననియె నట్టి [9]సప్తసారస్వత
తీర్థం[10]బు లాడినవారికి సారస్వతసిద్ధియగు బ్రహ్మాదిదేవతలచే నధిష్ఠితం[11]బు

---

3. కేగి-కొన్ని ప్రతులు. 4. వృత్త - ఒ. ఘ. చ; కృత్య - ఇ. గ. నివర్తితమగు-కొన్ని ప్రతులు. 5. నివర్తనమగు-కొన్ని ప్రతులు. 6. జేయుమ - ఇ. ఉ. ఔ. గ. ఘ. ద; జేయుమీవీనిన - చ. వీ. శ. ష. స. 7. ఈ సీసపద్యముక్రింది ఆటవెలది పద్యమునకు పాఠాంతరముగా క్రింది గీతపద్యము అ. ఆ. ఎ. ఝ. ప్రతులలో కనఁబడుచున్నది.

దపసిరూపంబు ధరియించి తన్మునీశు
కడకుఁజనుదెంచి యిది యేమి కారణమున
మెరసి యాడెదు విస్మయ మేమి గంటి
చెప్పనుచిత మేనియు నాకుఁజెప్పుమనిన.

ఇచ్చట మూడవపాదమున అఖండయతిగా భావించవలెను. 8. మొప్పు - పెక్కు ప్రతులు.

౨౮౬. 1. కరతలంబున - పెక్కు ప్రతులు. 2. కారిన - ఎ. 3. విస్మయంబొంది - ఊ. 4. నదియేమి - పెక్కు ప్రతులు. 5. విస్మయకరంబు - ఉ. ఔ. గ. ద. 6. యంగుళి తాడనంబు - కొన్ని ప్రతులు. 7. హేమ - కొన్ని ప్రతులు; కాశ - ఈ. త. శ; హిమశైల - ఊ. 8. గావలె - ఇ. ఊ. 9. సప్త - కొన్ని ప్రతులలో లేదు; సప్త సాగర - ఒ. 10. బాడినవారికి - పెక్కు ప్రతులు. 11. బయిన - పెక్కు ప్రతులు.

లయిన [12]యాశనస తీర్థంబును గపాలమోచ[13]నంబు విశ్వా[14]మిత్రంబుఁ గార్తికేయంబు ననియెడుతీర్థంబుల నాడి పాపవిముక్తు లయి [15]బ్రహ్మలోకంబు వడయుదురు.

267. క. వేదములయందు [1]వినఁగఁ [2]బృ, థూదకతీర్థంబ యుత్తమోత్తమము [3]సురేంద్రాదిసురవరులకును వ్యా, సాది[4]మహాయోగివరుల కాస్పద మగుటన్.

268. వ. అందు శరీరత్యాగంబు సేసిన[1]వార లపారపాప[2]విముక్తులై ముక్తులగుదురు [3]సురకన్యాసరస్వతీ[4]సంగమస్నాతు లయిన[5]వారు బ్రహ్మహత్యాదిపాతకంబులవలనఁ [6]బాయుదురు దర్భనిర్మితం బయిన [7]యద్ధకీలతీర్థం బాడిన శూద్రులు బ్రాహ్మణు లగుదురు బ్రాహ్మణులు పరమ[8]సిద్ధు లగుదురు [9]శతంబును [10]సహస్రంబు ననుతీర్థంబులందుఁ జేసిన జప[11]దానోపవాసంబులు [12]శతసహస్రగుణంబు లగు వేల్పులెల్లం గుమారు సేనాపతింగా నెందే నభిషేకించి రట్టి[13]తైజసం బనుతీర్థంబును దాని[14]తూర్పున నుండు కురుతీర్థం

---

12. యాశానతీర్థంబును - ఊ. గ; యాశినరితీర్థంబును - ఉ. ఘ. చ. శ. వ; యాశన తీర్థంబును - కొన్ని ప్రతులు. 13. నంబును - పెక్కు ప్రతులు. 14. మిత్రతీర్థంబును గార్తికేయతీర్థంబును నాడిన - పెక్కు ప్రతులు. 15. బ్రహ్మలోకప్రాప్తులునగుదురు - ఒ; సర్వపాపవిముక్తులగుదురు - గ.

267. 1. విన్న - అ. ఆ. ఉ. ల. 2. బ్రమోదక - ఘ. చ. శ. 3. సురేంద్రాదులకును వేదవ్యాసాది - ఔ. 4. పరమ - ఈ. ఏ. ఐ. ఓ. త.

268. 1. వారు పాప - స. శ. కొన్ని ప్రతులు. 2. విముక్తులగుదురు - శ. వ. కొన్ని ప్రతులు. 3. సుకణ్వ - గ. 4. సంగమ - కొన్ని ప్రతులలో లేదు. 5. వారు పెక్కు ప్రతులలో లేదు. 6. బాయుదు రత్రి నిర్మితంబయిన - న. పెక్కు ప్రతులు; బాయుదు రద్రి నిర్మి - ఒ. 7. యవికర్షణంబాడి - ఇ. ఈ. ఏ. ఓ. జ. ల; యధికర్షణం బాడి - ఉ. ట; యఘమర్షణం బాడి - ఊ. ఘ. చ; యతికర్షణతీర్థంబాడిన - శ. వ; యద్రి కర్షణంబాడి - ఒ; అతి కర్షణంబను తీర్థం బాడిన శూద్రులు - స. 8. సిద్ధి బొందుదురు - అ. ఔ. ఝ. ద. ల. 9. శతకంబును - కొన్ని ప్రతులు; శత కుంభంబును - ఇ. ల. 10. సహస్రకంబు- కొన్ని ప్రతులు; సహస్రకుంభంబు - ఇ. ల. 11. దానోపాసనంబులు - ఇ. 12. శత-పెక్కు ప్రతులలో లేదు. 13. యాశసంబను-కొన్ని ప్రతులు; యాసేనంబను - శ. వ; యారసంబను - ఇ. ఉ. ఘ. చ; యాజసంబనుదాని-ల. 14. తూర్పు

బును [15]స్వర్గద్వారం బనుతీర్థంబును జూచినవారికి స్వర్గద్వారంబు వివృతం బగు రుద్రపత్ని యనుతీర్థంబున శంకరనారాయణుల నర్చించి సర్వ[16]దుఃఖ విముక్తు లగుదురు [17]స్వస్తిపురంబుఁ బ్రదక్షిణంబు సేసి గోసహస్రదావ ఫలంబు వడయుదురు గంగ[18]మడువున నొక్కకూపంబున మూఁడుకోట్ల తీర్థంబులు సన్నిహితంబు లయియుండు నందుఁ గృతస్నానులయినవారికి [19]సర్వతీర్థ స్నానఫలం బగు [20]బదరీవనంబునందు వసిష్ఠాశ్రమంబునం ద్రిరాత్రంబులు బదరీఫలభక్షణంబు సేసి పాపవిముక్తు లగుదు రేకరాత్రం బనుతీర్థంబున నేకరాత్రోపవాసంబు [21]సేసి బ్రహ్మలోకంబు వడయుదు రాదిత్యాశ్రమం బను[22]వనంబున నాదిత్యుం బూజించి యాదిత్యలోకగతులగుదురు [23]దధీచితీర్థంబు[24]నం [25]గన్యాశ్రమంబునందుఁ [26]ద్రిరాత్రంబు వసియించిన వారికి స్వర్గఫలం బగు.

269\. క. జలరుహాసంభవుఁ డాదిగఁ, గలవేల్పులు ఋషులు సిద్ధ[1]గరుడోరగులుఁ
నెలనెల సేవింతురు భూ, తలమున [2]సన్నిహాతి యనఁగఁ దగు తీర్థంబున్.

270\. వ. [1]సూర్యగ్రహణంబున దాని నాడిన[2]వారు శతాశ్వమేధఫలంబు వడయుదురు ధర్ముఁడు దపంబు చేసిన ధర్మతీర్థం బాడి ధర్మశీలు రగుదురు [3]జ్ఞానపావ

---

నగురు – కొన్ని ప్రతులు; తూర్పున నుండు కురు తీర్థంబును – కొన్ని ప్రతులలో లేదు; తూర్పున మరు తీర్థంబును – ల. 15. స్వర్గాకారంబను – గ. ధ. 16. పాప – అ. ఆ. జ. ఝ. 17. సరస్వతీపురంబు – గ. ద; సరస్వతీప్రవంతి – ఔ. 18. మడువను – ఈ. 19. సరస్వతీ – గ. ద. 20. బదరికా – ఝ. ల. 21. సేసిన ననేక రాత్రోపవాసఫలంబగు–ప. ఓ. 22. తీర్థం – కొన్ని ప్రతులు. 23. దధీచి – కొన్ని ప్రతులు; దధీచ – వా. 24. వవృద్ధ కన్యాశ్రమం – ఆ. ఇ. ఊ. ఔ. ట. 25. గణ్యాశ్రమంబునందు – ఈ. ఐ. ఘ. ద. శ. ష. 26. ద్రిరాత్రంబు చేసినవారికి – ఉ. ఊ. గ; ద్రిరాత్రోపవాసంబు చేసినవారికి – ఆ. ఇ. ఘ. చ. ఝ. ల.

269\. 1. గణములు వెలయన్ – గ. 2. సన్నిహితమనగ – ఇ. ఈ. ఐ. ఘ. త. శ. ష; సన్నిహిత యనగ – కొన్ని ప్రతులు.

270\. 1. సోమ సూర్యగ్రహణంబుల – ఈ. ఏ. ఐ. ఓ. గ. త. శ. ష; సూర్య చంద్ర గ్రహణంబుల – ల. 2. వారు – కొన్ని ప్రతులలో లేదు. 3. కర పావనం

నంబును సౌగంధి[4]కంబు నను[5]తీర్థంబుల నాడినం జూచిన సర్వపాపవిముక్తు లగుదురు [6]దేవశ్రవ యనుసరస్వతీహ్రదంబు నందు వల్మీకంబున వెలువడు జలధార లాడి పితృతర్పణంబు సేసినవా రశ్వమేధఫలంబు వడయుదురు [7]సుగంధయు శత[8]కుంభయు బంచ[9]యజ్ఞయుఁ ద్రిశూల[10]ఖాతయు నను తీర్థంబు లాడి దుర్గతులవలనం బాయుదురు తొల్లి పార్వతి యొందేని శాకా[11]హారిణియై దివ్యసహస్రవర్షంబులు తపంబు సేసె నట్టి[12] శాకంభరీతీర్థం బాడి యొక్కదివసంబు [13]శాకాహారు లయినవారు పండ్రెండేండ్లు [14]శాకాహార తపంబు సలిపినవారిఫలంబు వడయుదురు సువర్ణాఖ్యం [15]బనుతీర్థంబున రుద్రుం బూజించి [16]రుద్రలోకగతు లగుదురు [17]ధూమావతి యనుతీర్థంబును [18]రథావర్తం బనుతీర్థంబును [19]ధార యను తీర్థంబు నాడి శోకవిముక్తు లగుదురు.

271. క. ధారుణి[1]లోపల స్వర్గ, ద్వారం బయి బుధుని సేవితం బగుగంగా
[2]ద్వారం బాడినధన్యులఁ, జేరును [3]శతకోటి తీర్థసేవాఫలముల్.

---

బును – పెక్కు ప్రతులు. 4. కవనంబును – కొన్ని ప్రతులు. 5. తీర్థంబుల నాడినం – కొన్ని ప్రతులలో లేదు. 6. దేవశ్రీయను – ప. ఓ; దేవస్రవన – ల; దేవశ్రయను – శ. 7. సుగంధి – శ. ప. కొన్ని ప్రతులు; సౌగంధిక – కొన్ని ప్రతులు. 8. కుంభి – కొన్ని ప్రతులు. 9. యజ్ఞంబును – పెక్కు ప్రతులు. 10. ఘాతయు – ల. శ. ప. పెక్కు ప్రతులు; పావని – జొ. 11. హారమై – ఐ. ఓ. గ. త. 12. శాకచర్యయను తీర్థంబాడి – అ. ఇ. ఝ. 13. శాకాహారంబు చేసినవారు – ఈ. ఐ. త. 14. శాకాహారవ్రతంబు – కొన్ని ప్రతులు; శాకాహారంబు చేసిన – కొన్ని ప్రతులు. 15. బున రుద్రుం – కొన్ని ప్రతులు. 16. రుద్రపూజ చేసినవారు విష్ణులోక – పెక్కు ప్రతులు. 17. ధూమవతి – కొన్ని ప్రతులు; రూపవతి – ప. ఓ; ధూమహారి – క. 18. రథవంతంబును – పెక్కు ప్రతులు. 19. దారయను – కొన్ని ప్రతులు.

271. 1. లోనను – శ. ష. స. శ. పెక్కు ప్రతులు; వివృత స్వర్గ – ఈ. ఐ త. 2. ద్వారమను దాని నాడిన – జొ. 3. దశ – అ. ఆ. ఉ

272\. వ. మఱియు [1]సప్తగంగాసంగమంబును [2]త్రిగంగాసంగమంబును శక్రావర్తంబును [3]గన[4]స్థలంబును గంగాసరస్వతీసంగమంబు [5]నాదిగాఁ గల పుణ్యతీర్థంబుల నాడి పుణ్యలోకంబులు వడయుదురు భద్రకర్ణేశ్వరంబున రుద్రపూజయు నరుంధతీవటంబును సింధు[6]ప్రభవంబును యమునాప్ర[7]భవంబు నను[8]పుణ్య తీర్థంబుల సేవయు [9]సర్వసిద్ధికరంబులు [10]వేదిక యనుతీర్థంబును ఋషి[11]కుల్య యనుతీర్థంబును కృత్తికా[12]మఘతీర్థంబులును విద్యాతీర్థంబు[13]ను [14]వేతసిక యనుతీర్థంబునుం జూచి దురితంబులవలనం దొలంగుదురు [15]బ్రహ్మతీర్థం బాడి పద్మ[16]వర్ణ[17]యానంబుల బ్రహ్మలోకగతు లగుదురు.

273\. చ. సురుచిర[1]కీర్తి నైమిశముఁ జూచిన మాత్రన పాయుఁ బాప మ
చ్చెరువుగ నందు మాసము వసించి యనంతఫలంబు లొందఁ గాం
తురు బహుతీర్థసేవనముతోడ సమానము నైమిశంబు నం
దరుదుగ నొక్కనాఁడు [2]శుచియై యుపవాసము సేయఁ గాంచినన్.

274\. వ. మఱియు [1]గంగోద్భేదతీర్థంబు [2]నిందీవరతీర్థంబు గంగాద్వారంబు దిశాపతి తీర్థంబు లనియెడుతీర్థంబుల నాడి వాజపేయఫలంబుఁ బడయుదురు

---

272\. 1. శరభంగంబును - కొన్ని ప్రతులు; సప్తసాగరంబును - ఆ. ఊ. గ. ఘ. ఝ. ద. ల. శ. ష; శరభంగంబును సప్తసాగరంబును త్రిసంగంబును - క; శరభంగంబును చక్రవంతంబును - ఉ. ల. 2. త్రి గంగయు - కొన్ని ప్రతులు; త్రి భంగంబును భద్రావర్తంబును - ఎ. ల. కన్యాతీర్థంబును-పెక్కు ప్రతులు. 3. గగన జలంబు- శ. ష. 4. కనక కమలంబు - ఉ; గాన బిలంబు - ఈ. త; కపిలంబు - చ; జలం బును - శ. ష. 5. ను నాది పుణ్య - పెక్కు ప్రతులు. 6. ప్రభవయు - ష. కొన్ని ప్రతులు; ప్రభావయు - శ. కొన్ని ప్రతులు. 7. భావంబుల - కొన్ని ప్రతులు; భవయు - కొన్ని ప్రతులు. 8. పుణ్య - పెక్కు ప్రతులలో లేదు. 9. సర్వ - కొన్ని ప్రతులలో లేదు. 10. వేది - పెక్కు ప్రతులు; వేది యను తీర్థం బును విద్యా - ల. 11. కుల్యంబును కృత్తికా—పెక్కు ప్రతులు. 12. మాఘ— ఐ. ద. శ. ష; మఘవ — ఇ. ఎ. ఏ. ఓ; కీర్తిమంబను - ఔ. 13. ను మహాలయ తీర్థంబును-ల. కొన్ని ప్రతులు; ను మహాకాళంబను తీర్థంబు ను — కొన్ని ప్రతులు. 14. వేదశిఖయునుం—పెక్కు ప్రతులు; వేద శిఖ—ఐ. ఒ; రుచియునుం జూచి—గ. దవ శిఖయునుం జూచి-ఠ. 15. బ్రాహ్మణ తీర్థం—కొన్ని ప్రతులు. 16. వర్ణ — శ. ష; పత్ర — అ. 17. యానంబున—కొన్ని ప్రతులు.
273\. 1. శక్తి - ద. 2. శుచులై - కొన్నిప్రతులు; శుచివై - ఆ. గ.
274\. 1. గంగోద్భవం బాడియు — అ. ఆ. ఔ. క. జ. ల; బ్రహ్మద్వారం బాడియు — ఈ. ఎ. ఏ. ఐ. ఓ. త; గంగాద్వారంబాడియు — ఉ. ఒ ఘ. చ; నందోద్భవ—వా; నందోద్భవం బాడి — గ. మూలమున గంగోద్భేద మనియే కలదు. చిత్రశాల ప్రతి- 141 - వనపర్వ. 2. ధీరవతియను తీర్థంబాడి వాజపేయ - ల. కొన్ని ప్రతులు.

బాహుద యనుతీర్థం బాడిన ననేక [3]సత్రయాగఫలం[4]బగు నెంరేని రాముండు స్వర్గగతుం డయ్యె నట్టి సరయూ[5]ప్రదేశంబున [6]గోప్రదానం బాడియు దేవతలకు ఋషులకు యజ్ఞభూమి[7]యయినతీరంబుల గల గోమతి నాడియు నశ్వమేధఫలంబు వడయుదురు [8]కోటితీర్థంబునం గుమారు నర్చించియు వారణాసియందు [9]రుద్రునర్చించియుఁ [10]గపిలా[11]హ్రదంబాడియు రాజసూయ ఫలప్రాప్తు లగుదురు మార్కండేయతీర్థం[12]బయిన గంగాగోమతీసంగమం బాడియు బ్రహ్మ[13]కల్పితం బయిన యూపంబుఁ బ్రదక్షిణంబు సేసియు వాజపేయఫలంబు వడయుదురు.

275. సీ. పలువురఁ గొడుకులఁ బడయంగ[1]వలయు నందొక్కరుండయినను నోపి గయకు నరుగునో యనియును నశ్వమేధంబొప్పఁ జేయునోయనియును [2]శ్వేతమైన యాఁబోతు విడుచునో యనియును గోరుదు [3]రనవద్యులైన గృహస్థు లట్టి గయకేఁగి యుభయ[4]పక్షములు వసించినఁగడుఁ బుణ్యు లుభయపక్షములవారి

ఆ. నుద్ధరింతు రందయోగిఁ బిండమిడిన వా,రనఘ పితృదయను గృతార్థులగుదు రందు ఫల్గు[5]తీర్థమాడినవారికిఁ, బరమసిద్ధితో [6]శుభంబు పెరుఁగు.

276. వ. మఱి [1]యక్షిణీతీర్థంబునందు జలపానంబు సేసి బ్రహ్మహత్యాదిదోష విముక్తులగుదురు [2]మణినాగం బను తీర్థం[3]బాడిన వారికి నాశీవిషవిషంబు

---

3. గోసహస్రదాన — ఈ. ఐ. ఔ. త. ద; సహస్రయాగ — కొన్ని ప్రతులు. 4. బువడయుదురు — కొన్ని ప్రతులు. 5. నదియును — ల. కొన్ని ప్రతులు. 6. గో హ్రదంబు — ల; గో ప్రసాదఁబును — ఐ. త; గో ప్రచారం బాడియు — అ. ఆ. పీ; గో ప్రవారం — క. 7. యైన గోమతీ తీర్థం బాడియు — ఎ. ఏ. ఐ. ఓ; యైన తీర్థంబుగల — ఆ. ఘ. శ; యైన గో తీర్థం బాడియు — ఈ. త. 8. చంద్ర తీర్థం బాడియుఁ గుమారు — కొన్ని ప్రతులు; భర్తృ తీర్థంబున — అ. ఆ. ఈ. ఐ; క్షుద్రతీర్థం — గ. ఘ. ఝ. ద. శ. ష; అత్రితీర్థం — చ. 9. మహాదేవు — ఏ. ఓ. 10. కపిల — పెక్కు ప్రతులు. 11. హృదయం — చ. 12. బాడియు — అ.ఆ. ఈ. ఎ. గ. ఝ. ద. 13. కల్పంబైన — గ. ద.

275. 1. గోరుదు రొక్కరుండైన - ఘ. పీ. శ. ష. 2. శిలమైన - ఔ. 3. రనవద్యులైన - చ. 4. పక్షంబులు వసియించు కడు - ఐ. ఈ; పక్షంబులు వసియింప - గ. ద. 5. నంబునం దాడు వారికి - శ. ష. 6. దపంబు - ఐ.

276. 1. యక్షయ - ఝ; యునక్షయ - ఎ. ఓ. ఔ. 2. తామ్రమ కౌశికి సంగమంబాడి త్రిరాత్రోపవాసంబు జేసిన శాప విముక్తులగుదురు-ఇ; గౌరీ శిఖరకుండం బాడినను నందినీ కూపంబాడినను బురుషమేధ ఫలంబగు - ఉ. ఘ. చ. 3. బాడిన నాశీవిష -

లొందవు గౌతమవనంబునం దహల్యాహ్రదం బాడి [4]యుదపానం బనుతీర్థం బాడియు నశ్వమేధఫలంబుఁ బడయుదురు [5]రాజర్షి జనక[6]కూపంబాడి విష్ణులోకప్రాప్తులగుదురు [7]కంపనయు మహానదియు ననుతీర్థంబుల [8]నాడినవారు పౌండరీకఫలంబు [9]నొందుదురు [10]దేవపుష్కరిణిని మహేశ్వర[11]ధారను [12]మహేశ్వరపదంబున నాడిన నశ్వమేధఫలంబు వడయుదురు తొల్లి కూర్మ [13]రూపుండయిన యసురచేతం గోటితీర్థంబు లపహృతంబులయిన వానిఁ దెచ్చి [14]విష్ణుండెందేని నిలిపె నట్టి [15]మహేశ్వరపథంబను తీర్థంబాడియు [16]విష్ణుస్థానంబయిన [17]సాలగ్రామం బనుతీర్థంబాడి విష్ణునర్చించియు నందు సన్నిహితచతుస్సముద్రం బయిన [18]కూపంబు నాడియు విష్ణులోకగతులగుదురు భరతాశ్రమంబునఁ [19]జంపకారణ్యంబున దేవి[20]సహితు నీశ్వరుం బూజించి [21]మిత్రావరుణ[22]లోకంబు వడయుదురు కన్యా[23]సంవేద్యం బను తీర్థంబునఁ గన్యాదానంబు సేసి[24] యక్షయఫలప్రాప్తులగుదురు [25]దేవకూటం

---

ట. క. 4. యుపవనంబను - ఆ; యుపవానంబను - ఇ; యు నుదపానంబును - ఎ. ఏ. క. 5. రాజర్షియైన - కొన్ని ప్రతులు. 6. తీర్థంబాడి - ఊ ఔ. శ. ష. 7, కంపనయను తీర్థంబాడి పౌండరీక - ల. 8. నాడి పౌండరీక - పెక్కు ప్రతులు. 9. వడయుదురు - కొన్ని ప్రతులు. 10. దేవపుష్కరంబును మహేశ్వరధారయు మానసపదంబును నాడి - ల; దేవపుష్కరంబను మనుష్య ధారను - ఱ. 11. ద్వారంబును - ఐ. త. 12. మానుషపదంబున - ఆ. ఈ. ఎ. ఐ. ఔ. క. జ. ఝ. త. శ. ష; మానసపథంబు - ఇ. ఖ. చ. 13. రూపుండై - పెక్కు ప్రతులు; రూపంబై - అ. ఆ. ఔ. ఎ. చ. జ ఝ. 14. విష్ణుదేవు డెందేని - పెక్కు ప్రతులు. 15. మహేశ్వర తీర్థంబాడి - ల. కొన్ని ప్రతులు. 16. విష్ణులోకప్రాప్తులగుదురు విష్ణుస్థానంబైన - ఈ. ఏ. ఐ. ఓ. గ. 17. సాలగ్రామంబున విష్ణు నర్చించి - ఆ. ఇ. ఎ. ఏ. ఒ. ఓ. ఖ. జ. ఝ. ద. ల. 18. కూపం బాడియు - పెక్కు ప్రతులు; కూపంబున నాడియు - వి. శ. వ. 19. జంపకంబున - క. 20. సహితుండైన యీశ్వరు - అ. ఆ. ఎ. ఔ. ఝ. 21. మైత్రా - ఉ. ఔ. గ. ల; మిత్ర - ఈ. ఐ. త. 22. లోకంబు - వా. వీ. శ. కొన్ని ప్రతులు. 23. సందేశంబును - ఉ. వా. శ. ష; సంబోధ్యంబును - వీ. శ; సంవేద్యంబను - ల.

"కన్యాసంవేద్య మాసాద్య నియతో నియతాశనః
మనోః ప్రజాపతే ర్లోకానాప్నోతి భరతర్షభ" 3–82–117.

24. యప్పుణ్య తీర్థ స్నానంబున - అ. ఆ. ఎ. 25. దేవకూటం సమాసాద్య బ్రహ్మర్షిగణసేవితమ్. అశ్వమేధ మవాప్నోతి కులంచైవ సముద్ధరేత్. 3–82–122.

బనుతీర్థం[26]బాడి బ్రహ్మలోకంబుఁ బడయుదు రెందేని విశ్వామిత్రుండు సిద్ధింబొందె నట్టి కౌశిక[27]హ్రదంబాడియుఁ గుమారవీరాశ్రమంబున నొక్క మాసంబు [28]వసియించియు నశ్వమేధఫలంబు [29]వడయుదు రగ్నిధారయుఁ [30]బితామహసరంబునం బుట్టిన కుమారధారయు నాడి త్రిరాత్రోపవాసంబు సేసినవారు బ్రహ్మహత్యాది [31]దోషవిముక్తులగుదురు [32]గౌరి[33]శిఖరకుండం బాడిన [34]నందినీకూపంబాడిన నశ్వమేధ[35]ఫలంబగుఁ [36]గాళికా[37]కౌశికా సంగమంబునందుఁ ద్రిరాత్రోపవాసంబు సేసినవారు సర్వపాప విముక్తు లగుదు [38]రూర్వశీతీర్థం బాడిన సర్వపూజార్హు లగుదురు [39]గోకర్ణంబను తీర్థం బాడి జాతి[40]స్మరణంబు వడయుదురు [41]సరస్వతీ[42]తీర్థస్నాతులయి వృషభ [43]ద్వీపంబునం [44]గుమారుఁ బూజించి దేవవిమానగతులగుదురు నందయు నౌ[45]లకమును గరతోయంబును గంగాసాగరసంగమంబు ననుతీర్థంబులనాడి

---

వేదకూటము, దేవకూటము అనియు పాఠము లు కలవు. 26. బాడువారు – ల. 27. హ్రదంబున నాడి – ఖ. ఝ; హ్రదంబునం దాడి – ఊ. ఒ. చ. జ. 28. వసియించినవారు – క; వసించిన – అ. ఆ. ఒ. ఝ. 29. వడయుదురు గోకర్ణ కౌశికాసంగమం బాడి త్రిరాత్రోపవాసంబు చేసిన సర్వపాపవిముక్తులగు దురు – ఓ. 30. బితామహేశ్వరంబునం – కొన్ని ప్రతులు. పితామహసరో గత్వా శైలరాజప్రతిష్ఠితమ్. 3–82–128. 31. పాపంబులవలన – అ. ఆ. ఎ. ఝ. ద; పాతక – స.

32. కం॥ సకలదురితములు వాయుదు
రకలంకయశస్కులగుదు రత్యుత్తమవ
ర్తకు లగుదురు సజ్జనగుణ
నికరంబుల కెలయుదురు సునిశ్చయమతులై.

స, గ, ప్రతులలో నీ పద్యము కలదు. తరువాత గౌరి......... 33. శీకర – ల. 34. పద్మినీ శిఖర – ఒ. 35. ఫలంబు వడయుదురు – ఆ. ఒ. క. 36. కాళి కారుణ సంగమంబు – క. 37. కాశికా......విముక్తులగుదురు – పెక్కు ప్రతులలో లేదు. 38. రు పార్వతీ తీర్థం – అ. 39. గోకార్ముకంబను – అ. పి. చ. ఝ; గోముఖంబను – కొన్ని ప్రతులు. 40. స్మరణత్వంబు – పెక్కు ప్రతులు. 41. గోకర్ణకౌశికాసంగమం బాడి త్రిరాత్రోపవాసంబు చేసిన సర్వపాపముక్తు లగు దురు – ఈ. ఐ. ఒ. త; సారస్వత – గ. ద; సర్వ తీర్థ – శ. ప. 42. తీర్థ – పెక్కు ప్రతులలో లేదు. 43. తీర్థంబు – ఔ. 44. కుమారు నర్చించి – కొన్ని ప్రతులు 45. నందాలకయు – వా. వి. శ. ఔద్దాలకం మహారాజ తీర్థం ముని

[46]శతాశ్వమేధఫలంబు వడయుదురు [47]శోణానర్మదాప్రభవంబును బదరీతీర్థంబును నాడి యాయుష్మంతులగుదురు మహేంద్రంబు [48]రామతీర్థంబును మతంగకేదారంబును వంశగుల్మంబు ననుతీర్థంబుల నాడి యశ్వమేధఫలంబుఁ బడయుదురు.

277\. తే. పరమమైనతీర్థంబు శ్రీపర్వతంబు, నందు దేవహ్రదం బాడి యాదిదేవు నీశు [1]నర్చించి వడయుదు రిష్టఫలము, [2]నశ్వమేధఫలంబును నవనిజనులు.

278\. వ. తొల్లి శతక్రతుండు నూఱుక్రతువులు సేయుటంజేసి పవిత్రంబయిన కృష్ణవేణియందు దేవహ్రదం బాడిన సర్వపాపవినాశనంబగుఁ [1]బాండ్యపర్వతంబునం గావేరీతీర్థంబును దుంగభద్రయు సముద్రతీరంబును గన్యాతీర్థంబును నాడి యశ్వమేధఫలంబు వడయుదురు గాయత్రీస్థానంబునం ద్రిరాత్రంబు గాయత్రీ జపంబుఁ [2]జేసినవారికి జన్మదుఃఖంబులు లేవు పెన్నయను మహానది నాడిన మయూరహంసవిమానగతులగుదురు గోదావరీస్నానంబు [3]సేసిన దశాశ్వమేధఫలంబు వడయుదురు పయోష్ణియు దండకారణ్యంబును శరభంగాశ్రమంబును [4]శుక్రాశ్రమంబును జమదగ్ని సేవితంబయిన [5]శూర్పారకంబును స[6]ప్తగోదావరీతీర్థంబును నాడిన పుణ్యులు పుణ్యలోకప్రాప్తులగుదురు.

---

నిషేవితం. 3-82-100 శ్లో. 46. దశాశ్వమేధ - పెక్కు ప్రతులు. 47. శోణస్య నర్మదాయాశ్చ ప్రభవే. 3-83-9. శ్లో. 48. అమరావతీ తీర్థంబాడియు - అ ఆ. ఎ. ఝ. ద.

277\. 1. భజియించి - ఈ. ఐ. త. 2. లశ్వమేధ - ఐ. ల.

278\. 1. పాండుర, పాండు - అనియు పాఠములు. 2. జేసినవారు జన్మదుఃఖంబులం బొరయరు - ఇ. స. 3. సేసినవారు గోమేధాశ్వమేధఫలంబులు - ఇ. చ. ల; సేసినవారు గవాశ్వమేధఫలంబులు - అ. ఉ. ఊ. క. ఝ. ద. 4. శుక్రాశ్రమంబును జమదగ్ని - కొన్ని ప్రతులు; జమదగ్ని - వా. పీ. శ; శరభంగాశ్రమం గత్వా శుకస్య చ మహాత్మనః. 3-83-39 శ్లో. 5. శూర్పనఖం - కొన్ని ప్రతులు; శూర్పకరం - కొన్ని ప్రతులు. 6. గోదావరంబునాడి పుణ్యలోకప్రాప్తులగుదురు - కొన్ని ప్రతులు

279. సీ. అసురుల భయమున నడఁగిన వేదంబు లోంకార[1]పూర్వమై యుండ నాంగి
రసుఁ డుద్ధరించి సారస్వతప్రముఖులఁ జదివించె నెందేని శాశ్వతముగ
నమరనియుక్తుఁడై యజియించె నెందేని భృగుఁడెల్లవారికిఁ బేర్మి నట్టి
రమణీయతుంగకారణ్యంబు సూచినమాత్రన దురితకర్మంబు లెల్లఁ

తే. బాయుఁ [2]గాలంజరంబను పర్వతంబు, నందు దేవహ్రదంబాడి యభిమతములు
వడయుదురు [3]మేధికంబు నాఁబరగు తీర్థ, మాడి మేధాసమన్వితు
లగుదురెందు.

280. వ. మఱి చిత్రకూటంబున మందాకిని సేవించి [1]పితృస్థానంబునం గుమారుం
బూజించి [2]జ్యేష్ఠస్థానంబున రుద్రు నర్చించి రామనివాసం బైనశృంగిబేర
పురంబున గంగాస్నాతులయి గంగాధరునర్చించియు సర్వపాపవిముక్తు
లగుదురు.

281. క. యాగశతంబులకంటెఁ బ్ర,యాగనివాసము విశేషమని [1]మునులు మహా
యోగులు సిద్ధులు సాధ్యులు, నాగులు నందుండుదురు మనఃప్రియమెసఁగన్.

282. వ. అది ప్రజాపతి యజ్ఞవేది గావున నందు మూఁ డగ్నికుండంబు లెప్పుడుఁ
గానంబడు మఱి వేదంబులు యజ్ఞంబులు మూర్తిమంతంబులై యఱువది
కోట్లపదివేలు తీర్థంబులు సన్నిహితంబులై గంగాయమునాసంగమంబు
సేవించి యుండు నందుఁ గృతస్నానులైనవారు రాజసూయాశ్వమేధులయు
సత్యవాదులయుఁ జతుర్వేదాధ్యయనులయుఁ బుణ్య[1]లోకంబులు వడయు
దురు భోగవతియు వాసుకియు హంస[2]వ్రతంబు ననుతీర్థంబులనాడి దశాశ్వ
మేధఫలంబు వడయుదురు.

---

279. 1. రూపమైయుండ - ఊ. శ. ప. 2. గాలంజరంబను - పెక్కు ప్రతులు
గాలరథంబను - వా. తతః కాలంజరం గత్వా. 3-83-53. భం. 3. మేధావికం
సమాసాద్య. 3-83-52 భం; వాహికము నాగ బరగు దీర్థమాడి - ఘ. చ. శ.
ప. ప్రౌ. కారక - 20, సం.

280. 1. భర్తృస్థాన మనుత్తమం. 3-83-57 భం. 2. జ్యేష్ఠమాసంబున జంద్రస్థానం
బున రుద్రు - వా; జ్యేష్ఠమాసంబున రుద్రు - పీ. శ. ప్రదక్షిణ ముపావృత్య
జ్యేష్ఠస్థానం వ్రజేన్నరః. 3-83-59 భం.

281. 1. సురలు - పెక్కు ప్రతులు.

282. 1. లోకంబు - వా. పీ. శ. ప. శ. కొన్ని ప్రతులు. 2. వర్తనము - ఉ;
వంతంబు - ఎ. ఏ. ఔ. తత్ర హంసప్రపతనం తీర్థం. 3-83-82.

283. క. విదితముగఁ దీర్థ[1]కీర్తనఁ, జదివిన [2]ధన్యులకు వినిన సజ్జనులకు న
భ్యుదయ మగు సర్వతీర్థ [3]స,ముదయస్నాన బహుయాగముల ఫల[4]ములగున్.

284. చ. వ్రతములు లేనివారు నుపవాసపరాఙ్ముఖులైనవారు దు
ర్మతులు [1]విహీనశౌచులుఁ గ్రమంబునఁ దీర్థము లాడనోప రా
తతగుణశాలి వీ వఖిలధర్మవిదుండవు గావునన్ శుభ
స్థితిఁ జని తీర్థ[2]సేవనము సేయుము నీకు నభీష్టసిద్ధిగన్.

285. వ. అని సకలతీర్థ[1]కథనంబు సెప్పిన పులస్త్యువచనంబున భీష్ముండు దొల్లి యెల్ల తీర్థంబులు సేవించి కృతార్థుండయ్యె గావున నీవును దీర్థసేవ సేసి.

286. క. పూరు పురూరవులట్లు భ,గీరథ రఘుపతుల యట్లు కృత[1]కృత్యుఁడవై
ధారుణి రక్షింపుము వి,స్తార[2]గుణాధార ధీర ధర్మతనూజా.

287. వ. రోమశుం డనుదేవర్షి దేవలోకంబుననుండి నీకడకు వచ్చుఁ దదుపదేశంబున [1]ధౌమ్యానుమతుండవయి తీర్థసేవనఁ జేయు మని చెప్పి నారదుండరిగిన నజాతశత్రుండు ధౌమ్యుంజూచి యి ట్లనియె.

---

283. 1. సేవన – ఎ. ఆ. ఝ. 2. పుణ్యులకు – ఆ. ఊ. ఎ. ఝ. 3. సముదయ స్నానముల యాగముల – ఏ. ఓ. ఘ. ల. వీ. స; సముదయంబులయందు స్నాన ముల – ఊ. స. 4. మడరున్ – ఝ.

క॥ ఇది నిక్కువమని మనములఁ బదిలంబుగఁ దీర్థసేవ భక్తిఁ దలఁచినన్
విదితముగ దురితహారమగు సదమలసుజ్ఞాను లగుట సత్యము ధరణిన్.

క॥ సకలదురితముల వాయుదు, రకలంకమనస్కు లగుదు రార్యోత్తమవ
ర్తకులగుదురు సజ్జనగుణ, నికరంబుల వెలయుదురు సునిశ్చితమతులై.

వ్యా. ఇవి యేము పరిశీలించిన అన్నిప్రతులందును లేదు.

284. 1. వివేకదూరులు – ట. 2. సేవ దగ జేయుము......సిద్ధిగాన్ – స.

285. 1. కీర్తనంబు – కొన్ని ప్రతులు.

286. 1. పుణ్యుడవై – ల. స. కొన్ని ప్రతులు. 2. గుణోదార – ఒ. ఔ. జ. ప.

287. 1. ధౌమ్య సమేతుండవై – ఉ. ఘ; ధౌమ్య సహితుండవై – ల; ధౌమ్యాది విప్ర సహితుండవై – ఇ. క. ఝ.

288. చ. అలయక మాకు నందఱ కహర్నిశముం బ్రియకారి యైనయ
త్యలఘుపరాక్ర[1]మాన్వితు మహాభుజు నర్జును దివ్యసాయకం
బులు వడయంగ నొక్కరున పుచ్చితిఁ దద్దయు వేడ్క నెద్దియుం
[2]దలఁపక యిప్డు తద్విరహి[3]తమ్మగు కామ్యక మొప్ప [4]దయ్యెడిన్.

289. వ. అంబుదాగమనం బపేక్షించు చాతకంబులట్లు మనమందఱ మర్జునాగమ[1]నంబు ప్రతీక్షించుచున్నవారము వాఁడును దనపూనినకార్యంబు నిర్వహించి కాని నివృత్తుండు గాఁ డవశ్యంబును దివ్యాస్త్రంబులు [2]వడసి యాతనివచ్చు నంతకుఁ దీర్థసేవ సేయుదమనినఁ గరంబు లగ్గగు నట్లచేయుదమని.

*-: రోమశమహాముని ధర్మరాజునొద్దకు వచ్చుట :-*

సం. 3 - 89 - 1

290. ఉ. నాలుగుదిక్కులందును వినన్ విదితంబగుచున్న పుణ్యతీ
ర్థాలి తెఱంగెఱుంగఁగ మహాత్ముఁడు ధౌమ్యుఁ డజాతవైరి కం
దోలిన చెప్పుచున్నతటి నొప్పుగ రోమశుఁ డేఁగుదెంచెఁ దే
జోలలితుండు నిర్మలయశుం డగు ధర్మతనూజుపాలికిన్.

291 వ. ఇట్లు వచ్చిన మహాముని నతిభక్తి ననుజబ్రాహ్మణసహితుండై ధర్మజుండు పూజించి మునీంద్రా యెందుండివచ్చితి రని యడిగిన నాతనికి రోమశుం డి ట్లనియె.

292. తే. ఎల్లలోకంబులును జూచి యింద్రలోక,లోకనార్థినై యే నింద్రలోకమునకుఁ
బోయి సుర[1]రాజుచేఁ బ్రీతిఁ బూజితుండ,నై మహీనాథ యందు
నీ యనుజు ననఘు.

---

288. 1. మోన్నతు - పెక్కు ప్రతులు. 2. దలపన - వా. కొన్ని ప్రతులు; దలపగ - ఇ. ద. 3. తంబయి - కొన్నిప్రతులు. 4. దేమియన్ - శ. ప. కొన్ని ప్రతులు.

289. 1. నం బపేక్షించు- కొన్ని ప్రతులు. 2. వడసివచ్చు నాతనివచ్చు-కొన్ని ప్రతులు.

292. 1. గణనాథుతో బూజితుండ - గ. స; రాజుచేతను బూజితుండ - ఏ. ఝ.

293. ఉ. [1]ఈశున నీశుఁదొట్టి సురలెల్ల న[2]భీష్టవరంబు లిచ్చుటం
జేసి కృతార్థుఁడైన కురుసింహము [3]నూర్జితశౌర్యు నర్జునున్
[4]భాసురతేజు విశ్వపరిపాలకుఁడైన [5]మహేంద్రుతోడ నే
కాసనమెక్కి యున్న మహిమాస్పదు నింద్ర[6]తనూజుఁ జూచితిన్.

294. క. బలవంతులైన భీష్మాదుల నర్జునుఁడోర్చు [1]నూర్జితుండై మఱి పో
రులఁ గర్ణుండు పదాఱవ, కళకు సమానుండు గాఁడు గవ్వడితోడన్.

295. వ. అతని యున్నవిలాసంబు సూచి విస్మితుండనయిననాకు నింద్రుండు తత్ప్రభావంబుసెప్పి వీఁ డమృతసంభవంబయిన పాశుపతం బనుదివ్యాస్త్రంబుఁ బరమేశ్వరుచేతను నాచేతను యమవరుణకుబేరాదులచేతను దివ్యాయుధంబులఁ బడసె నితండు [1]మనుష్యుండుగాఁడు దివ్యపురుషుం డన్యులకళక్యం బయిన దేవకార్యంబు దీర్చి మసలక వచ్చు [2]నని మర్త్యలోకంబునకుం బోయి భ్రాతృసహితుం డయిన ధర్మరాజునకుం జెప్పుమని[3]న వచ్చితినని వెండియు నిట్లనియె.

296. క. నిరత[1]ముగఁ దీర్ఘసేవా,[2]పరులగు శాంతాత్మ[3]లకు దపస్వులకును దు
ష్కర మెద్దియులేదని చెచ్చెర ధర్మజుఁ దీర్థసేవ సేయింపు [4]మొగిన్.

297. క. అనిపనిచిన నమరేశ్వరు,[1]పనిఁ దత్స్వార్వ్యమునఁనుండి [2]పన్నుగ నిట యేఁ
జనుదెంచితి నీకార్యము, ధనంజయున [3]కభిమతంబు ధరణీనాథా.

---

293. 1. ఈశుని దొట్టినట్టి సుర – ఒ; ఈశుని దొట్టిదేవవరు – ల. 2. నభీష్టములోలి నిచ్చుటం – ఊ. 3. నర్జును భూరిశౌర్యునిన్ – ఔ. 4 భాసిత – ఝ. 5. సురేంద్రు – ఘ. 6. సమాను – కొన్ని ప్రతులు.

294. 1. న విజితుండై – ల. శ. పెక్కు ప్రతులు; నవజింతుండై యని లోపల – గ. స; నపజింతుండై – స. శ.

295. 1. మనుష్యుండు గాడు – పెక్కు ప్రతులలో లేదు. 2. నీవు మర్త్యంబునకుం బోయి – పెక్కు ప్రతులు. 3. నన్ను నియోగించెనని వెండియు – ఖ; వెండియు నిట్లనియె – కొన్ని ప్రతులు; నన్ను సమర్పించి వెండియు – కొన్ని ప్రతులు.

296. 1. మును – ల. కొన్ని ప్రతులు. 2. పరులకు – ల. కొన్ని ప్రతులు. 3. లైన పావనులకు దుష్కర – ఉ. ఔ. 4. మిలన్ – ల. స. పెక్కు ప్రతులు.

297. 1. పనుపున స్వర్గంబునుండి – చ; పని విని తత్స్వార్వ్యగతిని – ఈ. ఐ. త. 2. పని వడి యిట యే – ఒ; పన్నుగనిట్లే – కొన్ని ప్రతులు. 3. కనుమతంబు – అ. క. గ. జ. ల; కనుమతమ్ము – ఉ. ఓ. ఘ. చ. ఝ. ద.

298. క. [1]అనవద్యతీర్థసేవన,మును [2]గపిలాస్వర్ణదానములు నుగ్రతపం
బులు జేయనివారికిఁ బో,లునె [3]పడయఁగఁ బేర్మి నుభయలోకసుఖంబుల్.

299. వ. ఏను దొల్లి [1]భూమింగల తీర్థంబులెల్ల [2]నినుమారు సూచితి నిప్పు డింద్రు నియోగంబున నీతోడనవచ్చి యఖిలతీర్థసేవ సేసెద ననిన [3]ధర్మజుం డతని కిట్లనియె.

300. ఉ. నన్నుఁదలంచి తీర్థ[1]గమనం బొనరింపఁగఁ బంచె నట్టె వి
ద్వన్నుత దేవవల్లభుఁడు దానఁ గృతార్థుఁడనైతి [2]దానిపై
నిన్ను సహాయుఁగాఁ బడసి నెమ్మి[3]నశేషవిశేషతీర్థముల్
పన్నుగఁజూడఁ గాంచి[4]కడుభవ్యుఁడనైతి [5]మునీంద్ర నీదయన్.

301. ఆ. విజయుకుశలవార్త [1]వేడుక నీచేత, [2]వినినయంతకంటె విస్తరిల్లె
హృదయ[3]సంప్రమోద మీరెంట నాకంచుఁ, దద్ద సంతసిల్లె ధర్మసుతుఁడు.

302. వ. మునీంద్రా యేను[1]దొల్లియు నారదధౌమ్యుల[2]వచనంబులం దీర్థ[3]గమనోన్ముఖుండనయి యున్నవాఁడ నిప్పుడు భవన్ని[4]దేశంబునం దీర్థసేవసేసి [5]కృతార్థుండ నగుదునని కృతనిశ్చయుండై భిక్షా[6]భుజులయిన బ్రాహ్మణు

---

298. 1. అనవరత — ఈ. ఐ. చ. త. ద. 2. గపిల — పెక్కు ప్రతులు. 3. పడయం గాను నిఖిల — గ.

299. 1. భూవలయంబునం గల — కొన్ని ప్రతులు. 2. నేనూరుమారులు — ఇ. ఉ. ఔ. 3. ధర్మరా జిట్లనియె — పెక్కు ప్రతులు.

300. 1. భజనం — ఈ. ఐ. త. 2. దానికై—కొన్ని ప్రతులు. 3. యెలర్ప నశేష తీర్థముల్ — గ. ల; దలిర్ప నశేషతీర్థముల్ — ఘ. 4. కడు భవ్యుడనైతి — ల. స. పెక్కు ప్రతులు; తి సభాగ్యుడనైతి—వా. 5. మహామునీశ్వరా—స. శ. పెక్కుప్రతులు.

301. 1. వేడ్కతో — పెక్కు ప్రతులు. 2. విన్నయంత కంటె — గ. ద. 3. సాంద్ర మోద — ఖ. ట.

302. 1. మున్ను నారద — కొన్ని ప్రతులు. 2. వచన ప్రకారంబులం—కొన్ని ప్రతులు. 3. గమనోత్సుకుండ — కొన్ని ప్రతులు; భజనోత్సుకుండ — ఈ. ఐ. త. 4. మిత్తంబునం — చ. శ. ష; ద్దేశంబునం — కొన్ని ప్రతులు. 5. కృతకృత్యుండ — కొన్ని ప్రతులు. 6. భోజను — ఘ. శ. ష; బుభుక్షులైన — ఇ. ఉ. ఔ. గ. ద.

లను యతులను రోమశువచనంబున నివర్తించి ధౌమ్య[7]పురస్కృతకతిపయ బ్రాహ్మణులతో [8]ననుజులుం దానును గృష్ణా[9]సహితుండయి కామ్యక వనంబున మూఁడు[10]దినంబు[11]లు వసియించి మార్గశీర్షమాసావ[12]సానంబునం దీర్థసేవార్థంబు గృతప్రస్థానుండయిన యుధిష్ఠిరునకు బ్రాహ్మణు లిట్లనిరి.

303. ఉ. నీయనుజుల్ ధనుర్ధరు లనింద్యచరిత్రులు దీర్ఘతీక్ష్ణకౌ
క్షేయ[1]కపాణు లత్య[2]మలకీర్తులు [3]గావఁగ రోమశుండు దే
జోయుతుఁ డెల్లతీర్థములుఁ జూపఁగఁ దీర్థము లాడువేడ్క ల
క్ష్మ్మీ[4]యుత యిప్డు నిన్ననుగమింపఁగఁ గంటిమి పుణ్యసంపదన్.

304. వ. రాక్షస పిశా[1]చశ్వాపదంబుల కారణంబున నడవులలో నేకతంబయరిగి తీర్థ సేవ సేయ మాయట్టివారికి నశక్యంబు గావున మీ[2]తోడ వచ్చెద మని బ్రాహ్మణులు ధర్మరాజుచేత ననుజ్ఞాతులై రంత.

305. క. పారాశర్యుఁడుఁ బర్వత,నారదులును బాండురాజనందనుల [1]గుణో
దారుల ననఘులఁ [2]దీర్థ,ప్రారంభులఁ గానవచ్చి [3]పరమప్రీతిన్.

306. క. వారలచేఁ బూజితులై, భూరితపోధనులు లోకపూజ్యులు ధర్మ
ప్రారంభనిత్యమతు[1]లకు, వారల కిట్లనిరి సత్యవచనులు గరుణన్.

---

7. పురస్సర కతిపయ – ల. కొన్ని ప్రతులు. 8. గమనోత్సుకుండై యను – వ. 9. సహితుండయి — ఈ. ఐ. త; సహితులయి — వా. పీ. శ. ష. మున్నగు ప్రతులు. 10. దివసంబు — పెక్కు ప్రతులు. 11. లుపవసించి — ఏ. చ. జ. ల. స. 12. సాన దినంబునం — ఒ. ఖ. స; సాన దివసంబునం — అ. ఆ. ఝ; సాన సమయంబున — పీ. శ. ష.

303. 1. కృపాణు – ల. పెక్కు ప్రతులు. 2. లఘు – కొన్ని ప్రతులు. 3. గావున – శ; కొన్ని ప్రతులు. 4. యుతు నిన్ను నేమనగ – ఔ. గ. ద.

304. 1; చాస్పదంబులగు – కొన్ని ప్రతులు. 2 తోడన – ల. పెక్కు ప్రతులు.

305. 1. గుణాధారుం – అ. ఇ. ఊ. ఘ. ఝ. ద; గుణోద్ధారుల – స. 2 దీర్ఘకృతారంభుల – ల. స. కొన్ని ప్రతులు. 3. రధికప్రీతిన్ – కొన్ని ప్రతులు; యధిక ప్రీతిన్ – ల. స.

306. 1. లగు వారికి నిట్లనిరి – ఘ. జ; లకు వారికి నిట్లనిరి – అ. ఏ. ఒ. చ.

307. వ. శారీరనియమంబులు మానుషవ్రతంబు లనంబడు మనోబుద్ధిశౌచంబులు దేవవ్రతంబు లనంబడు నట్టి[1]సౌమ్యవ్రతవిశేషంబులు సలుపుచు ఋజుమార్గు[2]లరై [3]తీర్థంబులు సేవించునది [4]తీర్థాభిగమనంబున మహాభిష నాభాగ [5]భరత భగీరథ ముచుకుంద [6]మాంధాతృ సగర[7]సార్వభౌమాష్టకరోమపాదుల యట్ల శత్రుజయంబును సర్వ[8]లోకసుఖంబులు బడయుదు రని[9]చెప్పి మునివరులు [10]మువ్వు రరిగి రంత నజాతశత్రుండు రోమశున కిట్లనియె.

308. క. ధరణి నధార్మికు[1]లగు కా,పురుషుల కభివర్ధనంబుఁ బుణ్యచరిత్రం
బరగెడు [2]ధార్మికులకు దు,ర్ధర[3]మగు నవివర్ధనంబుఁ దగునె మునీంద్రా.

309. వ. మఱియు న[1]చేతనంబు[2]లయ్యును గిరిసరిత్సరోవరంబులు పుణ్యతీర్థంబులై [3]జగత్పావనంబులై జనులకు దురితాప[4]హారణంబు లయిన కారణం బేమియని యడిగిన నతనికి రోమశుం డిట్లనియె.

*-: రోమశుండు ధర్మరాజునకు ధర్మవిశేషంబులు సెప్పుట :-*

సం. 3 - 92 - 1

310. చ. వసుధ నధర్మవర్తులగు వారల [1]వర్ధన మెన్నఁడుఁ సమం
జసమయి [2]నిల్వనేరదు భృశంబుగ నాశమువొందు దుర్మద
వ్యసను లధర్మవర్తనఁ[3]బ్రవర్ధితులయ్యును [4]నేము చూడ రా
క్షసులును దైత్యదానవులుఁ గ్రాఁగరె [5]తొల్లి సహస్రసంఖ్యలన్.

---

307. 1. సమ్యగ్వ్రత - ఇ. ఊ. ఒ. చ. ల. 2. లై - పెక్కు ప్రతులు. 3. తీర్థ సేవ సేయునది - కొన్ని ప్రతులు. 4. తీర్థగమనంబున - కొన్ని ప్రతులు. 5. భరత - కొన్ని ప్రతులలో లేదు. 6. మన్వత్రిమాంధాతృ - అ. ఆ. ఇ. ఝ. 7. భీష్మసార్వ - ఎ. ల. 8. లోకంబులు - కొన్ని ప్రతులు. 9. చెప్పి - కొన్ని ప్రతులలో లేదు. 10. మువ్వురు నరిగినంత - కొన్ని ప్రతులు.

308. 1. లకు - ల. 2. సజ్జనులకు - కొన్ని ప్రతులు. 3. తరమగునాశనంబు - ఇ; మగునతికృపణవృత్తి - అ. ఆ.

309. 1. చైతన్యంబు - పెక్కు ప్రతులు. 2. లైన - ఇ. ల. 3. జగత్పావనంబులై - కొన్ని ప్రతులలో లేదు. 4. హారణంబు - ఎ. ఏ. ఒ. ల; హంబు - ఊ. ఔ. చ; హరంబు - ఘ. త; హారంబు - వా. వీ. కొన్ని ప్రతులు.

310. 1. వర్తన - స. పెక్కు ప్రతులు. 2. చెల్లనేకడు - ఉ. 3. ప్రవర్ధను - కొన్ని ప్రతులు; ప్రసిద్ధులునైనను - ఒ. 4. నేమి - ఈత; నేమ - జ. ల. శ. ష. 5. నాడు - ఖ.

811. క. దేవతలు ధర్మ[1]వర్తులు, గావున నభివృద్ధిఁబొంది ఘన[2]మగు నిత్య
శ్రీవిభవాన్వితులయి ధర, ణీవల్లభ యున్నవారు నిరుపమ[3]శక్తిన్.

812. క. ధర్మసుత ధార్తరాష్ట్రు ల, [1]ధార్మికులై పెఱిఁగి రేనిఁ దడయక విధిచే
నిర్మూలితులగుదురు దు, ష్కర్మంబున నసురులట్ల కడు నస్థిరులై.

813. వ. అదియెట్లనిన నధర్మ[1]వర్తులయందు దర్పంబుపుట్టు దర్పంబువలన మానంబు పుట్టు మానంబువలనఁ గ్రోధంబుపుట్టుఁ గ్రోధంబువలనంజేసి లజ్జయు వృత్తంబునుం జెడు [2]నష్టలజ్జావృత్తు లయినవారి నుపశమంబును లక్ష్మియు విడుచు.

814. క. మీ రమరసదృశులరు ధ, ర్మారంభవిశిష్టమతుల రగుటను [1]సుచిర
[2]శ్రీరమ్యులగుదు రాజి జి, తారాతుల రగుదు[3]రుద్ధతాహవములలోన్.

815. వ. ధర్మ[1]వర్తులైన దేవతలు ఋషులు నాశ్రయించుటంజేసి తీర్థంబులు పవిత్రంబులై సర్వకామప్రదంబులై వర్తిల్లుచుండుఁ దీర్థ[2]సేవను గ్రతువులను [3]దానంబులను బ్రాహ్మణులదీవనలను జనులు సర్వదుఃఖవిముక్తులయి శ్రేయఃప్రాప్తు లగుదు రనిచెప్పిన నమ్మునివరువలన నొండు ధర్మ[4]స్థితులు వించుఁ బాండవు లరిగి నైమిశంబు నశ్వతీర్థంబును [5]గంగాఘోషంబును గన్యాతీర్థంబును గోమతియును బాహుదయును [6]మహానదియును దేవయజనం బయిన ప్రయాగయు గంగాయమునాసంగమంబును నాడి యందు బ్రాహ్మణులకు గోహిరణ్యదానంబులు సేసి ప్రయాగం గొన్నిదినంబులుండి

---

811. 1. వంతులు – ఇ. 2. ముగ – శ$_{2}$. పెక్కు ప్రతులు 3. కీర్తిన్ – అ ఉ. ఊ.

812. 1. ధర్మవిధం బెరిగి – ఖ; ధార్మికులై పరగి – ఘ; ధార్మికులై పెరిగిరింద – ఒ.

813. 1. వంతుల – ప. 2. లజ్జానివృత్తు–స. శ$_{1}$.

814. 1. పిర – కొన్ని ప్రతులు. 2. శ్రీరమ్య – స. శ. పెక్కు ప్రతులు; శ్రీరమ్య లగుదురువిజి – ఎ. ఏ. ఐ. ఓ. స. శ; జ్మా – వా. 3. రుద్గతాహవ – అ. చ.

815. 1. వంతులైన – కొన్ని ప్రతులు; వర్తనులైన – గ. ఘ. పి. శ. ష. 2. సేవలను – పెక్కు ప్రతులు. 3. దానంబులను – కొన్ని ప్రతులలో లేదు. 4. కథలు – ఇ. ఉ. ఊ. ఘ. ల. స. 5. గౌరీతీర్థంబును గన్యా – ఇ. ఝ. ద. ల; నాగకన్యా – కొన్ని ప్రతులు. 6. రేవయను మహానది – ల.

[7]వేదవిదులయిన బ్రాహ్మణులవలన వేదార్థంబు లెఱుంగుచుఁ జని యనేక పుణ్యనదీసముద్భవంబయిన గయపర్వతంబును రామసరంబును బ్రహ్మసరంబును వైవస్వతతీర్థంబునుం జూచి గయయందు నక్షయవటంబున [8]నార్షేయంబైన విధానంబునం జాతుర్మాస్య[9]క్రతువులుసేసి ఋషులవలనం బుణ్యకథలు వినుచున్న [10]యవసరంబున [11]శమఠుండను మహాముని ధర్మరాజునకిట్లనియె.

316. సీ. అనఘుం[1]డమూర్తరయః ప్రియపుత్త్రుండు గయుఁ డనురాజర్షి క్రతువు లిందు
[2]బ్రహ్మసరంబునఁ బరగంగ [3]మునుచేసె నాతని యజ్ఞంబులందు సకల
జనభుక్తశేషాన్నశైలంబు లిరువదియేనగుసంఖ్య దానెఱుఁగ నయ్యెఁ
[4]దత్కృతక్రతు బహుదక్షిణాసంఖ్యయు నుడు[5]సికతాసంఖ్యయును నెఱుంగఁ

ఆ. గాదు జనుల కట్టి గయునామమున గయ, యనఁగఁ [6]బుణ్యతీర్థ
మయ్యె నిదియుఁ
బితృహితార్థమిందుఁ బిండప్రదానంబు, [7]సేయఁగనిన నిష్టసిద్ధి[8]గలుగు.

317. వ. అనిచెప్పిన శమఠువలన గయామాహాత్మ్యంబు [1]విని యగస్త్యాశ్రమంబున కరిగి రంత [2]ధర్మరాజు రోమశున కిట్లనియె.

---

7. కం. ఎలమిని ధర్మతనూజుఁడు
కులపావనుఁడగుచు విప్రకోటుల కెల్లన్
వెలయగ నభీష్టవస్తువు
లలయక దానంబుసేసె నభివాంఛితుఁడై —

గ. ల. వీ. స. శ.

వ. మఱియును వేదవిదులయిన – గ. స. శ$_1$. 8. అర్ష్యంబైన – కొన్ని ప్రతులు; ఆర్షంబైన – జ. 9. వ్రతంబుసేసి – పెక్కు ప్రతులు. ఇచ్చట మూలము. తత్ర తే పాండవా వీరాశ్చాతుర్మాస్యైస్తదేజిరే – చిత్ర. పుట 158. వనపర్వ. 10. యెడ శమ – ల. 11. సుమంతుండను–కొన్ని ప్రతులు. ఇక్కడ మూలము – తత్ర విద్యావ్రత స్నాతః... శమఠోఽ కథ యద్రాజన్. చిత్ర. పుట 158. వన పర్వ.

316. 1. ఇచ్చట పెక్కు పాఠ భేదములు కలవు. మూలము. శమఠోఽకథయద్రాజన్నామూర్తరయసం గయం. 3–93–16. దీనికి పాఠాంతరము, అధూర్తరజసం. శం. వా. కొన్ని ప్రతులు; సరవినాధూతరజః ప్రియపుత్రుండు – ల. 2. బహ్మశరంబు – వా. కొన్ని ప్రతులు. 3. జేసిన నాతని – ల. 4. దత్క్రతుకృత – కొన్ని ప్రతులు; దత్క్రతుక్షితి – ఉ. ఔ. చ. 5. గణఘునసంఖ్య – ఈ. ఐ. త. 6. దివ్య – ఉ. ఊ. 7. సేసెనేని – ఉ. 8. పెరుగు – పెక్కు ప్రతులు.

317. 1. వినుచు – పెక్కు ప్రతులు. 2. ధర్మజుండు – కొన్ని ప్రతులు.

318. మధ్యాక్కర.

వాతాపి యనువాని నెట్లుసంపె సద్వంద్యుఁ డగస్త్యుఁ
డాతతతేజోధి[1]కుండు నావిందు నమ్మునినాథుఁ
[2]బ్రీతిని దచ్చరితంబు వినఁగ నభీష్టమిం దనిన
నాతని కిట్లనిచెప్పె [3]లోమశుం డమ్మునిపేర్మి.

319. క. [1]వీతభయుఁ డిల్వలుండును, వాతాపియు ననఁగఁ బరగు [2]వరదైత్యులు వి ఖ్యాత[3]బలులు వసి[4]యింతు ర, రాతిహరుల్ మణిమతీపురంబున [5]నొప్పన్.

320. వ. అందగ్రజుండయిన యిల్వలుం డొక్కబ్రాహ్మణునతిభక్తి [1]నర్చించి నాకు [2]సకలకామసిద్ధికరంబగు [3]మంత్రం[4]బుపదేశింపుమని [5]ప్రార్థించి విఫలప్రార్థ నుండై [6]యరిగి తనతమ్ముఁ గామరూపధరు [7]వాతాపి [8]నపుడు మేషరూ పంబుసేసి వధియించి వాని మాంసం బిమ్ముగా వండించి దాని నావిప్రునకుఁ [9]గుడువం బెట్టించి.

321. తే. విప్రుకడుపులోనున్న యప్పిరు ననుజుఁ, బిలిచె[1]వాతాపి రమ్మని ప్రియముతోడ
[2]జీవితుండయి వాఁడుసెచ్చెరను విప్రు, కడుపు[3]వ్రచ్చుచు
వెలువడి[4]క్రాఁచె విప్రు.

---

318. 1. కుండన – కొన్ని ప్రతులు; కుండనా – ల ఛందస్సు విచార్యము. 2. బ్రీతి దచ్చరితంబు వినగ నాకు నభీష్టమిందనిన – ఎ. ఓ. జ. ల. 3. ముదమున నమ్ము నిపేర్మి – ఆ. ఎ. జ.

319. 1. వితతబలు – ఒ. గ. ద; వీతభయులిల్వ – ఈ. త. శ. ప. 2. వారలు దైత్యుల్ – ఒ. 3. యశుల్ – కొన్ని ప్రతులు. 4. యించి – పెక్కు ప్రతులు. 5. బేర్మిన్ – న; కొప్పన్ – శ.

320. 1. బూజించి – పెక్కు ప్రతులు. 2. సర్వార్థసిద్ధి – పెక్కు ప్రతులు; సర్వాభీష్ట – ల. కొన్ని ప్రతులు. 3. నొక్కమంత్రం – ఆ. ఎ. ఖ. 4. బుపదేశించి యనుగ్రహింపుమని – అ. ఆ. ఎ. గ. 5. ప్రయత్నుండై – ల. కొన్ని ప్రతులు. 6. యలిగి – ఎ. ఏ. జ. ల. శ. 7. వాతాపి – కొన్ని ప్రతులలో లేదు; వాతాపి యను వాని – ఖ. 8. నపుడ – పెక్కు ప్రతులు. 9. భోజనంబుగావించి – పెక్కు ప్రతులు.

321. 1. రమ్మని వాతాపి – అ. ద. ఘ. చ. ట. వా. పీ. శ. ప. సూ. శ. 2. జీవవంతుడై – పెక్కు ప్రతులు. 3. వ్రచ్చికో–కొన్ని ప్రతులు. 4. కాంచె నతని – ల. కొన్ని ప్రతులు.

322. వ. అదిమొదలుగా నిల్వలుండు దన[1]కడకు నతిథులై [2]వచ్చు విప్రుల [3]నిప్పాట నంతకుపురంబున కతిథులం[4]జేయుచున్నంత నట యగస్త్యుండు బ్రహ్మచర్యాశ్రమంబు[5]నం బెద్దకాలం బుగ్రతపంబు సేయుచు వనంబునం బరిభ్రమించువాం[6]డొక్క సల్లకీపల్లవంబున నధోముఖులయి [7]వ్రేలుచున్న తనపితరులం జూచి యివ్విధంబున మీరున్న కారణంబేమి యనియడిగినం[8] బితరు లిట్లనిరి.

323. తే. అయ్య యేము నీపితరుల మధికనిష్ఠ, బ్రహ్మచారివై నీవు తపంబు సేయుచున్నవాఁడవు సంతతి [1]నొల్లకదియ, కారణంబుగ మాకూర్ధ్వగతియు లేదు.

324. వ. ఇంకనైనను నీవువివాహంబై సంతానంబు వడసిన మాకుఁ బుణ్య[1]గతి వడయనగు ననిన నట్ల చేయుదునని యగస్త్యుండు దనతపశ్శక్తిం జేసి పుత్త్రకాముండైన విదర్భరాజున కొక్క కూఁతుం బుట్టించిన నది లోపాముద్ర యను నామంబుతో జలంబులయందు [2]నలినియుంబోలె వినీతునందు లక్ష్మియుంబోలె నుద్యుక్తునందు విద్యయుంబోలెఁ బెరిఁగి [3]యౌవనంబుదాల్చి రూపవతియై వయోరూపంబుల [4]ననురూప లయిన కన్యకా[5]శతంబుతో [6]నొప్పుచున్నంత.

325. క. తరుణి నగస్త్యుభయంబున, వరియింపఁగ నోడి రాజవరులు మనోజాతురు[1]లగుచుండిరి తగియెడు, వరు రోయుచు నుండె సుతకు వైదర్భుండున్.

---

322. 1. యింటికి – ల. కొన్ని ప్రతులు. 2. వచ్చిన – పెక్కు ప్రతులు. 3. నిప్పాట – ల. కొన్ని ప్రతులలో లేదు; నందర – ఈ. ఐ. ఝ. త. 4. జేయుచున్న నతవి పాపవ్యవసాయం బుడిగించువా రెవ్వరును లేకయుండిరంత గొన్నిదినంబులకు నట – ఛా. 5. నన్యుగ్ర తపంబు – కొన్ని ప్రతులు. 6, డొక్క వల్లవంబున – ల, పెక్కు ప్రతులు: డొక్క పల్వలంబున – ఉ. గ. ద. 7. వ్రేలుచున్న – కొన్ని ప్రతులు. 8, వారిట్లనిరి – ఖ. ద, వీ. శ. ష; వానికి బితరు – ఉ. చ.

323. 1. యెల్ల – పెక్కు ప్రతులు; యొల్ల వదియు – క. గ; నొల్ల వదియ – అ. ఎ. ఖ.

324. 1. గతి గలుగు ననిన – కొన్ని ప్రతులు; లోకంబులు గలుగు ననిన – అ. ఆ. ఎ. గ. ల. 2. నలినంబునుం బోలె నీరధియందు లక్ష్మి – ట. 3. నవయౌవనంబు – ల. పెక్కు ప్రతులు. 4. కనురూపం బయిన – ల. కొన్ని ప్రతులు. 5. సహస్రంబుతో – కొన్ని ప్రతులు. 6. నొప్పుచున్న – పెక్కు ప్రతులు; నొప్పియున్న – ద.

325. 1. లై యుండిరి – కొన్ని ప్రతులు.

326. వ. అంత నగస్త్యుండు విదర్భరాజుపాలికి వచ్చి [1]నాకు లోపాముద్ర[2]నిచ్చునది [3]యనిన [4]విదర్భేశ్వరుండు తనతనూజ నమ్మునికిన్నోపక మనంబున ననుతాపించి యక్కన్యకం జూచి యాత్మగతంబున.

327. ఉ. నారలు గట్టి కూరలశనంబుగ నుగ్రవనంబులోఁ దపో
భారమునం గృశుం డయినబ్రాహ్మణుఁ [1]డీలలితాంగిఁ బెండ్లియై
నారలు గట్టి కూరలశనంబుగ నుగ్రవనంబులోఁ దపో
భారము దాల్చి యుండుమని [2]పంపక మిన్నక యుండ [3]నిచ్చునే.

328. ఆ. ఎఱిఁగి యెఱిఁగి [1]దీని నెట్లీఁగనగు భోగ, యోగ్య[2]యైనయది పయోజ[3]నేత్ర
[4]యీనినాఁడు శాపమిచ్చుఁ గాకిమ్ముని, యేల సైఁచు నింక నెట్టులొక్కొ.

329. వ. అని వైదర్భుండు దానునుం బత్నియు వగచుచున్న వారిపాలికి వచ్చి లోపాముద్ర యిట్లనియె.

330. క. ఇమ్మునివరునకు నన్నుఁ బ్రీ, యమ్మున నిచ్చునది మీకు నతిచింతాభా
రమ్మేల యనిన[1]నిరువురు, [2]నమ్ముదితకు సంతసిల్లి యధిక [3]విభూతిన్.

---

326. 1. తనకు లోపాముద్రను సధర్మిణింగా – ల. 2. నిమ్మనిన – ఔ. 3. యనిన వని – కొన్ని ప్రతులు; యని యడిగిన – అ. ఆ. గ. ఝ. 4. వైదర్భుం డాత్మగతంబున – స. పెక్కు ప్రతులు; విదర్భాధిభుం డాత్మగతంబున – అ. ఆ. ఊ. ఎ. ఒ. గ. ఝ. ట.

327. 1. డిట్టి లతాంగి – ఎ. ఓ. 2. వల్కక – ల. పెక్కు ప్రతులు. 3. నేర్చునే – పెక్కు ప్రతులు.

328. 1. తపసి కెట్లీయనగు – పెక్కు ప్రతులు. 2. యైన యీ పయోజనేత్రి – పెక్కు ప్రతులు; యైన యిప్పయోజగంధి – చ; యైన యిప్పయోజనేత్ర నీని – స. శ. 3. నేత్రి – పెక్కు ప్రతులు. 4. నీని – కొన్ని ప్రతులు.

330. 1. నిద్దరు – పెక్కు ప్రతులు. 2. నమ్మాటకు – ల. స. శ. కొన్ని ప్రతులు. 3. ప్రీతిన్ – ల. స. పెక్కు ప్రతులు.

-: అగస్త్యుఁడు లోపాముద్రను వివాహంబగుట :-

సం. 3 - 95 - 9

331. వ. [1]విధ్యుక్తంబుగా నక్కోమలి నగస్త్యునకు వివాహంబుఁ జేసిన [2]నగస్త్యుండు లోపాముద్రం బరిగ్రహించి దాని[3]దివ్యాంబరాభరణంబు [4]లపనయించి వల్కలాజినధారిణిం జేసి ధర్మచారిణిం దోడ్కొని చని [5]గంగాద్వారంబునం దపంబు[6]సేయుచు నొక్కనాఁడు.

332. క. నీచతరనాభిఁ జపలవి, లోచనఁ బృథుజఘనచక్ర [1]లోపాముద్రం
జూచి మునీంద్రుఁడు మన్మథ, గోచరుఁడై [2]దానిఁ బ్రీతిఁ గూడఁగఁదివిరెన్.

333. వ. అదియును [1]మునివరు నభిప్రాయంబెఱింగి లజ్జించి ముకుళిత[2]కరాంబుజయై యిట్లనియె.

334. క. పతి పత్నిఁ బ్రజార్థముగా, ధృతిఁ బడయుట [1]యెందుఁ గలయదియ యైనను వ
న్నతిరుచిరాంబర [2]భూషా, న్వితఁ జేసి మనఃప్రియంబు [3]నిర్మింపు దయన్.

335. క. మునినాథ నీవు ననులే, పనమాల్య [1]విభూషణప్రసన్నుఁడవై నా
కొనరింపు [2]మపత్యోత్పా, దన మీబుతు[3]వాసరములు దప్పక యుండన్.

---

331. 1. విధియుక్తంబుగా - పెక్కు ప్రతులు. 2. నగస్త్యుండును - ల. కొన్ని ప్రతులు. 3. దివ్యాభరణంబు - ఏ. ఓ. 4. లు పరిహరించి - ల. 5. గయాద్వారంబున - ఒ; గంగాతీరంబున - ఇ. ఈ. 6. సేయుచున్న - కొన్ని ప్రతులు.

332. 1. లోల శిరోజం - గ. 2. దానితోడ - ట.

333. 1. నమ్ముని యభిప్రాయం - ఇ. ఉ. ఊ. ల; మునీంద్రు - ఘ. చ. ద. పీ. శ. వ. 2. కరాంజలి - ఒ. ఝ. ద.

334. 1. శ్రుతులయందు దెల్లమయైనం - ఊ; శ్రుతులయందు దెల్లమయైనన్ - న. శ. 2. భూషాన్వితజేసి ప్రియం బొనర్చు వేడుకతోడన్ - ఔ. 3. వెలయింపు - చ; నిండింపు - అ. ఆ. ఎ. స; నిండింపు తగన్ - స.

335. 1. విభూషణోపపన్నుడవై - ల. 2. ము పుత్రోత్పాదన - ఊ. ఘ. 3. వాసరంబు - ఉ. ఖ.

336\. వ. అనిననాకుఁ దపోధనంబకాని యొండుధనంబులేదు నీకోరినవిధం బెట్లు సేయ నేర్తుఁ దపంబునంజేసి సర్వంబునుం [1]బడయ నగునంజేని [2]నేను దపోవ్యయంబు [3]సేయనోప నని యగస్త్యుండు వసుభిక్షార్థియై [4]శ్రుతర్వుండను రాజుపాలికింబోయి వానిచేతం బూజితుండయి యేను ధనార్థినై వచ్చితి నీ[5]పోష్యజనపోషణంబునకు విఘాతంబు గాకుండ [6]మిగులుధనంబుగలదేని [7]నాకిమ్మని యడిగిన[8]నతండాయవ్యయంబులు సమంబులగుటంజేసి మిగులు లేమి [9]యెఱింగించినవాఁడును దానును [10]బ్రధ్నశ్వుండను రాజుపాలికిం బోయిన [11]నతండును నయ్యిరువు[12]రం బరమభక్తిం బూజించి తదాగమన ప్రయోజనం [13]బెఱింగి తనయందుల నాయవ్యయంబు[14]లు సమంబులగుట యెఱింగించిన.

337\. క. ఇరువురఁ దోడ్కొని తానును, నరిగెం[1]ద్రసదస్యుఁ డను జనాధిపు కడకుం
గరమర్థితోడ [2]నందఱుఁ, బురుకుత్స[3]తనూజుఁడతఁడు పూజించి[4]తగన్.

338\. వ. వారలచెప్పి[1]నట్లు తననిర్వాహంబు సెప్పి త్రసదస్యుం డగస్త్యున కిట్లనియె.

---

336\. 1. బడయంబడు – ఈ. ఐ త. 2. నేను – పెక్కు ప్రతులలో లేదు; నే నెట్లు – కొన్ని ప్రతులు. 3. సేయంజాల – జ; సేయుదు – వీ. శ. ప. 4. శ్రీపర్వుం డను – ల; శ్రుతపర్వుండను – వా. వీ. మున్నగు ప్రతులు. సశ్రుతపర్వాణం మహీపాలం. 3–96–1 శ్లో. 5. పోష్య జనఁబునకు – కొన్ని ప్రతులు. 6. మిగిలిన– పెక్కు ప్రతులు. 7. నా కిమ్మనిన వాడును దనయాయ – ఈ. ఏ. ఐ ఔ. త. ల. 8. వానియం దాయవ్యయం – కొన్ని ప్రతులు; వానియం దాదాయ – ఆ. ఖ. ద. 9. యెఱింగి వాడును – కొన్ని ప్రతులు. 10. ఈపేరునకు పెక్కు పాఠభేదములు కలవు. మూలము. వధ్ర్యశ్వః ప్రత్యవేదయత్. 3–96–8. బ్రధ్నశ్వ – అని పాఠాంతరము. 11. వాడు – కొన్ని ప్రతులు. 12. రనతిభక్తిం – కొన్ని ప్రతులు. 13. బడిగిన దమవచ్చిన కార్యం బెఱింగించి యందుల నాయ వ్యయంబులు సమం బగుట యెఱింగి – వీ. శ. ప. శ. 14 లెరింగించి – కొన్ని ప్రతులు.

337\. 1. త్రిదసదస్యుడను – కొన్ని ప్రతులు. మూలమున త్రసదస్యుఁడనియే కలదు. 2. వారల – కొన్ని ప్రతులు. 3. తనూభవుండు – పెక్కు ప్రతులు. 4 వడిన్ – స. కొన్ని ప్రతులు; మదిన్ – కొన్ని ప్రతులు; ధృతిన్ – కొన్ని ప్రతులు.

338\. 1. న యట్లతం డతని నిర్వాహకంబు చెప్పిన – ల.

339. క. ఇమ్మణిమతీపురంబునఁ, దమ్ముండును దాను నతిముదంబున నుండున్
నెమ్మిని నిల్వలుఁడను[1]వాఁ, డిమ్మహి ధనవంతుఁ[2]డతఁడ యెవ్వరికంటెన్.

340. వ. అతండు మనయభిమతంబు దీర్పనోపునని రాజర్షులు మువ్వురు మహర్షిం దోడ్కొని యిల్వలుపాలికిం జనిన నయ్యిల్వలుండును వారి నాతిథ్యవిధానం బుల [1]నర్చించి వాతాపినెప్పటియట్ల సంస్కరించి యగస్త్యు[2]నకు భోజనం బుగా సమర్పించిన.

341. తే. దానినెఱిఁగి యమ్మువ్వురు ధరణిపతులు, మునివరేణ్యున కప్పుడు
మ్రొక్కియనిరి
విప్రవరులకు [1]భక్ష్యమై వీనితమ్ముఁ, డుదర[2]ములనుండి [3]విప్రులనొగిన చంపు.

342. చ. వలవదు వీని[1]యింటఁగుడువన్ మనకున్ ధన[2]మిచ్చునేని [3]ని
మ్ములఁగొని పోద[4]మిప్పుడని మున్నెఱిఁగించిన నమ్మునీంద్రుఁ డ
త్యలఘుఁడు వారిమాటకు భయంపడ కెంతయుఁ బ్రీతితోడ న
గ్గలముగఁ జేసె భోజనము గంఠముదాఁక [5]నకుంఠవీర్యుఁడై.

343. ఆ. ఇల్వలుండు ననుజునెప్పటిక్రియఁ బిల్వ, నెఱిఁగి [1]దాని నమ్మునీశ్వరుండు
గడుపుఁ [2]దడవికొనుచుఁ [3]గట్టునఁ [4]ద్రేఁచిన, నసుర[5]జీర్ణమయ్యె నాతఁడంబ.

---

339. 1. వా డెమ్మెయి – కొన్ని ప్రతులు. 2. డాత డెవ్వరికంటెన్ –స. కొన్ని ప్రతులు; డాత డిందఱికంటెన్ – ఆ. ఇ. ఎ. క. గ. ఝ. ల.

340. 1. పూజించి – ఇ. ఊ. ద. ల. 2. నకు భోజనంబుగా – పెక్కు ప్రతులు; నకు భోజనంబుగా నమర్చిన – ఖ; నికళనంబుగా – వా

341. 1. భోజ్యమై – ఇ. ఊ. స. శ. 2. మున నుండి – పెక్కు ప్రతులు; మగలించి – ఔ. స. శ. 3. వారల – క.

342. 1. యందు – ఓ. ఔ. క. ద. 2. మిచ్చెనేని – ల. స. పెక్కుప్రతులు. 3. యిమ్ముల – పెక్కు ప్రతులు. 4. మంచుదగ – ల. 5. నకుంఠితాత్ముడై – స. శ; పెక్కు ప్రతులు. ఈ పద్యము తరువాత వచనము. అంత – ఔ; ఆలోన – ఊ

343. 1. ఘనత – ఏ. ఓ; వేగయమ్ము – ఈ. ఐ. త. 2, దడివి – జ. ల. శ. ష. స; దడువు – ల. ఆ; నిమిరి – ఒ. స; నివిరి – చ. 3. గడవడి – స. కొన్ని ప్రతులు 4. ద్రేన్చిన – ఇ. ల; దేన్చిన – కొన్ని ప్రతులు. 5. భస్మ – అ. గ. ఝ.

344. వ. ఇల్వలుండును మునివరుశక్తికి భయంపడి విషణ్ణుండయ్యును బ్రసన్నుండ పోలెఁ దనవంచన[1]యేర్పడకుండం గృతప్రణాముండై దదాగమనప్రయోజనం బడిగిన వానికి నగస్త్యుం డిట్లనియె.

345. సీ. ఈరాజవరులతో నేను ధనార్థినై వచ్చితి నీకు ద్రవ్యంబు [1]గలుగు
టెఱిఁగి నావుడు [2]నటులేని మీ[3]కభిమతమెంత[4]యంతియ ధనమిత్తు ననిన
బదివేలుమొదవులు బది[5]వేల[6]గద్దియల్ పసిఁడియు నిమ్మహీపతుల కిమ్మ
[7]యొక్కొక్కనికి మఱి యొక్కనికిచ్చినదానికి [8]రెట్టిగోధనము నొక్క

ఆ. హేమమయరథంబు నిమ్ము[9]నాక నిన ని, ల్వలుఁడు దక్షణంబ తలఁచియిచ్చె
నయ్యగస్త్యుచెప్పి[10]నంతధనంబు ము, వ్వురుమహీపతులకుఁ గరము నెమ్మి.

346. వ. [1]మఱియు [2]విరావ సురావము లనునశ్వంబు[3]లంబూన్చిన [4]సౌవర్ణ రథంబును [5]నిరువది వేలమొదవులు నిరువదివేల[6]గద్దెల పసిండియు మునివరున కిచ్చినం [7]దద్రథంబున.

---

344. 1. బయల్పడ కుండం – ఖ.

345. 1. గలుగ నెరిగి – కొన్ని ప్రతులు. 2. నట్లయేను – ఉ. ల. 3. యభిమత – కొన్ని ప్రతులు. 4. యంతయు – అ. ఉ. ల. 5. వేలు – ల. కొన్ని ప్రతులు. 6. గద్దెలు, గద్యలు–అనియు పాఠములు కలవు. గద్దెల – సూ. 7. యొక్కొక్కరునకు నంపొక్కని కిచ్చిన – పెక్కు ప్రతులు; యొకళ్ళొకళ్ళకు – కొన్ని ప్రతులు 8. రెట్టిగా ధనము – కొన్ని ప్రతులు. 9. నాకనవుడు నిల్వలుండ వేడ్కనిచ్చె ధనము – అ. ఆ. క. గ. జ. ఝ. ప్రాసయతి నియమభంగము 10. నంతయు ముఫ్వురు ధరణి పతులకిచ్చె ధనము పేర్మి–క. ప్రాసయతి నియమభంగము; నంతయు ముప్పురు ధరణి పతుల కిచ్చెగరము నెమ్మి – ఆ. గ.

346. 1. మరి యుత్తమ హాయంబులంబూనిన – ఆ. ఔ. క. గ. ఝ. ట. ల. 2. విరోజోప రాజులను – కొన్ని ప్రతులు. ఇచ్చట మూలము. విరావశ్చ సురావశ్చ తస్మిన్యుక్తౌ రథౌహాయౌ. చిత్ర. పుట 163. వనపర్వ. 3. లు పూనిన – ఊ. ఖ. ఝ. 4. కాంచన – ఇ. ఊ; స్వర్ణ – కొన్ని ప్రతులు; సువర్ణ – కొన్ని ప్రతులు. 5. నిరువదివేల మొదవులు – ఒ. ఖ. శ. ష. ప్రతులలో లేదు. 6. గద్యాల – కొన్ని ప్రతులు; గద్దియల – కొన్ని ప్రతులు. 7. దద్రథబున – ల. ప్రతిలో లేదు.

347. క. [1]మునివరన్నృపతులఁ దగ్గో, ధనకాంచనతతుల [2]దత్ప్రతాకినులను నో
లిన తాల్చి యగస్త్యాశ్రమ, మునకుం దక్షిణమ రథ్యములు [3]వడిఁ బఱచెన్.

348. వ. [1]రాజర్షులు నగస్త్యు వీడ్కొని చని రంత నగస్త్యుండు లోపాముద్ర [2]కభిమతం
బొనరించి.

349. మధ్యాక్కర.
[1]పదుగురఁబోలెడు సుతులనూర్వురఁ బడయంగ [2]వలతొ
[3]పదుగుర నూర్వుర కెనయగుసుతులఁ బడయంగ వలతొ
వదలక వేవురు [4]సుతులఁ బడయఁగ వలతొ వేవురకుఁ
[5]గదియంగ నుత్తము నొక్కరు వలతొ కమలాయతాక్షి.

350. వ. అనిన [1]ముదితహృదయయై లోపాముద్ర మునీంద్రున కిట్లనియె.

351. క. [1]వేవురఁబోలెడువాని మ, హావీర్యగుణాఢ్యు నొక్క యాత్మజుఁ బడయం
గా [2]వలతు నపేతగుణుల్, వేవురు సుతు[3]లయ్యు నెందు విఫలమ కాదే.

---

347. 1. మునివరు - కొన్ని ప్రతులు. 2. తదాప్త జనులనో - ద. 3. వెస - ఈ. ఏ. ఐ. ఓ. జ. త. ల; వడి వచ్చెన్ - ఆ. ఇ. క. గ. ఝ; వడి దెచ్చెన్ - అ.

348. 1. రాజర్షులు మువ్వురు నగస్త్యు - కొన్ని ప్రతులు; రాజపురుషులు నగస్త్యు - అ. 2. ముదితహృదయమై యుండునట్లు చేసి - ఈ. ఐ. త.

349. 1. పదుంద్ర - వా. సం. శ; పదుంద్ర బోలగ - ఈ. ఐ. త; పదుగుర - జ. పీ. శ. శ. ర. శ. ష. 2. దలతొ - గ. 3. పదుగుర - పీ. శ. శ. ష; పదుంద్ర - వా. సం. శ. కొన్ని ప్రతులు. 4. కొడుకుల బడయ వలతొ వేవురకు - ల. 5. గదియగ నుత్తమునొకరు బడయంగ కమాలాక్షి వలతొ - జ.

350. 1. నది ముకుళిత కరకమలయై-ఉ.ఔ; విని ముకుళితకరకమలయై లోపాముద్ర-అ.ఆ.

351. 1. వేవుర బోలెడు వాని మహావీర్యు - శ. కొన్ని ప్రతులు; వేవుర బోలెడు... గుణల్ ...సతులయ్యు...-స. ఇచ్చట మూలము. సహస్రసమ్మితః పుత్ర ఏకో మేఽస్తు తపోధన. చిత్ర 162 పుట. వనపర్వ. 2. వలయు - అ. ఆ. చ. ఝ. 3. లైన నందు - పెక్కు ప్రతులు.

352. వ. అనిన నీకోరినట్లు గుణవంతుం డయిన కొడుకు [1]నీకుజన్మించునని దానికి గర్భాధానంబుసేసి యగస్త్యుండు[2]దపోవనంబున కరిగె నిట లోపాముద్రయు నేడేండ్లు గర్భంబు[3]దాల్చె నంత నక్కొమరికి.

353. క. తనయుఁడు [1]దృఢస్యుఁడనఁగా, ననవద్యుఁడు వేదములు రహస్యంబులతోఁ [2]గొనరఁగ [3]జపంబుసేయుచు, నినతేజుఁడు వుట్టె [4]భువనమెల్ల వెలుంగన్.

354. వ. వానికిం దేజస్వియనుఋషి వుట్టి యపారంబయిన యిధ్మభారంబు వహించుటం జేసి యిధ్మ[1]వాహుం డనంబరగె నిట్లగస్త్యుండు పుత్త్రపౌత్త్రవంతుం డయి తన[2]పితరులం బుణ్యలోకగతులం జేసెనని వైశంపాయనకథి[3]త కథా[4]క్రమం బతి [5]రమ్యంబు గాను.

355. క. కలికాల[1]భరత లక్ష్మీ, లలనాస్పద వీరగుణవిలాస విరోధి
ప్రళయాంతక నిఖిలమహీ, వల[2]యోద్వహబాహు విష్ణువర్ధన[3]మూర్తీ.

356. పృథ్వీవృత్తము.
సమస్త[1]భువనాశ్రయా వినయ[2]సత్యనిత్యోదయా
[3]సమీహిత[4]గుణక్రియా [5]స్థిరవిశాలకీర్తిప్రియా

---

352. 1. నీకు — పెక్కు ప్రతులలో లేదు. 2. దపంబున కరిగె — ఆ. ఉ. ఒ. ఔ. ఖ. గ. ఝ; దనరగ జపంబున కరిగె — స. 3. దాల్చిన నక్కొమరికి — పెక్కు ప్రతులు.

353. 1. దృఢవ్యు — ల; దితవ్యు — అ. ఆ. గ; దృళ్యుం — కొన్ని ప్రతులు; దృఢాశ్వు — ఉ. క.ద; ధన్యుం — ఏ. ఓ. ఝ; త్రిదళ్యు — ఒ; పృథాశ్వు — ఔ. 2. దనరగ — ల. కొన్ని ప్రతులు. 3. దపంబు—ఉ. ఒ. ఖ; జదువుచు ముదమున — క. 4. లోకమెల్ల — కొన్ని ప్రతులు.

354. 1. వహుండు నాబరగె — కొన్ని ప్రతులు. 2. పితృదేవతలం — కొన్ని ప్రతులు; పితృవరులం — కొన్ని ప్రతులు. 3. తంబైన పుణ్యకథ యతి — కొన్ని ప్రతులు. 4. శ్రవణంబు — కొన్ని ప్రతులు. 5. రమణీయంబుగాను — కొన్ని ప్రతులు.

355. 1. విభవ — ఉ. 2. యాస్పద — ఆ. ఊ. గ. ఝ; యోద్భవ — క. 3. దేవా — శ₁. పెక్కు ప్రతులు; నృపతీ — కొన్ని ప్రతులు.

356. 1. మహిమాశ్రయ — ఝ. 2. నిత్యసత్యోదయా — ఆ. ఔ. ఝ. 3. సమాహిత — కొన్ని ప్రతులు. 4. మనః — అ. ఆ; హిత — కొన్ని ప్రతులు; జయ — ఖ. 5. శుభ — పెక్కు ప్రతులు.

[6]నమన్నృపకిరీటచుంబిచరణద్వయా సంతత
[7]క్షమాభరణ రాజరాజ పరగండ[8]భేరుండకా.

గద్యము. [1]ఇదిసకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబున బృహదశ్వుదర్శనంబును నలోపాఖ్యానంబును [2]నారదాగమ నంబును [3]సకలతీర్థ[4]కీర్తనంబును [5]రోమశుం డర్జునకుశలవార్తఁ జెప్పు టయు రోమశమహాముని యుపదేశంబున ధర్మజు[6]తీర్థాభిగమ నంబును నగస్త్యుండు లోపా[7]ముద్రం బరిగ్రహించుటయు వాతాపిభక్షణంబును [8]నన్నది ద్వితీయాశ్వాసము.



6. నమన్నృపపదద్వయా దిగధినాథదత్తాభయా-శ$_1$. 7. క్షమాభరణ దిగ్జయా నుకవిజాల భాస్వద్దయా - శ$_1$. 8. హృద్భైరవా - ఈ. ఐ. త; భీమావ్యాయా - ఎ. ఏ. ఓ; కంఠీరవా - అ. చ. జ. ద.

357. 1. ఇతిశ్రీ-ఏ. ఘ; ఇతి-క. జ. శ. 2. దమయంతి స్తుతియును నారదాగమ-ఊ. ఒ. 3. సకల తీర్థ కీర్తనంబును - కొన్ని ప్రతులలో లేదు; సకల - కొన్ని ప్రతులలో లేదు. 4. ప్రశంసయు - ఉ. ఖ. ద; ఫలస్తుతియు - చ; మహాత్మ్యంబును - ఎ. 5. రోమశుం డను మహాముని యుపదేశంబును- పెక్కు ప్రతులు. 6. తీర్థగమనంబును- ఏ. ఓ. జ. 7. ముద్ర నను గమనించుటయు - ఊ; ముద్ర నభిగమించుటయు - ఔ. 8. అపత్యార్థంబగస్త్యుండు లోపాముద్ర నభిగ మించుటయు - ఒ.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - తృతీయాశ్వాసము

—o—o—o—

1. క. [1]శ్రీమందిర [2]బుధజనచిం, తామణి కోదండపార్థ ధర్మవిచారో
ద్దామ నల[3]నృగభగీరథ, రామచరిత్రాభి[4]రామ రాజ[5]నరేంద్రా.

### -: అగస్త్య చరిత్రము :-

సం. 3 - 98 - 1

2. వ. [1]అక్కథకుండు శౌనకాదిమహామునులకుం [2]జెప్పె నట్లు ధర్మతనయుం డగస్త్య మాహాత్మ్యంబు విని వెండియుఁ దచ్చరిత్రంబు రోమశు నడిగిన [3]నమ్మౌని [4]యిట్లనియె.

3. సీ. కృతయుగంబునఁ గాలకేయగణంబుతో [1]వృత్రుఁ డన్నసుర గర్వించి యమర
పతిఁదొట్టి [2]వేల్పుల బాధిం[3]చుచున్నఁ దద్భయమున [4]నమరులు బ్రహ్మకడకుఁ
జని [5]పోరిలో వృత్రుఁ [6]జంప నుపాయ [7]మెయ్యదియొ మా కానతిమ్మన
నజుండు
దివిరి సరస్వతీతీరంబునందు [8]నిశ్చింతుఁడై [9]తపమొప్పఁ జేయుచున్న

---

1. 1. శ్రీ మండిత - స. 2. ఘనబుధ చింతామణి — జ. 3. గయ — ఈ. ఓ. గ; నృప — శ. ష. 4. రాజ - అ. 5. మహేంద్రా - ఝ. స.

2. 1. అక్కథికుండు - ఊ. ట. ల. 2. జెప్పినట్లు - కొన్నిప్రతులు. 3. నమ్మహాముని - ఎ. 4. యిట్లు (ట్లని) చెప్పె - కొన్ని ప్రతులు.

3. 1. వృత్రాసురుండు గర్వించి - ఘ. శ. ష. 2. యమరుల - గ. 3. పుచున్న - ల. 4. సురలెల్ల - ఇ; సురులెల్ల - ల. 5. వారలా - ష. 6. జంపునుపాయ మెయ్యది మాకు నానతిమ్మనిన నజుడు - ల. 7. మెయ్యది యానతిమ్ము మాకనిన నజుడు - ఊ. చ. ఠ. స; మెయ్యదియు మా కానతిండనిననజుడు - ఔ. 8. నిశ్చిత్తుడై - అ. ఊ. ఏ. ఒ. ఓ. ఖ. గ. ఘ. చ. ఛ. జ. 9. తపమొగి - ల. స.

ఆ. యా [10]దధీచి కడకు నరిగి వేఁడుండు ని, జాస్థు లిచ్చు మీకు నమ్మహాత్ముఁ
డవి జయించు వజ్రమాదిగా [11]నిఖిల ది, వ్యాయుధంబులై సురారివరుల.

4. వ. అందు వజ్రంబున నింద్రుండు వృత్రు వధియించు ననిన నమరులెల్లం గమ
లాసనుశాసనంబున దధీచి పాలికిం [1]జని కృతప్రణాములై యిట్లనిరి.

5. క. [1]భువనజనస్తుత నిజగా, రవ [2]మెసఁగఁగ నమరపతిపురస్కృతు లగు ని
ద్దివిజుల కెల్ల [3]హితంబుగ, భవదస్థిచయంబు లిమ్ము పరమమునీంద్రా.

6. వ. అనిన విని [1]దధీచి సంతసిల్లి కృతార్థుండ నైతి నని దేవహితార్థంబుగా
నిజప్రాణంబుల విడిచె నమరు [2]లెల్ల నమ్మహామునియస్థు లాయుధంబులుగా
బరిగ్రహించి రందు.

7. ఆ. త్వష్ట యంత నూఱు ధారల రమ్యమై, యనల[1]కణకరాళ మైనవజ్ర
మొనరఁ జేసి దీన నోర్వుము దైత్యుల, ననుచు నిచ్చె దాని నమరపతికి.

8. వ. అవ్వజ్రంబున నింద్రుండు వృత్రు వధియించె నంత.

9. చ. అనుపమదివ్యశస్త్రధరులైన యమర్త్యుల [1]కాహవంబులో
మొనయక కాలకేయులు సముద్రముఁ జొచ్చి [2]దివంబు లెల్ల న
వ్వనధి [3]నడంగి యుండి బలవంతులు వెల్వడి రాత్రులెల్ల భూ
జనులకు బాధసేయుచు భృశంబుగ నుండిరి క్రూరచిత్తులై.

---

10. దధీచు - ఏ. ఓ. ఛ. ల. 11. నిఖిలాయుధంబులై సురారితతుల బోర - ఒ. ల. స.

4. 1. బోయి - కొన్ని ప్రతులు.

5. 1. భువనస్తుతమైనీగా - అ. ఛ. జ. ఝ. ఠ. స; భువన ప్రస్తుతనీగా - ఒ; భువనై
కస్తుతమైగా - ఊ. 2. మొప్పగ - ఠ. స. 3. ప్రియంబుగ - ఊ.

6. 1. దధీచుండు - ఇ. ఓ. క. గ. ఛ. ఝ. ల. 2. లెల్ల కమలాసను నియోగంబున
(శాసనంబున, పనుపున) - కొన్ని ప్రతులు.

7. 1. కర - అ.

9. 1. యాహవంబులో - ఔ. 2. దివంబులెల్లనున్ వనధి - ఔ.ఖ. 3. మునింగి -
అ. ఛ.

10. వ. మఱియు విద్యాతపోయుక్తులై [1]ధర్మచరితులైన వారికారణంబున [2]జగంబు లపాయంబు నొందక సుఖంబున్న యవి గావున నట్టి [3]వారిన రోసి వధియించి జగంబుల కపాయంబు [4]సేయుదమని యసురులు వసిష్ఠాశ్రమంబున నూటతొంబదియేడ్వురను జ్యవనాశ్రమంబున నూర్వురను భరద్వాజాశ్రమంబున నిరువదుండ్రనుంగాఁ బలువురు బ్రాహ్మణుల బ్రహ్మమయుల [5]వధియించి [6]భక్షించి యిప్పాట ననవరతంబు [7]నఖిలమునిగణాశ్రమంబుల కుపద్రవంబు సేయుచున్న.

-: దేవతలు వైకుంఠమునకుఁబోయి విష్ణునిస్తుతియించుట :-

సం. 3 - 99 - 11

11. క. యాగాదిపుణ్యకర్మ, త్యాగము [1]మర్త్యమున నైనఁ దా రధికభయో
ద్వేగంబునఁ బురుహూత పు, రోగములై యగ్నియమవరుణధనదాదుల్.

12. క. చని వైకుంఠంబునఁ బ్రభు, వనపతి వైకుంఠు గరుడవాహను [1]విష్ణున్
దనుజవిభంజనుఁ గని యి, ట్లని రెంతయు భక్తితోఁ గృతాంజలు లగుచున్.

13. వ. దేవా నీవు వరాహరూపధరుండవై మహీతలంబెత్తి నరసింహ[1]రూపంబు దాల్చి [2]యాదిదైత్యు హిరణ్యకశిపు [3]వధించి వామనుండవై బలిం[4]గట్టి యజ్ఞమూర్తివై [5]యజ్ఞవిఘ్నకరుండైన జంభుం డనుదానవుం [6]జంపి యండజ జరాయుజ స్వేదజోద్భిజ్జంబు లనం బరగిన చతుర్విధ[7]ప్రజల రక్షించు

---

10. 1. కర్మ — ఠ. 2. జనుల కపాయంబు కాక — కొన్ని ప్రతులు. 3. వారిని — కొన్ని ప్రతులు. 4. సేయవలయునని - ఈ. ఝ. ల. 5. వధియించి - పెక్కు ప్రతులలో లేదు. 6. భక్షించి - ఎ. చ. ఛ. జ. ఝ. ల. ప్రతులలో లేదు. 7. నిఖిల; సకల - కొన్ని ప్రతులు.

11. 1. మర్త్యులకునైన — చ.

12. 1. భౌమున్ - అ.

13. 1. రూపుండవై - కొన్ని ప్రతులు. 2. యద్దైత్యు - ఏ. ఔ. 3. వధించితి - కొన్ని ప్రతులు. 4. గట్టితి - కొన్ని ప్రతులు. 5. యజ్ఞవిఘ్నకరుండైన - పెక్కు ప్రతులలో లేదు; యజ్ఞఘ్నుండైన దానవుం — అని కలదు; యజ్ఞఘ్నుండను దానవుం — ల. 6. జంపితి అండజ - కొన్ని ప్రతులు. 7. భూత కోట్లను - అ.

చున్న జగద్రక్షకుండవు గావున నీకు విన్నపంబు సేసెద మిప్పుడు జగంబుల
కైన యుపద్రవంబు చిత్తగింపుము.

14. సీ. కాలకేయులు మహాకాయులు పగలెల్ల జలదుర్గబలమున జలధి నుండి
[1]రేలెల్లఁ జని నలిరేఁగి మునీశ్వరాశ్రమముల సద్ధర్మచారులైన
బ్రాహ్మణప్రవరులఁ బాయక వధి[2]యింతు రెట్టిపాపాత్ములు నెయ్యుగముల
బ్రాహ్మణహింస యాపాదింతురే యది వీరలవలనన వినఁగఁబడియెఁ

ఆ. బరమసాధులైన బ్రాహ్మణులకు బాధ, యగుడు మహికి బాధయగు ధరిత్రి
కైన బాధఁజేసి యఖిల[3]లోకంబులుఁ, గరము బాధ [4]నొందుఁ గమలనాభ.

15. వ. ఎట్లనిన వేదంబులు [1]ధరియించి విప్రులు వేదచోదితంబు లైన పుణ్య
కర్మంబులు [2]విధియించుటంజేసి హవ్యకవ్యంబుల దేవతలుం బితరులుఁ దృప్తు
లైన [3]వారివలన నెల్ల లోకంబులకు సుఖం బగుం గావున బ్రాహ్మణోప
ద్రవంబు పరిహరించి లోకంబులు రక్షింపు మనిన దేవతలకు [4]విష్ణుదేవుం
డిట్లనియె.

16. మత్తకోకిలము.
[1]కాలకల్పుల [2]నుగ్రతేజులఁ గాలకేయుల భూరిర
త్నాలయస్థుల వీర్యవంతుల నర్ణవంబు సమస్త[3]స
త్త్వాలి దోఁపఁగ వట్టినన్ విషయం బగుఁ వధియింపఁగాఁ
బోల దొండు విధంబునం బరిపూర్ణవార్ధి [4]జలోన్నతిఁ.

---

ఎ. ఛ. ఝ; ప్రాణికోట్లను – అ; ప్రాణుల – క. గ. ఘ. చ. ఠ; భూతంబుల –
ఏ. ఓ. జ. ల. శ. ష.

14. 1. రేయెల్ల – పెక్కు ప్రతులు. 2. యించిరెట్టి – ల; యించిరిట్టి – ఇ. ఉ. క.
3. లోకములకు గరముబాధయగును – ఔ. 4. బొందు – అ. ఖ.

15. 1. ధరియించిన – కొన్ని ప్రతులు. 2. నడుపుటంజేసి – ఊ; వహియించుటంజేసి –
ష. 3. వారివలన – ఊ. ఖ. ఘ. ఛ. ఠ. ష. ప్రతులలో లేదు. 4. దేవదేవుం –
ఘ. శ. ష.

16. 1. కాలకేయుల కాలకల్పుల కాలకాయుల భూరిర – పెక్కు ప్రతులు. 2. కాల
సత్త్వుల – అ. ద. 3. రత్నాలిదోపగ నింకినన్ – కొన్ని ప్రతులు. 4. జలోన్న
తిన్ – ఔ. క. ఘ. చ. ఛ. జ. ఠ. స. ష; జలోద్ధతిన్ – ల.

17. క. [1]వరుణ [2]జలంబుల మిత్రా, వరుణ తనూజుండు వీర్యవం[3]తుండై చె
చ్చెరఁ ద్రావనోపు [4]నిందఱు, నరుగుఁడు ప్రార్థింపఁ డమ్మహాత్ము
నగస్త్యున్.

18. వ. అనిన నమరు లెల్ల నగస్త్యు[1]పాలికిం జని యమ్మునివ[2]రు స్తుతియించి యి
ట్లనిరి.

19. క. అమరహితంబుగ జగదహి, తము దలుగుము [1]పేరితో బుధస్తుతగుణ విం
ధ్యము దొల్లి పెరిఁగి కగదహి, తము సేసిన నీవకావె [2]తలగితి [3]దానిన్.

20. వ. అని దేవతలెల్ల నగస్త్యుఁ గీర్తించి రనిన విని [1]ధర్మజుం డది యెట్లు వింధ్యం
బేల పెరిఁగె [2]దానిం బెరుఁగకుండ నగస్త్యుం డెవ్విధంబున వారించె నని
యడిగిన నాతనికి రోమశుం డిట్లనియె.

*-: అగస్త్యుఁడు వింధ్యంబు పెరుఁగకుండ వారించుట :-*

సం. 3_101_2

21. ఉ. నెమ్మి నినుండు మేరుధరణీధరనాథుఁ బ్రదక్షిణంబుగాఁ
ద్రిమ్మరుచున్నఁ జూచి [1]పటుదీధితికిం [2]గరమల్గి వింధ్యశై
లమ్మనియెన్ [3]దినేంద్ర యచల ప్రభు నన్నుఁ బ్రదక్షిణంబు [4]ని
త్యమ్మును జేయ[5]కేల మతి దప్పి[6]తి మేరువుఁ గొల్వ నేటికిన్.

---

17. 1. ఈ పద్యమునకును తరువాతి వచనమునకును మాఱుగా స. ప్రతిలో క్రింది వచనము కలదు. సముద్ర జలపాన నిమిత్తం బగస్త్యుం బ్రార్థింపుండని జగతీశ్వరుం డానతిచ్చిన దేవ సంఘంబు లతిత్వరితంబున నగస్త్యుకడకువచ్చి వినయంబు దోఁప నిట్లనిరి. 2. జలంబులు – ఇ. ఒ. 3. తు డగస్త్యుం డురుశక్తిఁ ద్రావనోపును అరుగు......డా మహాత్ముని మీరల్ – ఔ. 4. మీ రందరుగుడు – ఊ; మీరం (దందఱు) దరుగుఁడు – స.

18. 1. పాలికి వచ్చి – కొన్ని ప్రతులు. 2. వరునిట్లనిస్తుతియించిరి – ఓ. ల.

19. 1. నెమ్మితో – ఊ. 2. తలఁగితి – ఔ. ప; తలిగితి – వా (?); తగిలితి – ఊ. ఒ. ఖ. చ. 3. కరుణన్ – ఊ.

20. 1. ధర్మతనయుండు తొల్లి వింధ్యాచలంబేల – ల; ధర్మతనయుండది యెట్లు తొల్లి వింధ్యాచలంబేల – పెక్కు ప్రతులు. 2. దానినేల – ఈ. ఓ. ఝ.

21. 1. ఖరదీధితికిం – ల. 2. గడునల్గి – అ. ఝ. 3. దినేశ – కొన్ని ప్రతులు. 4. మోదమ్మున – చ. 5. వేల – ఝ; కేలమరిదప్పితి – ఠ. 6. టుమేరువు– ఱ; సుమేరువు – అ.

22. వ. అని గర్వించి పలికిన నప్పర్వతంబునకు భానుం డి ట్లనియె.

23. క. [1]అనవరతము విధియోగం, బున నేఁ [2]ద్రిమ్మరుదు నమరభూధరముఁ [3]బ్రియ
మ్మున నాత్మేచ్ఛ యొనర్పఁగఁ, జన దనవుడు [4]నలిగి వింధ్యశైలం బంతన్.

24. క. ఇనశశితారా[1]దులకుం, జన రాకుండంగఁ బెరిఁగి జలధరపథ మె
ల్లను గప్పి యుండె వింధ్యం, బనుపమ [2]ముత్తుంగమై సురాద్రిస్పర్ధన్.

25. క. రవిశశిగతు [1]లుడుగుడు నిది, దివ మిది రాత్రి యని వసుమతీజనులకు న
ద్దివిజమునివరుల కెఱుఁగఁగ, నవగాఢంబయ్యె నంధ [2]మయ్యె జగంబుల్.

26. వ. ఇట్లు పెరిఁగిన [1]వింధ్యంబు నొద్దకు వచ్చి వేల్పులెల్ల దానివర్ధనంబు వారింప నోపక యగస్త్యుపాలికిం జని వింధ్యంబు పెక్కువ యెఱింగించి యి ట్లనిరి.

27. క. [1]భువనవ్యవహారమునకు, వ్యవధానం బయ్యె వింధ్యవర్ధనమున న
ద్దివసకర[2]రజనికరగతు, లవిహిత మగునట్లు సేయు [3]మమర మునీంద్రా.

28. వ. అని దేవతలు ప్రార్థించిన నగస్త్యుండు లోపాముద్రాసహితుండై [1]వింధ్యంబు సమీపంబునకు వచ్చి దానిచేతం బూజితుండై యి ట్లనియె.

---

23. 1. అనిశంబు విధినియోగంబున — అ. వ. స. 2. గ్రుమ్మరుదు — ఈ. ఎ. ఏ. ఒ. క. గ. చ. ఛ. ఝ. స. 3. బ్రియంబున విను మే సాత్మేచ్ఛం జన — ల. 4. రగిలి — ఊ.

24. 1. తతులకు — అ. ఇ. ఈ. ఉ. ఎ. ఒ. ఖ. చ. ఝ. ఠ. ల. స; గతులకు — ఆ. ఔ. ఘ. డ; 2. మై తుంగమై — అ. ఎ. ఒ. ఖ. ఛ.

25. 1. ఉడగుడు — అ. ఈ. ఉ. ఝ. ఠ. డ. ల. 2. మగుచు — ఏ. ఓ. ల.

26. 1. వింధ్యశైలంబు — ఔ. డ.

27. 1. భువనవ్యవహారం బవ్యవధానంబయ్యె — ఈ. గ. ఝ. ఠ. డ. ల; భువనవ్యవహారంబులు వ్యవధానంబయ్యె — ఒ; భువనవ్యవహారమునకు వ్యవధానంబయ్యె — ఎ. ఏ. ల; భువనవ్యవహారమునకు వ్యవధానంబయ్యె — శ. ష. స; భువనోపద్రవమై యవ్యవహారంబయ్యె — వా. 2. హైమ — అ; శీతకర — శ. ప; నిశాకర — ఝ; తారకాగతుల — ఊ. 3. మనఘ మునీంద్రా — పెక్కు ప్రతులు.

28. 1. వింధ్యపర్వత, వింధ్యశైల — అని భిన్నప్రతులు.

29. క. [1]చనియెద దక్షిణదిశ[2]కే, నొనరఁగఁ [3]దెరు విమ్ము నాకు నుర్వీధర నీ
వనవుడు నట్టుల చేయుదు, నని పెరుఁగుట యుడిగి వింధ్య మతి
[4]వినయముతోన్.

30. వ. [1]భట్టారా విజయంచేయుం డని [2]భూమిసమానమై యున్నదాని కగస్త్యుం
డి ట్లనియె.

31. క. నా[1]మగుడివచ్చునంతకు, భూమీధర యీప్రకారమున నుండుము నా
తో మైత్రిఁ జేయుమని లో, పాముద్రాధీశ్వరుండు [2]వలికి ముదమునన్.

32. వ. దాని నొడంబఱిచి దక్షిణ[1]దిశకుం జని [2]లోకంబులకు హితంబుగా నంద
యుండె వింధ్యంబు నగస్త్యుండు మగుడి వచ్చునంతకుఁ బెరుఁగ నోడి
యున్నదని [3]యగస్త్య మాహాత్మ్యంబు ధర్మజునకుం జెప్పి వెండియు
రోమశుం డి ట్లనియె.

33. ఆ. అమరులెల్లఁ దన్ను నట్లు కీర్తించుచు, నున్నఁ జూచి మునిగణోత్తముండు
వారి నడిగె నేమి వచ్చితి రెఱిగింపుఁ, డని దయాళుఁడై ప్రియంబుతోడ.

34. వ. [1]అనిన.

35. చ. అమరులు గాలకేయకృత మైన జగద్భయ మెల్లఁ జెప్పి యు
త్తమమునినాథ తత్ప్రతివిధానము సేసి జగంబు గావఁ జి
త్తము గలదేని [1]విభ్రమమదభ్రతరంగమహార్ణవంబుఁ బా
నము [2]దగఁ జేసి చేయుము ఘనంబుగ మాకు మనః[3]ప్రమోదమున్.

---

29. 1. చనియెదనే దక్షిణదిశ కొనరగ – ట. ఘ. 2. కిమ్మొనరగ – ఝ. 3. తెఱ
గిమ్ము – స. [తెఱఁగు – opening? see తెఱచు and the root తెఱు with అగు–
తెఱు+అగు] 4. వినయమునన్ – కొన్ని ప్రతులు.

30. 1. భట్టరా – అ. ఎ. జ. డ. ల. 2. భూసమంబై – ఇ. ఊ. ఒ. ద. ల.

31. 1. మగిడి – ష. 2. వలికె – కొన్ని ప్రతులు.

32. 1. దిక్కునకుం – కొన్ని ప్రతులు. 2 లోకహితంబుగా – ల. 3. యగస్తి
మహాత్మ్యంబు – శ.

34. 1. ఈ వచనము పెక్కు ప్రతులలో లేదు.

35. 1. విభ్రమదదభ్ర – కొన్ని ప్రతులు; నీవుమహా – ఇ. స. 2. దయ – క.గ.ఝ.ద.
3. ప్రియంబుగాన్ – ఒ. ద.

36. క. ఆతోయధి నీ[1]చేతం, బీతం బగుడుం గడంగి భీమాసురసం
ఘాతంబు దక్షిణంబ[2] ని, పాతింతుము దివ్యశస్త్రపటు[3]ఘాతములన్.

*-: అగస్త్యుండు సముద్రోదకంబు పానంబుసేయుట :-*

సం. 3 _ 103 _ 1

37. వ. అనిన నగస్త్యుం డట్ల చేయుదు నని యమరవరుల కెల్ల సంతోషంబుగా నప్పుడు.

38. సీ. రంగదుత్తుంగతరంగహస్తంబుల నాడెడు నదివోలె నతులవేగ
[1]వాతావధూతమై [2]వఱలెడు నదివోలెఁ బర్వతకందరోపాంతతతులఁ
దొడరెడు నది వోలె [3]ధ్రువఫేనవితతుల నగియెడునదివోలె నాగనక్ర
మకరకులక్షుభ్యమాణమై తద్బాధ [4]కోపనియదివోలె [5]నుచ్చభీమ
ఆ. నినద మగుచు నున్న నీరధియొద్దకు, నమరగణముతో మహామునీంద్ర
గరుడఖచరసిద్ధగంధర్వపన్నగ, యక్ష[6]గణముతోడ నరుగుదెంచి.

39. ఉ. అందఱుఁ జూచుచుండఁగ మహాబ్ధి[1]జలంబులఁ ద్రావె విష్టపా
నందకరుం డగస్త్యుఁడఘనాశనుఁ డట్లు పయోధి [2]రిక్తమై
నం దిమికూర్మకర్కటకనక్రభుజంగచయంబుతో భయం
బందుచుఁ గాలకేయులు బయల్పడి తోఁచిరి [3]దానిలోపలన్.

---

36. 1. చేతంబీతం - ఆ. ఇ. ఎ. ఘ. చ. ఛ. శ. ష; చేత నిపేతం - వా. 2. విఘాతిం తుము దివ్య శస్త్రఘాతముల వడిన్ - ఇ; విఘాతింతుము దివ్య శస్త్రభూతముల వడిన్ - ప. 3. పాతములన్ - పెక్కు ప్రతులు.

38. 1. వాతావధూతమై - ఇ. ఈ. గ. చ - ప్రతులలో తప్ప తక్కిన అన్నిటియందును; వాతవిధూతమై - వా. 2. వర్తించు - ఆ. ఖ. 3. ధృతఫేన - అ. ఊ. ఓ. ఘ. ఛ. జ. ఝ - దీనిని బట్టి ఒకార ఋకారములకు మైత్రి పాటింపవచ్చునని తెలుచున్నది.; దృఢఫేన - ఉ. డ. శ. ష. స. 4. కోడని - స. 5. నుబ్బి - పెక్కు ప్రతులు; నుగ్ర-ఒ. ద. 6. వరుల - అ. ఎ. ఝ.; తతుల - ఆ.; వితతి-ఔ.

39. 1. జలౌఘము - అ. ఖ. ఘ. ష. 2. రిక్తయైనం - ఎ. ఓ. 3. వార్ధిలోపలన్ - ఇ. ఈ. ఉ. ఏ. ఔ. గ. ల. స.

40. వ. [1]అంత.

41. క. గీర్వాణప్రభుఁడాదిగ, గీర్వాణగణంబు గాలకేయులతోడన్
గర్వించి రణముసేసి ర, ఖర్వపరాక్రములు [1]గడిమిఁ గడు నుద్ధతులై.

42. క. అనిమిషదివ్యాయుధహతి, ననిఁ గొందఱు వడిరి గొందఱధికవిభీతిం
జని పాతాళముఁ జొచ్చిరి, దనుజులు దైత్యులును వీర్యదర్పచ్యుతులై.

43. వ. ఇట్లు కాలకేయులం దొట్టి యసురుల నెల్ల [1]నిశ్శేషంబుఁ జేసి జగంబుల యుపద్రవం[2]బుడిపిన దేవత లగస్త్యునిం గీర్తించి యి ట్లనిరి.

44. క. మునినాథ నీయనుగ్రహ, మున [1]నుడిగెను బాధ నిఖిలభువనంబుల కి
వ్వవధిఁ బయఃపూర్ణముఁగా, నొనరింపుము నీవకాని యొరులోప రిలన్.

45. వ. ఇది యనేకసత్త్వాశ్రయంబు గావున రిక్తంబై యుండఁ [1]దగ దనిన నగస్త్యుం డి ట్లనియె.

46. సీ. [1]మున్న జీర్ణం బయ్యె [2]మున్నీటినీరు నాకడు[3]పున నేనింకఁ బడయనేర
జలరాశి నిండంగ జలమొండు నావుడు నమరులు మునులును గమలగర్భుఁ
గానంగఁ [4]జని దేవ మీనాకరం బేమితెఱఁగున నిండు మాకెఱుఁగఁ [5]జెపుమ
యని [6]విన్నపంబు సేసినఁ బెద్దప్రొద్దు చింతించి వారలకు విరించి యనియె

---

40. 1. ఈ వచనము పెక్కు ప్రతులలో లేదు.

41. 1. గడగి – ఊ. జ.

43. 1. నిశ్శేష్టితుల (సేసి)ంజేసి – స. 2. బుడిచి – వా.; బుడిపిన – పెక్కు ప్రతులు.

44. 1. నిగ్రహముడిగె నఖిల (నిఖిల) – పెక్కు ప్రతులు.

45. 1. గాదనిన – అ. ఇ. ఎ. ఒ. ఔ. ఛ. ఝ. స; గాదగదనిన – ల.

46. 1. మున్ను – అ. ఈ. ఎ. ఛ. జ. ఝ. స. 2. మున్నీరునీరు – అ. ఔ. గ. ఘ. ఛ. 3. పునందేనింక – ఘ. శ. ష. స. 4. జనుదెంచి కడగి యీయబ్ధియు నే తెఱంగుననిండు నెఱుఁగఁజెప్పుమని – డ. ఈ పాఠము ప్రాసయతినియమమునకు భంగమగును. 5. జెప్పుమని – పెక్కు ప్రతులు. 6. విన్నపము సేయమటి

ఆ. [7]వనధిఁ బెద్దకాలమున భగీరథుఁడను, వాఁడునించుఁగాని వసుధనోరులు
పూని దీని నింపఁగా నోప రనవుడు, నమరవరులుమునులు నరిగి రనిన.

47. క. వనరాశి యేమికారణ, మున నెట్లు భగీరథుండు భూరిజలౌఘం
బున [1]నించె దీనిఁ [2]జెప్పుమ, యని యడిగిన ధర్మజునకు నమ్ముని సెప్పెఁ.

*-: భగీరథుండు జలముచే సముద్రము నించుట :-*

సం. 3 - 104 - 6

48. వ. తొల్లి యిక్ష్వాకువంశంబున సగరుండను రాజు హైహయుల నిర్జించి నిఖిల మహీరాజ్యంబు సేయుచు నపుత్త్రకుండై వైదర్భియు శైబ్యయు [1]నను నిద్దఱు భార్యలతోడం గైలాసంబున కరిగి యందు.

49. క. దక్షమఖక్షయకరు నిట, లా[1]క్షజహుతభక్ష్యభక్షితానంగు విరూ
పాక్షు మహోక్షధ్వజుఁ బ్ర, త్యక్షము గావించె నుగ్రతపమున పేర్మిఁ.

50. తే. హరుఁడు వానికిఁ బ్రత్యక్షమయి వరంబు, వేఁడు మనవుడుఁ ద్రైలోక్య [1]విభుఁడ నాకు
దయ యొనర్పుము సంతానదానమనుచు, వేఁడెఁ బుత్త్రార్థియై కడు వేడ్కతోడ.

51. వ. ఈశ్వరుండు వానికి[1] వైదర్భియం దఱువది వేవురు గొడుకులును శైబ్యయం దొక్క కొడుకుం గా వరం బిచ్చి యయ్యఱువదివేవురు నతి దర్పితులై యేకకాలంబునఁ గాలగోచరు లగుదు రనియు [2]నయ్యొక్క కొడుకు వంశకర్త యగు ననియుం జెప్పి యదృశ్యుం డైన.

---

పెద్ద - డ. 7. వినుడు బెద్దకాలమున - పెక్కు ప్రతులు

47. 1. నిండజేసె - ఎ. ఛ. ఝ. 2. జెప్పుండని - ఏ. స.

48. 1. నను తన యిద్దఱు - అని కొన్ని ప్రతులు.

49. 1. క్షుహుతభుగక్షిభక్షితానంగు - ఠ; క్షజహుతభక్షభక్షితానంగు - స్వ; క్షు హుతవహనక్షితానంగు - స. డ; క్షిజహుతవహనభక్షితానంగు - ల. అనం. గణ; క్షుజగద్రక్షు భస్మితానంగు - ఓ.

50. 1. విబుధ - స.

51. 1. గరుణించి - క. ఘ. ఠ. ష. 2. నయ్యొక్కరుండు - చ. ల.

52. క. కొడుకులఁ బలువురఁ బడసియుఁ, బడయని [1]యట్టిదయి ధర్మపత్నులుఁ దానుం
గడు సంతసపడ కరిగెను,దడయక సగరుండు మగుడి తనపురమునకున్.

53. వ. అంతఁ గొంతకాలంబునకు నయ్యిద్దఱు గర్భిణులైన నందువైదర్భికి నొక్క
యలాబూఫలంబును శైబ్యకు ససమంజసుం డనుకొడుకునుం బుట్టిన.

54. ఆ. వరదుఁడైన యీశు వరమున నిదియొక్క, వదరు వుట్టె నెట్టి వరమొ యనుచు
దానిఁ బాఱ[1]వైవఁ దారున్న నాకాశ, వాణి యిట్టులనియె [2]వసుమతీశ.

55. తే. సాహసం బిట్లు సేయంగ [1]జనునె దీని, బీజములు ఘృతఘటములఁ బెట్టి రక్ష
సేయు మఱువది వేవు రూర్జితులు సుతు లు, మేశువరమునఁ
బుట్టుదు[2]రిందు నీకు.

56. వ. అనినం దద్వచనానురూపంబు సేసి రక్షించుచున్న [1]రెన్నెలలకు.

57. క. సుతషష్టి[1]సహస్రక ము, ద్గతమై వర్ధిల్లి గగనగతిఁ బఱచి శత
క్రతులోకముఁ దొట్టి మదో, ద్ధతిఁ జేసె [2]సమస్తలోక[3]తతులకు బాధల్.

58. క. సగరసుతు లట్లు జగముల, కొగి బాధలు సేయుచున్న నోడి మరుత్ప
న్నగవరు లరిగిరి నాలుగు, మొగములుగలవేల్పుకడకు మునిసంఘముతోన్.

59. ఆ. వారిజాసనుండు వారల వచ్చిన, విధమెఱింగి మీకు వెఱవనేల
సగరసుతులు దగ్ధులగుదురు దర్పితు, లైన వారిపేర్మి యధ్రువంబు.

---

52. 1. యక్షైన – జ. ఝ. ల; యట్లుండె – ఐ; యట్లట్ల – డ.

54. 1. వైవగానున్న–పెక్కు ప్రతులు. కాని సర్వయతినియమభంగమగును. 2. ధరణినాథ – అని వావిళ్ళ. కాని యతిభంగమగును; అన్నిప్రతులందును వసుమతీశ యనియే గలదు.

55. 1. జనకు – డ. 2. రెఱమి – ల.

56. 1. కొంతకాలమునకు, కొన్ని దినంబులకు, మాసద్వయమునకు – భిన్న ప్రతులు.

57. 1. సహస్రము తద్గతమై – స (?) 2. సకల – కొన్ని ప్రతులు. 3. తతి ని – ఓ. ఘ. చ. ఠ. ల. శ. ష.

60. వ. అని కమలసంభవుం డానతిచ్చి[1]న నరిగి యమరవరు లాదిగా నఖిలలోకనివాసు లెల్ల సగరసుతపరిక్షయం బపేక్షించి యుండు నంత.

61. సీ. అశ్వమేధంబు సేయంగ దీక్షితుండయ్యె సగరుండు వానియశ్వంబు సగర తనయులచే రక్షితంబై వసుంధర యెల్లం [1]గ్రుమ్మరి [2]తోయహీనమైన [3]జలధిలోపల నదృశ్యంబైనం గానక సగరున కెఱింగించి సగరసుతులు జనకుశాసనమునం జని భూత[4]లమునందుం దడయక రోసి పాతాళతలము

ఆ. నందు రోయం గడంగి యఱువదివేవురు, నొక్క మొగిన గ్రొచ్చి రుదధిలోవ జలధిపంకమగ్నసత్త్వముల్ నిశితకు, ద్దాలహతి విదారితములుగాంగ.

62. వ. ఇట్లు గ్రొచ్చిగ్రొచ్చి సగరసుతులు సముద్రపూర్వోత్తరదేశంబునం గపిలుం డను మహాముని యాశ్రమసమీపమునందుం దమగుఱ్ఱంబుం గని [1]సంతోసిల్లి.

63. ఆ. [1]అశ్వమేధమునకు నర్చితంబైనయీ, యశ్వరాజు నిట్టు లపహరించి [2]ముచ్చు గొఱక యీసముద్రదేశంబున, [3]నోటమెడంద లేకయున్నవాండు.

-: సగరసుతులు గపిలమహాముని కోపాగ్నిచే భస్మమగుట :-

సం. 3 - 106 - 3

64. వ. [1]అని పలికి కపిలుం బరిభవించిన నమ్మునివరుండలిగి యనలశిఖలు దూల నతిఘోరదృష్టిం [2]జూచిన నప్పుడు సగర[3]సుతు లందఱు భస్మంబైన.

---

60. 1. ననమర - కొన్ని ప్రతులు.

61. 1. ద్రిమ్మరి - ఏ. ల. 2. చాలయే (నే?) పుమీటి - స. 3. జలరాశిలో నదృశ్యంబైన - ఈ. ఉ. ఏ. ఒ. ట. ఔ. డ. 4. లంబెల్ల దడయక - ఈ. ఉ. ల.

62. 1. సంతసిల్లి - పెక్కు ప్రతులు.

63. 1. అశ్వమేధమ్మునకునని యర్చితంబునైనయశ్వంబు నీవిట్లయపహరించి ముచ్చుగోలు యీ సముద్రదేశమ్మున నోట యింతలేక యున్నవాడు - శ. ప్రతి - ఇందలి మొదటి భాగము గీతపద్యార్థమును, తరువాతి భాగము ఆటవెలది పద్యార్థమునునై యున్నది. 2. ముచ్చుగోలు - ష. స. సూ. శర; ముచ్చుగోఱగ - ట; ముచ్చు గొంగ - ఛ. జ; ముచ్చుగాగ - ఖ. 3. నోట యింతలేక - ఐ. ఒ. స; నోట మింతలేక - ఈ. శ. ష; నోడకుంట లేక - ల.

64. 1. అని కపిలుం - వా. 2. జూచుడు సగర - అ. 3. సుతులెల్ల - ఆ. ఖ. ఘ. శ.

65. క. వీరు లగుసగరతనయుల, దారుణ[1]దాహంబుఁ జూచి తడయక చని యం భోరుహగర్భతనూజుఁడు, నారదుఁ[2]డంతయును సగరునకు నెఱిఁగించెన్.

66. క. దాని విని సగరుఁ డురుశో, కానలదందహ్య[1]మానుఁడయ్యును నయ్యా [2]శానువచనంబు దలఁచి ధ, రానాథుఁడు శోక[3]భరపరావృత్తుండై.

67. వ. అసమంజసపుత్త్రు నంశుమంతుం దనమనుమనిం జూచి యయ్యా నీయయ్య లఱువదివేవురు నొక్కటఁ [1]గపిలకోపానల[2]కబళితశరీరు లయిరి భవజ్జనకుం డతిక్రూరహృదయుండై పౌరబాలకుల నకారణంబ వధియించి మహానదిలో వైచుచున్న నెఱిఁగి పౌరజనాక్రోశంబు[3]నం దనుక్రోశపరుండనై వాని విడిచితి.

68. క. [1]కొడుకులకు వగవ మును నా, కడఁగిన హయమేధమఖము గడచనమికి నేఁ గడు దుఃఖితుండ [2]నయ్యెదఁ, దడయక నీవిపుడు [3]దీని దలఁగుము కడఁకన్.

69. వ. అనిన నంశుమంతుం డాతఁడంబ చని సగరసుతఖాత[1]ద్వారంబున సముద్రంబు సొచ్చి యందు సూర్యసహస్రద్యుతియై వెలుంగుచున్న కపిలమహామునికి నమస్కరించి నిజాగమనప్రయోజనం బెఱింగించినఁ గపిలుండును [2]వానికిం గరుణించి యాజ్ఞీయంబైన యశ్వంబు నిచ్చి యిట్లనియె.

---

65. 1. దహనంబు – డ. 2. డెంతయును – ల.

66. 1. మానసాత్మకుడై యా – ఝ. 2. శానుని వరంబుదలచి – వ. 3. భరవరా వృతుడయ్యెన్ – ఝ. ల.

67. 1. గపిలు రోషానలహత – ఖ. 2. దగ్ధశరీరు – ఛ. ఝ. ల. 3. న నతిశోకపరుం డైన – కొన్ని ప్రతులు; న నతిక్రోధపరవశుడనై – జ. శ. వ.

68. 1. కొడుకులని ధనమునకు నాకడగిన – ఊ. జ. డ. సూ. 2. నై తిన్ దడయక– పెక్కు ప్రతులు 3. దీని దాల్పుము – ఊ. ఖ. గ. ఝ. డ; కడకదాల్పుముదీ నిన్ – అ. ఎ. ల.

69. 1. ద్వారంబునం బాతాళంబు సొచ్చి – అ. ఎ. ఛ. జ. ఝ. 2. వానికిం గరుణించి యాజ్ఞేయంబైన యశ్వంబు నిచ్చి యిట్లనియె – అన్ని ప్రతులందును నీపాఠమే కలదు.; వాని వినయగుణ భయ భక్తి యుక్తి విశేషంబులకుఁ బరమానంద హృద యుండై వానికిం గరుణించి యాగకృత సంకల్పితంబై యాజ్ఞికంబైన యశ్వంబు నిచ్చి – వా.

70\. క. ఘనభుజ నీకారణమునఁ, జనఁగాంతురు పుణ్యగతికి సాగరులు ముదం
బున సగరునకును దొరకును, నొనరంగ సుతవంతు[1]లైన యుత్తముల గతుల్.

71\. వ. మఱియు [1]నీచేత నుపనీతం బైన [2]యీయశ్వంబున నశ్వమేధంబు సేసి సగ రుండు గృతార్థుండగు నీపౌత్రుం[3]డైన భగీరథుచేతఁ [4]దేరం బడియెడు గంగా[5]జలౌఘంబులం జేసి నంసిక్తులై సగరసుతులు స్వర్గగతు లగుదురు [6]సముద్రంబు సంపూర్ణంబగు ననిన నంశుమంతుండు సంతుష్టుండై కపిల ప్రసాదంబున నశ్వంబుఁ దెచ్చి సగరున కిచ్చి కపిలువచనంబు నెఱింగించిన సగరుండును బుత్త్రశోకం [7]బుడిగి యశ్వమేధంబు సేసి సముద్రుం దనకుఁ [8]బుత్త్రుఁగాఁ [9]గల్పించిన నది మొదలు [10]సముద్రంబు సాగరంబు నాఁబరగె నిట్లు సగరుండు పెద్దకాలంబు రాజ్యంబు సేసి నిజరాజ్యభారం బంశుమంతు నందు సమర్పించి [11]చనిన.

72\. తే. తన పితామహునట్టుల ధరణి యేలి, యంశుమంతుండు [1]నిజపుత్త్రుఁడగు దిలీపు
నందు రాజ్యభారముఁ బూన్చి యఖిలలోక, [2]పూజితుండు దపోవనంబునకుఁ జనియె.

73\. వ. దిలీపుండును దనపితామహులైన [1]సాగరు లధోగతులు గాకుండ గంగావ తరణంబునందు యత్నంబు సేసి [2]యశక్తుండై.

---

70\. 1. లొందు – జ; లఀదు – ఓ.

71\. 1. నునీచేత గృహీతంబైన యీ – డ. 2. యీ యశ్వరత్నంబున – ఎ. ఏ. ఓ. ల. 3. డగు – గ. 4. దేబడియెడు – ఊ. ఏ. ఒ. చ. జ. డ. 5. జలంబులం- చ. ల. 6. సముద్రంబును – ఇ. 7. బు విడిచి – ద. ల. 8. బుత్త్రునిగా జేసె – ఏ. డ. ల; బుత్తుౕం జేసిన – ఎ. త. 9. భావించిన, సంకల్పించిన – అని కొన్ని ప్రతులు. 10. గా సాగరం బనంబడియె నట్లు – ట; గాసాగరంబనంబరంగె–థ. 11. తపోవనంబునకు జనిన – ఉ. గ. ల; తపంబున కరిగిన – జ.

72\. 1. తన – ఈ. ఐ. 2. పూజితుండై – కొన్ని ప్రతులు.

73\. 1. సగరసుతుల – ఊ. ఎ. క. ఖ. ఝ. డ. ల. 2. యశక్తుండై – పెక్కు ప్రతులు; యశక్తుండయ్యె – వా.

74. చ. ప్రథితయశుఁ డ సుతుంబడసె భారసహిష్ణు మహారథుఁ డ భగీ
రథుఁడనుచక్రవర్తి నపరాజితతేజు నిజాన్వవాయదు
ష్పృథవినివర్తకుఁ డ సకలపార్థివజైత్రు [1]మదోద్ధతాసుహృ
న్మథను సురాపగానయ[2]సమర్థతపోగుణయుక్తు నుత్తమున్.

75. వ. ఆభగీరథు నపారభూభారధురంధరుం జేసి దిలీపుండు తపోవనంబున కరిగిన.

76. తే. కపిలు కోపాగ్నిఁ జేసి సాగరులు[1] గ్రాఁగి, రనియు గతిఁ గానకున్న వారనియు నెఱిఁగి
వారలకు హిత మొనరింప [2]వగచి గంగఁ, [3]దేరఁ గడఁగె [4]వీరుండు భగీరథుండు.

77. వ. ఇట్లు [1]భగీరథుండు గంగావతరణంబునందుఁ గృతనిశ్చయుండై యరిగి బహువిధాకారధాతుమంతంబు లైన యుత్తుంగశృంగంబులను [2]జలభర వినమ్ర ప్రబలబలాహకవ్యూహ[3]సంఛాదిత[4]శ్యామాయమానంబు లైన తుహినస్థలంబులను సిద్ధవిద్యాధర గంధర్వ గీర్వాణమిథున సంసేవ్యమానంబులైన నానారత్నకందరంబులను శుక పిక పారావత [5]శుక్లాపాంగ సారంగ శతపత్ర పుత్ర ప్రియదాత్యూహ వ్యూహశబ్దశబ్దాయమానంబు లైన తరువనరేఖలను సింహ శరభ శార్దూల శుండాల గోలాంగూల [6]కోలాహలాన్వితంబులైన గుహాగహ్వరంబులనుం జేసి [7]రమణీయభయానకం బైన హిమవత్పర్వతంబున.

---

74. 1. మహోద్ధతా - ఏ. గ. ఘ. ఝ. డ. ద. శ. 2. సమర్థుదపో - ఖ. ఘ. డ.

76. 1. గాలిరనియు - పెక్కు ప్రతులు. 2. వలసి - ఎ. ఝ. ఠ. ద. ల. స. 3. దేరగా బూనిగడగె భగీరథుండు - ఖ. చ. ఝ. డ. త. ల; దేరబూనిగడంగె భగీరథుండు - స. 4. ధీరుండు - క. ద.

77. 1. భగీరథుండు - కొన్ని ప్రతులందు లేదు. 2. సజలధార - ఎ. డ; జలధర విరామ - ఠ. 3. సంచారిత - పెక్కు ప్రతులు. 4. వ్యోమాయమానంబులైన - అ. ఇ. క. ఖ. జ. 5. శారి మయూర సారంగ సితపక్ష రథాంగదాత్యూహ - ఈ. ఐ. త. శ. ష; రథాంగ శతపత్రపతత్త్రిమయూర దాత్యూహ సందోహ - జ. ల. 6. కోలాహలంబులైన - పెక్కు ప్రతులు. 7. రమణీయంబును భయానకంబును నైన - పెక్కు ప్రతులు.

78. చ. సతత[1]కృతోపవాసముల శాకఫలోదకమూల[2]పారణ
వ్రతముల దేవపూజల నపారజపంబులఁ జేసి నిష్ఠతో
నతులతపంబు సేసె నమరాపగ నుర్వికిఁ దెచ్చు [3]వేడ్కతో
ధృతియుతుఁడై [4]దిలీపకుల[5]దీపుఁడు దివ్యసహస్రవర్షముల్.

79. వ. అభగీరథుతపంబునకు మెచ్చి గంగాదేవి ప్రత్యక్షంబై నీయిష్టంబు సెప్పు మనినం గృతాంజలియై [1]యిట్లనియె.

80. సీ. తపనతేజుం[1]డైన కపిలు [2]కోపంబున గతజీవులై పుణ్యగతుల యందు
[3]నిహతులై మత్పితామహులున్నవారు నీదగు పుణ్యజలముల సగరసుతులు
[4]సిక్తులై స్వర్గాను[5]భుక్తిఁ బ్రాపింతురు [6]గావున దేవి యిద్దేవపథము
నందుండి వసుమతి కొందంగఁ జనుదేరవలయు నావుడు మహీవలయమునకు
ఆ. నేను వచ్చునపుడు నానిరంతర[7]జలౌఘంబు దాల్ప నీలకంఠుఁడోపుఁ
గాని యొరులు దాల్పఁగానోప రయ్యుమా, నాథుకరుణఁ బడయుమన్నుఁ
దాల్ప.

81. వ. అనిన గంగాదేవివచనంబునఁ గైలాసంబున కరిగి భగీరథుండు భగవంతు [1]నంతకాంతకు నీశ్వరు గుఱించి పెద్దగాలంబు తపంబుసేసిన నీశ్వరుండు [2]వానికి సన్నిహితుండయి నీవు భూలోకంబునకు గంగావతరణంబు సేయు మేను గంగ ధరియించెద ననిన భగీరథుండు వెండియు గంగ నారాధించిన నాతనికిం గరుణించి.

---

78. 1. కృతోప - ఓ. గ. చ. స. 2. దారుణ - ఉ. ఝ. 3. వేడుకన్ - కొన్ని ప్రతులు. 4. భగీరదుడు ధీరుడు దివ్య - ఏ. ఓ. గ. ల. స; భగీరథుడు దివ్యుడు దివ్య - ఊ. త. 5. దీప్తుడు - స.

79. 1. వాడిట్లనియె - కొన్ని ప్రతులు.

80. 1. డగు - ఝ. ల. 2. తేజంబున - ట. 3. నిహతులై - పెక్కుప్రతులు.; నిహతులై - వా. 4. ముక్తులై - త. జౌ. డ. 5. యుక్తి - ద. థ. 6. గాన వేవెఁదేవి ఘనపథంబు - స. ఈ పాఠము సర్వప్రాస నియమమునకు భంగము. 7. జలౌఘముల - ల.

81. 1. నంధకాసురహరు - ఊ. ఘ. త. ద. 2. వానికి గరుణించి - పెక్కు ప్రతులు; వానికి - కొన్నింటలేదు.

82. మ. ఇలకుఁ గంగ తరంగ[1]సంగతులతోఁ [2]నేతెంచె నాకాంతరం
బులు నాకాశముఁ [3]గప్పుచుం దగ మహాభూతప్రపంచంబుతోఁ
జెలువై యుండఁగ దాని నీశ్వరుఁడు దాల్చెఁ సంగతోత్తుంగపిం
గళజూటాగ్రము[4]నందుఁ బద్మదళసంకాశంబుగా లీలతోన్.

83. సీ. సురముని[1]సిద్ధఖేచరవరుల్ వచ్చి యచ్చెరువంది చూడంగ హరుశిరంబు
నందుండి భువనైకవందితసురనది [2]ధరణీతలంబున కరుగుదెంచి
కలహంసగతియు నిర్మలఫేనహాసంబు నాకీర్ణమీనవిలోకనములు
నాలోల[3]పవనవాచాలితకల్లోల[4]లసితమృదూక్తులు నెసఁగుచుండఁ

తే. ప్రీతితో భగీరథుఁడను దూత[5]చేత, నీతయై మహామునిపరిపీతరిక్త
మగుసరిత్పతిఁగూడి యాసగరజులకు, [6]హితముగా దానినించె నాతత
జలముల.

84. క. సాగరులకు సద్గతిగా, సాగరము[1]న కట్లుసలిలసంపూర్ణముగా
భూగతయై భాగీరథి, భాగీరథకీర్తి భువనవంక్తుల [2]నించెఁ.

85. వ. అని యిట్లు గంగావతరణంబును భగీరథుమాహాత్మ్యంబును రోమశుండు
సెప్పిన విని ధర్మ[1]జుండనుజసహితుండై యరిగి [2]నందయు నపరనందయును

---

82. 1. సంహాతులతో - కొన్ని ప్రతులు; సంఘములతో - ఝ. 2. నేతేర - ఓ. త; నేతేరె - గ. 3. గప్పి సంభ్రమమహాభూతప్రపంచంబుతో - ఠ. స; గప్పి చంచల మహా - జ; గప్పి సంచల మహా-ష. 4. నన్ సితాబ్జదళసం-అ. ఉ. ఎ. ల.

83. 1. సిద్ధశేఖరులు నచ్చెరు (వడి) పడి చూడంగ హరుజటాజూటసమితియందుండి - స; సిద్ధఖేచరులు నచ్చెరు వడిచూడంగ హరుజటాజూటసమితియందుండి - ఊ. ఈ పాఠములు సర్వప్రాసనియమునకు భంగకరములు. 2. యవనీతలంబున కవ తరించి - ఇ. 3. పవమానచలితవిభ్రమశీతకల్లోలలసితమృదూక్తులు - ఔ. ప్రాసయతినియమ భంగము. 4. రసన మృదూక్తులు - ఉ. ఘ. 5. చేవినీతయై- చ. శ. వ. స. 6. ప్రీతిగావించె నించె నిరాతతముఁగ - ఇ. ఈ. ఏ. ఐ. గ. త. శ. వ.

84. 1. న కట్లు పూర్ణసలిలంబులుగా - క; నకట్లు సలిల - పెక్కు ప్రతులు; ను దివిరి - వా. 2. నినిచెన్ - డ; నిలిపెన్ - ఎ. జ. ఝ. ఠ. ష.

85. 1. తనయుం డనుజసహితుండై - పెక్కు ప్రతులు. 2. నందయు నవనంద యును - పెక్కు ప్రతులు; నందయు వరనందయు నను - ల.

నను మహానదులయందుఁ గృతస్నానుండై [3]హేమకూటంబున [4]నుపలంబుల వలన వెలువడు [5]దహనంబున నాహూతంబులై వచ్చు మేఘంబు[6]లను జూచి విస్మయంబంది దాని విధంబడిగిన వానికి రోమశుం [7]డిట్లనియె ఋషభ కూటంబున ఋషభుండనుముని యతికోపనుండై యెవ్వరువలికిన నపుడె యుగ్రానలాకారుండై [8]యుపలంబులవలన వెలువడు మేఘంబులం బిలిచి వారల వారించు దానంజేసి తపోదానధర్మశమదమరహితులైన జనుల కది దురారోహంబు దేవత[9]లు దేవదర్శనులైన ఋషులు నమ్మునిం జూడవత్తు రిందు [10]దేవఋషులు యజ్ఞంబుసేసిన యజ్ఞభూములందుఁ గుశాకారంబు లయిన [11]దూర్వాంకురంబులు యూపాకారంబులైన వృక్షంబులుఁ గానం బడుననిన నాపుణ్యతీర్థంబున స్నానంబుసేసి యరుగుచున్న ధర్మరాజునకు రోమశుం డిట్లనియె.

86. క. ఇది విశ్వామిత్రుని యా, స్పద మిది కౌశికి యనంగఁ బరగినయది య
ల్లది ఋష్యశృంగుఁ డనుముని, ప్రాద మనవుడు ధర్మతనయుఁ డమ్ముని
కనియెన్.

*-: రోమశుఁడు ధర్మజునకు ఋశ్యశృంగుచరిత్రము సెప్పుట :-*

సం. 3 _ 110 _ 6

87. వ. ఋశ్యశృంగుండను మునిజన్మంబును దచ్చరితంబును విన[1]వలయు [2]నది యెట్లని యడిగిన రోమశుం డి ట్లనియెఁ దొల్లి కశ్యపపుత్త్రుండగు విభాండకుం డనుమునివరుం డఖండితబ్రహ్మచర్యంబునం దపంబు సేయుచు నొక్కనాఁ డొక్కమడువున నీళ్ళాడుచున్న యవసరంబున.

88. క. సురుచిరసురూపగుణసుం, దరి యూర్వశి యను లతాంగి తద్దర్శనగో
చర యగుడు నపుడ [1]రేత, స్స్ఖలనం బమ్మునికి నయ్యెఁ గామకృతమునన్.

---

3. వృషభకూటంబున - కొన్ని ప్రతులు; సోమ కూటంబున - ఔ. ఖ. 4. నుత్పలం బుల వలన - ఎ. ఘ. చ. ఠ. డ. శ. ష. 5. దవానలంబున - ల. 6. ను నిత్యవాత వర్షంబులంజూచి - ఉ. గ. ల. 7. డిట్లని చెప్పె-పెక్కు ప్రతులు. 8. యుత్పలం బుల - కొన్ని ప్రతులు. 9. లును - కొన్ని ప్రతులు. 10. దేవతలు - గ. చ. ల. 11. దూర్వంబులును - కొన్ని ప్రతులు.

87. 1. వలతు - పెక్కు ప్రతులు. 2. జెప్పుమని యడిగిన - ల.

88. 1. రేతఃకరణం బమ్మునికి - పెక్కు ప్రతులు; రేతఃస్ఖలనము నమ్మునికి - గణ.

89. వ. అయ్యమోఘవీర్యంబుతో మిశ్రంబయిన జలంబు నొక్క [1]దుప్పిపెంటి ద్రావి గర్భంబు దాల్చిన నందు ఋశ్యశృంగుం డనుకుమారుండు జన్మించి తండ్రినిం దదాశ్రమంబునుంగాని యొండెఱుంగక ఘోరతపంబు సేయు చున్నంత.

90. తే. బలియుఁ డంగాధిపతి రోమపాదుఁ డనఁగ, ధరణిఁ బరగిన వీరుండు దనపురోహి తాపరాధకృతమున బ్రాహ్మణులచేత, విడువఁబడినఁ దన్మహి కనావృష్టి యయ్యె.

91. వ. దానికి వెఱచి యాతండు బ్రాహ్మణులఁ [1]బరమభక్తి నుపాసించి యీ యనావృష్టిదోషం బేమి కారణంబున నయ్యె [2]దీనికిం దగిన ప్రతీకారం బెద్ది యని యడిగిన వానికిం బ్రసన్నులై బ్రాహ్మణు లి ట్లనిరి.

92. క. కడు [1]దర్పితుఁడని నిన్నున్, విడిచిరి బ్రాహ్మణులు వారు [2]విడుచుడు నమరుల్
విడిచిరి దానన వర్షము, దడసె భవద్దేశ[3]మునకు ధరణీనాథా.

93. ఉ. శాంతుఁడు ఋశ్యశృంగుఁడనుసన్ముని [1]యున్న యెడఁ ధరిత్రికిన్
సంతత[2]వర్షణంబగు [3]భృశంబుగ నట్టివరంబు దొల్లి వృ
త్రాంతకుచే దయం బడసె నమ్ముని గావున [4]ఋశ్యశృంగు వే
దాం[5]తసువేది రాఁబనుపు మంగమహీశ్వర [6]నీదునేర్పునన్.

94. వ. అనిన విని రోమపాదుండు దనచేసిన బ్రాహ్మణావమానంబున[1]కుం దగిన ప్రాయశ్చిత్తంబుఁ జేసి బ్రాహ్మణవచనంబున నపుడ బుద్ధిమంతులతో విచారించి విదగ్ధ[2]వేశ్యాంగనలం బిలువం బంచి మీనేర్పు విధంబుల ఋశ్య శృంగుం బ్రబోధించి యిట తోడ్కొని రండని పంచిన.

---

89. 1. దుప్పి పెంటి మృగంబు – వా.

91. 1. బూజించి యీ – కొన్ని ప్రతులు. 2. దీనికిం బ్రతీకారం – కొన్ని ప్రతులు.

92. 1. దర్పితుండ వని నిను – ఝ ల. 2. విడిచిన – ఝ ష. స. 3. మునను – ల.

93. 1. యున్నెడ తద్ధరిత్రికిన్ – అ. ఎ. ఖ. ఝ. ల. 2. వర్షితంబగు – శ ష. (?); వర్షదంబగు – ఉ. చ. 3. భృశంబగు – వా. 4 నమ్మహాత్ము – చ. 5. తవివేది – అ. ఊ. ఎ. క. ఘ. జ. ఝ. ఠ. డ; తనివేది – ఉ. ఒ. ద. స; తిమవేది – స. నేర్పురూపునన్ – పెక్కు ప్రతులు; నేర్పు నేర్పునన్ – స.

94. 1. కుం బ్రాయశ్చిత్తం – కొన్ని ప్రతులు. 2. వేశ్యాజనంబులం – కొన్ని ప్రతులు.

95. క. ఆవేశ్యాజను లధికర, సావహభక్ష్యములు విలసదనులేపనమా
ల్యావళులుఁ గొనుచు నరిగిరి, [1]నావాశ్రమమునకు నమరనాదుల లీలన్.

96. వ. అట విభాండకుండును యథాకాలం బగ్నిహోత్రంబు వేల్వం దనపుత్త్రి
ఋశ్యశృంగు సమర్పించి వన్యఫలాహరణార్థంబు వనంబున కరిగిన యవస
రంబున నందొక్క జరద్వేశ్య దనకూఁతు నభినవయౌవనవిలాసవిభాసిని
[1]నమ్మునిపుత్త్రపాలికిం బుచ్చిన దానిం జూచి ఋశ్యశృంగుండు సంభ్రమంబున

-: ఋశ్యశృంగుఁడు వేశ్యను మునికుమారునిఁగా భావించుట :-

సం. 3_111_9

97. మధ్యాక్కర.
ఎదుండివచ్చితి ఋషికుమార యేనెన్నఁడు నిట్టి
సుందరాకారు [1]మునిసుతు నేఁదొల్లి చూచి యెఱుంగ
[2]నిందుండు మీవని కృష్ణమృగచర్మకృతకుశాసనము
నందుండఁ[3]గాఁ బనిచె ఋషియనుబుద్ధి నత్తన్విఁ బ్రీతి.

98. వ. మఱియు నర్ఘ్యపాద్యాదివిధులను వన్యస్వాదు[1]ఫలదానంబు[2]లం దాని కతిథి
పూజ [3]సేయనున్న నది [4]యమ్మునివరున కిట్లనియె.

---

95. 1. నావాశ్రమము - వేశ్యలు, క్రొత్తగా (నవముగా) నిర్మించిన ఆశ్రమము - బౌను ప్రతిలో అర్థమీఁబడినది; పావనమగు వాని నిజ తపోవనమునకున్ -కొన్ని ప్రతులు. కాని యతి భంగమగును; పావను నాశ్రమమునకు పణతులు లీలన్ - ద.

96. 1. నమ్ముని పాలికిం - కొన్నిప్రతులు.

97. 1. ఋషిపుత్త్రు జూచియే నెఱుగ - అ. ఓ. ఖ. ఘ. జ. ష. ఛందస్సు? ముని తనయుని దొల్లి చూచి యే నెఱుగ - ల. 2. నిందుండు నిందుండు మని కృష్ణ చర్మావృతకుశాసనము - ఓ; నింద నిందుండుమని కృష్ణచర్మావృత - క. జ. ఠ. ఛందస్సు? 3. గాఁ బంచె ఋషి యనెడి బుద్ధి - ల.

98. 1. ఫలాదులను - ల; ఫలంబులను - ఝ; ఫలవిధానంబులను - డ. 2. లను నతిథి - ఠ. 3. సేయుచున్న - ఐ. ఖ. చ. ఝ. 4. మునికుమారున కిట్లనియె - ఠ.

99. క. మాయాశ్రమ మిందులకుఁ, న్యాయవిధీ మూఁడుయోజనంబులు గల దే
బోయెద నీవును [1]విజయం, చేయుమ యందులకుఁ జెలిమి [2]సేయుము
నాతోన్.

100. వ. [1]అట్లేని నీచేత సత్కారంబు [2]గొందు ననిన ఋశ్యశృంగుం డట్లు సేయుదు నని దాని నాతిథ్యవిధానంబునం బూజించి తనకు [3]దానియిచ్చిన [4]దివ్యగంధ మాల్యంబులును సరసభక్ష్యపానంబులును విచిత్రవస్త్రంబులుం బరిగ్రహించిన నదియును.

101. క. మునిముందటఁ గందుకన, ర్తనమృదుగీతములయందుఁ దనకౌశల మె
ల్లను జూపి విరచితాలిం, గనయై మునిపతికి ముదము గావించె మదిన్.

102. వ. [1]ఇట్లు ఋశ్యశృంగుం బ్రబోధించి[2] వేశ్యాపుత్రి యరిగిన దాని పోయిన [3]వలను సూచుచు ఋశ్యశృంగుం డగ్నిహోత్రంబు [4]వేల్వ మఱచి విపరీతబుద్ధి [5]యైయున్న నంత నడవినుండి వన్యఫలంబులు గొనివచ్చి విభాండకుండు గొడుకుంజూచి యిట్లేల చింతాపరుండవై యగ్నిహోత్రంబు వేల్వక కాలాతి[6]క్రమంబు సేసితనినఁ దండ్రికి [7]ఋశ్యశృంగుం డిట్లనియె.

103. సీ. కాంచనవర్ణుండు గడురూపవంతుండు గమ్మని[1]జడలతో ఘనము లగుచు
ననయంబు [2]వట్రువలగు రెండు[3]పిండంబు లురమున విలసిల్లుచుండ నఱుత
వెలుఁగుచు జపమాల వ్రేలంగ నున్నవ [4]నడుమును వడఁకంగ నడచునపుడు
కలహంసకూజితకలనాద మెసఁగ నా[5]పాలికి నేఁ డొక్కబ్రహ్మచారి

---

99 1. విజయము - ఒ ఓ. ఝ. స०. 2. సేయను - ర.

100. 1. అట్లైన - పెక్కు ప్రతులు; అట్లైన నీచేత సత్కృతంబుగాంతు - డ. 2. గొని యెద - క. ఘ. ర. 3. నది - పెక్కు ప్రతులు. 4. దివ్య రసగంధంబులైన భక్ష్య - కొన్ని ప్రతులు; దివ్య మాల్యంబులును రసస్వాదు గంధంబులైన భక్ష్య - ల.

102. 1. ఇట్లు - కొన్ని ప్రతులు - ఒ. ఓ. గ. ద. ల; మఱియును - ర. 2. మరులు కొల్పి - ఔ. 3. వలనం జూచు - ఔ. 4. వేల్వ మరచి - పెక్కు ప్రతులు; వేల్వక మరచి - వా; వేల్వక కాలా తిక్రమంబుజేసి మరచి - శ. వ. 5. యున్న నడవి నుండి - ఏ. ఝ. ర, యున్నయెడ నడవిలోనుండి వన్యమూలఫలంబులు - ల. 6. క్రమణంబు సేసెదనిన - వా. 7. ఋష్యశృంగుడు - పెక్కు ప్రతులు.

103. 1. యొడలిపై - ఊ; యొడలితో - ఎ. ఝ. స. 2. వట్రువలై - ల. 3. శృం గంబు లురమున - ఉ. 4. నడుము వడంకగ - క. ఘ. ఝ. త. ల. 5. పాలి

ఆ. వచ్చి పోయె వానివదనంబు[6]వలన వె, ల్వడు [7]సుగంధిమధుర[8]భాషితంబు
పొలుచు విన(గ సమదపుంస్కోకిలా[9]లాప, చారు వగుచు హృదయ
సమ్మదముగ.

104. క. ఆఋషి[1]కుమారుకట్టిన, [2]చీరలు నతిమృదులములు విచిత్రములు మనో
[3]హరము వానిబృహ[4]త్కటి, భారమునం దొక్క కనకపట్టము వెలు(గున్.

105. క. [1]పవనసమీరితమధుసం, భవవివిధప్రసవసౌరభ[2]ము( బోలి ముని
ప్రవరుని[3] తనువునయం దు, ద్భవమై [4]రమ్యమయి సౌరభము విలసిల్లున్.

106. వ. మఱియు[1] నక్కుమారుం డొక్క యెఱ్ఱనిఫలంబు దనదక్షిణపాణితలంబున నందంద చఱచుచు నది నేలంబడి యెగయం[2]బోయిన వలనికి ప్రాలుచు వాతావధూతం బైన బాలవృక్షంబునుం బోలె నొప్పుచున్న నమ్మునిపుత్త్రునందు నాహృదయంబు దద్దయుం[3]దగిలినయది.

---

కినిం దొక్క - పెక్కు ప్రతులు. 6, నందు వెల్వడు - ఠ. 7. సుగంధ మధుర భాషణములు - ఓ; సుగంధమధురవాసితంబు పొల్పు - డ; సబంధమధుర భాషణముల పొలువు - న. 8. భాషణముల పొల్పు - శ; భాషణంబు పొలుచు - ఉ. ఈ. ఖ. ఝ. త. స. 9. రావమగుచు - ట; లాపచారు వయ్యె - ల. గ.

104. 1. కొమరుడు - ఆనం. ఉ. గణ; పుత్రుడుకట్టిన చీరలు మృదులములు నవ్యశిష్టములు - గు. 2. చీరము లతిమృదు - ఒ. జ. ద. ల; చీరలు మృదులములుకడు- ఈ. ఏ. ఐ. తి. 3. హారములతని - ఝ. ఠ. శ. 4. త్కచ భారముప్రేలున్ - పెక్కు ప్రతులు.

105. 1. పవనసమాహిత - డ. శ. ష. స; పవనోన్మీలిత - ఘ. ఠ. 2. ములొదవి - అ. ఎ. ఏ. ఝ; ముపొల్చు - ఘ; ముబోలె - ఒ. ల; ముబొలుచు - ఐ. గ. జ; ముపొలుచు - న. 3. నిజతనువునందు - ఝ; నిదేహంబున నుద్భవమై - త. ల; మృదుతనువునం దుద్భవమై - న. 4. యతిహృద్యసౌరభము - ల; సేవ్యమయి - ఖ. ఝ; చోద్యమయి - ట.

106. 1. నమ్మని కుమారుం డొక్క - పెక్కు ప్రతులు. 2. దానిపోయినవలనిక - గ ద. ఠ. ల. 3. దగిలినది; దగిలియున్నది; దగిలియున్నయది - భిన్నప్రతులు.

107. ఉ. నన్నునుఁ గౌఁగిలించుకొని నావదనంబునకుఁ నిజాస్య మా
సన్నముఁ జేసి యొక్కమృదుశబ్దము [1]సేసె మనోహరంబుగా
నెన్నఁడు నట్టిశబ్దము మునీశ్వర మున్ విని యే నెఱుంగ న
య్యన్నువ బ్రహ్మచారిముఖ[2]మంబురుహంబుసమంబు చూడఁగన్.

108. వ. [1]నాయిచ్చిన [2]వన్యస్వాదుఫలంబు లాదరించి యారగింప కమ్మునికుమారుం డమృతోపమానంబులైన ఫలంబులు నతిమధురంబులైనపానీయంబులు నాకు నిచ్చిన నుపయోగించి[3]తి.

109. క. తనచేతిపుష్పములఁ జ, ల్లిన నంతటఁ జెదరి యవి [1]యళిప్రకరనిషే
వన [2]మొప్ప నున్నయవి యి, వ్వనకుసుమము లట్లు గావు వరగంధంబుల్.

110. వ. నాకు నమ్మునిపుత్త్రు నాశ్రమంబునందు వానితో నొక్కటఁ దపంబు సేయు చుండ నిష్టం బనినఁ గొడుకుపలుకులు విని విభాండకుండు విస్మితుండై తప స్వులతపంబులకు విఘ్నంబులుసేయ ననేకరూపులయి రాక్షసులు వనంబునం [1]గ్రుమ్మరుచుండుదురు [2]తజ్జనదత్తంబు లయినపానీయంబు లపేయంబు లతి సుగంధులయిన కుసుమంబులు మునులకు వర్జనీయంబు లని కొడుకుం బ్రబోధించి యెప్పటియట్ల వన్యఫలంబులు దేర[3]నరిగిన.

---

107. 1. నించె - అ. ఖ. జ. ట. 2. మంబు రుహంబును బోలు చూడగన్ - ఐ.

108. 1. ఈ పద్యమునకుఁ బూర్వ మీక్రింది పద్యమధికముగా ఝ. ఢ. ప్రతులలోఁగలదు- అతిలలితాంగు డిందుముఖు డన్నువ జాలతపో...న్మతి నను గౌగిలించుకొని నాకతి ప్రత్యభివాదనంబుగా నతిమృదు శబ్దమిచ్చెనదియామనుశాస్త్రమునందు లేదు సంయు [త] తపద వాక్యముద్రకొక యుత్తరమేమని యిత్తు దన్మతిన్. 2. వన్యఫలం బులుపయోగింపక - పెక్కు ప్రతులు; స్వాదువన్య ఫలఁబు లాదరింపక, స్వాదువన్య ఫలంబు లారగింపక - న. 3. తినట్టిరసవిశేషంబులేను మున్నెన్నడు రుచియించుట లేదు మఱియును - వా. వాక్యముకూడ అన్వయించుటలేదు.

109. 1. యళిప్రకరము మూగిన నొప్పుచున్న యవి (మరి) - పెక్కు ప్రతులు. బోలుచుచున్నయవి - అ. జ. ఘ.

110. 1. గ్రుమ్మరుదురని - కొన్ని ప్రతులు. 2. రసవంతంబులైన (మధువంతంబులైన) పానీయంబు లపేయంబులు. సుగంధు - పెక్కు ప్రతులు; అతిమధురంబులైన పానీ యంబులు, నతిసుగంధంబులైన - ల; సజ్జనదుస్తరంబులై అసజ్జన దత్తంబులై రస వంతంబులైన పానంబు లపేయంబులని - న. 3. విభాండకుండరిగిన - గ. ఝ. ల.

111. క. చనుదెంచి తరుణి మునినం, దనుచిత్తంబునకు వైకృతము జేసె విలా
సినుల సహోలాప సహో, సన సహాయానములు [1]బంధసమములు గావే.

112. వ. ఇట్లు ఋశ్యశృంగుండు విలాసినీమోహితుండయి తండ్రి కెఱింగింపక [1]సుచరిత్రంబయిన తనయాశ్రమంబు విడిచి మనుష్యయోగంబునం దగిలి యక్కోమలి పిఱుందన చని యంగదేశంబు సొచ్చి యందు రోమపాదునాదేశంబున [2]రాజాశ్రయం బను [3]వనంబున నుండునంత.

113. మత్తకోకిలము.

[1]అమ్మునీశునివాసశక్తిఁ దదంగదేశమునందు మే
ఘమ్ములెల్ల [2]వలంకులం గడుఁ గ్రమ్మి సర్వజనప్రమో
దమ్ముగాఁ [3]బ్రభవద్బృహజ్జలధార లొప్పఁగ వృష్టిఁ జే
సె మ్మహో[4]నదులుఁ మహోసరసీవరంబులు నిండఁగన్.

114. వ. ఇట్లు ఋశ్యశృంగు[1]నాగతంబున నంగవిషయంబున నవగ్రహదోషంబు నిరస్తంబైన సంతసిల్లి రోమపాదుండు తనకూఁతు శాంత యనుదాని నత్యంత కాంతిమతి నమ్మునివరునకు వివాహంబు సేసి.

115. క. అనుభోగయోగ్యములుగా,ధనరాసులు భూషణములు దాసీనివహం
బును గాంచనమయ శయ్యా,సనములు [1]మునికిచ్చె
[2]హృదయసంతోషముగాన్.

---

111. 1. సింధు సమములు - స. కొన్ని ప్రతులు. అర్థము?; సీధు సమములు - ఈ. ఎ. జ. త.

112. 1. సచ్చరిత్రుల కాశ్రమంబగు నిజాశ్రమంబు - ఖ. జ. ట. ల; సుచరిత్రంబైన - శ. ష; స్వచరితం - వా. 2. రాజాశ్రమంబను - పెక్కు ప్రతులు. 3. భవనంబున - వా.

113. 1. అమ్మునీంద్రునివాస - పెక్కు ప్రతులు. 2. కెలంకులం - పెక్కు ప్రతులు; గడంగి గ్రక్కున గ్రమ్మినం గడు సర్వమో - అ. క. ఝ. స. 3. బ్రపతద్బృహ- ల. స. 4. నది దీర్ఘికాసరసీ వనంబులు - కొన్ని ప్రతులు.

114. 1. నను గ్రహంబున - పెక్కు ప్రతులు.

115. 1. దగనిచ్చె - ఖ. స. 2. హృదయ సమ్మద మెసగన్ - ఉ. ఓ. ఘ. ఠ. ద.

-: విభాండకుఁడు ఋశ్యశృంగుని వెదకుచు వచ్చుట :-

సం. 3 - 113 - 11

116. వ. మఱియు గోసహస్రంబు లనేకంబు లిచ్చి గోకులసంకులంబుగా ఘోషంబులు దేశంబులనెల్ల నిలిపి నిత్యసత్కారంబుల ఋశ్యశృంగునకుఁ బ్రియంబు సేయుచుండె నంతనట విభాండ[1]కుండు దనయాశ్రమంబునఁ గొడుకుంగానక యెల్లదేశంబులు రోయుచు నంగదేశంబునకు వచ్చి [2]గోగణసంకీర్ణంబైన యొక్క ఘోషంబునందు గోపసత్కృతుండై యొక్కదివసంబు వసియించి యిది యెవరిఘోషం బని గోపాలకుల నడిగిన వార లి ట్లనిరి.

117. క. యతినాథ వినవె యిది నీసుతుఘోషం బిదియకాదు చూడ ననేకా
యుతఘోషంబులు గల వున్నతగుణునకు ఋశ్యశృంగునకు నిద్ధరణిన్.

118. వ. అనిన విని విభాండకుండు సంతసిల్లి ఋశ్యశృంగుతోఁటుపట్ల విశ్రమించుచు రోమపాదుపురంబునకు వచ్చి యందు శాంతాసహితుండైన ఋశ్యశృంగుం జూచి సంతుష్టహృదయుండై తనగొడుకుం గోడలిం దోడ్కొని నిజాశ్రమంబున కరిగె నందు వసిష్ఠున కరుంధతియు నగస్త్యునకు లోపాముద్రయు [1]ముద్గలునకు నాలాయిని యైన యింద్రసేనయుంబోలెఁ దనకుఁ బరమభక్తి యుక్తయై శాంత పరి[2]చర్య సేయుచుండ ఋశ్యశృంగుండు సుఖంబుండె నని చెప్పిన నాకౌశికప్రహ్లదంబున నందఱు నభిషిక్తులై [3]యేనూఱుమహానదుల [4]సమాగమస్థానం బయిన గంగాసాగరసంగమంబుఁ జూచుచు సముద్రతీరంబునం జని కళింగదేశంబున వైతరణి యను మహానదిం గని రంత రోమశుండు ధర్మరాజున కి ట్లనియె.

119. క. మునిదేవవరులు యజ్ఞము,లొనరించిరి తొల్లి దీని యుత్తరతీరం
బున నిది పుణ్యాస్పదమై, తనరును యజ్ఞావభృథశతస్నానములన్.

---

116. 1. కుండును నాశ్రమంబున - పెక్కు ప్రతులు. 2. గోగణాకీర్ణంబైన - ఒ. ఔ. క. ఘ. ఠ. శ.

118. 1. మౌద్గల్యునకు - పెక్కు ప్రతులు; ముద్గలస్యాజమీఢ. భం. 3-113-24. 2. చరించుచుండ - కొన్ని ప్రతులు. 3. యేడునూరు-పెక్కు ప్రతులు. 4. సంగమస్థానంబయిన - ఈ. ఉ. ఐ. క. ఖ. ఘ. త. ద. ష.

120\. వ మఱియు సకలయజ్ఞంబు[1]లయందును బ్రశస్తం[2]బయిన పశుభాగంబు పశుపతికి [3]దేవతలును ఋషులు[4]నిందుఁ గల్పించి [5]రితీర్థంబాడినవారు దేవయానగతు లగుదు రనినం గృష్ణా[6]సహితుండై ధర్మతనయుం[7]డు దమ్ములుందానును వైతరణీ[8]స్నానంబు సేసి రోమశుంజూచి మునీంద్రా నాకు భవత్ప్రసాదంబున నఖిలలోకంబులుం[9]గాననయ్యె వైఖానసుల వేదాధ్యయనశబ్దంబులు [10]విననయ్యె [11]ననిన విస్మితుండై రోమశుండు [12]వైఖానసనివాసం బిందులకు ముప్పదివేలయోజనంబులుగలదు వారల యధ్యయనశబ్దంబులు వింటివి [13]గావున నీవు [14]దివ్యుండవంచు నరిగి యనవరతఫలాలంకృతంబైన యొక్క వనంబు గ[15]ని యిందుఁ దొల్లి స్వాయంభువుం[16]డైన విశ్వ[17]కర్మ యజ్ఞంబు సేసి.

121\. క. [1]దక్షుఁడయి యజ్ఞదక్షిణ, దక్షిణభూభాగమెల్లఁ దా నిచ్చె నశే
షక్షితిధరవనములతో, నక్షయ[2]మతిఁ గశ్యపునకు [3]నార్త్విజ్యమునన్.

122\. వ. దాని కలిగి భూదేవి గశ్యపున[1]కుం బట్టీక రసాతలంబునకు[2]ం బోయినఁ దత్ప్రసాదార్థియై కశ్యపుం డుగ్రతపంబు సేసినం బ్రసన్నయై [3]భూదేవి నీరిలోనుండి వెలువడి వేదిరూపంబునం గశ్యపున[4]కు నిజరూపంబుసూపె నవ్వేది యిదిసుమ్మీ దీనినెక్కినవారు వీర్యవంతు లగుదు రీమంత్రంబున దీని [5]నెక్కుండు [6]పెఱనాఁ డిది దావీక సముద్రంబు సొచ్చునని [7]యగ్నిర్మిత్రో యోని[8]యనునివి యాదిగాఁ గల మంత్రంబు లుపదేశించిన.

---

120\. 1. ఉందు – పెక్కు ప్రతులు. 2. బుతైన పశుభాగంబులు – అ. ఉ ఆ ఝ. 3. సమస్త – పెక్కు ప్రతులు. 4. నునింద – డ. 5. రిందు తీర్థంబాడిన – ఈ. ఉ. 6. సహితులై – ద; సహితంబుగా – శ. ష; సహితంబు – ఉ ఠ. 7. డనుజులు — డ. ల. పెక్కు ప్రతులు; డనుజసహితుండై – ఉ. ఠ. 8. స్నాతులై – పెక్కు ప్రతులు. 9. గానంబడియె – పెక్కు ప్రతులు; గనంబడియె – స. 10. వినంబడియె – ఉ. ఓ. ఔ. ఠ. ద. శ. ష. స. 11. అనిన రోమశుండు విస్మితుండై – త. ల. 12. వైఖానసులనివాసంబు – వా. 13. గావున – పెక్కు ప్రతులలో లేదు. 14. దివ్యపురుషుండ వనుచు – డ. ష. 15. ని యిట్లనియె నిందు – వా. 16. డను – ఎ. ఏ ల. 17. కర్త – ల.

121\. 1. దక్షుండయు యజ్ఞమునకు – ఊ. ఠ. 2. గతి – వా; ముగ – ట. డ. 3. నాయత్తముగన్ (గాన్) – పెక్కు ప్రతులు.

22\. 1. కునిచ్చెదనని రసాతలంబునకు – డ. శ. ష. 2. సొచ్చిపోయిన – స. 3. భూమిదేవి – వా. 4. కుఁబోడ – వా. 5. నెక్కుడిది – ఈ. ఐ. చ. త. శ. 6. పెరవాడిది యెక్కిన – కొన్ని ప్రతులు; లేని నాఁడిదిత్రోవయీక – స. 7. అగ్నిర్మిత్రావరుణ – పెక్కు ప్రతులు. 8. యు నిది యాదిగా – ఠ.

123\. క. అనుజులుఁ దానును మునిశా,సనమున నవ్వేది యెక్కి సమధికవీర్యం
బున నొప్పె [1]బ్రాహ్మణుల దీవన లెసఁగఁగ ధర్మసుతుఁడు వాసవలీలన్.

124\. క. ధరణీసురవరమునిగణ,పరివృతులై యరిగి కనిరి పాండవులు వియ
చ్చర[1]నిర్ఝరసేవితసుం, దరకందర మగుమహేంద్రధరణీధరమున్.

125\. వ. [1]అందుల మహాతపోధనులకు [2]నమస్కారసత్కారంబుల మనఃప్రియంబు సేసి
ధర్మరాజిట్లనియె.

126\. తే. పరమమునులార యిగ్గిరిఁ బరశురాము, శుభచరి[1]త్రుని మీరెవ్వు సూతు రట్టి
యమ్మహాభాగు మీచూచునవసరంబు, నందు మాకునుజూడంగ నమరునొక్కో.

127\. వ. అనిన నమ్మునిసంఘంబులోన రామానుచరుం డయిన యకృత[1]వ్రణుండను
ముని ధర్మరాజున కిట్లనియె.

128\. తే. ధర్మతనయ మీరాక ముందఱ[1]యెఱుంగు, జామదగ్న్యుండు నిర్మలజ్ఞాన
దృష్టి
ననఘ యెల్లి చతుర్దశి నమ్మహాత్ముఁ, జూతు రిమ్మును [2]లీవును జూడు[3]మిచట.

129\. వ. అనిన ధర్మతనయుండు మహేంద్రంబున నారాత్రి వసియించి యకృతవ్రణు
నిట్లని యడిగె.

130\. క. భువన[1]జనస్తుతుఁడగు భా, ర్గవు చరితము వినఁగ నాకుఁ గడుఁ గౌతుక [2]గౌ
రవమైనది దాని ముని, ప్రవర యెఱింగింపు కర్ణపథరమ్యముగన్.

---

123\. 1. బ్రాహ్మణులు దీవన లొసగగ - ల.

124\. 1. నిర్ఝరసేవిత - ల. స; బంధుర - వా.

125\. 1. అందు భృగ్వంగిరసాదులైన మహాతపో - గ. చ. ల. 2. నమస్కరించి
వారలకు సత్కారంబులు - ఖ. ఝ. డ. శ. ష.

126\. 1. త్రుని మీరెట్లు సూతురట్ల - డ.

127\. 1. వ్రవణుడు - పెక్కు ప్రతులు; ప్రణాముండు - డ.

128\. 1. ఎఱింగి, ఎఱింగె - కొన్ని ప్రతులు. 2. లిందరు-స. గ. - లందరు-ఙ. చ. ల.
3. మిందు - కొన్ని ప్రతులు. స; మీవు - కొన్ని ప్రతులు - వ.

130\. 1. స్తుత్యుండగు - వా. 2. మైతివిరినదిమది - స.

-: అకృతవ్రణుఁడు ధర్మరాజునకుఁ బరశురామునిమహిమ సెప్పుట :-

సం. 3-115-9

131. వ. [1]అని యడిగిన ధర్మరాజునకు నకృతవ్రణుం డిట్లని చెప్పెఁ [2]దొల్లి కన్యాకుబ్జంబున గాధియనురాజు[3]కూఁతు సత్యవతి యను దాని భృగుపుత్త్రుం[4]డగు ఋచీకుం డనుమహాముని వివాహార్థియై గాధి నడిగిన నమ్మునివరునకు వాఁ డి ట్లనియె.

132. సీ. ఒక్క[1]కర్ణంబు నీలోత్పలశ్యామమై తనువెల్ల [2]శశిహంసధవళమైన
[3]యిట్టిగుఱ్ఱములు వేయిక్కన్య కుంకు వి ట్లినోపుదేని మునీంద్ర దీని
నమరంగఁ [4]బెండిలియగు మిదిమాకులధర్మంబు నావుడుఁ దరుణిఁ బెండ్లి
యగువేడ్క భార్గవుఁడప్పుడ వరుణేంద్రు[5]పాలికిఁ జని వానిఁ [6]బడసి తెచ్చె

ఆ. నవనినాథ గంగయందుఁ గన్యాకుబ్జ, [7]పురవరంబు[8]నందుఁ బుట్టె నట్టి
హాయసహస్ర మమలమై నాఁటఁగోలెను, నశ్వతీర్థమనఁగ నయ్యె నదియు.

133. వ. ఋచీకుండును గాధికి నిచ్చానమంబులైన హాయంబుల నిచ్చి వానికూఁతు సత్యవతిం బాణిగ్రహ[1]ణవిధిం బరిగ్రహించి సుఖంబున్నఁ గన్యాకుబ్జంబునకు భృగుండు వచ్చి వారలచేతం బూజితుండై కొడుకునుం గోడలిం జూచి [2]సంతసిల్లి యొక్కనాఁడు కోడలి కి ట్లనియె.

---

131. 1. అనిన - పెక్కు ప్రతులు. 2. దొల్లి - పెక్కు ప్రతులలో లేదు. 3. కూతురు- పెక్కు ప్రతులు. 4. డైన ఋచికుండు - ద. ల.

132. 1. వర్ణంబు - వా. 2. కలహంస - ఉ. కవం. ఘ. ద. ఠ. శ. ష. 3. యట్టి గుఱ్ఱములు కన్యకు వేయి యుంకు విట్లినోపు - పెక్కు ప్రతులు; యట్టిగుఱ్ఱములు వెయ్యాకన్యకు నుంకు విడనోపు - ద; యట్టిగుఱ్ఱములు కన్యకు వేయు నుంకువ యీనోపు దేని - ల; యట్టిగుఱ్ఱములు కన్యకుంకువ యీనోపుదేని - స. 4. బెండ్లియై యరుగుము మీకుల - ద. 5. గానంగ - ఉ. ఘ. ఠ. ద. 6. బూనితెచ్చె- ఘ. ఠ. ద; గానంగఁజనివానిఁబూనితెచ్చె - అను పాఠమున ప్రాస యతిగలదు. ఈ సీసము సర్వయతి నియమము గలది. 7. పురమునందు నొంద - కవం. 8. నొద్ద - ఠ. డ. ల. కొన్ని ప్రతులు.

133. 1. ణంబుచేసి - అ. ఎ. ఖ. ఝ. ఠ. - పరిగ్రహించి - వీనిలో లేదు. 2. పంతో - కొన్ని ప్రతులు.

134. క. లలితాంగి యేను నీగుణ, ముల కతి[1]హృష్టుండ నైతి ముద మొనరఁగ ని
మ్ములు నిచ్చెద వేడుము నీ, [2]వలచువరం బనిన సత్యవతి యిట్లనియెన్.

135. వ. [1]దేవా నీప్రసాదంబున నాకొక్కకొడుకును [2]మజ్జనని కొక్కకొడుకు [3]నుద
యింపవలయునని మ్రొక్కినం గరుణించి [4]భృగుండు నీకోరినయట్ల యగు
[5]శుచిస్నాతలయి నీవు మేడి[6]మ్రానిం గౌఁగిలింపుము నీజనని నశ్వత్థంబుఁ
గౌఁగి[7]లింపుమనుమనిన నయ్యిద్దఱుఁ దదాలింగనవిపర్యాసంబు సేసిన
నెఱింగి భృగుండు [8]గోడలి కి ట్లనియె.

136. ఉ. పుత్త్రుఁడు నీకు బ్రహ్మకులపూజ్యుఁడు పుట్టియువాఁడు దారుణ
క్షత్త్రచరిత్రుఁడై పరగు[1]గర్వమునన్ మఱి [2]నీసవిత్రికిన్
క్షత్త్రియుఁ డుద్భవిల్లి యు నఘక్షయకారణుఁడున్ మహాతపః
పాత్త్రుఁడునై ధృతిం బడయు బ్రాహ్మణభావము భూరితేజమున్.

137. వ. అనిన సత్యవతి కృతాంజలియై క్షత్త్రి[1]యభారంబు [2]దనపుత్త్రునకుంగాక
పౌత్రున కగునట్లుగా [3]శ్వశురువలన వరంబు వడసి కతిపయకాలంబునకు
గర్భిణియై.

138. క. ఆదిమునిచరితుఁ బడసెఁ బ్ర, సాదసమన్వితు సుపుత్త్రు జమదగ్నిఁ [1]బతు
ర్వేదంబులయందు ధను, ర్వేదమునందును నతిప్రవీణు మహాత్మున్.

---

134. 1. సంతుష్టుండనైతి — క. ద. 2. వలచిన వరమనిన — పెక్కు ప్రతులు; వలయు వరంబనిన — ద. శ. ప.

135. 1. దేవా — కొన్ని ప్రతులలో లేదు. 2. మాయమ్మ — పెక్కు ప్రతులు. 3. ను గావలయునని — గ. ల. 4. భృగుం డిట్లనియె — పెక్కు ప్రతులు. 5. శుచిస్నానంబుచేసి — కొన్ని ప్రతులు; ఋతుస్నానంబు జేసి — ల. 6. మ్రానును — ఇ. చ; మ్రానుగౌఁగ — శ. ద. 7. లింపం బంపు — పెక్కు ప్రతులు. 8. కోపించి యిట్లనియె — ల.

136. 1. సత్త్వమునన్ — వా; గర్భమునన్ — ద. స. 2. నీదు తల్లికిన్ — ఉ. ల; నీజనిత్రికిన్ — ఇ.

137. 1. యాచారంబు — పెక్కు ప్రతులు. 2. నా — ల. కొన్ని ప్రతులు. 3. భృగువు వలనం — పెక్కు ప్రతులు; అగునట్లుగా ప్రసాదింపుమని — అ. ఔ. ఝ ద. త. ల.

138. 1. క్రియాపాదకు సద్బుద్ధిఁజతు, ర్వేదంబులయందు గడుప్రవీణు మహాత్మున్ — ప.

139. వ. ఆజమదగ్ని ప్రసేన[1]జితుఁ డనురాజ[2]కూఁతు రేణుక యనుదాని వివాహంబయి దానియందు [3]రుమణ్వత్సుషేణ[4]వసువిశ్వావసురాము లనువారి [5]నైదుగురు గొడుకులం బడసి [6]వనంబున నుగ్రతపంబు సేయు[7]చు నొక్కనాఁడు వన్యఫలంబులు దేరంగొడుకులువోయిన రేణుకవారిపిఱుందనపోయి యొక్క సరోవరంబునందు సభార్యుండయి జలక్రీడ లాడుచున్నవాని [8]మార్తికావతపతి[9]యగుచిత్రరథుం డనురాజుం జూచి కామమోహితయై వ్యభి[10]చరించిన దాని దుశ్చరితం బెఱింగి [11]జమదగ్ని కోపోన్మాదపరవశుండై.

140. క. తనయుల[1]నలువురఁ గ్రమమునఁ, బనిచెన్ జమదగ్ని దనదుభార్య వధింపన్
జననీఘాతము పాతక, మనివారలు [2]వలుకకుండి [3]రవ్యవసితులై.

141. క. కడు నలిగి యమ్మునీంద్రుఁడు, గొడుకులకును శాపమిచ్చె ఘోరాటవిలో
జడమతి మృగపశులయ, ట్లుడుక యజ్ఞానవృత్తి నుండుం డనుచున్.

142. వ. మఱియు నిశితపరశుహస్తు రాముం జూచి దీని వధియింపుమని జమదగ్ని పంచిన [1]వాఁడు గురువచనంబునం దల్లిం [2]దక్షణంబున వధియించిన.

143. క. శమితనిజక్రోధుండై, జమదగ్ని తనూజుసాహసమునకుఁ దనవా
క్యము లంఘింపమికిఁ బ్రస, న్నమనస్కుండై తనూజునకు నిట్లనియెన్.

144. వ. నావచనంబున నతిదుష్కరంబైన కార్యంబుసేసితి నీకిష్టంబైన[1]వాని నెల్లను వేఁడు మిచ్చెదననిన రాముండు సంతుష్టహృదయుండై మదీయజనని [2]జీవించి యుండను [3]దద్వధదోషనిష్కృతియు సహోదరులు శాపవిముక్తులయి

---

139. 1. జిత్తుండను – కొన్ని ప్రతులు; జిత్తను – గ. ఘ. చ. జ. ఠ. ల. 2. కూతురు రేణుక – పెక్కు ప్రతులు. 3. రుక్మవత్సుషేణ – ఏ. ఓ. ల; త్సహన – కొన్ని ప్రతులు. 4. వసు – పెక్కు ప్రతులలో లేదు. 5. నలువురు – కొన్ని ప్రతులు. 6. వనంబులో – పెక్కు ప్రతులు. 7. చున్న – పెక్కు ప్రతులు. 8. నంగాధిపతింజిత్ర – ల. పెక్కు ప్రతులు. 9. అగు – పెక్కు ప్రతులలో లేదు. 10. చలించి పచ్చిన – డ. 11. జమదగ్ని – కొన్ని ప్రతులలో లేదు.

140. 1. ముచ్వుర – పెక్కు ప్రతులు. 2. చంపకుండి రవ్యవసితులై – ఠ. డ. 3. రత్యవహితులై – ఈ. ఏ. ఐ. ఒ. త. ల. శ. ష; రపహిత మతులై – డ

142. 1. వాడును – పెక్కు ప్రతులు. 2. నతుణంబ – పెక్కు ప్రతులు; నాతుణంబ – ల.

144. 1. వరంబు – ఖ. గ. చ. ల. 2. దోషవిముక్తయై జీవించి–పెక్కు ప్రతులు. 3. నాకు దద్వధ దోష నిష్కృతియు – కొన్ని ప్రతులలో లేదు; దద్ద్రోహనిష్కృతియు–

యెప్పటియట్లయుండను సమరం[4]బుల నాకప్రతిహత[5]శక్తియు [6]దీర్ఘాయు వుంగాఁ బ్రసాదిం[7]పుండని తండ్రివలనం దనయభిమతంబులు వడసి యుండు నంతఁ గొండొకకాలంబున.

145. చ. అమితబలుండు హైహయుఁ డహర్పతితేజుఁ డజేయబాహువి
క్రముఁడు సహస్రబాహుఁ డనఁగా విదితుం డగువాఁడు తద్వనాం
తమున మృగ[1]వ్యఖిన్నుఁడయి తా జమదగ్నిమహామునీంద్రు నా
శ్రమమున కేఁగుదెంచె బహుసైన్యముతో నధికశ్రమార్తుఁడై.

146. వ. అందు మునివరుచేతం బూజితుండయ్యును వాఁడు దనరాజ్యమదంబున మెచ్చక యయ్యాశ్రమవాసుల [1]కవమానంబుసేసి యందుల వృక్షంబులెల్ల విఱిచి జమదగ్నిహోమధేను[2]వును దరుణవత్సంబుతోఁ గట్టికొనిపోయిన నప్పుడవ్వనంబుననుండి సమి[3]త్కుశఫలంబులు గొనివచ్చిన రామునకు జమదగ్ని యి ట్లనియె.

147. క. వినవయ్య కార్తవీర్యుఁడు, మనధేనువుఁ బట్టుకొని [1]సమర్థుండయి పె
ల్చన పోయె నేమి[2]సేయుద, మనవుడు రాముండు విని మహా[3]క్రోధమునన్.

148. క. గురువచన[1]బోధితుండై, సరభస[2]గతి వానివెఱుఁదఁ జని తద్బలముఁ
శరవృష్టిముంచి చంపె న, పరిమితలయకాలమేఘపటలమపోలెన్.

149. వ. [1]మఱియును.

---

స. 4. బుల యందు, బులందు - కొన్ని ప్రతులు. 5. ప్రతాపశక్తియు - స. 6. చిరాయువుంగా - కొన్ని ప్రతులు. 7. పు మని - కొన్ని ప్రతులు.

145. 1. వ్యకీర్ణుడయి - ద.

146. 1. బాధించి - పెక్కు ప్రతులు; కపరాధంబుజేసి - డ; బాధించి యపకారంబుచేసి - స. 2. నుం దద్వత్సంబుతో - ల. 3. త్తులు కుసుమంబులు, ఫలంబులుగొని - డ; త్కుసుమ ఫలంబులు - ల.

147. 1. సమర్థత మెయి - స; సమర్థతమై - కొన్ని ప్రతులు. 2. సేయుదు ననవుడు - ల. కొన్ని ప్రతులు. 3. క్రోధుండై - ల.

148. 1. చోదితుండై - ఝ. న. 2. మున - కొన్ని ప్రతులు.

149. 1. మఱియును - పెక్కు ప్రతులలో లేదు.

### -: పరశురాముఁడు కార్తవీర్యునిఁ జంపుట :-

సం. 3 - 116 - 24

150. చ. బలిమి నశేషలోకపరిభావి మహోద్ధత[1]శౌర్యసంపదం
బొలుచు సహస్రబాహుకరముల్ [2]గులిశాతినిశాతబాణధా
రల నతివీరుఁడై [3]తునిమి రాముఁ డరాతులకున్ భయంబుగాఁ
గలహములోన వాని [4]నతిగర్వితుఁ జంపెఁ [5]బరాక్రమోన్నతిన్.

151. వ. [1]అంతం గార్తవీర్యుని పుత్త్రులు [2]బద్ధవైరులై రామరహితం బయిన జమదగ్న్యాశ్రమంబు[3]నకు వచ్చి యందు.

152. మ. మునులం దిట్టుచుఁ బుష్పవృక్ష[1]తతు లున్మూలించుచుం గ్రూరులై
యనవద్యున్ జమదగ్నిఁ బట్టి బలిమిన్ హా రామ హా రామ యం
చును నాక్రోశము సేయుచుండఁగ మునుల్ శోకింప ధర్మాత్ము న
మ్మునిముఖ్యున్ వధియించి [2]రాగ్రహమహామోహాంధులై హైహయుల్.

153. చ. వఱలఁగ రాముఁ డంత ననవద్యుఁడు వచ్చి [1]బహుప్రలాపియై
యఱచుచునున్న తల్లిని గృతాంత[2]వశస్థితుఁడైన తండ్రి [3]ను

---

150. 1. కార్య - అ. ఉ. ఝు. ట. 2. గులిశాహతిశాత - ఘ. ద. 3. తునిమె - కొన్ని ప్రతులు. 4. గడు - ఈ. ఐ. త. 5. నిమేష మాత్రలోన్ - ఉ. ఘ. శ. ద; బరాక్రమంబునన్ - పెక్కు ప్రతులు.

151. 1. అంత నక్కార్తవీర్యపుత్త్రులు-కొన్నిప్రతులు; అంతం గార్తవీర్యుండు మృతుండైన నతని పుత్త్రులు - ఏ. ఓ. ల. 2. బద్ధమత్సరులై - ఇ. ఉ. గ. ఘ. చ. ద. ర. 3. పొచ్చియందు - ఉ. బౌ. డ.

152. 1. తతి నిర్మూలించు (పు) చుం - ఊ. ఖ. ప్రతులు తప్ప తక్కిన అన్నిటియందును. 2. రాగ్రహమునన్ మోహాంధులై - వా; రాగ్రహ మహామూఢాత్ములై - బౌ. ట.

153. 1. మహాప్రలాపియై - ఏ. ఐ. కసం. ర. డ. త. శ. శర; ప. సూ. బహుప్రలాపియై - పెక్కు ప్రతులు. 2. వశీకృతుడైన - ఈ. ఐ. ఒ. త. ద. ల. శ. ష. 3. నిక్కెరగని... ఖేదహతుండయి - కొన్ని ప్రతులు; నుక్కెరగని......ఖేదహంతుయి - ఏ. ఓ. ష. స.; నొక్కెఱఁగని...ఖేదహంతుడయి - చ. స; నుక్కరగని...ఘాతహతుండయి- ఈ. ఐ. గ. త; నివ్వెరగని తీవ్రఖేదపరివేదనుడై యదియట్లు నేర్పడన్నరిగి.

క్కఱఁగని తీవ్రశోకపరిఘాతహతుండయి తత్ప్రకార[4]మం
దెటిఁగి ముహూర్తమేనియు [5]సహింపఁగ నోపక [6]కోపదీప్తుఁడై.

154. చ. అనఘు [1]ని వీతరాగుఁ గరుణాత్ముఁ బ్రశాంతు[2]ని దాంతు నిమ్మహా
[3]మునివరుఁ జూచిచూచి యధముల్ వధియించిరి దీనఁ జేసి దు
ర్జనులగుచున్న క్షత్త్రియులఁ జంపుదు నంచుఁ బ్రతిజ్ఞ సేసె భూ
వినుతుఁడు జామదగ్న్యుఁడతి వీరుఁడు [4]లోకభయంకరాకృతిన్.

155. వ. ఇట్లు కృతప్రతిజ్ఞుండై క్షత్త్రియులనెల్ల వధియించి దిగ్దంతి[1]దంతాగ్రశాఘాట [2]మహీచక్రంబు సాధించి [3]విధివిహితవిధానాధ్వరుండై కశ్యపునకు నార్త్విజ్య దక్షిణగా [4]నఖిలభూవలయంబు [5]నిచ్చి నిస్సంగుండై మహేంద్రపర్వతంబునం దపోనిత్యుండై యున్న వాఁడని పరశురాముచరితంబు సెప్పిన విని ధర్మజుం డనుజబ్రాహ్మణసహితుండై మునిగణోపదేశంబునం జతుర్దశినాఁడు పరశురాముం జూచి పరమభక్తిం బూజించి తత్ప్రతిపూజితుండై దక్షిణదిక్కునకుం జని.

156. క. [1]భూవినుతంబై త్రిభువన, పావనమై [2]త్ర్యంబకప్రభవమైన జలౌ
ఘావళిఁ [3]బవిత్ర మగు గో, దావరిఁ బుణ్యానదిఁ[4]గనియె దక్షిణగంగన్.

---

ముహూర్తమైనను సహింపగ నోపక శోకదీప్తుడై – ఔ; దిక్కెరుగని తీవ్రఖేద – శ; నత్తటిఁగని తీవ్రశోకపరితాప – వా. 4. మున్నెఱిగి – అ. ఎ. ఝ. ణ. 5. సహింపక నంతక – స. 6. క్రోధదీప్తుడై – కొన్ని ప్రతులు; రోషదీప్తుడై – క.

154. 1. ననాత తాయి – వా; నివీతరాగు – కొన్ని ప్రతులు. 2. నిరాగ సున్మహా – పెక్కు ప్రతులు. 3. మునివరు హైహయుల్ కరము మూర్ఖులు చంపిరి దీన – ఉ. ఘ. ఠ. 4. శోక – ఈ. ఐ. త.

155. 1. దంతాగ్రశాఖరణీభూతమహీ – అ. ఇ. ఎ. ఝ. డ. ణ. ల. శ. ష. 2. ధరా – అ. ఇ. ఎ. ఝ. ణ. ల. 3. విహిత వివిధాధ్వరుండై – వా; విధివిహిత విధానా – శ. ష. కొన్ని ప్రతులు. 4. నఖిల – కొన్ని ప్రతులలో లేదు. 5. నిచ్చి మహేంద్ర – పెక్కు ప్రతులు.

156. 1. భూవిదితంబై – అ. క. ఘ. చ. ఝ. ఠ. ణ. ప. స. 2. యఘ కళంకపంకము వాపున్ గావున ప్రశస్తమగు గోదావరి – ఉ. ఘ. 3. ప్రశస్త – కొన్ని ప్రతులు. 4. గనిరి – పెక్కు ప్రతులు.

157. శా. గోదేవక్షితిదేవభక్తిపరుఁడై గోదావరి[1]స్నాతుఁడై
[2]గోదానంబులు హేమదానములుఁ బెక్కుల్ రత్నదానంబులన్
భూదేవోత్తమపూజ సేయుచు జగత్పూజ్యుండు ధర్మాత్మజుం
డాదిత్యాభుఁ డనేకతీర్థ[3]శతసేవా[4]సక్తపుణ్యాత్ముఁడై.

158. వ. ద్రవిళదేశంబున నగస్త్యతీర్థం బాడి యందుఁ దొల్లి యర్జునుచేసిన [1]గోసహస్ర దానాదివివిధదానంబులు విని వానిం బ్రశంసించుచుం జని [2]శూర్పారకంబను తీర్థంబునం బర్వతోత్సేధం బయిన పరశురామువేదిం గని [3]సముద్రతీరంబునకుం జని ప్రభాసతీర్థంబునం బండ్రెండుదినంబులు [4]పవనాంబుభక్షుండై పంచాగ్ని మధ్యంబున ధర్మజుండు దపంబు సేసిన.

159. ఆ. దాని నెఱిఁగి రామదామోదరులు వృష్ణి, వరులతోడఁ బ్రీతి నరుగుదెంచి
కనిరి సకలతీర్థగమన [1]పరిక్లేశ, కృశులఁ బాండుసుతుల విశదయశుల.

160. క. చీరాజినధారుల నవి, కారతపో[1]యుతులఁ జూచి కడుదుఃఖితులై
వారిజదళాక్షి ద్రౌపది, నూరార్చి[2]రుదారహితమృదూక్తుల నొప్పన్.

161. వ. వారికి ధర్మతనయుండు దమవనవాసతీర్థగమనాయాసంబును నర్జును దివ్యాస్త్రలాభంబును నింద్రునొద్ద నాతనియునికియుం జెప్పిన విని రాముండు గృష్ణాదులైన వృష్ణి[1]వరుల కిట్లనియె.

---

157. 1. స్నానుడై - బొ. క. గ. 2. మోదం బందుచు భీమముఖ్యులగు తమ్ముల్ ద్రౌపదింగూడిరా - బొ. 3. పద - ఈ. ఏ. ఐ. ఓ. జ. త; పరి - ద; వర - శ. ఝ. 4. మేయ పుణ్యాత్ముడై - ఈ. ప ఐ. త. ల; స్నాన - ఇ. స.

158. 1. గోసహస్రాది నానావిధ మహాదానంబులు - పెక్కు ప్రతులు. 2. శూర్పా కారంబను - వా. పునః స శూర్పారక మాజగామ. అని మూలము. 3. పశ్చిమ సముద్ర - ల. 4. పంచాగ్నిమధ్యంబునం బవనాంబు భక్షకుండై ధర్మజుంతు-వా; పవనాంబు భక్షుండై పంచాగ్ని మధ్యంబున - కొన్ని ప్రతులు.

159. 1. పరిక్లేశ - పెక్కు ప్రతులు; పథక్లేశ - వా.

160. 1. యశుల - శ. మ. స; ధనుల - ఊ; మయుల - బొ. చ. డ. 2. రుదాత్త మృదు హితోక్తుల నొప్పన్ - శ.

161. 1. వీరుల - కొన్ని ప్రతులు.

162\. సీ. మతిహీనుఁడై తనసుతునిపల్కులు విని ధృతరాష్ట్రుఁ డీపాండుసుతులఁ[1]బాప
[2]భీరుల [3]నపగతధారుణీరాజ్యులఁ జేసి యుగ్రారణ్యవాసగతులఁ
గావించె నిది ధర్మువే విచారవిహీనుఁడయ్యె భీష్మాదులు నెయ్య[4]మున ని
వారింపఁగా దీని నేరర దృఢసత్యరతులకు దేవ[5]నిర్మితుల కహిత
ఆ. మాచరించుచున్న నీచదుర్యోధనా, దులకు వర్ధ[6]నమును నలఘులైన
పాండునందనులకు దండితారుల కవ, ర్ధనము నిట్లు సేయఁ [7]జనునె విధికి.

163\. క. ధరణీతలంబు నిర్ధా, ర్తరాష్ట్రముగఁ జేసి యనఘు ధర్మైకధురం
ధరు ధర్మతనూజు వసుం, ధర కధిపతి జేయకుండఁ దగునే మనకున్.

164\. వ. అనిన బలదేవునకు సాత్యకి యిట్లనియె.

165\. చ. అనుపమశౌర్యవంతుల రనంతబలాఢ్యుల రీవు నీజనా
ర్దనుఁడును సాంబసారణులు దర్పకవీరుఁడు నుండఁ బాండునం
దనులు సుయోధనాదులకృతంబున నిట్టు లనాథులట్ల యి
వ్వనమున నుండఁగాఁ దగునె వన్యఫలాశ[1]న హీనవృత్తితోన్.

166\. తరలము.
అహితచిత్తవిదారణక్రియలందుఁ బ్రౌఢములై జగ
త్కుహర మంతయు మ్రోయుచుండఁగ ఘోరయాదవసైన్య స
న్నహనదుందుభి[1]నాదముల్ గగనంబు దిక్కులు నిండ దు
స్సహము లయ్యెడు ధార్తరాష్ట్రుల సైన్యవీరభటాలికిన్.

167\. మ. ఘనమై నీపృథుబాహులాంగలముఖాఘాతంబుతోడఁ జనా
ర్దనశార్ఙ్గచ్యుతసాయకావలియుఁ గంద ర్పేషుజాలంబు నీ
యనిరుద్ధోగ్రశిలీముఖాలియు మదీయాస్త్రౌఘముం ధార్తరా
ష్ట్రనికాయోత్తమకాయఖండనపటిష్ఠం బయ్యెడుం బోరిలోన్.

---

162\. 1. నధికవీరుల - కొన్ని ప్రతులు. 2. దూరుల - ఠ. 3. నపహృత - పెక్కు ప్రతులు. 4. మమర వారింప - వా 5. సమ్మితుల - అ. ఉ. క. ఘ. ఠ; సమ్మతుల - ఇ. ఔ. ఝ. 6. నంబు నలఘు - పెక్కు ప్రతులు. 7. దగునె - వా. సర్వప్రాస నియమమునకిది విరుద్ధము; జనునె - క. ఘ. ఠ.

165\. 1. నలై విహీనులై - వా; న హీనవృత్తిలోన్ - డ.

166\. 1. రావముల్ - సం.

168. వ. కేకయసృంజయపాంచాల[1]వృష్ణిభోజాంధకవీరులుం గృష్ణానుమతులయి యుద్ధంబున ధృతరాష్ట్రపుత్త్రులను భీష్మ[2]ద్రోణకర్ణాదులను వధియింతురు ధర్మరాజు దమ్ములుం దానును సమయాబ్దంబులు సలిపి రాజ్యాభిషిక్తుండగు నంతకు [3]నతిరథు నభిమన్యు నఖిలరాజ్యరక్షకుం[4]జేసి యుండుద మనిన సాత్యకి పలుకుల కనుకూలుం డయి [5]వాసుదేవుండు ధర్మరాజున కి ట్లనియె.

169. ఉ. ఈతనిపల్కినట్లు ధరణీశ్వర నీరిపులఙ్ మహాబలో
పేతులఁ బోరఁ జంపుదు రభేద్యులు వీరలు మీకు [1]భూతధా
త్రీతలరాజ్య మెల్ల నగుఁ దెల్లము నావుడు ధర్మనందనుం
డాతతకీర్తి యిట్లనియె నమ్మురవైరికి సీరపాణికిన్.

170. ఉ. మీదయ మాకుఁ గల్గఁగ నమిత్రుల నోర్చుట [1]యేమిపెద్ద ధ
ర్మోదయనిత్య[2]బుద్ధులను నుత్తమకీర్తుల [3]నొప్పు ద్రోణభీ
ష్మాదులసన్నిధానమున[4] నమ్మెయిఁ బల్కినపల్కు దప్పఁగాఁ
గాదని ధర్మనందనుఁడు గ్రమ్మఱిచెన్ యదువీరకోపముల్.

171. వ. యాదవులు పాండవుల వీడ్కొని పోయి రట పాండవులు [1]సోమమిశ్రితతోయయైన పయోష్ణియందుఁ గృతస్నానులయియున్న నందు ధర్మరాజునకు రోమశుం డి ట్లనియె

172. క. మనుజేంద్ర దీనితీరం, బున [1]నృగుఁ డనురాజు యజ్ఞములఁ జేసిన నం
దనిమిషపతి తృప్తుండై, దనుజుల[2]నోర్చనకు ఘోరతర[3]శస్త్రములన్.

---

168. 1. యదువృష్ణి – ల. కొన్ని ప్రతులు. 2. ద్రోణ ద్రౌణి కృప కర్ణాదులను – పెక్కు ప్రతులు. 3. నతిరథు – కొన్ని ప్రతులలో లేదు. 4. జేయుద మనిన – అ. ఈ. ఉ. ఐ. గ. ఝ. ఞ. 5. వాసుదేవుం డిట్లనియె – పెక్కు ప్రతులు.

169. 1. భూరి – వా; భూత – పెక్కు ప్రతులు

170. 1. యెంత పెద్ద – అ. ఈ. ఎ. క. ఝ. ఞ. త. ష. 2. పుణ్యులను – గ. ల; సత్యులను – క. 3. నొప్పుచున్న భీష్మా – ఈ. ఏ. ఐ. ఓ. త. 4. నట్టుల – ఇ. త. ఒ. క. ఆ; మానుగ – ఏ. ఓ; నప్పుడు – జ ఝ.

171. 1. సోమశ్రవ సమ్మితమైన – శ. ష; సోమశ్రవ మిశ్రితమైన – ఈ. ఏ. ఓ; సోమశ్రవ సనిస్సృతతోయ – స.

172. 1. నృగుడను – పెక్కు ప్రతులు; భృగుడను – వా. 2. దెగటార్చె ఘోర – కొన్ని ప్రతులు; దానోర్చె ఘోర– చ. ద. స. 3. సమరములన్ – పెక్కు ప్రతులు.

173. వ. మఱియు నిందతొల్లి యా[1]ధూర్తరయసుం డైన గయుండు హిరణ్మయంబు లయిన [2]చపాలస్థాలీ[3]యూపచమసపాత్రీస్రుక్స్రువంబులును [4]దేవస్థాపితంబు లయిన యూపంబులు నొప్ప నేడశ్వమేధంబులు సేసి యసంఖ్యాతంబు లయిన ధనంబుల ఋత్విజులను సదస్యులనుం [5]బూజించి సువర్ణమయగోదానంబు లనేకంబులు బ్రాహ్మణుల కిచ్చి[6]యక్షయంబు లయిన యింద్రలోక[7]సుఖం బులం బడసెం బయోష్ణియందుఁ గృతస్నానులైనవారు [8]దేవసాయుజ్యంబుఁ బడయుదు రని[9]చెప్పుచుం జని నర్మదాస్నానంబుఁ జేసి[10]వైడూర్యపర్వతంబుఁ గని రోమశుం[11]డు ధర్మరాజున కిట్లనియె నిది త్రేతాద్వాపరసంధి యీసరో వరతీరంబు [12]శర్యాతియజ్ఞప్రదేశంబు మఱియు నిందు భృగుపుత్త్రుండయిన చ్యవనుండు శర్యాతియనురాజు[13]కూఁతు సుకన్యయనుదాని వివాహంబయి వానియజ్ఞంబున నింద్రు[14]నాదరింపక [15]యాశ్వినుల సోమపీథులం జేసె ననిన నది యెట్లని యడిగిన ధర్మరాజునకు సౌకన్యాఖ్యానంబు సవిస్తరంబుగా రోమశుం[16]డిట్లనిచెప్పె.

*-: రోమశుఁడు ధర్మరాజునకు సౌకన్యాఖ్యానంబు చెప్పుట :-*

సం. 3 _ 122 _ 1

174. క. ఇక్కొలనిసమీపంబునఁ, [1]బెక్కగు వేలేండ్లు తపము భృగు[2]సుతుఁడు గరం
బక్కజముగ నొనరించెను, [3]వెక్కసనియమమున నిరతవీరాసనుఁడై.

---

173. 1. యశోధనుండైన-పెక్కు ప్రతులు; యశోఘనుండైన, ఆశాపూరితయశుండైన - ఆశావిదితయశుండైన-భిన్నప్రతులు. అధూత రజఃపుత్రుండైన—ౘ. 2. ఝుపాల— డ. శ; కపాల — ర; చ పాల యూపస్థాలీ — ఏ. ఓ. చషాఃస్థాల్యూప విజర స్రుక్స్రువం—ఆ. ఆ ఎ. క. డ. శ. 3. యూపవేదిస్రుక్స్రువంబులును వేదోత్థాపితంబు లయినయూపంబులు — ల. 4. వేదోత్థాపితంబులయిన — ల. 5.దనిపి - ఆ. ఈ. ఏ. ఐ. ఓ. గ. త ల. 6. యక్షయంబైన పుణ్యలోక సుఖంబు (లు) వడసె — కొన్ని ప్రతులు. 7. సుఖంబనుభవించె — ర. 8. త్రిణయన సాయు జ్యంబు — ల; గయాసాయుజ్యంబు — ఒ. ఘ. ర. ద.. 9. చెప్పుచు నప్పయోష్ణి గడచి నర్మదా - ల. 10. వైడూర్య — పెక్కు ప్రతులు; వైదూర్య — వా. 11. డిట్లనియె — పెక్కు ప్రతులు. 12. సంయాతి — పెక్కు ప్రతులు. 13. కూతురు — ఝ. ద. ల. 14. నారాధింపక — అ. ఆ. ఏ. క. గ. ఘ చ జ. శ. 15. యశ్వినుల - కొన్నిప్రతులు. 16. డిట్లనిచెప్పె - పెక్కుప్రతులు; డిట్లనియె-వా.

174. 1. బెక్కులు వేలేఁడ్లు - అ. ఊ. ఓ. ఔ. క. ఘ. ఝ. ర. త ద. 2. పుత్రుడు దా నక్కజముగ - డ. ల. 3. తక్కక యమనియమసంభృతకచతురుండై - ఇ. ఐ. త; వెక్కసముగ నియమపరతవీరాసనుడై - జ. ల; తక్కక యమనియమ నియతిదర్భా సనుడై — ష; వెక్కసముగ నియమ నియత వీరాసనుడై — గ; తక్కకయమ నియమసంభృతా చరణుండై — డ; వెక్కకు యమ నియమ నిరతి వీరాసనుడై — స;

175. క. అమ్మునిదేహము వల్మీకమ్మునఁ గప్పంగఁబడి [1]నికటవల్లీగుల్మమ్ములపైఁ బ్రాఁకిన [2]నన, యమ్మును నేర్పడకయుండె నవ్వనభూమిన్.

176. వ. అంతం బెద్దగాలంబునకు శర్యాతి యనురాజు దనచతుస్సహస్రదేవీనివహంబుతోడఁ దత్సరోవరంబున విహరింప నరిగిన నాతని కూఁతురు సుకన్యయనునది యిష్టసఖులతోఁ గ్రుమ్మరుచున్న నవ్వల్మీకంబునందు.

177. క. విద్యుల్లతాంగి భార్గవు, నుద్యన్నయనములు మెఱచుచున్నను విలసత్ఖద్యోత[1]ద్యుతులొకొ యని, సద్యస్సంజాతబుద్ధి [2]సంభ్రమ యగుచున్.

178. వ. అప్పు డప్పుట్ట[1]గ్రొప్పించిన నలిగి నిమీలితనయనుండై చ్యవనుండు శర్యాతిసైన్యంబుల కెల్ల మూత్రపురీషనిరోధంబుఁ జేసిన నది దనసైన్యాపరాధంబున [2]నయ్యెఁ గా వగచి వాఁ డెల్లవారి నడిగి తత్కారణం బెఱుంగ నేరక [3]చింతాపరుండై యున్నఁ దండ్రికడకు వచ్చి సుకన్య యిట్లనియె.

179. తే. మిన్న మిడుఁగుఱు[1]లట్టులై [2]మెఱసి రెండు, మెఱుఁగు లొక[3]పుట్టలో నున్న నెఱుఁగ కేను
బుట్ట[4]గ్రొప్పించి యారెంటి[5]పొడవుఁగాన, కుడిగి వచ్చితి విస్మయపడి మనమున.

180. వ. ఈసైన్యనిరోధంబున కిది నిమిత్తంబగునో యనిన శర్యాతి యప్పు డాపుట్ట[1]యొద్దకు వచ్చి యందుఁ [2]దపఃక్లేశంబునఁ గృశత్వగస్థిభూతశరీరు నతివృద్ధు భార్గవుం గని నమస్కరించి యిట్లనియె.

---

175. 1. నకడువల్లీ — డ. శ. 2. నెయ్యమ్మున నేర్పడక — ఇ. ఈ. ఐ. శ. ష.

177. 1. ద్యుతి యొకొ — గ. ఘ. చ. ఝ. ఠ. ల. 2. సంభృత — శ. ష.

178. 1. త్రొవ్వించిన — ఔ. ట. శ; గ్రొవ్వించిన — అ. జ; ద్రోపించిన — ఠ. 2. నయ్యెం గాక యని వగచి — ఇ. ఈ. ఝ. ఠ. ల. 3 చింతాక్రాంతుడై — అ. ఆ. ఈ. ఎ. ఐ. ఝ. త.

179. 1. లట్టివై — ఝ. ఠ. ల; లై రెండు మెరచుచున్న — స. యతి ? 2. మెరచి — ఊ. ఏ. ఔ. ఝ. ద. 3. పుట్టపై — ఏ. డ. ద. శ. ష. 4. త్రొవ్వించి — ఔ. శ. ష; గొట్టించి — ఝ. 5. పొడవు — ఉ. ఊ. ఏ. ఓ. గ. ఝ. ఠ. డ. ల. శ. ష. స; పొలుపు — వా.

180. 1. వద్దికి — క. ఔ. క. ల. 2. దపఃక్లేశత్వగస్థిశేష శరీరు — ల.

181. క. [1]అమితంబగు [2]నీతపము మ, హిమ యెఱుఁగక యిట్లుచేసె నిది దీని సహిం[1]
పుము దయ మత్తైన్యనిరో, ధము వాపుమ యెఱుకగలరె
తరుణులు ధరణిన్.

182. వ. అనిన భార్గవుండు కరుణించి యతిశయరూపయౌవనగర్వితయైన యాకన్యకం బరిగ్రహించికాని [1]సహింప ననిన శర్యాతి తనకూఁతు నమ్మునివరున కిచ్చి నిజసైన్యనిరోధంబుఁ బాచికొని చనిన.

183. ఆ. పతికిఁ బరమభక్తిఁ బరిచర్యసేయుచు, [1]నొనరఁగా సుకన్య యుండునంత
నాలతాంగికడకు [2]నాశ్వివను లేతెంచి, తమ్మెఱుంగఁ జెప్పి దాని కనిరి.

184. వ. అవ్వా నీవెవ్వనికూఁతుర వెవ్వని భార్యవని యడిగిన నేను శర్యాతికూఁతుర భార్గవుం డయిన చ్యవనునిభార్య ననిచెప్పిన విని వారలు నగి యక్కటా యిట్టిరూపవిభవంబులు వడసి కామభోగబాహ్యుఁ డయిన వృద్ధు [1]భార్గవుని వరియించి నీ[2]జవ్వనం బెల్ల వృథచేసి తింకనైనను నీవయోరూపంబులకుం దగిన వరు[3]వరియింపు మేము వానిఁ దెచ్చెద మనిన [4]నప్పలుకులు సహింపక [5]సుకన్య యాశ్వినుల కిట్లనియె.

185. ఆ. చ్యవనునందు నాకు సంతతప్రీతియై, యుండ నిట్లు[1]పలుకు టుచిత మగునె
యని [2]నిజేశ్వరునకు నప్పుడ వారల, పలుకు[3]లెల్లఁగఁ జెప్పెఁ బంకజాక్షి.

---

181. 1. అమితమగు నీదు — ఝ. క. స. 2. నీ తపము — గు. తి.

182. 1. క్షమింప — వా.

183. 1. నొనరనా — ఎ. ఏ. జ. ఝ. 2. నశ్వినులు వచ్చి తమ్మెఱుగ జెప్పి దాని కిట్టు లనిరి — పెక్కు ప్రతులు.

184. 1. భార్గవు వరియించి — పెక్కు ప్రతులు. 2. యవ్వనంబేల — అ. ఎ. ఐ. ట. జ. ఝ; జవ్వనంబేల - ల. 3. వరియింపు వాని - పెక్కు ప్రతులు; వరియింపుము వాని — ఝ. 4. నప్పలుకులవలన ననాదరంబు చేసి వారల కిట్లనియె — ఈ. ఐ. త. 5. సుకన్య యిట్లనియె — కొన్ని ప్రతులు.

185. 1. పలుక నుచితమగునె-చ. ల. 2. మునీశ్వరునకు-కొన్ని ప్రతులు. 3. తెల్ల జెప్పె- ఐ. ఝ. ల. స; దూపుజెప్పె — ద.

186. వ. చ్యవనుండు దానిపతివ్రతాత్వంబునకు [1]సంతోసిల్లి వారల పలుకుల కొడం బడుమని పంచిన నది పతిచేత ననుజ్ఞాతయై చని [2]నాకు నవయౌవనవరుం గావింపుం డనిన నాశ్విను లప్పు డక్కొలను సొచ్చిరి భార్గవుండును వారితోడ సరఃప్రవేశంబుసేసె నిట్లమ్మువ్వురు నవయౌనులయి సుకన్యకడకు వచ్చి నిలిచి మాయందు నీ[3]వలచువానిని వరియింపుమనిన నది తనపతియైన భార్గవుని వరియించె నంత నయ్యాశ్వినుల కతిప్రీతుండయి చ్యవనుం డిట్లనియె.

-: చ్యవనుఁ డాశ్వినుల సోమపీథులఁ జేయుట :-

సం. 3 - 124 - 21

187. తే. ఏను మీకారణంబున [1]నిపుడు లబ్ధ, [2]యౌవనుండనై ధన్యుండనైతి మిమ్ము సోమపీథులఁ జేసెద సురల[3]రాజు, సూచుచుండఁగ శర్యాతిసుక్రతువున.

188. వ. అనిచెప్పిన నాశ్వినులు సంతసిల్లి యరిగి రట శర్యాతి భార్గవు జరాభారపరి త్యాగంబు విని విస్మితుండై యల్లునిం గూఁతుం జూడవచ్చిన నాతని సత్కృతుంజేసి భార్గవుం డిట్లనియె.

189. క. విదితముగ నిన్నుఁ జేయిం, చెదఁ గ్రతువు ధరాధినాథ చేయుము నీక భ్యుదయంబగు సంభారస, ముదయము సమకట్టు మనిన మునివచనమునన్.

190. క. అనఘుఁడు శర్యాతి మఖం, బొనరించె విధిప్రయోగయుతముగ నం దా శ్వినులకు సోమం బీఁ బో, యిన భృగుపుత్త్రునకు నలిగి యింద్రుం డనియెన్.

191. క. వీరిద్దఱు సోమార్హులు, గా రమరులవెజ్జు లిది యకర్తవ్యము బృం దారకులు గానివారికి, వారింపక సోమమిచ్చు వారుం గలరే.

192. వ. అనిన నింద్రువచనం బాదరింపక చ్యవనుం డాశ్వినుల సోమపీథులం జేసిన [1]దాని సహింపక యింద్రుం డలిగి.

---

186. 1. పంతసిల్లి - పెక్కు ప్రతులు. 2. నా పతి నవయౌవనవరుం గావింపుండనిన- ఈ. శ. ష. 3. వలయు వాని - ఈ. ఐ. త. శ. ష.

187. 1. నిష్ఠలబ్ధ - అ. ఆ. ఉ. ఎ. ఒ. గ. ఝ. డ. ల; నెలమి - శ. ష. 2 యౌవనుడ నైతి ధన్యుండనైతి - డ. ల. 3. విభుండు సూచు - అ. ఎ. ఐ. త. ల.

192. 1. దానికి సహింపక - ల.

193. క. జృంభించి వజ్రమెత్తిన, జంభాంతకు వజ్రయుత [1]భుజాస్తంభము సం
[2]స్తంభించి యతనిఁ [3]బటుసం, రంభంబునఁ జంపఁ గడఁగి [4]రౌద్రాకృతితోన్.

194. క. చ్యవనుఁడు వేల్చిన నం[1]దు, ద్భవమయ్యె నపార[2]ఘోరబలయుతుఁడు మహా
జవుఁడు [3]మదుం డనురాక్షసుఁ, డవని[4]చరద్యుచర భీకరాకారుండై.

195. వ. [1]ఇట్లుద్భవించి దశసహస్రయోజనాయామంబులైన బాహుదండంబులయు శతయోజ[2]నాయామంబులైన [3]చతుర్దంష్ట్రలయు దశయోజనాయామంబులైన [4]దశనంబులయు శశి[5]రవిమండలసదృశంబులైన నయనంబులయుఁ [6]గాలాగ్నిసన్నిభం[7]బైన వక్త్రంబును దిగ్భానభోభాగసంకటంబైన శరీరం[8]బునుందోడ భూమినొక్కహనువును దివంబు[9]ను నొక్క[10]హనువుగా వదనగహ్వరంబు దెఱచి జగజ్జన[11]సంత్రాసనవ్యగ్రసంచలనంబైన దీర్ఘజిహ్వా నధరోష్ఠపుటంబు నాకుచు నత్యుగ్రనాదంబున దిక్కులు [12]వ్రచ్చుచు వచ్చు మహారాక్షసుం జూచి సురేంద్రుండు వెఱచి భార్గవ స్తంభితభుజుండు గావున వాని నెద్దియుం జేయనేరక చ్యవనునొద్దకువచ్చి కృతాంజలియై మునీంద్రా నీతపోవీర్య[13]మహారంభంబు మిథ్యయగునే యాశ్వినులు నేఁడుమొదలుగా సోమార్హులగుదురు నీవు నాకుఁ బ్రసన్నుండవై [14]క్షమింపు మనిన.

---

193. 1. భుజస్తంభంబున్ స్తంభించి — కొన్ని ప్రతులు. 2. స్తంభింపజేసి యతిపంరంభం — ఛా. 3. నతి — కొన్ని ప్రతులు. 4. రౌద్రాకృతియై — కొన్ని ప్రతులు.

194. 1. దుద్భవించె కృత్యకు డపారబల — పెక్కు ప్రతులు; దుద్భవించె కృతకుం డపార బలయుతుడు — ఝ. స; దుద్భవించె గృత్య య (న?) ని వార్య బలయుతుడు — స. 2. భూరి — ఇ. ఈ. ల. 3. మధుండు — పెక్కు ప్రతులు. 4. చరత్ఖచల — ల.

195. 1. ఇట్లుదయించి — ఓ. గ. ఠ. డ. ల. 2. నాయమానంబులైన—అ. గ. 3. చతుర్దశ దంష్ట్రలును — డ; చతుర్దంష్ట్రములును — కొన్ని ప్రతులు. 4. దశనంబులయు — పెక్కు ప్రతులలో లేదు. 5. సూర్య — కొన్ని ప్రతులు. 6. కాలాగ్నిసన్నిభం — పెక్కు ప్రతులలో లేదు. 7. బైన వక్త్రంబు — పెక్కు ప్రతులలో లేదు. 8. బుతోడ — ల; బుతోడన — ఠ. 9. న — పెక్కు ప్రతులు 10. హనువునుంగా — కొన్ని ప్రతులు. 11. సంగ్రసన — స; గ్రసన — పెక్కు ప్రతులు. 12. వ్రయ్యనార్చుచు — ఘ. శ. 13. మాహాత్మ్యంబు — ల; మహత్వంబు — ఠ. శ. ష. 14. క్షమియింపుమనిన — ఆ. ఝ. డ; రక్షింపుమని — ఇ. ల.

196. క. మునినాథు నలుకతోడన, యనిమిషపతి వజ్రయుతమహా[1]భుజసంస్తం
భన [2]ముడిగె నంత భృగునం, దను వీడ్కొని యింద్రుఁడరిగెఁ
దనపురమునకున్.

197. వ. అమ్మదరాతుసుండు [1]నాతుణంబ [2]చ్యవనునుపదేశంబున మద్యస్త్రీమృగ
యాతుంబుల నాశ్రయించె నాశ్వినులు సోమపీథులై దివంబున కరిగి[3]రిట
భార్గవుండైన చ్యవనుండు దనతపోమహత్త్వంబు[4]నందుఁ బ్రకాశింపఁ
జేయుటంజేసి నాటంగోలె నది యార్చీకపర్వతంబు నాఁబరగె నని
రోమశుండు సెప్పిన నందులఁ బుణ్యాసరోవరంబునం గృతస్నానులై పాండవు
లరిగి యంత శంతను శునక నరనారాయణ విధాతృతపోవనస్థానంబై [5]దేవర్షి
నివాసంబైన సైంధవారణ్యంబునం జంద్ర[6]సరోవరంబునందు రోమశ
నియుక్తులై [7]చరువులుచేసి యతిథులం బూజించి [8]చని యమునాదిం గని
రంత వారలకు రోమశుం డి ట్లనియె.

-: మాంధాతృ చరిత్రము :-

సం. 3 - 125 - 22

198. క. ఇది యమున యనుమహానది, త్రిదశనదీ[1]నిభము దీనితీరమున జగ
ద్విదితుఁడు [2]మాంధాతృఁడు సంపదఁ గ్రతువులఁ జేసెఁ దొల్లి
బహువత్సరముల్.

199. వ. అనిన [1]మాంధాతృజన్మంబును వానిచరితంబును వినవలతుంజెప్పు మని
యడిగిన ధర్మరాజునకు రోమశుం డి ట్లనియె.

---

196. 1. బాహా - ఔ. క. చ. జ. ద. 2. మానె - ఇ. గ.

197. 1. నతుణంబ - పెక్కు ప్రతులు; తత్క్షణంబ - ఘ. ల. 2. చ్యవను నుపదేశంబున - కొన్ని ప్రతులలో లేదు. 3. రెట్లు - పెక్కు ప్రతులు. 4. బిందు - పెక్కు ప్రతులు. 5. దేవర్షినివాసంబైన - పెక్కు ప్రతులలో లేదు. 6. సరంబునందు - గ. ల; శరంబునందు - కొన్ని ప్రతులు. 7. స్నానంబులు - ఈ. ఐ. శ. ష; దానంబులు - ద. 8. చని - కొన్ని ప్రతులలో లేదు.

198. 1. సమము - ఇ. ఏ. ఓ. ల. 2. మాంధాతు - చ. డ.

199. 1. మాంధాత - డ.

200. ఉ. [1]పీకున నశ్వమేధములు [2]వేయొనరించిన ధర్మశీలుఁ డి
క్ష్వాకుకులోద్భవుండు బలవంతుఁ డనంతయశుం [3]డవార్య[4]వి
ర్యాకరుఁ డుత్తముండు యువనాశ్వుఁ డపత్యము లేమిఁ జేసి దుః
ఖాకులుఁ డై ప్రధానవరులందు సమర్పితరాజ్యభారుఁడై.

201. వ. భృగునాశ్రమంబునకుం జని పుత్త్రికాముండై పెద్దకాలం బమ్మునిఁ నుపా
సించిన నయ్యువనాశ్వునకుం గరుణించి భృగుండు పుత్త్రికామేష్టిఁ జేసి
యందు మంత్రపూతజలపూరితం[1]బై పుత్త్రోదయకారణంబైన కలశంబు
వడసి దాని[2]రక్షించియుండ ఋత్విజులం బంచిన.

202. ఆ. రాత్రి జాగరణభరశ్రాంతులై వారు, నిద్రఁ[1]బొంది రంత నీరు వట్టి
ధారుణీశ్వరుండు తన్మంత్రకలశోద, కంబు లెల్లఁ ద్రావెఁ గడుపు నిండ.

203. వ. దాని నెఱింగి భృగుండు యువనాశ్వుం జూచి నీకుఁ బుత్త్రార్థంబుగా మదీయ
తపో[1]వీర్య[2]లబ్ధంబైన యిమ్మంత్ర[3]జలంబు నీభార్య కీనున్నచో నీవధిక
పిపాసా[4]పరుండవయి యుపయోగించి యకర్తవ్యంబుఁ జేసితి దైవకృతం
బెవ్వరికిఁ [5]దప్పింప నశక్యంబు దీనం జేసి నీకు గర్భంబై యింద్రసదృశుండైన
పుత్త్రుం[6]డుద్భవించు ననిన విని యువనాశ్వుండు దనపురంబునకుఁ జని
యున్నంత నూఱేండ్లకు యువనాశ్వు వామభాగంబు భేదించుకొని బాలార్క
తేజుండైన బాలకుండు వెలువడిన న[7]క్కొడుకుం జూడ నింద్రుండు[8]వచ్చి
వాని వదనంబున నిజప్రదేశినిఁ బెట్టి యమృతమయం బగుదీనిం ద్రావుమనిన
నింద్రువచనంబున నమరులెల్ల నక్కుమారునకు మాం[9]ధాతృండను నామంబుఁ
జేసి రట్లు సురేంద్రసంవర్ధితుం[10]డై.

---

200. 1. పీకను – గ. ల. శర; పీకువ – న. కసం. 2. వెయ్యొనరించిన – డ. 3. డపా
రవీ – డ. 4. విద్యాకరుఁడు – ఖ. డ. త. ఝ.

201. 1. బై – బైన – కనక కలశంబు – పెక్కు ప్రతులు; బైన యొక్క కలశంబు –
ల; 2. రక్షించుకొని – ఈ. క. డ.

202. 1. బొంచియుండ – అ. ఝ. శ. శర. ష. సూ.

203. 1. వీర్య – కొన్ని ప్రతులలో లేదు. 2. లబ్ధంబులైన – కొన్ని ప్రతులు.
3. జలంబులు – కొన్ని ప్రతులు. 4. పరవశుండవై – ఘ. ఠ. డ. 5. గడవ –
కొన్ని ప్రతులు. 6. డుదయించు – పెక్కు ప్రతులు. 7. బ్బాలుంజూచి పోవ–
కొన్ని ప్రతులు; బ్బాలునింజూడ – ల. 8. పరతెంచి – కొన్ని ప్రతులు. 9. ధాత
యను – ఈ. ఐ. ఝ. త. డ. ల. 10. డైన – ఇ. ఠ. డ. ల.

204. తే. ధ్యానమాత్రనచేసి వేదములు సర్వ, శాస్త్రములు ధనుర్వేదము సకలదివ్య
సాయకప్రయోగంబులుఁ [1]జట్టవచ్చి, పొందె మాంధాతృఁ డ్రిభువన
[2]పూజ్యునొప్ప.

205. వ. మఱియు నమ్మాంధాతృండు మహేంద్రుచేత మహామహీరాజ్యంబున కభి షిక్తుండై చక్రవర్తియై శక్రునర్థాసనంబెక్కి [1]యాజగవం బనుధనువును దివ్యాస్త్రంబులు నభేద్యకవచంబును ధరియించి నిఖిలలోకజైత్రుండై సంపూర్ణదక్షిణాక్రతువు లనేకంబులు చేసి పద్మసంఖ్యలు గో[2]దానంబుల బ్రాహ్మణులం దనిపి నిజశాసనంబునఁ బ్రజల నెల్ల నిలిపి.

206. మధ్యాక్కర.

భూమి కనావృష్టియైనఁ గడునల్గి పురుహూతుతోడ
భీమసంగ్రామంబుఁ జేసెఁ దనదివ్యపృథుసాయకముల
సామజావలి నేయునట్లు మేఘసంచయముల నేసి
భూమికిఁ [1]గురియించె వర్షములు [2]సస్యముల్ వృద్ధిఁబొంద.

207. వ. ఇది యమ్మాంధాతృదేవయజనస్థానంబు మఱి యిక్కురుక్షేత్రంబునందు సరస్వతీతీరంబున సోమకుండను[1]వాఁడు యజ్ఞంబుఁ జేసి పుత్త్రశతంబుఁ బడసె ననిన నది యెట్లని ధర్మజుం డడిగిన రోమశుం డిట్లనియె.

## -: సోమకుం డను రాజర్షి చరిత్రము :-

సం. 3 - 127 - 2

208. క. సోమకుఁ డను రాజర్షి మ, హామఖ మొనరించి జంతుఁ డను నొక్క సుతుణ
భూమీశ పడసె నాతని, భామలు నూర్వురును గొడుకుఁ బరమప్రీతిన్.

---

204. 1. జక్కవచ్చి - పెక్కు ప్రతులు; జంటవచ్చి - ఏ. ఓ. ఔ. ఘ. ల; జట్ట - జ. 2. పూజ్యతేజు - పెక్కు ప్రతులు; పూర్ణతేజు - స; పుణ్యతేజు - ఇ; భూరితేజు - ఔ. ద. ట.

205. 1. యజగవంబు - ల; యజగరంబను - పెక్కు ప్రతులు 2. సహస్రంబుల నిచ్చి - పెక్కు ప్రతులు; సహస్రంబునిచ్చి - ల.

206. 1. వర్షముల్ గురియించె - పెక్కు ప్రతులు; వర్షములు గురిసెను - ల. 2. సస్యములు వృద్ధిబొంద - ల.

207. 1. రాజు - పెక్కు ప్రతులు.

209. క. తమతమ[1]పుత్త్రుఁడకాఁ జి, త్తములం[2]జేకొని దయం బృథగ్భావము లే
[3]క ముదంబునఁ బెంచిరి లో, కమున జనుల్ చోద్యమందఁగాఁ
గడువేడ్కన్.

210. వ. ఒక్కనాఁ డబ్బాలకు కురువు చీమ గుట్టినఁ దద్వేదన సహింపనోపక యేడ్చు చున్న వాని [1]కడకుఁ దల్లులందఱుఁ బఱతెంచి [2]యేడ్చిన నయ్యాక్రందన ధ్వని విని [3]సంభ్రమించి సోమకుం డంతఃపురంబునకుంజని కొడుకు నూఱార్చి సభాస్థితుండై మంత్రులకు ఋత్విజులకు ని ట్లనియె.

211. ఆ. కోరి యొక్కకొడుకుఁ గొడుకుఁగా నేనెట్లు, నమ్మియుండ నేర్తు నాకుసతులు
శతము గలిగియుండ సంతాన మల్పమై, యునికి మీకుఁ జూడ నుచిత మగునె.

212. వ. అనిన వానికి ఋత్విజు లి ట్లనిరి.

213. తే. ధరణినాథ నీ[1]భార్యాశతంబునందుఁ, బరగ నూర్వురు పుత్త్రులఁ బడయ నీకు
నభిమతం బేనిఁ దగుఁ దగదనక నీవు, కడఁగి మాచేయఁబంచిన క్రతువు సేయు.

214. వ. ఈ[1]జంతుం [2]బశువుగా వధించి తద్వపాహవ్యంబుల హవ్యవాహునిం దనిపిన దాన నీనూర్వురుభార్యలకు నూర్వురు కొడుకులు పుట్టుదు రం దగ్రజుండైన జంతుండు [3]సౌవర్ణలక్షణలక్షిత[4]సవ్యపార్శ్వుండై యుదయించు నని చెప్పి ఋత్వి[5]జులచేత[6] సోమకుండు ననుజ్ఞాతుండై.

---

209. 1. పుత్త్రుడుగా – ప్రౌ. 2. జేకొనుచు బెనిచి దయును బృథగ్భా – ఈ. ఎ. వ. ఐ. క. ఝు. త; జేకొనుచు బెనిచి దయవేరగు భావము – బౌ. 3. కయు ముదమున – అ; కముఁదమునను – త. ఝు.

210. 1. యొద్ద – పెక్కు ప్రతులు. 2. యేడ్చుచున్న – కొన్ని ప్రతులు. 3. సంభ్ర మించి – కొన్ని ప్రతులలో లేదు.

213. 1. భార్య శతంబు – వా; భార్యాశతంబు – కొన్ని ప్రతులు.

214. 1. జంతునుం – ర; జంతునిం – అ. ఐ. 2. పశువధియించి – ఎ. డ; పశునరించి – ఉ. ఊ. ఘ. ఝు. 3. సువర్ణ – ఘ. చ. ద. 4. సౌమ్య – డ. 5. జుండు – వా; జులచేత – డ. 6. సోమకునిచేత – వా.

215. క. తనయుఁ[1]బశువఁజేచి తద్వపఁ, గొనివేల్చినఁ జూచి [2]యార్తకురరీనాదం
బున[3]నేడ్చిరి కడు[4]నడలుగఁ, దనుమధ్యలు నూర్వురును సుతస్నేహమునన్.

216. క. ఇమ్మొగఁ[1]దద్ధూమాఘ్రా, ణమ్మున గర్భములు దాల్చి నాతులు నవమా
సమ్ములు[2]నిండుడుఁ గనిరి ము, దమ్మున జంతుప్రముఖ[3]సుతప్రకరమ్మున్.

217. వ. అందు జంతునకు నందఱు నెప్పటియట్ల తల్లులు[1]సమస్నేహలై యుండం బుత్త్రులు నూర్వురుం బెరిఁగి సమర్థులై [2]యున్నఁ బెద్దకాలంబునకు ఋత్విజుండు పరలోకగతుండై ఘోర[3]నరకానలంబున నెరియుచునుండె నంత సోమకుండును దేహత్యాగంబుసేసి [4]యమరలోకంబున కరుగువాఁడు [5]ముందట నరకానల [6]పచ్యమానుం డయ్యెడు ఋత్విజుం జూచి యిట్లేల తీవ్ర దుఃఖోపహతుండ వైతి వని యడిగిన వాఁ డిట్లనియె.

218. ఆ. అవనినాథ నీకు నార్త్విజ్య మొనరించి, [1]చూవె యిట్టి నరక [2]పావకమునఁ
బడినవాఁడ నీకు [3]బహుపుణ్యలోకముల్, [4]గలవు నన్నుఁ గావవలయుఁ గరుణ.

---

215. 1. తనయు విశసించి - పెక్కు ప్రతులు; తనయువధియించి - డ; తనయు బకువ అచి - త; తనయుం బకువుగఁ దద్వప - వ. 2. యార్తిగూరిన - పెక్కు ప్రతులు. 3. నరచిరి - ఏ. ఓ. క. గ. జ. స; వగచిరి - డ. 4. నడలుచు - ఎ. ఝ. ద. శ. ష. స; నడలున - కొన్ని ప్రతులు.

216. 1. సుతధూమా - న. 2. నిండగ - ఓ. శ. ష; నిండుగ - స; నిండంగనిరి - త. 3. శత - పెక్కు ప్రతులు; సుతశతమంతన్ - ఔ; (జంతుముఖసుత) శతప్రకరంబున్ - డ. స.

217. 1. సంస్నేహలై - డ; నతిస్నేహంబై యుండ - గ. 2. యుండ - ఒ. ఔ. డ. 3. నరకంబుల - త. 4. యమలోకంబున - త; అపరలోక - ట; యమరలోకపథంబున - క. చ. ట. 5. ముందట - కొన్ని ప్రతులలో లేదు. 6. దందహ్యమానుండ - అ. ఆ. ఈ. ఎ. ఐ. శ. ష; పీడ్యమానుండ - ఇ. ఉ. గ. ఝ; తప్యమానుండ - ఏ. ఓ.

218. 1. వట్టిపాతకమున నరకమునకు - చ; చూవెయేను నిట్టిచోటనుండ - ఆ. ఇది ప్రాస నియమమునకు విరుద్ధము. 2. పాతకమున - ఉ. క. చ. 3. పరమలోకంబులు - ఝ. 4. గలుగు - త.

219. వ. అనిన సోమకుండు [1]ధర్మరాజు పాలికిం జని తచ్ఛాసనంబునం బుణ్యలోకం బులకుం బోవుచుండి యిట్లనియె.

220. క. నాకారణమున ఋత్విజుఁ, డేకాంతము నరక[1]గతికి నేఁగెను వానిం దోకొని పోయెద నని శుభ, లోకంబు[2]న కరిగెఁ ద్రిదశలోక[3]స్తుతుఁడై.

221. వ. ఇట్లు యజ్ఞపుత్త్రుం డైన సోమకుండు దన తపోయజ్ఞఫలంబున ఋత్విజు నరకవిముక్తుం జేసి పుణ్యలోకగతుం డయ్యె నిందుఁ దొల్లి ప్రజాపతి సహస్ర వార్షికం బైన [1]యిష్టాకృతంబను [2]సత్రయాగంబుఁ జేసె [3]నాభాగుం డైన యంబరీషుం డిందు యజ్ఞంబులం జేసి పరమసిద్ధికిం[4]జనియె నిది నహుషు యజ్ఞదేశం బిందు దశపద్మసంఖ్యాధనంబుల నాతండు సదస్యులం బూజించె నిది సార్వభౌమయజ్ఞస్థానం బిది యయాతి యజ్ఞాయతనంబు వాని [5]సవనం బున కింద్రుండు వచ్చె నిది[6]రామహ్రదం బిది నరనారాయ[7]ణాశ్రమం బిది [8]ప్లక్షావతరణం బను యమునాతీర్థం బిందు దేవతలును ఋషులును సారస్వత యాగంబుఁ జేసి రిది దేవర్షి యైన సంవర్తుచేత రక్షితం బిందు భరతుం డనేక యాగంబులు సేసి సర్వలోకంబులుం[9]జూచె నీవు నిందుఁ గృతస్నానుండవై సర్వలోకంబులుం [10]జూడు మనిన ననుజసహితుండై ధర్మతనయుం డత్తీర్థంబున స్నానంబుఁ జేసి రోమశున కిట్లనియె.

222. శా. దేవర్షి [1]ద్యుచరాహిలోకములు నాది[2]త్యాశ్వినీలోకముల్
దేవాధీశ్వరుఁ జూచితిన్ మఱియు నద్దేవేంద్రునొద్దన్ సగాం
డీవోద్దామమహోభుజార్గళుఁ గిరీటిన్ సవ్యసాచిన్ జయ
శ్రీవిభ్రాజితుఁ బార్థుఁ జూచితి జగత్సేవ్యా మునీంద్రోత్తమా.

---

219. 1. యమధర్మ – శ. డ.

220. 1. మునకు – కొన్ని ప్రతులు; మునకు నేగెడు – ఝ. త. శర. 2. ల–క. డ. ల. 3. నుతుండై – ర.

221. 1. యిష్టిక్రియ – ర. శ. ష; యిష్టప్రీతియను – డ; యిష్టకృతి – ల. కొన్ని ప్రతులు; యిష్టిక్రతువ – కొన్ని ప్రతులు. 2. సత్త్రంబు – ఊ. ఘ. చ. శ. 3. నాభాంగాంబరీషులు – కొన్ని ప్రతులు. 4. జనిరి – పెక్కు ప్రతులు. 5. సదనంబున–పెక్కుప్రతులు. 6. యింద్ర – ఈ. ఐ. త. 7. ణస్థానంబు – పెక్కు ప్రతులు. 8. దక్షావతరణంబ–ఇ. ఎ. ఒ. ఘ. ద. ర. ల; దర్గావైతరంణంబ–డ.ష. 9. జూడంబడసె నీవును – కొన్ని ప్రతులు; జూతనిన – ర. 10. జూతువనిన – కొన్ని ప్రతులు.

222. 1. ద్విజరాజ – పెక్కు ప్రతులు. 2. త్యాశ్విలోకంబులున్ – చ. ర. స.

223. వ. అనిన రోమశుండు వెండియు ధర్మరాజున కి ట్లనియె.

224. క. ఇది దక్షుమఖస్థానం, బిదియు సరస్వతి యనంగ నిలఁ బరగు మహా
నది యిందుఁ ద్రిదశతతితోఁ, ద్రిదశజ్యేష్ఠుండు సేసెఁ దివిరి మఖంబుల్.

225. వ. ఇది పంచయోజనప్రమాణం బైన [1]ప్రజాపతి యజ్ఞవేది యిందు దేహ త్యాగంబు [2]జేసి మర్త్యు లమ[3]ర్త్యత్వంబుం బొందుదురు తొల్లి సరస్వతి [4]నిషధదేశంబున భూమి సొచ్చి [5]యిచ్చమసోద్భేదంబునందుఁ గానంబడియె నిది సింధుతీర్థం బిందు లోపాముద్ర నగస్త్యుండు [6]ప్రతిగ్రహించె.

226. తే. ఇదియు విష్ణు[1]పదంబు దా నిది విపాశ, [2]యిదియుఁ గాశ్మీరమండలం బిది [3]వితస్త
మిదియు మానసద్వార మిం దిందువంశ, పరశురాముండు మును హంసపథముఁ జేసె.

*-: శిబి యను రాజర్షిచరిత్రంబు రోమశుఁడు ధర్మరాజునకుఁ జెప్పుట :-*

సం. 3 - 130 - 15

227. వ. ఇక్ష్వాకులనం బైత్రమాసంబునందు మహామునులచేతం బూజితుం డై [1]యుమా సహితుం డీశ్వరుండు వారికిం బ్రత్యక్షుం[2]బగుటయు నరుంధతీసహితుం డై వసిష్ఠుం డిందుల వసియించె నిది భృగుతుంగం బనుపర్వతం బిందు [3]నుశీనరపతి శిబియనువాఁడు దొల్లి యజ్ఞంబుసేయుచున్న [4]నింద్రాగ్నులు వాని

---

225. 1. ప్రజాపతి - ఒ. డ. ప్రతులలో లేదు. 2. జేసినవారలు - అ. ఎ. డ. 3. ర్త్యు లగుదురు — ఏ. ఓ; ర్త్యభావంబు బొందుదురు - క. ట. డ.; ర్త్యభవనంబు - ఒ. చ; ర్త్యభువనంబు బొందుదురు — ఘ. ర. 4. నిషాదద్వేషంబున - చ. ద. నిషాద దేశంబున - జ. క. గ. నిషాదవేషంబున - జ. ష. 5. యిచ్చట చమసోద్భేద-ల 6. పరిగ్రహించె - పెక్కు ప్రతులు.

226. 1. పథంబు — ఇ. డ. 2. మిదియు — ఇ. త. డ. 3. యశస్త — ఓ. ఝ; నిరస్త - ఇ. ప.

227. 1. యీశ్వరుండు - అ. ఘ. ర. ద. 2. బైన నరుం - డ. 3. నౌశీనరుండు శిబి - శ. ప; నౌశీనరపతి - కొన్ని ప్రతులు. 4. నింద్రాగ్నులు - కొన్ని ప్రతులలో

మహాగుణంబు లెఱుంగ వేఁడి యింద్రుండు [5]శ్యేనంబైన నగ్ని కపోతంబై శ్యేనభయంబునఁ బఱతెంచి శిబిమఱువు సొచ్చిన దాని [6]నెగిచికొని [7]వచ్చి శ్యేనంబు శిబి కిట్లనియె.

228. ఆ. నిమ్న [1]సత్యధర్మనిర్మలుఁ గావిందు, [2]నట్టినీకుఁ బాడియయ్య [3]యిప్పు డతిబుభుక్షితుండనై యున్ననాకు నాహారవిఘ్న మిట్లు లాచరింప.

229. వ. సర్వభూతంబులు [1]నాహారంబున జీవించి [2]వర్ధిల్లు నిది [3]నాకుభక్ష్యంబు గాని నాఁడు బుభుక్షావేదనంజేసి ప్రాణవియోగం[4]బగు నట్లయిన నాపుత్త్రిలు భార్యయు జీవింప [5]నేర రొక్కకపోతంబు రక్షించి పెక్కు[6]జీవులకు హింస సేయుట ధర్మవిరోధంబు.

230. క. [1]ధర్మజ్ఞులైన పురుషులు, [2]ధర్మువునకు బాధసేయు [3]ధర్మువునైనన్ [4]ధర్మముగా మదిఁ దలఁపరు, ధర్మువు సర్వంబునకు హితంబుగ వలయున్.

231. వ. ఇక్కపోతంబు నాకు [1]వేదవిహితంబైన యాహారంబు "శ్యేనాః కపోతాన్ [2]ఖాదయన్తి" యనువేద[3]వచనంబు గలదు గావున [4]దీనినాకునాహారంబుగా నిమ్మనిన [5]దానికి శిబి యిట్లనియె.

---

లేదు. 5. శ్యేనంబు నగ్ని కపోతంబునునై కపోతం బాశ్యేనభయంబున – ల. 6. నెగచి – ఠ. 7. వచ్చిన శ్యేనంబు – డ.

228. 1. నిత్య సత్య నిర్మలు – కొన్ని ప్రతులు; సత్య నిత్య నిర్మలు – శ. ష. స. 2. ననఘునీకు – ఆ. ఈ. ఎ. ఐ. ఔ. ఝ. శ. ష. స. 3. యిపుడునతి – కొన్ని ప్రతులు.

229. 1. నాహారంబున – పెక్కు ప్రతులు; నాహారంబునన – ఎ; నాహారంబునంద – ఏ. ఓ. జ. ఝ; నాహారమంద – ల; నాహారంబునను – వా. 2. వర్తించు – పెక్కు ప్రతులు. 3. నాకాహారంబుగానినాడు – ఇ. ఝ. ల. 4. బైన – కొన్ని ప్రతులు. 5. నేరరగుదురు – డ. 6. జీవంబులకు – వా. శ. ష; జీవులకహితంబు – ఓ. ఔ. జ. డ.

230. 1. ధర్మాత్ములైన – ఇ. 2. ధర్మమునకు – కొన్ని ప్రతులు. 3. ధర్మువు నెల్లన్ – ఎ. ఏ. ఓ. ప; ధర్మవు నెందున్ – ఆ. ఔ. ఘ. ద. డ. శ. ష. 4. ధర్మవుగ నెందు – ఇ. ల; ధర్మవుగా నెద – పెక్కు ప్రతులు; ధర్మువుగ నెడ్డ – ప. ఠ.

231. 1. దేవ హితం – కొన్ని ప్రతులు; దైవ విహితంబున నాహారంబు – ఠ. 2. బాధ యన్తి – ఆ. ట. డ; వేధయన్తి – ఈ. ఐ; ఖాదన్తి – ల. 3. వచనంబునుం గలదు – ఠ. 4. దీని నాహారంబుగా – వా. 5. దానికి – కొన్ని ప్రతులలో లేదు.

282. తే. ప్రాణభయమునవచ్చి యిప్పుడినన్ను, [1]నా్రశయించె నా్రశితునెట్టి [2]యధముఁడయిన
విడువఁ[3]డనినను నేనెట్లువిడుతుదీని, నా్రశితత్యాగమిది [4]ధర్మువగునె చెపుమ.

283. వ. నీవు పక్షివయ్యును [1]ధర్మమెఱింగినట్లు పలికితి శరణాగతపరి[2]త్యాగంబు కంటె మిక్కిలి యధర్మం బొం డెద్ది నీయాఁకలి దీననకాని [3]యొంట నుప శమింపదే నీయత్నం బాహారార్థం[4]బేని యిప్పు డివ్వనంబున మృగమహిష [5]వరాహఖగమాంసంబులు దీనికంటె మిక్కిలిగాఁ బెట్టెద నిక్కపోతంబు వలన యా్రగహం[6]బుడుగుము దీని నే నెట్లును విడువననిన శ్యేనం బిట్లనియె.

284. ఆ. నాకు విహితభక్షణం[1]బిది యిప్పుడిఁ, బూని[2]కావ నీకు బుద్ధియేని
యవనినాథ దీనియంత [3]నీమాంసంబు, దూఁచి[4]నాకుఁ బెట్టు తొలఁగ కిపుడ.

285. చ. అనిన నను్రగహించితి మహావిహగోత్తమ యంచు సంతసం
బున శిబి [1]తత్క్షణంబ [2]యసిపు్రతిక నాత్మశరీరకర్తనం
బనఘుఁడు [3]సేసిచేసి తన[4]యంగమునం గలమాంస మెల్లఁ బె
ట్టినను గపోత[5]భాగమ కడిందిగ [6]డిందుచు నుండె [7]నత్తులన్.

---

282. 1. నా్రశయించెను నా్రశితుడధముడై-డ. 2. యధముడైన విడువ రాదన నే నెట్లు-ఊ. త. 3. డనిన నేనెట్టులు-కొన్ని ప్రతులు. 4. ధర్మమగునె-కొన్ని ప్రతులు.;

283. 1. ధర్మువెఱింగినట్లు - పెక్కు ప్రతులు. 2. త్యాగంబు సేయుటకంటె - వా; త్యాగంబుసేయుట కంటె - వా; త్యాగంబున కంటె - ఊ. బ. త. శ. ష. 3. యొంట దీరదేని - ఏ. ఓ; యొంట నుపశమిల్ల - పెక్కు ప్రతులు; మరి యొంట - ల; యొంటనుపశమింపదేని దీని తదర్థంబు నాహారంబు లిచ్చెదం బనుమని యె నిప్పుడ - డ. 4. బయ్యేనేని - కొన్ని ప్రతులు; బయేని నిపుడ - భ. 5. వరాహంబుల - పెక్కు ప్రతులు; వరాహ మాంసకంబులు మిక్కిలిగా - ల. 6. విడువుము - అ. ఆ. ఎ. ఔ. గ.

284. 1. బగునిప్పుడి - ఇ. ఎ. ల. 2. నీకు కావబుద్ధియేని - కొన్ని ప్రతులు. 3. మాం సంబును దూచి - డ. 4. పెట్టు నాకు తొలగకిపుడు - పెక్కు ప్రతులు.

285. 1. యక్షణంబ...శరీరమెల్ల నయ్యనఘుడు చెక్కిచెక్కి కలయంగము లందలి మాంస మెల్ల - ఔ. 2. యసిపృత్తికనాత్మ - త. 3. చేసియంత దన - ఊ. త; చేసె చేసి - డ. 4. యంగములం - వా; యంగమునం - పెక్కు ప్రతులు 5. భాగము- కొన్ని ప్రతులు; భారమ - త. 6. డిగ్గుచునుండె - ఇ. ఎ. ఏ. ఓ. గ. ల. స. 7. నంతటన్ - ఎ. ఏ. ఓ. గ. ఝ.

236\. క. దానికి నచ్చెరువడి ధర, ణీనాథుఁడు తనువునందు నెత్తురు దొరుఁగం
[1]దాన తులయెక్కె [2]నంతన్, వానిగుణోన్నతికి మెచ్చి వాసవదహనుల్.

237\. వ. శ్యేనకపోతరూపంబులు విడిచి [1]నిజరూపంబులఁ జూపి నీ[2]ధైర్యశౌర్యాది గుణంబు [3]లనన్యసాధారణంబులు [4]గావున నీకీర్తి నిత్యంబై శబ్దబ్రహ్మంబు గలయంతకాలంబును వర్తిల్లు[5]చు నుండెడుమని శిబికి వరంబిచ్చి యింద్రాగ్నులు చని రిది యమ్మహాపురుషు [6]పుణ్యస్థానంబు [7]మఱియు ననవరత [8]ఫలవృక్షంబులు గలయిది [9]యౌద్దాలకియైన శ్వేతకేతుతపోవనం బిందు సరస్వతి మనుష్యస్త్రీరూపధారిణియై శ్వేత[10]కేతుని సేవించె మాతుల భాగినేయులైన యష్టావక్రశ్వేతకేతు లింద యుగ్రతపంబుఁ జేసి రనిన నం దష్టావక్రుమాహాత్మ్యంబు విన[11]వలతు నని యడిగిన యుధిష్ఠిరునకు రోమశుం[12]డిట్లనియెఁ దొల్లి [13]యేకపాదుండను మునివరుండు తనవిద్యా [14]విభవంబున సుజాత యనుదాని వివాహంబై వనంబున ఘోరతపంబు చేయుచు ననవరతంబును [15]శిష్యుల వేదంబులు చదివించుచున్నఁ బెద్దకాలంబునకు సుజాత [16]గర్భిణియైనఁ దద్గర్భంబున నున్నయర్భకుం డొక్కనాఁడు తండ్రి కిట్లనియె.

---

236\. 1. గానత్తుల యెక్కుటయును వాని — ద; దానత్తుల యెక్కుటయును — ఉ. ఠ. దానె తుల యెక్కినందగువాని-డ. 2. నప్పుడు — ఫ. స.

237\. 1. తమనిజ — వా; నిజ — కొన్ని ప్రతులు. 2. ధైర్యాదార్యాది — ఔ. జ. ల; శౌర్యధైర్యోదార — ఈ. ఐ. త. 3. లివియనన్య - కొన్ని ప్రతులు. 4. గావున— కొన్ని ప్రతులలో లేదు. 5. చుండెడమని — పెక్కుప్రతులు; చునుండునని — ప. 6. యజ్ఞ — ఏ. ఓ. 7. మరి యీయనవరత — పెక్కు ప్రతులు. 8. ఫల వృక్షంబుల యది — ఠ; కుసుమఫలం — ఎ. ప. ఓ. 9. యౌద్దాలకుండైన — ఉ. క. 10. కేతుసేవించె — కొన్ని ప్రతులు. 11. వలతుం జెప్పుమనిన — డ. ల; వలతు ననిన నయ్యధి — కొన్ని ప్రతులు. 12. డిట్లని చెప్పె - పెక్కుప్రతులు. 13.యేక పూషుండను — ఘ. ద. ఠ; కహోళుఁడని సంస్కృత భారతము — స. 14. బలంబున — ఏ. ఐ. ఓ. ల. 15. శిష్యులచే వేదంబులు చదివింపుచుండ బెద్ద — ల; శిష్యుల వేదంబు చదివించు — పెక్కు ప్రతులు. 16. గర్భంబైన — ఔ. ఝ. ట. డ; గర్భంబున నర్భకుం డొక్కనాడు — ఠ.

-: రోమశుఁడు ధర్మరాజునకు నష్టావక్రుచరితంబు చెప్పుట :-

సం. 3 - 132 - 8

238. క. [1]ఎడఁబడక [2]యహోరాత్రులు, వడిఁగొని చదివింపనిట్లు వలయునె శిష్యుల్
గడు నిద్రలేమి నెంతయు, జడమతులై చదువు దప్పఁ జదువుచు నుండన్.

239. వ. అని[1]యుపాలంభించి పలికి[2]న నలిగి యేకపాదుండు నీవధ్యయనంబునకు వక్రంబుగాఁ బలికితివి గావున నెనిమిదివంకలు గలశరీరంబుతో జన్మింపుమని కొడుకునకు శాపంబిచ్చిన.

240. ఆ. [1]అగ్నికల్పుఁడై మహాత్ముఁడు కడుపునఁ, [2]బెరుఁగుచుండె నంత సరసిజాక్షి
ప్రసవకాలమైనఁ బతి కొక్క[3]నాఁడిట్టు, లనియెఁ బ్రసవ[4]భారమునకు [5]వెఱచి.

241. క. ధరణిఁగడుఁ బేదవారును, బురిటికి ఘృతతైలధాన్య[1]ములఁ జెచ్చెర ముం
దర సంగ్రహింతు రవి మన, [2]కరయగ నతిదుర్లభంబు లర్థము లేమిన్.

242. వ. ఏమిసేయుదు నెవ్విధంబున నీప్రసవ[1]క్లేశంబువలనఁ బాయుదునని ఏకపాదుండు ధనార్థియయి జనకరాజుపాలికిఁ జని వాని యజ్ఞంబునందు వరుణపుత్త్రుండైన వందితో [2]వివాదంబుసేసి యోటువడి [3]జలమగ్నుండై యున్న నిట సుజాత ప్రసూతియై యష్టావక్రుం గనియెఁ [4]దత్కాలంబున

---

238. 1. యెడపకయ సర్వరాత్రులు — త; ఎడవడక సర్వరాత్రులు — ర; ఎడవడక యెల్ల రాత్రులు — న; ఎడపకయు నర్ధరాత్రము — ట. 2 సర్వరాత్రులు — పెక్కు ప్రతులు; యహోరాత్రము — ఊ. ఏ. ఓ. జ. సూ.

239. 1. యుపలంభించి — అ. ఉ. ఒ. ఔ. ఘ. జ. ద. శ. వ. 2. ననేకపాదుండు — కొన్ని ప్రతులు.

240. 1. అగ్నికల్పుడమ్మహాత్ముఁడు కడుపులోఁ బెరుగుచుండుఁడంత — వ 2. బెరుగుచుండు — ఉ; బెరుగుచుండ — ఇ. 3. వేళయిట్లనియెఁ — న. 4. కాలమునకు — అ. వ; భావమునకు — స. 5. దలరి — ఈ. ఐ. త. ట.

241. 1. ములు ముందర చెచ్చెర సంగ్రహింతు — పెక్కు ప్రతులు; ములు తగినవి చెచ్చెర సంగ్రహింతు — ల. వ. 2. కరుదుగ — వా.

242. 1. క్లేశంబు వాయుదు — సూ. 2. వాదంబు సేసి — కొన్ని ప్రతులు. 3. లజ్జామగ్నుండై — పెక్కు ప్రతులు. 4. దత్సమయంబున — కొన్ని ప్రతులు; దత్సమ

నుద్దాలకుభార్య శ్వేతకేతుం[5]గనియె నిట్లు మాతులభాగినేయు లిద్దఱు సవయస్కులై పెరిఁగి పండ్రెండేండ్లొక్కట నుద్దాలకు[6]తోఁ జదివి యధ్యయన[7]శూరులై రందు.

243. తే. తండ్రియనుచు నుద్దాలకుఁ దనకు గరము, ప్రీతితో శ్వేత[1]కేతుని భ్రాత యనుచు
ననఘచరితుఁ డష్టావక్రుఁ డనుదినంబు, నొండెఱుంగక సుఖలీల నుండు నంత.

244. వ. ఒక్కనాఁ డుద్దాలకు కురువెక్కియున్న యష్టావక్రుం జూచి శ్వేతకేతుండు సహింపక నీవేల మాయయ్య కురు[1]వెక్కియుండెదీవు వోయి మీయయ్య [2]కురు వెక్కుమని చేయిపట్టి యీడ్చిన నేడ్చుచుం దల్లికడకుం జని యష్టావక్రుం డి ట్లనియె.

245. క. మాయయ్య యెవ్వ రెక్కడఁ, [1]బో[6]యిరి సెప్పుమని తెల్లముగ నడిగి తప
శ్శ్రీయుతుఁడు దండ్రికడకుం, బోయెం దన[2]మామ నెయ్యమునఁ దోడ్కొనుచున్.

246. వ. ఇ ట్లష్టావక్రుండు దానును శ్వేతకేతుండును జనకరాజుయజ్ఞంబునకుం జని యందు దౌవారికనివారితులై మూకాంధబధిరపంగు[1]స్త్రీబ్రాహ్మణ సుప్రవేశంబగుచున్న యీరాజద్వారంబున మమ్ము విద్వాంసుల బ్రాహ్మణుల నేల [2]వారించెద రనిన దౌవారికుం డిట్లనియె.

---

కాలంబున – ఉ. ఇ. ఒ. ల. 5. గాంచె – ఏ. ఓ. ల; జనవించె – ఉ. ద.ట. 6 తోఁగూడి చదివి – ల. 7. శూరులైన నందు – పెక్కు ప్రతులు.

243. 1. కేతుండు – ఉ. ఓ. గ.

244. 1. వెక్కితివి పోయి – ఘ. ట. ద; వెక్కియుండెదు పాయుము మీయయ్య – అ. ఆ. ఈ. ఎ. ఐ. ఝ. త. 2. కురువున నుండుమని – ఘ. ట. ద. శ. మ; కురువెక్కియుండుమని – కొన్ని ప్రతులు.

245. 1. బోయెం జెప్పుమని – ఈ. త. శ. మ. 2. యల్లు – ఔ.

246. 1. స్త్రీ బాల బ్రాహ్మణ – ఈ. ఊ. ల. 2. వారించితనిన – వా; వారించెద రనిన – పెక్కు ప్రతులు.

247. క. అలఘులగు వృద్ధవిద్వాం, సులకు మహా[1]యాజ్ఞికులకుఁ జొర[2]నర్హ్వాంబై
విలసిల్లు యజ్ఞసభ సొర, [3]వలవదు చనుఁ డీరు చిఱుత[4]వారల రనిన్.

248. క. అలయక [1]యేండ్లు గడుం బె, క్కులు జీవించుట[2] నరగలుగుటయుం దగువృ
ద్ధుల లక్షణమే జ్ఞానము, [3]గలఁడేనిన్ బాలుఁ డయినఁ గడువృద్ధు మహిన్.

249. వ. [1]కృతాధ్యయనశీలుండై [2]యాచారపరుండైనవాఁడు బాలుండయ్యును [3]సర్వజనసంభావనీయుం [4]డగు బాలురని మమ్ము నవమానింప వలవ దేము జనకరాజ[5]సదనంబున దర్పితు[6]లైన వేదవాదులతో వాదంబుసేయ సమకట్టి వచ్చినవారమనిన దౌవారికుండు వారి నప్పుడు [7]రాజానుమతుండై లబ్ధప్రవేశులం జేసె నంత.

250. సీ. జనక[1]భూపాలుని సంప్రశ్నములకెల్ల నేర్పడ నుత్తరం బిచ్చి వాని
సభయందు భూసురసంఘమధ్యంబున వరుణపుత్త్రుండైన వందితోడ
వాదంబు చేసి గర్వంబున నాతని [2]నోడిచి తద్విజితులై [3]యుదధి నున్న
[4]ధరణీసురులఁ దన[5]తండ్రితో నిగ్రహముక్తులఁ [6]జేసి సన్మానికుమారుఁ

---

247. 1. యాజకులకు – ఏ. ఓ. జ. ల. 2. నరహంబై – డ. 3. వలదు చనుండీరు – అ. ఉ. త. 4. వారలు ననినన్ – ఘ. డ.

248. 1. యేడులు గడు బెక్కులు – పెక్కు ప్రతులు. 2. యునరలగుటయునిది వృ – స. ల; యు నెరలగుటయునివి వృ – కొన్ని ప్రతులు. 3. గలడేనియు బాలుడైన – ఎ. ఏ. క. జ. డ. ల; గలదేనియు బాలుడైన – అ. ఆ. ఆనం. ఇ. ఉ. గ. చ. ద. ట.

249. 1. శ్రుతాధ్యయన – పెక్కు ప్రతులు. 2. యనూనాచార – వా. 3. స్వజన సమ్మాన – వా; సర్వజన సంభావ – పెక్కు ప్రతులు. 4. డగు సభాయోగ్యుండు బాలురని – వా; సభాయోగ్యుండు అనునది యేప్రతియందును లేదు. 5. సదనంబునందు–పెక్కు ప్రతులు. 6. లైన వేద వేదాంగ విదులగు బ్రాహ్మణులతో– ఊ. ల. 7. జనకరాజాను – వా.

250. 1. భూపాలకు – అ. ఉ. ఘ. ఠ. డ. 2. నోడించి – ఇ. ఊ. ట. డ. స; నోడించి తద్విజు కోడియున్న – స; నోడించి తద్విజు కొదిగి యున్న – స. 3. యొదిగియున్న – కొన్ని ప్రతులు. 4. ధరణీ సురల – ఇ. ఉ. గ. చ. జ. ఝ. స. 5. తండ్రిని – వా; తండ్రితో – పెక్కు ప్రతులు. 6. జేసెనమ్మని – కొన్ని

తే. డధిక తేజుఁ డష్టావక్రుఁ డఖిల[7]లోక, పూజితుం[8]డైన జనకుచేఁ బూజలంది
[9]యేకపాదుఁ దోడ్కొని పేర్మి నేఁగుదెంచె, బుధనుతుండు నిజాశ్రమంబు
నకు నొప్ప.

251. వ. అని చెప్పుచు నరిగి యిది [1]సమంగ యనుపుణ్యనది యిందు భరతుండు రాజ్యాభిషిక్తుఁడయ్యెఁ దొల్లి [2]యింద్రుండు లక్ష్మీప్రాప్తుండై దీని జలోప స్పర్శనంబున శాపవిముక్తుండయ్యె నిదిమైనాకకుక్షి యిం దదితి [3]పుత్త్రార్థి నియై తపంబుసేసె నిది[4]ఋషిదైవతంబైన [5]కనఖలనగం బిది గంగానది యిందు సనత్కుమారుండు సిద్ధిం బొందె నిది [6]యుష్ణగంగ యిందుఁ గృత స్నానులైనం గృతార్థు లగుదు రిది రైభ్యాశ్రమం బిది భరద్వాజాశ్రమం బిందు భరద్వాజసుతుండు యవక్రీతుండు తపోవిద్యాగర్వంబున నపగతజీవుం డయ్యె ననిన నది యెట్లని ధర్మతనయుం డడిగిన రోమశుం డి ట్లనియె.

*-: రోమశుఁడు ధర్మరాజునకు యవక్రీతుచరిత్రంబు చెప్పుట :-*

సం. 3 _ 135 _ 12

252. క. అలఘులు రైభ్యభరద్వా, జులు దమలో సుహృదులై విశుద్ధతపో ని
[1]శ్చలితమతు లివ్వనంబున, నొలసి తపంబొప్పఁ జేయుచుండిరి [2]నెమ్మిన్.

---

ప్రతులు. 7. విప్ర పూజితుండైన - వా; లోక పూజితుండై - కొన్ని ప్రతులు. 8. డై జనకు - పెక్కు ప్రతులు. 9. యేకపాదుని దోడ్కొని యేగు దెంచె - ఝ. శ. ష.

251. 1. సమంజస, సరోజ, సరోజిని, స కూజిత - భిన్న పాఠములు. 2. యింద్రుడు దీని జలౌఘు స్పర్శనంబున లక్ష్మీప్రాప్తుండయ్యె - పెక్కు ప్రతులు. 3. పుత్రా ర్థియై - పెక్కు ప్రతులు. 4. రుషి కుల్యంబను కులశైలం బిది దేవతాయతనంబైన కనక శిలానగం బిది గంగా - ల. 5. కనకనగం - పెక్కు ప్రతులు. 6. తూష్ణి గంగ - పెక్కు ప్రతులు.

252. 1. శ్చలమతి నివ్వనమున దా రొలసి - ఏ. ల; శ్చలమతు లివ్వనమున దారొలసి-ఛ; శ్చలమతి నివ్వనమున వారొలసి - డ. 2. పేర్మిన్, ప్రీతిన్ - భిన్న ప్రతులు.

253. వ. అందు రైభ్యుండు [1]కృతాధ్యయన[2]శూరులైన [3]యర్ధావసుపరావసులను తన యిద్దఱు పుత్త్రులతో విద్వత్పూజితుండై యున్నవానిం జూచి సహింపనోపక భరద్వాజ[4]సుతుఁడు యవక్రీతుండు తపోబలంబున నఖిలవేద[5]శాస్త్రాగమంబులు పడయుదు నని [6]సమిద్ధంబైన యగ్నియందు [7]సంధార్యంబు సంధించుచు నుగ్రతపంబు [8]సేయుచున్న [9]దాని సహింపనోపక యింద్రుండు వానియొద్దకు వచ్చి నీవేమియుద్దేశించి [10]యుగ్రతపంబుఁ జేసెదవనిన శక్రునకు యవక్రీతుం డిట్లనియె.

254. ఆ. చదువకయును నాకు [1]సర్వవేదంబులు, [2]సర్వశాస్త్రములును సంభవిల్ల
వలయునని తలంచి వదలక నిష్ఠతో, నుగ్రతపముఁ జేయుచున్నవాఁడ.

255. వ. [1]అనిన వానికింద్రుం డిట్లనియె.

256. క. గురుముఖమునఁ బడయక దు, ష్కరతపమునఁ జేసి పడయఁగాఁ [1]బడువిద్యల్
పరమార్థము మదమును మ, త్సరమును గావించు [2]నెట్టి సాధులకైనన్.

257. వ. ఇది విద్యోపార్జనంబున కుపాయంబుగాదని వారించి వాసవుఁడరిగిన నుడుగక యవక్రీతుం డెప్పటియట్ల తపంబుఁ జేయుచున్నఁ దదీయ [1]తపస్తప్తమానసుండై వృద్ధశ్రవుండు వృద్ధవిప్రరూపంబు ధరియించి యశక్తుండై

---

253. క్రుతాధ్యయన - పెక్కు ప్రతులు. 2. శీలులైన - ఊ. ఒ. ఠ. డ. 3. యర్థావసు - పెక్కు ప్రతులు; యర్ధవసు - ల; యర్వావసు - వా. 4. పుత్రుండు - కొన్ని ప్రతులు. 5. శాస్త్రాదికంబులు - ల. 6. సమృద్ధంబైన - కొన్ని ప్రతులు. 7. సాన్నాయ్యంబు - ఇ. ఔ. క. గ. చ. ద. ఠ. స; సాయాహ్నంబులు - డ; నుద్గాయం బనుసం - అ. ఎ. ఝ; కాయంబుసం - ల. 8. సేయుచున్నంత - కొన్ని ప్రతులు. 9. దాని సహింప నోపక - కొన్నింట లేదు. 10. యిట్టి యుగ్ర - పెక్కు ప్రతులు.

254. 1. సకల - ఏ. క. ల. 2. సకల - ఇ. ఏ. గ. జ. ల.

255. 1. ఈ వచనము కొన్ని ప్రతులలో లేదు.

256. 1. దగు విద్యల్ - ఇ; నగు విద్యల్ - ఘ. ల. 2. నెంత - ఈ. ఐ. త; నెట్టి ధన్యుల కైనన్ - ఆ. ఆ. ఎ. ఝ; జనులకు నైనన్ - ట.

257. 1. తపస్తప్య మానసుండై - ఉ. ఔ. శ; తపస్తవ్య మానుండై - ఓ.గ.ఘ.గ.జ.శ.ల.

శోషించిన శరీరంబు[2]తోడ సికతాముష్టిపరంపర నపారగంభీరగంగాప్రవాహామునందు సేతు[3]బంధంబు చేయుచున్న [4]నవ్విప్రుంజూచి యవక్రీతుం[5]డు నగుచు నిట్లనియె.

258\. క. శతవర్షవృద్ధుఁడవు నీ, వతికృశుఁడ వశక్యమైన యర్థమునం దా
[1]స్థత యేల సేసి కడు దు, ర్మతి[2]వై తిం కెన్నఁడిది [3]సమాప్తిం బొందున్.

259\. వ. [1]అనిన నింద్రుండు వానిం జూచి యేను నీయట్ల యఘటమానం బైన యర్థంబునందు యత్నంబుఁ జేసెద నని నిజరూపంబుఁ జూపి [2]యిట్లు నిరర్థక ప్రయాసం బేలచేసె దుడుగు మనిన నే నెట్లు [3]నుడుగ నా[4]యభిమతంబు సఫలంబు సేయవలయు [5]నన యవక్రీతుండు [6]శక్రువలనం దన[7]యభిమతంబు వడసి తత్ప్రకారంబుఁ దండ్రికిం జెప్పిన విని భరద్వాజుఁడు కొడుకుగర్వంబు సహింపక [8]దేవగీతలైన గాథల[9]యర్థంబు వానికి[10] నిట్లని చెప్పె.

260\. సీ. [1]బాలధి యనుమునిప్రవరుండు పుత్త్రశోకాపన్నుఁడై ఘోరమగు తపంబుఁ
జేసి వేల్పుల దయఁ జిరజీవిగాఁ బుత్త్రుఁ బడసె మేధావి నాఁబరగువాని
వాఁడు నాయుష్య[2]గర్వమున మునీంద్రుల [3]నెవ్వరి మెచ్చక యేఁగి యొక్క
[4]ధనుషాక్షుఁ డనుతపోధనునొద్ద గర్వించి పలికిన నలిగి తపస్వి వాని

---

2\. తో సికతా-ఏ. ల; తోన సికతా-ఘ. ర. 3. బంధనంబు - పెక్కు ప్రతులు. 4. యవ్విప్రుం - ల 5. డిట్లనియె - పెక్కు ప్రతులు.

258\. 1. తతశక్తినేసి - డ. శ. ప. స. 2. వైతిక నెన్నడిది - డ; వైతి వెన్నడిది - గ. 3. సమాప్తత బొందున్ - కొన్ని ప్రతులు.

259\. 1. అనిన వినియిం - వా. 2. యిట్లేల నిరర్థక ప్రయాసంబుచేసె - పెక్కు ప్రతులు. 3. నుడుగుదు - ఊ. గ; నునుడుగ - డ. 4. యభిప్రాయంబు - పెక్కు ప్రతులు. 5. ననిన - ఒ. ఔ. క. ఝ. శ. 6. శతమఖువలన - డ. శ. ష; శతక్రతు వలన - పెక్కు ప్రతులు. 7. యభిప్రాయంబు - పెక్కు ప్రతులు. 8. వేద - ఏ. ఓ. జ. ద. త. ష. 9. యర్థం బాతని కిట్లనిచెప్పె - ల; యర్థంబుల వాని కిట్లని చెప్పె - డ. 10. ట్లని చెప్పె - పెక్కు ప్రతులు.

260\. 1. బాలాది - పెక్కు ప్రతులు; బాలాచి - ర. 2. గర్వంబున మునులను నెవ్వారి - ఒ. 3. నెవ్వారి - పెక్కు ప్రతులు. 4. ధనుషాకుడు - పెక్కు

ఆ. నంతకాంతికమున కరుగంగఁ జేసె గ, ర్వంబు చెట్ట యెట్టివారినైనఁ
గ్రాఁచుఁ [5]దక్షణంబు గర్వంబు గర్వంబు, నొడిచి [6]యున్నవాఁడ
యుత్తముండు.

261. వ. కావున [1]నీవు గర్వంబు విడిచి [2]యకోపనుండవై పరమశాంతులైన రైభ్యకొడుకులతోడ నిర్మత్సరుండ వయి యుండుమనిన నట్లుసేయుదు నాకు రైభ్యుండు భవత్సమానుండ యని యవక్రీతుండు తనవిద్యావిభవంబు మునిసభల విస్తరించుచు నొక్కనాఁడు రైభ్యాశ్రమంబునకుం జని [3]యందు.

262. ఉ. కోమలకీరషట్పరణకోకిలనాదమనోహరంబు నుద్
దామవసంతపుష్ప[1]భరితక్షితిజప్రకరంబు [2]నైనయా
రామమునందుఁ జూచె మునిరాజకుమారుఁడు రైభ్యకోడలిం
దామరసాక్షిఁ గృష్ణయనుదానిఁ బరావసుభార్యఁ బ్రీతితోన్.

263. ఆ. దానిఁ జూచి మదన[1]తప్తుఁడై తనయభి, ప్రాయ మెఱుఁగఁ జెప్పెఁ బంకజాక్షి
కదియు శాపభీతి [2]నప్పటికొడఁబడి, [3]నట్లు పలికి పెలుచ నరుగుదెంచి.

264. క. తమ మామకుఁ దద్వృత్తాం, త[1]మునంతను దెలియఁజెప్పి తరుణి [2]విలోలా
క్షములందు బాష్ప[3]సలిలో, ద్గమముగఁ దల[4]వాంచియుండెఁ గడుఁ
గోపమునన్.

---

ప్రతులు; ధవళాక్షు-శర. ప. 5. రక్షణంబు-ఈ. ఐ. త. శ. 6. యుండువాడ - పెక్కు ప్రతులు.

261. 1. నీవు - పెక్కు ప్రతులలో లేదు. 2. యకోపనులైన రైభ్య - పెక్కు ప్రతులు. 3. యందు - పెక్కు ప్రతులలో లేదు.

262. 1. ఫలిత - స; చలిత - స. 2. లైన - ఊ. ఝ. డ.

263. 1. తత్పరుడై, యభి - ఒ. స. 2. కప్పటి - ఆ. క. ఝ. త. ద. 3. నట్ల యుండి - అ. ఈ. ఊ. ఐ. ఓ. త.

264. 1. ములెస్స యెరుంగ జెప్పి - అ; మునంతయు నెరుగజెప్పి - పెక్కు ప్రతులు; మంతయును దెలియ - త. 2. విశాలాక్షము - ఏ. ఓ. గ. ఝ. ప. 3. సలిలోద్గమమయై - ల; సలిలోద్గమమై - ఎ. ఓ. 4. వంచుకొని యెగడు - అ; వాంచికొనియె - అ. ఇ.

265. వ. రైభ్యుండు నయ్యవక్రీతున కలిగి నిజకోపానలశిఖాయమానైక[1]జటావలం
బనకరుండై హుతాశనునందు [2]వేల్చి యయ్యగ్నికుండంబునందు.

266. క. లలితాంగిఁ బడసెఁ దనకో, డలి రూపముకంటెఁ గడు [1]బెడంగగు రూపో
జ్జ్వలకాంతి గలుగుదానిం, బోఁతుక [2]నొక్కర్తు నతితపోవీర్యమునన్.

267. వ. మఱియు నొక్కజట యవలంబించి వేల్చిన నందు [1]వికృతదంష్ట్రాకరాళం
బైన ముఖంబుతో శూలహస్తుండైన యొక్క[2]రాక్షసుండు పుట్టె [3]నయ్యి
ద్దఱు [4]ముకుళితహస్తులై మాకుం బనియేమి [5]యని యడిగిన నవినీతుండైన
యవక్రీతు వధియింపుం డని [6]పంచిన.

268. క. ఆతరుణి [1]మున్నుచని మద, నాతురుఁడై [2]వికృతచిత్తుఁడై యున్నయవ
[3]క్రీతుకరకమండలువుం, బ్రీతిఁ [4]బ్రబోధించి కొనియె బెడఁగుగ నంతన్.

269. క. [1]అపహృతకమండలుండై, యపవిత్రుండగుటఁ జేసి యధికతపో[2]వీ
ర్యాపరిక్షయ మగుడును నా, తపస్విసుతు రాక్షసుండు దడయక తాఁకెన్.

270. వ. వానికి వెఱచి [1]పఱచి యవక్రీతుండు మహానదులు గొలంకులు సొచ్చిన
[2]నవి శుష్కంబులైనఁ దనజనకునగ్ని[3]హోత్రంబు జొచ్చు నంత.

---

265. 1. జటావలుంఛన – స. 2. వేల్చిన నయ్యజ్ఞ – గ. చ. ఠ. డ. ల.

266. 1. బెడంగడరెడు నుజ్జ్వల – ఒ; బెడంగయితగు నుజ్జ్వల – ఒ. 2. నొక్కతుక – ఇ; నొక్కర్తుదన – ఈ. త. స.

267. 1. వికట – ఔ. ల. 2. రక్కసుండు – ఇ. గ. త. 3. నట్ల యిరువురు, నట్ల య్యిరువురు – కొన్ని ప్రతులు. 4. ముకుళీకృతహస్తులై – వా; ముకుళిత హస్తులై – పెక్కు ప్రతులు. 5. యనిన నవినీతుండైన – పెక్కు ప్రతులు 6. రైభ్యుండు పంచిన – ఉ. ఊ. ఔ. క. ఙ. ఠ. ద. ల.

268. 1. మున్నుచని – ఉ. డ ల. 2. విగత చేష్టుడై – ఆ. ఈ. ఊ. ఔ. క. ఖ. ఝ. ఠ. డ. ల. సూ; వికృతచేష్టుడై – ఇ. ఉ. ఎ. ఏ. ఐ. చ. ఙ. ద. శ. ష. స. 3. క్రీతుని దొ కమండలువు – అ. ల; క్రీతు కమండలువు నతిప్రీతి – పెక్కు ప్రతులు. 4. నపహరించి కొనియె – అ. ఆ. ఇ. ఎ. ఔ. క. ఝ ట. ల.

269. 1. అపహృష్ట – ఊ. ద. స; అపకృష్ట – ఉ. ఒ. ఖ 2. విద్య – స.

270. 1 పరచి – పెక్కు ప్రతులలో లేదు, 2. నవియు – ల. 3. హోత్ర గృహంబు జొచ్చెనంత – పెక్కు ప్రతులు; సొత్తెంచెనంత – ల.

271. ఆ. మునికుమారు నెగిచికొనివచ్చి నిశితశూ, లాయుధమునఁ బొడిచి యాసుర్థమున
రక్కసుండు చంపి యక్కాంతయును దాను, నరిగె రైభ్యుకడకు [1]నతుణంబ.

272. వ. రైభ్యుండును వానికి భార్యగాఁ [1]గృత్తి నిచ్చె నంత నిట భరద్వాజుండు వనంబుననుండి [2]వచ్చి తనకెప్పుడుం బ్రత్యుత్థానంబుఁ జేయునగ్ను లప్పు డడంగియున్న నచ్చెరువడి గృహపాలకుం డైనశూద్రువలన నంతవృత్తాంతం బెఱింగి [3]నిహతుం డైనపుత్త్రుం జూచి [4]దుఃఖితుండై.

273. ఆ. రైభ్యుఁ [1]డధికకోపరతుఁ డంటి నమ్మునిని, యాశ్రమంబు [2]దెసకు నరుగ వలవ
దంటి వినఁగ నొల్లవైతి నా[3]పలుకులు, గర్వితునకు బుద్ధిగాననగునె.

274. వ. అని ప్రలాపించుచు భరద్వాజుండు వానిదహించి పుత్త్ర[1]శోకదహనంబు సహింప నోపక తద్దహనంబున [2]దేహత్యాగంబుఁజేసె నంత బృహద్ద్యుమ్నుం డనురాజు సత్రయాగంబుఁ [3]జేయుచుండి రైభ్యుపుత్త్రుల [4]నర్థావసు పరావసులం దనకు ఋత్విజులంగా వరియించిన నయ్యిరువురుఁ దండ్రి[5]చేనను జ్ఞాతులై వానియజ్ఞంబు [6]నడుపుచుండి యొక్కనాఁడు పరావసుండు నిజాశ్రమంబునకు వచ్చువాఁడు వేగుఁబోక [7]చీఁకటి నడవిలో నేకతంబ

---

271. 1. నాతుణంబ - వా; నతుణంబ - పెక్కు ప్రతులు.

272. 1. గృత్య - ఏ. 2. వచ్చి తనకెప్పుడున్ - పెక్కు ప్రతులు; వచ్చి తొల్లి తన కెప్పుడుం - వా. 3. హతుండైన - ఓ. ల. 4. దుఃఖితుండై - కొన్ని ప్రతులలో లేదు.

273. 1. డుగ్ర - ఊ. ఏ. ఓ. గ. 2. కడకు - ఘ; నకును - గ.; దిశకు - కొన్ని ప్రతులు. 3. పలుకతి - వా. పలుకులు - పెక్కు ప్రతులు.

274. 1. శోకదాహంబు - ఐ. ద; శోకతాపంబు - ఏ. ఓ. ల; శోకదవానలంబు - ర. 2. దేహ పరిత్యాగంబు - ఓ. క. గ. జ. 3. జేయుచు రైభ్యు - కొన్నిప్రతులు. 4. నర్వావసు - వా.; నర్థావసు - పెక్కు ప్రతులు. 5. చేతననుజ్ఞాతులై - పెక్కు ప్రతులు. 6. నడపుచున్న నొక్క - పెక్కు ప్రతులు. 7. చీకటి నేక

తన[8]కు నెదురుగా వచ్చురై_భ్యు నెఱుంగక మృగంబకా వగచి నిజప్రాణ భయంబున వధియించి పదంపడి యెఱింగి [9]పరమదుఃఖితుండై [10]ప్రేత కార్యంబులు దీర్చి బృహద్ద్యుమ్ను[11]సత్రంబునకు వచ్చి తనచేసినపితృఘాతం బగ్రజునకుం జెప్పి యి ట్లనియె.

275\. తే. [1]నీవు దీని నొక్కరుఁడవు నిర్వహింప, నోప వేనొక్కరుండ నయ్యును గడంగి నడప నోపుదుఁ గావున నాతదర్థ, మాచరింపుము బ్రహ్మహత్యావ్రతంబు.

276\. వ. అనిన నర్థావసుం డట్లు సేయుదు నని బ్రహ్మ[1]హత్యావ్రతంబులు సలుపు చుండెఁ బరావసుండును నొక్కరుండ సత్రయాగంబు [2]జరుపుచుండె నంత నర్థావసుండు బ్రహ్మహత్యా[3]ప్రాయశ్చిత్తంబులఁ జేసి యాసత్రయాగంబు నకు వచ్చిన వానిం జూచి పరావసుండు బృహద్ద్యుమ్నున కి ట్లనియె.

277\. క. ఇమ్మునిఁ నీయజ్ఞాయత, నమ్ముఁ బ్రవేశింపఁ దగఁడు నరనాయక యు గ్రమ్ముగ సలిపెడు శుభకా, ర్యమ్ములకుం బాసి బ్రహ్మహత్యావ్రతముల్.

---

తంబ - పెక్కు ప్రతులు; చీకటి నడవి నేకతంబు - ల. సూ ప్రతి ననుసరించి చీకటి శబ్దములో అరసున్న లేదు. 8. కు నెదురువచ్చు-అ. ఈ. ఝ; కెదురై వచ్చు - ఓ. 9. పరమ - కొన్ని ప్రతులలో లేదు. 10. పితృకార్యంబు - అ. ఆ ఈ. ఎ ఐ. గ. చ. ఝ. త. ద; పితృ కార్యంబుచేసి - ఇ. ఓ. ల. 11. సత్త్ర యాగంబునకు వచ్చి - అ. ఎ. చ. ల.

275\. 1. ఏను దీని నొక్కరుఁడనె పూని నడప, నోప నీవొక్కరుండవయ్యును - వా. కాని సర్వయతి నియమ భంగము; నీవు దీని నొక్కండవు నిర్వహింపనోపవే - కొన్ని ప్రతులు; ఏను దీని నడపఁగా నోప నొక్కడ, నీవు పూని తాల్చి నిర్వహింపు. నడపనోవు దీవునాకుగాను తదర్థ. మలయ కాచరింపు హత్యవ్రతము.; ఏను దీని నొక్కండన పూని నడప, నోపనీ వొక్కరుండ వయ్యును గడంగి, నడపనోపుదు గావున నాతదర్థ, మలయ కచరింపు బ్రహ్మహత్యావతంబు - స.; నీవు దీనినొక్క రుడవు...కొన్ని ప్రతులు.

276\. 1. హత్యాహరణ వ్రతంబు - ఇ. 2. గడపు, సలుపు, నడపు - అని భిన్న పాఠ ములు. 3. ప్రాయశ్చిత్తంబుజేసి - కొన్ని ప్రతులు.

278. వ. అనవుడు బృహద్ద్యుమ్ను[1] ప్రేరితు లయినజనులచేత నుత్సార్యమాణుండయి యర్థావసుం డనియెం బరావసుండుగాని యేను బ్రహ్మఘాతకుండం గాను [2]వానికై వ్రతంబు సలిపి తత్పాతక[3]విముక్తుం జేసితి నని చెప్పిన యర్థావసు యథార్థకథనంబునకు మెచ్చి యగ్నిపురోగములైన దేవతలు వాని కిట్లనిరి.

-: దేవత లర్థావసునకు మెచ్చి కోరినవరంబు లెల్ల నిచ్చుట :-

సం. 3 _ 139 _ 18

279. తే. తమ్ముచేసినదురితముల్ తలఁగఁ బూని, ధర్మబుద్ధివై వ్రతములు పేర్మిఁ జలిపి
తనఘ నీకు నభీష్టంబులైనవరము, లడుగు మిచ్చెద మీమెచ్చు [1]గడవ నగునె.

280. వ. అనినఁ దనతండ్రియు [1]భరద్వాజుండును యవక్రీతుండు నెప్పటియట్ల జీవించి యుండను నిజజనకుండు పరావసుచేత నిహతుండగుట [2]నిస్తరింపను వలయు నని ప్రార్థించి దేవతల వరంబున నర్థావసుండు రైభ్య భరద్వాజ యవక్రీతుల సంజీవితులం జేసిన [3]నద్దేవతలకు యవక్రీతుం డిట్లనియె.

281. తే. [1]ఏను బహువేదశాస్త్రమ్ము లెఱిఁగి వ్రతము, లెల్లఁ [2]జేయుచు
రైభ్యుచే నిట్లు హతుఁడ
నైతి నాకంటె రైభ్యున [3]కధికశక్తి, యైన తెఱఁ గెట్లు లనిన
నిట్లనిరి సురలు.

---

278. 1. ప్రేషితులయిన - పెక్కు ప్రతులు. 2. వానిని - వా. వానికై - పెక్కు ప్రతులు. 3. విముక్తుండనైతి - పెక్కు ప్రతులు.

279. 1. గడవఁ దగునె - వా. గడవనగునె - కొన్ని ప్రతులు.

280. 1. భరద్వాజ యవక్రీతులు - పెక్కు ప్రతులు. 2. వాని విస్మరింపను - వా; నిస్తరింపను - కొన్ని ప్రతులు. 3. నంత దేవతలకు - కొన్ని ప్రతులు.

281. 1. ఏను వేదశాస్త్రమ్ముల నెరిగి వ్రతములెల్ల సలిపియు రైభ్యుచే హింసితుండ - అ. ఆ. ఉ. ఎ. ఘ. శ. ష. స. ల. 2. జరి (లి) పియురైభ్యుచే హింసితుండ - ఒ. ఔ. చ. జ. ద. 3. కంత - పెక్కు ప్రతులు.

282. క. గురుశుశ్రూష యొనర్చుచుఁ, బరమక్లేశమునఁ జేసి పడసినవిద్యల్
స్ఫురియించుఁగాక గురుముఖ, విరహితముగఁ బడసినవియు వెలయునె
యెందున్.

283. వ. నీవు గురుముఖంబునం బడయక యొండువిధంబునం బడయుటం జేసి నీ యధ్యయనశ్రుతంబులు నిర్వీర్యంబు లయ్యె [1]గురుసంతోషకరుండై రైభ్యుండు బ్రహ్మజ్ఞానం [2]బుపార్జించెం గావున నాతం డిట్టిశక్తి వడసె నని దేవతలు దివంబున కరిగి రిది యవక్రీతునివాసం బిందు వసియించినవారు దురితవిముక్తు లగుదు రిది కాలశైలం బిది [3]సప్తవిధం బైనగంగ యిది మనుష్యుల కగోచరం బిందయ్యుండి సమాధి[4]శౌచపరులై చూడుం డిది మందరనగం బిందు నానాప్రహరణపాణులై యష్టాశీతిసహస్రగంధర్వులు కిన్నరకింపురుషసుపర్వులు సురేంద్రుఁ గొలిచి బోయెద రిందుల కాఱు నూఱుయోజనంబులు గలదు కైలాసపర్వతం బందుఁ గుబేరుం డుండు నని రోమశుండు సెప్పినం బాండవులు [5]కృతసమాధిశీలురై వానినెల్లం జూచి రంత నంతకసుతుండు భీమున కిట్లనియె.

284. సీ. దుర్గమం బైన యీదుర్గమార్గంబున నడవంగ నేర మున్నతరథముల
నింద్రసేనాదుల నీధౌమ్యవిప్రుల ద్రుపదతనూజను దోడ్కొనుచు
సహదేవుఁడును నీవు [1]చట్టనఁ గ్రమ్మఱుఁ డేను నకులుండు నేఁగి రోమ
శాదేశమునఁ జేసి [2]యఖిలతీర్థంబులు నాడి వచ్చెదము మాయరుగుదెంచు

ఆ. నంత కెంతయును బ్రయత్నంబుతోఁ గృష్ణఁ, [3]గాచియుండుఁ డనిన
ఘనుఁడు భీముఁ
డనియె నిట్టిరాక్షసాకీర్ణవనములోఁ, నిన్నుఁ బాయ[4]నగునె నిమిష[5]మేని.

---

283. 1. గురు శుశ్రూషా సంతోష – వా; గురుశుశ్రూషా పరుండై – చ. ల; గురు సంతోషణపరుండై – ఇ. 2. బవలంబించె – అ. ఈ. ఎ. ఐ. ఒ. జ. ఝ. త. శ. ష. 3. సప్త శతవిధం – పెక్కు ప్రతులు. 4. శౌచపరులై – పెక్కు ప్రతులు; శౌచ ప్రయత్నపరులై – వా. 5. కృతాచమన సమాధానులై – పెక్కు ప్రతులు; కృత సమాధులై – ల.

284. 1. చట్టన – పెక్కు ప్రతులు; చయ్యన – వా. 2. సకల – అ. ఆ. అఖండయతి 3. గాంచి – ఏ. 4. దగునె – ఔ. ఝ. త. శ. ష; జనునె – ఘ. 5. మైన – ఇ. ఊ. క. గ. ఝ. ద. ల.

285. చ. అనఘచరిత్రు [1]నర్జును మహాభుజు నొక్కనిఁ బాసి వంతఁ [2]బొం
దిన[3]యెడ నిట్టిచోట సహదేవుఁడు నేనును గృష్ణయుఁ జగ
జ్జనసుత నిన్నుఁబాసిన [4]నసహ్యతరం బగు తీవ్రతాపవే
దన యగు నీకు మాకు నుచితంబె పరస్పరభేద [5]మెన్నఁడున్.

286. క. కడు [1]డస్సి నడవనోపని, యెడ నీకమలాయతాక్షి నీకవలను నే
దడయక [2]నఱకట నిడికొని, కడఁకం గొనివత్తు విషమగహనాంతములన్.

287. వ. ఈరథంబులతోఁ బోవ నిమ్మాగాదేని వీని నింద్రసేనాదుల నెందేనిం బెట్టి పోద
మనిన రోమశుం డిట్లనియె.

288. క. అతులతపోవీర్యబలో, న్నతి ఘోరదము గంధమాదవంబునకు సమా
[1]గతు నందుఁ గాంతు మర్జును, నతివీరు [2]నుదారు [3]సురగణార్చితుఁ బార్థున్.

289. వ. అనిన నందఱు సంతసిల్లి యరుగువారు [1]ముందర [2]ననేకపహాయరథసనా
థంబై యపారకిరాత[3]బలసంకులం బై నదానిఁ బుళిందాధిపతియైన సుబాహు
పురంబుఁ గని యందు వానిచేతం బూజితులై తమరథసూతహయనివహం
బుల నింద్రసేనాది[4]భృత్యులను సుబాహునొద్దం బెట్టి పాదచారులై పాంచా
లిని బ్రాహ్మణులను రక్షించికొని గంధమాదనంబున కభిముఖులై యరిగి
రంత ధర్మతనయుండు [5]భీమున కిట్లనియె.

---

285. 1. డైన మనయర్జును నొక్కని – ఔ 2. జెందిన – ఇ; నొందిన – ఏ. ఓ. వ. 3. నినునిట్టి – అ. 4. నశక్యతరం – ఐ. ద. శ. ష; నసహ్యతరం బయి – అ. ఆ. ఎ. ఏ. ఘ. చ. ల. 5. మెప్పుడున్ – ఊ. ల.

286. 1. డప్పి – ఇ. డ. 2. తెచ్చెద నాయిరు,గ (క?) డ నిడుకొని యెట్టి విషమ గహ నాంతములన్ – ఆ. ల; నయింతు నాయఱకడ నిడుకొని పఱతు నెట్టిగహ వాంత ములన్ – ఉ. ఊ. ఒ. ఘ. జ. స; యఱకడ నిడికొని కడకంగొని వత్తు మిమ్ము గహనాంతములన్ – ష. వ; దెచ్చెద నిరకట నిడుకొని వడినిట్టి విషమ హీనాటవు లన్ – ఈ. ఐ. ఔ. త. శ; దెచ్చెద నాయిరుకడనిడుకొని యిట్టి విషమ గహనము లోనన్ – ఏ; యెత్తుక నాయఱుకడనిడుకొని యట్లు విషమ – డ.

288. 1. హితునందు – ఉ. ష. 2. నపారసుర – ఔ. 3. నురుగుణాన్వితు – స; సురగణాన్వితు – ఊ.

289. 1. ముందట – కొన్ని ప్రతులు. 2. ననేకానేకప – ఘ. చ. జ. డ; ననేకహయ– అ. ఇ. ఉ. ఏ. ఔ. గ. 3. జనసంకులం – అ. ఎ. ఝ. శ. ష; బలసమృద్ధం బైన – డ. 4. మూల భృత్యులను – ఉ. ద. ర. 5. భీముం (మునిం) జూచి యిట్లనియె – కొన్ని ప్రతులు

290. సీ. [1]అలిగి వజ్రాయుధునైన నను బోరిలో నోర్వంగనోపు నత్యుగ్రవీరు
జవమునఁ బవనుఁ దేజంబున నాదిత్యుఁ బోలినవాని నంభోజనేత్రు
నాయతబాహుఁ గృతాస్త్రు [2]సింహస్కంధు సర్వధనుర్ధరాచార్యు విజయు
నిత్యతమూన్వితు నీతమ్ము నర్జును శుభగుణసుందరుఁ జూచునంత

ఆ. కధికతాపతప్తమైనది నాచిత్త, మొనర నతనితోడ నొక్కటునికి
యెన్నఁడొక్కొ మనకు [3]నిందఱకగు నాతఁ, డేల మసలెనొక్కొ
[4]యిన్ని యేండ్లు.

291. మ. అనుచుం బార్థవిలోకనంబు [1]మదిలో [2]నర్థింపఁగా ధర్మజుం
డనవద్యుల్ గడువేడ్కతో నరిగి [3]తా రప్పాండవుల్ గంధమా
దనశైలేంద్రముఁ గాంచి రున్నతబృహద్ధాతుస్థలీసంహతిన్
ఘనసంధ్యాగమశంక సన్మునులకుం గావించు[4]దానిన్ మహిన్.

292. క. నానావర్ణశిలావిహ, గానేకమృగాభిరామ మై భూనారీ
నానాభరణవిభూషిత, పీనోన్నత[1]కుచముఁ బోలె [2]వెలిఁగెడుదానిన్.

*–: పాండవులు గంధమాదనపర్వతంబునకుం బోవుట :–*

సం. 3 – 143 – 1

293. క. [1]లలితాచ్ఛస్ఫటికశిలా, తలములపైఁ బాఱువిమలతరనిర్ఝరిణీ
జలపూరములను[2]తారో, ల్లలదురుహారాలి నుజ్జ్వలం బగుదానిన్.

---

290. 1. అలఘు – వా; అలిగి – పెక్కు ప్రతులు. 2. వృషస్కంధు – అ. ఈ. ఎ. ఐ. త. శ. ష. 3. నొనగూడు మరియాత – ఇ. గ. 4. యిందుకులుడు – ద.

291. 1. నెదలో – గ. ఘ. చ; నెడలో – క. 2. నర్థించుచున్ – క. జ. ష. 3. రం దప్పాండవుల్ –అ. 4. దానిన్మదిన్ – ఒ. ఘ. డ. ద. శ. ష.

292. 1. భుజమువోలె – స. 2. బెడగగు దానిన్ – పెక్కు ప్రతులు; వెడగగుదానిన్– అ. ఇ. ఉ; బెణగగు – ఒ. డ.

293. 1. లలితోచ్ఛ – ఇ. ఐ. క. గ. ఝ. ద. శ. ష?; లలిత స్ఫటిక శిలావృతతలముల పై – ఊ. చ. 2. తారాలలనాహారాలి – ఔ. క. ద; వాతోల్లలదంబురు హాలి – ష.

294. ఉ. వారలు గంధమాదన మవార్యబలాఢ్యులు సొచ్చుచో మహా
మారుత [1]మప్డు వీచె నహిమద్యుతిమార్గము దిఙ్ముఖంబు[2]లన్
భూరుహపత్ర[3]మిశ్ర మయి భూరిపరాగము గప్పఁగా ధరి
త్రీరుహ[4]శాఖలున్ విఱిగి త్రెళ్ళఁగ గుల్మలతాలి [5]సాల్పడన్.

295. చ. కడు వడి గాడ్పుచే విఱుగఁగాఁ బడి త్రెళ్లుమహీరుహాళి చ
ప్పుడు విని యందఱుం [1]జెదరి భూమిపయిన్ గగనం [2]బుదగ్రతం
బడియెనొ శైలశృంగములు భగ్నము లయ్యెనొ యంచు ధూళి [3]నె
క్కడఁ జన[4]నేర కొండొరులఁ గానక యుండిరి [5]సంచలాత్ములై.

296. వ. ఇట్లు [1]మహారేణుపటలం బంధకారంబునుంబోలె నీరంధ్రంబై కప్పినఁ [2]బతితతరువిటపలతాగుల్మంబులు [3]కరతలంబులం బాయం ద్రోచుచు విశాల దృఢతరుమూలంబు లాశ్రయించి యగ్నిహోత్రంబులతో ధౌమ్యధర్మజ సహదేవు లొక్కచోట [4]నుద్యద్గదాకార్ముకుం డైన భీమసేనుండును ద్రౌపదియు నొక్కచోట రోమశుండును నకులుండును బ్రాహ్మణులు నొక్కచోటనుగా నందఱు వేఱువేఱ యుండి రంత.

297. చ. కురిసెఁ బ్రచండవృష్టి ఘనఘోషము లెల్ల [1]కెలంకులన్ భయం
కరములుగాఁ [2]గరాళకరకాతతు లొప్పఁ దటిల్లతాళి వి
స్ఫురితముగాఁ బ్రపూర్ణ[3]జలపూరము లద్రికుంజభూరిని
ర్ఝర[4]తటినీతటీనికటసాలచయంబు విమూలితంబుగన్.

---

294. 1. మందు – ఈ. ఐ. త; మప్డు వీచెను హిమ – ఐ. శ. ష. 2. లంభోరుహ పత్ర– ఈ. ఘ. చ. త. ద. శ. ష. 3. మిత్తు నెడ – ఐ. శ. ష. 4. శృంగముల్ – పెక్కు ప్రతులు. 5. చాడ్పడన్ – అ. ఆ; సాల్వడన్ – శర.

295. 1. బెదరి – పెక్కు ప్రతులు; బడిరి – ఔ. 2. బుకగ్గరన్ – పెక్కు ప్రతులు. 3. నొక్కడు – శ. 4. లేక యొండొరుల – ఐ ఝ. ష. 5. చంచలాత్ములై – ఊ. గ. ఘ. ల; భీత చిత్తులై – ఓ.

296. 1. భూరేణు పటలం – ఇ 2. దరు విటప – వా; పతిత గుల్మలతా వితానంబులు– శ. ష. 3. కర తలంబులం – పెక్కు ప్రతులలో లేదు. 4. నుద్యత్కార్ముకధరుండైన – ఇ జ. డ. ల.

297. 1. వలంకులన్ – ఆ. ఉ. ఊ. ఒ. గ. చ. జ డ. ద. స. 2. గరాళె కరకా – వా. గరాళ కరకా – పెక్కు ప్రతులు. 3. జల పూరములిగ్గిరి – వా. 4. తటినీ తటీ నికటసాల – పెక్కు ప్రతులు; తటినీ విశాల – వా.

298\. వ. అట్లు గాడ్పుతోడివాన పెద్దయుంబ్రొద్దు కురిసి [1]యుడిగిన నందఱు నొక్కచోటికి వచ్చి యెప్పటియట్ల యరుగునెడ నతివిషమశిలాసంకట[2]పథంబున నడవనేరక ద్రౌపది [3]తొడరి పడి మూర్ఛితయైనం బవనతనయుం డక్కోమలి [4]నెత్తికొని యజినాస్తరణంబు పయిం బెట్టి కదళీదళంబుల వీచుచున్నం గవలు దానిపల్లవతామ్రపాదతలంబు లాయుధాభ్యాసవశంబునం గిణీభూతంబు లయిన తమకరతలంబులం జేసి మెత్తన యొత్తుచుండి రట్టియవసరంబున ద్రౌపదిం జూచి దుఃఖితుం డయి ధర్మతనయుం డిట్లనియె.

299\. అక్కర.

[1]అరుణసరోరుహదళమృదువు లైన యీతన్వి రమ్య
[2]చరణతలంబులు గొడిగరాలపైఁ జనుచున్కిఁ జేసి
పరుసంబు లై కడు నెట్టనై నవి పద్మాయతాక్షి
[3]పరగ నాకారణంబునను నీదుఃఖభారంబు దాల్చె.

300\. సీ. [1]సముచితంబగు మృదుశయనతలంబున శయనించు[2]నిత్తన్వి సదనులాంగి
పరుసంపుఱాలపైఁ బడి తీవ్రవేదనఁ బొందినయది మహాపురుషులైన
పాండవులకుఁ బ్రియభార్యయై నాపుత్త్రి సుఖముండునని [3]మది సోమకుండు
పాయక సంతోషపడియుండుఁ గాకున్నె యని [4]విలాపించు నయ్యమతనూజ

ఆ. నుచితవచనరచన నూరార్చి రప్పుడు, ధౌమ్యుఁదొట్టి సకల[5]ధరణిసురులు
మూర్ఛదేఱె నంత ముదిత ద్రౌపది శీత, మందపవనసేవ్యమాన యగుచు.

---

298\. 1. యుడిగి – కొన్ని ప్రతులలో లేదు. 2. తలంబున (ం) – ఉ. ఘ. డ. ద. 3. బడలి మూర్ఛిత – గ. 4. దెచ్చి యజినా – అ. ఆ. ఈ. ఎ. ఐ. ఝ. త.

299\. 1. అరుణ సరోరుహ దళమృదులంబులైన యుత్తరుణి – వా. ఛందస్సు? 2. చరణ తలంబులు గొడిగ రాలపైఁ జను చునికిఁ జేసి – వా.. ఛందస్సు? 3. పరఁగనా కారణమున నిట్టి దుఃఖ భారము దాల్చె – వా.

300\. 1. సము చితంబుగ – వా; స లలితంబుగ శయ్యాతలంబున – డ. 2. తన్వియీా పదము – కొన్ని ప్రతులు. 3. యెద, యెద్ద – కొన్ని ప్రతులు. 4. విల పించు – ఏ. ఓ. ఘ. ఝ. 5. ధరణి సురలు – పెక్కు ప్రతులు.

301. వ. [1]దాని నాశ్వాసించి ధర్మరాజు భీమున కి ట్లనియె.

302. క. ఈరాజపుత్త్రిఁ దోడ్కొని, దారుణపాషాణ[1]దుష్పథంబులఁ జనఁగా
నేర మిది నడువ నోపదు, భూరిభుజా యనిన [2]ననిలపుత్త్రుం డంతన్.

303. క. అగ్రజు ననుమతమున న, త్యుగ్రనిశాచరసమేతు [1]నుడుమార్గగు వీ
రాగ్రణి ఘటోత్కచుం దన, యగ్రసుతుం దలఁచె [2]ధీరు హైడింబు వెసన్.

304. క. అతఁడును రాక్షససైన్యా, న్వితుఁడై [1]తత్క్షణమ వచ్చి నిర్జరవరస
మ్మితులకుఁ బ్రణమిల్లెం దన, పితృవరులకు[2] బ్రాహ్మణులకుఁ బెద్దయు
భక్తిన్.

305. వ. ఇట్లు మ్రొక్కి పని [1]యేమని ముకుళితహస్తుం డయి [2]తన[3]ముందర నున్న
కొడుకుం గౌఁగిలించుకొని భీముండు వాని కి ట్లనియె.

306. తే. అబల యిది భవన్మాత నిత్యాధ్వగమన, యన్న యైనది గజరాజఖేలగమన
దీని నీ వెత్తికొని చనుదెమ్ము మాన, మీపమున నని సుతు నియమించె
నపుడు.

307. వ. వాడును బితృవచన[1]చోదితుండై యిమ్మార్గం బతిపరుషశిలావిషమంబు పాద
చారుల కగమ్యంబు గావున మిమ్మందఱ నెత్తికొని యాశ్రమంబున నరిగెద
నని ధౌమ్యపాండవ[2]ద్రౌపదులం దా నెత్తుకొని బ్రాహ్మణుల నెత్తి[3]కొనం

---

301. 1. అంత దాని - వా.

302. 1. దుష్పథంబున - కొన్ని ప్రతులు. 2. పవన - క. జ.

303. 1. నుడు మార్గును (ని) - పెక్కుప్రతులు. 2. ధీరునాహైడింబున్ - స; వీరుహైడిం
బేయున్ - కొన్ని ప్రతులు; ధీరుహైడింబేయున్ - వా.

304. 1. తత్క్షణము - వా; తత్క్షణమె - శ. వ. 2. బ్రాహ్మణులకు - గ. తప్ప తక్కిన
అన్ని ప్రతులు; పాండవులకుఁ - వా.

305. 1. యేమి యని - పెక్కు ప్రతులు; యేమి యాన తిండని - ఉ. త. ద. శ. వ.
2. తన - పెక్కు ప్రతులలో లేదు. 3. ముందట నిలిచియున్న - పెక్కు ప్రతులు.

307. 1. బోధితుండై - అ. ఇ. ఉ. ఏ. ఒ. ఓ. గ. చ. జ. త. డ. ద. ల. 2. ద్రౌపదుల
నెత్తుకొని - ఇ. ఊ. ఏ. ఓ. ఔ. క. గ. 3. కొనిరా - పెక్కు ప్రతులు.

దన[4]రాక్షసబలంబులం బంచె రోమశుండు సిద్ధగతినరిగె నిట్లుందఱు గగన మార్గంబునం జని గంగాతీరంబున నర[5]నారాయణాశ్రమం బైన బదరీ వనంబుఁ గని రాక్షసస్కంధావతీర్ణులై యందు.

308. క. లలితమధుస్రవఫలములు, విలసితమృదుపత్రతతులు వృత్తస్కంధం
బులు నవిచలితచ్ఛాయలు, గలబదరీ[1]తరులఁ జూచి కడు[2]విస్మితులై.

309. వ. సురసిద్ధమునిసేవితం బయిన [1]భాగీరథిం జూచి యందుఁ గృతస్నానులయి నియమవ్రతంబులు సలుపుచు సమాధియోగంబున మైనాకశైలంబును హిరణ్య[2]శృంగంబును బిందు[3]సరంబునుం జూచి బదరీవనంబునం దాఱు దివసంబులు నివాసంబుసేసి యుండు నంత నొక్కనాఁడు.

310. చ. అలఘులు గంధమాదనమహాధరణీధరసానురత్నవే
దులఁ బవమాన[1]నందనుఁడు [2]ద్రోవదియున్ [3]విహరించుచున్నచో
లలితసహస్రపత్రకమలంబు సమీరవిధూతమై మహీ
తలముపయిన్ వడింబడియెఁ దద్దయు[4]ఁ బొల్పుగ వారి[5]ముందటన్.

311. వ. ఆసౌగంధిక[1]కమలంబుఁ జూచి దానియపూర్వ[2]రమణీయత్వంబునకు [3]ననన్య కుసుమసాధారణం బయిన[4]సౌరభ్యంబునకు నోటువడి ద్రుపదరాజపుత్త్రి ముదిత[5]చిత్తయై యక్కటా యిది [6]యొక్క[7]పువ్వ యయ్యు నపూర్వంబై మనోనయనానందకరం[8]బైనది యిట్టి కుసుమంబులు కడుం బెక్కులు

---

4. రాక్షసులంబంచె – కొన్ని ప్రతులు. 5. నారాయణ స్థానంబైన – ఈ. ఐ. ట. త. శ. ష. – తప్ప తక్కిన ప్రతులు.

308. 1. తతులు – పెక్కు ప్రతులు; వనము – ఏ. ఓ. గ. జ. డ. ల. 2. నుత్సుకులై – ఓ.

309. 1. భాగీరథి యందు – పెక్కు ప్రతులు. 2. శిఖరంబును – ఉ. ఔ. ఘ. వా. శ. ష. 3. సరస్సునుం – వా; సరంబునుం – పెక్కు ప్రతులు.

310. 1. సూనుడును ద్రౌపదియున్ – ఇ. ఏ. ఓ. గ. ఘ. డ. ద. శ. ష; సూనుడును ద్రోవదియున్ – ఉ. జ. స. 2. ద్రౌపదియున్ – అను పాఠమే పెక్కు ప్రతులలో గలదు. 3. విహరింపు – పెక్కు ప్రతులు. 4. సొంపుగ – ఇ. గ. స. 5. ముందరన్ – కొన్ని ప్రతులు.

311. 1. కుసుమంబు – అ. ఆ. ఎ. ఏ. ఓ. ఙ. ఝ, ద. 2. రమణీయతకు – ఈ. ఐ. త; మణి మయత్వం – ఏ. 3. న నన్యసాధారణంబయిన సౌగంధిక సౌరభం – ఓ. 4. సౌరభంబునకు – పెక్కు ప్రతులు. 5. హృదయయై – ఇ. ఉ. ఊ. క. గ. చ. ఙ. ల. 6. యెక్కడిదిది యొక్క పువ్వు నెయ్యదియో యపూర్వ నయనా – శ. 7. పువ్వు నెయ్యదియో యపూర్వ నయనా – పెక్కు ప్రతులు. 8. బుబైనయి

గా[9]వలవదె యని కురంగటం గ[10]లవేని తెచ్చియిచ్చి నాకు మనఃప్రియంబుఁ [11]జేయుమని యప్పుడ యప్పువ్వు ధర్మరాజు[12]కడకుం గొని[13]పోయె నిట భీముండు దాని యభిమతంబుఁ జేయం గడంగి రుక్మపుష్ఠంబైన ధను శ్శ్రేష్ఠంబును నాశీవిషోపమానంబులైన[14]బాణంబులు ధరియించి యక్కమలంబు [15]దెచ్చిన గాడ్పున కభిముఖుండై [16]గంధమాదనంబున వివిధరత్న బంధుర[17]కందరకదళీషండదర్శనంబులను [18]మందారమందిరసుగంధి[19]గంధవహస్పర్శనంబులను నలికుల[20]కోకిలాలాపశ్రవణంబులను సర్వర్తుకుసుమ[21]సురుచిరగంధాఘ్రాణంబులను నతిమధురఫలాస్వాదనంబు[22]లను బద్ధప్రమోదహృదయుం డగుచుఁ దన కెదిరి వచ్చుమృగంబులం దాఁకి గజంబు నెత్తి గజంబుపై వైచుచు సింహంబునెత్తి సింహంబుపై వైచుచు [23]నల్పమృగంబులం గరతలప్రహారంబులం బ్రహరించుచు.

*-: భీముఁడు సౌగంధికహరణార్థంబు పోవుట :-*

సం. 3 _ 146 _ 292

312. సీ. [1]గమనవేగంబున ద్రుమలతాజాలసం[2]చాలన సేయుచు శైలగుహల
నడఁగి[3]యదృశ్యులై కడువేడ్కతోఁ దన్నుఁ జూచు ఖేచరసిద్ధసురభుజంగ

---

కుసుమంబులు పెక్కులు - పెక్కు ప్రతులు. 9. వలయు - ఏ. ట. 10. ల వేని పీని దెచ్చి - కొన్ని ప్రతులు. 11. జేయ వలయు ననుచు నప్పువ్వు ధర్మ - పెక్కు ప్రతులు. 12. నొద్దకుం - పెక్కు ప్రతులు. 13. పోయిన నిట భీముండు - కొన్ని ప్రతులు. 14. యమ్ములు - కొన్ని ప్రతులు. 15. వచ్చిన - ఇ. ఈ. ఐ. ఝ. త; దెచ్చిన కమ్మతెమ్మెర కభి - ఉ. 16. గాడ్పువట్టి గంధ-వా; గంధమాదన వివిధ - పెక్కు ప్రతులు. 17. కంధర - అ. ఆ. ఇ. ఒ. ఔ. గ. ఘ. చ. జ. శ; కందర దర్శనంబున - పెక్కు ప్రతులు. 18. మందశీతల సుగంధ గంధవహ - జ. శ. 19. గంధ స్పర్శనంబునను - పెక్కు ప్రతులు. 20. కీర కోకిలా - అ. ఆ. ఎ. గ. ఝ. శ. 21. సురభి - అ. ఇ. ఉ. ఎ. ఐ. జ. డ. ద. 22. నను - పెక్కు ప్రతులు; లను బద్ధ ప్రమోద - ట. 23. బెబ్బులింబట్టి బెబ్బులిపై వైచుచు లులాయంబు నెత్తి లులాయంబుపై వైచుచు - ఏ. ఓ. ల.

312. 1. శమన విద్రుమ లతాజాల సంచలనంబు సేయుచు నందంద శిఖరిగుహాల - ఉ;? గమన వేగమున విద్రుమలతా - డ. 2. సంచలనంబు - ద. చ. శ. వ. 3. యదృ

గరుడగంధర్వకిన్నర[4]కామినులచేత మానుగా నభివీక్ష్యమాణుఁ డగుచు మ్రాఁకులువిఱుచుచు వీఁకతోఁ [5]దీగలు పెఱుకుచుఁ బదహతిఁ బృథునగేంద్ర

ఆ. మద్రువ నున్నతంబు [6]లయినెడలెక్కుచు, మదగజంబువోలె మధ్యముండు పవనవైనతేయపటుజవయుక్తుఁడై, యరిగె గంధమాదనాంతరమున.

313. వ. ఇట్లరుగువాఁడు నిజ[1]సింహనాదశ్రవణపరిత్రస్తంబులై యెగసి పఱచు [2]పక్షుల యార్ద్రపక్షంబులఁ జూచి ముందట [3]నాసన్నంబునం గొలను [4]కలుగవలయు నని [5]యుపలక్షించి యతిత్వరితగతిం [6]జని పవన[7]వశసంచలిత [8]తట మహీవన తమాల తాల హింతాల [9]విశాలకదళీదళ [10]విజ్యమాన శీతలజలపరిపూర్ణం బైన యొక్క సరోవరంబుఁ గని యందుఁ గృతావ[11]గాహుండై నవ[12]నలినదళ[13]మృణాలవలయాలంకృతుం డగుచు దాని వెలువడి యనేకయోజన[14]విస్తారాయామరమణీయం బైన కదళీషండంబుఁ [15]జొచ్చి యందు శంఖధ్వానంబుఁ జేసిన.

314. క. ఆ[1]శంఖరవంబు [2]మహోం, ద్రాశనినిర్ఘోషభీమ మై దిక్కులు నా

---

క్ష్యలై – ఠ. ల. తప్ప తక్కిన అన్ని ప్రతులందును. ? 4. వియచ్చరులచేమానుగా– ప. ఓ; కామినులచేత నభివీక్ష్యమాణుడై యతిశయిల్లి – ట. 5. దీవలఁ వెఱుకుచు – వా. అన్నిప్రతులందును గృహీత పాఠమేకలదు; దీగలు పెరుకుచు–పెక్కు ప్రతులు. 6. లైనెడ – పెక్కు ప్రతులు లైన+ఎడ – అని విరుపు; లగునెడ – ఈ. ఐ. ఘ. త. ఠ. శ. ష.

313. 1. సింహనాద పరి – అ. ఆ. ట. క. గ. చ. 2. జలపక్షుల – ట. ఐ. ద. ల. 3. సమీపంబున – ఇ. ఎ. ఏ. ఓ. గ. ల. 4. కలదని – పెక్కుప్రతులు. 5. నిశ్చయించి – ఈ. ఐ. క. ఝ. త. శ. ష; శంకించి – డ. 6. జనిచని పవన – వా. 7. వేగ సంచలిత – పెక్కు ప్రతులు; వశపరిచలితతటీరుహానవతమాల – స; ? వశచలిత తటీరుహతమాల – ల. 8. తటరుహత మాల – పెక్కు ప్రతులు; తటమహీరుహ – డ. 9. విశాల – పెక్కు ప్రతులలో లేదు. 10. విద్యమాన – ట. చ; విభజ్యమాన – అ. ఆ. ఝ. డ. 11. గాహనుండై నళిన – కొన్ని ప్రతులు. 12. నళినీదళ – అ. ఉ. ఒ. ట. 13. మృదుమృణాల – ఎ. ఏ. ఓ. గ. ల. 14. విస్తారాయత – ఎ. ఏ. ఓ. ల; విస్తారరమణీ – ఉ. ఐ; విస్తారంబైన కదళీ – ట; విస్తీర్ణంబైన – గ. 15. జొచ్చి శంఖ – పెక్కు ప్రతులు.

314. 1. శంఖారవము – ఈ. ఐ. ట. క. జ. త. 2. మహోగ్రాశని – ట.క.

[3]కాశంబు నిండె నంత గు, హా[4]శయుఁడై యున్నహనుమ యను కపి పెలుచన్.

315. క. దాని విని బెదరి లేచి మ, హానాదం బిది మనఃప్రియం బయ్యె మదీ యానుజశంఖధ్వానము, దా నగు నని యెఱిఁగి హృష్టతనురుహుఁ డగుచున్.

316. వ. [1]భీమునకు మార్గనిరోధంబుగా మహావృక్షంబు లురులం ద్రోచి [2]యేకాయన పథంబున [3]కడ్డంబుగా శయనించి లాంగూల[4]లీలాచాలనంబుఁ [5]జేసిన.

317. క. గోలాంగూలోత్తము లాం, [1]గూలస్ఫోటనరవంబు ఘోరంబై వా చాలతఁ జేసె నశేషమ్ము, గాలి భయం [2]బంద గిరిగుహాంతరములలన్.

318. వ. అయ్యపూర్వధ్వని విని భీముండు విస్మితుం డయి చని కదళీషండమధ్యంబున నొక్కవిశాలశిలాతలంబుపయి శయనించినవాని.

319. సీ. [1]హ్రస్వపీనగ్రీవు[2]నచలితాయత[3]హను నతిచపలస్వభావాభిరాముఁ [4]దనుమధ్య[5]కటిచక్రు దహనకణాకార[6]తామ్రోష్ఠు నతి[7]కృశదశనకరజుఁ బృథులవిద్యుత్పుంజ[8]పింగాక్షు నుత్తుంగదృఢవక్షు [9]నాజానుదీర్ఘబాహు నూర్ధ్వలాంగూల మత్యున్నతధ్వజలీలఁ గ్రాలు[10]చునుండ నేకాంతయోగ

---

3. కాశమునునిండె - ఊ. ఏ. ఓ. గ. జ. డ. ద. ల; కాశము నిండిన నంత - ఇ. క; కాశంబు గప్పెనంత - ఔ. ట. 4. శయనుండైన హనుమ - డ. శ. ష. వ.

316. 1. వానికి మార్గ - పెక్కు ప్రతులు; వానికి మార్గావరోధంబుగా - ఓ. 2. తద యన పథం - వా; తదాగమన పథం - ఇ; తడయక పథంబున - ల. 3. కడ్డంబు - వా; కడ్డంబై - కొన్ని ప్రతులు. 4. విచలనంబు - ఈ. ఐ. ఔ. త. ద. శ; చాల నంబు - ల. చలనంబు - కొన్ని ప్రతులు. 5. జేయుచున్న - ఊ.

317. 1. గూలాస్ఫోటన - కొన్ని ప్రతులు; గూలాస్ఫాలన - ఎ. ఠ. డ. స. 2. బంది గిరి గుహాలకుంబారన్ - పెక్కు ప్రతులు.

319. 1. బంధుర గ్రీవు విభ్రాజితోరస్థులు నతి - ఔ; బంధురవిపుల విభ్రాజితోరస్థలు నతి - ట. 2. నవనతాయత హను - ఉ. ఊ. ఎ. ఏ. ఒ. ఓ. క. గ. ఘ. జ. ద. డ. ల. స. 3. భుజు - ఒ. 4. ధనుమధ్యుగటి - ట. 5. కటి చక్ర దహన కణాకారు దామ్రోష్ఠు - ఎ. ఏ. ఓ. గ. న. 6. తామ్రోష్ఠు - ఔ. క. ఘ. చ. ట. న. 7. తీవ్ర - ఎ. ల; దృఢ - స. 8. పింగాంగు - క. ఖ. ఠ. డ. సం; పింగాంశు - ఔ. 9. నక్షీణ - పెక్కు ప్రతులు. 10. చుండంగ - పెక్కు

ఆ. నిద్రనున్న [11]ధర్మనిర్మలు హనుమంతుఁ, జూచి పాండురాజసుతుఁడు వాని
నిద్రఁ దెలుపఁ గడఁగి నిజ[12]సత్త్వ మేర్పడ, సింహనాద మొప్పఁ జేసె డాసి.

320. వ. హనుమంతుఁడును [1]మెల్లమెల్లన మేల్కని జృంభ[2]సంభృతజలార్ద్రసంచల
విలోచనుం డగుచు ననాదరంబున నాతనిం జూచి యి ట్లనియె.

321. తే. అతిజరారోగ[1]భరమున నలసి [2]యొలసి, యొదిఁగి సుఖనిద్రమై నిట్టు
లున్న వానిఁ
గడుమదంబున నేమియుఁ గరుణలేక, యేల బోధించితయ్యా నీ వెఱిఁగి
యెఱిఁగి.

322. వ. తిర్యగ్జాతులు [1]ధర్మ వెఱుంగవు గాక సర్వభూత[2]దయాస్వరూపం బైన
ధర్మ వెఱింగెడు వారు మనుష్యుల కారె యిట్టి మనుష్యజన్మంబు [3]వడసి
వృద్ధోపసేవ [4]సేయవు గాకేమి ధర్మ వెఱుంగక నిర్దయుండవై మాబోఁటి
[5]పేదమృగంబులకు భయంబుగ [6]గర్జిలితి [7]వి వెవ్వండవు మనుష్యగోచరంబు
గాని యివ్వనంబున కేల వచ్చితి సిద్ధగతి లేనివారి కిట వోవ నశక్యం బమృత
కల్పంబు లైన యీ[8]ఫలమూలంబు లుపయోగించి [9]క్రమ్మఱుము నీయందు
బద్ధస్నేహుండఁ [10]గాన బుద్ధి సెప్పితి నాపలుకులు చేకొను మనిన భీముం
డి ట్లనియె.

---

ప్రతులు. 11. యోగనిర్మలు — ఇ. గ. ఘ. ద. 12. సత్త్వమేర్పడ — అ. ఆ.
ఈ. ఎ. ఐ. ఔ. ఝ. త. ట. ల. శ. స; రూపమేర్పడ — వా.

320. 1. మెల్లన మేల్కని — పెక్కు ప్రతులు; మెత్తమెత్తన — ఈ. ఐ. ఝ. త. శ. స.
2. సంభూత — పెక్కు ప్రతులు.

321. 1. భయమున — ? ఎ. ఏ. ఓ. ఔ. ఝ. ఠ. డ. శ. ష. 2. యున్న వాని నీతోడ
బుట్టిన వాని నన్ను నొనర సుఖనిద్రమై యిట్టులున్న వాని — పెక్కు ప్రతులు.

322. 1. ధర్మమెరుంగవు — అ. ఈ. త. చ. ష. 2. దయాస్పదంబైన — డ. 3. వడ
సియు — ఆ. ఎ. ల. 4. సేయమి — ల. 5. పెద్ద — పెక్కు ప్రతులు. 6. గర్జి
ల్లితివి మరినీవెవ్వండవు — ల. 7. మరినీవెవ్వండవు — ఊ. గ. చ. 8. ఫలంబు
లుపయోగించి — అ. ఇ. ఊ. ఎ. ఏ. ఐ. ఒ. ఓ. ఙ. ఝ. త. 9. క్రమ్మరిచనుము—
ఉ. గ. ల. 10. గావున — పెక్కు ప్రతులు.

323. తే. క్షత్త్రియప్రవరుండ విఖ్యాతబలుఁడఁ, బాండుతనయుండ గొంతి గర్భంబునందు
వాయువరమునఁ బుట్టినవాఁడ నన్ను, భీముఁ డండ్రు భూజనులు కపిప్రముఖుండ.

324. వ. [1]ఏ నిక్కడఁ గార్యార్థినై [2]పోయెద నాకుం దెరు వి మ్మనినాఁడు దొల్లి శతయోజనవిస్తారం బయినసముద్రంబు [3]లంఘించి లంకకుం బోయిన హనుమంతు నట్ల నిన్ను నీపర్వతంబు లంఘించి పోదు ననిన [4]హనుమంతుఁ డతం డేమికారణంబున సముద్రలంఘనంబుఁ జేసె [5]నెఱుంగుదేనిం జెప్పు మనిన వానికి భీముం డి ట్లనియె.

325. క. [1]అలఘుం డిక్ష్వాకు మహా,కుల[2]వీరుడు రాఘవుండు గురు[3]వచనంబున్
[4]సలుప వనవాసియై తన, లలనం గోల్పడియె నట్టె లంకేశ్వరుచేన్.

326. క. [1]సీతాన్వేషణపరులై, నీతిఁ గపిప్రవరు లరిగి[2]నిరతంబుగ సం
పాతి యనుపక్షిచేత మ, హీ[3]తనయ సువార్త లెల్ల నెఱిఁగి కడంకన్.

327. క. వారలు వారిధి గడవఁగ, నేరక తారున్న యెడ ననిలసత్త్వమునన్
వారిధి లంఘించె మహా, వీరుఁడు హనుమంతుఁ డనఁగ విందుఁ గపీంద్రా.

328. వ. [1]ఏను హనుమంతు నంతియ బలపరాక్రమంబులు గలవాఁడ నాపౌరుషంబుఁ

---

324. 1. ఏనొక్క - డ; ఏనింక - ఇ. గ; ఏనిట్లు - ఐ. త. శ. 2. పోయెద దెరువిమ్ము - కొన్ని ప్రతులు. 3. లంఘించిపోయిన - కొన్ని ప్రతులు. 4. హనుమంతుఁ డేమి - కొన్ని ప్రతులు 5. నీ వెరుంగుదేని - పెక్కు ప్రతులు.

325. 1. అలఘు యశుండిక్ష్వాకుని, కులతిలకుఁడు — వా. సం. 2. తిలకుడు — ఈ. త. 3. వచనంబున్ (బుల్) — పెక్కు ప్రతులు; వచనమిలన్ — వా. 4. నిలిపి- వా; సలుప — పెక్కు ప్రతులు.

326. 1. ఈ పద్యమునకు ముందు — బొ, ప్రతిలో నధిక పాఠము కలదు — వ. యిట్లు గోల్పడి యన్నయుంతమ్ముండును వనంబున నెమకుచు సూర్యపుత్త్రుండైన సుగ్రీవుతో మైత్రి పాటించి యతని పగదీర్చి కిష్కింధానగరంబునకు పట్టంబు గట్టిన తదనంతరం బారామకార్యార్థియైన సుగ్రీవు పనుపున హనుమదాదులు. 2. నియతంబుగ — వా. 3. తనయావార్తలెల్ల — ఈ. ఎ. ఒ. ఓ. బొ. ఘ. శ. ష. ల.

328. 1. ఏను నమ్మహాత్మున కనుజుండనంతియ మహాబల పరాక్రమవంతుండనా — బొ.

జూపుదునే యనిన నవ్యక్తహాసముఖుం డగుచు నన్నా యేనుముదిసిన వాఁడ లేవ నోపం బోయెదవేని నాతోఁకం బాయంద్రోచి పొమ్మనిన [2]మెచ్చక తమవామకరంబున నెత్తం బోయి [3]వశంబుగాక.

329. ఉ. ఏపున రెండుచేతులను నిమ్మగఁ బట్టి యమర్చి యెత్తగా
నోపక [1]మొగ్గతిల్లఁబడి యుద్గతఘర్మజలార్ద్రదేహుఁడై
కాపురుషుండుఁ బోలె నిజగర్వము దక్కి యడంగి యుండెఁ జిం
తాపరుఁడై వృకోదరుఁడు దద్దయు లజ్జ నధోముఖంబుతోన్.

330. వ. ఇట్లక్కపివరు లాంగూలంబుఁ గదల్ప నోపక భీముండు [1]కృతప్రణాముం డయి నిన్నెఱుంగక నాపలికిన [2]దురుక్తంబులు సహింపవలయు నీవు కపి [3]రూపధరుండ వైన సిద్ధుండవో గంధర్వుండవో దేవవరుండవో నాకెఱిం గింపు మనిన హనుమంతుండు భీముం జూచి నగుచు నేను గేసరిక్షేత్రంబున వాయుభట్టారకునకుం బుట్టినవాఁడ నీచెప్పిన హనుమంతుండ నీవు నా యనుజుండవు దొల్లి రఘుకులేశ్వరుం డయిన రామదేవుండు రావణుం డను రాక్షసుచేత నపహృతభార్యుండై సుగ్రీవాదివానరుల [4]నసంఖ్యాతసంఖ్యుల వారిం దనకు సహాయులం జేసికొని సేతుబంధనంబున సముద్రంబు లంఘించి సమరంబున రావణు [5]వధియించి యందు నా[6]కెలసంబునకు మెచ్చి.

331. మధ్యాక్కర.

నరసురస్తుత్యమై యెంతకాలంబు [1]నాకీర్తి నిలుచు
నిరతంబుగా నంత[2]కాలమున్ నీవు నిత్యుండ వగుచుఁ

---

2. భీముండది తృణప్రాయంబని మెచ్చక – ఔ. 3. పాయంద్రోవ శక్యంబుగాక – కొన్ని ప్రతులు.

329. 1. మోఁకరిల్లఁబడి – వా; మొగ్గతిల్ల – ఔ. శ. ష.

330. 1. కపికి కృత – అ. ఆ. ఎ. ఝ. 2. దురుక్తులు – కొన్ని ప్రతులు. 3. రూపంబు దాల్చిన సిద్ధుండవో – పెక్కు ప్రతులు. 4. నసంఖ్యాత బలంబులు గలుగువారిం– శ. ష. 5. జంపి – పెక్కు ప్రతులు. 6. ఖేలనంబునకు – ఝ. ష.

331. 1. నాకథలు – వా. ఛందస్సు? 2. కాలంబు నీవు – పెక్కు ప్రతులు, ఛందస్సు.?

బరగు మని వరముఁ దగ దయంజేసి ప్రభుఁ డుర్వియెల్ల
సరి పదు[3]నొక్కఁడువేల యేండ్లేలి చనియెఁ దా దివికి.

332. వ. అనిన విని భీముండు వాని నప్పుడు హనుమంతుంగా నెఱింగి సంతసిల్లి వెండియు నమస్కరించి భవద్దర్శనంబునం గృతార్థుండ నయితి నని యిట్లనియె.

333. ఆ. బలిముఖుండ దయయుఁ [1]గలవేని దొల్లి య, ర్ణవము గడచి చనిన [2]నాఁటి నీదు
రూపుఁ జూడవలతుఁ [3]జూపు నా కనవుడు, వాని కిట్టు లనియె [4]వానరుండు.

334. క. [1]అక్కాలంబున రూపం, బిక్కాలమునందుఁ జూప నెట్లగుఁ గాలం
బొక్క[2]విధంబున నుండక, పెక్కు[3]ప్రకారముల నుండు భిన్నావస్థన్.

335. వ. దానంజేసి కృత[1]త్రేతాద్వాపరకలియుగంబుల సంఖ్యలు వేఱు[2]వేఱయై యందుల చరాచర[3]భూతంబులు భిన్నప్రకారంబులై వర్తిల్లు ననిన నయ్యా యుగంబుల యాచార[4]ప్రవర్తనంబులు నాకేర్పడం జెప్పు మనిన భీమునకు హనుమంతుం డిట్లనియె.

---

3. నొకండు వేలేండు లేలి చనియెదివికి — శర. పెక్కు ప్రతులు. ఛందస్సు ?

333. 1. గలదేని — ఈ. ఔ. ర. డ. ద. ష. 2. నాటిరూపు జూడ వలతు దద్దజూపు— ఓ. ద; నాటిరూపు జూడవలతు నిపుడు జూపు — ఉ. ప్రాసనియమభంగము. 3. జూపుము నావుడు — ఈ. ఔ. ఝ. 4. వాయుసుతుడు — ద.

334. 1. అక్కాలంబున రూపం బిక్కాలంబెట్లు సూపనెసగును గాలం — డ. 2. తిరంబున నుండక — డ. 3. విధంబులను వచ్చు భిన్నావస్థన్ — అ. ఒ. క. జ.ఝ. శ. ష; వికారములఁబొందు — వ; పదార్థములఁ బొందు — స. ?

335. 1. త్రేతద్వాపర - పెక్కు ప్రతులు. 2. వేరయై యుండునందుల - ఎ. ఏ. ఝ. ల. 3. భావంబులు - ఉ. ఊ. చ. డ; భూతంబుల ప్రభావంబులు భిన్న - ఓ. ల. 4. భూచారవర్తమానంబులు - వా; వర్తనంబులు - శ. ష.

-: భీమునకు హనుమంతుఁడు చతుర్యుగాచార వర్తనంబులను దెలుపుట :-

సం. 3 _ 148 _ 10

336. తే. కృతమకానికర్తవ్యంబు గృతయుగంబు, నందు [1]లేదు చతుష్పాద
మగుచు ధర్మ
మనఘ వర్తిల్లు నచ్యుతుం డయ్యుగమున, శుక్లవర్ణుఁడై ప్రజలఁ
గాచుచు వెలుంగు.

337. వ. అది [1]సనాతనధర్మసనాథం బందుల బ్రహ్మ క్షత్త్రియ వైశ్య శూద్రు లేక[2]వేదక్రియాయోగ్యులై [3]యకామఫలసంయోగంబునఁ బుణ్యలోకంబులు వడయుదు రందు నసూయాభిచార[4]దర్ప పైశున విగ్రహ క్రోధ మద మత్సర భయ సంతాప వ్యాధి [5]ప్రజాక్షయేంద్రియక్షయంబులు లేవు మఱియుఁ ద్రేతాయుగంబునందుఁ ద్రిపాదం బై ధర్మువు వర్తిల్లు నందు జనులు నిత్యసత్య[6]వ్రతశీలురై యజ్ఞతపోదానాదిక్రియల వర్తింతు రందు రక్తవర్ణుం డయి విష్ణుభట్టారకుండు ప్రజారక్షణంబుఁ [7]జేయు.

338. తే. ద్వాపరంబున రెండుపాదములఁ జేసి, నడచు ధర్మువు వేదముల్
నాల్గు[1]దెఱఁగు[2]
లై ప్రవర్తిల్లు వేద[3]శాస్త్రార్థచోది, తంబు లై [4]ధర్మకామముల్
ధరణిఁ బరగు.

---

336. 1. నడ (డు) చు - అ. ఆ. ఈ. ఉ. ఎ. ఐ. ఘ. ఝ. త. ద. డ. శ. ష. ల.

337. 1. ధర్మ సనాతనంబందు - పెక్కు ప్రతులు. 2. వేష క్రియా - ద. ల. 3. కర్మ సంయోగంబున - ఐ. జ. త. శ. ష. 4. దర్ప కార్పణ్య పిశున విగ్రహ క్రోధ మత్సర - పెక్కు ప్రతులు. 5. ప్రజాక్షయంబులు - పెక్కు ప్రతులు. 6. ప్రవర్తను లై - ఉ. ష; ప్రవృత్తులై - శ; వ్రతులై - ఆ. ఈ. ఝ. డ. ద; ప్రవర్తులై - స. 7. జేయుచుండు - ఏ. ఓ. ద. ల.

338. 1. విధము - ల. 2. లయ్యుంబ్రవర్తిల్లు - డ. 3. శాస్త్రాదిచోది - ఇ. 4. సర్వ కర్మముల్ ధరణి - ఆ. ఓ. గ. ఘ. ర. ల. స; సర్వ కామముల్ - ఒ. ప; సర్వ ధర్మముల్ ధరణి - క; సర్వ లోకముల్ - డ.

339. తే. సత్య[1]శమహీను లగుదురు [2]జనులు గామ, కాములై చేయుదురు [3]బహుక్రతువు లో[4]లి
నందుఁ ద్రైలోక్యవందితుం డచ్యుతుండు, కృష్ణవర్ణుఁడై జగము [5]రక్షించు మఱియు.

340. క. కలియుగమునందు ధర్మము, బల మఱి వర్తిల్లు నేకపాదంబున నం
దలఘుఁడు [1]కృష్ణుఁడు జగతీ, వలయము రక్షించుఁ [2]బీతవర్ణుం డగుచున్.

341. వ. అందులజనులు తమోగుణయుక్తులై కామక్రోధాదిదోషవశంబునన్ [1]దమ్మె
ఱుంగక యధర్మవర్తు లగుదు రందుఁ జేసిన తపో[2] దానాదికర్మంబులు
స్వల్పంబులయ్యును బహుఫలంబు లగు నని యుగవర్తన[3]ప్రకారంబులఁ
జెప్పి నీకిష్టావాప్తి యయ్యెడు నరుగు మనిన భీముం డి ట్లనియె.

*-: హనుమంతుఁడు భీమునకుఁ దనపూర్వరూపంబుఁ జూపుట :-*

సం. 3 - 149 - 1

342. క. నీనాఁటి[1]తనువుఁ జూచియ, కాని యవశ్యంబు [2]పోవఁ [3]గావునఁ గపినా
థా నాకుఁ జూపు మనవుడు, వానికిఁ దన[4]రూపుఁ జూపె వానరుఁ డంతన్.

343. చ. అతులితమై ద్వితీయకనకాద్రియొకో [1]యిది నా నిజాంగ [2]మూ

---

339. 1. పరిహీనులగుదురు - ఈ. ఊ. ఐ. ఔ. ఘ. చ. ఝ. త. శ. ష; పదహీనులగుదురు - ఒ. క. 2. సర్వజనులు కాములై - ల; జనులు గామకర్ములై - ఆ. ఊ. ఐ. ఝ. త. శ. ష. 3. మహాక్రతువు - క. చ. 4. లోపినందు - ఒ. 5. రక్షింపుచుండు - కొన్ని ప్రతులు.

340. 1. విష్ణుడు - ఠ. ల. 2. బీతవర వర్ణుండై - ఈ. ఎ. త; కృష్ణవర వర్ణుండై -క.

341. 1. దమ్మెరుంగక - పెక్కు ప్రతులు; ధర్మువెఱుంగక - వా. 2. దానధర్మంబులు బహు - కొన్ని ప్రతులు. 3. ప్రమాణంబులు - ఇ. ఐ. ఝ. శ.

342. 1. రూపు - ఠ. చ. 2. నుడుగ - ఓ; నరుగ - ఏ. 3. గపిసత్కులనా - ఇ. ఐ. ఝ. త. 4. పొడవు - ఊ. స.

343. 1. యనగానిజాంగ - డ. 2. ముచ్ఛ్రితముగ - ఆ. ఐ. ఒ. ఘ. జ. శ. ష. స.

ర్జితముగఁ బెంచి పుచ్ఛమునఁ జేసి [3]దిగంతము లందుచున్న యు
న్నతుఁ గపినాథుఁ జూచి కురునందనుఁ డప్డు నిమీలితాక్షుఁడై
మతి నతివిస్మితుం డగుచు మారుతి కిట్లని యోర్ [4]భయంబునన్.

344. క. అతిభీషణ మిది యత్యు, ద్భుత మోహో చాలు ఘననభోమధ్యవ్యా
పిత మయ్యె భవద్దేహా, యతత్వ[1] ముపసంహరింపు మనవుడుఁ గపియున్.

345. క. తన యెప్పటి రూపముఁ[1]జే, కొని దీనికి నినుమడుం గగుం బ్రతిబలముం
గని[2]నప్పుడు నారూపం, [3]బనుపమముగ ననిన హనుమ కనిలజుఁ డనియెన్.

346. ఉ. ఉన్నతిఁ [1]బూని నీవు బలియుం డగు[2]రావణు నశ్రమంబునం
బన్నగఁ జంపనోపు పటుబాహుబలాఢ్యుఁడ విట్టి[3]యున్నతున్
నిన్ను సహాయుఁగాఁ బడసి నిర్మల[4]నీతిపరుండు రాఘవుం
డన్నరభోజనా[5]న్వయుల నాజి వధించుట యేమి [6]చోద్యమే.

347. వ. అనిన వాని కతి[1]ప్రీతిమంతుండై హనుమంతుం డి ట్లనియె నయ్యా నీవు సౌగంధికసరోవరంబునకుం బోయెద[2]వే నందు సాహసంబు సేయ వలవ దది యక్షరాక్షసరక్షితంబై [3]దేవతోపభోగయోగ్యంబై యుండు దేవతలు బలిహోమనమస్కారంబులఁ [4]జేసి భక్తిసాధ్యులు గాని [5]సాహసక్రియా సాధ్యులు గారు [6]నీవు నిజధర్మనిష్ఠితుండవై పరమధర్మంబు లెఱుంగునది

---

3. వియత్తల మందుచున్న — స. 4. బ్రియంబుతోన్ — ఆ. ఈ. ఎ. ఏ. ఐ. ఒ. ఓ. ఔ. ఝ. త; భయంబుతోన్ — కొన్ని ప్రతులు.

344. 1. మివుడుపసంహరింపు — డ.

345. 1. గైకొని — ఇ. గ. డ. ద. ల. 2. నపుడునాదురూపం — డ. 3. బనుపమ మగు — గు. కొన్ని ప్రతులు.

346. 1. జూడ — ఔ. క. 2. దానవు — థం; దానవవర్యురావణుం — కవి. 3. యుద్ధతున్ — ఊ. ఘ. జ. ద. ఠ. స; యూర్జితున్ — వా. 4. కీర్తియుతుండు — ఈ. ఐ. ఔ. ట. త-శ. ష. స; కీర్తివరుండు — కొన్ని ప్రతులు. 5. న్వయము — ఝ. ఠ. డ. స. 6. చోద్యమో—గ. చ. ఝ. డ. ద. ష; చోద్యమౌ—ల; పెద్దయే—ఔ.

347. 1. ప్రీతుండై — ఉ. ద. 2. వేనినందు — ఠ, డ. 3. దేవోపభోగయోగ్యంబై— ఓ. ల; దేవతోపభోగంబై—డ; దేవతోపయోగ్యంబై—ఊ. ఒ. జ. 4. మంత్రతంత్రం బులఁజేసి — వా. 5. యాహవక్రియా — ఏ. ఓ; శక్తిసాధ్యులు — శ. 6. నీవు

యెందేని హీనబుద్ధులు [7]విమోహింతు రట్టిధర్మాధర్మవిభాగంబు లెఱుంగు విద్వాంసుల నుపాసించి శుభాచారుండవు గావలయు [8]నాచారంబున ధర్మంబు పుట్టు ధర్మంబువలన వేదప్రతిష్ఠ యగు వేదంబులం జేసి యజ్ఞంబులు ప్రవర్తిల్లు నట్టి యజ్ఞంబువలన దేవతలు తృప్తులగుదురు.

348. ఆ. కార్యసిద్ధిపొంటె కాలంబు దేశంబు, నెఱిఁగి బుద్ధిమంతు లెల్లప్రొద్దు
సాహసంబు [1]విడిచి సామాద్యు[2]పాయప్ర, యుక్తి చేయుదురు
యథోచితముగ.

349. వ. మఱియు సర్వకార్యంబులు మంత్రమూలంబులు గావున విద్వాంసు[1]లై ప్రబుద్ధులైనవారలతో మంత్రంబుఁ జేయునది బాలకులయు నధిక[2]శ్రీదర్పితులయు లుబ్ధులయు లఘుజనంబులయుఁదోడ మంత్రంబు సేయవలదు.

350. తే. జనులు నిగ్రహానుగ్రహశక్తుఁడైన, రాజు శాసనమునఁ జేసి రమణతోడ
నోలిఁ దమతమ [1]మర్యాద లొక్కనాఁడుఁ, దప్పనోడుదు
రిమ్మహీతలమునందు.

351. వ. నీవు నిగ్రహానుగ్రహ[1]సమర్థుండవు గావున నీ కెల్లవారును వశ్యు లగుదురు నిన్నుఁ జూచుటం జేసి నానయనంబులు [2]సఫలం బయ్యె నీ కెద్ది యిష్టంబు [3]దానిం జేసెద.

---

ధర్మ – కొన్ని ప్రతులు. 7. విమోహితులగుదు రట్టి ధర్మాధర్మ విభాగంబు లెఱుంగునపుడు శాస్త్రంబు లెరిగిన విద్వాంసుల – పెక్కు ప్రతులు. 8. నాచారంబువలన ధర్మంబు – ఉ. ఏ. ఒ. గ. చ. డ. ల.

348. 1. ఉడిగి – చ. 2. పాయంబు యుక్తి – డ.

349. 1. లై సిద్ధులైన – ఉ. ఏ. ఓ. ఘ. జ. ఠ. డ; లై వృద్ధులైన – ఇ. ల. 2. స్త్రీదర్పితులయు – కొన్ని ప్రతులు.

350. 1. మరియాద యొక్కనాడు – ఠ.

351. 1. శక్తుండవు – ఔ. ట. డ. 2. సఫలంబులయ్యె – కొన్ని ప్రతులు. 3. దానిన – ఇ. ఝ. డ. ల.

352. మత్తకోకిలము.

మీకు నెగ్గొనరించి [1]యున్న[2]యమిత్రులన్ [3]హతబుద్ధులం
జీకురాజు తనూజులం గురుసింహ నీకుఁ బ్రియంబుగా
నేకమాత్రన పోరిలో వధియించి [4]నాగపురంబు నా
నా[4]కులాద్రిశిలావళీగహనంబు [6]సేయుదు నావుడున్.

353. మత్తకోకిలము.

[1]ఇంతయుం గపి[2]నాథ నీ కిది యేమి పెద్ద మహాహవా
భ్యంతరంబున [3]నుద్ధతప్రతిపక్షవీరుల నేమ ని
ర్జింతు మెవ్వరు మాకు మీ[4]దయఁ జేసి మార్కొనునంత య
త్యంతవీరులు [5]లేరు భూవిదితప్రతాపబలోన్నతిన్.

354. వ. అనిన విని భీమసేనునకు హనుమంతుం డిట్లనియె నన్ను [1]రణాంతరంబునం దలంచునది నీయందు సౌహృదంబున నాహవంబులో నతిరథుం డైన యర్జును రథధ్వజంబునం దుండి మీ బలపరాక్రమంబులం [2]జూతు నని భీముం గౌఁగిలించుకొని వానికి సౌగంధిక[3]సరోవరమార్గంబుఁ జూపి హనుమంతుం డంతర్హితుం డైనఁ దదాలింగనవిగతశ్రముండును విపులజవశక్తియుక్తుం డును నై భీమసేనుండు.

355. సీ. వారిధారల ననివారితనిర్గళద్దానధారలఁ దటిద్దామములను
దశనధామంబుల నశనిఘోషంబుల ఘోరబృంహితబృహద్ఘోషణముల

---

352. 1. నట్టియమిత్రులన్ ల. 2. యమిత్ర – మిత్రబలంబుతో – ఈ. ఎ. ఐ. గ. ఘ. చ. ఝ. ఠ. త; యమిత్రులన్ సబలంబుగాన్ – ష. 3. హతబంధులన్ – స. 4. హస్తి – కొన్ని ప్రతులు. 5. కులోగ్ర – ఝ. ద. శ. 6. చేసెద – ఆ. ఎ. ఝ.

353. 1. ఇంతకున్ – ఝ; ఎంతయున్ – డ. 2. రాజ – ఊ. ఎ. 3. నుద్ధతిన్ బ్రతి– ల. 4. కృపజేసి – గ. ల. 5. మేరుభూవలయప్రతాప బలోద్ధతిన్ – స.

354. 1. రణరంగంబునందు దలంచునది – పెక్కు ప్రతులు; గదనాంతరంబునందలంచు – ఊ. క. 2. జూచెదనని – ఏ. ఒ. ల. 3. వనమార్గంబు – ఆ. ఈ. ఎ. ఐ. ఝ. త. ల.

నివి ఘనబృందంబు లివి గజయూథంబు [1]లని విచారింపంగ నక్కజంబు
లై లలితోత్తుంగశైల[2]శృంగంబులఁ ద్రిమ్మరు జలధరద్విరదతతుల

ఆ. విస్మయంబుతోడ వీక్షించుచుం జని, రజతగిరిసమీపరమ్యభూమి
నక్కుబేరు[3]వనమునందు సౌగంధిక, కమలవనముఁ గనియె ఘనభుజుండు.

356. క. అందుల హేమాంబుజమక, రందరసామోదమృదుతర[1]శ్వసనం డా
నందంబుఁ జేసెఁ దనప్రియ, నందనునకు భీమసేనునకు నభిముఖుఁడై.

357. వ అంత.

358. క. వీరుండై సౌగంధిక, వారిజములు [1]గొనఁగ నిట్లు వచ్చినవానిఁ
భూరి[2]పరాక్రము భీము [3]ను, దారగదాహస్తుఁ జూచి తా రుద్ధతులై.

359. వ. దాని రక్షించియున్న [1]పదివేవురు రాక్షసు లాక్షణంబ [2]విచిత్రాయుధ[3]పరి
చ్ఛదులై పఱతెంచి వీఁ డొక్క [4]దివ్యపురుషుం డాయుధంబులు ధరియించి
నవాఁ [5]డజినంబులు గట్టినవాఁ డధికతేజస్వి [6]తపస్వివేషధరుం డిందులకు
వచ్చినవాఁ డని యచ్చెరు వందుచు భీమసేనుం డాయవచ్చి యి ట్లనిరి.

360. తరలము.

ఇది కుబేరువనంబు దీనికి నెవ్వరుం జనుదేర నో
డుదురు నీ విట [1]వచ్చి యేల కడుం బ్రమాదముఁ జేసి తిం

---

355. 1. లని యెఱుంగక యుండు నక్కజంబు – ల. 2. కుంజంబుల – అ. ఉ. క. ఘ. చ. ఝ. ద. డ. శ; కూటంబుల – స. 3. పురమునందు – ఉ.

356. 1. శ్వసనం బానందంబు – ఝ. ల. కొన్ని ప్రతులు.

358. 1. గోసికొనగ వచ్చిన వానిన్ – ఈ. ఝ. 2. పరాక్రమవంతునుదార – ఊ. చ. ప. 3. ని, దారుణ దృఢహస్తు – ట.

359. 1. పదివేవులు – పెక్కు ప్రతులు. 2. విచిత్రవర్మ ధరులును సితాయుధ హస్తులునై – ఎ. ఏ. ల; చిత్రాయుధ – కొన్ని ప్రతులు; చిత్రాయుధహస్తులై – గ. 3. పరికరులై – ఈ. ఐ. త. శ. 4. వీరపురుషుం – పెక్కు ప్రతులు. 5. డజిన వల్కలంబులు – పెక్కు ప్రతులు. 6. తాపసవేష – అ. ఎ. ప. ఘ.

360. 1. కేల వచ్చికడుం – చ.

దుదితతేజుఁడు గ్రీడ లాడుచు నుండు నింతులుఁ దాను స
మ్మదముతోడఁ గుబేరుఁ డీరుచిమత్సరోజవనంబునన్.

361. వ. దీనితీరంబున [1]దేవర్షి గణంబులు దేవతార్చనంబులఁ జేయుదు రిందులజలంబు లమృతోపమానంబులు మఱి వైడూర్యనాళంబులై యపూర్వసౌరభంబులైన కనకకమలంబులు గలుగుటం[2]జేసి యక్షరాక్షసాక్షోహిణీరక్షితం బగు దీని మహిమం బెఱుంగక యింతదూరంబు వచ్చిన వీరుం డెవ్వండ వేమి కారణంబున వచ్చి తనిన వారికి భీముం డి ట్లనియె.

362. మత్తకోకిలము.

ఏను బాండుసుతుండ భీముఁడ [1]నిద్ధతేజుఁడ ధర్మరా
జానుజన్ముఁడ ద్రౌపదీహృదయప్రియం బొనరింపఁగాఁ
బూని యిక్కమలాకరంబునఁ బుష్పముల్ గొనవచ్చితిన్
వీనిఁ గొందు నవశ్యమున్ సురవీరు లడ్డము [2]వచ్చినన్.

363. వ. అనిన [1]వార లిట్లని రయ్యా నీవు దివ్యపురుషుండ వీసౌగంధిక[2]కమలంబులు గొని యెదేని కుబేరున కెఱింగించి తదాదేశంబునఁ గొనుము [3]నీవు ధర్మజానుజుండవు గావున నీకు ధర్మపథంబు తప్పంజన దనిన [4]రాక్షసులఁ [5]గటాక్షదృష్టిం జూచి భీమసేనుం డి ట్లనియె.

364. క. గిరినిర్ఝరములఁ బుట్టిన, [1]సరోవరం బిదియు సర్వసామాన్యముగా
[2]కరుదుగ నొక్కనియదియే, పరగఁ గుబేరుండు దీనిఁ [3]బడసెనె మొదలన్.

---

361. 1. దేవరుషులు, దేవర్షులు – భిన్నపాఠములు. 2. జేసియిది యక్షరాక్షసాక్షోహిణీ రక్షితంబు – పెక్కు ప్రతులు.

362. 1. నిద్ధశౌర్యుఁడ – ఉ. ఏ. క. ఘ. ఠ. డ. ద. ల. స. 2. జొచ్చినన్ – ఔ.

363. 1. యక్షులిట్లనిరి – అ. ఓ. ల; నయ్యానీవు – పెక్కు ప్రతులు. 2. కుసుమంబులు – అ. ఆ. ఇ. ఎ. ఏ. ఒ. ఓ. ఘ. జ. ఝ. ద. 3. నీవు – కొన్ని ప్రతులలో లేదు. 4. యక్షులం – ఎ. ఏ. ఓ. 5. గటాక్ష దృష్టింజూచి – అన్ని ప్రతులు; గటాక్షరూక్షేక్షణంబుల నిరీక్షించి – వా.

364. 1. సరసిజ వనమిదియు – ఝ. ఠ. డ. 2. కరయగ – ఆ. ఝ. ల. 3. బాలించుటకున్ – ఔ.

365. తే. ఉత్తమక్షత్త్రియుం డేల యొరుల నడిగి, వేఁడువాఁడగుఁ దన[1]భుజ విక్రమమున
[2]నన్యధనము లుపార్జించి యర్థిజనుల, [3]కిచ్చి కీర్తి దిక్కుల వెలయించుఁగాక.

-: భీముఁడు యక్షరాక్షసులతో యుద్ధంబు సేయుట :-

సం. 3 _ 152 _ 12

366. వ. నాకు మిమ్మును మీ[1]కుబేరుం బ్రార్థించి కాని యిక్కొలనిపువ్వులు గొనం గాదొకో యని భీముండు రాక్షసుల నాదరింపక సౌగంధిక[2]వనంబు సొచ్చి కనకకమలంబులుం గొని యుత్తమ[3]వీర్యవంతంబు లైన తత్సలిలంబు లుప యోగించి యనంతబలసంపన్నుండై యున్న నాతనిం జూచి రాక్షసు లలిగి [4]యుద్యతాయుధహస్తులై తాఁకిన [5]భీముండును భీకరాకారుండై.

367. చ. తనగదఁ జేసి రాక్షసుల దారుణశస్త్రచయంబు [1]నక్రమం
బున నతివీరుఁడై [2]విరిచి పోర నిశాచరులఁ బడల్పడఁ
ఘనభుజదండచండహతిఁ గ్రాఁచిన [3]నుక్కఱి రక్కసుల్ కుబే
రున కెఱిఁగింపఁ బాఱిరి సరోషవృకోదరభీమ[4]కర్మముల్.

368. వ. కుబేరుండును బాంచాలీ[1]ప్రియకరంబైన పవనతనయు [2]పరాక్రమారంభంబు విని మెచ్చి [3]దాని నుపేక్షించె నట్లు భీమసేనుండు రాక్షససేన నోడించి సౌగంధికకమలంబులు గొని తత్తీరకుసుమితలతాపాదపవనంబున విహరించు చున్నంత [4]నట.

---

365. 1. భుజా విక్రమమున - వా. భుజవిక్రమమున పెక్కు ప్రతులు. 2. నర్థతతు లుపార్జించియయ్యర్థిజనుల - అ. ఎ. ఝ. 3. కిచ్చుఁగీర్తి - వా; కిచ్చిదిక్కుల కీర్తులనించుగాక - డ.

366. 1. కుబేరు నడిగికొనికాని - గ. చ. 2. సరోవరంబు సొచ్చి - ఇ. ఎ. ఏ. ఒ. క. గ. జ. 3. వీర్యబీజంబులైన - ఘ. చ. ఠ. 4. యుద్ధతా - ద. ఠ. డ. 5. భీముండు భీకరాకారుండై - అ. ఈ. ఎ. ఐ. ఝ. త. శ. ష; భీముండును భీకరాకారంబున - వా.

367. 1. నక్రమంబున నతివీరుడై నిలిపి - సూ. 2. నిలిపి - వా. 3. నొక్కట రాక్ష సుల్ - ఇ. న; నప్పుడ రక్కసుల్ - అ. 4. కర్మమున్ - కొన్ని ప్రతులు.

368. 1. ప్రియకరుండైన - కొన్ని ప్రతులు. 2. విక్రమారంభంబు - పెక్కు ప్రతులు. 3. వాని - వా; దాని - కొన్ని ప్రతులు. 4. నట - పెక్కు ప్రతులలో లేదు.

369\. క. వడిఁ బడియెఁ బిడుగు లుడుగక, వడఁకె మహీతలము పాంసువర్షము గురిసెం
గడు [1]నెట్టనయ్యె దిశ లే, ర్పడకుండె నినుండు తిమిరపటలావృతుఁడై.

370\. వ. ఇట్టి మహోత్పాతంబు లుపలక్షించి విస్మితుండై ధర్మతనయుం [1]డివి భీమాహవపిశునంబులై కానంబడియె నేమఱకుండవలయు నని నాలుగు దిక్కులుం జూచి భీమసేనుం గానక [2]తనసమీపంబున నున్న పాంచాలి కి ట్లనియె.

371\. క. ప్రియసాహసుండు భీముఁడు, భయవిరహితుఁ డెందుఁబోయె బహురాక్షససం
శ్రయ మిగ్గిరి గంధర్వా, న్వయసేవ్యం - బేకచరుఁడు [1]వాఁ డెయ్యెడలన్.

372\. ఆ. భూరిభుజుఁడు దానె పోయెనో నీ[1]వెట, యేని పుచ్చితో [2]నిజేచ్ఛ నతని
నని యజాతశత్రుఁ డడిగినఁ బతికిఁ బాం, చాలి యిట్టు లనియె సంభ్రమమున.

373\. మధ్యాక్కర.

ధరణీశ నీకు నాయిచ్చి[1]న పసిఁడి తామరపువ్వు
గురువాయు[2]వశమున వచ్చినను [3]దానిఁ గొని యిట్టిపువ్వు
[4]లరుదు గాన కుఱంగటం గలిగెనేని యర్థిఁ దెమ్మనిన
నరిగె నీశాను[5]దిక్కునకు నీతమ్ముఁ డతివేగమునను.

---

369\. 1. నెట్టలయ్యె – శర. శ. ప.

370\. 1. డిది భీమాహవ సూచకంబై – ఇ. ల. 2. తన – పెక్కు ప్రతులలో లేదు.

371\. 1. వాఁడియ్యెడలన్ – ద.

372\. 1. వెటకేని–ఊ. శర. ప. 2. నిజేశుబూనియతని–ఈ. ఎ. ఐ. క. ఝ. త. ద. స.

373\. 1. నట్టి యాతామర – ఇ. ఉ. ర. 2. మరుద్వశమున వచ్చినమదానిగొని – ఆ. ఇ. ఏ. ఓ. గ. ద. ల. 3. దానుఁగొని – వా. 4. లరుదుగా కుఱగటగలవయేని నాకర్థిఁ దెమ్మనిన – పెక్కు ప్రతులు. 5. దిక్కునకు నీ యనుజన్ముడతివేగము నను – శ. ప; దెసకును య (న) నిలజుడనిలవేగమున – ఉ; దిక్కునకు నీతమ్ముడతి వేగముననను – 1901.? దిక్కునకు నీయనుజుఁడనిలవేగమున – వా;

374. వ. అనిన నట్లని యందఱు మునిపోయిన[1]వలనం బోవుద మని [2]యెప్పటి యట్ల రాక్షస[3]స్కంధారూఢులై గగనగతి [4]నరిగి సౌగంధికతీరంబున.

375. చ. అతులబలాఢ్యు [1]నుద్యతగదాయుధ[2]హస్తుఁ బటుప్రతాపవ
ర్ధితయశుఁ బాండునందనుఁ దదీయమహోగ్రగదా[3]విఘాతదా
రితపృథుయక్షరాక్షసశరీర[4]చయంబులుఁ జూచి విస్మయ
స్మితముఖు లైరి బ్రాహ్మణసమేతులు ధర్మసుతాదు లచ్చటన్.

376. వ. భీమసేనుండును ధౌమ్య ధర్మజ రోమశులకు మ్రొక్కి తనకు మ్రొక్కిన కవలఁ గౌఁగిలించుకొని వైడూర్యనాళంబు లైన కనకకమలంబులు ద్రౌపది కిచ్చి యున్నంత [1]నాతనికి ధర్మరా జి ట్లనియె.

377. ఆ. చనునె నీకు నిట్టి సాహసక్రియఁ జేయ, నెల్లవారికంటె నెఱుకగలవు
గురుభుజుండ నాకుఁ [1]గూర్తేని చేయకు, మయ్య యిట్టిచెయ్వు లనఘ యింక.

378. వ. అని కఱపి యి ట్లందఱుం గుబే[1]రోద్యానవనంబున విహరించు చున్నంతఁ దద్రక్షకులైన యక్షులు వచ్చి.

379. క. దేవర్షి యైన రోమశు, దేవేంద్రసమాను నయ్యుధిష్ఠిరు [1]ధరణీ
దేవోత్తములం గని విన, యావనతులు భక్తి నిట్టు లని రందఱకున్.

---

374. 1. దిక్కునకుంబోదమని - పెక్కు ప్రతులు. 2. యెప్పటియట్ల - కొన్ని ప్రతు లందు లేదు. 3. బలసమన్వితుండై - వా. 4. నరిగిరంత సౌగంధికసరోవర తీరంబున - ఎ. ఏ. ఓ. క. గ. చ. జ.

375. 1. నుద్ధత - కొన్ని ప్రతులు. 2. బాహు - కొన్ని ప్రతులు. 3. నిపాత-శ. ష. 4. భయంకరు - ఈ. ఐ. త. శ. ష.

376. 1. నాతనిం జూచి - కొన్ని ప్రతులు.

377. 1. గూర్తు నీవిక చేయకయ్య యిట్టి చెయ్వు లనఘచరిత - ఒ.

378. 1. రోద్యానంబున - పెక్కు ప్రతులు.

379. 1. నవనీ - పెక్కు ప్రతులు.

380. వ. మీ రిందు మసల [1]వల దిది యక్షరాక్షసప్రచారఘోరంబని నందుండ నొల్లక పాండవులు తత్సమీపంబున నివాసంబుఁ జేసికొని రాక్షసబలంబుతో ఘటోత్కచుఁ బోవం బనిచి యుండు [2]నంత జటాసురుం డను రాక్షసుండు బ్రాహ్మణరూపధరుండై యేను వేదవిదుండ ధనుర్వేదవిదుం డైన పరశు[3]రాముశిష్యుండ ననుచుం బాండవుల సేవించుచున్నంత నొక్కనాఁడు.

381. ఆ. మృగవిరోధిబలుఁడు మృగయావినోదార్థ, మడవి కనిలతనయుఁ [1]దరిగినట్టి
యవసరమున నజ్జటాసురుఁ డాసురా, కారవికృత[2]రూపకంబుఁ దాల్చి.

382. క. చనుదెంచి ద్రౌపదిని యమ, [1]తనూజు నకులుం దదాయుధంబులతోఁ బె
ల్చన యెత్తికొని మహోజవ, మునఁ బఱచె మహీసురోత్తములు
భయమందన్.

383. వ. అంత సహదేవుండు [1]భీముం బిలుచుచు వనంబున కరిగె నిట ధర్మతనయుం డధర్మవర్తియైన యసుర కిట్లనియె.

384. క. దేవాసురాదు [1]లిం దుప, జీవింతురు మనుజులకు విశేషసుఖంబుల్
గావించు[2]చునమ్మనుజులఁ, గావంగలవార మేము గౌరవయుక్తిన్.

385. వ. ఇట్టి మా కపకారంబు సేయుట నీకు లగ్గు గాదు నీవు ధర్మ మెఱుంగవు విశ్వసించినవారికిం [1]గుడువం బెట్టినవారికి నెగ్గుసేయుట కడుం బాపంబు గావున.

---

380. 1. వలవదిది – కొన్ని ప్రతులు. 2. నంతనొక్కనాడు – ఉ. ఒ. 3. రాముని శిష్యుండ – వా; రాము శిష్యుడ – కొన్ని ప్రతులు.

381. 1. దరిగె నట్టి – ఆ. ఉ. ఊ. క. చ. జ. ఠ. డ. ద. 2. రూపకంబు తోడ – కొన్ని ప్రతులు; రూపంబు దాల్చి – క. గ.

382. 1. తనయుని నకులుని – పెక్కు ప్రతులు.

383. 1. భీమునిం – వా; భీమసేనుం – కొన్ని ప్రతులు.

384. 1. లిందుల జీవింతురు మునులు జపవిశేష సుఖముల్ – వా; లిందుపజీవింతురు మునుజులకు విశేష సుఖంబుల్ – కొన్ని ప్రతులు. 2. చున్నమనుజులఁ – వా; చునమ్మనుజులఁ – కొన్ని ప్రతులు.

385. 1. దనకుఁగుడువం – వా; కూడు – ఇ. ఎ. ఏ. ఓ. చ. జ. ట. డ.

386. మధ్యాక్కర.

మాయావి మాయాయుధములు మాకిచ్చి మాతోఁ రణమ్ము
సేయు మివ్విధమునఁ బోవఁ [1]దగదంచుఁ [2]జిక్కనై యసుర
నాయతబాహుఁడు గరము భరముగా నదిమె ధర్మజుఁడు
[3]మాయావి యగువాని గమనవేగంబు మందమై యుండ.

387. వ. ఇట్లు [1]ధర్మజు నిబిడపీడనవేదనాభరంబున విగతవేగుండై యరుగు జటా సురున కడ్డంబు వచ్చి సహదేవుం డి ట్లనియె.

388. క. నన్నెఱుఁగవె పాండవుఁడఁ బ్ర, సన్నయశోవీర్య[1]యుతుఁడ సహదేవుఁడ న త్యున్నతి యేర్పడ [2]నిప్పుడ, నిన్నోర్చెదఁ జక్క నెదిరి నిలువుము [3]పోరన్.

-: భీముఁడు జటాసురునితో యుద్ధము సేయుట :-

సం. 3 - 154 - 28

389. వ. అనుచున్న యవసరంబున ననిల[1]సుతుం డనిలవేగంబున [2]నరుదెంచి జటాసురుచేత నిగ్రహీతులై గగనగతిం జను ధర్మజ నకుల ద్రౌపదులను మహీతలగతుం డైన సహదేవుం జూచి యయ్యాసుర కి ట్లనియె.

390. తే. అతిథివై వచ్చి నీవు [1]మాయందుఁ గుడిచి, యసురవై [2]యిట్లు
యెగ్గు సేయంగ నగునె
యెందుఁ గుడిచినచోటికి నెగ్గుసేయ, రెట్టి దుర్జను లైనను నెఱుక విడిచి.

---

386. 1. జనదంచు - ఇ. ఉ. ఊ. ఒ. క. గ. జ. 2. జక్క నయ్యాసుర - కొన్ని ప్రతులు; చెప్పియయ్యాసుర - శ. ష. 3. మాయమార్గుడగు వానిగమనవేగంబు మందమై యుండ - స.

387. 1. ధర్మజు భుజనిపీడితభరంబున - కొన్ని ప్రతులు.

388. 1. బలుడ - ఆ. ఈ. ఎ. ఐ. ఔ. ఝ. త. శ. ష. స. 2. నాజిని నిన్నోర్చెద - ఈ. ఐ. ఔ. ఝ. త. శ. ష. 3. నాతోన్ - ఏ. ఒ. ట.

389. 1. తనయుం డనిల - కొన్ని ప్రతులు. 2. జనుదెంచి, బరతెంచి - భిన్న ప్రతులు.

390. 1. మాయంద - సం. 2. తిట్లుసేయంగనగు నీకు - కొన్ని ప్రతులు.

391. వ. నీవు బుద్ధిగలవేని వీరిని విడిచి నీప్రాణంబులు రక్షించుకొను మట్లు గాని నాఁడు బక హిడింబ కిమ్మీరులం జంపిన ట్లిక్రమంబునం జంపుదు ననిన విని జటాసురుండు వారల విడిచి భీమసేనున కభిముఖుండై.

392. క. రయమున [1]నీచేత నిహతు, లయిన సురారాతులకు రణాంతరమున నీ
దయిన రుధిరమున నుదక, క్రియఁ జేసెద బక హిడింబ కిమ్మీరులకున్.

393. క. అనుచుఁ గడు నలిగి మారుత, తనయు మహాబాహు నసుర దాఁకె మరున్నం
దనున కెడసొచ్చి మాద్రీ, తనయులు తత్క్షణమ వానిఁ దాఁకిరి [1]వీఁకన్.

394. సీ. వారల నిద్దఱ వారించి భీముండు దాఁకె జటాసురు వీఁకతోడ
భీమాసురులకు సంగ్రామంబు [1]గడుఘోర మయ్యె నిర్మూలంబులయ్యె వారి
యూరుఘట్టనముల ధారుణీ[2]రుహములు పద[3]ఘట్టనములఁ గ్రక్కదలె ధరణి
భూరుహ[4]పాణులై పోరి యాసన్నభూరుహములు వొలిసిన బృహదుదగ్ర
ఆ. [5]శిలలఁ గొంతసేపు చెలఁగి పోరాడి రో, డొరులు పెనఁగి పట్టి పరుషభంగి
[6]నుగ్రులైనవాలిసుగ్రీవులట్టుల, యుద్ధ మొప్పఁ జేసి [7]రిద్ధబలులు.

395. క. భీమాసురవీరుల ము, ష్టాముష్టి[1]రణచ్ఛటచ్ఛటాశబ్దం బు
ద్దామంబై [2]తద్విపినమ, హామృగపక్షులకు నతి[3]భయావహ మయ్యెన్.

---

392. 1. నీచేమును హతులయిన – వా; నీచేత నిహతులయిన – పెక్కు ప్రతులు.

393. 1. ఔలుచన్ – వా; వీచన్ – పెక్కు ప్రతులు

394. 1. దారుణంబయ్యె – గ. 2. ధరములు – కొన్ని ప్రతులు. 3. ఘటనంబున పగిలెధరణి – ఒ. ప్రాసయతి నియమ భంగము. 4. పాషాణముల బోరి శిలలు భూరుహములు – ఔ, సర్వప్రాస నియమ భంగము; భూరుహపాషాణులై వార లాసన్న–చ. 5. శిలలజేసివైచి చేరి యొండెరువుల పెనగిపట్టి పరుసదనము–ఇ. ఏ. గ. ల; శిలలవైచి గిట్టిచేరి యొండొరులను – చ. 6. నుగ్రరేఖ – ఆ. ఈ. ఊ. ఐ. ఔ. ఝ. త; నుగ్రభంగి – క; నుగ్రులగుచు – ఇ. గ. చ. డ. 7. ఉగ్రబలులు – వా. సర్వప్రాసనియమ భంగము; రిద్ధబలులు – కొన్ని ప్రతులు.

395. 1. రణోత్థి (ద్ధ) తచ్ఛటా – ష. ఘ. శ. ప. 2. యవ్విపిన – ఆ. ఎ. ఔ. ద 3. భయానక – చ. స; భయంకర – ఇ. ఎ. ఓ. గ. ద. ల.

396. త. అంత భీమసేనుఁ డంతకాకారుఁడై
వాని బలవిహీనుఁ గా నెఱింగి
తడయ కపుడు వాని మెడ గ్రుంగఁ బిడికిటఁ
బొడిచె నసుర [1]ముడిఁగి పడియెఁ బుడమి.

397. వ. ఇట్లు [1]నిర్ఘాతనిపాతభిన్నోన్నతనీలగిరిశృంగంబునుం బోలె నేలఁ బడిన జటాసురు[2]శరీరం బెత్తి యొక్క విశాలపరుషపాషాణంబుపై [3]జర్జరితంబుగా వైచి వానిం గాలగోచరుంగాఁ జేసిన వాయు[4]పుత్త్రు పరాక్రమంబు [5]ధౌమ్యరోమశాదిమహీసురవరులు వర్ణించి రని [6]వైశంపాయనకథితం బైన కథ రమ్యంబుగ.

398. క. [1]భూపకులతిలక నృపవి, ద్యాపార[2]గ నిత్యసత్యధనధాన్య దయా లాపచతురాస్య ధర్మ, వ్యాపార[3]విచార విష్ణువర్ధన[4]నృపతీ.

---

396. 1. ముడగి పుడమిబడియె – గ.

397. 1. నిర్ఘాతపాత పతిత నీలగిరి – పెక్కు ప్రతులు; నిర్ఘాత విపాత నీలగిరి – శ. ష. 2. కళేబరంబెత్తివా; శరీరంబెత్తి – కొన్ని ప్రతులు. 3. జర్ఘరితంబుగా – పెక్కు ప్రతులు. 4. సుతు – పెక్కు ప్రతులు. 5. ధౌమ్యాది మహీసురవరులు – పెక్కు ప్రతులు. 6. వైశంపాయన కథితంబైన పుణ్యకథ – పెక్కు ప్రతులు; వైశంపాయనున కథితంబైన కథ – గ. ఘ.

398 1. ఈ పద్యమునకు ముందు – ఇ. ఎ. ఏ. ఒ. ఓ. ద. డ. జ ల– ప్రతులలో అధిక పాఠములు.

క॥ 'వీరావతార విమలా । చార బుధాధార హారశరదిందుసుధా
సారధవళాద్రిగంగా । పూరయశోదార ధీర బుధజనవినుతా'– 'ఇ'

క॥ 'వీరావతార విమలా । చార మహోదార హారశరదిందుసుధా
ధారావధాతగంగా । పూరయశోదార ధీర బుధనుతచరితా'–
యశస్సార ('ల' ప్రతి) 'ఎ'

క॥ ధారావధాతకు – ధారావదాత
యశోదార – యశోధార

ఉ॥ 'రాజ కులాగ్రగణ్య మృగరాజపరాక్రమ రాజరాజ వి
భ్రాజితకుభ్రకీర్తిపరిపాండురసర్వదిగంతరాళ ఘో

399\. వసంతతిలకము.

[1]శ్రీరమ్య రాజకులశేఖర [2]రాజరాజా
భూరిప్రతాప పరిభూతవిరోధి[3]వర్గా

---

రాజిముఖోపలబ్ధ విజయప్రమదాశ్రిత బాహుదండ ని
స్తేజితవైరివీర కులదీప మృడప్రియ విష్ణువర్ధనా. 1–1–162.

ఈ పై ఉత్పలమాల ఆదిపర్వము ప్రథమాశ్వాసాంతమునఁగలదు.
కొద్దిమార్పులతో నిచ్చట ఆవృత్తమైనది.

దీనిలోఁగల కొన్ని పాఠభేదములు.
శుభకీర్తి – శుద్ధకీర్తి – ఇ.
ఘోరాజిముఖావలబ్ధ విజయభ్రమ తాయత బాహుదండ–ద
ప్రమదాశ్రిత – ప్రమదాసిత – ఉ. ఒ.
మృడప్రియ – బుధప్రియ – ఉ. ఒ.

ఈ యుత్పలమాలాపద్యము 'ఒ' ప్రతిలో 397 వ పద్యము తరువాతను 'ఉ' ప్రతిలో 398 వ పద్యము తరువాతను, 'ఇ, క, ద' ప్రతులందు 399 వ పద్యము తరువాతను గలదు.

2 రచరిత్ర విలస దనవద్య దయా – ఎ. ఓ; రగ యతుల సత్యధన ధాన్యదయా – ఈ. ఐ. క. ఝ. త. శ. ష; రగ ధర్మసత్య – ఆ. 3. విభాసి – ఏ. ఔ. చ. జ. ట. శ. ష. స; విశాసి – ఘ; సహిష్ణు – ఈ. ఐ. క. త. 4. మూర్తి – ఏ. ఓ. గ; దేవా – ట.

"వీరావతార" అను కందపద్యమునకుఁగల అధికపాఠము లింకను క్రిందఁ జూపఁబడుచున్నవి.

క॥ 'వీరావతార విమలా। చార బుధాధార వారశరదిందుసుధా
ధారావతారచేతః। పూర యశోదార వీర బుధజనవినుతా' ద. డ.
ధారావదాతచేతో
హారియశః పూరపూరితాశా వివరా – జ.

క॥ 'వీరావతార విమల, విచార బుధాధార హారశరదిందుసుధా
ధారావదాతచేతః, పూరయశోమూర్తి కీర్తి బుధజనకీర్తి – ఒ.

399\. 1. ఇచ్చట నధికపాఠములు గలవు. అవి ముందు ప్రదర్శింపఁబడును. 2. రాజరాజ – ఇ. ఈ. ఊ. ఐ. ఒ. ఘ. చ. త. ఈ పాఠమునం దొక విశేషము కలదు. వసంతతిలకావృత్తము పాదాంతములందు 'గగ'ము లుండవలసియుండగా నిచ్చట

హారామృతాబ్జహారహాసతుషారకుంద
[4]స్ఫారద్యశఃప్రసర[5]పాండుకృతత్రిలోకా.

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబున దధీచికథ యును నగస్త్యమాహాత్మ్యంబును [1]భగీరథుప్రయత్నంబునుం గంగావతరణంబును ఋశ్యశృంగుచరితంబును బరశురాముచరితంబును గార్తవీర్యువధయును [2]రామకృష్ణాదుల యాగమనంబును సౌకన్యాఖ్యానంబును [3]చ్యవనుండు [4]సంయాతియజ్ఞంబున నశ్వినుల సోమపీథులం జేసి వారిచేత జవ్వనంబు వడయుటయు [5]మాంధాతృజన్మంబును [6]సోమకుండు

---

"రాజ" యనుచోట గురువు, లఘువు, మాత్రమే కలదు. ఇట్టి పాఠమే అనగా పాదాంతమున లఘువు గల పాఠము వావిళ్ళ ప్రతియందు మూఁడవపాదము చివర కాన్పించు చున్నది. "కుంద తారాయశః" నన్నయ కిట్టి పద్ధతి యిష్టమేమో తెలియదు. దీనికి మఱియొక ఉదాహరణము, ఆది - 2 - 240 వ పద్యమునందు "రాజా నారాయణాఖ్య" అనుచోట కొందరు "రాజనారాయణాఖ్య" అని గ్రహించుచున్నారు. 3. వర్గ - గ. గురువునకు లఘువు. 4. తారాయశః - వా. ఇచ్చట యతిభంగము; స్ఫారద్యశః - కొన్ని తాళపత్రప్రతులు. 5. పాండు రిత - ఎ. ఏ. ఒ. ఓ. చ. ల.

అధికపాఠములు.

తోటకం. ధరణీశ నిరంతర దానయశః, పరిపూర్ణ దిగంతర భానునిభా
కరుణాకర నిర్మల కాంతియుతా, శరణాగత రక్షణ సత్యనిధీ

దీనిలోఁగల కొన్ని పాఠభేదములు.

రక్షక - రక్షణ - ఐ. ఔ. జ
సత్యనిధీ-సత్యయుతా - ఈ. ఐ.
,, తత్వనిధీ - ఔ.

ఈ తోటకవృత్తము పీ. శ. ష ప్రతులందు వసంతతిలకమునకు మాఱుగాను, తక్కిన ప్రతులం దధికపాఠముగాను గలదు.

400. 1. నమ్మహాముని వింధ్యంబు పెక్కువ వారించుటయును, సముద్రపానంబును, కాలకేయవధయును, భగీరథ ప్రయత్నంబును, గంగావతరణంబును, సాగరులు స్వర్గవాసులగుటయు - పెక్కు ప్రతులు. 2. రామకృష్ణాదుల యాగమనంబును - ఇది పెక్కు ప్రతులలో లేదు. 3. భార్గవుం డయిన చ్యవనుండు - పెక్కు ప్రతులు. 4. సంయాతి - కొన్ని ప్రతులు; శర్యాతి - వా. 5. మాంధాతృ జన్మంబును - కొన్ని ప్రతులలో లేదు. 6. సోమకుండు యజ్ఞంబు చేసి పుత్రశతంబు

యజ్ఞంబుఁ జేసి పుత్త్రశతంబు వడయుటయు జంతూపాఖ్యానం
బును శ్యేనకపోతంబులై యింద్రాగ్నులు శిబిమాంసంబు
గొనుటయు [7]నష్టావక్రుమాహాత్మ్యంబును రైభ్యయవక్రీ
తుల[8]సంవాదంబును [9]భీముండు సౌగంధికహరణార్థం
బరుగుటయు హనుమద్దర్శనంబును[10]రామాయణ
కథయును [11]భీముండు గంధమాదనంబునం
దుండుకొలనికిం బోయి యక్షరాక్షసుల
వధియించుటయు గంధమాదనం
బున నందఱుం గూడుటయు
జటాసుర వధయు నన్నది
తృతీయాశ్వాసము.



# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - చతుర్థాశ్వాసము

—o—o—o—

1. క. [1]శ్రీరాజరాజకుల[2]ని, స్తారసుధాహార[3]హీరసన్నిభకీర్తీ
శ్రీరమణ ధనుర్విద్యా, పారగ కోదండపార్థ పార్థివతిలకా.

2. వ. [1]అక్కథకుండు శౌనకాదిమహామునులకుం [2]జెప్పె నట్లు పాండవులు నర
నారా[3]యణస్థానంబునఁ గొన్నిదినంబు లుండి యొక్కనాఁడు ధర్మతన
యుండు దమ్ములకి ట్లనియె.

3. మధ్యాక్కర.
[1]ఏనేఁడు లగుదెంచె నర్జునుం [2]డేఁగి యింత కేతెంచుఁ
బూని దివ్యాస్త్రముల్ వడసి యమ్మహాభుజు భూరిసత్త్వ
నానత[3]రిపువర్గుఁ జూడఁ గాంతు మిం దంచు బ్రాహ్మణుల
తో నేఁగె [4]ను త్తర[5]మించి ధర్మనిత్యుఁడు ధర్మజుండు.

---

1. 1. శ్రీరాజ దేవదేవ పురారాతిపదాబ్జభృంగ యమృతాంశుకులాం
భోరాశిచంద్ర శౌర్యప్రారంభ యశోభిరామ పార్థివభీమా - వా.
శ్రీరాజరాజ కులనిస్తార సుధాహార హీర సన్నిభకీర్తీ
శ్రీరమణ ధనుర్విద్యాపారగ కోదండపార్థ పార్థివతిలకా-పీ. శ. ష. పెక్కు ప్రతులు.
శ్రీవనితోరస్థల నిజభూవనితాప్రియమనోజ భుజబలవీరా
శ్రీవనితాశ్రయవిద్యా (ప్రియనిత్య) శ్రీవనితానన దిగంతసేవితకీర్తీ - అ. ఉ. ట. ద.
2. తుషార - ఊ. స; నీహారసుధాహారహాసహారనిభకీర్తీ - స. 3. తార - స.

2. 1. అక్కథికుండు-పెక్కు ప్రతులు. 2. జెప్పినట్లు - ఆ. ఊ. ఎ. ఒ. ఓ. ఘ. చ. జ. ర. ల. 3. యణాశ్రమంబున-వా. కొన్నిప్రతులు; యణస్థానంబున-కొన్ని ప్రతులు.

3. 1. ఏనేండ్లరుగుదెంచె - ఆ. ఉ. ఘ. చ. ద. ల; ఏనేండ్లయ్యె నర్జునుం డరిగి - ఎ. ఒ. ఓ. ఝ. ట; ఏనేఁడు లయ్యె మన యర్జునుం డేఁగి - ఈ. ఐ. త. శ. ష; ఏనేఁడు లయ్యెను ఫల్గునుం డేఁగి - పీ. 2. డరిగి - పెక్కు ప్రతులు. 3. రిపుబలు జూడ గాంతు మిందనుచు - ల. 4. నుత్తరమునకు తమ్ములతో ధర్మసుతుఁడు - పీ. శ. ష. 5. ముమించి - వా; మించి - కొన్ని ప్రతులు.

4. వ. ఇట్లు గంధమాదన పుణ్యతీర్థావలోకనపరు లయి పాండవు [1]లరిగి పదియేడగు దివసంబున వృషపర్వుం డను రాజర్షి యాశ్రమంబు గని యం దతిప్రీతి నాతనిచేతఁ బూజితు లయి యేడు దివసంబులు వసియించి బ్రాహ్మణుల నెల్ల [2]నందు నిలువం బనిచి వృషపర్వోపదిష్టమార్గంబున ధౌమ్య రోమశప్రభృతి కతిపయ[3]బ్రాహ్మణవరులతోఁ జని యష్టమదివసంబున.

5. క. విమలస్ఫాటికహాటక, [1]రమణీయదరీనిరంతర[2]శ్వేతనగేం
ద్రము మాల్యవంతమును ను, త్తమచరితులు సూచు చరిగి తద్విపినమునన్.

6. క. [1]చలదళిపుంస్కోకిల[2]కుల, కలరవముఖరితలతాంత[3]క్రమఫలాళీ
లలితమహీరుహ[4]మాలా, మిళితోద్దేశముల విశ్రమించుచు [5]లీలన్.

7. వ. [1]అందు విహరించు[2]చున్న నొక్కనాఁడు [3]శ్వేతకి యను పుణ్యనదివలన [4]మారుతానీతంబు[5]లై తమ ముందటం బడిన [6]పంచవర్ణసురభికుసుమంబులం జూచి యందఱు విస్మయం బంది రంత [7]నేకతంబున నొక్క శశికాంతశిలా తలంబుపయి [8]నున్న భీమసేనునకు ద్రుపదరాజపుత్త్రి యిట్లనియె.

---

4. 1. లరిగి యందు గోదాన హిరణ్యదానాది మహాదానంబుల విప్రులం దృప్తులం జేసి పదునేడగు - వా; లరిగి పదియేడగు - పెక్కు ప్రతులు. 2. నందుండ నియమించి- వా. కొన్ని ప్రతులు; నంద యుండం బనిచి - ఓ. ల; నందు నిలువంబనిచి - ఈ. ఐ. త. 3. బ్రాహ్మణులతో-వా. కొన్నిప్రతులు; బ్రాహ్మణవరులతో-ఓ.ఔ.గ.ఘ.ద.

5. 1. రమణీయాకర నిరంతర - ఎ.ఘ.చ.జ.ఝ.ట. 2. స్ఫీత-ఓ.జ.తి.ల.స; స్ఫార-స:

6. 1. చలదళిశుకపుంస్కోకిల కలరవ - ఈ. ఐ. జ. త. పీ. శ. ష; చలదళులం గోకిల శుక - ల. 2. కల కలరవ - ఇ. ఊ. ఎ. ఏ. ఝ. ద. 3. కమనీయదళా వలిత - వా; క్రమఫలాళీ (లీ) లలిత - పీ. శ. ష. పెక్కు ప్రతులు. 4. శాఖా - వా. కొన్ని ప్రతులు; మాలా - పీ. శ. ష. కొన్ని ప్రతులు. 5. వేడ్కన్ - ఇ. ఉ. ఏ. ఓ. ల. స.

7. 1. అందొక్కనాఁడు - ఘ. శ. ష; అందొక్కనాఁడు శ్వరథయను - పీ; 2. చుండ - వా. కొన్ని ప్రతులు; చుండ - ఆ. ఏ. ఐ. 3. దళకలయను - ఆ. ఘ. ట. 4. మారుతనిపాంతంబులై - ల. 5. లై సువర్ణమయంబులయి తమ - వా. కొన్ని ప్రతులు; లై తమ - పెక్కు ప్రతులు. 6. పంచవర్ణాపూర్ణ-ఈ. ఐ. జ. త; పంచవర్ణ పూర్ణ - ఉ. ఎ. ఓ. ఘ. ర. 7. నేకాంతంబ యొక్క - వా. కొన్ని ప్రతులు; నేకతంబున నొక్క - ఓ. ఘ. పీ. శ. ష. 8. విశ్రమించియున్న - ఇ. ఈ. ఎ. ఏ. ఐ. చ. ఝ. త. ల.

8. క. [1]ప్రకటముగఁ [2]దొంటి సొగం, ధిక[3]కనకాబ్జములకంటె దివ్యసుగంధా
ధిక[4]కుసుమము లివి దద్దయు, సుకుమారము లిట్టివానిఁ జూచి యెఱుంగన్.

9. వ. [1]ఇప్పువ్వులు నాకుఁ దెచ్చి యిచ్చి మనఃప్రియంబు సేయు మని[2]న భీముండు తత్క్షణంబ చని [3]చక్రవాళ[4]నగసమున్నతం బయిన గిరిశృంగం బెక్కి యందు వివిధరత్న[5]రచితరమ్యప్రాకారపరివృతం బయిన వైశ్రవణు నివాసంబు గని [6]శంఖధ్మానంబు సేసిన.

10. క. దాని విని యక్షరాక్షస, సేనలు పఱతెంచి [1]భీమసేను మహాసే
[2]నానీసన్నిభుఁ దాఁకిరి, నానాయుధధరులు దారుణధ్వను లెసఁగన్.

11. క. వాయుసుతప్రేరితశిత, సాయకముఖదళితరాక్షసప్రకరబృహ
త్కాయాభ్రగళితశోణిత, [1]తోయంబుల నవనిధరనదులు [2]గడు నిండెన్.

---

8. 1. ప్రకటముగ – పెక్కు ప్రతులు; ప్రకటముగు – వా. 2. దొల్లి – కొన్ని ప్రతులు. 3. వికచాబ్జముల – ఔ. ద. 4. కుసుమంబులు దద్దయు – ఆ. ఇ. ఏ. జ. ఝ.

9. 1. ఇక్కుసుమంబులు – వా. పీ. శ. ష; ఇప్పువ్వులు – పెక్కు ప్రతులు. 2. న విని భీముండు – వా; న భీముండు – పెక్కు ప్రతులు. 3. మహాతాళసమున్నతంబయిన – అ; బహుతాళసమున్నతం – స; వక్రతాళసమున్నతం – అ. ఊ. ఒ. ఓ. ఔ. గ. ఘ. చ. ద. స; బహుతాళోచ్ఛ్రియం శృంగ మారురోహ మహాబలః. మూలం. కుంభకోణంప్రతి. 8–161–42. 4. సమోన్నతం – ఊ. ఓ. గ. ఘ. చ. ఠ. బ; నగసమున్నతం – పీ. శ. ష; సమనిమ్నోన్నతం – వా. కొన్ని ప్రతులు. 5. రశ్మిరమ్య వేశ్మ పరివృతం – వా. కొన్ని ప్రతులు; రచితరమ్యప్రాకార – ఉ. పీ. శ. ష. 6. శంఖాధ్మానంబు – ఠ; శంఖముపాధ్మాయ – కుంభకోణంప్రతి – 8–161–53.

10 1. భీమసేనాఖ్య మహాసే–ఆ. ఇ. ఈ. ఏ. ఐ. ఝ. ఠ. పీ. శ. ష; భీమసేనుని ఘను నిన్ సేనాని నిభుని – గ. ల. 2. న నిభు నచట దాకిరి – ఝ. పీ. శ. ష.

11 1. తోయములందవని ధర – ఇ. ఈ. ఊ. ఏ. ఐ. ఒ. ఔ. క. ఘ. చ. ఝ. త. ద. శ; తోయమ్ముల నవని ధర – ష; తోయములన్ ధరణిధర – వా. పీ. కొన్ని ప్రతులు; తోయములం దవనిచరనదులు – స. 2. వడినిండెన్ – ఔ. ద; గడు నిండన్ – ఠ.

12. ఉ. ఉక్కటి యిట్లు మధ్యము మహోగ్రశరంబు[1]ల కోర్వనోప కా
రక్కసు లెల్ల నాహవపరాఙ్ముఖు లైనఁ గడంగి [2]భీముఁ దా
నెక్కటి దాఁకె దిక్కరి సహింపక [3]సింహము దాఁకు నట్టులం
దక్కజుఁ డుద్యతాయత[4]గదాయుధుఁడై మణిమంతుఁ[5]డల్కతోన్.

13. క. ఆరాక్షసు నతివీరుఁ గు, బేరసఖుం బవనసుతుఁ డభేద్యుఁడు నిజదు
ర్వారతర[1]శాతసాయక, ధారావర్షమునఁ గప్పె దారుణభంగిన్.

14. క. గద[1]ద్రిప్పి భీముమీఁదను, వదలక మణిమంతుఁ [2]డలిగి వైచిన నది [3]వి
ద్యుదితప్రభా[4]నిభంబై, పదిదిశలు వెలుంగ భీముపైఁ బఱతెంచెన్.

15. క. [1]దానిఁ దననిశితబాణావళి, తానంబున జర్జరీకృతముఁ జేసె మరు
[2]త్సూనుఁడు గుహ్యకరాక్షస, సేనల కెల్లను భయంబు సేయుచు నలుకన్.

16. క. ఘనుఁ డమ్మణిమంతుఁడు కాం, చనదండోద్భాసియైన శక్తి [1]మరున్నం
దను మీఁద వైచె నది యా, తని భుజ[2]పార్శ్వమ్ము దాఁకి ధారుణిఁ
బడియెన్.

---

12. 1. లుదాకుకోర్వకా – వా; లకోర్వలేకనా – ఊ. బొ; లకోర్వజాలకా – ద; లవేఁడి కోపకా – ఒ; లవెల్లి కోపకా – ఓ; లవాడి కోర్వకా – చ; లదాకనోర్వకా – వీ. ష. సూ; లకోలి నోర్వకా – ఠ. 2. భీముడానెక్కటి – క. ద. శర. 3. కేసరి మీఁదనెత్తున ట్లక్కజ – వా. కొన్ని ప్రతులు; కేసరి మీఁద దాఁకిన ట్లక్కజ – స; సింహముఁదాఁకునట్టులం ద – వీ. శ. ష. పెక్కు ప్రతులు. 4. గదాయుతుఁడై – ఠ. శ. ష. 5. డచ్చటన్ – వా. పెక్కు ప్రతులు; డల్కతోన్ – ఇ. ఉ. ఏ.

13. 1. సారసాయక – బొ. ద; నిశితసాయక – అ. ఎ. ఓ. గ; సాయకారుణ – ఝ. స.

14. 1. దీర్చి – వా. కొన్ని ప్రతులు; దిగిచి – ఉ. గ; ద్రిప్పి – అ. బొ. చ. ద. వీ. ష. 2. డెత్తివైచిన – ఓ. బొ. గ. ఘ. చ. ద. స; డేసె వైచిన – ఠ. 3. యత్యుదిత– వీ. శ. ష; విద్యుదిన – వా. కొన్ని ప్రతులు; విద్యుదిత–కొన్ని ప్రతులు. 4. విభాతిం – ష; వితంబై – ఠ.

15. 1. ఈ పద్యమునకు ముందు వా. వీ. ప్రతులలో "అమ్మహా సాధనంబునకు మనంబున బెగడక" అను వచనముగలదు. కాని మిగిలిన వానియందిదిలేదు. 2. త్సూనుండు యక్షరాక్షస – ఐ. క.

16. 1. యనిలనం – గ. 2. పార్శ్వంబుగానుచు – కొన్ని ప్రతులు.

17. చ. గదఁ గొని భీముఁ [1]డంత లయకాలకృతాంతుఁడపోలె నేల గ్ర
క్కదల నదల్చి నిల్చిన నకంపితుఁడై మణిమంతుఁ డాజి దు
ర్మదుఁడు త్రిశూల మెత్తికొని మధ్యముపై [2]ననలస్ఫులింగముల్
సెదరఁగ వైచె [3]దానిఁ [4]జెరిచెన్ ఘనుఁ[5]డగ్గదచేత భీముఁడున్.

18. వ. ఇట్లు తనశక్తి శూలంబు[1]లశక్తి నిహతంబైనఁ బరిత్యక్తమదుండై మణిమంతుం డంతరిక్షంబున కెగసిన.

19. క. పోవకు పోవకు [1]మనుచు మ, హావీరుఁడు గద యమర్చి యమ్మణిమంతున్
[2]లావరఁగ వైచె నగ్గద, తో వాఁడును బడియెఁ బ్రతిహతుండై నేలన్.

20. క. పోర మణిమంతుఁ డిట్లు స, మీరణసుతుచేతఁ బ్రాప్త[1]మృతుఁడై పడినన్
వారక పఱచిరి [2]భయమున, నారాక్షసు లార్తనాదులై తూర్పునకున్.

21. వ. [1]అట ధర్మరాజు భీముండు పోయినవలను ద్రౌపదిచే నెఱింగి [2]యార్ష్టిషేణుం డను మునివరునాశ్రమంబున ధౌమ్య ద్రౌపదీ ప్రభృతులం బెట్టి రోమశ నకుల సహదేవయుతుండై తద్గిరిశృంగం బెక్కి [3]కుబేరసదన సమీపంబున నిజగదాఘాతపాతిత[4]మణిమదాదిరాక్షసదారుణరణమధ్యంబున నున్న మధ్యము నొద్దకుం జనియె నంత.

---

17. 1. డంత్యలయ – ఆ. ఉ. ఓ. వీ. శ. సూ. 2. ఘన విస్ఫులింగముల్ – గ. 3. దానికిఁ జలింపకడగ్గఱఁ జేసె భీముఁడున్ – ట. 4. జఱచెన్ – వా. కొన్ని ప్రతులు; జడిసెన్ – ఈ. ఐ. ఓ. ఔ. గ. త. ద. స. జదిసెన్ – ర; జెరిచెన్ – ఉ. ఒ. జ. వీ. ష. 5. డై గదఁ జేసి – వా; డగ్గదఁ జేసి – వీ. శ. ష. పెక్కు ప్రతులు; డగ్గదచేత – ఏ. గ.

18. 1. లు నిహతంబులైనం – అ. ఇ. ఉ. ఏ. చ. ఝ. ర; లు విఫలంబులై – ష; లప హతంబులైన–ఒ; లు శక్తిరహితంబులైన – ఓ. ఔ. క. జ. ద; లు శక్తివిహీనంబు లయిపడిన – వా; లు శక్తినిహతంబులై పడిన – వీ. శ.

19. 1. మంచును నావీరుడు – కొన్ని ప్రతులు. 2. జేవడఁగ – వా; లావుచెడ – అ; లావుగవైచెను – ర; లా వరయవైచె – ట; లావరఁగ – వీ. శ. ష. కొన్ని ప్రతులు.

20. 1. మృత్యుండైనన్ – వా; మృతియై పడినన్ – ల; మృతియై పడియెన్ – స; మృతుడై పడినన్ – పెక్కు ప్రతులు. 2 భీతిని యా – ఆ. గ.

21. 1. అంత – వీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. పార్ష్ణి సేనుండను – ఆ. ఐ. ద. శ. ష. 3. కుబేరోద్యాన – కొన్ని ప్రతులు. 4. మణిమదాది – ఓ. జ. వీ. ష; మణిమంతాది – వా. కొన్ని ప్రతులు.

22. క. హతశేషులైన రాక్షసు, లతిరయమునఁ బాఱి చెప్పి రప్పుడ యలకా
పతికి సవిస్తరముగ నిజ, మతిఁ బవనజు విక్రమంబు మణిమద్వధయున్.

23. వ. దాని విని కుబేరుండు [1]విస్మితుండై యాత్మగతంబున.

24. క. [1]తలకక మును సౌగంధిక, ములు గొని యిప్పుడును దర్పమున నిందుల పు
వ్వులు గొని [2]మణిమత్ప్రభృతులఁ, బలువుర వధియించె నెట్టి బలియుఁడొ
యనుచున్.

25. వ. సుర గరుడ గంధర్వ యక్ష రాక్షస[1]సహితుండయి యక్షప్రభుం డరుగుదెంచి
పాండవులం గని [2]వారిలోన గదా[3] కృపాణ బాణ బాణాసన ధరుం డయి రణ
కాంక్షనున్న మహావీరు మారుతాత్మజుం జూచి పరమప్రీతచిత్తుం [4]డయిన.

26. ఆ. [1]అక్కుబేరునకు మహామతుల్ పాండవుల్, మ్రొక్కి రంత ధర్మమూర్తియైన
ధర్మతనయుఁ జూచి తద్దయు దయతోడ, నిట్టు లనియెఁ గిన్నరేశ్వరుండు.

27. వ. అయ్యా నీ యనుజుండు మత్ప్రియసఖుండైన మణిమంతు వధియించి నా కప
కారంబు సేసె నని లజ్జింప వలవ దది యగస్త్య[1]శాపనిమిత్తంబున నయ్యె
నని భీమసేను డాయం బిలిచి నీచేసిన సాహసంబు నా కుపకారంబు గావున
[2]నిన్ను మెచ్చితి ననిన నక్కుబేరునకుం గృతాంజలి యయి ధర్మతనయుం
డి ట్లనియె.

---

23. 1. విస్మితుండై – ఔ. గ. ష; విస్మిత హృదయుండై – వా. కొన్ని ప్రతులు.

24. 1. తలరక – వా. కొన్ని ప్రతులు; తలకక – కొన్ని ప్రతులు. 2. మణిమం
తాదుల – గ. స.

25. 1. సమేతుండయి – క. ఖ. చ. జ. ట. శ. ష. 2. వారలలో – ల; వారిలో –
వా. కొన్ని ప్రతులు; వారిలోన – కొన్ని ప్రతులు 3. కృపాణబాణబాణాసన –
కొన్ని ప్రతులు; కృపాణబాణాసన – వా. 4. డయిన – కొన్ని ప్రతులు; డయి
యున్న – వా.

26. 1. ధనదు జూచి యపుడు తడయక పాండవుల్ మ్రొక్కిరపుడు ధర్మమూర్తియైన–
ఔ. గ. ద.

27. 1. శాపంబుననయ్యె – ఊ. ఒ. చ. ఝ. 2. నీకుమెచ్చితి.– కొన్ని ప్రతులు.

28. ఆ. ఇట్టి శాప మమ్మునీంద్రుండు దానేల, యిచ్చె [1]దాని నాకు నెఱుఁగఁ జెప్పు
మనిన విస్తరించి యమరాజసుతునకు, నక్కుబేరుఁ డిట్టు లనుచుఁ జెప్పె.

29. వ. తొల్లి కుశావతి యను పుణ్యానదీతీరంబున నమరు లెల్ల సత్త్రయాగంబు సేయు
చుండి నన్ను రావించిన నేనును బుష్పకవిమానారూఢుండనై [1]త్రిశత
మహాపద్మసంఖ్యల యక్షరాక్షసబలంబుతో గగనగతి నందులకుఁ బోవు నెడ
నూర్ధ్వబాహుండై యమునాతీరంబున నుగ్రతపంబు సేయుచున్న యగస్త్య
మహాముని మీఁద నాప్రియసఖుం డైన మణిమంతుం డెఱుంగక నిష్ఠీవనంబు
సేసిన నలిగి [2]యమ్మునివరుండు నా కిట్లనియె.

30. ఆ. నీవు సూచుచుండ [1]నీయిష్టుఁ [2]డిమ్మణి, మంతుఁ డిపుడు దనదు మదము పేర్మి
నన్ను [3]నరయ కుమిసె నామీఁద [4]కష్టదు,ర్మదుఁడు [5]పాలియు నొక్క
మనుజుచేత.

31. వ. మఱియు నీయక్షరాక్షసబలంబులు వానిచేత [1]నిహతులగుదు రిద్దురితంబు
దద్దర్శనంబునం బాయు ననియెం గావున నిట్టిశాపఫలంబునకు నీయనుజుండు
నిమిత్తం బయ్యె నని చెప్పి వెండియు నిట్లనియె ధృతియును [2]దాక్ష్యంబును
[3]దేశకాలంబులును బరాక్రమం[4]బును మంత్రవిధానంబు ననుపంచవిధాంగంబు

---

28. 1. దీని - కొన్ని ప్రతులు.

29. 1. త్రిదశమహా - పెక్కు ప్రతులు; శతమహాపద్మ - వా; కొన్ని ప్రతులు. త్రిశత
మహాపద్మ - ఊ. క. ట. ల. మూలము. మహాపద్మశతైస్త్రిభిః. 8—162—58.
2. చూచి యమ్మునీంద్రుండు - ఘ. ల. వీ. శ. ప; చూచియమ్ముని - వా.
కొన్ని ప్రతులు.

30. 1. నిష్ఠురు - ఇ. ప. స. 2. డగుమణి - ఉ; డౌమణి - ఈ. ఐ. త; డైమణి-ఝ.
3. మఱకయుమిసె - ల. వా. సూ. కొన్ని ప్రతులు; నరయకు - ఈ. ఐ. త. వీ.
శ. ప. 4. నిట్టిదుర్మదుడు - వా. స. కొన్ని ప్రతులు; నిట్టి యిద్దనుజుఁడిల్లు-ఒ.
న. సూ; కష్టదుర్మదుడు — ఈ. ఉ. ఎ. ఐ. త. ఝ. వీ. శ. ప ? 5. నీల్గు
నొక్క — పెక్కు ప్రతులు.

31. 1. నిహతంబులగు నీదురితంబు - వా. కొన్ని ప్రతులు; నిహతులగుదు రిద్దురితంబు -
కొన్ని ప్రతులు. 2. ధృతి ర్దాక్ష్యం దేశకాలపరాక్రమాః. 8—163—1. కుంభకోణం
ప్రతి; దాక్షిణ్యంబును — పెక్కు ప్రతులు 3. దేశంబును కాలంబును — వా;
దేశకాలంబులను - కొన్ని ప్రతులు. 4. బు నను పంచవిధంబులైన లోకతంత్ర

నెఱింగిన క్షత్త్రియుండు ధర్మవిదుండై ధరణీచక్రంబు నిర్వక్రంబుగా రక్షించి పుణ్యలోకంబు వడయుఁ[5]గర్మవిశేషంబు లెఱుంగక వృథారంభుండై సాహసంబున వర్తిల్లు వానికిం బాతకం బగుట నిశ్చయంబు.

32. క. కావున [1]నిరతమ్ము మరు, ద్దేవాత్మజు సాహసైకధృతి గాకుండన్
భూవల్లభ [2]శిక్షింపుము, నీవిమలజ్ఞాన[3]ధర్మనిష్ఠితబుద్ధిన్.

33. వ. నిన్నును నీతమ్ములను ధర్మానిలశక్రాశ్వినులు రక్షించునట్లు యేనెప్పుడు రక్షింతు నాని యోగంబున మత్పరిచారకులు [1]మీకు నిత్యంబును నన్న పానాదులు దెచ్చి యిచ్చుచుండ [2]నార్ష్టి కాశ్రమంబున నొక్క పక్షంబు వసి యించునది.

34. సీ. మానితయశుఁడు భీమానుజుం డర్జునుం డమరులచేత [1]దివ్యాస్త్రతతులు
వడసి దేవేశ్వరు కడ నున్నవాఁ డతం డుపకారి యయ్యె దేవోత్తమునకు
[2]సప్తమేధాధ్వరప్రాప్తపుణ్యుఁడు ధర్మమతి భవత్పితృపితామహుఁడు ఘనుఁడు
శంతనుఁ డతనిచే సంతర్పితుండయ్యె[3] గుఱుకొని మీకైన కుశలమడిగె

ఆ. నరుగుదెంచు నింత[4]కయ్యర్జునుండు మీ, కభిమతార్థసిద్ధి [5]యగును సిద్ధ
మని యెఱుంగఁ జెప్పి యలకాధినాథుండు, యక్షగణముతోడ నరిగె నంత.

---

విధానంబు లెఱింగిన – వా. ధృతిర్దాక్ష్యం దేశకాల పరాక్రమాః లోకతంత్ర విధానామ్ ఏష పంచవిధో విధిః – పి. పి. ఎస్. ప్రతి; బును మంత్రవిధానంబునను పంచవిధాంగంబు లెఱింగిన – కొన్ని ప్రతులు. 5. దత్కర్మ –, వా; ధర్మ – కొన్ని ప్రతులు; కర్మ — కొన్ని ప్రతులు.

32. 1. నీతమ్ము – వా. కొన్ని ప్రతులు; నిరతమ్ము – ఈ. ఐ. త. వీ. శ. ష. 2. రక్షింపుము – అ. ఇ. ఓ. క. చ. జ. ఝ. ల. 3. తత్త్వ – ఈ. ఐ. త క.

33. 1. నీకు – కొన్ని ప్రతులు. 2. పార్ష్ణిసేనాశ్రమంబున – కొన్ని ప్రతులు.

34. 1. దివ్యాయుధములు – ఇ. ఎ. ఔ. ద. 2. సప్తాశ్వమేధ సంప్రాప్త – వా; నశ్వమేధాధ్వర ప్రాప్త – ల. ప్రాసయతి నియమభంగము. సప్తముఖ్యాన్ మహామేధాన్ ఆహరద్యమునాంప్రతి. పి. పి. ఎస్. ప్రతి; సప్తమేధాధ్వర – కొన్ని ప్రతులు. 3. కోర్కెతో మీకైన – ఈ. ఎ. ఐ. ఔ. ఝ. త. ల. 4. నయ్యర్జునుండు – ఇ. ఈ. ఏ. ఐ. ఓ. క. త. 5. యగును సిద్ధ – కొన్ని ప్రతులు; యగుఁబ్రసిద్ధ – వా.

35. వ. ఇట్లు ధర్మరాజు కుబేరునాదేశంబున [1]నార్ష్టిషేణాశ్రమంబున నున్న నాతనికి నొక్కనాఁడు [2]ధౌమ్యుండు నిజాంగుళి నుత్తరదిగ్భాగంబు సూపుచు ని ట్లనియె.

36. క. అది మందరనగ మక్కడ, నది మేరు[1]గిరీంద్ర మమ్మహాశైలమునె
న్నిదిదిక్కుల వసియింతురు, [2]త్రిదశేశ్వరు దొట్టి [3]యష్టదిక్పాలవరుల్.

37. చ. కనకగిరిం బ్రదక్షిణముగా శశిభాస్కరతారకాగణం
బనవరతంబుఁ [1]ద్రిమ్మరు మహామునిసప్తకమండలంబుతో
ననఘ [2]తదీయతుంగశిఖరాగ్రమునందుఁ బయోరుహాసన
త్రినయనవిష్ణులుండుదురు దేవగణంబులు గొల్చుచుండఁగన్.

38. వ. అని చెప్పుచుండఁ బాండవు లం దొక్కమాసంబు నివాసంబు సేసి రంత.

39. ఉ. [1]అంబర మాత్మదీప్తినివహంబున నొప్పఁగ మాతలిప్రయు
క్తంబగు దివ్యకాంచనరథంబు [2]లసచ్ఛపలాంశుపుంజర
మ్యంబగు దాని నెక్కి ధృతిమందరుఁ డింద్రసుతుండు నాకలో
కంబుననుండి వచ్చెఁ బ్రవికాశితతేజుఁ డినప్రకాశుఁడై.

40. వ. ఇట్లు చనుదెంచి ధనంజయుండు రోమశధౌమ్యధర్మజభీమసేనులపాదంబులకుం బరమభక్తి మ్రొక్కి [1]వినయావనతు లయిన కవల [2]నెత్తి కౌఁగిలించుకొని ద్రౌపదీహృదయ[3]నయనాంబుజంబుల కానందంబు సేయు చున్నంత నందఱు

---

35. 1. పార్ష్ణిసేనా – శ. ష. కొన్ని ప్రతులు ఆర్ష్టిషేణ – పి. పి. ఎస్. ప్రతి 2. ఈ వాక్యము ఆర్ష్టిషేణుఁడు పలికినట్లుగా పి. పి. ఎస్. ప్రతి.

36. 1. నగేంద్ర – వా. సూ; గిరీంద్ర – పెక్కు ప్రతులు. 2. త్రిదశేంద్రుం దొట్టి – వా; త్రిదశేశ్వరు – పెక్కు ప్రతులు. 3. సకల దిక్పాలకులున్ – కొన్ని ప్రతులు.

37. 1. గ్రుమ్మరు – ఈ. త. 2. తృతీయ శృంగమున నగ్రమునందు – ఈ. ఐ. త.

39. 1. అంబురుహప్రదీప్తిని వహంబుల – స. 2. జలచ్ఛపలాంశు – వా; లపచ్ఛ పలాంశు – ట; లసచ్ఛ పలాంశు – క. చ.

40. 1. తనకు వినయవినమితోత్తమాంగులయిన – వా; వినయావరతులయిన – ఇ. ఉ. ప. 2. నెత్తి కౌఁగిలించుకొని – కొన్ని ప్రతులు. నెత్తికొని – వా. 3. నయ

సంతసిల్లి మాతలి నతిప్రీతిఁ బూజించిన నతండును [4]దివ్యరథంబు గొని దివంబున కరిగె నట్టియవసరంబున.

41. క. దిననాథుఁ డస్తగిరిఁ బొం,దినఁ జీఁకటి చాచి యాత్మతేజమున దిగం గనల [1]విభూషించుచు రజ,నినాథకలహంస[2]గగననిమ్నగ నొప్పెన్.

42. వ. ఆరాత్రి యర్జునుం డనుజుల నందఱ నొద్దఁ బెట్టుకొని యిష్టపూర్వకథలు సెప్పుచు శయనించె నంతఁ బ్రభాతంబగుడు సిద్ధమునిగణంబులయు రోమశ ధౌమ్యులయుఁ దమ్ములయుఁదోడ ధర్మతనయుండు సుఖోపవిష్టుండై యున్నంత.

-: ఇంద్రుఁడు పాండవులయొద్దకు వచ్చుట :-

సం. 3 - 162 - 5

43. సీ. బోరన సురదుందుభుల నినాదంబులు గిన్నరగంధర్వగీతరవము
లెసఁగ సహస్రసూర్యేందుమండలములుపోలె విమానము ల్బొలిచి వెలుఁగఁ
బాండవాలోకనపరుఁడై సహస్రాక్షుఁ డమరగణంబుతో నమ్మహాద్రి
కేతెంచెఁ బ్రీతి నయ్యింద్రునకందఱు నంత[1]నభ్యుద్గతులైరి పాండ

ఆ. వాగ్రజుండు దాను ననుజులు నింద్రుపా,దాంబుజముల [2]కెఱఁగి యధికభక్తి
[3]శాస్త్రదృష్టవివిధసత్కారవిధులఁ బూ,జించె నమరఖచరసిద్ధపూజ్యు.

44. వ. ఇంద్రుండును వారల నందఱ [1]నతిమధురవచనంబుల నభినందించుచుఁ దదంతికస్థితు నధికతపోయుక్తు ధనంజయుం జూపి ధర్మజున కి ట్లనియె.

---

వారవిందంబుల - వా; నయనాంబుజంబుల - పెక్కు ప్రతులు. 4. దదీయరథంబు - వా. కొన్నిప్రతులు; దివ్యవిమానంబు-చ. వీ; శ. ష. దివ్యరథంబు - కొన్నిప్రతులు.

41. 1. న్వెలిగించుచు - ఈ. ఎ. ఐ. త. ఝ. 2. గతుల నిమ్నగనొప్పెన్ - గ. ఘ. ఝ. ఠ. ద.

43. 1. ప్రత్యుద్గతులైరి - ఈ. ఔ. క. ఝ. 2. కొఱగి - అ. ఘ. చ. ఝ. 3. శాస్త్రదృష్టి విహిత - కొన్ని ప్రతులు.

44. 1. హితమధుర - వా; పరమప్రీతి - శ; నతిమధుర - పెక్కు ప్రతులు.

45. క. ఘనుఁ డీపార్థుఁడు [1]నావల,నన దివ్యాస్త్రప్రయోగ[2]నయనిపుణుండై
దనుజుల నివాతకవచుల, ననిఁ జంపి [3]సురావలికిఁ బ్రియం బొనరించెన్.

46. క. ఈతఁడు పరాక్రమమున న,రాతుల వధియించి యిద్ధరారాజ్యము వి
ఖ్యాతముగ నిచ్చు నీకు మ,హాతేజుఁ [1]డజేయవీర్యుఁ డని నెవ్వరికిన్.

47. క. అని చెప్పి యనిమిషప్రభుఁ, డనిమిషనివహంబుతోడ నమరావతికిం
జనియె నిజాలోకనమున, కనఘులు [1]పాండవులు హర్షమందుచు నుండన్.

48. మధ్యాక్కర.
ఘనముగ [1]ధనదేంద్ర పాండుసుతసమాగమ మొక్కయేఁడు
దనరంగ బ్రహ్మచర్యవ్రతస్థులై తగిలి నిత్యంబు
వినిన పుణ్యాత్ములును జదివిన[2]వారు [3]విభుత నూఱేండ్లు
నొనర జీవింతు [4]రత్యంతమగు కాంతియుక్తులై ధరణి.

49. వ. ఇట్లు సురేంద్రుం డరిగిన ధర్మతనయుం డర్జునుం జూచి పరమానంద [1]భరితహృదయుం డై యిట్లనియె.

50. సీ. హరుఁ డాదిగాఁ గల యమరగణంబుచేఁ బడసి దివ్యాస్త్రముల్ పరమమైన
యుపకార మమరుల కొనరించె నీ[1]పార్థుఁ డని నాకుఁ జెప్పె వృత్రాంతకుండు
దివ్యాస్త్రలాభమ్ము దేవేంద్రునకుఁ బ్రీతిగా వేల్పులకు నుపకారి వైన
[2]విధమును మాకిప్డు విన వేడ్క యైనది యని తన్ను నడిగిన నగ్రజునకుఁ
ఆ. నగ్రజన్మపూజ్యు లగు ధౌమ్యరోమశ,[3]భ్రాతృవరుల యొద్దఁ బాండవేయుఁ
డసదృశ[4]ప్రభావుఁ డతివీరుఁ డర్జునుఁ, డాత్మచరిత మిట్టు లనుచుఁ జెప్పె.

---

45. 1. నావలనను – ఈ. త. న. పి. 2. నైపుణ్యుండై – కనం; ఘు. నిపుణుఁడై – త. పి. న. 3. సురాళికిం – వా. కొన్ని ప్రతులు; సురావలికి – ఈ. ఉ. ఓ. ఘ. ఘు.

46. 1. డజయ్యు – వా. కొన్ని ప్రతులు; డజేయ – కొన్ని ప్రతులు.

47. 1. తమలోన – ద.

48. 1. నమరేంద్ర – పెక్కు ప్రతులు. 2. నరులు – ల. 3. వినుము – వా. కొన్ని ప్రతులు; విభుఁడ – ర; విభుత – ఘ. జ. 4. రత్యంత సత్కాంతి – వా. కొన్ని ప్రతులు; రత్యంతమగు కాంతి – ల.

49. 1. నిర్భర – వా; కొన్ని ప్రతులు. భరిత – ఓ. ఔ. క. ద.

50. 1. తమ్ముఁడని – ట. 2. విధమును విన మీకు వేడుక యైనది – ల; విధము మాకు వినంగ వేడుకైనది చెప్పుమని – న. కొన్ని ప్రతులు. 3. ప్రభృతివరుల – వా. కొన్ని ప్రతులు; భ్రాతృవరుల – పెక్కు ప్రతులు. 4. ప్రతాపుడతి – ఉ. ఎ. ఏ. ఒ. ఔ. ఘు. త. ద.

51\. వ. ఏను [1]భవదాదిష్టవిద్యాప్రకారంబున తపోనియుక్తుండనై హిమవంతంబునకుం జని యందు వాముందట వృద్ధబ్రాహ్మణుండై యున్న వృద్ధశ్రవుం గని తదుపదేశంబున నీశ్వరుఁగుఱించి యుగ్రతపంబు సేసిన నీశ్వరుండు గిరాతరూపధరుండై నాతోడ నతిఘోరయుద్ధంబు సేసి నాకుఁ బ్రసన్నుఁడై నిజరూపంబుఁ జూపి పాశుపతాస్త్రంబుఁ బ్రసాదించె ననంతరంబ యింద్రాది దేవతలవలన నైంద్రాగ్నేయ యామ్య రాక్షస వారుణ వాయవ్య కౌబేర గాంధర్వ పైశాచ బ్రాహ్మ్యంబు లనంబరగు దివ్యాస్త్రంబులు వడసి మహేంద్రాను[2]గృహీతుండనై మాతలిప్రయుక్తంబైన దివ్య[3]రథం బెక్కి యీశరీరంబుతోడన యమరావతి కరిగి యం దమరేంద్రు నాచార్యుఁగా వరించి తత్ప్రసాదంబున దివ్యాస్త్రంబులు వడసి తత్ప్రయోగంబులును నుపసంహారంబులును నివర్తనంబులునుఁ బ్రాయశ్చిత్తంబులును బ్రతిఘాతంబులును [4]నేర్చిన నాకు సంతసిల్లి సురేంద్రుం డిట్లనియె.

52\. క. నీ[1]వఖిలాస్త్రవిదుండవు, గావున నిన్నాజి నోర్వఁగా నోప రొరుల్
దేవతలకు బ్రాహ్మణులకుఁ, [2]గావింపు హితంబు దీనఁ గడు సిద్ధి యగున్.

53\. క. నాకు గురుదక్షిణార్థము, నాకహితార్థంబుగా జనస్తుత బుద్ధిం
జేకొని నాపనిచిన పనిఁ, బ్రాకటముగఁ జేయు మహితభంజన[1]శక్తిన్.

54\. తే. జలధికుక్షిలో నుండి [1]వీరులు నివాతకవచు లను మూఁడుకోట్ల దానవులు బలిమిఁ
బ్రిదశులకు బాధ సేయు చుండుదురు వారు, నిహతు లగుదురు నీచేత మహిత[2]కీర్తి.

---

51\. 1. భవదధిష్ఠిత విద్యా ప్రభావంబున – కొన్ని ప్రతులు. భవదుపదేశ ప్రభావంబున – ట; భవదాదిష్ట విద్యాప్రకారంబున – ల. 2. గ్రహంబున–వా. కొన్ని ప్రతులు; గృహీతుండనై – కొన్ని ప్రతులు. 3. స్యందనం – ఈ. ఎ. ఐ. త. 4. నేర్చి యున్న నన్నుంజూచి సంతసిల్లి – ల.

52\. 1. వఖిలశస్త్ర విదుండవు – వా; కొన్ని ప్రతులు. వఖిలాస్త్ర విదుండవు – కొన్ని ప్రతులు. 2. గావించు – ఘ. శ.

53\. 1. శక్తిన్ – ఔ. క. ఘ. చ.

54\. 1. ధీరులు – వా; కొన్ని ప్రతులు; వీరులు – కొన్ని ప్రతులు. 2. శక్తి – ఆ.

55. వ. అని తన తొడగిన దివ్యభూషణంబుల మణికిరీటంబున నన్ను విభూషితుం జేసి స్పర్శరూపం బైన యభేద్యకవచంబు నిచ్చి [1]యజగరసన్నిభం బయిన యుగ్గానయంబు గాండీవంబునం దాన యోజించి పదివేలహంససమయూరవర్ణ మాననీయహయంబులం బూనిన రథంబు మాతలిప్రయుక్తం బైనదాని నెక్కం బనిచి నివాతకవచవధార్థం బరుగు మని నియోగించిన నింద్రుు వీడ్కొని చనుచున్న [2]నాకు దేవత లిట్లనిరి.

56. ఉ. ఈరథ మెక్కి [1]తొల్లి యమరేంద్రుఁ డనేకసహస్రసంఖ్య దే
వారుల వృత్ర[2]శంబరబలాదుల నుద్ధతులన్ జయించె వీ
రారివిభేది నీవును బలాఢ్యుఁడవై వధియింపు ముగ్రమా
యారతులన్ నివాతకవచాసురులన్ సమరాంతరంబునన్.

57. వ. అని నాకు దేవదత్తం బను శంఖం బిచ్చిన నేనును మాతలి[1]సహితంబుగా రథం బెక్కి యతిత్వరితగతి నరిగి.

*-: అర్జునుఁడు నివాతకవచు లను రాక్షసుల జయించిన కథ :-*

సం. 3 _ 166 _ 1

58. క. ఫేనవదూర్మిచయంబుల, నానావిధమీనకూర్మనక్రంబుల శై
లానుకృతి నొప్పుచున్న మ, హానీరధిఁ గంటి నేను నమ్మాతలియున్.

59. వ. ఆ[1]సముద్రోదరంబున విశాలాట్టాలక ప్రతోళికా[2]లంకృతం బైన పురంబుఁ గని తద్ద్వారంబున శంఖధ్మానంబు సేసిన నది సకలదిఙ్మహీధరగుహా[3]కుహరంబుల

---

55. 1. యజగర సన్నిభంబయిన - పెక్కు ప్రతులు; యజరంబయిన - వా. 2. నాతో - వా. కొన్ని ప్రతులు; నాకు - కొన్ని ప్రతులు.

56. 1. పోయి - వా. కొన్ని ప్రతులు; తొల్లి - పెక్కు ప్రతులు. 2. జంభశ - గ; జంభశ - ఘ.

57. 1. ప్రయుక్తంబైన - వా. కొన్ని ప్రతులు; సహితంబుగా - కొన్ని ప్రతులు.

59. 1. సముద్రాంతరంబున - ఈ. ఝ. ట. త. 2. ప్రతాన విచిత్రపతాకా వివిధసాలా లంకృతంబైన - వా. కొన్ని ప్రతులు; లంకృతంబైన పురంబు - ఆ. ఙ. శ. ష. 3. కుహరాంతరంబులం బ్రతి - వా; కుహరంబులయందు బ్రతి - కొన్ని ప్రతులు.

యందు బ్రతిశబ్దజనకం బయిన దాని విని యలిగి దానవులు నానావిధా యుధసన్నద్ధు లయి నిజకాయ[4]కాళిమత మోఘూతభువను లగుచు వచ్చి నారథంబుఁ బరివేష్టించి.

60. క. ఉరుశస్త్రవృష్టి నాపైఁ, గురిసినఁ దత్క్షణమె [1]యొక్కొకొనిపయి నేనున్ [2]వరుసం బదేసి బాణము, లరుదుగ నేసితి మహాభయంకర[3]భంగిన్.

61. క. దనుజులు మదీయరథమా, ర్గనిరోధముగాఁ బ్రచండకాండప్రకరం బునఁ గప్పిరి రోదోంతర, మని మిషులును ఋషులుఁ జూచి యద్భుతమందన్.

62. క. కడుభయమున మాతలి చే, డ్పడి రథ[1]చోదనమునం దపాటవుఁ డైనన్ వడి నేన రథము గడపుచుఁ, దడయక యేసితిఁ గడంగి దానవులపయిన్.

63. వ. మాతలి నన్నుం జూచి సంతసిల్లె నంత.

64. చ. అతులరణాంతరంబున నిరంతరమత్పటుబాణ[1]దారితో
చ్ఛ్రితదనుజాంగనిర్గళదసృగ్జలధారలు సూడ నొప్పె నా
తతగిరిశృంగసంగదళితప్రచలజ్జలవాహజాలసం
తతగళదంబుధారల విధంబున నంబర మెల్లఁ [2]గప్పుచున్.

65. వ. అంత నయ్యసురులు మాయాయుద్ధంబు సేయ సమకట్టి నామీఁద [1]వర్షాస్త్రంబు లేసిన.

---

4. కాళిమాంధతమోఘూత ఘూభువనులగుచు -? వా; కాళిమతమోఘూతభువను లగుచు - పీ. శ. ష. కొన్ని ప్రతులు.

60. 1. మిగుల గొనకొనియేనున్ - పీ. శ. ష; యొక్కొకొని పయినేనున్ - పెక్కు ప్రతులు. 2. వరుసంబదినేసి - ఇ. ట. త. వా; వరగగ వదేసి - అ. ఝ; వరుస వదినేసి - త. మూని; వరుసంబదేసి - పీ. శ. ష. కొన్ని ప్రతులు. 3. వృత్తిన్ - వా. కొన్ని ప్రతులు; భంగిన్ - పెక్కు ప్రతులు.

62. 1. చోదకతయం - ఈ. ఐ. త.

64. 1. పాతితో -వా. కొన్ని ప్రతులు; దారితో - ట. ఔ. క. గ; పీ. శ. ష; వారితో - ఈ. ఊ. ఘ. 2. గప్పఁగాన్ - ఇ. ఈ. ఎ. ఏ. పీ.

65. 1. వరుణాస్త్రంబు - వా. కొన్ని ప్రతులు; వర్షాస్త్రంబు - ఆ. ఓ. క. గ. చ. జ. ద. పీ. ష.

66. క. బలరిపుఁడు నాకు నిచ్చిన, యలఘునిశాతముఖశోషణాస్త్రంబున ని
ర్గళదవిరళజలధారా, వలి నెల్లను దత్క్షణంబు వట్టఁగఁ జేసెన్.

67. సీ. [1]అద్దానవులు దారుణాశ్మవర్షంబులుఁ గురిసిన నవి నన్నుఁ దెరలఁ గప్పె
నేనును గులిశాస్త్ర మేసి పాషాణముల్ నుఱుము గావించితి నుఱక వెండి
యసురులు నామీఁద [2]ననలాస్త్రజాలంబు లేసిన గాడ్పుతో గ్రమ్మి యగ్ని
కణములు [3]నాపయిం గవిసిన నేనును సలిలాస్త్రముల వాని[4]బల మడంచి

ఆ. యున్నఁ దిమిరబాణ ముగ్రంబుగా వార, లేసి రంత దిక్కు లెల్లఁ గప్పె
నంధకారమగ్నుఁడై చలియించి [5]మాతలి[6]ప్రతోద మెడలి ధరణిఁ బడియె.

68. క. తురగములు పఱవ నేరక, [1]వరరథవహనంబునందు వంధ్యము లయ్యెన్
సురసారథి నను గానక, హరినందన [2]యెందుఁ బోయి తనెఁ గడు భీతిన్.

69. క. అమృతనిమిత్తంబున ము, న్నమరాసురయుద్ధ మయ్యె నది యింత భయ
భ్రమజనకము గా దిది యు, గ్రము దనుజు లవార్యవీర్యగర్వితు [1]లగుటన్.

70. తే. [1]బ్రహ్మచేత నిర్మింపఁగఁ బడిన భువన, సంప్లవం బిది నావుడు సంగరమున
సంచలింపక నాభుజశక్తిఁ జూచు,చుండు [2]మనవుడు మాతలి చోద్యమందె.

---

67. 1. ఈ పద్యమునకు ముందు 'మరియును' అను వాక్యము కొన్ని ప్రతులలోఁ గలదు. ఆ దానవులును మహాశిలావర్షంబు గురిసిన - ల. 2. ననిలాంబులలుకమైనేసిన - ననలాస్త్రనిచయంబులేసిన - ఘ. ల; ననలాస్త్ర ముగ్రత నేసిన - డ; ననలాస్త్ర జాలంబులేసిన - చ. 3. నామీఁద - కొన్ని ప్రతులు; నాపయింగవిసె నేనును శైలసలిలాస్త్రముల - వా. కొన్నిప్రతులు; నాపయింగవిసిన నేనును సలిలాస్త్రముల- కొన్ని ప్రతులు. 4. చలమడంచి - ట. 5. మాతలియుదోడగూడ - డ. 6. ప్రతాపమెడలి - ఆ. ఈ. ప్రమోదమెడలి — ఘ. చ. శ.

68. 1. వరూధవహనంబునందు - అ. ఎ. ట. ఝ. స. 2. యెందుబోయితని - అ. ఆ. ఈ. ఉ. జ. ఝ. శ. డ. సం.

69. 1. లెందున్ - కొన్ని ప్రతులు.

70. 1. బ్రహ్మచేతను నిర్మింపబడని -డ; బ్రహ్మచేత నిర్మింపగాబడని - స. 2. మని యప్డు మాతలి నూరడించి - అ. ఆ. ఈ. ఉ. ఐ. క. జ. ఝ. పి. శ. ప; నిప్పుడు దనుజుల నుక్కణంతు - ల.

71\. ఉ. [1]వాసరనాయకుం దలఁచి వజ్రివరంబున సూర్యబాణ మే
నేసితి నింద్రుఁ దొట్టి సుర[2]లెంతయు సంతస మందఁగా జగ
[3]త్త్రాసి తమిస్రరాశి [4]నిహతంబుగ దిక్కులు ద్రెళ్ళఁగా మహో
[5]గ్రాసురు లాహవంబున భయంపడ మాతలి మెచ్చి యార్వఁగన్.

72\. క. గాండీవముక్తదారుణ, కాండవి[1]ఖండీకృతాపఘనులై దనుజుల్
ఖండన[2]ముఖమునఁ జేడ్వడి, గొండలు వడినట్టు వడిరి కుతలం బద్రువన్.

73\. వ. ఇట్లు నివాతకవచులు మదీయదివ్యాస్త్రనిహతులై మహీతలంబునం బడిన నట యసురకాంతల యాక్రందనధ్వను లాకసం బద్రువ నొక్కటఁ బురంబున నెగసె నంత నద్దానవపురంబుఁ బురందరపురంబుకంటె నతిసుందరం బైన దానిం జూచి మాతలి కిట్లంటి.

74\. క. నిరుపమరత్ననిరంతర, వరగృహముల నొప్పి సుఖనివాసం బగు ని
ప్పురినుండ నొల్ల కొండొక, పురి నుండఁగ నేల వలసెఁ బురుహూతునకున్.

75\. వ. అనిన మాతలి యి ట్లనియె.

76\. సీ. అసురులవలన భయం బైన యపుడు వేల్పులకు [1]సేమంబుగా బలవిరోధి
యీప్రోలు జలధిలో [2]నిమ్ముగ నిర్మించె దనుజులు పదపడి వనజగర్భు
వలనఁ దపోవీర్యవంతులై యిందుండ నమరులచేతఁ గయ్యమున నజితు
లై యుండఁ బడసిన నమరేంద్రుఁ [3]డెఱిఁగి తద్విజయార్థముగఁ బంచె
విజయ నిన్ను

ఆ. నమరులకు [4]నసాధ్యు లైనట్టి వీరల, నీవ యోర్చి తనుచు నెమ్మితోడ
నన్ను సంస్తుతించి నరనాథ మాతలి, గడఁగి యపుడు రథముఁ గ్రమ్మఱించె.

---

71\. 1. వాసవ – కొన్ని ప్రతులు. 2. లెల్లను – ఉ. డ. 3. త్త్రాసితమిస్ర – అ. ఝ. డ. వీ. 4. నిహతంబుగ దిక్కులు తెల్లగా – వా. కొన్ని ప్రతులు; విదితం బుగ దిక్కులు త్రెళ్ళగా – పీ. ష. 5. గ్రాసురులెల్ల జూడగ భయం బరి మాతలి ప్రస్తుతింపగన్ – ఉ.

72\. 1. ఖండిత దృఢాదికాయుల్ – వా. కొన్ని ప్రతులు. ఖండీకృతాపఘనులై – ఈ. ఐ. ఒ. క. గ. వీ. శ. ష. 2. మున బిండరివడి కొండలు – ఠ.

76\. 1. ప్రియంబుగా – ట. 2. నిమ్ముల – ఉ. ఝ. ల. శ. స. 3. దలిగి – ఈ. ఐ. వీ. శ. ష. 4. నసాధ్యు లసురుల వీరల నీవ – పీ. శ. ష. ఠ. కొన్ని ప్రతులు.

77. వ. ఇట్లు నివాతకవచులం జంపి క్రమ్మఱి వచ్చునెడ నాముందట నొక్క తపో వనంబును నతివిచిత్రం బైన పురంబునుం గని యిది యెవ్వరిపురం బని యడిగిన నాకు మాతలి యిట్లనియె.

78. క. వినవె పులోమయుఁ గాలక, యును నన(గా నిరువు రసురయువతులు గమలా
సను నారాధించిరి తప, మున దివ్యసహస్రవర్షములు గడు నిష్ఠఁ.

79. క. కనకమయ మైన యీ[1]ప్రో, లున దమసుతు లాహవంబులో నమరులచే
[2]తను వధ్యులుఁ గాకుండను,వనజుచేఁ బడసి రసురవనితలు [3]వరముల్.

80. వ. ఇది హిరణ్యపురం బిందుఁ బౌలోమకాలకేయు లను[1]నసురు లఱువది వేలుండుదురు వారమరులచేత నవధ్యు లనిన నట్లేని [2]దానిపయిం బోదము రథంబు వఱపు మని యేను మాతలిం బంచిన.

81. చ. అతఁడును సప్తమారుతరయంబున దివ్యరథంబుఁ దత్సురా
హితపురి భూరి వప్రము పయిం బఱపెఁ సురవైరు లంత ను
ద్ధతు లయి ప్రోలు వెల్వడి రథంబులు షష్టిసహస్రకంబుతో
శతమఖబుద్ధిఁజేసి కడు సైఁపక తాఁకిరి నన్ను నల్కతోఁ.

82. వ. ఏనును వారల యఱువదివేల రథంబులకు గతినిరోధంబుగా వితత[1]వృతవికట శిలాప్రభవంబు లయిన దివ్యబాణంబులేసిన నసురులు మాయాయుద్ధనిబద్ధ బుద్ధులై తమపురంబుతోడన దివంబున కెగసి మదీయమార్గణార్గళనిరుద్ధ మార్గులై నేలంబడిన వీరల నొండువిధంబున నోర్వ[2]రా దనితలంచి.

---

79. 1. ప్రోలును - వా. పెక్కు ప్రతులు; ప్రోలున - ఊ. ఝ. శ. 2. తనవధ్యులు గాదగనవ్వనజు - వా. కొన్ని ప్రతులు; తనువధ్యులుగాకుండను వనజజు-ఊ. ఝ. త. 3. కరుణన్ - వా. పెక్కు ప్రతులు; వరముల్ - ఘ. వీ. శ. ష.

80. 1. నసురు లఱువదివేలుండుదురు - ప్రౌ. శ. కొన్ని ప్రతులు; నసురు లుండుదురు - వా. కొన్ని ప్రతులు. 2. వారిపయిం - అ. ఊ. ఒ. ఔ. గ. ట. ద. వా; వారలపయిం - ల. కొన్ని ప్రతులు; దానిపయిం - చ. జ. వీ. శ. ష.

82. 1. వృతవికటశిలా - పెక్కు ప్రతులు; వృతశిలా - వా. 2. గాదని - వా. కొన్ని ప్రతులు; రాదనితలంచి - ఇ. ఏ.

83. చ. ఉరగఫణాగ్రరత్నకిరణోల్లసదుగ్రభుజుఁ వృషాంకు శం
కరు శశిఖండమండితశిఖండు శివున్ హృదయాంబుజంబునం
దిరముగ నిల్పి పాశుపతదివ్యశరం బరివోసి యేసితిఁ
సురరిపుకోటిమీఁద [1]సురసూతుఁడు మాతలి [2]చూచి మెచ్చఁగఁ.

84. వ. ఆ దివ్యాస్త్రప్రభావంబున సింహ శరభ శార్దూల శుండాల మహిష మహోక్ష యక్ష రాక్షస పిశాచ పన్నగ గంధర్వ రూపంబు లుద్భవిల్లి యసురుల నెల్ల విగతాసులం జేసిన.

85. క. [1]వంచనయును మాయయు [2]మా, యించి పరాక్రాంతి నయ్యుమేశాస్త్రమునం
[3]గ్రంచఱ నంతకపురికేఁ, గించితిఁ బౌలోమకాలకేయాసురులన్.

86. వ. ఇట్లు హిరణ్యపురనివాసులం గృతాంతపురనివాసులం జేసి వచ్చి వాసవునకు మ్రొక్కిన వాసవుండును నివాతకవచపౌలోమకాలకేయులవధ[1]ప్రకారం బంతయు మాతలివలన విని సంతసిల్లి నాకిట్లనియె.

87. చ. సురలకుఁ బ్రీతి సేసితి వసుంధరకేఁగుము నిన్ను నీ సహో
దరులు నిరంతరంబును ముదంబునఁ జూడఁగఁ గోరుచున్నవా
రరిమదభేది నీకు [1]విషమాజిముఖంబుల మార్కొనంగ నో
పరు నరు లెవ్వరుఁ హరి కిభంబులు మార్కొనునయ్య యెయ్యెడన్.

88. క. ద్రోణ ద్రోణజ కృప గీ, ర్వాణనదీజాంగపతు [1]లవశ్యమును భవ
ద్బాణహతిఁ జేసి సమర, క్షోణిఁ బరిక్షీణబలు లగుదు [2]రవజితులై.

---

83. 1. హరిసూతుడు - వా. కొన్ని ప్రతులు; సురసూతుడు - పెక్కు ప్రతులు; 2. మెచ్చి చూడగన్ - వా. కొన్ని ప్రతులు; చూచిమెచ్చగన్ - ఆ. ఇ. ఉ. చ. వీ. శ. ష.

85. 1. వంచనయు మాయయు ముదిగుటించి - అనం; వంచనీయు మాయయు వారించి - చ. 2. వారించి - ఇ. ఏ. గ. చ. గణ. 3. గొంచక - అనం. ఈ. చ. వీ. శ. ష.

86. 1. ప్రపంచంబు మాతలి - వా. కొన్ని ప్రతులు; ప్రకారంబంతయు - ఆ. జ. ట.

87. 1. విసుమాజి - ఐ. ఔ. త.

88. 1. లవశ్యంబుభవ - ల. కొన్ని ప్రతులు. 2. రువిజితులై - డ. ద; ......, రవజయులై - ల; రవజితులై - వా. పెక్కు ప్రతులు.

89. క. అనిన నమరేంద్రు వీడ్కొని, చనుదెంచితి నని కిరీటి శతమఖలోకం
బునఁ దనచేసిన [1]విధ మ, త్యనఘుం డేర్పడఁగఁ జెప్పె నందఱు వినఁగన్.

90. వ. ధర్మరాజును దమ్ముఁడు సేసిన మహా[1]పరాక్రమంబునకుఁ జతురంభోధి పర్యంతమహీరాజ్యం బప్పుడు తనకు సంప్రాప్తంబై నంతియ సంతసిల్లి.

91. ఆ. దివ్యబాణములు తదీయప్రయోగముల్, మాకుఁ జూపుమనిన మఘవ సుతుఁడు.
వేలువేల చూపె [1]వేలుపు లిచ్చిన, యస్త్ర[2]శస్త్రములు నిజాగ్రజునకు.

92. వ. మఱియును.

93. చ. సురవిశిఖప్రయోగములు సూపఁ దొడంగిన నేల దిర్దిరం
దిరిగెఁ బయోనిధుల్ గలఁగె దిగ్గజముల్ మద[1]మేది కుందె భా
స్కరరుచి మాసెఁ బావకశిఖాతతి [2]తోన యడంగె గాడ్పు లం
బరమున నిల్చె రీశ్వరుఁడు బ్రహ్మయు నాదిగ వేల్పు లందఱున్.

94. వ. అంత సురగణచోదితుండైన నారదుం డర్జును పాలికివచ్చి యిట్లనియె.

95. తే. ఎదురులేక దివ్యాస్త్రంబు లిట్లు నీకుఁ, [1]బాడియే ప్రయోగింపంగఁ బాండు పుత్త్ర
సిద్ధమివి యధిష్ఠానవర్జితము లయ్యె, నేని మూఁడులోకములు దహించు [2]నాగిని.

---

89. 1. తపము – ప.

90. 1. సంరంభంబునకు – వా. సూ. పెక్కు ప్రతులు; పరాక్రమంబునకు – క.

91. 1. వేల్పులిచ్చిన యట్టి శస్త్రరత్నములు – ఈ. ఎ. ఐ. ఝ. త. 2. రత్నములు– పెక్కు ప్రతులు.

93. 1. మెత్తికట్టె – ఆ. ఏ. ఒ. ఓ. క. ఘ. చ. జ. ఠ. డ; మ్రొగ్గెకుందె – వా; మేది కుందె – పీ. శ. ష. 2. యెల్లనడంగె – ఆ.

95. 1. బాడియగునె ప్రయోగింప పాండుపుత్త్ర – ఇ. ఏ. పీ. 2. మాత్ర – వా. కొన్ని ప్రతులు; నాగిని – ల; సుమ్మె – ఈ. ఐ. త. శ. ష.

96\. వ. అని యర్జును వారించి నారదుం డరిగిన నమరులు నిజస్థానంబుల కరిగి రిట్లు పాండవు లందుపదిమాసంబు లుండునంత నొక్కనాఁ డమరకన్యకలు వచ్చి యర్జునున కి ట్లనిరి.

97\. తే. వనమునందును బండ్రెండువత్స[1]రములు,నలయ కజ్ఞాత[2]వాసమేకాబ్దకంబు
పూని నిర్విఘ్నవృత్తిఁ జల్పుదురు మీరు, [3]పగఱ నిర్జింతు రాహవాభ్యం
తరమున.

98\. తే. నీపరాక్రమబలమున నిఖిలధరణి, రాజ్యభారంబు నీధర్మరాజు [1]పూను
రఘుకులాధీశ్వరుం డైన రాముకీర్తి, యట్ల నీకీర్తి త్రిజగంబులందుఁ
[2]బరగు.

99\. వ. అని యాదేశించి దేవకన్యకలు వోయిన నిట దేవర్షి యైన రోమశుండు [1]ధర్మరాజునకు ధర్మానుశాసనంబుసేసి దివంబున కరిగె నంతఁ బాండవు లెప్పటియట్లు ఘటోత్కచ[2]సేనాన్వితులై క్రమ్మఱి వృషపర్వునివాసంబు సూచుచు బదరీవనంబున నొక్కరాత్రివసియించి సుబాహుపురంబునకు వచ్చి యందుఁ దమపరిచారకు లైన [3]యింద్రసేనాదులం గూడి నిజరథారూఢులై ఘటోత్కచుం బోవం బనిచి హిమవత్పర్వతంబునందు దేవర్షి బ్రహ్మర్షుల యజ్ఞ[4]ప్రదేశంబుల ననేకవిధయూపంబులు సూచుచు నొక్కవర్షం బుండి రంత నొక్కనాఁడు.

---

97\. 1. రమ్ములలయ — వా; రములునలయ — కొన్ని ప్రతులు. 2. చర్యయేకా— వా. కొన్ని ప్రతులు; వాసమే — కొన్ని ప్రతులు, 3. పరుల — ఉ. ఔ: పరగ — ఎ; సంతసంబున విష్టపాభ్యంతరమున — ఊ. స. స్వరయతి నియమభంగము — అర్థమును విచార్యము.

98\. 1. దాల్చు — వా. కొన్ని ప్రతులు; పూను — పెక్కు ప్రతులు; 2. బర్వు — వా. కొన్ని ప్రతులు; వెలుగు — ఇ. ఏ. గ. స; బరగు — శ. ష.

99\. 1. పాండవుల వీడ్కొని దివంబున — ఈ. ఎ. ఐ. ఝ. త. 2. సహితులై — ఘ. వీ. శ. ష; సేనానీతులై — వా. కొన్ని ప్రతులు; సేనాన్వితులై — ఉ. ఒ. గ; సేనాసమన్వితులై — ఆ. ఏ. ఐ. ఓ. చ. ఝ. ద. ల. 3. యింద్రసేన ప్రముఖులం — వా. కొన్ని ప్రతులు; యింద్రసేనాదులం — కొన్ని ప్రతులు; 4. ప్రదేశంబులయందు ననేక — ఔ. గ. డ.

-: అజగరోపాఖ్యానము :-

సం. 3 - 176 - 5

100. క. మృగయార్థ మరిగి హిమవ, న్నగభూములయందుఁ బవననందనుఁ డొక ప
న్నగుచేతఁ బట్టువడి యి, మ్మగ ధర్మతనూజుచేత [1]మోఁచితుఁ డయ్యెన్.

101. వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

102. మధ్యాక్కర.
పదివేలగజముల[1]బలముగలవాఁడు పౌలస్త్యతోడఁ
గదనంబు సేసి యనేకయక్షరాక్షసుల నిర్జించి
యుదిత శౌర్యోన్నతుండైనవాఁడు వృకోదరుఁ డేల
పదపడి నిగృహీతుఁ డయ్యెఁ [2]దానొక్క పన్నగుచేత.

103. వ. [1]అనిన వానికి వైశంపాయనుం డిట్లనియె భీముం డొక్కండ హిమవదు
త్తుంగశృంగోపాంతకాంతారంబుల మృగయాభిలాషం బరిభ్రమించు
చుండి యతిశ్రాంతుం డయి తత్ప్రదేశంబున.

104. మ. [1]అశనాశావివృతాస్యగహ్వరుఁ గృతాంతాకారు నిశ్వాసధూ
మశిఖాధూసరి[2]తోగ్రదుర్గతరుగుల్మవ్రాతు హారిద్రవ
ర్ణశరీరుః భృశరూక్షదర్శను మహానాగప్రభుం గాంచె న
ర్ధశశాంకద్యుతి[3]హారిదారుణచతుర్దంష్ట్రున్ జగత్త్రాసకున్.

105. వ. [1]అమ్మహాజగరం బామిషార్థియై భీముం బట్టికొని వానిభుజయుగంబుఁ దనముఖంబున నంగంబు నిజాంగంబున[2]జిక్కం బంధించిన నాగాయుతబలుం డయ్యును దదంగసంగంబున దుర్బలుండై [3]మెలంగ నేరక భీముం డప్పాము బలవీర్యంబులకు విస్మితుం డయి యిది ప్రకృతిసర్పంబుగా [4]దెయ్యది యేనియు నొక్కయద్భుతరూపం బని విచారించుచు దాని కిట్లనియె.

106. మత్తకోకిలము.

ఏను భీముఁడఁ బాండవేయుఁడ నిద్ధతేజుఁడ ధర్మరా
జానుజుండఁ బిశాచపన్నగయక్షరాక్షసవీరులం
బూని పోరుల నోర్వ నోపెడు భూరి[1]వీరుఁడ నాగపం
చాననాదులఁ బట్టి [2]వ్రచ్చు ననంతబాహుబలాఢ్యుఁడన్.

107. ఆ. ఇట్టి నన్నుఁ బట్టి యిప్పాట బంధించు, నట్టి శక్తి యెట్టు లయ్యె నీకు
నిది నిసర్గశక్తియే వరదానసం, సిద్ధి యైన యదియె చెప్పు మనిన.

108. వ. అదియును దిర్యగ్జాతి యయ్యును దన పూర్వ[1]స్మృతి సెడకుండ వరంబుఁ గాంచుటం జేసి వాని కిట్లనియె.

109. క. ఇది నావరలాభంబున, నుదయించిన శక్తి [1]యెట్టి యున్నతబలసం
పదు లైన జీవులును నా, [2]కెదిరించి బలహీను లగుదు రివ్విపినమునన్.

110. ఆ. ఎదురఁ బడిన [1]వాని వదలక శార్దూల, శరభ సామజాది సత్త్వతతులఁ
బట్టి తినుచు నున్న యట్టి నాకిప్పుడు, భక్ష్య మైతి [2]వీవు పాండుపుత్త్ర.

---

105. 1. అమ్మహానాగంబా – ఈ. ఊ. ఎ. ఐ. ఒ. ఝ. త. 2. చిక్కంబట్టిన – శ. ప; కొన్ని ప్రతులు. 3. మెదలనేరక – ఏ. ఐ. ఒ. ఝ. వీ. శ. ష. వెలువడనేరక – ల. 4. దెద్దేనియు – వా. పెక్కు ప్రతులు; దెయ్యదియే – వీ. శ. ష.

106. 1. వీరుడ – ఝ. ట. పెక్కు ప్రతులు; సత్త్వుడ – అ. క. చ. వా. వీ. శ. ష. 2. ప్రంచు; ప్రచ్చు – స.

108. 1. స్థితి – ఉ. గ. స.

109. 1. సువ్వె (చూవె) – క. చ. ఠ. త. 2. యెదురను – వా. సం; కెదురుచు. కెదిరిన – స; కెదిరిచి – వీ. శ. ష. కొన్ని ప్రతులు.

110. 1. దాకి – వా; వాని – పెక్కు ప్రతులు; 2. నీవు – కొన్ని ప్రతులు.

111. ఆ. శక్రపదవిఁ బొంది సద్బ్రాహ్మణుల కవ, మాన మేను జేసి మదము పేర్మి
ననఘ [1]యిట్టులైతి నందొక్క మునివరు, శాపశక్తిఁ దొంటి శక్తి దఱిఁగి.

112. వ. అని దుఃఖించిన [1]యజగరంబునకు భీముం డిట్లనియె.

113. క. కడుకొని కడు దుఃఖములై, నెడ నుచితమె యాత్మనింద యెయ్యెడల మనం
[1]బెడలక యేకాకృతి నె, ప్పుడు నుండుట సూవె [2]పురుషు పురుషార్థమిలన్.

*-: ధర్మరాజు భీమసేనుని వెదకఁబోవుట :-*

114. వ. [1]పురుషకారంబునం జేసి దైవంబు నివర్తింప నెవ్వరోపుదు రేను మహాబలుండ నయ్యును భవద్గృహీతుండనై యిట్టి యవస్థం బొందితి నాత్మత్యాగంబునకు [2]వగవ [3]నపహృతరాజ్యానుభోగులై మద్భ్రాతృవరులు దుర్గమం బైన[4]యిప్పర్వతకందరంబునం గ్రుమ్మరు చున్నవారు నన్నుఁ గానక యెంత దుఃఖింతురో యని వగచెద ననుచున్నంత నిట ధర్మతనయుండు దీప్తం బైన శివారుతంబు విని యతిశంకితచిత్తుం డయి యనంతరంబ తన దక్షిణభుజాస్పందనం బుపలక్షించి మీఁద లగ్గగు నంచు ననుజమధ్యంబున [5]ననిలజుం గానక యర్జునుం గవలను గృష్ణారక్షణార్థంబు నియోగించి ధౌమ్యపురోగమభూసురవరులతో భీము రోయుచుం దదీయపాదతలలలితహలకులిశకల[6]శజలజాదిలక్షణాలంకృతం బైన పాంసుపథంబునం జని ముందట.

---

111. 1. యిట్టిదైతి – జ; యిట్టిదైతి – ఝ. త. స.

112. 1. భుజంగమంబునకు – వా. కొన్ని ప్రతులు; యజగరంబునకు – కొన్ని ప్రతులు.

113. 1. బడలక – వా. కొన్ని ప్రతులు; బెడలక – పెక్కు ప్రతులు. 2. పరమ – ఔ. ట. ద.

114. 1. కావునపురుష – వా; పురుష – పెక్కు ప్రతులు. 2. వెరవ – ఈ. ఐ. త. వీ. శ. ష. 3. నపగత – వా. కొన్ని ప్రతులు; నపహృత – కొన్ని ప్రతులు. 4.యిప్ప ర్వత కందరంబునం – పెక్కు ప్రతులు; యిప్పర్వతంబునం – వా. 5. భీముం (భీమునిం) –కొన్ని ప్రతులు. 6. కలశజలజాది లక్షణాలంకృతంబైన – ల; కల శాది లక్షణ లక్షితం – వా. కొన్ని ప్రతులు.

115. క. గిరిశిఖరాభోగ[1]బృహ, త్తరభుజగశరీరవేష్టితశరీరుండై
ధరమునఁ గదలఁగ నేరక, పరమ [2]శ్రమ మడర నున్న [3]పవనజుఁ గనియెన్.

116. క. కని యాత్మగతంబున ని, య్యనిలజుఁ డొకపాముచేత [1]నవిచేష్టితుఁడై
తన [2]లావు దటిఁగి ప్రాకృతజనుక్రియ నిట్లున్న[3]వాఁడ సామర్థ్యమునన్.

117. వ. ఇది యేమి యాశ్చర్యం[1]బో యనుచు ననిలజుం జూచి దుఃఖితుండై ధర్మజుం
డయ్యజగరంబున కి ట్లనియె నయ్యా నీవు సర్పరూపంబుఁ దాల్చిన
దైత్యుండవో దేవతవో [2]చెప్పు మేను యుధిష్ఠిరుండ ని న్నడిగెద
నిమ్మహాభుజు నా యనుజు నామిషార్థివై [3]పట్టితేని నీకు బుభుక్షానివృత్తి
యగునట్లుగాఁ జాలినంత మృగమాంసంబుఁ బెట్టెద వీని విడువు మనిన
ధర్మరాజునకు నయ్యజగరం బి ట్లనియె.

118. సీ. వినవయ్య నహుషుఁడన్ జనపతి నేను మీపూర్వజులకు నట పూర్వజుండ
[1]ననఘ సుత్రామున కెనయగువాఁడనై శ్వర్యగర్వంబున నార్యవృత్తి
విడిచి వివేకంబు సెడి సహస్రోత్తమ[2]బ్రాహ్మణధృతమైన బ్రహ్మరథము
నెక్కి బ్రాహ్మణులకు [3]నక్కజంబగు నవమానంబు సేసిన దాన నాకుఁ

ఆ. గలశభవుఁ డగస్త్యుఁ డలిగి యత్యుగ్రాహి, వగు[4]మటంచు శాపమప్పుడిచ్చె
మునివరేణ్యు శాపమునఁ జేసి యిప్పాట, నవయు చున్నవాఁడ నాఁటఁ
గోలె.

---

115. 1. బృహత్తర - స, 2. క్లేశముననున్న - ఔ. ద. 3. పవనతనూజున్ - ఊ స.

116. 1. నదెవేష్టితుఁడై - వా. కొన్ని ప్రతులు; నవిచేష్టితుడై - పెక్కు ప్రతులు.
2. చేష్ట - వా. పెక్కుప్రతులు; లావు - గ. 3. వాఁడు సామాన్యముగన్-వా;
వాఁడ సామర్థ్యమునన్ - పెక్కు ప్రతులు.

117. 1. బనుచు - వీ. శ. ష. 2. చెప్పుమేను - పెక్కు ప్రతులు; యేను - వా. ల.
3. పట్టుకొంటివేని - ల. కొన్ని ప్రతులు.

118. 1. జననుతసోమున - ఆ. ఉ. ఊ. ఐ; వినుము సుత్రామున - ఈ. ఎ. క. ఝ. ల;
ఘనుతసోమున - ఒ. ఓ. ఘ. చ. ఠ. శ. 2. బ్రాహ్మణావృతమైన - శ. ష.
3. నక్కజంబుగ - కొన్ని ప్రతులు. 4. మనియును శాపమొగిన యిచ్చె - వా.
కొన్ని ప్రతులు; మునీవనిశాప - ఐ ఝ; మనియును శాపమనఘుడిచ్చె - ఘ. చ.
వీ. శ. ష; మటంచు శాపమప్పుడిచ్చె - ఏ. ఔ.

119. వ. [1]విధివిలసితంబు పేర్మి నీకే మని చెప్పుదు.

120. చ. చదివితి నెల్లవేదములు [1]సత్క్రియ చేసితి నూఱుయజ్ఞముల్
విదితముగా సురేంద్రపదవీస్థితిఁ బొందితి దుర్మదంబునం
దుదిఁ బెనుబాముసై యధిక[2]దుఃఖుఁడనైతి సుఖంబుదుఃఖమున్
వదలక చేయుచోట బలవద్విధి కేమి[3]భరంబు సెప్పుమా.

121. వ. అయ్యగస్త్యుచేత నిట్లు శాపగ్రస్తుండనై శక్రాసనంబువలనం బాసి యిట వచ్చుచు నుండి మునీంద్రా నాకుఁ బూర్వస్మృతి సెడకుండను బలవంతంబు లైన సత్త్వంబులు నన్ను ముట్టునప్పుడ బలహీనంబులై భక్ష్యంబులుగాను శాపవిమోక్షంబున కుపాయంబును బ్రసాదింపు మని కృతాంజలినై యున్న నాకుం గరుణించి మునివరుండు నావేఁడిన వరంబు లిచ్చి వెండియు నిట్లనియె.

122. క. క్రమమున నీ[1]చేసినప్రశ్నములకుఁ బ్రత్యుత్తరములు సన్మతి నత్యు
త్తముఁ డెవ్వఁ డిచ్చు నతనిక, తమునను శాపాంతమగు బుధస్తుత నీకుఁ.

123. వ. అది దీర్ఘకాలంబునంగాని కాదనియె నేనును దద్వచనం [1]బవలంబించి పెద్ద కాలం బియ్యడవి నున్నవాఁడ నేఁడు నీతమ్ముఁడు [2]నాకు నష్టప్రాప్తం బైన భక్ష్యం బయ్యె నోపుదేని నాప్రశ్నములకుఁ బ్రత్యుత్తరంబు లిచ్చి వీని విడిపించు కొమ్మనిన ధర్మజుం డి ట్లనియె.

124. క. [1]నీయడిగిన యర్థాభిప్రాయములకు నుత్తరంబు పరువడిఁ జెప్పన్
ధీయుత బ్రాహ్మణులకుఁ గా, కాయతమతు లయ్యు నొరుల[2]కవి విషయములే.

---

119. 1. అని పలికి మరియు నిట్లనియె - డ.

120. 1. సద్విధి - వా; సత్కృతి - కొన్ని ప్రతులు; సన్మత - ల; సంస్కృతి - శ; సత్క్రియ - కొన్ని ప్రతులు. 2. దుఃఖితుఁడైతి - వా. కొన్ని ప్రతులు; దుఃఖుడనై - ఝ. పీ. శ. ష. కొన్ని ప్రతులు. 3. ఫలంబు - ల.

122. 1. యడిగిన - వా; చేసిన - పెక్కు ప్రతులు.

123. 1. బిచ్చనమ్మి - వా; బవలంబించి - పెక్కు ప్రతులు. 2. దుష్టకాల ప్రాప్తుండై నాకు - వా; లబ్ధకాల ప్రాప్తుండై - ఇ; నాకునష్టప్రాప్తంబైన - ల.

124. 1. నీయడిగెడునర్థా - కొన్ని ప్రతులు. 2. కలవియెచెప్పన్ - వా. సం; కవి విషయములే - పీ. శ. ష. స. కొన్ని ప్రతులు.

-: ధర్మరాజు నహుషప్రశ్నంబులకుఁ బ్రత్యుత్తరంబులిచ్చుట :-

సం. 3 – 177 – 13

125. వ. అయినను నానేర్చువిధంబునం జెప్పెద నడుగుమనిన నజగరం బిట్లనియె.

126. ఆ. ఘనుఁడ యేగుణములు గలవాఁడు బ్రాహ్మణుం, డతని కెఱుఁగఁ దగిన యట్టివస్తు
[1]వెద్ది దీని నాకు నెఱిఁగింపు మనిన ని,ట్లనుచుఁ జెప్పెఁ బాండవాగ్రజుండు.

127. సీ. సత్యంబు మా[1]దమ శౌచదయాతపోదానశీలంబు లెందేనిఁ గాన
నగునట్టివాఁడు బ్రాహ్మణుఁ[2]డు సుఖంబుదుఃఖంబునై నెడవిమో[3]హంబునొంద
కునికియ వానికి నుత్తమం బగు[4]విద్య యనిన నీచెప్పిన [5]గుణము లివియు
క్రియ శూద్రునందుఁ గల్గిన నతం డుత్తమద్విజుఁడుగా నేర్చునే నిజము విడిచి
ఆ. నట్టు లయిన బ్రాహ్మణాదివర్ణ[6]విభాగ, మెట్లు గలుగునయ్య హీను లధికు
లను వివేక మదియపార్థకం బగుఁగాదె, యనిన ననియె నంతకాత్మజుండు.

128. వ. ప్రమాదంబున వర్ణసంకరం బయినప్పుడు వర్ణపరీక్షార్థంబుగా బ్రాహ్మణాదులకు వృత్తంబు వేఱువేఱ స్వాయంభువుండైన మనువు సెప్పె సత్యాది గుణంబులు శూద్రునందుఁ గలిగినేని వాఁడు సచ్ఛూద్రుండుఁగాక బ్రాహ్మణుండు గానేర్చునే యవి బ్రాహ్మణునందులేనినాఁడు శూద్రుం డనంబడు గావున [1]వృత్తంబ యుత్తమంబు.

---

126. 1. వెట్టిదిదియు నాకు – డ. స.

127. 1. ధర్మ – ఎ. ఏ. ఒ. ఓ. క. స. 2. డగుసుఖము – వా; దుసుఖంబు – పెక్కు ప్రతులు. 3. హామునుబొంద – వా; హంబునొంద – పెక్కు ప్రతులు. 4. వేద్య మనిన –? వా. కొన్ని ప్రతులు; విద్యయనిన – వీ. శ. ష. కొన్ని ప్రతులు. 5. యగ్గుణములు – వా. వీ. శ. ష. కొన్ని ప్రతులు. ప్రాసయతి నియమభంగము; గుణములివియు – పెక్కు ప్రతులు. 6. విభేదమేల చెప్పుమయ్య – పెక్కు ప్రతులు.

128. 1. వృత్తంబె – కొన్ని ప్రతులు; వృత్తంబుల – వా. వీ. శ. ష. ట; వృత్తంబ – కొన్ని ప్రతులు.

129. తే. [1]వృత్తవంతుండు వెండియు వివిధగతుల, వృత్తవంతుండు గా
నేర్చు వృత్తహీనుఁ
డైనవాఁడు విహీనుండ యంద్రుగాన, విత్తరక్షకుఁ గడుమేలు వృత్తరక్ష.

130. వ. అనిన నజగరం బిట్లనియె.

131. వ. [1]అప్రియంబు జేసియు మఱియు నృతవాది, యయ్యు హింస
గావింపని యమ్మహాత్ముఁ
డేఁగు సుగతికి నంద్రదది [2]యెట్లహింస, యనఘ యింతవిశేషమె ట్లయ్యె
చెపుమ.

132. వ. అనిన ధర్మతనయుం డిట్లనియె [1]దానంబును బ్రియరంబుచేఁతయును సత్యంబును నహింసయు ననునవి నాలుగును సమంబులయయినను నహింస విశేషం బెట్లనిన దేవమనుష్యతిర్యగ్యోనులను మూఁడుగతులయందును మనుష్యుండు దానాదిగుణంబులు గలిగి యహింసాపరుం డయిన దేవగతి వడయు [2]విపరీతవర్తనుండు తిర్యగ్యోనులం బొందు నని యిట్లు తనచేసినప్రశ్నంబులకు [3]నుత్తరంబులుచెప్పిన ధర్మరాజున కతిప్రీతుండై భీమసేనుని విడిచి శాపవిముక్తుండై దివ్యరూపంబు సేకొనియున్న [4]నహుషువలన నధ్యాత్మవిద్యారహస్యంబు లిమ్ముగా నెఱింగి యుధిష్ఠిరుండు వృకోదరుం దోడ్కొని నిజాశ్రమంబునకు వచ్చి యున్నంత.

---

129. 1. విత్తహీనుండు వెండియు వివిధవిధుల విత్తవంతుండుగా నేర్చు వృత్తహీనుఁ – అ. ఝ. ట. వా; వృత్తవంతుండు వెండియు వివిధగతుల వృత్తవంతుండుగా నేర్చు వృత్తహీను – కొన్ని ప్రతులు.

131. 1. అప్రియంబొగి జేసియు నన్నృత–వా. పీ. శ. ప. ట; అప్రియంబు జేసియు మఱి యన్నృత – పెక్కు ప్రతులు. 2. యెట్లు సెప్పుమయ్య యనఘ యహింసమేలైన తెరగు – వా. ట; యెట్లహింస యనఘ యింత విశేషమెట్లయ్యె చెపుమ – పెక్కు ప్రతులు.

132. 1. దానంబు ప్రియంబు సత్యంబు నహింసయునను – ల. 2. విపరీతవర్తనుండు – పెక్కు ప్రతులు; విపరీతుండై – వా. 3. ప్రత్యుత్తరంబులు పలికిన ధర్మనందనున – వా; నుత్తరంబులు చెప్పిన ధర్మరాజున–కొన్ని ప్రతులు. 4. నహుషుం జూచి ధర్మతనయుండు సంతోసిల్లి యతనివలన – వా. ట; నహుషువలన – పెక్కు ప్రతులు.

133. క. ఖర[1]కిరణతాపమున నురు,తరదవదాహమున శోషితములైన వనాం
తరతరుతతి కాప్యాయన,కరమై వర్షాగమంబు గడు బెడఁగయ్యెన్.

134. క. నాలుగు కెలఁకుల నవఘన,జాలంబులు ద్రేవి కురిసె ఝంఝానిలవే
గాలోలములై బహుల,స్థూలపయోధార లోలిఁ దుములంబులుగాన్.

135. క. ఘనతర[1]ధర్మతమం బొకొ, యనఁగ [2]ఘనాఘన తమిస్ర మ[3]విరళమై క
ప్పినజనులకు వస్తువిభా,వన మొక్కొక[4]మాటు గలిగె వైద్యుతరుచులన్.

136. చ. అరుదుగ తత్పయోదసమయంబున నొక్కట విస్తరిల్లె నం
బరమున నంబుదధ్వనియుఁ బల్వలభూముల భూరి దర్దురో
త్కరరవముల్ మహీరుహా[1]శిఖండములందు శిఖండి తాండవాం
తరమదమంజులస్వనము [2]దారతరంబగుచున్ వనంబునన్.

137. చ. దళితనవీనకందళకదంబకదంబకకేతకీరజో
మిళితసుగంధబంధుర[1]సమీరణ మన్ సఖి యూఁచు చుండఁగా
నులియుచు [2]పువ్వుగుత్తులను నుయ్యెల లొప్పగ నెక్కి యూఁగె ను
ల్లలదళినీకులంబు [3]మృదులధ్వనిగీతము [4]విస్తరించుచున్.

---

133. 1. కిరణాతపమున - ఈ. త. శ.

135. 1. నైశతమం-వా. కొన్ని ప్రతులు; ధర్మ - ఈ. ఐ. త. పీ. శ. ష. 2. ఘనా గమ - వా. కొన్ని ప్రతులు; ఘనాఘన - పీ. శ. ష. కొన్ని ప్రతులు 3. విరళ - పెక్కు ప్రతులు; పికల - వా. 4. యెడల - ఆ. ఉ. గ. ట. వా; మాటు - పీ. శ. ష. స. పెక్కు ప్రతులు.

136. శిఖాంతములందు - ఎ. ఓ. వా; శిఖండములందు - అనునదియే పెక్కు ప్రతులలోఁ గలదు. ఈ పాఠము అఖండయతి దోషమును కూడ తొలగించుచున్నది శిఖండ - తీగమల్లెలు; వృక్షాగ్రములు. 2. దానతిరమ్యములై వనంబునన్ - గ. ద. ట. వా; దారతరంబగుచున్ వనంబునన్ - పీ. శ. ష. స పెక్కు ప్రతులు.

137. 1. సమీరణుఁడన్ సఖుఁడూచు - వా. సం. సూ. సమీరణమన్ సఖియూచు - కొన్ని ప్రతులు. 2. మొల్లగుత్తుల - వా. కొన్ని ప్రతులు; పువ్వుగుత్తుల - పీ. శ. ష. కొన్ని ప్రతులు. 3. మధుర - ఝ. ('రల' లకుయతి); లతులధ్వని-ఔ.ద. 4. విస్తరిల్లగన్ - ఇ. ఏ. జ. ల.

138. క. సురచాపచిత్రగగన,[1]స్ఫురణం బురణించునట్లు భూవనిత నిరం
తరచిత్రితయై యొప్పెను, సురుచిర నవతృణ[2]శిలీంధ్ర సురగోపములన్.

139. వ. తత్సమయానంతరంబున.

140. ఉ. [1]భూసతికిం దివంబునకుఁ బోల్పఁగఁ గంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకరమై [2]విలసిల్లె మహర్షి మండలో
[3]పాసితరాజహంసగతి[4]భాతిప్రసన్నసరస్వతీకమ
బ్జాసనశోభితం [5]బగుచు నబ్జజుయానముతో సమానమై.

141. ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణక
ర్పూరపరాగపాండురుచిపూరములం బరిపూరితంబు[1]లై.

నన్నయభట్టకవిత్వము సంపూర్ణము

---

138. 1. స్ఫురణము బురుడించునట్లు – ర. వీ; స్ఫురణంబురుణించునట్లు – వా; స్ఫురణంబురణించునట్లు – పెక్కు ప్రతులు. 2. శిఖీంద్ర – అ. ఈ. ఉ. ఐ. చ. ఝ. త.

140. 1. 'ఉ' ప్రతిలో – ఈ పద్యముతో ఎఱ్ఱాప్రెగడ కవిత్వమారంభమని యున్నది. 2. విలసిల్లు – ఛం. 3. ద్భాసిత – అ. ఒ. గ డ. ద. 4. భాసి – వా; కొన్ని ప్రతులు; శారి ఇ. ఏ; భాతి – ఒ. ఘ. జ. వీ. శ. ష. 5. బనగ – ఊ. ఓ. చ.

141. 1. ఈ పద్యముతో నన్నయభట్టకవిత్వము సమాప్తమైనదని అన్ని ప్రతులు (ఉ – తప్ప).

-: ఇక్కడనుండి యెఱ్ఱాప్రెగ్గడ కవిత్వము :-

142. చ. [1]స్ఫురదరుణాంశు[2]రాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంససారసమధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ
గరము [3]వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్.

143. శా. దానాంభః[1]పటలంబునం బృథుపయోధారావలిం దాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహిత[2]చ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గె నాఁ
గానొప్పారె మదోత్కటద్విరదసంఘంబుల్ [3]వనాంతంబునన్.

---

142. 1. ఛా. ప్రతిలో ఈ క్రిందనున్న పాఠము అధికముగాఁగలదు.

శ్లో. మునిం స్నిగ్ధాంబుదాభాసం వేదవ్యాసమకల్మషం ।
వేదావాసం సరస్వత్యావాసం వ్యాసం నమామ్యహమ్ ।
వ. అని.

సీ. భవ్యచరిత్రుఁడాపస్తంబసూత్రుఁడు శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు సూరనార్యునకును బోతమాంబికకును
నందనుండిల పాకనాటిలో నీలకంఠేశ్వరస్థానమై యెసగ యెసగు
గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పుధన్యుండు ధర్మతాత్పర్యనిరతుఁ

గీ. డెఱ్ఱనార్యుండు సకలలోకైక విదితుఁ
డైన నన్నయభట్ట మహాకవీంద్ర
సరససారస్వతాంశప్రశస్తి తన్నుఁ
జెందుటయు సాధుజన హర్ష సిద్ధిగోరి.

కం. ధీరవిచారుడు తత్కవి, తారూఢియు కొంతదోవ,ప్రచనయకా
నారణ్యపర్వశేషము, పూరింపఁగడంగె కర్ణపుట పేయముగాన్.
వ. అది యెట్లనిన.

2. రాగమున - ఇ. ప. 3. వెలుంగె - కొన్ని ప్రతులు.

143. 1. ప్రకటంబునం - ఠ. ఢ; కపటంబునం - అ. ఇ. ఏ. ఒ. ఘ. ఙ. ఌ. 2. చ్ఛలన
మాచ్ఛాదించి - అ. ఝ; చ్ఛలననాచ్ఛాదించి-ఈ. ఐ. ఛా. త. 3. వనాంతంబు
లన్ - కొన్ని ప్రతులు.

144\. క. కలనీలకంఠకోలా,హల[1]లీలలు [2]సెలఁగె రాజహంస[3]కులంబుల్
విలసించె సప్తపర్ణా,వలివిగళితకుసుమ[4]కుటజవాటిక[5]లడరెన్.

145\. మ. అతిగాంభీర్యవిభూతి నేకచులుకాహంకారనిశ్శేషశో
షితపాథోధిపయస్కుఁడై నముని దోఁచెం బుణ్యతేజోమయా
కృతి నయ్యామ్యదిగంతవీథిఁ బ్రకటక్రీడాకళాగర్వగ
ర్జితమండూకకళంకితాంబుళుచితా[1]సిద్ధిప్రదాచార్యుఁడై.

146\. తే. విశదశారదాంబుదపరివేష్టనమునఁ, బొలుచు గగనంబు ప్రతి[1]బింబములో యనంగ
వికచకాశ[2]వనీపరివేష్టనమున, నతిశయిల్లె నిర్మలకమలాకరములు.

147\. వ. అట్టి [1]శారదాగమంబున [2]నుత్ఫుల్లకమలకల్హారకేసరకరాళకలితకల్లోల మాలినియు ననేకమునిలోకసతతసంసేవ్యమానవిపులపు[3]లినోత్సంగయు నిరంతరతీర[4]వానీరవనమండలీవిలసితయు నాకాశసంకాశవిశదసలిలయునైన [5]సరస్వతీమహానది ననుదినస్నానపానాదివిశేషంబులం బరితోషంబు నొందుచుఁ బాండునందను[6]లు మరుభూమిం గొన్నిదినంబులు వసియించి తదనంతరంబ ధౌమ్యాది భూసురులు నింద్రసేనాదిభృత్యులు దోడ నరుగుదేరఁ గామ్యకవనంబునకు వచ్చి [7]యచ్చటి మునులచేత నభినందితులై యందు సముచితవర్తనంబుల నున్నంత నొక్కనాఁడు.

---

144\. 1. ములుసెలరేగె - అ. ఈ. ఐ. ఠ. ఝ. త. 2. సెందె - స. కొన్ని ప్రతులు. 3. కులములందిలకించె - వా; కులంబుల్ విలసించె - కొన్ని ప్రతులు. 4. గంధవైభవ మొలసెన్-ఇ. ఏ. 5. లడరెన్ - ల; లడగెన్ - వా; లందున్ - శ. ష. కొన్ని ప్రతులు; వెలసెన్ - ఔ.

145\. 1. సిద్ధవ్రతాచారుడై -అ. ఇ. ఊ. ఏ. క. ఘ. చ. న; సిద్ధవ్రతోపాధ్యుడై -ఆ. ఈ. ఐ. త; రిష్టవ్రతాచార్యుఁడై - డ.

146\. 1. బింబమోయనంగ - వా. కొన్ని ప్రతులు; బింబములోయనంగ - కొన్ని ప్రతులు. 2. వనావలివేష్టనమున - ఆ. ఉ. ఊ. ఎ. ఏ. ఒ. ఓ. ఔ. గ. చ. జ.

147\. 1. శారద సమయంబున - వీ. శ. ష. 2. నంపుల్ల - అ. ఇ. ఈ. ఏ. ఐ. ఝ. త. 3. పులినోత్సంగతలయు - వీ. శ. ష; పులినోత్సంగసంగయు - ఈ. ఐ. ఠ. త. 4. వాసితతాపసమండలీ - శ. ష; వాసితవనమండలీ - పెక్కు ప్రతులు; వాసితరాజహంస - వీ. వానీరవేతసవనమండలీ - వా. 5. సరస్వతీనది - వీ. శ. ష. 6. లమ్మరు - వా; లుమరు - పెక్కు ప్రతులు. 7. యందుల - క.

148. క. వాసవ[1]నందనసఖుఁ డగు, భూసురుఁ డొకఁ డరుగుదెంచి భూవినుతగుణో
ద్భాసితు ధర్మజు విప్రస, భాసీనుం గాంచి [2]యిట్టు లనియెం బ్రీతిన్.

149. చ. జనవర నీవుఁ దమ్ములును సమ్మద[1]మొప్పగ నివ్వనంబునం
దునికి ధ్రువంబుగా విని మహోజ్జ్వలతేజుఁడు దేవకీసుతుం
డనఘుఁడు మిమ్ముఁ జూచుటకునై [2]యిదె వచ్చుచునున్నవాఁడు మీ
[3]కును ననిశంబుఁ దా హితము కోరుచు నుండు నతండు నెయ్యుఁడై.

150. వ. మఱియు ననేకయుగసహస్రజీవియు నప్రమేయ[1]తపఃప్రభాసియు వినత విధేయుఁడునైన మార్కండేయుండును భవదీయదర్శనార్థం బీక్షణంబ చనుదెంచు నని చెప్పిన యనంతరముహూర్తంబున.

## -: శ్రీకృష్ణుఁడు సత్యభామతోడఁ బాండవుల యొద్దకు వచ్చుట :-

సం. 3 _ 180 _ 7

151. సీ. [1]శైబ్యసుగ్రీవాదిజవనాశ్వయుక్తమై యాబద్ధనూత్నరత్నాంశుపటల
[2]భాసితంబై చారుపతగ[3]పతాకావిభూషితగగనమై పొలుపు మిగులు
దివ్యరథంబున దేవకీసుతుఁడు ప్రియంబున సత్యభామాన్వితముగఁ
దరళసౌదామినీదామసముజ్జ్వలధారాధరోత్సంగతలమునందు

ఆ. శచియుఁ దాను వెలుఁగు [4]శతముఖుండునుబోలె, నరుగుదెంచె ఘనరథాంగనేమి
విపులఘోషతాండవితబర్హిశబ్దశ, బ్దాయమానవనవిభాగుఁ డగుచు.

---

148. 1. సఖుఁడనఁగాఁదగు–డ. 2. పలికె పరమప్రీతిన్–శ. ష; యనియెఁ బరమ ప్రీతిన్–శ.

149. 1. మందుచు – అ. ఆ. ఈ. ఐ. త; మొందగ – వా. కొన్ని ప్రతులు; మొప్పగ – ఘ. 2. యిట – వా. పెక్కు ప్రతులు; యిదె – అ. ఆ. ఒ. చ. ఝ. 3. కుననిశమున్ హితంబు మదికోరుచు – పెక్కు ప్రతులు; కునెపుడునున్ హితంబు మదిగోరుచు – ల.

150. 1. తపఃప్రభావ భావియు–వా; ప్రభావభావియు–ల; తపఃప్రభాసియు–కొన్ని ప్రతులు.

151. 1. సైన్య – వా; శైబ్య – మూలము శైబ్యసుగ్రీవయుక్తేన. 11–185–6 కుంభకోణంప్రతి. 2. భాసితంబైన సావర్ణపతాకాదిభూషిత – ప. శ. ష. 3. పతాకాదిభూషిత – పెక్కు ప్రతులు; పతాకాభిభూషిత – అ. జ. ల. 4. శతమన్యుఁడును– వా; శతముఖుండును – పెక్కు ప్రతులు.

152. వ. ఇట్లు వచ్చి వాసుదేవుండు రథావతరణంబుసేసి ధర్మనందనున కభివందనం బొనరించి భీమార్జుననకులసహదేవులం గౌఁగిలించుకొని ద్రౌపదిం గారవించి ధౌమ్యాదిమహీవరులచేత నభినందితుండయ్యె నంతఁ గౌంతేయాగ్రజుండు [1]గదాధరునకు నర్ఘ్యాదిసత్కారంబులు నిర్వర్తించి తమ్ములుం దానును విప్రజనంబులు నతనిం బరివేష్టించి యుండి రప్పుడు కృష్ణుండు ధనంజయుం దన చేరువ నునిచికొని చిరకాలదర్శనోల్లసితంబులైన యాలోకనంబుల నతని యాకారం బత్యాదరంబున నభినందించి ధర్మరాజున కిట్లనిగెు.

153. సీ. భాగ్యంబుగాదె యీపార్థుండు హరుఁ డాదియైన నిర్జరసమూహంబువలన
నెలమిఁ గృతాస్త్రుడై యేతెంచు టరయంగ ధన్యుండ [1]వైతివి ధర్మతనయ
నీధర్మనిష్ఠయు నీతపంబును జూవె యింతకుఁ గారణం బిద్ధచరిత
రాజ్యంబుకంటెను రాజేంద్ర [2]ధర్మంబె యిష్టమై యుండు నీకెల్లనాఁడు
తే. వేదవేదాంగవిదుఁడవు వివిధయజ్ఞ, కర్తవైతి ధనుర్వేదకర్మఠుఁడవు
ధరణి యెల్ల [4]నేలెడిరాజధర్మమమర, సులభమయ్యె నీకిహపరశోభనంబు.

154. చ. దమమును [1]సత్యయుక్తియును ధైర్యనిరూఢియు నిత్యతృప్తియుఁ
శమమును నీకునైజములు సన్మతి నర్థవశంబుఁ గామలో
భములును బొందవట్లగుటఁ బార్థివకుంజర ధర్మరాజనా
మమునఁ ద్రిలోకపూజ్యమహిమం బొగడొందెద [2]విశ్వధంబునన్.

155. వ. అని వెండియు.

---

152. 1. గరుడధ్వజునకు – క. వీ. శ. ష. స; గదాగ్రజునకు – వా. కొన్ని ప్రతులు; నగధరునకు – ల; గదాధరు – పెక్కు ప్రతులు.

153. 1. వైతీవు – వా. కొన్ని ప్రతులు; వైతివి – కొన్ని ప్రతులు. 2. ధర్మమె, ధర్మము – అ. ఝ; ధర్మంబు – వా. కొన్ని ప్రతులు; ధర్మంబె – కొన్ని ప్రతులు. 3. కర్మఠుండ (సంబుద్ధి) – ఈ. ఊ. ఘ. త; కర్మరతుడ – అ. క; కర్మపరుడ – ఔ. ద. 4. నేలితి – పెక్కు ప్రతులు. 5. శోభనములు – వా. కొన్ని ప్రతులు; శోభనంబు – కొన్ని ప్రతులు.

154. 1. సత్యముండయయు – ఊ. ఘ. చ. డ. వి. 2. వెల్లకాలమున్ – వా; విశ్వధంబునన్ – పెక్కు ప్రతులు.

156. శా. ద్యూతవ్యాజమునన్ సభాంగణమునన్ దుర్యోధనుం డట్లు దు
ర్నీతిం [1]గూరి యొనర్చి నట్టి యఘముల్ నిష్కంప [2]ధైర్యోన్నమ
చ్చేతస్స్ఫారుఁడవైన నీకొకనికిం జెల్లెన్ సహింపంగ [3]వి
ఖ్యాతక్షాంతులు లేరె ధార్మికులు నిక్కం బిట్టిరే యెవ్వరున్.

157. ఉ. ఉల్లము [1]సత్యసంయమము నూనినవాఁడవు నీవు విక్రమం
బొల్లమిఁ గౌరవాధముల యుద్ధతి యమ్మెయిఁ జెల్లెఁగాక యొం
డెల్లను నేల నీదుమది నించుక కిన్క జనించినన్ మహీ
వల్లభ యప్డ రూపఱదె వారక వైరికులంబు సర్వమున్.

158. చ. వినుత భవన్ని[1]యోగ మను వేల యలంఘ్యము గాన యిమ్మెయిన్
ఘనభుజవీచివిభ్రమవికాసముఁ జూపక నిల్చెఁగాక స
జ్జనసుత చూడ నీయనుజసాగరముల్ దటితోడ విద్విష
జ్జనలయకాలులై [2]కడఁగు సర్వజగంబులు నాక్రమింపఁగన్.

159. ఉ. అంధకవృష్ణిభోజకుకురాన్వయభూపతులెల్ల నీదెసన్
బాంధవసౌహృదప్రణయభక్తివిశేషము లొప్ప నీమనో
గ్రంధి యడంగఁ జేయ నెసకంబునఁ బూనినవారు [1]లోభమో
హాంధులు ధార్తరాష్ట్రులు [2]జనాధిప మార్కొనువారె వారలన్.

160. క. చతురంభోధిపరీత, క్షితితలసామ్రాజ్యలక్ష్మికిం బతివి జగ
న్నుత నీవ [1]నీవు దలఁచిన, నతిదుష్కర మెందు లే దనర్గళమహిమన్.

---

156. 1. గ్రూరు డొనర్చినట్టి – ట. డ. ల. స; గూడి – ఆ. ఈ. ఊ. ఒ. ఓ. కసం. గు. ఝ. ద. 2. ధైర్యోన్నతిన్ జేతః స్ఫారుడ – వా; ధైర్యోన్నమచ్చేత స్స్ఫారుడ – కొన్ని ప్రతులు. 3. విఖ్యాతిం బొల్పగు ధార్మికుల్ గలరె యింకం పృథ్విలో నెవ్వరున్ – త. ద. పీ. శ. ష; విఖ్యాతుల్ధార్మికు లిద్ధపుణ్యులును – డ.

157. 1.-సత్యసంశయము నొందిన – వా; సత్యసమ్మతమునూనిన – కొన్ని ప్రతులు; సత్య సంయమము నూనిన – స. కొన్ని ప్రతులు.

158. 1. దేశ – ఒ. స. 2. కడగి సర్వజగంబుల నాక్రమింపవే – వా. కొన్ని ప్రతులు.

159. 1. కామలోభాంధులు – చ. 2. నయంబు మెయిన్ మనకుర్వి నిత్తురే – భ. గ.

160. 1. నీతలంపునకలి – ఓ. డ.

161\. వ. అనిన సంతసిల్లి కుంతీనందనుండు దేవకీనందనుతోడ దేవా యెవ్విధంబున నైన నల్పావశిష్టం బైన వనవాసకాలంబును నజ్ఞాతవర్తనంబును దీర్చి లోకనింద్యంబు గాని విక్రమంబునం బగఱ జయింపఁగోరెదము దీని నంతయు నిర్వహించుభారంబు నీయదియ నిన్ను శరణంబు సొచ్చిన మాకుం బరమ శోభనంబులును సులభంబు లగుట నిశ్చయంబు గాదె యనియె నప్పుడు కృష్ణుండు నిజసమీపంబున నున్న పాంచాలిం జూచి యిట్లనియె.

162\. సీ. [1]నీపుత్త్రు లేవురు నీరజలోచన యదుకుమారులఁ దారు ముదముతోడ
ననుపమస్నేహసమాహితహృదయులై కరిహయారోహణపరతఁ దగిలి
యాడుచు వివిధశస్త్రాస్త్ర[2]ప్రయోగముల్ గఱచుచు నొండెల్ల మఱచి యున్న
వారు ప్రద్యుమ్నుండు వారికి దివ్యాస్త్రజాతంబు లెల్లను బ్రీతినొసఁగెఁ
ఆ. దన్వి యాసుభద్ర తనపుత్త్రుకంటె నీ, తనయులందుఁ గూర్మిఁ దనరఁజేయు
నూఱడిల్లు మింక నుజ్జ్వలోన్నతులఁ బెం, పారఁ గాల మనతి దూరమయ్యె.

-: *మార్కండేయుండను మహాముని పాండవుల యొద్దకు వచ్చుట* :-

సం. 3 - 180 - 39

163\. వ. అని యాశ్వాసించు[1]సమయంబునం బరమతపోవృద్ధుం డయిన మార్కండేయుండు సనుదెంచినం గృష్ణుండును బాండవులు నతని నెదుర్కొని యథోచితవిధులం బూజించిరి మునీంద్రుఁడును బ్రత్యేకంబ వారి కుశలంబు లడిగెఁ దదనంతరంబ యందఱు నాసీనులై యున్నయెడఁ బాండవహితార్థియై వనజోదరుం డమ్మునివరున కిట్లనియె.

164\. ఉ. ఏనును బాండునందనులు నిమ్మునిముఖ్యులు [1]నిప్డు లోకస
మ్మానితవాక్య నీదయిన మంజులవాగమృతప్రవాహముల్
వీనుల[2]దోయి నించుచును వేడుకఁ గ్రోలికొనంగ నాత్మలం
బూనెద మస్మదీప్సితము పూర్ణము సేయఁగ నర్హ మెమ్మెయిన్.

---

162\. 1. నీపుత్త్రులిప్పుడు - ర. డ. వీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. విశేషముల్ - వా. వీ. శ. ష. కొన్ని ప్రతులు; ప్రయోగముల్ - కొన్ని ప్రతులు.

163\. 1. యవసరంబున - కొన్ని ప్రతులు.

164\. 1. నీవు - కొన్ని ప్రతులు; సర్వ - ల. 2. దోయిలించుచును - ఝ. స; దోయిలింపుచును - డ.

165. వ. కావున.

166. క. దేవనరదేవధరణీ, దేవచరిత్రములు భర్తృదేవత లనఁగా
భూవినుత లయినసతులప్ర, భావము లెఱిఁగింపు మోలిఁ బ్రస్ఫుటములుగన్.

167. వ. అని యడుగుచున్నయెడ నారదుం [1]డేఁగుదెంచిన నందఱు ప్రత్యుద్గతు లయి ప్రణమిల్లి యాతని [2]నుచితసత్కారంబులం బ్రీతునిం జేసిన నమ్మహా మునిమార్కండేయునిం జూచి కృష్ణపాండవ[3]ప్రియార్థంబుగాఁ బరమపుణ్య కథాకథనం బొనరింతువు గాకయని పలికి వారల నామంత్రణంబుసేసి నిజేచ్ఛం జనియెఁ దదనంతరంబ ధర్మతనయుండు మార్కండేయున కిట్లనియె.

168. సీ. కడఁగి ధర్మముతోడ నడచుచు నేమిట్లు దందడి దుఃఖంబు [1]బొందుటయును
నేపుననెప్పుడు పాపంబు సేయుచు ధృతరాష్ట్రజులు సుఖోన్నతు లగుటయుఁ
గని యివ్విపర్యయమునకు నేనూహింతుఁ బాయక నరుఁ డిప్డు సేయుకర్మ
మున ఫల మిందుఁ బొందునొ పరలోకంబునందుఁ బొందునో యిందు
నందుఁ గనునో

ఆ. విశ్వకర్తయైన [2]యీశ్వరుఁగానని, పురుషుఁ గర్మఫలము [3]పొరయకున్నె
యొడలితోనఁ గృతము వెడలిపోవునొ యిది, దెలియవలయు నాకు
నలఘుపుణ్య.

169. వ. ఇంతయు నెఱింగింప నీవ యర్హుండ వనినఁ బరమజ్ఞాననిధియైన యత్తపోనిధి యతని కిట్లనియెఁ దొల్లి విధాత ప్రథమకల్పంబున నత్యంతనిర్మలంబులును ధర్మతంత్రంబులును నైన శరీరంబులు సృజియించె నట్లు పుట్టింపఁబడిన యా మనుష్యులు మహాసత్త్వసంపన్నులు సత్యవాదులు సత్యసంకల్పులు బ్రహ్మ భూతాత్ములు స్వచ్ఛందజీవులునై దేవయానంబుల విహరించుచు ననా

---

167. 1. దరుగుదెంచి – ఆ. ఇ. ఎ. ఐ. ఓ. ఘ. ఝ. 2. నుచిత పీఠంబున నుచితసత్కారంబులం – వా; నుచిత సత్కారంబులం – పెక్కు ప్రతులు. 3. ప్రియహితార్థం– వా; ప్రియార్థం – కొన్ని ప్రతులు.

168. 1. బొందుటయును – ఝ. పీ. శ. శర. ష. సూ. 2. యీశ్వరునిది కాని – అ; యీశ్వరునదికాని – క. ష; యీశ్వరునకుగాక – శ; యీశ్వరునినకాని – వా; యీశ్వరుగానని – ఎ. ఏ. 3. లొరయకున్నె–డ; బొందకున్నె – ఇ. గ.

యాసంబున నధికఫలసిద్ధిం బొందుచు [1]సర్వధర్మజ్ఞులై విగతమత్సరులై బహుసహస్రసంతానులై [2]బహుసహస్రసంవత్సరాయుష్యులై వర్తిల్లుచుండి రంతఁ గాలాంతరంబునం గామక్రోధాదిగుణంబులు దమ్ముం బొందుటయు మాయాప్రవర్తనులై దేవతలచేత విడువంబడి యల్పాయువులు నల్పబల శరీరసత్త్వులును దరిద్రులును నిష్ఫలారంభులును బహురోగపీడితులును నాస్తికులును నై యొండొరుల మెచ్చక దురితంబులు సేయుచుఁ దిర్య గ్యోనులం బుట్టుచు నరకాగ్నులం [3]గ్రాఁగుచు గతాగతభ్రమణంబుల [4]నలయం దొడంగి రిట్లు దిరుగుచున్న సంసారచక్రంబునందు.

170\. చ. మనుజులు పుణ్యపాపములు మానక [1]యిట్లొనరించుచుం దుదిం
దనువు దొఱంగి పోవునెడఁ దప్పదు నీడయపోలెఁ గర్మము౯
వెనుకన యేఁగి భూరిసుఖ[2]విస్మృతియుం బటుదుఃఖదైన్యముం
[3]దనుకఁగఁ జేయు గ్రమ్మఱఁగ దాన యొనర్చు [4]భవంబు దేహికి౯.

171\. క. విను మనుజున కెవ్విధమునఁ, దనచేసిన సుకృతదుష్కృతంబులు నెఱయం
దన కనుభవింపఁ జాలివి, తనువు సెడుం గాని కర్మతతి సెడ దనఘా.

172\. వ. మఱియు నొక్క [1]నిదర్శనంబు సెప్పెద.

173\. క. ఈలోకము [1]యగుఁ గొందఱ, కాలోకము కొందఱకు నిహంబును బరమున్
మేలగుఁ గొందఱ కధిపా, యేలోకము లేదు [2]వినవె యిలఁ గొందఱకున్.

174\. వ. అది యెట్లంటేని.

---

169\. 1. సర్వజ్ఞులై – వా. శ. ష; సర్వధర్మజ్ఞులై – పెక్కు ప్రతులు. 2. బహుసహస్ర సంవత్సర – పెక్కు ప్రతులు; బహుసంవత్సర – వా. 3. వేగుచు, వెచ్చుచు – భిన్నప్రతులు. 4. నవయం – ర.

170\. 1. యిందొనరించు – పెక్కు ప్రతులు. 2. విచ్యుతియుం – త. శ; వికృతియుం – డ; విస్మృతియుం – వా. కొన్ని ప్రతులు. 3. దనరగ – జా. 4. వరంబు – క.

172\. 1. విశేషంబు – ఘ. శ. ష.

173\. 1. యును – ఒ. క. జ. ర. స. సూ. 2. సూవె – వా; వినవె – పెక్కు ప్రతులు.

175. చ. ధనములు సాలఁ గల్గి సతతంబును నింద్రియవాంఛ సల్పుచుఁ
మనమున నెన్నఁడుఁ సుకృతమార్గము [1]పొంతకుఁబోక లోభమో
హ[2]నిహతబుద్ధులై తిరుగునట్టిజనుల్ పరలోకసౌఖ్యముల్
గనుటకు నేర [3]రిప్పటి సుఖంబులు మేలయి తోఁచు వారికిఁ.

176. మ. ఉపవాసవ్రతసంతతాధ్యయన[1]తీర్థోపాసనాదిక్రియై
కపరత్వంబునఁ జేసి యైహికము దుఃఖ[2]ప్రాయ మై పోవఁగా
విపులానందముఁ బొందఁ గల్గుఁ దుది నావిర్భూత[3]భోగై కలో
లుపబుద్ధిం జిరపుణ్యశీలురకు నాలోకంబునన్ భూవరా.

177. ఉ. ధర్మమ [1]సల్పుచుం దగిలి ధర్మపథంబునఁ జేసి యర్థముం
చేర్మియుఁ గాంచి ధర్మవిధిఁ [2]బెండిలియై ప్రజలఁ సృజించి స
త్కర్మములం బ్రశస్తములుగాఁ గ్రతువుల్ [3]వొనరించు సజ్జనుల్
ధర్మజ యిందు నందును ముదంబునఁ గాంతు రభీష్ట[4]సౌఖ్యముల్.

178. ఆ. సత్యమును శమంబు శౌచంబు లేక నా, స్తిక్యమును నిషిద్ధసేవనంబు
గలిగి తిరుగు దుష్ట[1]కష్టజనశ్రేణి, పొలియు నుభయలోకములకుఁ గాక

179. వ. ఇది మనుష్యుల కర్మగతిప్రకారంబు.

---

175. 1. పొత్తున – ఝ; పొంతను – ఉ. గ. డ. ల. వి. 2. నియత – ఆ. ఉ. ఊ. ప. ఒ. చ. ఝ. ఠ. డ. త; నిహత–వా. కొన్ని ప్రతులు. 3. రిక్కడి–వా.సం; రప్పటి–ల.

176. 1. నిత్యోపాసనాది క్రియాతపితత్వంబున – త; తీర్థావాసనాది క్రియైక పరత్వంబు– డ. 2. ప్రాప్తమై – ఇ. ఏ. క. గ. ఝ. త.
3. యేయోగయుక్తాస్తపసిప్రసక్తాః
స్వాధ్యాయశీలాజరయన్తిదేహాన్
జితేంద్రియాభూతహితే నివిష్టా
స్తై షామసౌ నాయమరిఘ్నలోకః (11–186–38)

177. 1. పల్కుచుం – పెక్కు ప్రతులు. కాని, – గృహీతపాఠమే మూలానుగుణము. 2. బెండ్లియునై – ఘ. చ. 3. దనరించు – వా. కొన్ని ప్రతులు; వొనరించు – అ. జ. ఝ. 4. సంపదల్–ఊ. ఔ. చ. స.

178. 1. కలుష – డ.

180. చ. [1]జనవర మీరు దివ్యులరు సమ్మతి దేవహితార్థ మిమ్మహిన్
జననము నొందినారరు ప్రశస్తపరాక్రమలీలఁ బేర్చి యిం
క నఖిలశత్రునిర్మథన[2]కర్మ మొనర్చి మహీభరంబు దీ
ర్చి నియతిఁ బెక్కుజన్మములు సేసి [3]భజింతురు దేవభావమున్.

-: మార్కండేయుఁడు ధర్మజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట :-

సం 3_182_1

181. వ. అనిన విని ధర్మనందనుండు బ్రాహ్మణప్రభావంబు వినవలతుం జెప్పవే యనిన మార్కండేయుం డిట్లని చెప్పెఁ దొల్లి [1]హైహయవంశోద్భవుం డైన [2]ధుంధుమారుం డనుకుమారుండు మృగయాసక్తుం డై వనంబునఁ గ్రుమ్మరువాఁ డొక్కయెడం దృణలతా[3]గుల్మమధ్యంబునం గృష్ణాజినోత్తరీయుం డయి యున్నవాని నొకవిప్రు దవ్వులం గని మృగం బను[4]బుద్ధిం జేసి యేసి డాయం జని [5]నిశ్చేతనుండైన యతనింజూచి యత్యంత దుఃఖితుండయి పురంబునకుం బోయి నిజవంశవృద్ధులైన హైహయుల కంత వృత్తాంతంబునుం జెప్పి వారిం దోడ్కొని వచ్చి యవ్విప్రు[6]కళేబరంబు సూపిన.

182. తే. వారలదంఱు నందురి వగచి యచటి, కతిసమీపంబునను దార్క్ష్యుఁడను మునీంద్రు
నాశ్రమంబున్న నయ్యెడ కరిగి కనిరి, దేవమునిసిద్ధలోకప్రతీక్ష్యుఁదార్క్ష్యు.

---

180. 1. జనమత - వా. సం. కొన్ని ప్రతులు; జనవర - పెక్కు ప్రతులు. 2. కర్మము లన్ జయశీల వృత్తదీర్చి - స. 3. వహింతురు - ఆ.

181. 1. హైహయానాం కులకరో రాజా పరపురం జయః
కుమారో రూపసంపన్నో మృగయాం వ్యచరద్బలీ - అని
మాత్రమే మూలము 11-187-3. 2. సుకుమారుండను - కొన్ని ప్రతులు; దుందుమారుండను - ల. 3. వలీ మధ్యంబునం - పెక్కు ప్రతులు. 4. బుద్ధి నేసి - కొన్ని ప్రతులు. 5. నిజశరచ్ఛిన్నుండయిన - వా; నిశ్చేతనుండైన - పెక్కు ప్రతులు. 6. శరీరంబు - ఘు. పీ. శ. ష.

183\. క. కని భక్తిఁ బ్రమొక్కుటయు న, య్యనఘుఁడు దీవించి వారి [1]కర్హమ్మగు పూ
జనము లొనరింపఁ బంచెం, దనశిష్యులఁ బరమ[2]సంశ్రిత[3]వ్రతుఁడు దయన్.

184\. వ. హైహయులు నమ్మునీంద్రునకు సాష్టాంగదండప్రణామంబు సేసి మహాత్మా
యిక్కుమారుండు మృగయాసక్తుండై వచ్చి యింతకు మున్న యివ్వనంబున
నొక్కబ్రాహ్మణుం [1]గృష్ణాజినసంవృతు నతిశాంతుం బాపంబునం జేసి
మృగం బనుబుద్ధి నేసిన నతండు మృతుం డయ్యె నేము మహాపాతక
దూషితుల మైతిమి గావున మీచేయుసత్కారంబుల కర్హులము గా మి
ప్పాపంబున కెయ్యది నిష్కృతి యనిన నవ్వుచుఁ దార్క్ష్యుం డి ట్లనియె.

185\. క. [1]వినుఁ డెన్నఁడు మాయాశ్రమ, మున నెవ్వారలకు లేవు [2]భూరిభయవ్యా
ధినిరోధమృత్యు[3]దోషా, ద్యనేక[4]దుఃఖములు త్రిజగదాశ్చర్యముగన్.

186\. వ అని పలికి దనపుత్త్రు నధికతపోబలసమన్వితుం జూపి.

187\. క. [1]ఈతఁ డగు నె మీబాలకు, చేత నిహతుఁ డైనవాఁడు సెప్పఁ డనుడు వా
రాతఁడ తమమును [2]చూచిన, యాతం డగుటకు మహాద్భుతాత్మకులగుచున్.

---

183\. 1. కర్హములగు పూజనము – ఉ. ఝ. డ. పీ. శ. ష. 2. సంతత – ర. డ. కొన్ని ప్రతులు. 3. పరుండుదయన్ – వా. కొన్ని ప్రతులు; వ్రతుడుదగన్ – ల; వ్రతుడుదయన్ – కొన్ని ప్రతులు.

184\. 1. గృష్ణాజినావృతు–వా. కొన్ని ప్రతులు; గృష్ణాజిన సంవృతు – కొన్ని ప్రతులు.

185\. 1. వినమెన్నడు – డ. 2. మృత్యుభయ – ఇ. ఏ. దీనినిబట్టి 'ము, మృ' లకు యతి. 3. రోగాద్యనేక – ఉ; బాధాద్యనేక – ఈ. ఐ. 4. దురితములు – ఊ. ఎ. క. ఝ. ట; దోషంబులు – పెక్కు ప్రతులు.

187: 1. ఇతఁడగు మీ బాలకుచే
మృతుఁ డయ్యెనవాఁడు చెప్పుఁడాయనుడును వా
రతఁడు తమ మున్ను చూచిన
యతఁ డగుటకు నమ్మి మదిమహాద్భుత మనుచున్ – డ.
ఇతఁడామీబాలకుచే
హతుఁడై చనువాఁడు సెప్పుడనుటయు వారా
యతనిన్ దమమును సూచిన
యతఁడగుటకు నద్భుతాత్ము లగుచు నలరుచున్ – ఠ.
2. చూపిన – సం.

188. క. మృతుఁ డయిక్రమ్మఱ సంజీ, వితుఁ డయ్యె నితండు కరము విస్మయ మిది భూ
నుత యిట్టి మహిమకలిమికిఁ, గతమెయ్యది యానతిమ్ము [1]కారుణ్యమునన్.

189. వ. అని యడిగినఁ దార్క్ష్యుం డి ట్లనియె.

190. శా. ఆలస్యం బొకయింతలేదు శుచి యాహారంబు నిత్యక్రియా
జాలం బేమఱ మర్చనీయు లతిథుల్ సత్యంబ పల్కం బడున్
[1]మేలై శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిం దాల్తు మల్లాట నె
క్కాలంబుం బటురోగమృత్యుభయశంకం బొంద[2]మే మెన్నడున్.

191. వ. ఇది యస్మదీయ[1]ప్రభావంబు మీకుఁ [2]బాతకభయంబు వలవ దరుగుం డనినం దార్క్ష్యు వీడ్కొని హైహయులు నిజనివాసంబులకుం జనిరి భరతవంశోత్తమ యిట్టిది బ్రాహ్మణప్రభావం బని మఱియు మార్కండేయుండు బ్రహ్మక్షత్త్రస్వరూపనిదర్శనం బయినయొక్కయితిహాసంబు సెప్పెద విను మని ధర్మరాజున కి ట్లనియె.

192. చ. వినుతచరిత్రుఁ డత్రి యనువిప్రవరుండు తపంబొనర్పఁ గా
[1]ననమున కేఁగుచుండి తననాతిఁ గనుంగొని యిట్లనుం దపం
బున కిదె యేను బూని వనభూమికిఁ [2]బోవుచు నున్నవాఁడ నో
వనరుహ[3]నేత్ర నీవు నటవచ్చెదొ పుత్త్రులయొద్ద నుండెదో.

---

188. 1. కారుణ్యనిధీ – వా. కొన్ని ప్రతులు; కారుణ్యమునన్ – కొన్ని ప్రతులు.

190. 1. మేతా – గ. ట. వా; మేలై – పీ. శ. ష. పెక్కు ప్రతులు. 2. మేమిమ్ము లన్ – ఈ. ఒ. ఔ. క. గ. చ. పీ. శ. ష; మేమెప్పుడున్ – వా; మేమెన్నడున్ – కొన్ని ప్రతులు.

191. 1. ప్రభావమూలంబు – వా. కొన్ని ప్రతులు; ప్రభావంబు – ఆ. ఈ. ఐ. ఔ. ఝ. త. ద. 2. పాతకంబువలని భయంబువలవ – జ; పాతకంబువలని శంకవలవ – ఘ. పీ. శ. ష; పాతకభయంబువలన – వా.

192. 1. వనమున కేగుచుండిన వల్లభగన్గొని – ఈ. ఐ. గ. జ. త. పీ. శ. ష. స; వనమున – వా. పెక్కు ప్రతులు; ననమున – కొన్ని ప్రతులు. 2. నేగుచు – ఈ. ఐ. త. 3. నేత్రి – పెక్కు ప్రతులు.

193 చ. అనుటయు భార్య యి ట్లనియె నక్కట పుత్త్రులకుం గుటుంబభా
[1]రనియమవృత్తులెల్లను దిరంబుగఁ జేయక యాశ్రమాంతరం
బునకు మహాత్మ నీకు నిటు వోవుట ధర్మువు గాదు వైన్య భూ
జనపతి యిచ్చునర్థులకుఁ జాలఁగ నర్థము వేఁడు మవ్విభున్.

194. వ. అనినం గొండొక విచారించి భార్యపలుకులు ధర్మయుక్తంబు లగుటకు సంతసిల్లి యమ్మహాద్విజుం డప్పుడు చని యశ్వమేధాధ్వరదీక్షితుం డయి విప్రులకు నపారధనంబు లిచ్చుచున్న వైన్యుంగని యాశీర్వాదపురస్సరంబుగా ని ట్లనియె.

195. ఉ. నీవ విధాత వింద్రుఁడవు నీవ సమస్తజనేశ్వరుండవున్
నీవ యశేషధర్మములు నీవ యెఱుంగుదు నిన్నుఁ బోలఁగా
నీవసుధాతలంబున [1]మహీశ్వరు లెవ్వరు లేరు సన్మునీం
ద్రావలి యెప్డు నిన్నుఁ గొనియాడుఁ బరిస్ఫుటవాక్య [2]భంగులన్.

196. చ. అనిపలుకంగ గౌతమమహాముని యచ్చటనుండి యంతయుఁ
విని కలుషించి యేల యిటు [1]వీఁకున నోరఱుగంగఁ బ్రేలె దీ
జనపతియే విధాతయును శక్రుఁడు నీశుఁడు నర్థకాంక్షి వై
మనమున [2]శంకలేక యొకమానవు నింతనుతింప నేటికిన్.

-: అత్రిగౌతముల పరస్పర సంవాదము :-

సం. 3 – 183 – 11

197. వ. అనుటయు నత్రి యిట్లనియె.

---

193. 1. వనయగు వృత్తియెల్లను ధ్రువంబుగ – వా. కొన్ని ప్రతులు; రనియమ వృత్తులెల్లను దిరంబుగ – వీ. శ. ప. కొన్ని ప్రతులు.

195. 1. మహీశ్వర యెవ్వరు – వా. కొన్ని ప్రతులు; మహేశ్వరులెవ్వరు – పెక్కు ప్రతులు. 2. పద్ధతిన్ – ఘ. వీ. శ. ప.

196. 1. వీకను – వా. కొన్ని ప్రతులు; వీకున – కొన్ని ప్రతులు. 2. సిగ్గులేక – అ. ఉ. ఎ. ఝ.

198\. ఉ. ఊఱక మీఱ[1]నాడెదవు యుక్తమయుక్తము నాత్మఁజూడఁగా
నేరవు సర్వలోకములు నిర్మలనీతిపరాక్రమంబు లొ
ప్పారఁగ నేలి ధర్మముల కన్నిటికిం గుదురై వెలుంగు ధా
త్రీరమణుండు మేటిగ [2]నుతింపఁగ వోలదె నాకు నిమ్మెయిన్.

199\. వ. అని [1]తన్నాక్షేపించిన గౌతముండు.

200\. ఆ. కలయ[1]నరలువచ్చి తలలెల్లనైనంతఁ, జేసి నీకునెట్లుఁ జేరు నెఱుక
జ్ఞానవృద్ధుఁడైన వానిమాటలు గదా, సభలఁ జెల్లు నార్యజనుల కెక్క.

201\. వ. అనితొడంగి యయ్యిరువురు మహానాదంబుగా [1]వివాదంబు సేయుచుండఁ
గాశ్యపనామధేయుండైన ముని సభాసదులైన మునులం జూచి వీరల[2]వాదు
మనచేతఁ జక్కంబడదు సకలధర్మజ్ఞుం డయిన సనత్కుమారు నడుగుద మనిన
నాసదస్యు లందఱు సనత్కుమారుపాలికిం జని యత్రిగౌతముల వివాదంబు
తెఱంగెఱింగించిన నతండు వారల కిట్లనియె.

202\. ఉ. అత్రి నిజంబ పల్కెఁ దగ నాతనివాక్యము ధర్మయుక్త మీ
ధాత్రి సమస్తముఁ బృహదుదగ్రభుజాగ్రమునందుఁ దాల్చు స
త్క్షత్రియుఁడెల్ల [1]వారలను గావను బ్రోవఁబ్రభుండు గావునన్
శత్రునిషూదనుం డతఁడు శక్రుఁడు నీశ్వరుఁడున్ విధాతయున్.

203\. క. జనులకునెల్లను బాజ్యుఁడు, జన[1]పాలుం డతని [2]మహితశాసనమున [3]స
జ్జనులును మునులును సద్విధిఁ, జనువారలు గాక కడవఁ[4]జన దెవ్వరికిన్.

---

198\. 1. నాడెదవయుక్తము యుక్తము – ఉ. ఏ. చ. ష. 2. నుతించుట – వా. కొన్ని ప్రతులు; నుతింపగ – పీ. శ. ప. కొన్ని ప్రతులు.

199\. 1. యధిక్షేపించిన – వా. ఇ. ఉ. ట; తన్నాక్షేపించిన – పీ. శ. ప. కొన్నిప్రతులు.

200\. 1. నెరులు – పెక్కు ప్రతులు.

201\. 1. వాదంబు – వా. పెక్కు ప్రతులు; వివాదంబు – ఒ. క. చ. జ. 2. వివాదంబు – ఈ. ఐ. క. త.

202\. 1. వారలనుగా నను బ్రోవ – ఇ. ఉ. ట. వా; వారలకుగావను బ్రోవ – కొన్ని ప్రతులు.

203\. 1. నాయకుడతని – పీ. శ. ష. 2. వాక్యశాసనమున – స. 3. సజ్జనులును – కొన్ని ప్రతులు. 4. జనదగదెవుడున్ – ఊ. ఒ. ఓ. ఔ. గ. ద; జనగాదెవుడున్ – ఘ. పీ. శ. ష.

204. వ. క్షత్త్రియప్రభావంబేమనవచ్చు [1]విరాట్టుసమ్రాట్టు విధిజితుండు సత్యమన్యుండు యథాజీవుండు ధర్ముండు ననుభవ్యనామంబుల [2]నిగమంబులు పార్థివుం గొనియాడుఁ దొల్లి యధర్మంబునకు వెఱచి బ్రాహ్మణులు నిజతేజోబలంబులు [3]క్షత్రియులందు నిక్షేపించిరి నాఁటంగోలె బ్రాహ్మణ్యంబువలన క్షత్త్రంబు [4]ప్రవర్తిల్లుచుండు బ్రహ్మక్షత్త్రంబులు పరస్పరసంశ్రయంబులు వెలిగా వర్తింపనేరవు క్షత్త్రియుండు బ్రాహ్మణసంసేవనంబునం దేజోనిరూఢుండయి యాదిత్యుండు చీకటి నడంచునట్లు దురితంబుల నడంచు నట్లగుటంజేసి క్షత్త్రియుండు సర్వాధికుం డగుట నిశ్చయం బనిన నమ్మునను లందఱుఁ జని వైన్యునకుఁ దత్ప్రకారం బంతయు నెఱింగించిన నాభూవరుం డత్రిం జూచి.

205. క. నను నెల్లజనులకంటెను, ఘనుఁడని కొనియాడి తీవు కడునిజముగఁ [1]గావున నిదె ప్రీతుఁడనై తిన్, గొను మిచ్చెద నీకుఁ [2]నేను గోటిధనంబుల్.

206. క. అని యిష్టధనములిచ్చినఁ, గొని వచ్చి మునీశ్వరుండు గొడుకులకుఁ బ్రియంబునఁ బంచి యిచ్చి యిమ్ములఁ, జనియె వనంబునకు ధర్మ[1]సంహితబుద్ధిన్.

207. వ. అనిచెప్పి మార్కండేయుండు [1]పాండవేయునితో నిట్లను సరస్వతీగీతయను నితిహాసంబు సెప్పెద నందు విశిష్టధర్మంబు లెఱుఁగనగుఁ దొల్లి తార్క్ష్యుం డను [2]మునివరుండు భారతి నారాధించిన నద్దేవి ప్రత్యక్షంబగుటయు నిట్లని యడిగె.

---

204. 1. విరాట్సమ్రాడ్యథాజత్స్వర్ణేత్రుసహాజిద్విభు సత్యయోని పురావిత్సత్యధర్మప్రవర్తకుండునను - వా; విరాట్టు సమ్రాట్టు విధిజితుండు సత్యమన్యుండు యథాజీవుండు ధర్ముండునను - కొన్ని ప్రతులు. 2. నాగమంబులు - వా. కొన్ని ప్రతులు; నిగమంబులు - కొన్ని ప్రతులు. 3. క్షత్త్రింబున - గ. చ. ట. వా. వీ. శ. స; క్షత్రియులందు - కొన్ని ప్రతులు. 4. వర్ధిల్లుచుండు - కొన్నిప్రతులు.

205. 1. కావున నీదెసప్రీతుడనైకొను మిచ్చెద నీకు దనియకోటి ధనంబుల్ -ఊ. ఔ. ట. ద. వా; కావున నిదెప్రీతుడ నై తిన్ గొను మిచ్చెద నీకు నేనుగోటిధనంబుల్ - పెక్కు ప్రతులు. 2. కోటికోటి - కొన్ని ప్రతులు.

206. 1. సంయుతబుద్ధిన్ - అ. ఎ. ఐ. జ. ఝ. న.

207. 1. పాండవేయులతో - కొన్ని ప్రతులు. 2. మునీంద్రుండు - పెక్కు ప్రతులు

208\. క. పురుషున కెయ్యది ధర్మువు, పురుషుం[1]డెద్దానఁ [2]బరమ పుణ్యాత్ముఁడై
చిరపుణ్యగతులు వడయును, దిరముగ నిదియానతిమ్ము దేవీ నాకున్.

209\. వ. అనిన [1]వానికి నప్పరమేశ్వరి యిట్లనియె.

210\. మ. శ్రుతి వేదంబులు నాలుగుం జదివి భూదేవుండు నానాధ్వర
వ్రతుఁడై యుండెడు నట్టిపుణ్యుఁ డమరావాసంబునం దుండు ను
న్నతవృత్తస్తనభార[1]మంథరమరున్నారీపరీరంభసం
భృత రోమాంచ [2]సమంచితాంగుఁ డగుచుం [3]బెక్కేండ్లు సంప్రీతితోన్.

211\. సీ. మేలగు క్రేపుతోఁ బాలు సాలఁగఁ గల్గి లాలితంబగు తొలిచూలు మొదవుఁ
బాత్రభూతుండైన శ్రోత్రియునకు నిచ్చు సదదుల[1]చరితుఁ డమ్మొదవుమేన
నెన్ని రోమములుండు నన్ని [2]వేలేఁడులు సురలోక[3]సౌఖ్య విస్ఫురణనొందు
భారంబునకుఁ జాలి భూరిసత్త్వాఢ్యమై బిరుదైనయెద్దు భూసురున కిచ్చి
ఆ. నరుఁడు ధేనుదశక మిరవొంద నిచ్చిన, ఫలము వడయు [4]మఱియు వలువ లొసఁగి
చంద్రలోకమునకు [5]సంప్రీతుఁడై చనుఁ, గనక మిచ్చి నాకమునకు నరుగు.

212\. క. కృతమతి[1]యై యేడేఁడులు, [2]హుతవహుఘృతమునను బ్రీతి నొందించిన సు
వ్రతుఁ డేడేడు తరంబుల, పితరులఁ [3]గొని దివికి నేఁగుఁ బెంపెసలారన్.

---

208\. 1. డెద్దానివలన - బొ. ద. ల. 2. బరగు - ట.

209\. 1. నతనికి - ఊ. ట. వా; వానికి - పెక్కు ప్రతులు.

210\. 1. బంధుర - ఒ. బొ; సుందర - ఎ. ఓ. 2. సమంచితాత్ముడగుచుం - ఈ. ఐ. త. 3. బెక్కేళ్ళు - ఆ. ఈ. ఏ. ఓ. ఝ.

211\. 1. చిత్తుడమ్మొదవు - ఉ. క. 2. వేలేండ్లును - వా. కొన్ని ప్రతులు; వేలేడులు- వీ. శ. ష. కొన్ని ప్రతులు. 3. మునను విస్ఫురణ - ఘ. 4. మంచి - ఇ. ఏ. ట. వా; పెక్కు ప్రతులు. 5. జనునతి ప్రీతుడై-ఘ. చ; జనువేడ్కతోడను - ఆ. జ.

212\. 1. నేడేడులు దాహుతవహు - అ. ఈ. ఐ. ఝ. త. శ; యైయేడేండ్లును ఘృత మున హుతవహుని - ఘ. ద. 2. హుతమున హుతవహుని - ఆ. చ. ల; ఘృత మునహుతవహుని బ్రీతి - కొన్ని ప్రతులు; హుతమునహుతవహుని బ్రీతకుని జేసిన-? స. 3. తోనరుగుదివికి బెంపెసలారన్ - అ. ఈ. ఎ. ఐ. క. ఝ. త. స; గొని దివికినరుగు - జ.

213. క. సతతంబును శుచియై దే, వతలఁ [1]బ్రదీప్తాగ్నియందు వదలక సంత
ర్పితులుగఁ జేసి పడయు [2]నం, చితముగ గోలోకవాస చిరసౌఖ్యంబుల్.

214. వ. అగ్నిహోత్రం బస్మదాత్మకం బని యెఱుంగుము సకల యజ్ఞంబులందుఁ గల్గింపంబడు విశిష్టద్రవ్యంబు లన్నియు [1]మదీయంబు లేను [2]మహనీయంబైన యగ్నిహోత్రముఖం[3]బునం బ్రభవింతు నాత్మజ్ఞులగు మహాత్ములకు నఖిల సంశయచ్ఛేదంబు సేయుదు ననవరతస్వాధ్యాయధానవ్రతపరాయణులైన తపోధను లెందేని [4]వీతశోకులై [5]వసియింతు రట్టిది మామకంబైన పరమ పదంబు వినుము ప్రచుర [6]మధుక్షీరతోయంబులును శర్కరాసైకతంబులును [7]మాంసాపూపప్రకరతీరంబులును బాయసకర్దమంబులు నైన యేఱుల నేకంబు లుత్పాదించి యింద్రాగ్నిప్రముఖులైన [8]దివిజులకుఁ దృప్తి[9]సేసి యజన [10]శీలురు మత్పదంబుం బ్రాపింతు రని [11]చెప్పినఁ దార్క్ష్యుండు కృతాంజలియై.

215. ఉ. అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ శారదచంద్రచంద్రికా
డంబర చారుమూర్తి [1]ప్రకటస్ఫుటభూషణరత్న[2]రోచిరా
చుంబితదిగ్విభాగ శ్రుతిసూక్తవివిక్తనిజప్రభావ భా
వాంబరవీథి విశ్రుతవిహారి ననుం గృపఁ జూడు భారతీ.

---

213. 1. బ్రతిష్ఠాగ్నియందు – అ. ఆ. ఈ. ఐ. ఝ. త. 2. నంచితమతి – క. జ; సంచితముగ – ఘ. ఝ. శ.

214. 1. మదీయాధీనంబులేను – ఆ. ద. వీ. శ. ష; మదీయంబులేను – పెక్కు ప్రతులు. మదీయంబులనేను – వా. 2. మహావీర్యంబులైన యగ్ని – అ. ఈ. ఊ. ఎ. ఐ. ఘ. జ. ఝ. త. ద. 3. బు ననుభవింతు–వా; అగ్నిహోత్రాదహామభ్యాగతాస్మి। విప్రవర్ష భాణాం సంశయచ్ఛేదనాయ–అని మూలము; బున ప్రభవింతు–పెక్కుప్రతులు. 4. విగత – వా. కొన్ని ప్రతులు; వీత – కొన్ని ప్రతులు. 5. చరింతురట్టి – ఆ. శ. ష; వర్తింతురట్టి – ట. 6. మధుర – పెక్కు ప్రతులు. తస్యమూలాత్సరితః ప్రస్రవన్తి మధూదకప్రస్రవణారమణ్యః – అని మూలము. 7. మాష్టాపూప – ఈ. త. వీ. శ. ష. "ధానాపూపామాంసశాకాః సదా పాయసకర్దమాః" అని మూలము. "ధానాపూపారగాః పుణ్యాః"–అని యొక సంస్కృత ప్రతి. భం. పా. 8. దిక్పాలకురకు బ్రీతి – అ. ఈ. ఎ. ఐ. ఝ. త. 9. సేసిన – ఎ. ఏ. ఐ. ఒ. ఓ. గ. త. ల; సేయు – శ. 10. శీలురు పెక్కండ్రు అని – ఎ. ల. ప్రతులలో తప్ప తక్కిన అన్నిటియందును గలదు. కాని మూలమున దీని కాధారములేదు; శీలురు పెక్కేండ్లు – అని వా. ఇదియు నిరాధారమే. 11. చెప్పిన విని–కొన్ని ప్రతులు.

215. 1. వికచస్ఫుట – అని పెక్కు ప్రతులు. కాని – యతికుదురదు. 2. దీపికాచుంబిత– వీ. శ. ష. కొన్ని ప్రతులు; రోచిరా చుంబిత – కొన్ని ప్రతులు.

216. వ. అని [1]వినుతించి కృతార్థుండయ్యె [2]ననిన విని మృకండుపుత్త్రునకు పాండుపుత్త్రుం డిట్లనియె మునీంద్రా వైవస్వతమను వెత్తెఱంగునం బ్రభావసంపన్నుం డయ్యెఁ జెప్పవే యనిన మార్కండేయుం [3]డిట్లనియె.

217. క. విను చాక్షుషమన్వంతర, మున వైవస్వతుఁడు పరమపుణ్యుం డుదపం
బొనరించె నిరాహారత, ననుపమధైర్యుండు [1]దశసహస్రాబ్దంబుల్.

218. ఆ. అనఘుఁ డూర్ధ్వబాహుఁడై యేకపాదంబు, నందు నిలిచి బదరికాశ్రమమునఁ
జలిపె మఱియుఁ బెక్కు[1]సంవత్సరంబులు, తపము సకలజనులుఁ[2]దనునుతింప.

*-: మార్కండేయుండు ధర్మరాజునకు వైవస్వతు వృత్తాంతంబును జెప్పుట :-*

సం. 3 _ 185 _ 1

219. వ. ఆవైవస్వతుం డొక్కనాఁడు గృతస్నానుం డయి జలాశయతీరంబున [1]నున్నయెడ నొక్కమత్స్యంబు జలంబులదరికిం జనుదెంచి యిట్లనియె నయ్యా యేను గడు నల్పమత్స్యంబ నగుటం జేసి బలవంతంబు లగు జలచరంబులవలన [2]నాకుఁ దద్దయు భయంబు గలిగియుండు నిమ్మడువు మహా[3]మత్స్యసంకులంబు గావున [4]నపాయంబు వొందకుండ నన్నుద్ధరించి యొండెడం [5]బెట్టవే యేను నీకుఁ బ్రత్యుపకారంబు సేయనోపుదు ననిన [6]విస్మితుండై యతం డమ్మీను నెత్తికొనిపోయి యొక్కనూతియందు విడిచి దానిం బలుమాఱు నరసికొని యుండె నదియును గ్రమంబున[7]వర్ధిల్లి యొక్కనాఁ డమ్మనువున కి ట్లనియె.

---

216. 1. సంస్తుతించి - పీ. శ. ష; నుతించి - కొన్ని ప్రతులు. 2. నని చెప్పిన విని పాండు పుత్త్రుండు ముకుళిత హస్తుండై మునీంద్రా - ట. వా. పీ. శ. ష; ననిన విని మృకండుపుత్త్రునకు పాండుపుత్త్రుండిట్లనియె మునీంద్రా - కొన్ని ప్రతులు. 3. డతనికిట్లనియె - కొన్ని ప్రతులు.

217. 1. శతసహస్రా - అ.

218. 1. సంవత్సరంబులు సకలజనులు దన్నుసంస్తుతింప - ఔ. పీ. శ. ష. న. 2. దన్ను బొగడ - అ ఈ. ఊ. ఎ. త; సన్నుతింప - ఖ.

219. 1. నున్నంత - ట. వా. పీ. శ. ష; నున్నయెడ - పెక్కు ప్రతులు. 2. బాధయయ్యెడునని - పీ. శ. ష. 3. మీనసంకులంబు - కొన్ని ప్రతులు. 4. నాకు నపాయంబు - అ. ఈ. ఎ. ఐ. ఝ. త. 5. బెట్టిననేను - పీ. శ. ష. 6 విస్మితుండగుచు నతండమ్మీను-పెక్కు ప్రతులు 7. వర్ధిల్లి యమ్మనువున కిట్లనియె - ఇ. ఉ. ఏ. ట. గ. ల.

220. ఆ. అనఘ నీప్రయత్నమున నాశరీరంబు, పొదలె [1]నాకు నిందు మెదల నెడము
సాల దట్లుగాన [2]మేలగు నొండొక, యెడకుఁ గొంచుఁ బొమ్ము కడఁగి నన్ను.

221. వ. అనిన నతం డాజలచరంబుఁ [1]గొని చని యొక్క బావియందు విడిచిన నది యెప్పటియట్ల యక్కజంబుగాఁ బొదలి తనకు [2]బావియందు నవకాశంబు పర్యాప్తం బగుటం జెప్పి యతనిచేత గంగమడువున విడువంబడి కాల క్రమంబున నచ్చోటఁ దిరుగం బట్టు [3]చాలకున్న నమ్మనువున కెఱింగించిన నతం డెత్తికొనిపోయి సముద్రంబునం బెట్టిన నది వాని కి ట్లనియె.

222. క. ఉపకారం బొనరించితి, కృపతో [1]నాకిట్లు నీవుఁ గృతమతివై ప్ర
త్యుప[2]కారం బొనరించెద, విపులగుణాభరణ తెలియ విను నాపలుకుల్.

223. తే. తడవు లే దింక [1]నిఖిలభూతములు ప్రళయ, మొందనున్నవి యిప్పు డొండొండపొంగి
కలయఁ బాఱుఁ బయోధు లుగ్రముగఁ బుణ్య, చరిత యిదియ మన్వంతర సంధి యండ్రు.

224. వ. కావున నీవు దృఢరజ్జు[1]బంధురంబును [2]సకలధాన్యతండులకలితంబునుంగా నొక్క [3]పేరోడ గావించి సప్తమునిసహితుండవై దాని నెక్కి సముద్రంబు [4]దరియందు నన్నుం దలంచునది యేనును ఘనశృంగశోభితం బయిన రూపం

---

220. 1. నిందునాకు – వా. శర. పెక్కు ప్రతులు; నాకునిందు – కొన్ని ప్రతులు. 2. మెలగంగ నొండొక – చ. ద. ప్రాసయతి నియమభంగము; మేలుగ – వా. పీ. శ. ష. కొన్ని ప్రతులు; మేలగు – కొన్ని ప్రతులు.

221. 1. గై కొనిపోయి – వా. శ. ష; గొనిచని – కొన్ని ప్రతులు. 2. నవ్వాపి యందు – వా. బావియందు – పెక్కు ప్రతులు. 3. గానక యమ్మనువున కెఱింగించిన నతం – పీ. శ. శర; ష. చాలకున్న నమ్మనువునకెరింగించిన నతం – పెక్కు ప్రతులు; చాలకున్ననతం – వా.

222. 1. నాకిట్లు నీవు – ఓ; నీవిట్లునాకు – వా; పెక్కు ప్రతులు. 2. కారం బొనరించెద – కొన్ని ప్రతులు; కారమేనొనర్చెద – వా. కొన్ని ప్రతులు.

223. 1. నఖిల, సకల – అని భిన్న ప్రతులు.

224. 1. బంధనంబును – వా; బంధురంబును – గ. పీ. ష. 2. సకల ధనధాన్య సహితంబును – వా; సకల ధాన్యతండులకలితంబును – పెక్కు ప్రతులు. 3. పెద్ద యోడ – కొన్ని ప్రతులు; యోడ – ఓ. పీ. శ. ష. 4. దరియందు – ఓ. ఝ.

బునఁ బోడసూపి మీకు [5]మే లొనరించెద నని యమ్మత్స్యంబు సనియె వైవస్వతుండును దదుక్తప్రకారంబున [6]నోడ నిర్మించి సప్తముని [7]సహితంబుగాఁ గృతారోహణుండై పయోధి దఱియం దొడంగె నంత.

225. మ. మతి వైవస్వతుచేఁ దలంపఁబడి యమ్మత్స్యంబు దోఁతెంచె నా
యతశృంగోన్నతమూర్తి నాతఁడుఁ దదాజ్ఞాయత్తుఁడై తచ్ఛిరో
గతశృంగాగ్రమునం దగిల్చె నతిదీర్ఘంబైన పాశంబు న
ద్భుతవేగంబున నోడ నీడ్చె నది యంభోరాశిమధ్యంబునన్.

226. వ. [1]తదనంతరంబ.

227. సీ. గరుసులు [1]గడవంగఁ గదలి యల్లల్లన యొత్తుచు [2]నెడముల [3]నుత్తరించి
వేడుకఁ జేతులు [4]విచ్చి యాడెడునట్లు లోలోర్మిపంక్తులఁ గ్రాలి క్రాలి
[5]ప్రచురహాసస్ఫూర్తి పచరించు[6]చాడ్పున నురుఫేనరోచులఁ దెరలు[7] గవిసి
యురువడి వర్ధిల్లుచున్న జలంబుచేఁ బొంగారి దెసలెల్ల గ్రమింగి కొనుచుఁ
ఆ. బ్రబలవిలయకాల [8]పటురయబహుళ స, మీర[9]ణౌఘదుర్నివార మగుచు
నుగ్రభంగిగాఁ బయోనిధు లొక్కటఁ, బెల్లురేఁగి జగము [10]లెల్ల ముంచె.

---

త. ల; దరిసి – వా. కొన్ని ప్రతులు. 5. మేలుసేసెదనని – వీ. శ. ష; మేలొనర్చెదనని – కొన్ని ప్రతులు. 6. నోడ నిర్మించి సకలబీజంబులు సంగ్రహించి సప్తముని – వా; నోడనిర్మించి సప్తముని – పెక్కు ప్రతులు. 7. సమన్వితంబుగా – కొన్ని ప్రతులు.

226. 1. ఈ వచనము కొన్ని ప్రతులలో లేదు.

227. 1. గదలంగ – ఊ. ఘ. డ. 2. సిడముల నుత్తరించు – డ. 3. నొత్తరించి – ఓ. ఔ. క. 4. వీచి – వా. శ. కొన్ని ప్రతులు; విచ్చి – వీ. ష. కొన్నిప్రతులు. 5. ప్రమద – అ. ఔ. ట. ద. వా; ప్రచుర – పెక్కు ప్రతులు. 6. విధమున – వా. కొన్ని ప్రతులు; చాడ్పున – కొన్ని ప్రతులు. 7. గలిగి – వా; గవిసి – పెక్కు ప్రతులు. 8. బహుళతరాంతసమీర – చ. ల. 9. సంఘ దుర్నివార – శ. ష. కొన్ని ప్రతులు. 10. వెల్లివొడిచె – వా. కొన్ని ప్రతులు; లెల్లముంచె – వీ. శ. ష. కొన్ని ప్రతులు.

228. వ. ఇట్లు లోకంబెల్ల నేకార్ణవంబైన నమ్మత్స్యంబు దజ్జలాంతరంబున ననేక [1]సహస్ర[2]వర్షంబు లయ్యోడందిరుగుచుఁ బదంపడి యప్పెనువెల్లి యల్ల[3]న దిగిచి పోవందొడంగునెడం దుహినగిరిశృంగసమీపంబున నయ్యోడ నిలిపి వారలతోడ.

229. తే. ఈనగంబు శృంగంబున నిపుడు మీరు, గట్టుఁడియ్యోడ ననిన నతఁడును వారు నట్లచేసిరి విను మమ్మహాద్రిశృంగ, మనఘ నౌబంధనంబన నవనిఁబరగె.

230. క. మనుసహితులైన మునులం గనుఁగొని, యమ్మీను గరము గారవమున ని ట్లనుఁ బ్రళయంబున కీడునఁ, జనకుండఁగ మీకు రక్ష సలిపితిఁ గరుణన్.

231. క. మునులార [1]యేను విశ్వం, బునకుఁ బరమకర్తయగుప్రభుఁడ వాత్సల్యం బున మత్స్యమైన రూపం, బున నిమ్మెయి నిన్నిచందములఁ జనవలసెన్.

232. వ. మీరు నిర్భయులై చరియించునది మఱియు నిమ్మనువును దేవాసుర మానుషంబైన జగం బఖిలంబును సృజియించు మత్ప్రసాదంబున నతనికిఁ బరమజ్ఞానోదయం బగు నని చెప్పి యయ్యాదిమత్స్యం బదృశ్యం బయ్యె వైవ స్వతుండును మఱియు నధికతపంబుసేసి సకల[1]చరాచరభూతంబుల సృజి యించె.

233. క. పరమంబగు వైవస్వతు, [1]చరితం బతిభక్తివినినఁ జదివినను మహా దురితంబు లడఁగు [2]జనులకు, నిరవుగ సిద్ధించు ననఘ యిహపరసుఖముల్.

234. వ. అనిన నమ్మేదినీశ్వరుం డమ్మునీశ్వరునకుఁ బ్రణతుండై యిట్లనియె.

235. క. పరమేష్ఠికల్పుఁడవు ని, ర్భరభూరితపః[1]ప్రభావపరిపూర్ణుఁడవ [2]చ్చెరువు భవన్మాహాత్మ్యము, సురమునిలోకప్రణామశోభితచరణా.

---

228. 1. సహస్ర - కొన్ని ప్రతులలో లేదు. 2. సంవత్సరంబుల - కొన్ని ప్రతులు. 3. నడంగి పోవదొడంగు - ఐ. ఝ. త. పీ. శ. ష.

231. 1. అహం ప్రజాపతిర్బ్రహ్మా మత్పరం నాధిగమ్యతే - అనిమూలము; యేను విశ్వం బునకు బ్రథమకర్త - కొన్ని ప్రతులు.

232. 1. చరాచరంబుల - వా. కొన్ని ప్రతులు; చరాచర భూతంబుల - పెక్కుప్రతులు.

233. 1. చరితంబనురక్తి-ఇ.ఏ; చరితము కడు భక్తి-శ. 2. నరులకు-అ.ఇ.ఒ.క.గ.చ.జ.

235. 1. ప్రబోధ - వా. పెక్కు ప్రతులు; ప్రభావ - ఆ. క. జ. పీ. శ. ష. 2. చ్చెరు వగు భవన్మహత్వము - ఔ.

236. క. [1]అడరి [2]నిఖిలాండకోటియుఁ, జెడునప్పుడుఁ [3]జెడక నీవు జీవించెద వే
ర్పడ జగములు గ్రమ్మఱఁ గలి, గెడునప్పుడు సూచెదవు వికృతిరహితుఁడవై.

237. చ. తొడరి చరాచరప్రతతితో [1]జగమంతయు వార్ధి దొట్టి న
ప్పుడు లలితాబ్జపీఠమునఁ బొల్చు చతుర్ముఖుఁ బద్మగర్భుఁ బెం
పడర భజించి తీవు జగదాదిజుఁడైన ప్రభుండు నీయెడం
గడు ననురక్తుఁడై యొసఁగెఁ గాదె మునీశ్వర యీప్రభావమున్.

238. క. జగముల నెల్లను ద్రిమింగెడు, జగదంతకు మౌళి వామ[1]చరణం బిడి పె
ల్లగు రోగజరా [2]భరముం, [3]దిగ విడువఁగఁ [4]జెల్లె నీకుఁ ద్రిభువనవినుతా.

239. వ. సకలచరాచరోత్పత్తి స్థితి [1]విలయ ప్రకారంబులు నీకుం బెక్కుమాఱులు
ప్రత్య[2]క్షంబులయి కానం[3]బడియుండుఁ గావున నిన్నడిగెద లోకంబులు
[4]విలయకాలంబున [5]నెట్టిభంగి యగు [6]నెఱింగింపుమనిన మార్కండేయుం
డి ట్లనియె.

-: *మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ బ్రళయప్రకారంబు సెప్పుట* :-

సం. 3 _ 186 _ 13

240. సీ. **శాశ్వతు నఖిలభూతేశ్వరు** నవ్యయు నాదిదేవుని జగదాదిజన్ము
నాదిమధ్యాంత[1]విచ్ఛేదవిదూరు నాశ్చర్య కారణ [2]కర్మధుర్యు నజరు

---

236. 1. ఎడలి – ఓ. స; ఈ పద్యమునకు ముందు 'అని మరియును' అను వచనము ఆ. ఘ. ఠ. శ. ష. ప్రతులలోఁ గలదు. 2. యఖిలాండ కోటి – అ. ఈ. ఉ. ఐ. ఝ. త. పీ. స. 3. జెడని బ్రతుకు జీవించెద – పెక్కు ప్రతులు.

237. 1. జగమింతయు – వా. సూ; జగమంతయు – ఏ. ఐ. ఒ. క. జ. ట. త. పీ. శ. ష.

238. 1. చరణంబిడ బెల్లగు – వా. పీ. ష. కొన్ని ప్రతులు. 2. భరములదిగ – క. ఘ. చ. పీ. శ; భరములు దిగ – ఐ. ఝ. త. తి. 3. దెగ విడువగ – వా. కొన్ని ప్రతులు; దిగవిడువ – కొన్ని ప్రతులు. 4. జెల్లు నీకు–కొన్ని ప్రతులు; నీకు చెల్లు – క.

239. 1. లయ ప్రకారంబులు – ఉ. ఏ. ఐ. క. గ. ఠ. త. 2. క్షంబై – కొన్ని ప్రతులు. 3. బడియెంగావున – అ. ఐ. ఔ. ఝ. త. 4. ప్రళయ – ఇ. ఏ ఓ గ. 5. నెట్టివి యగు – అ. ఈ. ఐ. ఔ. ఝ త. 6. నవ్విధంబెరింగింపు – అ. ఈ. ఐ. ఝ. త.

240. 1. విభేద – అ. ఈ. ఏ. ఐ. క. ఘ. జ. ఝ. త. 2. కర్మ శౌర్య ధుర్య – ఈ. ఐ. త. పీ. శ. ష.

[3]నీకిష్టసఖుఁడును నీకుఁ బ్రెగ్గడయునై వెలుఁగొందుచున్న యీయలఘుపుణ్యు
[4]లాలితదీర్ఘవిశాలసితేక్షణుఁ గనకవర్ణాంబరు వనజనాభు

ఆ. నింద్రనీలవర్ణు నింద్రాదిసురగణ, వినుతుఁ గృష్ణుఁ గరము వినయ మొప్పఁ
దలఁచి యతని యాజ్ఞ[5]దలకొని యెఱిఁగింతు, వినుము వరుసతోడ
మనుజనాథ.

241. వ. కృత త్రేతా ద్వాపర కలి నామంబు లయిన యుగంబులు నాలుగును బన్రెండువేల దివ్యవర్షంబులం బర్యవసితంబు లగు నియ్యుగంబులు నాలుగు నొక్క మహాయుగం బనం బరగు మహాయుగసహస్రపర్యంతం బైన కాలంబు బ్రహ్మకు [1]దివసంబ నాబరగు దద్దివసావసానంబునందు శతవార్షికం బైన యనావృష్టిదోషంబు ప్రవర్తిల్లు నప్పుడు.

242. ఆ. సప్తహయుఁడు మూర్తిసప్తకం[1]బు ధరించి, కరము వేఁడిమిగులు
కరము లొప్ప
నదనదీజలములు నుదధిజలంబులుఁ, బీల్చి జగము[2]లెల్లఁ బ్రేల్చుఁ గడఁగి.

243. చ. దినకర[1]తిగ్మతేజము ప్రదీప్తహుతాశనుఁ డై యుగాంతసం
జనితమహాసమీరణవశంబునఁ బేర్చి నగవ్రజంబుతో
మనుజులతోడ నిర్జరసమాజముతోడ భుజంగపంక్తితో
దనుజులతో జగత్త్రయము దత్క్షణ[2]మాత్రనొనర్చు నీఱుగన్.

---

3. గురుడు నీకిష్ట సఖుడును బ్రెగ్గడ - వా. కొన్ని ప్రతులు; నీకిష్ట సఖుడును నీకు బ్రెగ్గడ - పెక్కు ప్రతులు. 4. లాలితాంభోజదీర్ఘ - జ. 5. దలనిడి - ఇ. ఈ. ఊ. ఎ. ట. ద. వా; దలకొని - కొన్ని ప్రతులు.

241. 1. నొక్క దినంబనంబడు - వా; దివసంబనాబరగు - పెక్కు ప్రతులు.

242. 1. దినకరైర్దీప్తైః స్సప్తభిః - అని మూలము; బొగిదాల్చి - వా. కొన్ని ప్రతులు బుధరించి - ఈ. ఐ. ఔ. చ. త. వీ. శ. ష. 2. లెల్ల నేర్చుగడగి - ఆ. ప్రాసయతి నియమ భంగము.

243. 1. తీవ్రతేజమునదీప్త - వీ. శ. ష. 2. మాత్రన జేయునీఱుగన్ - ఎ. జ. ఝ. ల; మాత్రన నేర్చునీఱుగాన్ - ఔ. స.

244. వ. తదనంతరంబ.

245. మ. సితపీతారుణ నీల [1]పింగరుచులై [2]స్నిగ్ధంబులై యుద్యోతా
[3]యతవిద్యుల్లలితంబులై [4]ఘనగిరీంద్రాకారఘోరంబులై
తతనిర్ఘాత [5]నిపాతభీమభిదురధ్వానంబులై సంతతో
ద్ధుతసంవర్తవలాహకంబులు వెసం దోఁతెంచు నిగ్భిత్తులన్.

246. ఉ. [1]వెల్లునఁ గూలు తజ్జలము[2] పెక్కువ నొక్కట నమ్మహానలం
జెల్లను నాఱిపోవుఁ బృథివీశ్వర యేఱులు నబ్ధులున్ వెసం
దొల్లిటియట్ల నిండుఁ బటుతోయదసంఘము లంతఁ బోక గ
ర్జిల్లుచు వెండియుం గురియుఁ జిత్రముగాఁగ ననేకకాలముల్.

247. శా. ధారాపాతనితాంతవేగమున నిద్ధాత్రీతలం [1]బాహతం
బై రూపేది మునుంగుఁ దోయములలో [2]నత్యంతగంభీరవాః
పూరం బంతయు [3]ముంచిమించుటయు దిగ్భూమీనభోగభాగముల్
వే రూపింపఁగ రాకయుండఁ [4]దమముల్ వేష్టించుఁ ద్రైలోక్యమున్.

248. తే. అంతఁ బరమేష్ఠి[1]చోదిత మైన యొక్క, మారుతము నలిరేఁగి దుర్వారభంగి
విలయకాలవిశృంఖల [2]విపులవారి, ధరచయంబుల నెల్లను [3]విరియ నడఁచు.

---

245. 1. పింగళరుచి స్నిగ్ధంబులై – అ; పింగళరుచుల్ స్నిగ్ధం – ఎ. ప; హింగుల రుచుల్ – స. 2. శీఘ్రోల్ల సద్విద్యుతా – అ. బ. ఝ. ట. త; స్నిగ్ధోల్ల సద్విద్యుతా – క. జ. 3. యతరేఖాంకములై మహాగజగిరీంద్రా – స; యతరేఖాంకమునై – వా. కొన్ని ప్రతులు; యతవిద్యుల్లలితంబులై – వీ. శ. కొన్ని ప్రతులు. 4. సురగజేంద్రాకార – జ. ట; సురకరీంద్రాకార – ఈ. బ. త; గజగిరీంద్రా – వా. కొన్ని ప్రతులు; ఘనగిరీంద్రా – వీ. శ. కొన్ని ప్రతులు. 5. విఘూత – బ. త.

246. 1. వెల్లుగ బారు – వీ. శ. ష; వెల్లునగూరు – స; వెల్లునగూలు – వా. కొన్ని ప్రతులు. 2. వెల్లున – ఇ. ఉ. ఏ. బ. సం; పెక్కున – వా. కొన్ని ప్రతులు; పెక్కువ – పెక్కు ప్రతులు.

247. 1. బాప్లుతంబై – ఘ. చ; బాహ్యాతంబై – అ. బ. గ. జ. త. శ. 2. నత్యుగ్ర – ఘ. చ. డ. 3. ముంచుముంచుటయు – శ; ముంచెముంచుటయు–ఘ; ముంచినించుటయు – శ. 4. దమముద్వేగించు – అ.

248. 1. చోదితంబైన – ఏ. ఔ. క. ద. 2. విలయవారి – ఒ. 3. విరియజేయు – వా; విరియనడచు – వీ. శ. ష. పెక్కు ప్రతులు.

249. క. ఆమారుతంబు గ్రోలి పి, తామహుఁ డెంతయును ఘోరతర మగు సలిల
స్తోమంబునందు నడుమం, దామరపై నిదురవోవుఁ దద్దయు నెమ్మిన్.

250. వ. ఇట్టి [1]కల్పాంతంబు లనేకంబులు సనియె నింకఁ గానున్నవి యనేకంబులు [2]విను మతీతకల్పాంతసమయంబున నేను [3]బ్రబలాంధకారంబున [4]నేదెసయుం గానక [5]యొక్కండన యత్యంతభయాతురుండ నగుచుం బెద్దకాలంబు పరిభ్రమించుచుండ నొక్కతటి నయ్యుదకమధ్యంబున నత్యున్నతం బయిన వటభూరుహంబు గానంబడియె మఱియుఁ దదీయపర్ణపర్యంకంబునందు.

251. క. కమనీయ జలదవర్ణుని, హిమకరబింబాస్యు నుద్యదినతేజుఁ బ్రమో
దమునఁ [1]బవళించువానిం, గుమారు నొక్కరునిఁ గుసుమకోమలుఁ గంటిన్.

252. వ. కని విస్మితుండనై యాత్మగతంబున.

253. క. లోకంబులు దెగటారఁగ, నేకార్ణవమైన యిచట నిబ్భాలుఁ [1]డొకం
[2]డేకతమున నిద్రించుచు, నేకతమున నున్నవాఁడొ యెవ్వాఁడగునో.

254. తే. అని తలంచు నల్లన యక్కుమారుఁ, జేరఁబోయిన నాతండు సితసరోజ
రేఖ దలకొనఁగా [1]నలరించెఁ [2]గన్ను, లవధరించెను నను లోలచనాంచలమ్ము

255. వ. తదనంతరంబ గంభీరమధుర[1]స్వరంబున నిట్లనియె నయ్యా నిన్ను నతిశ్రాంతుంగా నెఱింగితిఁ గొండొకసేపు విశ్రమింపవలతేని నవకాశం బిచ్చెద నాశరీరంబు ప్రవేశించి సుఖంబున శయనింపు మని తన[2]వదనంబు వివృతంబుగాఁ జేసిన నేనును బలాత్కార [3]ఊిప్తుండునుంబోలె బరవశుండనై తన్మార్గంబున నతని యుదరంబుఁ బ్రవేశించి యందు.

---

250. 1. కల్పాంతరంబు – ఇ. ఊ. గ. ఝ. ర. శ. 2. వినుము తత్కల్పాంత – అ. క; గలవు విను – ఎ. ఏ. జ. ఝ. 3. ప్రబల జలాంధకారంబున – ఇ. ఉ. ఎ. ఏ.; ఝ. 4. నెద్దియుంగానక – జ. ద. వీ. శ. మ; నెద్దెస – ఊ. ఏ. ఐ. ఒ. డ. 5. యొక్కరుండ – ఒ. చ. జ. డ. ల.

251. 1. శయనించు – అ. ఉ; బ్రభవించు – క. గ; బవడించు – జ. శ.

253. 1. డితండే – అ. ఎ. ఝ. వీ. శ. 2. డేకతమయున్నవా డితడేకతమున – అ. ఆ. ఔ. జ. ల ; డేకతమయున్నవా డితడేకీభావంబో తలపనెవ్వాడగునో – శ

254. 1. నలరించెనాగనవధ – శ. 2. నన్నునాదరించెను – ఒ క

255. 1. స్వనంబున – అ. ఈ. ఐ. క. శ. మ. 2. వదన గహ్వరంబు – ఎ. ల. 3. నిక్షిప్త శరీరుండునుంబోలె – వా; క్షిప్తుండునుంబోలె – పెక్కు ప్రతులు.

256. సీ. గంగాదినదులతోఁ గనకశైలాదిభూధరములతో సముద్రములతోడ
వివిధ[1]పట్టణ [2]నవద్వీపవర్షములతో బహుకర్మరతులైన ప్రజలతోడఁ
బక్షిమృగవ్యాళపశుసంఘములతోడఁ దద్దయు నొప్పారు [3]ధాత్రిఁ గంటి
సూర్యేందుతారకాజ్యోతిరుజ్జ్వలమైన గగనంబుఁ బవనమార్గములుఁ గంటి
తే. శక్ర[4]యమవరుణాది నిర్జరసమేత, మైన నాకంబు గంటి మహాహియక్ష
[5]రాక్షసాసురవిద్యాధరప్రముఖులఁ, గంటి [6]వేయేల సకలలోకములుఁ గంటి.

257. చ. అరుదుగ నమ్మహాత్ముని మహాజఠరాంతరభూమి నూఱు వ
త్సరముల యంతకాలము [1]వసం బఱి త్రిమ్మరితిం గడంగి య
ప్పరుసున నెందుఁ గాల్గొనఁగఁ [2]బట్టదు చిత్తము క్షితి [3]మీఱఁ ద
త్పరమతి నంత [4]నక్కపట బాలు[5]పదంబులు సంస్మరించితిన్.

258. వ. ఇట్లు శరణ్యావరేణ్యుం డైన కారుణ్యానిధి నద్దేవుం దలంచుచుండ [1]నతండు నన్నుం దనవదనానిలవేగంబునం జేసి వెలువరించె[2]నంత నెప్పటియ ట్లమ్మహా [3]వటవిటపిశయనుం డైన యర్భాలు నాలోకించితి నంత.

259. క. ననుఁ గనుఁగొని యెలనవ్వునఁ, దనవదనము వింతచెన్ను వలకొనఁగా ని
ట్లను నర్భాలుఁడు విశ్రమ, మొనరించితె యనఘ యస్మదుదరములోనన్.

260. వ. అనిన నేనును సంభ్రమంబున నతనిం జేర నరిగి కెందామరరేకులం దెగడు నంగుళంబులు గలిగి తరుణకిసలయ సుకుమారంబు లయిన తచ్చరణకమలంబులు శిరంబునం జేర్చి దేవా దేవరప్రసాదంబున నత్యాశ్చర్యకారణం బైన సకలచరాచరభూతప్రపంచంబుఁ జూచితి భవదీయమాయా[2]ప్రభావంబు భావింప నేరకున్నవాఁడ.

---

256. 1. పత్తన - వా; పట్టణ - కొన్ని ప్రతులు. 2. నవద్వీప - ఇ. ఉ. ఎ. ఏ. శ; వనద్వీప - వా. ష. కొన్ని ప్రతులు. 3. ధరణి - ఐ. గ. 4. వరుణయమాది- వా. పీ. శ. ష; యమవరుణాది - పెక్కు ప్రతులు. 5. రాక్షసాదిత్య - ఉ. 6. వెలయంగసకల - గ.

257. 1. వెసంబడి - ఎ. ల; పదంపడి - ఏ. ట. ద. శ; వశంతడి - ఠ; ముదంబున - స; పదంపడి క్రుమ్మరుచుండి యుండియ-ట. 2. బట్టక-ఘ. చ. 3. మీరె - అ. ఊ. ఏ. ఓ. గ. ట. ల. 4. నక్కడను-ఘ. 5. మనంబున సన్నుతించితిన్-ఔ; మనంబున - ట.

258. 1. నతండు - కొన్ని ప్రతులలో లేదు. 2. నప్పుడెప్పటియట్ల - కొన్ని ప్రతులు. 3. వటపత్రశయనుండైన - పీ. శ. ష. కొన్ని ప్రతులు.

260. 1. సమంబులయిన - అ. 2. ప్రకారంబు - అ.

261. శా. ఈ యేకార్ణవ మీ వటక్షితిరుహం బీ పర్ణపర్యంక మి
ట్లై యొప్పారుచు నుండఁగా నుదరభాగైకప్రదేశంబునం
దీ యీ రేడుజగంబులున్ [1]మెలఁగఁగా [2]నిట్లున్న బాలత్వ మే
నేయందంబున నిశ్చయించి సుఖినై యేపారుదుం జెప్పవే.

262. క. నాదైనయాశ్రితత్వము, నీదగుచిత్తమునఁ గలిమి నియతమ యేనిన్
సాదరఫణితుల నన్నవ, సాదిత[1]సమ్మోహుఁగాఁ [2]బ్రసాదింపఁదగున్.

-: నారాయణుఁడు మార్కండేయునకుఁ దనప్రభావంబు సెప్పుట :-

సం. 3 _ 187 _ 1

263. క. అని యేను వేఁడికొనుటయు, ఘనతరకరుణారసానుకలితహృదయుఁడై
తనదివ్యమహిమ [1]యిట్లని, వనజాక్షుఁడు [2]సెప్పె గారవంబున నాకున్.

264. ఆ. అనఘ దేవతలును మునులును నాదైన, మహిమఁ దెలియలేరు మహితబుద్ధి
నతులపుణ్యమతివి పితృభక్తుఁడవుగాన, యెలమి నీకుఁ జెప్పవలసెఁ దెలియ.

265. క. నారము[1]లందురు జలముల, నారయ వారములు నాకు నయనంబగుటన్
నారాయణుఁ డను పేర న, పారనిగమఫణితులందుఁ బరగుదుఁ బేర్మిన్.

266. తే. అట్టి నారాయణాఖ్యుండనైన నేను, శాశ్వతుండనై ప్రభుఁడనై సకలజగము
లోలిఁ బుట్టింతుఁ బాలింతు నుచిత[1]వేళ, సంహరింతుఁ జిదానందశాలినగుచు.

---

261. 1. వెలుఁగగా - అ. ఏ. గ. ఝ. ఠ. ద. వీ శ. 2. నీయున్న - ఏ.

262. 1. నిర్మోహుఁగా - అ. 2. ప్రసాదింపుతగన్ - వా; బ్రసాదింపుదయన్ - ఇ. ఈ. ఎ. ఏ. ఐ. ఒ. కపం; ఝ. వీ. బ్రసాదింపదగున్ - ఉ. ఓ. ఔ. గ. చ. ద. శ. ష.

263. 1. మిట్లని - ఏ. ఐ. త; నిట్లని - డ. ల. 2. నాకు గారవంబున చెప్పెన్ - కొన్ని ప్రతులు.

265. 1. లంద్రు జలము లింపారగ - వా; లందురు జలముల నారయ - ల.

266. 1. లీల - ఈ. ఎ. ఐ. ఔ. ఘ. ఝ. త.

267. మత్తకోకిలము.
అంబుజాసనుఁ డింద్రుఁ డీశ్వరుఁ డంతకుండు ధనేశ్వరుం
డంబుధీశుఁడు లోనుగా సుర లస్మదాకృతు లుర్వి పా
దంబు లగ్ని ముఖంబు సూర్యసుధాకరుల్ నయనంబు లీ
యంబరంబు [1]శిరంబుగా నిటు లద్భుతాకృతి నుండుదున్.

268. చ. అతులితదక్షిణాన్వితమహాధ్వరసంఘము లే నొనర్చితిం
జతుర[1]మనీషితాప్రచురసౌఖ్యులు భూసురముఖ్యు లంచిత
వ్రతులు మహీపతుల్ సుగుణ[2]వంతులు వైశ్యులు భక్తి నన్ను సం
తతమును గొల్తు రీక్షితి నుదాత్త[3]మహాక్రతుకర్మశీలులై.

269. చ. విలయపయోధిమగ్న మగు విశ్వమహీవలయంబుఁ దొల్లి యే
నలఘువరాహవిగ్రహుఁడనై వెస నెత్తితి శేషమూర్తినై
లలితఫణాసహస్రకము లావునఁ దాల్తు నశేషధాత్రియుఁ
[1]జలనిధి నిమ్నగా [2]నగ లసన్నగరీ వనమండలంబుతోన్.

270. క. బాడబదహనుఁడనై వడి, నేడుసముద్రముల జలము లేఁ గ్రోలుదు నీ
రేడుజగంబులు విలయముఁ, గూడెడునెడఁ దజ్జలంబు గొనకొని విడుతున్.

271. చ. వదన భుజోరు[1]పాదముల వర్ణచతుష్టయముం యుగాదియం
దొదవ సృజింతు ఋగ్యజుషసూక్తులు సామము నయ్యథర్వముం
విదితముగా మదీయముఖవీథుల నుద్భవమొందు నన్నియుం
దుదిఁ బరివర్తనక్రమవిధూతములై ననుఁ జేరుఁగ్రమ్మఱన్.

---

267. 1. శరీర మేనిటుల – అ. ఇ. ఉ. ఊ. ఎ. ఐ. ఓ. ఔ. గ. ఘ. చ. ద. వి. శ. ష.

268. 1. మనీషిత ప్రచుర – పెక్కు ప్రతులు. 2. వశ్యులు – వా; వర్యులు – అ. చ. ఝ. ద; వంతులు – ఇ. ఎ. ఓ. గ. ఘ. 3. మహాశ్రమ కర్మ – ఈ. ఐ. ఝ. త. మహావ్రత కర్మ – క.

269. 1. జలధి వలగ్నగానగ – శ. ష. 2. సకల సన్నగరీ – అ. ఉ. ఘ. ర; నవల సల్లవలీ విపినాంతరంబులన్ – ట.

271. 1. పాదయుగ (?) – ఆనం.

272. క. అనహంకృతు లక్రోధను, లనసూయులు సంగరహితు లధ్యాత్మవిదుల్
ఘన[1]సత్యాత్మకులు మహా, మునులు ననుం గొల్తు రెపుడు మోక్షాపేక్షన్.

273. తే. అఖిలనక్షత్రతారాగ్రహములు గగన, పవన దిశలును మత్స్వ
రూపములు వినవె
సకలరత్నాకరంబులు శయ్యగాఁగ, [1]నిత్యసుఖలీలమై శయనింతు నేను.

274. క. దానము [1]సత్యంబు తపో, జ్ఞానాహింస లనఁ బరగు సాత్త్వికగుణ సం
తానముఁ గామ[2]క్రోధా, జ్ఞానంబులు మన్మయములు సంయమివర్యా.

275. క. విను మింకఁ బెక్కుమాటలఁ, బనియేటికి జగమునందుఁ బ్రకటితముగఁ గ
ల్గినయదియు [1]నేనలేనిది,యును నేన సునిశ్చితముగ నూహింపు మెదన్.

276. ఉ. ఎప్పుడు ధర్మహాని యగు నెప్పు డధర్మము మీఱుఁ గ్రూరులై
యెప్పుడు దైత్యు లుబ్బుదురు హీనతఁ బొందుదు రెప్డు వేల్పు లే
నప్పుడు సత్కులీనులగృహంబుల నుద్భవ మొంది లీలమై
నెప్పటియట్ల నిల్పుదు సురేంద్రుల నంచితధర్మపద్ధతిన్.

277. క. సితరక్త[1]నీలపీత, ద్యుతివిలసితరూపములఁ జతుర్యుగముల నే
[2]నతిధృతిఁ [3]జరియించి సమం, చితధర్మస్థాపనంబు సేయుదు ననఘా.

---

272. 1. సత్త్వాత్మకులు — వా. శ. ష. కొన్ని ప్రతులు; సత్యాత్మకులు — కొన్ని ప్రతులు.

273. 1. నిష్ట — ర.

274. 1. సత్యమును — కొన్ని ప్రతులు. 2. క్రోధవిధానములును మన్మనోవిధము మునివర్యా — అ. ఘ.

275. 1. లేని యదియును నొనరఁగ నేనని మనమున నూహింపు తగన్ — వా. కొన్ని ప్రతులు; నేన లేనిదియును నేన సునిశ్చితముగ నూహింపు మెదన్ — కొన్ని ప్రతులు.

277. 1. పీత నీల — కొన్ని ప్రతులు. 2. గృతమతి — వా. పెక్కు ప్రతులు; నతిధృతి— శ. ష. 3. జరియింతు — ఈ. ఐ. ఝ. త.

278. మత్తకోకిలము.
కాలచక్రము నిర్వికల్పము గాఁగ [1]నేననయింతు ను
న్మీలితక్రమవిక్రమైక [2]సమృద్ధినై లయవిక్రియా
వేళ నింతయు సంహరింతుఁ బ్రవృద్ధయోగబలోల్లస
త్కాలరూపము దాల్చి దుర్వహగర్వ [3]నిర్వహబుద్ధినై.

279. క. నా తెఱఁ గంతయు నిప్పుడు, [1]చేతోముద మొదవ నీకుఁ జెప్పితిఁ ద్రిజగ
ద్ధాతయగు పితామహుఁడు సు,జాతుఁడు నాయెడలఁ జక్క [2]సగబాలు సుమీ.

280. వ. నారాయణాభిధానుండ నైన [1]యేను బాలరూపంబున శంఖచక్రగదాధ
రుండనై యేకార్ణవంబునందు మహాయుగసహస్ర[2]సమయం బయిన
కాలంబున యోగనిద్రా[3]పరవశుండనై యుండుదు నిట్టి దారుణకల్పాంతంబు
చూచి నీవు భీతుండ వగు టెఱింగి నీవలనియనుగ్రహంబున [4]నాత్మగుప్తంబు
లైన సకలలోకంబులు [5]గనునట్టి తెఱంగుఁ[6] గావించితి నీవింక [7]నిశ్శంకహృద
యుండవయి వలసినయెడం జరియింపుము మదీయనాభికమలకర్ణికాశాయి
నుం[8]డయి యున్న చతురాననుండు మేల్కని సృజియించు[9]లోకంబు
లేర్పడం జూచెదనని యానతిచ్చి యద్దేవుం[10]డచ్చోటన యంతర్హితుండయ్యె
నత్యంతవిచిత్రంబైన యీవృత్తాంతం[11]బు నాకు ననుభవగోచరంబైన యది.

---

278. 1. నేనొవరింతును-వా. కొన్ని ప్రతులు; నే ననయింతును - ఉ. ఎ. ఒ. క. చ. జ, ఝ; నే నవహింతును - ఆ. ల. కాలచక్రం నయామ్యేకో - అని మూలము 11–192–34. 2. సమృద్ధిమై - ఈ. ఉ. ఊ, ఎ. ఐ. ఘ. జ. ఝ. త. 3. ధూర్వహా- ఈ. ఐ. ఒ. త.

279. 1. చేతోమోదమున - ఇ. ఈ. ఏ. ఐ. త. ల. 2. సగమని కనుమీ - వా. కొన్ని ప్రతులు; సగమనుకొనుమీ - డ; సగబాలుసుమీ - పీ. శ. ష. కొన్ని ప్రతులు.

280. 1. యేనీబాల - ఈ. ఐ. 2. మయంబైన - కొన్ని ప్రతులు; సమయంబైన - ఏ. చ. ద. శ. 3. పరుండనై - ఓ. జ. ర; వివశుండనై - ఈ. ఎ. ఐ. ఝ. త. 4. నా యాత్మగుప్తంబు - పీ. శ. ష; స్వాత్మాంగ గుప్తంబు - డ. 5. నీకుం గనునట్టి - వా. పీ. శ. ష. 6. గా చరించితి - పెక్కు ప్రతులు. 7. నిర్విశంక- కొన్ని ప్రతులు. 8. డయిన - పెక్కు ప్రతులు. 9. లోకంబులెల్ల నిప్పుడేర్పడం- ఈ. ఎ. ఐ. త. 10. డంతట నంతర్హితుం - వా. పీ. శ. ష; డచ్చోటనయం తర్హితుం - కొన్ని ప్రతులు. 11. బు నాకు - పెక్కు ప్రతులు; బంతయును నాకు - వా. పీ. శ. ష.

281. శా. [1]నాకమ్మెం బోడసూపెఁ దాను గృపతో [2]నాకందు నేఁడియ్యెడన్
నీకున్ గాదిలిచుట్టమై నచివుఁడై నెయ్యంబుమై నున్న పు
ణ్యాకారుం గమలాయతాక్షుఁ గరుణైకాయత్తు నత్యుత్తమ
శ్లోకుం గృష్ణునిఁ గంటి నాసుకృతముల్ శోభిల్లెఁ బక్వంబులై.

282. క. ఈదేవదేవు కరుణం, గాదే కురునాథ నిర్వికారుఁడనై నిః
ఖేదుఁడనై యుండుదు దే, వాదివివిధభూతవిలయ మయ్యెడు [1]నపుడున్.

283. తే. అనఘ[1]యిద్దేవు సన్నిధి యగుటఁగాదె, నాకుఁ బూర్వవర్తనకథనంబునందు
బోధ మిప్పుడు గలిగె నిప్పుణ్యుఁ బరమ, పురుషుఁ బ్రభవిష్ణుఁ గృష్ణుని
శరణు సొరుము.

*—: మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ గలియుగధర్మంబులు సెప్పుట :—*

సం. 3 _ 188 _ 5

284. వ. అనిన విని [1]ధర్మనందనుం డనుజసహితుండై కృష్ణునిం బ్రశంసావచనంబుల నభినందించి మార్కండేయుం జూచి మునీంద్రా భవత్ప్రసాదంబున నత్యద్భుత [2]కథాశ్రవణపరితోషితుల మైతిమి కలియుగంబున సకలధర్మలోపం బగునని చెప్పుదురు తత్ప్రకారం బెఱింగింపవేయనిన నతం డతని కిట్లనియె.

285. క. కృతయుగమునందు ధర్మువు, చతురంశంబులను బరగఁ[1]జను నది త్రేతన్
ద్రితయమున నొక్కఁడొకఁడుగఁ, బ్రతియుగమునఁ దఱుఁగఁదొడఁగుఁ
[2]బాళులు వరుసన్.

---

281. 1. నాకిమ్మెం – కొన్ని ప్రతులు. 2. నాడందు – వా. పీ. కొన్ని ప్రతులు. నాతండు – కొన్ని ప్రతులు.

282. 1. వేళన్ – ఈ. ఊ. ఐ. త.

283. 1. "దృష్ట్వేమం వృష్ణిశార్దూలం స్మృతి ర్మామియ మాగతా"; యద్దేవు–వా. శ. ప. కొన్ని ప్రతులు; యిద్దేవు – ఉ. ఊ. ఎ. క. పీ.

284. 1. ధర్మజుం డనుజసహితంబుగా – పెక్కు ప్రతులు. 2. పుణ్యకథాశ్రవణ – వా; కథాశ్రవణ – పెక్కు ప్రతులు.

285. 1. జను ద్రేతాదిత్రితయమున – వా. పీ. కొన్ని ప్రతులు; జనునది త్రేత ద్రితయ మున – కొన్ని ప్రతులు. 2. బాళ్ళను వరుసన్ – చ. ల; బాళ్ళివరుసన్ – శ. బాళ్ళులవరుసన్ – డ.

286. వ. అట్లగుటం జేసి ధర్మంబు కలియుగంబునఁ గరంబు [1]దుర్లభం బయి పాద మాత్రావశిష్టం బయి యుండుఁ [2]దత్ప్రవర్తనం బాకర్ణింపుము.

287. సీ. సత్యంబు నరులకు [1]సంక్షిప్తమగు [2]సత్యహాని నాయువు గడు నఱిగిపోవు
నాయువు దఱిఁగిన నల్పంబు లగు విద్య లల్పవిద్యలను మోహంబు[3]మిగులు
మోహంబువలనఁ బైముసురు లోభంబు లోభావేశమునఁ గామ మగ్గలించుఁ
గామంబు పెంపునఁ గడఁగుఁ గ్రోధంబు క్రోధంబున
వైర మెంతయును [4]బెరుఁగు.

ఆ. [5]వైరమున నశేషవర్ణులు నన్యోన్య, పీడసేయుచును విభిన్నబుద్ధి
నొక్కఁ[6]డొకని మేర నుండక వర్ణసం, కరము సేయఁగలరు కలియుగమున.

288. క. జపనియమస్వాధ్యాయ, ప్రపంచములు విడువఁగలరు బ్రాహ్మణులు జనా
ధిప శూద్రులు విపులతపః, క్షపితులు గాఁగలరు వినవె కలికాలమునన్.

289. మ. వివిధవ్యాఘ్రమృగోరగాకులములై విస్తీర్ణశూన్యాటవీ
నివహాభీలములై యరాజకములై నిర్మూలధర్మంబులై
ద్రవిళాభీర తురుష్క బర్బర పుళిందవ్యాప్తి దుష్టంబులై
భువిలో నెల్లెడఁ బాడగున్ జనపదంబుల్ దస్యుగాంతంబునన్.

290. క. క్షత్రియజాతులు శూద్రచ, రిత్రంబున శౌర్యమును సిరియు దేజంబున్
మైత్రియును లేక చెదరి ధ, రిత్రీశ్వర శూన్యులై [1]చరించెదరు ధరన్.

291. క. రసగంధద్రవ్యంబులు, పస చెడు సస్యంబు లల్పఫలములగు మహిం
బసిపాఁడిదఱుఁగుఁ దరువులఁ, గుసుమఫలంబులును గరముఁ గొంచెంబు
లగున్.

---

286. 1. దుర్బలంబయి - ఉ. ఎ. 2. దత్ప్రకారం బాకర్ణింపుము - ఉ.

287. 1. సంక్షీణమగు - ఔ. ఘ. వీ. శ. ష; సంక్షిప్తమగుచుండు దానికి నాయువుదరిగి పోవు - ఇ. ఏ. 2. సత్యదమహాని నాయువు దరిగిపోవు - ఉ. ఘ. శ. 3. పెరుగు - ఇ. ఎ. 4. మిగులు - ఇ. ఏ. 5. వైరమెసగి యెల్లవారలు నన్యోన్య - ఒ. గి. 6. డొకఁడు - అ. ఎ. ఝ. ట. వా; డొకని - పెక్కు ప్రతులు.

290. 1. చరించెదరెందున్ - వీ. శ. ష; చరించెదరుర్విన్ - అ; చరించెదరు దగన్ - వా. చరించెదరు ధరన్ - పెక్కు ప్రతులు.

292. క. [1]అరులు మిగులఁగొని రాజులు, నరులకు నెంతయును భయ మొనర్తురు ధరణీ
సురులు గడఁగి వాణిజ్యముఁ, గరిసనమును జేయఁగలరు కలి[2]యుగవేళన్.

293. సీ. పాషండదర్శనబహుళంబు [1]లయ్యెడు వర్ణాశ్రమంబులు వసుమతీశ
తవిలి శరీరంబుఁ దద్దయుఁ బ్రోతురు పుణ్యఫలంబులు బొంకు లనుచుఁ
గాలంబుతోఁ గూడఁ గలుగవు వానలు పొల్లులై బీజముల్ వొలిసి పోవుఁ
గ్రయవిక్రయంబులఁ గపటంబు దఱ[2]చగుఁ గడఁగి యిల్లడసొమ్ము
లడఁచికొంద్రు

ఆ. సాధుచరితు లైన జనులు దుర్గతుల రో, గములఁ దెగుదు రల్పకాలముననఁ
[3]పాపపరులు లగ్గుఁ బరమాయువును నరో, గతయు సిరియుఁ
బొందఁ గాంతు రెందు.

294. క. [1]ఉఱవగు [2]నారికెపంటలు, గోఱియలపాఁడియును దఱచగుం బురుషులకుం
[3]దెఱవలు పుట్టము లయ్యెద, రెఱచియు భుజియింతు రర్థి నెల్లజనంబుల్.

295. క. పితృదైవతకార్యంబుల, నిత రేతరభోక్త లగుదు రెల్లయెడలఁ గు
త్సితదేశకాలపాత్ర, ప్రతతియ [1]వర్తించు దైవపైతృకవిధులన్.

296. క. [1]హేతుప్రత్యయ [2]వాద వి, చేతసులై వేదనింద సేయుచును మఖ
[3]వ్రాతంబులు వ్రతములుఁ జెడఁ, జాతురు దుర్మార్గకర్మపరులై విప్రుల్.

---

292. 1. అరిగొని రాజులు అనిశము – అ. 2. కాలమునన్ – వా. వీ. శ. ష. సం. యుగవేళన్ – పెక్కు ప్రతులు.

293. 1. లైయుండు – వా; లయ్యెడు – వీ. శ. ష. పెక్కు ప్రతులు. 2. చుగా గడగి యెల్లడ – ఈ. ఐ. త; చగు నడరి యెల్లెడ–ఏ. ఔ. గ. చ. ది; చగు నడరియిల్లడ– అ. ఓ. క. జ. 3. పాపపరు లనంతబరమా – శ. ష; పావనరు లనంతబరమా – ఈ. ఐ. త; పాపపరులు తగగ బరమా – అ.

294. 1. ఉరవుగ – కొన్ని ప్రతులు. 2. నారుగ – వీ. స; నారిక – గు. శర. స. మూని. 3. "భార్యా మిత్రాశ్చ పురుషా భవిష్యంతి యుగక్షయే, మత్స్యామిషేణ జీవన్తో దుహన్తాశ్చాప్యజైడకమ్" మూలము 11–193–20.

295. 1. వర్తిల్లు – కొన్ని ప్రతులు.

296. 1. నయత్స్యంతి నహోష్యంతి హేతువాదవిలోభితాః – అని మూలము. 2. వాదవ చేతసులై – ఘ. ఠ. శ; విచేతసులై – పెక్కు ప్రతులు. 3. వ్రాతముల నేమములు జెడ – అ. ఎ. ఐ. ఝ. త.

297\. మ. [1]వనితాదుర్బలదీనబంధుజనసర్వస్వాపహారుల్ సుహృ
జ్జనమాతాపితృపుత్రహంతలు యదృచ్ఛాకర్మశీలుర్ ధరన్
జనసంపూజితులై చరింతురు వినష్టశ్రీకులై విప్రు లా
జనులం జేరి [2]పరిగ్రహించెద రవజ్ఞాపూర్వదుర్విత్తముల్.

298\. మ. ధరణీరక్షణ మాచరింపక నృపుల్ దర్పంబునం బశ్యతో
హరులై సాధులఁద్రోఁచి [1]చేకురు తదీయస్త్రీధనక్షేత్రముల్
హరియింపంగలవారు దారుణతరంబై పెల్లు చెల్లుం బర
స్పర[2]వైరంబు ధరాతలేంద్రులకు [3]విశ్వప్రాణినాశంబుగన్.

299\. క. సుతుఁ డవమానించు జనకుఁ, బతి నవమానించు భార్య పడఁతులుఁ బతులుఁ
మతి నొండొరువుల మెచ్చక, సతతముఁ జరియింతు [1]రిష్టసంచారములన్.

300\. క. నడవవు దేవపితృక్రియ, లుడుగును వేదార్థసమ్యగుపదేశంబుల్
[1]గడఁగు మహామోహతమము, పుడమి సమస్తంబుఁ [2]గుజనభూయిష్ఠమగున్.

301\. సీ. పదియాఱువర్షముల్ పరమాయువయ్యెడు ధరణీశ కలి[1]యుగాంతమున వినవె
[2]యేడును నెనిమిదియేండ్ల ప్రాయంబునఁ బ్రజలుద్భవింతురు భామినులకు

---

297\. 1. "విధవానాంచ విత్తాని హరిష్యంతిహ మానవాః" – అని భం. 2. ప్రతిగ్రహించెద – వా. కొన్ని ప్రతులు; పరిగ్రహించెద–పీ. శ. ప. కొన్ని ప్రతులు.

298\. 1. చేకుర దదీయ – ఇ. ఊ. 2. యుద్ధంబు – అ. ఉ. ఐ. ట. వా; వైరంబు – పెక్కు ప్రతులు. 3. సర్వప్రాణి – ఈ. ఎ. ఐ. ఝ. త.

299\. 1. రిట్లు సంవాదమునన్ – ఈ. ఐ. త.

300\. 1. గడఁగును మోహతమంబులు – వా. పీ; గడగు మహామోహతమము – పెక్కు ప్రతులు. 2. నరకభూయిష్ఠ – పెక్కు ప్రతులు.

301\. 1. యుగాంత్యమున – కొన్ని ప్రతులు; యుగాంతమున – వా. కొన్ని ప్రతులు. 2. యేడు నెన్మిదియు నేండ్ల ప్రాయంబున – వా; యేడును నెనిమిది యేండ్ల ప్రాయంబున – పెక్కు ప్రతులు. పంచమేవాథ షష్ఠేవా వర్షే కన్యా ప్రసూయతే.

[3]ద్రవ్యవిహీనులై దాత యొక్కఁడులేక యన్యోన్యతస్కరు లగుదు రెందు
నెఱిఁగెడువారును నెంతయుఁ గ్రూరులై [4]చెనసి పాపంబు సేసెదరు సూవె

తే. యన్నవిక్రయ మొనరింతు రఖిలజనులు, వేదవిక్రయు లగుదురు [5]విప్రవరులు
పణ్యయోనుల [6]యగుదురు పద్మముఖులు, గష్టతరమైన యక్కలికాలవేళ.

302. తరువోజ.

ఉక్కున శూద్రు లత్యుగ్రులై కవిసి [1]యొడొండ పెక్కండ్ర [2]నుఱక చంపుటయు
దిక్కెవ్వరును లేక దీనులై వసుమతీ[3]సురుల్ నాలుగు దెసలఁ బాఱెదరు
ముక్కడిచోరులు ముట్టి నిశ్శేషముగ ధనావలిఁ గొని మొగి[4]వధియింప
గ్రుక్కి కాకులయట్లు శూన్యులై చెదరి సొంపఱి యడవులు [5]సొత్తురు జనులు.

303. క. శ్రుతిధర్మంబులు శూద్రులు, ప్రతిభం జెప్పంగ వినుచు [1]బ్రాహ్మణజాతుల్
[2]ధృతి సెడి తత్సేవకులై, యతినిందితకర్మకారు లయ్యెద రధిపా.

304. మత్తకోకిలము.

దేవతాయతనంబులుం జగతీసురావసథంబులుం
బావనాశ్రమభూములుం జెడి పాడగుం శుభవృత వ
ల్లీ[1]వనంబులు నాశ మొందుఁ గలి[2]ప్రచారమునందు దు
స్త్రీవిహారము మద్యపానముఁ జెల్లుఁ బెల్లుగ [3]నెల్లెడం.

---

సప్తవర్షాష్టవర్షాశ్చ ప్రజాస్యంతినరాస్తదా — అని భం. 3. ద్రవిణ — వా; ద్రవ్య — పెక్కు ప్రతులు. 4. చెలగి — ఇ. ఏ. 5. విప్ర జనులు — కొన్ని ప్రతులు; విప్రులెల్ల — ల. 6. రగుదురు — ల.

302. 1. యొక్కండ — వా; యొండొండ — పెక్కు ప్రతులు. 2. నొనరి — గ; నుక్క డంగింప — త. 3. జనుల్ — జ. 4. వధింపంగ — వా. పీ. శ. మ; వధియింప — అ. ఐ. చ. ఝ. 5. సొచ్చెదరు జనులు (?) — పెక్కు ప్రతులు.

303. బ్రాహ్మణులు కడున్ — వా. కొన్ని ప్రతులు; బ్రాహ్మణ జాతుల్ — పీ. శ. మ. పెక్కు ప్రతులు. 2. మతిసెడి — వా; గతిసెడి — అ. ఎ. ఏ. ఐ. ఝ. త; ధృతిసెడి — పీ. శ. మ. కొన్ని ప్రతులు.

304. 1. వితానము — ఘ. ట. ద. 2. ప్రభావమునందు — ఒ. ఔ. ఘ. ద. 3. నెయ్యెడం — ఒ. త; నయ్యెడం — ఈ. ఏ.

305. క. గురుఁ గొనియాడఁడు శిష్యుఁడు, గురుఁడును శిష్యునెడ వంచకుండగు మది నొం
డొరువులనొల్లరు బంధులు, పోరిఁబోరిఁ [1]గఱవులగుఁ బ్రజకుఁ బొడమును భయముల్.

306. తే. ఇవ్విధంబున ధర్మంబులెల్ల [1]నపగ, తమునఁ బడ జనులెల్లను దల్లడిల్ల
బహువిధోత్పాతములు పుట్టుఁ బార్థివేంద్ర, కడఁగి తత్కాలికాల సంక్షయము[2]నందు.

307. క. క్రమమున [1]రాష్ట్రములును నగ, రములును నాశంబునొందు రక్షాచ్యుతులై
భ్రమియింతురు జను లతిదు, ర్గమ గిరి[2]సరిదంతికములఁ గడునాతురులై.

*-: కలియుగంబున విష్ణుండు గల్కిరూపంబున ధర్మంబు ప్రతిష్ఠించుట :-*

సం. 3 - 188 - 89

308. వ. అంతఁ గలి[1]యుగాంతంబునందు భువనవిదితంబయిన శంబళగ్రామంబున కల్క్యాత్మకుండై [2]న విష్ణుయశుం డను బ్రాహ్మణుండు జనియించి సంస్మరణ మాత్రన[3]వేదశాస్త్రంబులును సమస్తశస్త్రాస్త్రవిశేషంబులు నధిగమించి సార్వభౌముం డయి.

---

305. 1. కరవగచు - ట.

306. 1. నా కతమున జెడు జనులెల్ల - ల; నపగతంబులై చెడ - డ; నగ్గతమున - వ.
2. నపుడు - కొన్ని ప్రతులు.

307. 1. నాశ్రమములు నగర - ఈ. ఝ. త. 2. సరసీతటముల గడు - ట. ద.

308. 1. యుగాంతవేళ శంబళ గ్రామంబున - ఈ. ఎ. ఐ. ఓ. ఝ. త. 2. కృష్ణాంశంబున విష్ణుయశుం డను పేర - కొన్ని ప్రతులు; విష్ణుయశుండను - వా. కొన్ని ప్రతులు.

"కల్కిర్విష్ణుయశానామ ద్విజః కాల ప్రచోదితః ।
ఉత్పత్స్యతే మహావీర్యోమహాబుద్ధి పరాక్రమః" అని మూలము 11-194-93.

3. సకలవేద - పెక్కు ప్రతులు.

309. మధ్యాక్కర.

అసదృశతేజుఁడు బ్రాహ్మణానీకసహితుఁడై కడఁగి
వసుమతి[1]యందు నధర్మవర్తులై యున్న మ్లేచ్ఛులను
మసలక నిజశక్తిఁ జేసి [2]మడియించి ధర్మంబు నిలిపి
వసునిభుం డొనరించుఁ బేర్మి [3]వాజిమేధము [4]నిష్ఠ యొప్ప.

310. క. ఘనుఁ డిల యెల్లను బ్రాహ్మణ, ధనముగ భాగించి యిచ్చి ధర్మయశో వ
ర్ధనుఁడై వార్ధకమున న, త్యనఘుండు దపోవనంబునందు వసించున్.

311. వ. అతనిచేతం [1]బ్రతిష్ఠితం బయిన [2]ధర్మంబు [3]ననుసరించి బ్రాహ్మణాదివర్ణంబులు సమర్యాదంబులై వర్తింపం గలయవి దానఁజేసి కృతయుగంబు సంప్రాప్తం బగు నందు.

312. శా. ఆరామవ్రజచైత్య[1]సద్మవనదేవాగార[2]సౌమ్యంబులై
భూరిబ్రహ్మతపస్విసంకులములై పుణ్యాధ్వరారంభసం
భారోదారములై నితాంతఫలితబ్రాజిష్ణుసస్యంబులై
యారూఢస్థితి నెల్లదేశములు నొప్పారుం [3]బ్రకాశంబులై.

313. క. సమయముతోడఁ గురియు వ, ర్షములు గరము తేజ మెక్కి చరియించు నవ
క్రములై గ్రహంబు లారో, గ్యము సౌఖ్యము సమధికముగఁ గలుగు నరులకున్.

314. వ. ఇది కృతయుగప్రవర్తనంబు త్రేతాద్వాపర [1]యుగంబులందుఁ ద్రితయ ద్వయపాదంబుల ధర్మంబ వర్తిల్లు నిట్టి తెఱంగునం గాలగతు లనేకంబులు నాకుం బ్రత్యక్షసిద్ధంబు లయ్యె [2]నీవడిగిన యతీతానాగతంబు లయిన [3]విశేషంబు లెఱింగించితి నింక నొక్క హితోపదేశంబు సేసెద నాకర్ణింపుము.

---

309. 1. నెందున ధర్మ – అ. ఈ. చ. ఝ. త. 2. మర్దించి – ఈ. ఐ. ట. త. 3. వాజిపేయము – ఈ. ఐ. త. 4. నిష్ఠతోన్ – ఈ. ఐ. త. శ.

311. 1. ప్రవర్ధితంబైన–ట. 2. ధర్మువు–ఎ. ల. 3. నను సంధించి–ఇ. ఏ. గ; ననుచరించి–ల.

312. 1. పద్మవన – పెక్కు ప్రతులు. 2. సౌఖ్యంబులై – శ. ష. కొన్ని ప్రతులు. 3. ప్రశాంతంబుగన్ – అ. ఈ. ఝ. త; ప్రకాశంబుగన్ – వా. సూ; ప్రకాశంబులై – కొన్ని ప్రతులు.

314. 1. యుగద్వితయంబునందును – వా; యుగంబులందు ద్రితయద్వయ పాదంబుల – కొన్ని ప్రతులు. 2. నీయడిగిన–అ. ల. 3. విషయంబు లెఱింగించితి–అ. ఈ. ఝ. త.

315\. క. ధరణీసురులకు నెప్పుడుఁ, [1]గరమిష్టము సేయుమయ్య కౌరవవంశో
త్తర విప్రులు సంతుష్టిం, బొరసినఁ జేకుఱు నశేషపుణ్యఫలంబుల్.

316\. సీ. సకలభూతములందు సదయాత్ముఁడవు గమ్ము పాలింపు ప్రజల నీప్రజలఁ బోలె
[1]విశదవృద్ధాచారవేదివై ధర్మంబు నలుపుము దురితవర్జనము [2]గాఁగ
నెఱుఁగమిఁ బాప మొక్కించుక దొడరినఁ [3]జయ్యన ప్రతీకారశాలివగుము
గర్వంబు విడువుము[4] గరము ప్రియంబును నిజమునుగా [5]వచోనియతి నడపు
తే. కాలగతులెల్ల నెఱిఁగి యస్ఖలితబోధ, యుక్తుఁడవు గమ్ము
ధరణవంశోద్భవుఁడవు
[6]నీవు గావున నత్యంతనిర్మలుఁడవు, ప్రాజ్ఞుఁడవు నీకు వేఱ చెప్పంగ నేల.

317\. వ. అనినవిని యుధిష్ఠిరుండు మునీంద్రా నీయానతిచ్చిన వాక్యంబు లన్నియు
నవహితుండనై వింటి నింతకు మున్ను నాయోపిన తెఱంగున లోభ
మాత్సర్యాది [1]దుర్గుణంబులు పరిహరింతు నింకను భవదుక్తంబైన ధర్మ
శాసనంబును బ్రయత్నంబునం బాలించెద నని యతనికి బ్రణమిల్లి
మఱియును బ్రాహ్మణప్రభావంబు వినువాఁడై యతనిం బ్రార్థించినఁ దద్వి
షయంబైన యితిహాసం[2]బతనికి నమ్మహాముని యిట్లనిచెప్పె.

*-: మార్కండేయుండు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావంబు సెప్పుట :-*

సం. 3 - 190 - 1

318\. చ. ఘనుఁడు పరిక్షితుండనఁ బ్రకాశితుఁడైన మహీవిభుండు [1]భా
నునిభుఁడు భానువంశ్యుఁడు వినూతనకీర్తి యయోధ్య యేలు వాఁ

---

315\. 1. గరము ప్రియము - వా. సూ; గర మిష్టము - ఇ. ఓ.

316\. 1. విదిత - శ. ష. కొన్ని ప్రతులు; వితత - వా. వీ. కొన్ని ప్రతులు; విశద - ఇ. ఉ. ఏ. ఓ. ఔ. గ. 2. సేయుమెరుగమి - వా. పెక్కు ప్రతులు; గాగ నెరుగమి - కొన్ని ప్రతులు. 3. సరగ సంప్రతికార - ఈ. త. వీ. శ. ష; జట్టన - వా; చయ్యన - డ. 4. నిర్గర్వంబు ప్రియమును - అ. ఝ. 5. వచోనిరతి - అ. ఈ. ఔ. క. ఝ. ట. 6. నీకు బ్రతిసేయ నొండొక నృపుడుగలడె - ఈ. క. ఝ. త.

317\. 1. గుణంబులు - ఇ. ఓ. క. చ. ల. 2. బొక్కటియమ్మహాముని - ల.

318\. 1. భానుని కులసంభవుండు తగనూతన - గ; భానుని మహనీయ వంశజుడు

డనుపముఁ డొక్కనాఁడు [2]మృగయారతుఁడై చరియించెఁ గానన
మ్మున నొకరుండ యిమ్ముల [3]నపూర్వజవోగ్రహయాధిరూఢుఁడై.

319. వ. ఇవ్విధంబునం బెక్కుమృగంబుల వధియించుచుఁ గ్రుమ్మరువాఁడొక్కయెడ.

320. ఆ. [1]మదగజాభిరామమృదులయానం బొప్ప, నల్లఁబొలయుచును లతాంతరములఁ
గరములీలఁ గమ్మవిరులు గోయుచునున్న, పువ్వుఁబోఁడి నొక్కపొలఁతిఁ గనియె.

321. క. కని యంతఁ గదిసి యాకా, మిని [1]యొప్పులఁ జూడ్కి దగుల మీఱిన తమకం
బున ననిమిషలోచనుఁడై, జననాథుఁడు మదనబాణసంహతిఁ దూలెన్.

322. వ. అదియును నతిసుందరంబైన తదీయమూర్తివిభవంబునకు మెచ్చి సాభి
ప్రాయంబుగా నవలోకించె నంత నమ్మహీకాంతుం డక్కాంత కి ట్లనియె.

323. ఉ. ఎవ్వరిదాన వంబుజదళేక్షణ యేకత మిట్టులేల నీ
వివ్వనభూమియందుఁ జరియించెదు నావుడుఁ దండ్రిపంపునం
దివ్వనభూమియందుఁ జరియించెద సద్వరుఁగోరి కన్య నే
నెవ్వరిదానఁ గావలయు నేర్పడఁ జెప్పుము రాజనందనా.

324. వ. అనిన దాని[1]ప్రగల్భవచనంబులకు నధికవిలోలుండై భూపాలుండు దన
యభి[2]లాషం బెఱింగించిన నమ్మగువ నన్నెన్నండును జలవిహారంబునకుఁ
బొనుపకుండునది యట్లయిన నిన్ను వరియించెద ననిన వాఁడును దత్సమ
యంబున కొడంబడి దానిం దోడ్కొని [3]పురంబునకుం[4]జనుదెంచి యిష్టసుఖ
తత్పరుండయి యుండె[5]నంత నొక్కశరత్సమయంబు నందు.

---

నూతన – ట. 2. మృగయాతురుడై – ఊ. ఘ. 3. న పూర్వజవాశ్వరథాధి
రూఢుడై – ద; ప్రభూత బలోగ్రహయాధి – ఝ.

320. 1. మదభరాభిరామ – వా. కొన్ని ప్రతులు; మదగజాభిరామ – పెక్కు ప్రతులు.

321. 1. యేపున జూడ్కిదగుల మిగిలిన తమకం – ట.

324. 1. ప్రాగల్భ్యవచనంబులకు నతిలాలసుండై – ట. 2. ప్రాయంబెరింగించిన –
ఘ. జ. ద. 3. నిజపురం – కొన్ని ప్రతులు. 4. జని యిష్టోపభోగముల ననుభ
వించుచున్నంత – ఆ. 5. నంతనొక్క వాఁడు శర – వా; నంతనొక్క శర –
కొన్ని ప్రతులు.

325. చ. అతులితపుష్పపల్లవఫలాన్వితభూరుహభూరివల్లరీ
[1]వితతముఁ జారుకైరవనవీనసరోరుహషండమండలీ
యుతసరసీమనోహరము నైన పురోపవనంబునం దసము
న్నత[2]విభవుండు వాసభవనంబు లొనర్పఁగఁ బంచి [3]యిమ్ములన్.

326. క. దేవీసహితంబుగఁ బృథ్వీవరుఁ డవ్వనమునందు విహరించె ఘనాం
తావసరవాసరంబుల, భావితపద్మవనపవన[1]పరిచితుఁ డగుచున్.

327. వ. అంత నొక్కనాఁడు నితాంతఘర్మజలకణాకలితశరీరుండై ప్రియాసమేతంబుగా వాసగృహంబు వెలువడి తత్సమీపంబున నతిమనోహరంబయిన కమలాకరంబు గని దానితీరంబున నయ్యగ్రమహిషి నునిచి దాను గృతావగాహుండై.

328. క. మేనై యున్నది జలము వి, శాలనయన చెమట[1]వోవఁ జల్లిన దేహ
క్షాళన మొనరింపు మనిన, [2]నాలేమ [3]దరస్మితాననాంబుజ యగుచున్.

329. ఆ. మడుఁగు సొచ్చి మునిఁగి మాయమై పోయిన, నద్భుతాత్ముఁ డగుచు
నవనివిభుఁడు
మడుఁగు గలయ వెదకి మానినిఁ గానక, జలము లెల్ల వెడలఁ జల్లెఁ గడఁగి.

330. వ. ఇట్లు సల్లియందు మండూకంబు లనేకంబు లున్నం జూచి యివి మత్ప్రియాంగనను మ్రింగినవి గాకేమి యని కలుషించి యనుచరులం బిలిచి నాకుఁ బ్రియంబు సేయ[1]వలసినవారు గలిగినం బుడమిం గల కప్పలనెల్లం బొడవడంగించునది యనిపంచిన నలుదిక్కులకుం జని తదీయకింకరవర్గంబు.

---

325. 1. వితతుల - ఝ. ల. పీ.? 2. సుఖుడై విలాసభవనంబు - ల. 3. [illegible] - ట.

326. 1. పరిణతుడగుచున్ - ట.

328. 1. యుడుగ - పీ. శ. ష. కొన్ని ప్రతులు; దొలఁగ - వ. 2. నాలేమయు నలి తాననాంబుజ - అ. 3. దరస్మితాంబుజానన యగుచున్ - ఝ; దరహాసితాననాంబుజ - ట.

330. 1. దలంచినవారు - ఎ. ఐ. ఝ; గలవారు - అ.

331. చ. కొలఁకుల వాగులన్ నదులఁ [1]గ్రోవుల బావుల నిర్ఝరంబులం
గలయఁగ రోసిరోసి వడిఁ గప్పలఁ గుప్పలుగా వధించుచో
[2]నలుగుల మందు భేకనివహంబు గనుంగొని భేకనాయకుం
డలఘుతపస్విరూపమున నానృపుపాలికి వచ్చియిట్లనున్.

332. ఉ. అక్కట లోకమెల్ల నగ నాఁడి కప్పలఁ జంప[1]నేల యిం
దెక్కడిపెంపు గల్గుఁ బృథివీశ్వర కోపము డింపు కప్పలం
జక్కని చూడ్కిఁ జూడు మిది చాలనధర్మము నావుడున్ విభుం
డెక్కడి మాట [2]నాసతికి నెగ్గొనరించెఁ గడంగి భేకముల్.

333. క. నాయిష్టవనిత మ్రింగిన, మాయపుఁబుర్వులివి వీని మడియింతు మునీం
ద్రా [1]యుడుగుము నీవనుటయు, నాయన యత్యంతదుఃఖి
తాత్ముండగుచున్.

334. వ. ఏను మండూకనాయకుఁడ నాయు వనువాఁడ నమ్మగువ నాకూఁతురు
[1]సుశోభన యనునది దానిచేత ననేకులు బేలుపడిరి నీవెంతవాఁడ వనిన
నప్పరిక్షితుం డక్లేని నాకు నమ్మొలఁతుకఁ దెచ్చి యొప్పింపవలయు నని
ప్రార్థించిన నతండు నవ్వుచు నవ్వామ[2]నయనం దలంపున రావించి యా
రాజునకు నిచ్చి దానింజూచి కోపించి నీవు గడుంజెట్టవు ప్రసిద్ధులగు[3]రాజులం
బెక్కండ్రం [4]జిక్కులంబెట్టితివి గావున నీకుంబుట్టెడు కొడుకులు గపటవర్తను
[5]లయ్యెడుమని [6]కూఁతు శపియించి మండూకరాజు నిజేచ్ఛంజనియెఁ

---

331. 1. గ్రోతుల – ఆ. 2. నలుగులనుంది – త. డ; నలబలమందు — ల; నలుగుల
మందు – శర.

332. 1. దీననీ కెక్కడి – అ. ఈ. ఝ. త. వీ. సూ. 2. నాకుకడునె – ఆ. ఉ. ఊ.
ఒ. ఓ. ఔ. ద; నామదికి – వీ. శ. ష.

333. 1. యరుగుము – వీ. శ. ష. సూ. కొన్ని ప్రతులు.

334. 1. సంశోభని – ఈ. ఐ; సంశోభన – త; సులోచన – ఔ. ద. గృహీత పాఠమే
మూలానుగుణము 11-195-32. 2. లోచనం – అ. ఈ. ఎ. ఐ. ఝ. త.
3. భూపతులం – పెక్కు ప్రతులు. 4. బెనవెట్టితివి – వా; జిక్కులం బెట్టితివి —
వీ. శ. ష. పెక్కు ప్రతులు. 5. లయ్యెదరని – అ. గ. ఝ. 6. కూతునకు

బరిక్షితుండును సంప్రాప్తమనోరథుం డయి సుశోభనయందుఁ గ్రమంబున
శలుండును దలుండును వలుండును నను మువ్వురు గొడుకులం [7]బడసి యం
దగ్రజుం డయిన [8]శలు నభిషిక్తుం జేసి తపోవనంబున కరిగె నంత.

335. క. శలుఁడొక్కనాఁడు కనకో,జ్జ్వల మగు రథమెక్కి వేఁటసని పెక్కుమృగం
బులఁ జంపఁగ నొక్కమృగం, బలఘుతర [1]శరాగ్రవిద్ధమై వెసఁ బఱచెన్.

336. ఆ. ఇట్లు పఱచుటయును నెంతయు రయమున, నమ్మృగంబు [1]వెనుక
నరిగి యరిగి
యెయిద లేక ధారుణీశుండు సారథిఁ, బదరి తేరు వేగ పఱవు మనియె.

337. సీ. అనవుఁడు సూతుఁ డిట్లను దేవ మనమెంత దఱిమిన మృగము దద్దయు జవంబు
గలదు రథ్యంబులు గడుకొని కూడంగఁ జాలవు వలవని[1]జాలి యేల
మనతేరిహరులు వామ్యములైన నమ్మృగ మగపడు లేకున్న నలవిగాదు
నావిని వామ్యముల్ నాఁగనెవ్వని హయంబులు సెప్పుమనియె
నబ్భూవిభుండు

తే. వామదేవమహామునివరుని హరులు, వామ్యములు నాఁగఁజను నని
వాఁడుఁ జెప్పె
నతనియాశ్రమ[2]మెచ్చట నచటి కిపుడ, తేరుపోవని మ్మనియె ధాత్రీవిభుండు.

338. వ. వాఁడును రథంబు సత్వరంబుగా వామదేవునాశ్రమంబునకుం బఱపినం జని
యాతం డాతపో[1]నిధిం గని నమస్కరించి మునీంద్రా నాచేత నేటువడి
యొక్కమృగంబు రయంబునం బఱచె [2]నమ్మృగంబు వధియింప వలయు
భవదీయహయంబుల [3]నీవలయు ననిన నతండు నీవుకృతకార్యుండవై మా

---

శాపంబిచ్చి – పీ. శ. ష; కూతురు శపియించి – అ; కూతుర శపియించి – ఎ.
7. గని – కొన్ని ప్రతులు. 8. శలుని రాజ్యాభిషిక్తుం జేసి – అ. ఐ. ఔ. ఝ. ల.

335. 1. శితాస్త్ర – వా. కొన్ని ప్రతులు; శరాగ్ర – పీ. శ. ష. కొన్ని ప్రతులు.

336. 1. వెంట నరిగి – ఓ. ఔ. ద.

337. 1. జోలి – ల. 2. మెక్కడ – కొన్ని ప్రతులు.

338. 1. ధనుం – ఈ. ఝ. త. 2. నామృగంబునేడ వధియింప – జ. పీ. శ; వెనుకొని వధియింప – అ. ఈ. ఎ. ఐ. ఝ. త. 3. నీవెయనిన – వా. పెక్కు ప్రతులు;

హయంబులం దడయక యొప్పింపవలయు [4]నశ్లేనిం గొనిపొ మ్మనిన వల్లె యని వామ్యంబులంగొని రథయుక్తంబులంగావించి తదీయజవంబునకు మెచ్చుచు ముహూర్త[5]మాత్రంబునఁ [6]గూడముట్టి మృగంబు సమయించి మగిడి నిజపురంబునకునచ్చి.

339. మత్తకోకిలము.
రాజయోగ్యములైన యీహయరత్నముల్ జవసత్త్వవి
భ్రాజితంబులు వానికేటికిఁ బాలువానికి నంచు నా
రాజు రాజసబుద్ధి నంతిపురంబు[1]నందిడఁ బంచె న
వ్వాజియుగ్మము వేడ్క నూనినవాఁడు దోస మెఱుంగునే.

340. వ. [1]అట వామదేవుండును దనయశ్వంబుల శలుండు గొనిపోయి మగుడ నొప్పింపక [2]తడయుట కాత్మగతంబున.

341. తే. రాజపుత్త్రుండు బలియుండు [1]రాజసుండుఁ, [2]గొండికాతండు వేడుకఁ గొనుచు [3]నరిగె
నశ్వములఁ గ్రమ్మఱఁగ నిత్తు ననువిచార, మెవ్విధంబున నతనికి నేల కలుగు.

342. వ. అని శంకించి నిజశిష్యు నాత్రేయుం డనువానిం జూచి శలుండు మన వామ్యంబులంగొని పోయి యొక్కమాసం[1]బరుగుదెంచె వాఁడును దనయంతఁ దెచ్చుట [2]గలుగనేరదు నీవరిగి మన[3]తురంగరత్నంబులం గొని రమ్మని పంచిన నప్పుడ కదలి [4]యయోధ్యా నగరంబునకుం జని.

---

నీవలయుననిన – అ. వీ. శ. ష. 4. ననిన వల్లెయని – శ. ష; నట్లయినం – వా. వీ. పెక్కు ప్రతులు; నశ్లేనిం – అ. ఈ. ఐ. త. 5. మాత్రంబునకు నమ్మృగంబు గూడముట్టి దానిని సమయించి – వీ. శ. ష. 6. గూడముట్టి యమ్మృగంబు – వా. పెక్కు ప్రతులు; గూడముట్టి మృగంబు – కొన్ని ప్రతులు.

339. 1. నన్నియమించె – కొన్ని ప్రతులు.

340. 1. అంత – ఊ. ట. 2. తడయుటయు నాత్మ – వా. కొన్ని ప్రతులు; తడయుటకు నాత్మ – కొన్ని ప్రతులు.

341. 1. రాజసమున – ఉ. ఘ. వీ. శ. ష; రాజసమున కోడెకాడు వేడుకబడిగొనుచు నరిగె – స. 2. కొండికాడు వేడుకపడి గొనుచునరిగె – ల; కొండుకాడు వేడుకపడిగొనుచుపోయె – క; కొండొకాతడు – గ. 3. బోయె – ఉ. ఊ. ఏ. ఔ. క.

342. 1. బేగుదెంచె – ఈ. ఎ. ఐ. క. ఝ. త. 2. కలుగదు – కొన్ని ప్రతులు. 3. తురంగ రత్నంబుల – వా. కొన్ని ప్రతులు; తురంగంబుల – శ. ష. 4. యయోధ్యకుంబోయి–వా. వీ; యయోధ్యానగరంబునకుంజని – పెక్కుప్రతులు.

343. క. మనుజపతిఁ గాంచి యాతఁడు, మునిపతి పుత్త్రేర [1]నధిపముఖ్య యిచటి కేఁ
జనుదెంచితి మాహయముల, నెనసిన [2]నెయ్యంబుతోడ నిమ్మని యడిగెన్.

344. క. అనవుడు శలుఁ డిట్లనియెం, జను నిముఁ[1]బుత్త్రేఁగ నతఁడు సాలుదు [2]ఏవుం
గొనిపోవఁ దురంగంబులఁ, జనుమీ [3]దుర్భాషణములు సైఁపను మాకున్.

345. వ. అనిన నమ్మునికుమారుండు గ్రమ్మఱి చని గురునకు నవ్విధం బెఱింగించిన వామదేవుండు క్రోధపరీతచేతస్కుండై శలునిపాలి కరిగి యిట్లనియె.

346. క. ఇమ్ము నరేశ్వర మా తురగమ్ముల నీకార్యమయ్యెఁగాదే కడు లో
భమ్మున [1]నొండుల సొమ్ములు, [2]రమ్మనిన్ వచ్చునే దెగవు నత మగునే.

347. క. పరధనహరణము దురితము, పరికింపుము వరుణుచేతిపాశంబుల ని
ష్ఠురముగఁ గట్టువడకు ని, ర్భర[1]నరకకృశానుశిఖలఁ బడకుము మీఁదన్.

348. చ. అనుటయు నాతఁ డిట్లనియె నాఱడివిప్రుల కేల యశ్వముల్
ఘనతరసత్త్వమూర్తు లనఁగాఁ దగు[1]నెడ్లను రెంటి నిచ్చెదన్
విను మటుగాక బల్లిదపు[2]వేసడముల్ పలతేని నిత్తు గా
కొనుము [3]తగంగ వామ్యములఁ గోరక పొమ్మడియాస [4]లేటికిన్.

349. క. అనిన [1]నివి యేటిమాటలు, వినువారలు నవ్వ నకట విప్రుల [2]ధనముల్
గొనివేఱ యొంటి నిచ్చెద, నను టిది యేనాఁటి చందమని మునిపలికెన్.

---

343. 1. రాజముఖ్య - కొన్ని ప్రతులు. 2. హృదయంబుతోడ - త. శ.

344. 1. బుత్తెంచె - పెక్కు ప్రతులు. 2. నీవుం - పెక్కు ప్రతులు. 3. దుర్భాషిత ములు-ఈ. ఊ. ఒ. ఓ. గ. చ. ట. వా; దుర్భాషణములు-పి. శ. వ. కొన్నిప్రతులు.

346. 1. నొరువుల - ఈ; ననొరుల - ల; ననొండ్ల - శర; నొండ్లని - వా. నూ; నొండుల - అ. ఎ. ఔ. జ. 2. రమ్మన్నను - శ. వ.

347. 1. శమన కృశాను - ఇ. ఏ.

348. 1. నెద్దుల - అ. ఇ. ఏ. జ. డ. ల. వ. 2. "చత్వారో వా గర్దభాస్త్వాం వహన్తు। శ్రేష్ఠాశ్వతరో హరయో వా తురగాః - అని భం. 3. కడంగి - వా. పెక్కు ప్రతులు; తగంగ - అ. శ. 4. యేటికిన్ - శర.

349. 1. వివి - కొన్ని ప్రతులు. 2. సొమ్ముల్ - జ. ట. ల.

350. క. [1]పలుకుటయు నలిగి శలుఁడి, [2]ప్పలుగుఁ దపసి నంటఁ గట్టి పటుశూలములం
బొలియింపుఁ డనుచు భీకర, బలుల నియోగించెఁ దనదుపార్శ్వజనములన్.

351. వ. అంతయుం జూచి వామదేవుండు ఘనరోషభీషణప్రహాస [1]దుర్నిరీక్ష్యముఖుం డగుటయు నక్షణంబ ఘోరాకారు లగు రాక్షసు లనేకులు పుట్టి నిశాత శూలంబుల నాభూపాలుం బొడిచి కాలగోచరుం[2]జేసిరి మునీంద్రుండు నిజేచ్ఛం జనియెఁ దదనంతరంబ శలానుజుండు దలుం డనువాఁడు నిజరాజ్య పట్ట[3]బద్ధుండై [4]సుఖంబుండఁ గొండొకకాలంబునకు వామదేవుఁడు సను దెంచి వానిం గని మహాత్మా నీవు ధర్మపరుండవు ధర్మువు దప్పనోడుదేని మాహాయంబుల నిమ్మనుటయు దలుం డలిగి నిజసమీపంబున నున్నసారథిం జూచి యి ట్లనియె.

352. సీ. కడుఁగ్రొవ్వి తేఁకువ సెడియె నీపాఱుండు [1]వీఁకమై నిప్పుడు వీనిఁజొమ్ము
వ్రయ్యంగ [2]నేసెదఁ జయ్యన విషదిగ్ధసాయకమును శరాసనముఁ దెమ్ము
నావుడు నమ్మహీదేవుండు నగుచు నిట్లనియె నన్నేయఁ దెమ్మనిన విశిఖ
మంతఃపురంబున సంతసంబున [3]నున్నయనఘు భవత్సుతుఁ [4]దునుముగాక

తే. యనఁగఁ దదనంతరంబ ఘోరాస్త్రనిహతుఁ, డైన బాలునిఁగొనుచు హాహారవంబు
లెసఁగ [5]నంతిపురంబువారెల్ల వచ్చి, రదిద్రుపదంబుగఁ గనియును నవ్విభుండు.

---

350. 1. శలుడలిగి యత్తపస్విని । బలు ద్రాళుల నంటగట్టి పటుశూలములన్ – శ. వీ. శ. ష; శలుడలిగి యత్తపస్విని బలువిడి నంటంగగట్టి పటుశూలములం – ఆ. 2. ప్పలవు – కొన్ని ప్రతులు.

351. 1. దుర్నిరీక్షణ రూక్ష – వా; దుర్నిరీక్షుండగుటయు నక్షణంబ – పెక్కుప్రతులు. 2. జేసిన – డ. 3. భద్రుండై – చ. డ. ద. 4. సుఖంబుననుండ – కొన్ని ప్రతులు.

352. 1. వెరవేది – ఆ. 2. జేసెద – వా. వీ. శ. ష. కొన్ని ప్రతులు; నేసెద – కొన్ని ప్రతులు. 3. నున్న ఘనుభవత్సుతు – వా. కొన్ని ప్రతులు. 4. దున్మగాక యిప్పుడనగ – ల; దున్మగాక యిపుడ – వా. పెక్కు ప్రతులు; దునుముగాక – ఘ. 5. నంతఃపురంబు – ఇ. ఉ. ఊ. ఎ. ఏ. ఘ. చ. జ. ఝ; నంతఃపురం బింతు లెల్ల – ఠ,

358. వ. అని యివ్విధంబున నతం[1]డేపు దప్పి జోహారు వెట్టుటయుఁ దదీయబంధుమిత్ర జనంబులు భయసంభ్రమంబులతో నమ్మునినాథు శరణు సొచ్చి యనున యించినఁ బ్రసన్నుండై యమ్మహాత్ముండు దత్కరయుగ స్తంభనంబు మాన ననుగ్రహించి తదీయనందనుప్రాణంబు లొసంగె నంతనమ్మహీకాంతుండు [2]భార్యాసహితంబుగా నతనికిఁ బ్రణమిల్లి హయంబులఁ దెచ్చి యొప్పించినం గైకొని వామదేవుం డరిగె నిట్టిది బ్రాహ్మణప్రభావంబని చెప్పిన విని.

359. క. మునిపతికి మ్రొక్కి కుంతీ, తనయుఁడు మీకంటె వృద్ధతముఁ డగు పురుషుం డనఘా కలఁడె జగమ్మున, ననియడిగిన నాతఁడిట్టు లని యెఱిఁగించెన్.

*-: మార్కండేయుఁడు ధర్మరాజునకు నింద్రద్యుమ్నునికథ చెప్పుట :-*

సం. 3 - 191 - 2

360. క. ఘనుఁ డింద్రద్యుమ్నుం డను, జనపతి గలఁ డాతఁ డింద్రసదనమున ముదం బున నుండఁగ బహుకాలం, బున కాతనికీర్తి లోకమున మాయుటయున్.

361. తే. అమరు లచ్చోట నుండలే వరుగు మనుచు, నుర్విఁ ద్రోచిన నతఁడు నాయున్న[1]కడకు
నర్థిఁ [2]జనుదెంచి యిట్లను ననఘ నన్ను, నిద్ధపుణ్యు నింద్రద్యుమ్ను నెఱుఁగు దయ్యా.

362. సీ. అనుడు నే నిట్లంటి నయ్య నిన్నెఱుఁగంగఁ జాల నయ్యెద [1]హిమశైలశృంగ
[2]వాసియై యుండు [3]ప్రావారకర్ణుం డను పేరి ఘూకము గడుఁ బెద్ద యదియు
నాకంటె నిన్ను నిర్ణయముగ నెఱుఁగుఁ బొమ్మనుటయు నన్ను రమ్మనియె నతఁడు
ఘనరసాయన ఘుటికాప్రయోగంబున [4]దేహతాపంబు వర్ధిల్లె నందు

---

358. 1. డేటుదప్పిన - వా. పెక్కు ప్రతులు; డేపుదప్పి - గ. 2. నిజభార్యా బంధు జనసహితంబుగా - వా. కొన్ని ప్రతులు; భార్యాసహితంబుగా - పి. శ. ష.

361. 1. యొడకు - కొన్ని ప్రతులు. 2. నేతెంచి - బొ.

362. 1. అస్తిఖలు హిమవతి - మూలము; హేమశైల - ఎ ఐ. త. 2. చారి - ఓ. ల. 3. ప్రావాళకంతుండనియెడి - కొన్ని ప్రతులు. ప్రావారకర్ణోనామ ఉలూకః - అని మూలము. 4. దేహదాహంబు వర్ధిల్లెగాన - పి. శ. ష; వర్ధించె నేడు - వా. కొన్ని ప్రతులు; వర్ధించెనెందు - ల.

తే. గదలి రాఁజాల నేనంటిఁ గడఁగి యన్న, రేంద్రుఁ డశ్వమై నను బ్రీతి నెత్తికొనుచు
నయ్యులూకము పాలికి నరిగి నన్ను, నడిగినట్టుల దానిని నడుగుటయును.

363. వ. అదియునుం గొండొకసేపు దలపోసి చూచి యేను నిన్ను నిక్కువంబుగా నెఱుంగనేర నింద్రద్యుమ్నుఁ బనుకొలనియందు నాళీకజంఘుం డను పేరి బక వల్లభుండు వసియించు నవ్విహంగంబు [1]నాకుఁ బెద్ద నిన్నెఱుంగు నరుగు మనిన నమ్మనుజపతి నాతోడఁగూడ నయ్యులూకంబు మోచికొని నాళీక జంఘునొద్దకుం జని తనపేరు సెప్పి నన్నెఱుంగుదే యనిన నదియు నే నిన్నె ఱుంగం జాల నాకంటెఁ జిరకాలజీవియైన [2]యకూపారుం డను కచ్ఛపంబు గల దదియును [3]నిక్కొలన నుండు నజ్జలచరము నిన్నెఱుంగం[4]బోలు నడిగి చూతము గాక యని యక్కమఠంబుఁ జేర్కొని యొక్క సందేహంబు నిర్ణ యించుటకయి యీయార్యజనంబులు నిన్నుగుఱించి వచ్చినవారు నీవు సనుదేరవలయు నని [5]పలుకుటయును.

364. తే. కొలను వెలువడి చనుదెంచెఁ గూర్మవిభుఁడు
వార లడిగి రింద్రద్యుమ్నధారుణీశు
నెఱుఁగుదే యన నదియు నొక్కింత [1]తడవు
దలఁచికొని కన్నుఁగవ నశ్రుజలము [2]లొలుక.

365. వ. [1]ఎలుంగు రాలుపడ వారలం గనుంగొని యిట్లనియె.

366. ఉ. అక్కట నే నెఱుంగనె మహాగుణభూషణు నమ్మహాత్ము న
[1]న్నిక్కడ బెక్కుమాఱులు ననేకభయంబులఁ బొందకుండఁగా
నక్కటికంబుతోడఁ దగ నాతఁడు గైకొని కాచెఁ గాదె పెం
పెక్కిన [2]యన్నరోత్తముని నెన్నఁటికిన్ మఱువంగ వచ్చునే.

---

363. 1. నాకంటెఁబెద్ద-కొన్ని ప్రతులు. 2. యుగంధరుండను - అ. ఘ. ద. శ. ష. కాని, అకూపారః - అని మూలము. 3. నిక్కొలనన యుండు - ఊ. ఘ. ల; నీకొలననయుండు - ఈ. ఐ. 4. జాలు - వా. కొన్ని ప్రతులు; బోలు - కొన్ని ప్రతులు. 5. వేడుటయును - వా. వీ; పలుకుటయును - పెక్కు ప్రతులు.

364. 1. సేవు - వా. పెక్కు ప్రతులు; తడవు - అ. ఎ. ఝ. 2. ఉరుల - వా; లొలుక - పెక్కు ప్రతులు.

365. 1. అతడెలుంగురాల్పడ - శర. శ. ష.

366. 1. న్నక్కట బెక్కుమారులు భయంబున బొందక యుండునట్లుగా - ఉ. 2. యన్న రేశ్వరుని - వీ. శ. ష.

367. తే. అమ్మహాత్ముండు బహువిధయజ్ఞదక్షి, ణార్థముగ విప్రవరులకు నర్థినిచ్చు
గోగణంబుల గొరిజల [1]గ్రొచ్చి యయ్యెఁ, గాదె యీసరోవరము
జగన్నుతముగ.

368. వ. అనిన యనంతరంబ దేవదూతలు విమానంబు గొనుచుఁ జనుదెంచి యింద్ర
ద్యుమ్నుం గని మహాత్మా నీకీర్తి జగంబునందు శాశ్వతంబై నిలిచె నీకుఁ
ద్రిదివనివాసంబు [1]సుస్థిరంబయ్యె నరుగుదెమ్ము విమానం బెక్కుమని [2]పెండియు.

369. క. తనకీర్తి యెంతకాలము, వినఁబడు నిజ్జగమునందు వెలయఁగ నంతాఁ
కను బుణ్యలోకసౌఖ్యం, బున నెంతయు [1]నుల్లసిల్లుఁ బురుషుం డనఘా

370. వ. [1]అనిన నమ్మహీకాంతుండు దివిజకింకరులం జూచి యిమ్మునిసలి తాపసుని
వృద్ధవిహంగంబును గార్యార్థంబు సహాయులుగా దెచ్చితి వీరిని నిజస్థానంబుల
నునిచి వచ్చెద నించుక నిలువుండని వారిచేత ననుజ్ఞాతుం డయి నన్నును
నులూకంబును నెప్పటి నెలవులం బెట్టి తానును దేవయానంబున [2]దివంబున
కరిగె నని చెప్పినఁ బ్రీతుఁడై పృథానందనుండు.

371. క. నీకంతెు వృద్ధతమముని గు, ణాకర యెఱిగించి తిది మహాద్భుతమని సు
శ్లోకుఁడు మునివరునకుఁ బ్రు, ణ్యాకృతికిఁ గృతప్రణాముఁడై కడు భక్తిన్.

---

367. 1. గ్రొప్పి – శర; గ్రొస్సి – వా. సూ. కొన్ని ప్రతులు; గ్రోసి – ఎ. చ. వ;
గ్రొచ్చి – ఉ. ప. ఓ. క. గ.

368. 1. సుచిరంబయ్యె – ఉ. ఒ. ఓ. గ. 2. పెండియు – పెక్కు ప్రతులు; మఱియును–
వా. కొన్ని ప్రతులు.

369. 1. నుండ జెల్లు – ఔ; సంతసిల్లు – స.

370. 1. ఈ వచనమునకు ముందు 'చ' ప్రతిలో అధిక పాఠము.
దుష్టుడగు పాపకర్ముడు కష్టంబగు నరకములను గ్రాగుచు నీచో
త్కృష్టుండై వర్తించు సుతుష్టిలేక జగములో విదూషితు డగుచున్;
అనుటయు – వా; అనిన – పెక్కు ప్రతులు. 2. బుణ్యలోకంబున – వా; దివం
బున కరిగె – వి. శ. ప.

-: మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ గువలాశ్వచరిత్రము సెప్పుట :-

సం. 3 - 192 - 4

372. వ. మునీంద్రా యిక్ష్వాకువంశోద్భవుండైన [1]కువలాశ్వునకు ధుంధుమారుం డను పేరెట్లు గలిగెఁ జెప్పవే యని యడిగిన నతం డిట్లనియె.

373. ఉ. శంకరసన్నిభుండు జన[1]శంకరుఁడున్ కరుణాకరుం డనా
తంకుఁ డుదంకుఁ డన్ముని [2]వ్రతస్థితుఁడై మరుభూమియందు ని
శ్శంకమతిన్ వసించి యనిశంబును నవ్యయు నచ్యుతుణ్ మనః
పంకజవేదిపై నిడి తపం బొనరించె ననేక[3]వర్షముల్.

374. తే. అతనిభక్తికిఁ బ్రియమంది యాదిదేవుఁ, డంబుజాక్షుఁ డధోక్షజుఁ [1]డక్షరుండు
గరుణఁ బ్రత్యక్షమగుటయు గని యతండు, [2]ప్రణతి యొనరించి యిట్లని ప్రస్తుతించె.

375. మత్తకోకిలము.
దేవదేవ [1]శ్రుతిప్రమాణవిధేయ మాధవ జంగమ
స్థావరాత్మక మైన లోకము సర్వముణ్ భవదీయమా
యావిధేయము విశ్వరూపుఁడ వవ్యయుండవు [2]నీవ స
ద్భావ[3]సుస్థితి నిన్నెఱింగినఁ బాయుఁ బాపము లచ్యుతా.

376. చ. అనిమిషసిద్ధసంయమి [1]విహంగభుజంగమముఖ్యు లెల్ల ని
న్ననిశముఁ గొల్చి నీ[2]దయఁ గృతార్థతఁ బొందుదు రెందు నీవు నె

---

372. 1. కువలయాశ్వ - పెక్కు ప్రతులు కాని - 'కువలాశ్వ' అనియే మూలము.

373. 1. శంకరసత్కరుణాకరుం - పెక్కు ప్రతులు; శంకరుడున్ కరుణాకరుం - వీ. శ. ప. 2. కృతస్థితియై - ఊ. ఏ. ఒ. ఓ. క. గ. జ. వీ. శ. ప. ధృతస్థితియై - ఎ. 3. కాలముల్ - అ; ఈ. ఎ. ఐ. ఝ. ట. త.

374. 1. డచ్యుతుండు - ఉ. ఘ. 2. ప్రణుతి - ఆ. ఔ. ఘ. చ.

375. 1. కృత ప్రణామ విధేయ - అ. ద; శ్రుతి ప్రణామ విధేయ - ఊ. ఎ; శ్రుత ప్రణామ విధేయ - గ. 2. నీవు - పెక్కు ప్రతులు. 3. సంస్థితి - ఆ. క. చ.

376. 1. విహంగమపన్నగముఖ్యు లెల్ల - ఘ. చ. 2. కృప - ఆ. ఇ. ఉ. ఊ. ఏ. ఓ.

మ్మనమున [3]సంతసిల్లుదు సమస్తజగంబులు శాంతిఁబొందు నీ
కినుకకు మాఱులేదు [4]శివకీర్తిత యీభువనత్రయంబునన్.

377. మత్తకోకిలము.

విక్రమ[1]త్రయలీల నోలిన విష్టపత్రితయంబుఁ బె
ల్లాక్రమించితి [2]క్రూరులైన సురారివీరులఁ బ్రస్ఫుర
చ్చక్రవిక్రమ[3]కేళిఁ ద్రుంచితి సర్వయజ్ఞఫలావహ
ప్రక్రియాత్మకుఁడ వీవు నిశ్చల [4]భక్తిగమ్యజనార్దనా.

378. వ. అని మఱియుం బెక్కు[1]భంగులం బ్రస్తుతించినం గరుణించి పాంచజన్యధరుండు వరం బడుగు మనిన నుదంకుడు దేవా భవదీయ[2]దివ్యరూపంబుఁ బ్రత్యక్షంబుగాఁ గంటి నింత[3]కంటె వరం బెయ్యదిగల దైనను నామనంబు నిత్యంబును సత్యధర్మశమంబులయందు [4]సుస్థిరంబై నీయందు దృఢ[5]భక్తికంబు గావలయు నిదియ నాకు వరం బనుటయు నద్దేవుండు నీకోరిన[6]యట్లు యిచ్చితి మత్ప్రసాదంబున నీకుం బరమజ్ఞానయోగంబును సిద్ధించు త్రిలోకహితం బైన [7]కార్యం బొక్కటి నీచేత [8]సాధితం బయ్యెడు నది యెయ్యది యనిన వినుము ధుంధుం డను దానవుండు జగంబుల కుపద్రవంబు సేయంగలవాఁడు తద్వధార్థంబై నీవు బృహదశ్వసూనుం డైన కువలాశ్వు నుద్యుక్తుం జేసెదఁ

---

బొ. గ. ఘ. చ. జ. ట. ద. 3. సంతసిల్లిన – ఏ. ల; సంతసిల్లుదు – ? గు. వా. శర. సం; సంతసిల్లుదు – కొన్ని ప్రతులు. 4. సితకీర్తన – ఘ; సితకీర్తియు – ఆ. ట; శివకీర్తన – వా. పెక్కు ప్రతులు; శివకీర్తిత – గ.

377. 1. క్రమలీల – ఆ. ఉ. ర. ద. 2. పోరులందు – ఆ. ఉ. ఘ. ద. వీ. శ. ష. 3. కేళినొంచితి – ట. 4. భావభవ్య – వా. వీ. శ. ష; భక్తిగమ్య – పెక్కు ప్రతులు.

378. 1. విధంబులం – కొన్ని ప్రతులు. 2. దివ్య–కొన్ని ప్రతులలో లేదు. 3. కంటె నుమిగులవరం – వా. కొన్ని ప్రతులు; కంటెవరం – అ. ఆ. జ. శ. ష. 4. తిరంబై – వా. వీ. శ. ష; సుస్థిరంబై – పెక్కు ప్రతులు. 5. భక్తికరంబు – ఇ. ఏ. ల. 6. యట్లు వరంబిచ్చితి – ఎ. ట. డ. ల. 7. కార్యంబును నొక్కటి – ఇ. ఈ. ఊ. ఏ. ఐ. ఒ. గ. జ. త. ద. 8. సాధ్యంబగునది – ఎ. ఐ. ఝ. ల.

వన్నరేంద్రుండు మత్ప్రసాద[9]లబ్ధంబైన యోగబలంబునం జేసి భవన్ని యోగంబున నయ్యసురం బరిమార్ప సమర్థుండగు నవ్విశేషంబునకు నీవలన నఖిలలోకంబులు సంతసిల్లెడు నని పలికి విష్ణుదేవుం డంతర్హితుండయ్యె నుదంకుండును బూర్వప్రకారంబునం దపంబు సేయుచుండె మఱియును.

379. సీ. అనఘుఁ డిక్ష్వాకుఁడీయఖిలభూచక్రంబు నేలి[1]నాకమునకు నేఁగుటయును
అతని నందనుఁడు శశాదుండు రాజయ్యె వాఁడు[2]కకుత్స్థుఁడన్వానిఁ గనియె
[3]నతఁ డనేనసుఁడను నాత్మజుఁ బడసె నాపృథివీపతికిఁ బుట్టెఁ బృథుఁ డనంగ
పృథుఁడు [4]ష్వగుఁడను పేరి పుత్రకుఁగాంచె నతనికిజనియించె నార్ద్రుఁడనఁగ.
తే. నార్ద్రునకుఁ బుట్టె యువనాశ్వుఁ డను తనూజుఁ డాతనికి, బుట్టె
[5]శ్రావస్తు డను విభుండు
దత్సుతుఁడు బృహదశ్వుఁ డాధరణిపతికి, నుగ్రతేజుండు గువలాశ్వుఁ
డుదితుఁడయ్యె.

380. వ. అక్కువలాశ్వునకు నఖిలాస్త్రశస్త్రవిద్యావిశారదులు నధికసత్త్వసంపన్నులు నైన పుత్త్రు లేకవింశతిసహస్రంబులు వుట్టి రంత బృహదశ్వుండు నిజపుత్త్రుం గువలాశ్వుం బ్రాప్తసంతాను నత్యంతధర్మాన్వితు నఖిల మహీరాజ్యభారధౌరేయుంగా నభిషేకించి తపోవనంబునకుఁ బోవ సమకట్టి యయోధ్యానగరంబు వెలువడు నవసరంబున నవ్వార్త విని యుదంకుండు సనుదెంచి బృహదశ్వున కిట్లనియె.

381. ఉ. నీవు ప్రజాభిరక్షణము నెమ్మి నొనర్పు మరణ్యభూమికిం
బోవఁగనేల రాజులకు భూప్రజఁ [1]గాచుటఁ బోలుధర్మముల్
భూవర కల్గునే యడవిఁ బోయి[2]వసించినఁ గాని కాదె ర
క్షావిధిఁ గాదె సద్గతులు గాంచిరి తొల్లిటి రాజ[3]ముఖ్యులున్.

---

9. "సయోగబల మాస్థాయ మామకం పార్థివోత్తమః
శాసనాత్తవ విప్రర్షే ధుంధుమారో భవిష్యతి" అని మూలము.

379. 1. నాకమ్మున కేగుటయును - ఈ. ఊ. ఐ. గ. త. 2. కాకుస్థుడన్వానిగనియె- కొన్ని ప్రతులు. 3. నతడు (వేనుండను, ధేనుండను, శేనుండను, వెన్నుడను, ప్రసేనుండను) - ఇత్యాదిగా భిన్న ప్రతులు; అనేనసః - అని మూలము. 4. విశ్వకుఁడను పేరి - వా. పెక్కు ప్రతులు - 'విష్వగశ్చ పృథోఃపుత్రః' - అని మూలము 11-205-3. 5. "శ్రావస్తస్య చాత్మజః । జజ్ఞేశ్రావస్తకో రాజా శ్రావస్తీ యేన నిర్మితా" - అని మూలము.

381. 1. కాచుటకంటె-అ. ఘ. జ. వీ. శ. 2. కృశించినగాని-ద. 3. నందనుల్-వీ. శ. ప.

382. క. నీరక్షణంబు కతమున, ధారుణి మముబోంటి సాధుతపసులు నిత్య
ప్రారంభ ధర్మ[1]కర్మో, ద్ధారు లగుట యదియు నీదుధర్మువు గాదే.

383. వ. విను మొక్కయద్భుతంబు సెప్పెదతొల్లి [1]మధుకైటభులనం బ్రఖ్యాతులైన యసురుల తనయుండు ధుంధుం డనువాఁడు మహాబలపరాక్రమసంపన్నుండు నిజతపోబలంబునం బితామహు[2]వలన వరంబు వడసి దేవదానవగంధర్వాదు లకు [3]నజయ్యుండై చరియించుచుండు నయ్యసుర యిపుడు మదీయాశ్రమ సమీపంబున బహుయోజన [4]విస్తీర్ణం బగు సముద్రవాలుకాపులినతలంబు నందు మహావివరంబు గావించుకొని సుఖంబున నిద్రించుచున్నవాఁడు వాలుకాంతరితశరీరుం డైన వాని నిశ్వాసపవనంబు ధూమదహన జ్వాలా భీలం బయి సంవత్సరంబున కొక్క[5]మాటు వెలువడి భూనభోంతరం బెల్లను నిరంతరసికతారజఃపటలంబు మాఁటుకొనం జేయుఁ దదీయవేగంబునఁ దత్సమీపభూమిశైలకాననంబు లేడుదినంబులదాఁకఁ గంపించుచుండు నిట్టిదారుణత్వంబు కతంబునమాకు మాయాశ్రమంబున నుండుట సంకటంబు గావున నద్దురాత్ము వధియించి మాకును లోకంబులకును [6]హితంబుసేసి కృతకృత్యుండవై మఱి తపోవనంబున కరుగుము.

384. తే. ఎవ్వఁడమ్మహాసురు వధియించు పనికిఁ, బూను నతనికి నాత్మీయభూరిశక్తి
యిచ్చి జయమిత్తునని యానతిచ్చె నధిప, [1]యాదరంబున నాకుఁ
జక్రాయుధుండు.

385. వ. కావున.

---

382. 1. కర్మోద్ధారులగుట యదియు విహిత ధర్మువుగాదే - వా; కర్మోదారులగుట యదియు నీదుధర్మువుగాదే - వీ. శ. ప. పెక్కు ప్రతులు.

383. 1. మధుకైటభయోఃపుత్రో ధుంధుర్నామ సుదారుణః - అని మూలము. 2. మెప్పించి వరంబు - ఐ. ఘ. ఠ. వీ. శ. ప. 3. నవధ్యుండై - ఘ. ఠ; నజే యుండై - ల. 4. విస్తరంబగు, విస్తారంబగు - కొన్ని ప్రతులు; విస్తీర్ణంబుగా - ఠ. 5. మాటుకొనం - ఆ. ఈ. ఐ. ఘ. ఝ. ఠ. త. ద. ల; దూటుకొనం - వా. శర. సూ. కొన్ని ప్రతులు. 6. ప్రియంబుసేసి - వా. పెక్కు ప్రతులు; హితంబుసేసి - ఈ. ఐ. ఒ. త.

384. 1. యాదరమున నాతోడ జక్రాయుధుండు - పెక్కు ప్రతులు.

386. చ. అతులితవిష్ణుశక్తిసముపాసితమూర్తిని గమ్మి [1]లెమ్మి నం
తతభుజశక్తి నిట్టి యవధాన మొనర్పఁగ నీవ కాని యీ
క్షితి [2]నితరుండు లేఁ డధికకీర్తియుఁ బుణ్యముఁ జేరు నిన్ను నూ
ర్జితగుణ యింతవట్టుఁ దగఁ జేయుము గావుము లోక మంతయున్.

387. వ. అనినం గృతాంజలియై యుదంకునకు బృహదశ్వుం డిట్లనియె.

388. క. విమలమతి నస్త్రసన్యాసము సేసితిఁ దప మొనర్ప సమకట్టితి నిం
క మునీంద్ర తపోవనగమనము దప్పదు వారు వినుము నాపిన్నపముల్.

389. చ. అనఘుఁడు మత్సుతుండు గుణలాలసుఁడు ఘనుఁడు మహాబలుండు స
జ్జన[1]హితకారి ధైర్యనిధి సంస్తుతకీర్తి ధనుర్విద్యాగ్రణిన్
జనసుత యమ్మహాసురునిఁ జంపుట కోపు నవార్యశౌ
ర్యను లగుచున్న పుత్త్రులును [2]దాను సహోద్యద్భుజావిభూతితోన్.

390. వ. [1]నాకుం దపంబున కనుజ్ఞ యీవలయు నని పలికి యుదంకునకుం బుత్త్రు
సమర్పించి యమ్మునిచేత నభినందితుండై బృహదశ్వుండు తపోవనంబున
కరిగె ననిన విని ధర్మనందనుండు మార్కండేయుతో ధుంధుండు మధుకైట
భుల పుత్త్రుం డని చెప్పితి రమ్మధుకైటభు లెక్కాలంబు[2]వా రేమియై రని
యడిగిన [3]నతం డిట్లనియె.

-: మార్కండేయుఁడు ధర్మరాజునకు మధుకైటభుల చరిత్రము సెప్పుట :-

సం. 3 _ 194 _ 13

391. సీ. అధిప తొల్లి జగత్త్రయంబు నేకార్ణవమై యుండఁగా[1] నప్పు హరి యొకండ
భాసురభోగీంద్రపర్యంకమున భవ్యయోగనిద్రాసుఖాయుక్తి సలుప
నతిదీర్ఘ మగు కాల[2]మరిగెఁ బదంపడి దైత్యులిద్దఱు మహోదాత్త[3]బలులు
మధుకైటభులు నాఁగ మథితశాత్రవు లేఁగుదెంచి యప్పరమాత్ము దివ్యనాభి

---

386. 1. వేగమాతత - ఈ. ఐ. త; నెమ్మినాతత - అ. ప. 2. నొకరుండు - ఆ. ర. పి. శ. ష; నధికుండు - ఉ. ఊ. ఎ. చ. ఝ.

389. 1. హితకార్యధైర్యనిధి-ఇ. ప. ఝ. 2. దానును శౌర్యమహావిభూతితోన్ -ఆ.

390. 1. నాకుందపంబున కనుజ్ఞ - ఎ. ప. జొ. గ; నాకునమజ్ఞ - వా, కొన్ని ప్రతులు. 2. వారేమి క్రమంబున నెవ్వరిచేత నేమైరని - వా.పి.శ.వ; వారేమియైరని-పెక్కు ప్రతులు. 3. నతం డిట్లనియె-కొన్ని ప్రతులు; నతండు ధర్మనందనున కిట్లనియె-వా.

391. 1. నందు - అ. ఈ. ఎ. ఐ. ఝ. త. 2. మరిగిన పదపడి - అ. ఈ. ఎ. ఐ. ఝ. త. 3. భుజులు - ఆ. ర. పి. శ. ష.

ఆ. [4]కమలమున వెలుంగు కమలాసనుని గని, దర్ప[5]రోష నిహతిఁ [6]దలరవ్రేయ
నతఁడు క్షితినొంది యాక్రోశ మొనరించె, నాదిపురుష నన్ను నరయు మనుచు.

392.. ఉ. ఆతెఱఁ గాత్మఁ గాంచి కమలాక్షుఁడు మేల్కని ఘోరవిక్రమో
పేతుల దైత్యసింహుల నపేతభయాత్ములఁ జూచి మీర లి
ట్లీతని [1]నుక్కనం బఱుప నేల [2]భవద్బలశౌర్య[3]యుక్తికిం
బ్రీతుఁడ నైతిఁ జెచ్చెర నభీష్టవరంబులు వేఁడుఁ డిచ్చెదన్.

393. తే. అనినఁ గలకల నవ్వి య య్యసురవరులు, నీవు మాకేమి యిచ్చెదు నీకు నేము
వరము లిచ్చెద మడుగుము [1]వలచితేని, యనిన [2]వారల కిట్లను నవ్విభుండు.

394. క. [1]సత్యవ్రతులార వరం, బత్యంతప్రీతి మిమ్ము నడిగెద లోక
ప్రీత్యర్థముగా నాచే, [2]మృత్యువునం బొందుఁ డిప్పుడ మీరిరువురున్.

395. వ. అనిన వార లొండొరువుల మొగంబులు [1]చూచికొని యాచక్రధరున కిట్లనిరి.

396. చ. [1]నగిననగి యేనియున్ విను జనార్దన యెన్నఁడు బొంకు వల్కమ
[2]త్యగణితవిక్రమోరుబలధైర్యసమగ్రుల మెల్లభంగులఁ గా
లగతి దొలంగఁ బోవఁగ [3]దలం పగునే యగుఁగాక నీకు మె
చ్చుగ నిదె ప్రాణ మిచ్చెదము స్రుక్కము వాపవ కార్త[4]నెమ్మియున్.

---

4. కమలమున వెలుగు జగత్పితామహుఁ గని దర్పరోష – ఉ. హ. గ. ఘ. జ. ద.
5. రోషమునను – ఘ. స; రోషమతిని – వీ. శ. ష; రోషనిహతి – అ. ఉ. హ.
గ. జ. 6. దలరిగ్రేయ – వా. కొన్ని ప్రతులు; దలుబ్రేయ – ఐ. త. డ;
దలరవ్రేయ – వీ. శ. ష. కొన్ని ప్రతులు.

392. 1. నీగతింబఱుపనేల – ఈ. ఐ. త. వీ. శ. ష; నుక్కనం బఱవనేల – ల; నుక్కవం
బఱపనేల – డ. 2. భవద్గుణ శౌర్య – అ. ఈ. ఎ. ఝ. త. శ. వృత్తికిం – ఊ. వ.

393. 1. వలసితేని – స. కొన్ని ప్రతులు. 2. వారికి నిట్లను – కొన్ని ప్రతులు.

394. 1. సత్యవరులార వర మే నత్యుత్తమవృత్తి మిమ్ము – ఆ. 2. మృత్యువునం
బొందు – ఐ. డ. త. ల. వీ.

395. 1. చూచుచు – ఆ. వీ. శ. ష; సూచి – వా.

396. 1. నగవులకేనియున్ – వా; నగిననగియేనియున్ – పెక్కు ప్రతులు. 2. త్యగణిత
ధైర్యవిక్రమ బలైక సమగ్రుల – వీ. శ. ష. స. 3. దరంబగునే – అ. హ. గ.
4. నెమ్మెయిన్ – ఆ; నెమ్మియున్ – వీ.

397. ఆ. చంపెదేని మమ్ము [1]జలములు లేని దే, శమునఁ జంపవలయుఁ గమలనాభ
నిక్క మింతవట్టు నీచేత [2]మడియంగఁ, దగుదు మనిన నగుచు నగధరుండు.

398. వ. త్రైలోక్యంబును జలమయంబగుట నాలోకించి.

399. క. పరమేశుఁడు దనయూరులు, పరపుగ నొనరించి వానిపైఁ దచ్ఛిరముల్
పరుషతరశితసుదర్శన, ఖరధారానిహతిఁ జేసి గ్రక్కునఁ దునిమెన్.

400. తే. పరగ నమ్మధుకైటభాసురుల సుతుఁడు, సువ్వె ధరణీశ ధుంధుఁడన్ శూర వరుఁడు
[1]వాఁడు వరగర్వమునఁ జేసి వాఁడి మిగిలి, యమరపతిఁదొట్టి వేల్పుల [2]నభిభవించె.

401. వ. అనిచెప్పి యమ్మునీంద్రుం డిట్లనియె నట్లు బృహదశ్వుచేత [1]ననుజ్ఞాతుండై
కువలాశ్వుండు శుభదినంబున నుదంకపురస్సరంబుగాఁ [2]గృతప్రస్థానుండై.

402. తరలము.

దనుజనిర్మథనైక[1]తత్పరతావిజృంభణ మొప్ప స
ద్వినుతతేజుఁడు ఘోరసంగర[2]విక్రమోత్సవలీలమై
ఘనభుజాబలభూరిదుర్వహగర్వసంగ్రహులైన నం
దను లనేకసహస్రసంఖ్యులు దన్నుఁ గొల్వ నుదగ్రుఁడై.

---

397. 1. 'అనావృతేఽస్మిన్నాకాశే వధం సురవరోత్తమ' - అని మూలము. 2. బడ యంగ - పెక్కు ప్రతులు; బడుటకు - ఆ. ఉ. ఘ. త. ద. పీ. శ. ష.

400. 1. వరతపోగర్వమున జేసి వాడిమిగిలి - అ. ఈ. ఎ. ప. ఐ. ఝ. 2. నవమతించె- వా. సం; పరిభవించు - ఔ. గ. ఘ. పీ. శ. ష. యతిభంగము; నభిభవించె - పెక్కు ప్రతులు.

401. 1. నాజ్ఞాపితుండై - ప. ఒ. ట. 2. గృతస్నానుండై - పెక్కు ప్రతులు.

402. 1. సత్వరతా - అ. ఈ. ఝ. త. 2. విభ్రమోత్సవలీలమై - ఇ. ఏ. ఓ. గ. చ. జ. పీ. శ. ష.

403. మ. చతురంగధ్వజినీపద [1]ప్రవిహతిన్ సర్వంసహాచక్ర మా
తతకంపంబు[2]గ నేఁగె నప్పుడు దగం దైత్యారి యారాజునం
దతులం బైన నిజాంశశక్తి సొనిపెన్ హర్షించి రింద్రాదిదే
వతలున్ సన్మునిముఖ్యులుఁ నృపతి[3]కైశ్వర్యోన్నతిం జేయుచున్.

404. ఆ. మొరసె దివ్యతూర్యములు నందనద్రుమ, సురభికుసుమవృష్టి గురిసెఁ గలయ
[1]నప్రతీపభంగి యగుమందపవనవి, చేష్టితంబు గర మభీష్ట మయ్యె.

405. క. గగనమున సురవిమానము, లగణితముగఁ గ్రందుకొనియె ననుకూలములై
మృగపక్షిగతులు శోభన, మగు శేర్పడఁ జెప్పె నజ్జనాధిపుయాత్రఁ.

406. వ. ఇట్లు సని కువలాశ్వుండు సముద్రతీరంబున విడిసి నిజపుత్త్రుల [1]నానాస్త్రశస్త్రజ్ఞుల ననేకసహస్రసంఖ్య లగువారల నవారితజవసత్త్వుల నవ్వాలుకాపులినఖననంబు సేయ నియోగించిన.

407. మ. నరనాథోత్తమునందనుల్ గడఁగి నానాశూల కుద్దాల ము
ద్గర కాష్ఠాదుల నయ్యుదగ్రసికతౌఘం బంతయుఁ సప్తవా
సరముల్ వాయక పాయ [1]గ్రొచ్చి నడుమఁ సంసుప్తుఁ డై యున్న యా
సురవైరిం గని రుగ్రనిశ్వసననిష్ఠ్యూతాగ్నికీలావృతున్.

408. చ. అడరి నిశాత పట్టిస గదాసి పరశ్వధ శూలహస్తులై
[1]తడయక వారలందఱును దానవుదేహము వీఁక వ్రేసియుం
బొడిచియు నొంప [2]నెంతయును బ్రొద్దున కయ్యసురాధముండు బి
ట్టొడలు గదల్చి నీల్గి [3]వివృతోగ్రముఖుం డయి యావులించినన్.

---

403. 1. ప్రనిహతిం – శ. ప; ప్రవిహతిం – కొన్ని ప్రతులు. 2. న బొందనే గెనవు డద్దైత్యారి – వా; గ నేగెనప్పుడు దగన్ దైత్యారి- పెక్కు ప్రతులు. 3. నైశ్వరోన్నతుం జేయుచున్ – వా. కొన్నిప్రతులు; కైశ్వర్యోన్నతిం జేయుచున్ – పెక్కుప్రతులు.

404. 1. నప్రతీత – వా. కొన్ని ప్రతులు; నప్రతీప – కొన్ని ప్రతులు.

406. 1. నానాస్త్రశస్త్రజ్ఞులనేకసహస్ర – కొన్ని ప్రతులు; నానాసహస్ర – వా.

407. 1. ద్రోచి – ఒ. ఘ. పి. శ. ప.

408. 1. తడబడ – కొన్ని ప్రతులు. 2. దద్దయును – పెక్కు ప్రతులు. 3. వికృతోగ్ర– ఆ. ఉ. ఔ. ర. డ. ద.

409\. ఉ. ఘోరున విస్ఫులింగములు [1]వొడ్మఁగఁ దన్ముఖనేత్రనాసికా
ద్వారములందు వెల్వడిగె దారుణవహ్నిశిఖాకలాపముల్
వారక యందు[2]మందిరనివాస్యులు రాజకుమారు లందఱున్
ఘోరత సాగరుల్ గపిలు[3]కోపమున న్నశియించు చాడ్పునన్.

410\. వ. ఇట్లు దృఢాశ్వకపిలాశ్వ[1]భద్రాశ్వులు దక్కం దక్కినకొడుకులందఱుఁ [2]బొడవడంగినఁ గడంగి గినుకం గువలాశ్వుండు సంహారసమయ సప్తాశ్వుండునుం బోలె నుజ్జ్వలుం డయి కదియుటయు నద్దానవుండు [3]క్రోధసంరంభంబున సముత్థితుండై యొక్క శూలం బెత్తికొని కవిసె నప్పు డమ్మహీపతిఖుండు దదీయ[4]దేహజనితంబై మండుచున్న యనలం బాత్మీయయోగవిద్యా[5]ప్రభవం బగుజల[6]ప్రవాహంబునం బ్రశాంతంబు గావించి బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన.

411\. క. ఆదివ్యాస్త్రజ్వలనము, భూదిగ్గగనములు [1]వెలుఁగఁ బొదివి మహోగ్రం
బై [2]దానవేంద్రు దేహము, బూదిగ నొనరించెఁ జిత్రముగ నొకమాత్రన్.

412\. వ. అంత.

413\. క. సురశత్రుఁడైన ధుంధునిఁ, బరిమార్చితి వీవు[1]జగదభయకారివి భూ
వర ధుంధుమారుఁ డనఁగాఁ, [2]బరఁగు మనిరి సురలు మునులు పార్థివముఖ్యా.

414\. వ. ఇట్లు ప్రసన్నులై యింద్రాదిదేవతలు [1]నుదంకప్రముఖసంయమివరులును నమ్మహీవరు నభినందించి నీకెయ్యది యిష్టంబు వేఁడు మనిన నతండు బ్రాహ్మణ[2]భక్తియు ననవరతదానశీలతయు విష్ణునితోడి సఖ్యంబును [3]వరం

---

409\. 1. పుట్టగ – వీ. శ. ప. 2. మగ్గిరని – ఈ. త. వీ. శ. ప. 3. కోపమునందు నశించు – వా. కొన్ని ప్రతులు; కోపముననశియించు – వీ. శ. ప. కొన్ని ప్రతులు.

410\. 1. చంద్రాశ్వులు – వా. వీ; భద్రాశ్వులు – పెక్కు ప్రతులు. 2. సమసిన – వీ. శ. ప. 3. క్రోధావేశంబున – అ. ఈ. ఎ. ఐ. ఝ. 4. తేజోజనితంబై – ఇ. ఏ. ఓ. గ. జ; దేహంబు తేజోజనితంబై – ఙా. 5. ప్రభావజంబగు – ల. 6. ప్రభావంబునం – ఈ. ఐ. త.

411\. 1. నిండి – వా. వీ. శ. ప; వెలుగ – పెక్కు ప్రతులు. 2. దానవుఘన – వా. వీ శ. ప; దానవేంద్రు – పెక్కు ప్రతులు.

413\. 1. జగముబాలించితి భూవర – అ. ద. వీ. శ. ప. 2. బరగుదు వీవనిరి సురలు పార్థివముఖ్యా – వీ. శ. ప.

414\. 1. నుదంకప్రముఖ సంయమివరులును – కొన్ని ప్రతులు; దక్కటి సంయమిప్రముఖులును – వా. 2. శక్తియు – వా; భక్తియు – వీ. శ. ప. పెక్కు ప్రతులు. 3. దనుజునివలన మృతులైన తనసుతులు గలుగనువరంబులు గోరిన – ఘ. వీ. శ. ప.

బులుగాఁ దనకుఁ గోరిన నట్లయొసంగి [4]వారలందఱు నిజనివాసంబుల కరిగిరి కువలాశ్వుండును విజయోల్లాసభాసితుండై [5] పురంబున కరిగి సముజ్జ్వల [6]సామ్రాజ్యసౌఖ్యంబులం బరగె నని మార్కండేయుండు ధర్మరాజునకు గువలాశ్వుండు ధుంధుమారుం డైన విధంబు సెప్పె నని వైశంపాయనుండు జనమేజయున కెఱింగించిన తెఱంగు.

415 క. [1]చరమయుగచరిత [2]ధర్మ, స్థిరీకరణచతురచరిత ధీగుణలీలా
పరికరపరిచితనయ[3]వి, స్తర వితరణవివరణైకదానవినోదా.

416. మాలిని.
[1]కరివరకిరికూర్మక్ష్మాధరాధీశతుల్యో
ద్ధరణగుణధురీణోద్దండబాహార్గళాగ్ర
స్ఫురితనిఖిలగోత్రాభోగ భాగైకభోగా
[2]తరుణరుచిరమూర్తీ ధర్మ[3]తంత్రాను వర్తీ.

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబున యక్షయుద్ధంబును గుబేరదర్శనంబును నర్జునాగమనంబును బాండవులకడకునింద్రుండు సనుదెంచుటయు నర్జునుండు నివాతకవచకాలకేయ పౌలోమవధప్రకారంబెఱింగించుటయు నాజగరంబును బాండవులు గామ్యక వనంబునకువచ్చుటయుఁ గృష్ణమార్కండేయాగమనంబును బ్రాహ్మణప్రభావంబును సరస్వతీగీతయు వైవస్వతుచరితంబును గల్పాంతప్రకారంబును యుగధర్మకీర్తనంబును వామ్యాశ్వ హరణంబును నింద్రద్యుమ్నోపాఖ్యానంబును ధుంధుమార చరితంబును నన్నది చతుర్థాశ్వాసము.

---

4. రాక్షసనిహతులైన యతనిపుత్త్రులం బునర్జీవితులుగా బ్రసాదించివార - వా. ఇది పెక్కు ప్రతులలో లేదు. మూలమందును లేదు. 5. యుదంకుని నిజాశ్రమంబునకనిచి కుమారసహస్రంబుతో నిజపురంబునకరిగి వారాంగనా నృత్యగాన విశేషంబు లాలోకించుచు రాజధానింబ్రవేశించి - వా. పీ. శ. ష. తప్ప తక్కిన ప్రతులలో లేదు. మూలమునందును లేదు; పురంబున కరిగి సము - పెక్కు ప్రతులు. 6. సామ్రాజ్యవిభవంబు లనుభవించుచుండెనని - ల. పీ. శ. ష.

415. 1. పరమయుగచరిత ధర్మస్థిరకరుణాచతుర - ఇ. ఉ. 2 ధర్మస్థిరకర్మాచరణ చతురధీగుణ - ఈ. ఐ. ఝ. త. పీ. శ. ష; ధర్మస్థిర కరుణాచతుర - ఊ. ఏ. ఒ. గ. ఘ. ద. 3. విస్తరసైకసుధీనిధాన దానవినోదా - ఇ. ఈ. ఎ. ఏ. ఐ. ఝ. త.

416. 1. కవివరఫణికూర్మ - ఉ. శ. ష. 2. దరణసుఖితమూర్తీ - వా; తరుణవిమల మూర్తీ - ఈ. ఐ. త; తరుణరుచిర - పీ. శ. ష. కొన్ని ప్రతులు. 3. నిత్యాను వర్తీ - చ; సంధానవర్తీ - ఔ.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - పంచమాశ్వాసము

—o—o—o—

1. క. శ్రీయువతీప్రియ నృపనా
రాయణబిరుదాంక భీమ రమణీయ[1]గుణ
శ్రీయుత నిర్మలధర్మప
రాయణ రవితేజ రాజరాజనరేంద్రా.

-: ధర్మరాజునకు మార్కండేయుఁడు పతివ్రతకుం దగు గుణంబులం జెప్పుట :-

సం. 3 - 196 - 1

2. వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు బహు[1]భంగుల మార్కండే[2]యుండు వివరింపం బుణ్యకథావిశేషంబులు విని సంతుష్టహృదయుండై కౌంతే[3]యపూర్వజుండు మఱియు నమ్మునీంద్రున కిట్లనియె.

3. సీ. సమధికదర్పదుర్జయములై [1]నిగిడెడు నింద్రియంబులఁ గుదియించి తెచ్చి
మనసుపొందున నిడి [2]మన సహంకారంబు పజ్జకుఁ [3]బాపి సద్వృత్తియుక్తి
నెరయంగ ననిశంబు నిజభర్తృశుశ్రూషయందు [4]సమాహితయైన వనిత
యఖిలలోకోత్కృష్టయని యెప్పు [5]నూహింతు నరయఁ బతివ్రతలైన వారి

---

1. 1. గుణా - ద.

2. 1. విధంబుల - ఇ. ఏ. ఓ. గ. ల. 2. యువలన బుణ్యకథా - ఆ. ఈ. ఎ. ఐ. ఝ. త. 3. యాగ్రజుండు - పెక్కు ప్రతులు.

3. 1. నెగడెడు - ఆ. ఈ. ఎ. ఐ. క. ఝ. త. ల. స; నిగుడెడి - కొన్ని ప్రతులు. 2. మహదహంకారంబు - ఔ. ట. 3. జొనిపి - ఔ. ఘ. చ. ట. ద. 4. సమీహితయైన - ఈ. ఎ. ఐ. ఔ. 5. కీర్తింతు రరయ - క. చ.

తే. చరిత మత్యంత ధర్మసూక్ష్మంబుఁ గరము, [6]దుష్కరముగాదె [7]తలఁప నిర్ధూతదురిత
యట్లుగావున వినవేడ్కయయ్యెఁ జెప్పు, [8]వయ్య పుణ్యానులీప్రభావంబు నాకు.

4. వ. మఱియుఁ దల్లిదండ్రు [1]లిరువురయందును [2]బుత్త్రనిమిత్తంబైన యాయాసం బెవ్వరి కెక్కుడు వారలయెడం బుత్త్రుం డెట్టివాఁడు గావలయు హీనయోని జాతుండైన పురుషుం డేమి తెఱంగు నడవడిం బరమధార్మి[3]కుల లోకంబులు వడయు [4]నివియన్నియు వివరింప నీవ యర్హుండ వనిన నమ్మహామునిం యమ్మహీపతి కిట్లనియె.

5. సీ. జతనంబు [1]మిగుల మాసములు దొమ్మిది యుదరంబునం గరము భరంబుతోడ భరియించి పదపడి ప్రాణసంశయదశ నొంది పుత్త్రునిఁ గాంచు [2]నెందుఁ దల్లి తపములు యజ్ఞముల్ దానముల్ వ్రతములు దేవతాసజ్జనసేవనములుఁ గావించుఁ బుత్త్రునిఁ గామించి జనకుఁ డీ ట్లిరువురపాటును సరియె తలఁపఁ
తే. దనయుఁ గని తల్లిదండ్రులు దమకు నతఁడు, భక్తుఁ డగుటకు [3]ధర్మాను రక్తుఁ డగుట
కాసపడుదురు [4]విను మట్టి యాస సిద్ధిఁ, బొందఁ జేయునతఁడ చువ్వె నందనుండు.

6. క. జననియు జనకుఁడు నెవ్వని, యను[1]వర్తనమునఁ బ్రియంబు నందుదు రెదఁ ద త్తనయుఁడు ధర్మముఁ గీర్తియు, ననూనముగఁ [2]బడయుఁ బొందు నతయగతులన్.

---

6. దుష్కరంబును గాదె నిర్ధూత — పెక్కు ప్రతులు. 7. వివరింప దురితదూర — ట. 8. వలయు—పెక్కు ప్రతులు.

4. 1. లిద్దరి — ట. 2. బుత్రస్నేహనిమిత్త — అ. ఝ. 3. కలోకంబులు — కొన్ని ప్రతులు. 4. నవియును — వా. కొన్ని ప్రతులు; నివియన్నియు — పెక్కు ప్రతులు.

5. 1. మీరి — ఇ. ఏ. 2. నొవర — వా; నెందు — ట. 3. ధర్మసంయుక్తుడగుట — ఉ. ఘ. చ. ఠ. ద; ధర్మార్థ సక్తుడగుట—ట. ఔ. గ. ట. ల. శ. ష. ప. 4. వారి (వీరి) యాయాససిద్ధి — ఉ. ఘ. ఠ.

6. 1. నయవృత్తమున ప్రియము — ఇ. ఏ. 2. బడయు (బొందు) నతయ — ఉ. ఎ. క. జ; బడయఁజాలు — శ. ష; బడయఁబొందు — అ. ట. ఝ; బొందఁబడయు — వా; నొందిపడయు — ఘ. చ.

-: మార్కండేయుఁడు ధర్మజునకుఁ బతివ్రతామాహాత్మ్యంబు సెప్పుట :-

సం. 3 - 196 - 20

7. వ. మఱియు నిజభర్తృశుశ్రూషయందు నిత్యాసక్తయయిన పతివ్రతకు సకల యజ్ఞదానతపఃఫలంబులు సులభంబులగు నొక్కయితిహాసంబు సెప్పెద నందు నీయడిగిన యర్థం[1]బులన్నియుం దేటపడు నాకర్ణింపుము కౌశికుం డను బ్రాహ్మణుండు ధర్మతపశ్శీలుండు సంతతాధ్యయన [2]తత్పరుండయి యొక్క విశిష్టగ్రామంబున నుండు[3]నతం డొక్కనాఁడు గ్రామసమీపంబునం దొక్కవృక్షమూలంబున నాసీనుండై వేదం[4]బులు [5]గుణియించుచుండం దదీయ [6]శాఖాగతంబైన [7]యొక్క కొక్కెర యాతనిపై రెట్ట[8]వెట్టిన సమ్మహోద్వేగుం డలిగి చూచుటయు నది [9]యప్పుడ నిర్జీవసంగతయై నేలం బడినం గనుంగొని యతండు.

8. క. అక్కట నా[1]హృదయము గడు, నక్కటికము లేనిదయ్యె [2]ననిమిత్తము యీ
కొక్కెర నిటు సేసితి నా, కెక్కడి శాంతి యని [3]వికలహృదయుం డగుచున్.

9. వ. పెక్కుభంగుల వగచి మధ్యాహ్నంబగుటయుఁ [1]గృతాహ్నికవిధానుండై గ్రామంబున కరిగి యందు శుచులైన విప్రగృహంబుల [2]కరిగి భిక్షాచరణంబు సేయుచు [3]నందొక్క[4]పుణ్యగృహంబు వాకిట నిలిచి 'భిక్షాందేహి' యనుటయు నాయింటి [5]యవ్వయు నతిసంభ్రమంబున భిక్ష యిడుటకుం బాత్రశోధనంబు సేయునెడ.

---

7. 1. బంతయు - ద; బుసర్వంబు - ఔ; 2. శీలుండయి - ఘ. ట. 3. నంత నొక్క - ఔ. ద. ఘ. 4. బుగుణియించు-కొన్ని ప్రతులు 5. బుచదువుచుండ - ఆ. 6. శాఖాగ్రంబున-కొన్ని ప్రతులు. 7. కొక్కెర యొక్కండు-వా; యొక్క కొక్కెరయా - ఆ. ఈ. ట. ఎ. ఐ. ఙ. త. శ. 8. వైచిన - గి. శ. శర. ష. 9. యతుణంబ - ఇ. ఏ.

8. 1. డెందము - ఆ. ఈ. ఎ. ఐ. ఝ. త. ల. 2. నలుగస్ మఱియూ - ఈ. ఐ. త. 3. చలిత - ఝ.

9. 1. గృతస్నాన - గ. శ. ష. 2. వాకిళ్ళనిలిచి - కొన్ని ప్రతులు; చేరి - ఇ. ఏ. 3. వచ్చి యొక్క - ఈ. ఎ. ఐ. త; వచ్చి వచ్చి యొక్క - ఝ. 4. విప్ర - ఈ. త. ఐ; నందొక్క గృహంబు - కొన్ని ప్రతులు. 5. సతియు - గ. వి. శ. ష.

10. ఉ. ఆయెలనాఁగ భర్త గడు నాఁకటఁ దూలుచు వచ్చె వచ్చినం
దోయజ[1]నేత్ర సంభ్రమముతోఁ దగుపీఠము వెట్టి పాద్యముం
బాయక మజ్జన[2]క్రియయు భక్తి[3]నొనర్చి ప్రియోక్తు లొప్పఁగా
నాయనఁ [4]బ్రీతుఁ జేసె రుచిరాన్నరసంబులఁ[5] జేసి చెచ్చెరన్.

11. చ. కుడిచినపిమ్మటం గుసుమకోమలి [1]విస్తృతసంస్తరంబుగా
నొడికపు [2]సెజ్జసేసి ప్రియుఁడొయ్యన యందు శయింపఁ దమ్ములం
బిడి చరణంబు లొత్తి మదిరేక్షణ యంతటిలోఁ దలంచె ము
న్నడరఁగ భిక్షకై నిలిచినట్టి మహీసుర[3]ముఖ్యు నాత్మలోన్.

12. వ. ఇట్లు దలంచి భిక్ష గొనుచుం జనుదెంచిన నమ్మగువం జూచి కౌశికుండు రోషరంజిత[1]లోచనుం డగుచు నిట్లనియె.

13. క. అడిగినయప్పుడ చెచ్చెరఁ, గడపినఁ [1]బోనవ్వ యేను గడు దుర్మతివై
పడఁతి నను[2]నిలిపి భిక్షం, బిడక కడు నవజ్ఞసేసి తేల మదమునన్.

14. చ. అనినఁ బతివ్రతాతిలక మాతని కిట్లను నయ్య మత్ప్రియుం
డనుపమితక్షుధా[1]కలితుఁడై చనుదెంచిన భక్తి నమ్మహా
త్మునకు సపర్యసేయుచు మిముం మదిలోనఁ దలంపఁ జాలనై
తి నిదియుఁ దప్పుగాఁ గొనక ధీరత[2]యొప్ప సహింపఁగాఁ[3] దగున్.

15. వ. అనిన నమ్మహీదేవుం[1]డప్పతివ్రత కిట్లనియె.

---

10. 1. నేత్రి — శ. కొన్ని ప్రతులు. 2. క్రమము — ఉ. 3. నమర్చి — ఊ. ద.
4. దృప్తు — ఈ. ఐ. త. వీ. శ. ప. 5. నింతి — వా. వీ; జేసి — క.

11. 1. సంస్కృత సంస్తరంబుగా — స; విశ్రమ సుస్థిరంబుగా — ఈ. ఐ. త. 2. శయ్య — పెక్కు ప్రతులు; శయ్యవైచి — ల. 3. వర్య — కొన్ని ప్రతులు.

12. 1. నయనుండగుచు — కొన్ని ప్రతులు.

13. 1. బోదవ్వ — ఇ. ఏ. ల; బోనమ్మ — ఉ. ర. 2. పిలిచి—ట.

14. 1. భరితుడై — ఇ. ఏ. ఘ. స; చలితుఁడై — ఉ. ఊ. బొ. ర. వీ. స; 2. కీని — ఘ. 3. నగున్ — అ.

15. 1. డవ్వనిత — ఒ.

16. ఉ. నీమగఁ[1]డెంత [2]యొక్కఁడె మనీషులు భూసురు లింతవారొక్కవే
కోమలి [3]యేల యిట్లు గడుఁ గ్రొవ్వునఁ గానవు లోకవంద్యులై
భూమిసురేంద్రులు ద్విజపుంగవుఁ[4] డాటిన భక్తిఁ [5]గొల్చుచో
నేమిటనొక్కొ వారు గడు నెల్లిదమై రిటు నీకు [6]నిచ్చటన్.

17. క. అవమానితులై ధరణీ, దివిజులు క్రోధాగ్నిశిఖల దీపించి [1]మహా
ద్రి వనద్వీపంబులతో, నవని నయముఁ బొడవడంగఁ గ్రాఁగింతురుల్.

18. వ. నీవింత[1]నెఱుంగ నొల్లనైతివి గాకేమి యానిన సంక్షేపంబుగ నిట్లనియె.

19. సీ. దేవతాసములు భూదేవతావరు[1]లౌట యెను ధర్మపాత్రస్థ మెఱుఁగనయ్య
యొక విప్రుఁ డలిగి పయోనిధిజలము లపేయములుగాఁగ శపియించెఁ డట్లు
[2]దండకవిషయంబు దగ్ధంబు [3]సేయుండె యలుకనై యొక్క మహాత్ముఁ డందు
వాతాపి యను దైత్యవరుఁ బ్రమింగి యఱిగించుకొనఁడె భూదేవుఁ
[4]డొక్కరుఁడు [5]గినిసి

తే. ధరణి మఱియును బెక్కువిధంబులందు, బ్రహ్మవిదులైన బ్రాహ్మణ
ప్రభుల మహిమ
వినమె యెఱుఁగి యెఱింగి సద్వినుతచరిత, కోపవిగోని పెల్లిసే
తలఁ[6]గ్రోఁచి కొనఁగ.

20. వ. నా[1]తెఱంగు సెప్పెద నాకర్ణింపుము.

---

16. 1. డింత - పి. శ. వ. కొన్ని ప్రతులు. 2. యొక్కఁడె - పి. శ. శర. వ. 3. యింతయేల - కొన్ని ప్రతులు. 4. పులా - ఆ. ఉ. 5. సేయగా - చ; గొల్వగా - జ. 6. నిచ్చలున్ - వా; నిచ్చటన్ - పి. శ. వ. పెక్కు ప్రతులు.

17. 1. సముద్ర వన - ట.

18. 1. నెఱుంగవైతిగాకేమి - కొన్ని ప్రతులు.

19. 1. వారు (లయ్య) రేను - ఇ. ఏ. పి. వ. 2. దండకాఖ్య విషాగ్ని - ట. 3. సేయదే - కొన్ని ప్రతులు. 4. దుక్కననుగినిసి - శ. 5. కడగి - కొన్ని ప్రతులు. 6. గ్రోఁకి - వా; గోకి.

20. 1. తెఱం గెఱింగించెద - జ.

21. తే. పతియచూవె నాపాలికిఁ బరమదైవ, మేను [1]వాఙ్మనఃక్రియలఁ దత్పరత నెప్పుడుఁ
గొలిచి యొనరింతు [2]దీని మిగులఁగ [3]నొండు, ధర్మకృత్యము గానెందును
[4]దలఁచి చూచి.

22. వ. నీ వతిక్రోధనుండ వగు[1]టయు నెఱుంగుదు నీకోపంబున నొక్క కొక్కెర
నిహతం బయ్యెం గాదె యిది మదీయపాతివ్రత్యమహిమం జేసి కాంచితిం
గాన క్రోధంబు గొనియాడుట లగ్గు గా[2]దని యిట్లనియె.

23. తే. క్రోధమో[1]హనామకులైన [2]ఘోరశత్రు, లిరువు రెదిరించుచుండుదు రెప్పుడు [3]నంత
రంగ మయ్యుభయంబు నడంగకున్నఁ, గలదె యారక బ్రాహ్మణ్యగౌరవంబు.

24. సీ. ఎవ్వాఁడు సత్యం[1]బ యెప్పుడుఁ [2]బల్కు హింసావిదూరుండు [3]గురుజనహితార్థి
యింద్రియంబుల [4]నోర్చి యెల్లవారలఁ దనయట్ల కాఁ జూచు ధర్మాభిరతుఁడు
గామంబు [5]వగులందు కర్మంబు లాఱును సముచితసంప్రయోగ్యత నొనర్చు
నట్టి పుణ్యాత్ముని ననఘు బ్రాహ్మణుఁడని యనిశంబుఁ గీర్తింతు రమరవర్యు
ఆ. లార్జవంబు శమము నధ్యయనంబును, [6]బరమధనము సువ్వె బ్రాహ్మణు[7]నకు
ధర్మగతికి [8]నివియ తగుసాధనంబులు, వేద[9]విహిత [10]ముఖ్యవిధులు [11]నివియు.

---

21. 1. సద్భక్తి శుశ్రూష నెపుడు ప్రీతి–ఉ. ఝ. 2. నిది నాకు నొక కొండె ధర్మములు గాగ నుండుదుఁ దలఁచిచూడ – పీ. శ. వ. 3. నెందు – ఉ. [illegible] 4. [illegible] చూచి – కొన్ని ప్రతులు.

22. 1. ట యే నెఱుంగుదు–ఆ. ఎ; ట నెఱుంగుదు – ఇ. ఈ. ఉ. త. 2. దని మరి యుని – పెక్కు ప్రతులు.

23. 1. హానుగతులైన–ఘ. 2. క్రూర – ఇ. ఈ. ఎ. ఐ. త. 3. వరుని నంతరంగ మయ్యుభయంబు నడపకున్న గలదె యారక బ్రాహ్మణ – కొన్ని ప్రతులు.

24. 1. బు నెప్పుడు – వా. కొన్ని ప్రతులు; బ యెప్పుడు – చ. 2. బల్కుమ. హింసా విదూరుండు హితకరుండు – స. 3. హితపరుండు – ఇ. ఏ. 4. నోర్చు – పెక్కు ప్రతులు. 5. దగులక – ఉ. ర. 6. బరగు – శ. 7. లకు – కొన్ని ప్రతులు. 8. నవియ – వా; నివియ – కొన్ని ప్రతులు. 9. విహిత – వా. కొన్ని ప్రతులు; విహిత – ఈ. ఉ. ఫ. చ. ఝ. ర. త. 10. వినయవిధులు – శ. 11. నివియు – వా; నివియ–పెక్కు ప్రతులు.

25. వ. ధర్మంబు బహు[1]మార్గదృష్టం బయి సూక్ష్మం బయి యుండు నీవు కేవల స్వాధ్యాయపరుండవు గాని ధర్మ[2]సూక్ష్మత యెఱుంగవు గావునం దడయక మిథిలానగరంబున కరుగు మందు జితేంద్రియుండును సత్యవాదియు మాతాపితృభక్తుండును నయినవాఁడు ధర్మవ్యాధుం డను కిరాతుండు [3]నీకు నఖిల ధర్మంబులు నెఱింగించి సంశయచ్ఛేదంబు సేయు [4]నాదెసం బ్రసన్నుండ [5]వగునది వనితలకుం బరిజ్ఞానంబు లేదు గావున [6]వా రెట్టి యపరాధంబు సేసినను సహింపవలయుఁ గదా యనినఁ గౌశికుం డి ట్లనియె.

26. క. [1]నిను దూఱఁదగదు నీకత, మున నా[2]చిత్తము ప్రశాంతిఁ బొరసెఁ బురంధ్రీ జనవినుత పోయి వచ్చెద, [3]ననుపమశోభనసమృద్ధు లయ్యెడు నీకున్.

–: కౌశికుం డను బ్రాహ్మణుఁడు ధర్మవ్యాధుని యొద్దకుఁ బోవుట :–

సం. 3 – 197 – 1

27. వ. అని యాక్షణంబ యమ్మహాద్విజుండు ధర్మవ్యాధదర్శనలాలసుండై కదలి పతివ్రత యెఱుకకు విస్మయంబందుచుఁ దన్నుం గృతాప[1]రాధునిఁగాఁ దలంచుచు ననేకనగరగ్రామంబు లతిక్రమించి చని యనుపమానశోభా సనాథం బయిన మిథిలానగరంబు సొచ్చి రాజమార్గంబు దఱిసి యచ్చటి జనంబుల ధర్మవ్యాధుం [2]డున్న[3]యెడ నడిగి వా రెఱింగింప [4]నట యేఁగి ముందట నల్పమృగమాంసఖండంబు లంగడిం బచరించి యమ్ముచున్నవాని ననవరత[5]విక్రయాగతజనసమావృతు నక్కిరాతుం గని యతిజుగుప్సితం బయిన [6]సూనాపణంబు [7]సేర నొల్లక తొలంగి యొక్కయెడ నుండె నంత.

---

25. 1. మార్గంబయి – ఒ. ఓ. 2. సూక్ష్మవిధంబెఱుంగవు – ఔ. గ. 3. నీకు బర మంబగు నఖిల – ఠ. 4. నాయెడ – కొన్ని ప్రతులు. 5. వగుము – ఘ. ఠ. 6. వారెందున – ఠ; వారెద్ది – శ.

26. 1. ననుదూఱవలయు – ఆ. ఈ. ఐ. ఝ. త; ననుదూఱవలదు – ఎ; నినుదూఱ దగదు – ఇ. ఏ. ల; ననుదూఱందగునీ – వా. వీ. 2. చిత్తంబు శాంతి బొరసె – పెక్కు ప్రతులు; చిత్తంబు శాంతిబొందె – కొన్ని ప్రతులు. 3. ననువుము – ట.

27. 1. రాధుంగా – పెక్కు ప్రతులు. 2. డెచ్చటనున్నవాడని – ఓ. 3. యెడయ డిగి – క. జ. శ. 4. నయ్యెడకేగి – వీ. ష. 5. క్రయవిక్రయా – ఇ. ఎ. ఏ. ఐ. త. ల. 6. సూనావాసంబు సొర – ఠ. 7. సొరనొల్లక – కొన్ని ప్రతులు.

28\. ఆ. వాఁడు నతనిరాక పోఁడిగ [1]నిజబుద్ధి, నెఱిఁగి యతఁడియున్న యెడకు వచ్చి
పరమభక్తి మ్రొక్కి ధరణీసురేశ్వరుఁ, గుశల [2]మడిగి ప్రియము
[3]గొనలు నిగుడ.

29\. చ. అనఘ [1]నితంబినీతిలకమైన [2]పతివ్రత నాతెఱంగు నె
ప్పినఁ జనుదెంచి తీవు ననుఁ బ్రీతిఁ గనుంగొన నీమనోరథం
బును మదిలో నెఱుంగుదుఁ బ్రమోదముఁ [3]బొందితి [4]రమ్ము మద్గృహం
బున కని పల్కి తోడుకొనిపోయె నతండు మహీసురోత్తమున్.

30\. వ. కౌశికుండును ధర్మవ్యాధు నెఱుక[1]కచ్చెరువంది పతివ్రత యెఱుకయుం దలంచి [2]యిది రెండవు నాశ్చర్యంబు గంటి పొమ్మని తలంచుచుఁ దదీయ భవనంబున కరిగి వానిచేతం బూజితుం డయి యిష్టకథాప్రసంగంబునందు యతని కిట్లనియె.

31\. తే. నీవు గడు ధర్మవిదుఁడవు జీవహింస, జీవనంబుగ నడచుట [1]శిష్టపథమె
యకట యీఘోరకర్మంబునకు మదీయ, బుద్ధి దద్దయు దుఃఖంబు
[2]బొందె నిపుడు.

32\. వ. అనుటయు లుబ్ధకుం డిట్లనియె బ్రాహ్మణులకుఁ దపస్స్వాధ్యాయ[1]సత్యశౌచ బ్రహ్మచర్యంబులును రాజులకు దండనీతియు వైశ్యులకుఁ గృషి[2]పశుపాలన వాణిజ్యంబులును శూద్రులకు[3] శుశ్రూషయు నెట్లు పరమధర్మంబులై చెల్లు నట్లు మాకును [4]మృగమాంసోపజీవనంబు పరమధర్మంబు విశేషించి యిది వంశక్రమాగతం బయిన యాచారంబు విను మదియునుంగాక యీదేశంబు

---

28\. 1. దనబుద్ధి – ఇ. ఉ. ఏ. వీ. 2. మడిగె – ఉ. ల. 3. గోమురు మిగుల – ఔ.

29\. 1. పతివ్రతా – వా. నితంబినీ – పెక్కు ప్రతులు. 2. నితంబిని – వా. పతివ్రత – పెక్కు ప్రతులు. 3. నొందితి–కొన్ని ప్రతులు. 4. రమ్మ – పెక్కు ప్రతులు

30\. 1. కు నచ్చెరువడి – క. జ. ద. 2. యీ రెండు నాశ్చర్యంబులు – ఈ. ఐ. ఝ. త. ల.

31\. 1. సిద్ధపథమె – ఊ. ట. 2. బొరసెనిపుడు – ఒ. ఓ. ఔ. క. గ. ఘ. చ. శ. ద. ల.

32\. 1. సత్యబ్రహ్మచర్యంబులు – వా; సత్యశౌచ బ్రహ్మచర్యంబులు – అ. ఈ. ఊ. ఎ. ఐ. ఝ. ద. 2. పాశుపాల్య వాణిజ్యంబులు – ఇ. ఊ. ఓ. ల. 3. ద్విజ (విప్ర) శుశ్రూషయు – కొన్ని ప్రతులు. 4. మృగమాంసోపజీవనంబు – పీ. శ.

నకు రాజైన జనకుండు [5]రాజధర్మతత్పరుండయి సకల[6]వర్ణధర్మరక్షణంబు వదలకుండు నట్లుగాన యాత్మ[7]కర్మంబులు విడుచువానిం దనపుత్త్రు[8]నైనను దండితుం జేయుఁ గావున నేనును నిజకర్మపరిత్యాగంబు సేయ నోడుదు నీదృశప్రవర్తనుండ నయ్యెను.

33\. తే. జీవహింస యెన్నండును జేయ ననఘ, యొరులు సంపి తెచ్చిన మాంస మొసర [1]విలిచి
తగిన వెల[2]కమ్మి బ్రదుకుదుఁ దద్దనమున, [3]నమలమానసశాంతి నాయర్థ మెందు.

34\. చ. వినయము విస్తరిల్ల గురువృద్ధజనాతిథి [1]విప్రదేవతా
ర్చన లొనరింతు [2]సత్యమును శౌచము నేమంబు [3]నీగి మన్ననం
దనుపుదు భృత్యబంధుతతిఁ దాల్మివహింతు ననూయఁ జేయ నెం
దును మదిఁ దృష్ణనొన్పఁ బరదోషకథావిముఖుండ నెప్పుడున్.

35\. క. సతతోపవాసనియమ, వ్రతములఁ జరియింతు నేకపనిత్యప్రియయుఁ దగ
ఋతుకాలరతుఁడ నిందా, స్తుతులందు మనంబు నాకుఁ దుల్యత[1]నుండున్.

36\. వ. అట్లగుటం జేసి హీన[1]యోనిజుండ నయ్యెను నిర్మలుండనైతిం బ్రసంగవశంబున నింత సెప్పవలసె నీవు [2]ధర్మబోధార్థంబు నాయున్నయెడకుం జను దెంచితి గావున నీకు ధర్మవిశేషంబు లెఱింగించెద నవ[3]ధానతత్పరుండ వయి యాకర్ణింపుము.

---

5; మృగయోపజీవనంబు – వా. కొన్ని ప్రతులు. 5. నిజధర్మ – వా. వీ. 6. కొన్ని ప్రతులలో 'వర్ణ' శబ్దమును, కొన్నింట 'ధర్మ' శబ్దమును విడువఁబడినవి. 7. ధర్మంబు విడుచు – ఇ. ఉ. ఎ. ఐ. బ. 8. నేనియు – కొన్ని ప్రతులు.

33\. 1. నినిచి – శ; గొనియు – ఘ. 2. కిచ్చి – కొన్ని ప్రతులు. 3. నమల మానస – ఈ. ఐ. త. శ; నమల మాంసంబు శాంతియ సాధనంబు – ఇచ్చట అఖండ యతి. వా. ష. కొన్ని ప్రతులు; నయమహింసయు శాంతియు సాధనంబు–శ;

34\. 1. బంధు – ఆ. ఈ. ఎ. ఐ. ఝ. 2. నిత్యమును శౌచము – ఔ. ద. న. 3. నీవి మన్ననం – కొన్ని ప్రతులు.

35\. 1. నొందున్ – ఓ.

36\. 1. యోనిజాతుండ – వీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. ధర్మప్రబోధార్థంబు – వీ. శ. ష. కొన్ని ప్రతులు; ధర్మబోధనార్థంబు – ఈ. ఐ. క. 3. ధానపరుండ వయి – పెక్కు ప్రతులు.

-: ధర్మవ్యాధుఁడు కౌశికునకు ధర్మవిశేషము లెఱిఁగించుట :-

సం. 3 _ 198 _ 19

37. క. తనకులధర్మము [1]విడువక, మనుట పరమధర్మ మండ్రు మాన్యులు చిత్తం
బునఁ గృప గలుగుట ముఖ్యపుఁ, జని సైరణవలయు నఖిలభావములందున్.

38. ఆ. [1]విడువవలయు విషయవిషమవాంఛల నెద, విడుపుఁ బోలు గుణము వెదకి యెందుఁ
గానరైరి బుధులు గలదె పరిత్యాగ,శీలునకు నసాధ్యసిద్ధి యెందు.

39. సీ. సత్యహితాలాపచతురత [1]యర్హంబు సంతతసుజనపూజనము వలయు
విను [2]కామసంరంభ విద్వేషములఁ జేసి [3]మతిగలంగినను ధర్మంబు దప్పఁ
ద్రొక్కక నడచు టత్యుత్తమసరణి యప్రియములయందును బ్రియములందు
దైన్యహర్షంబులఁ దగులక [4]యున్నట్టి కల్యాణవర్తనకాంత లెస్స
తే. యెగ్గుసేసినవారికి హితముసేఁత, యార్యజనములు గీర్తింతు రన్యదోష
కారి దన[5]పాపమునఁ దాన[6]కాలిపోవు, వేఱవానికిఁ [7]గీడు గావింపనేల.

40. క. ధార్మికులు [1]సలుపునుత్తమ, కర్మముఁ జెడనాడు నాస్తికజనము విను మా
దుర్మతుల తెఱఁగు[2]గైకొని, ధర్మము నెడఁ బ్రీతి[3]వదలఁ దగదు బుధు[4]నకున్.

---

37. 1. దప్పక - ఔ.

38. 1. విడువ......నెద - ఆ. ఉ. ఒ. చ. ఝ. ల. వ; విడువవలయు బుద్ధి విషయ వాంఛలయందు - ఈ. ఐ. త. శ; విడువవలయు సకల విషయవాంఛలయందు - వా. పీ. శర. కొన్ని ప్రతులు.

39. 1. యరుహంబు - శ. 2. కామసంరంభ - ఆ. ఈ. ఎ. ఐ. ఒ. ఓ. ఔ. క. ఘ. చ. జ. ఝ. ఠ. త. ద. క్రోధ సంరంభ - వా. శ. ష. కొన్ని ప్రతులు. అచ్చట మూలమిట్లున్నది "నచకామాన్న సంరంభాన్ ద్వేషాద్ధర్మముత్సృజేత్" శం - 706 శ్లోక 40 ఆరణ్యపర్వ. 3. మది - ఈ. ఊ. ఐ. త. 4. యున్నది - కొన్ని ప్రతులు. 5. దోషమున - కొన్ని ప్రతులు. 6. క్రాగిపోవు - శ. 7. నెగ్గు - ఒ.

40. 1. నడపు - ట. 2. గనుగొని - పెక్కు ప్రతులు. 3. యెడలఁదగదు - ఖ. వ. 4. లకున్ - కొన్ని ప్రతులు.

41. క. మది మఱపునఁ బాపము దన, కొదవుటయును విడిప వగచి [1]యొకసగమును నే
నిది సేయ నింకనని యెడు, మదిఁ దెలిసగ[2]మును నరుఁడు [3]మలుఁగు నఘంబున్.

42. తే. [1]పాపముల కెల్ల నెక్కుడు పాతకములు, [2]సువ్వె క్రోధలోభంబులు సుప్రశాత్మ
వాని రెంటి జయించినవాఁ[3]డుగాని, యెందుఁ బరమధార్మికుఁడని యెన్నఁబడఁడు.

43. వ. శిష్టచరితంబులు గానిమార్గంబులు గొన్ని తృణసంవృతంబు లైన కూపంబులుం బోలెఁ గపటధర్మసంవృతంబులై యుండు వాని[1]దవ్వులన పరిత్యజించి శిష్టాచారంబుల నడ[2]పుట ధర్మలక్షణం బనినం గౌశికుండు శిష్టాచారంబు లెయ్యవి యెఱింగింపు మనుటయు ధర్మవ్యాధుం డి ట్లనియె.

44. సీ. దానంబు సత్యంబుఁ దపము యజ్ఞము సార్జ[1]వముఁ గామలోభాదివర్జనంబు
గురుజనశుశ్రూష క్రోధరాహిత్యంబు దమము సంతోష మధ్యయన [2]నిరతి
దాంభికత్వములేమి దైన్యంబు వొరయమి యనసూయ యనహంక్రియా[3]యుక్తి
దలఁపంగ నాద్యమై తనరు ధర్మమ యెప్డుఁ [4]గొనియాట [5]నాస్తికగోష్ఠిఁ జనమి
తే. శీలసంరక్ష తీర్థ[6]సంసేవ శౌచ, [7]మఖిలభూతంబులందు [8]దయార్ద్రదఁగుట
మితహితోక్తులు సంశ్రితమిత్రగుప్తి, యిన్నియును శిష్టచరితంబు లిద్ధచరిత.

---

41. 1. యొక్కసగంబున్నది సేయనింక - స. 2. మును - వి. శ. ష. పెక్కు-ప్రతులు; మైన - వా; ముగ - సూ. 3. మలవగవలయున్ - ఈ. ఐ. త; మానఁగవలయున్ - ఔ. న; మలఁపు నఘంబున్ - ష. సం.

42. 1. పాతకములకు - ఉ. ఓ. ఘ. శ. 2. సూవె - ల. 3. డగణగి - ఈ. ఐ. త.

43. 1. దవ్వులం బరిత్యజించి - కొన్ని ప్రతులు. 2. చుట - వా. పుట పరమధర్మ-ల.

44. 1. వంబుగామవిమోహవర్జనంబు - ఛ; వంబు గామవిలోభవర్జనంబు - ఈ. ఉ. ఐ. త. ఝ; వము గామలోభవివర్జనంబు - జ. 2. నియతి - ఔ. 3. గుప్తి - ఆ. ఎ. 4. గొనుటయు - ల; గొనియాడ - శ. కొన్ని ప్రతులు. 5. నాస్తికత్వ గోష్ఠి - ల. శ. 6. నిషేవ - కొన్ని ప్రతులు. 7. మఖిలభూతములకు సదయాత్ముఁడగుట - ఘ. శ. 8. కృపార్ద్రదగుట - ఇ. ఝ. శ.

45. క. విను శిష్టచరిత గై కొని, [1]యనసూయత నడవ నడవ నంతఃకరణం
బునఁ బొదలునట్టి సమ్మద, మనఘా దుర్లభము సూవె యన్యపథములఁ.

46. వ. కావున శిష్టాచార[1]నియతిం జేసి గురుశుశ్రూష సలిపి కృతాధ్యయనుండవై పరమజ్ఞాన[2]పరిపక్వం బైన చిత్తంబుతోడం గామక్రోధమహామకర సంకీర్ణయు విషయజల[3]పరిపూర్ణయు నైన మోహ[4]జలధి నస్ఖలితధైర్యం బను తెప్పం జేసి యక్రమంబున [5]నిస్తరించి కృతార్థుండ వగు మని మఱియు నిట్లనియె.

47. క. క్రమమున శిష్టాచార, క్రమ మెఱుఁగఁగ ధర్మమునకుఁ గడు వాటం బై
విమలం బగుఁ జిత్తము స,త్యమును నహింసయును దనకుఁ [1]దావలములుగన్.

48. ఆ. విను మహింస ధర్మవితతి కెల్లను మేటి,యదియు సత్యయుక్త[1]మైన వెలయు
ననఘ శిష్టచరితలందు సత్యమ కడు,నధిక మనిరి శ్రుతుల నరసి బుధులు.

49. తే. వేదవిహితంబులును శాస్త్రవిహితములును, శిష్టచరితంబులును
ననఁ జెప్ప నొప్పి
ధర్మములు మూఁడువిధములఁ దనరుచుండుఁ, [1]గడఁగి యిన్నియు
సద్గతికారణములు.

50. మ. అనయంబుఁ [1]శ్రుతవంతుఁడై వినుతశిష్టాచారమార్గంబులం
జను పుణ్యాత్ముఁడు [2]దుర్గముల్ గడచి ప్రజ్ఞాహర్మ్యసంరూఢుఁడై
కనుచుండుం బటుమోహపంకజలమగ్నం బైన లోకంబు నీఁ
క నధోభాగమునందు [3]డింది కడు దుఃఖం బొందఁగా [4]నవ్వుచున్.

---

45. 1. యనపాయత – పెక్కు ప్రతులు.

46. 1. నిరతిం జేసి – త. 2. ప్రదం బైన – ఇ. ఉ. 3. పరి – పెక్కు ప్రతులలో లేదు. 4. జలధినస్ఖలిత – త. మహానది – వా. వీ. కొన్ని ప్రతులు. ఇచ్చట మూలమున నదియనియే యున్నది. "కామలోభగ్రహాకీర్ణామ్ పంచేంద్రియజలాం నదీమ్, నావం ధృతిమయీం కృత్వా జన్మదుర్గాణి సంతర" భం 3–198–67. 5. నుత్తరించి–ఇ.

47. 1. దావలములగున్ – ఝ. త. ల. శ. ష.

48. 1. మగుచు – ఇ. ఏ.

49. 1. గణగి – కొన్ని ప్రతులు.

50. 1. శమవంతుడై –ఓ. ఘ. ల. శ. ష. శ్రుతిమంతుడై –కొన్ని ప్రతులు. 2. దుర్గతుల్ గడచి–ఆ. ఎ. ఒ. క. ఝ. త. ల. వీ. 3. నుండి – కొన్ని ప్రతులు. 4. జూచుచున్ –ఉ.

-: ధర్మవ్యాధుడు గౌశికున కహింసాస్వరూపంబు సెప్పుట :-

సం. 3 - 199 - 1

51. వ. అని పలికి ధర్మవ్యాధుండు మఱియు నిట్లనియె నయ్యా నీవు దొలుత నావర్తనంబు గనుంగొని యిది హింసా[1]బహుళంబు గాదె యని పలికితివి దానికేను దగుతెఱంగు సెప్పితి నది యట్లుండె [2]హింస యిట్టిది యహింస యిట్టి దని విభాగింప నెవ్వరికి [3]నేర నగు.

52. క. మును తనచేసిన కర్మం,బునఁ [1]జూపె నశించు భూతములు సంపెడు వాఁ డు నిమిత్తమాత్ర మింతయె, యనిచెప్పఁగ వినమె [2]యంచితాచారులచేన్.

53. వ. [1]అదియునుంగాక.

54. క. [1]ఫలమూలౌషధి శాకం,బులు బశుమృగతతులు భక్ష్యములుగా భూతం బుల కజుఁడు సేసె నని య,స్ఖలితంబుగ మ్రోయుశ్రుతులఁ గాదన వశమే.

55. సీ. అనఘ యౌశీనరుం[1]డగు శిబి నిజగాత్రహింస నింద్రాగ్నుల కిడఁడె మాంస మతనికి లేదయ్యె నయ్య యుత్తమగతి రంతిదేవుం డను రాజు దొల్లి యనుదినంబును గోసహస్రద్వయంబుఁ దా వధియింపఁడే [2]వేయివత్సరములు దురిత మ[3]మ్మహితాత్ముఁ దొడరెనే వేదార్థనిరతులై యత్యంతనియతులైన

తే. ధారుణీసురముఖ్యు లధ్వరము[4]నందుఁ [5]బశువరింపరే పశువులఁ బరమపుణ్య గతులు గలుగవె వారికిఁ గడఁగి యగ్ను, లధికమాంసార్థు లని శ్రుతులందు వినమె.

---

51. 1. కర్మంబుగాదా (గదే) - గ. ల. శ. ష. 2. హింసాహింస లిట్టివని - ఈ. ఐ. త. 3. వశంబుగాదు - ఉ; నగును - ఊ. శ.

52. 1. దాన - ఈ. ఉ. ఎ. క. చ. జ. 2. యెందు నార్యులచేతన్ - శ; యెందు నార్యజనముచేన్ - ఘ.

53. 1. కొన్ని ప్రతులలో ఈ వాక్యములేదు.

54. 1. ఫలములు నోషధి - ఘ. ఠ. శ. ష.

55. 1. డను శిబి - ఆ. ఘ. ఠ. శ. 2. వేయు వత్సరములు - ఇ. ఉ. ఎ. ఝ. ఠ. ల. 3. మ్మహనీయు - ఉ. 4. లందు - పెక్కు ప్రతులు. 5. బశువధంబొనరింపరే పరమపుణ్య - ఏ; బశువరింపరే - ఈ. ఊ. ఠ. త.

56. క. పితృ[1]దైవతకార్యములం, దతిభక్తిని మాంస మిడుట యర్హమనియుఁ ద
త్పితృ[2]దైవశేషములు స, మ్మతి [3]భోజ్యము లనియు మునుల
మతములు గావే.

57. మ. హాలికుం డెంతయు [1]నోజతోఁ దునుఁగ సీరాగ్రంబునం [2]జొచ్చి ప్రా
ణు లనేకంబులు సచ్చు హింస యది యానోకాదొ వేయేల మ
ర్త్యులు నేలం జరియించుచోఁ బదములం ద్రొక్కంబడుం [3]బెక్కు జం
తులు హింసావిధి గాదనంగ వశమే [4]దోషజ్ఞ యూహింపుమా.

58. చ. సలిలము నుర్వి యాకసము సర్వము జంతుమ[1]యంబు గావునం
గలుగు నవశ్యముఁ సకలకర్మములందును హింస హింసకుం
దొలఁగిన దేహయాత్రయును దుర్ఘట మైనటు లుండు నింతయుం
[2]దలఁపరు హింససేయ మని తారు[3]తలంతురు గొంద ఱిమ్మహిన్.

59. క. పనివడి యహింస వ్రతముగఁ, [1]గొని వనమునను్న మునుల[2]కుం
దొడరదె హిం
సనము తరుమూలఫలశా, కనిపీడన మదియు హింస[3]గాదొకో తలఁపన్.

60. తే. హింస సేయనివాఁడు [1]లేఁ డిజ్జగమున, [2]నొక్కడైనను దమతమ యోపినట్లు
హింసతెరువున కెడగల్గి యేఁగవలయు, నదియ చూవె యహింసనా
నతిశయిల్లు.

---

56. 1. దేవత – చ. 2. దైవత శేషము – ఈ. ఐ. త. శ. ష. వి; దేవశేషములు – ల.
3. బూజ్యములని – స.

57. 1. నోజదున్నగను – ఇ. ప. ఓ. ఔ. చ. తి. ల; నోజదున్నునెడ – ఆ. ఎ. ఐ. క. ఖ.
త. ఝ. వీ. శ. శర. ష. సూ. 3. హీన – ట. 4. దోషఘ్న – క. ల.

58. 1. యంబ – ఓ. ల. 2. దలఁపర – వా; దలపరు – పెక్కు ప్రతులు. 3. చరింతురు–
వీ. శ. ష. కొన్ని ప్రతులు.

59. 1. గొన కొని యున్నట్టి మునులకుం – ట. 2. కున్నొడ వదె – క. 3. గావె
తలంపన్ – చ. ల.

60. 1. లేఁ డీ జగమున – చ. స. 2. నొక్కరుండైన దమ తమ – కొన్ని ప్రతులు.

61. వ. ధర్మంబు బహుప్రకారం[1]బై యుండుఁ దదీయసూక్ష్మగతి దురవబోధంబు గావున శ్రుతిప్రమాణంబువలనను వృద్ధాచార[2]నిదర్శనంబులను నెఱింగి కొనునది.

62. ఉ. భూతహితంబుగాఁ బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చుఁ ద
ద్భూతభయాస్పదంబగు ప్రభూతపుసత్యము బొంకు నట్ల ప్రా
ణాతు[1]రుఁడై నచోఁ బరిణయంబునయందును బల్కు బొంకు స
త్యాతిశయంబ యండ్రు మహితాత్మక యిట్టివి ధర్మ[2]సూక్ష్మముల్.

63. వ. అని[1]తెలిపి మఱియు నతండు.

64. క. [1]ఒప్పెడునది యైనను గడు, నొప్పనియది యైన నిజకులోచితపథముం దప్పఁ దగ దండ్రు ధార్మికు, లప్పని నిజభాగ్యవిహిత మని యుండఁ దగున్.

65. క. విను పూర్వకర్మఫలములు, దనకు[1] వశముగాక పొందుఁ దఱితో వానిం [2]గనుఁగొన నేరక మూఢుఁడు, దనకాపదయైనచోట దైవము దూఱున్.

66. తే. కార్యఫలములయెడఁ దాన కర్తననుట, కడు నెఱుఁగమిఁ జువ్వె తాఁ గర్తయేని
తగిలి తనదైన కార్య[1]జాతంబు నెల్లఁ, జెడక ఫలియించునట్లుగాఁ జేయరాదె.

67. వ. అది యెట్లంటేని.

68. సీ. నీతిమంతులు ధర్మనిరతులు దక్షులు నగువారు సేయుకార్యములు గొన్ని
సిద్ధిఁ బొందవు దుష్టచిత్తులు [1]క్రూరులై చేయఁ గొన్ని [2]విశేషసిద్ధిఁ బొందు

---

61. 1. బై యపారంబై — అ. ఝ. వీ. 2. ని — డ. ర. ల. ప్రతులలో లేదు.

62. 1. రమైనచో — ఈ. ఐ. క. చ. ఝ. ట. త. ల. 2. సూక్ష్మతల్ — ఒ. ఓ.

63. 1. పలికి — ర.

64. 1. ఒప్పెడి యది — డ.

65. 1. ననుభవింపవలయు దఱితో — అ. ఈ. ఏ. ఒ. ఝ. 2. గనిగొన నేరక — డ. ల.

66. 1. హితంబులెల్ల — ఉ. ఝ. ట; జాతంబులెల్ల — ఐ. ఓ. చ. ఝ. ట.

68. 1. గూరులై — వా. 2. విశిష్టసిద్ధి — డ.

నూరక యుండంగ నొందుఁ గొందఱు విపులార్థముల్ గొంద
ఱాయాసపడియు
నిష్ఫలారంభులై నిలుతురు గొందఱు పేదవారికిఁ బ్రజ పెల్లువొడము
తే. నర్థవంతులు గొందఱ కర్థి నధిక, దానములు ధర్మములు సువ్రతములుఁ జేయఁ
బ్రజలు పుట్టరు విను[3]మిట్టిభంగి సుమ్ము, కర్మఫల మాత్మతంత్రంబు
గాకయుండు.

69. క. పురుషుఁడు కర్మాధీనత, నరుగక తన[1]వశము యనిన నాపదలు రుజల్
మరణంబును నివి యేమియుఁ, బొరయక యుండంగ బ్రదుకఁ
[2]బోలదె చెప్పుమా.

70. ఆ. కర్మవశతఁ జూవె కలుగుదేహము దేహ, వర్తనంబు కర్మ[1]వశతఁ బుట్టు
దేహ[2]పాతమైన దేహస్థుఁడగు జీవుఁ, డరుగుఁ గర్మవిహితమైన [3]యెడకు.

71. వ. అనినం గౌశికుండు జీవుం డెట్టివాఁడని యడిగిన లుబ్ధకుం డిట్లనియె.

-: ధర్మవ్యాధుఁడు గౌశికునకు జీవలక్షణంబు సెప్పుట :-

సం. 3 - 200 - 26

72. క. విను జీవుండు సనాతనుఁ, డనఘుఁడు నిజకర్మవశత నధ్రువదేహం
బునఁ బొందు దేహ[1]పాతం, బున నెప్పుడుఁ జెడఁడతండు భూసుర[2]వర్యా.

73. క. ఈయొడలు విడిచి వేఱొక, కాయముఁ గైకొని [1]శరీరి కర్మవశగతిం
బోయి సుఖదుఃఖములు గనుఁ, బాయక వెండియును దేహబంధముఁ[2]
బొందున్.

---

3. మట్టి భంగి - వా. పీ. కొన్నిప్రతులు; మిట్టి భంగి - ఆ. ఊ. ఐ. చ. జ. ఝ. త.

69. 1. మతము యనిన - ఈ. ఐ త; వశమయేని నాపదలు - గ. ఠ. డ.-ల; 2. బోలదె- ఐ. ఔ. చ. ఝ; బోలదు - వా. కొన్ని ప్రతులు.

70. 1. వశగతంబు - పెక్కు ప్రతులు. 2. నాశమైన - ఔ. 3. యపుడు - ఒ.

72. 1. తంత్రంబు - ఐ. ఝ. 2. ముఖ్యా - ఈ. ఐ. ఒ. త.

73. 1. శరీర - వా. కొన్ని పతులు. శరీరి - ల. పీ. శ. ష. 2. నొందుఁ - ఈ. ఐ. ఒ. చ. ద; వడయున్ - ట.

74. వ. అనిన విని బ్రాహ్మణుండు లుబ్ధకునితోడం బుణ్యపాపానురూపంబు లయి దేహబంధంబు లెట్టి వనిన వాఁ డిట్లనియె.

75. చ. [1]స్థిర మగు పుణ్యకర్మమున దేవభవం బగుఁ బుణ్యపాప సం
కరమున మానుషత్వ మగుఁ గల్మషముల్ పశుకీటభావముం
బొరయఁగఁ జేయు నిప్పగిదిఁ బుట్టుచుఁ జచ్చుచు మోహవార్ధిలోఁ
దిరుగుచు నుండుఁగాని యొకతీరము [2]సేరఁడు జీవుఁ డెన్నఁడున్.

76. చ. ఇది సకలంబుఁ గాంచి బుధుఁ[1]డెన్నఁడుఁ బాపముపొంతఁబోక ని
ర్మదనిరహంక్రియాత్ముఁడును మత్సరదూరుఁడు నై చరించు నెం
పొదవఁగ ధర్మమార్గమున నొయ్యన [2]ధర్మము లీ పెఱింగి తా
వదలఁడు [3]సత్క్రియావిధము వారక యెక్కుడు దొనర్చు ధర్మముల్.

77. చ. చిరముగ ధర్మముల్ [1]నడపఁ జిత్తము దేఱుఁ బ్రసన్నచిత్తుఁడై
పరువడి నింద్రియార్థములభంగులు రిత్తలుగా నెఱింగి చె
చ్చెర [2]నవి యంతవట్టు నిరసించి తపో[3]దమసత్యశీలతం
బరిణతి నొందుఁ బొందుఁ బిదపం బర[4]మార్థపదప్రభావమున్.

78. వ. అనిన నమ్మహాద్విజుం[1]డు ధర్మవ్యాధున కి ట్లనియె.

79. ఆ. ఇంద్రియంబు లనఁగ నెయ్యవి యవి నిగ్రహింపకున్నఁ బాప[1]మేమి దొడరు
వాని నిగ్రహించువానికి నగుఫలం, బెట్టి దనిన నాతఁ డిట్టు లనియె.

---

75. 1. తిరమగు – పా. ఘ; స్థిరముగ – డ. 2. చేరగ నేర డెన్నడున్ – ట. న.

76. 1. డెప్పుడు – పెక్కు ప్రతులు. 2. ధర్మవు తీ పెరింగి – ఝ; ధర్మము ప్రో వెరింగి- ఆ. డ. 3. తత్క్రియావిధము – పీ. శ. ష. మున్నగు ప్రతులు.

77. నడవ – క. డ. 2. నిది యంత వట్టు – చ. 3. ధన నిత్యశీలతం – ఈ. ఐ. త. 4. మాత్మపద – ఐ. త.

78. 1. డమ్మహామతి – వా. కొన్ని ప్రతులు; డా లుబ్ధకునకు – ష: డు ధర్మవ్యాధున- ఈ. ఏ. ఐ. ఝ. త.

79. 1. మెట్లు – ఎ. ఏ. ఐ. ఝ. త. పీ.

80. క. విను విషయజ్ఞానము[1]నకు, ననయంబును మనసు మూల మది కామక్రో
ధనిరూఢ మగుచుఁ బురుషుని, ననిశము నెలయించు
నింద్రి[2]యార్థక్రియలన్.

81. సీ. ఇంద్రి[1]యార్థంబుల కెలసిన పురుషుండు [2]గాఢరాగంబునఁ [3]గరఁగుచుండు
రాగంబువలనఁ దిరంబగు లోభంబు లోభియై కరుణకు లోనుగాఁడు
[4]మఱి సముద్ధతవృత్తి మరుగుఁ బాపక్రియఁ [5]దగువారు సెప్పెడి తగవు వినఁడు
కుజనుల[6]దెసఁ బ్రీతి గొఱలుఁ దుల్యంబులు [7]గాకుండు వాఙ్మనఃకర్మములగు

ఆ. లిహమునందుఁ బుణ్యహీనుఁడై చెడిపోవుఁ, బరమునందు దుఃఖ
[8]భరమునొందుఁ
[9]గాన యింద్రియార్థగతిఁ బోక సాధుసం, సర్గ[10]జేసి సుగతిఁ
జనుట యొప్పు.

82. వ. ఇంద్రియంబు లనవెయ్యవి యనియు నింద్రియజయసిద్ధియు నీవు నన్నడి
గితివి [1]తత్ప్రకారంబు బ్రహ్మవిద్యావిషయంబు మాబోఁటివారికి [2]నవా
చ్యంబై యుండు నైనను నీవు బ్రాహ్మణప్రవరుండవు గావున [3]సద్బ్రాహ్మణ
ప్రియం బవశ్యకర్తవ్యంబు పరమబ్రహ్మవిదు లయిన బ్రాహ్మణవరు[4]లకు
నమస్కరించి బ్రహ్మవిద్యాప్రపంచం బెఱింగించెద [5]నవధానపరుండవై
యాకర్ణింపుము.

---

80. 1. లకు – ళ. 2. యార్థంబులకున్ – పెక్కు ప్రతులు.

81. 1. యార్థములకు నెనసిన – ఈ. గ. చ. జ. డ. ద. శ; యార్థములకు నెలసిన – ల. ష. కొన్ని ప్రతులు. 2. కామరాగంబున – ఉ. 3. గడఁగుచుండు – త. 4. మఱి సముద్ధత వృత్తి – ఇ. ఊ. ఏ. ఓ. ల. శ; కరుణ లేనప్పుడు గడగు బాప క్రియ – ఔ; మది సముద్ధతవృత్తి – ఒ. చ. 5. తత్పాపి పుణ్య వర్తనుడుగాడు–ఔ. 6. యెడ – ఓ. స. 7. గాకుండు నజ్ఞానకర్ముడగుచు నిహ – ళ. 8. పరము–ఆ. 9. గాన నింద్రియార్థ – ల. వీ. ష. 10. గనుట సుగతి జనుట కొదవు – ఔ.

82. 1. తత్ప్రభావంబు – ళ. 2. నసాధ్యంబై యుండు – ఆ. ళ; నశక్యంబై; న వార్యంబై – అని పాఠములు. 3. బ్రాహ్మణప్రియం – కొన్ని ప్రతులు. 4. ల దలంచి నమస్కరించి – ళ; లకు మ్రొక్కి – ఆ. ఈ. ఎ. ఐ. ఝ. త. 5. సావధానుండవయి – ళ.

-: ధర్మవ్యాధుఁడు కౌశికునకు బ్రహ్మవిద్యాప్రపంచం బెఱింగించుట :-

సం. 3 - 201 - 16

83. తే. అంబరము వాయు వగ్ని దోయమ్ము ధరణి, భూతపంచక మిది క్రమంబున మహాత్మ
శబ్ద సంస్పర్శ రూప రసములు గంధ, సంయుతంబుగ భూతపంచక గుణములు

84. క. ఒనరఁగ నాకస మాదిగ, [1]ననులోమముతోడ నిమ్మహాభూతము లే
నును బుట్టు[2]నొకటి కొక్కటి, యనయముఁ బ్రతిలోమగతి లయంబునఁ బొందున్.

85. వ. శ్రోత్రంబును ద్వక్కును [1]జక్షువును జిహ్వాయు ఘ్రాణంబును [2]నను నియ్యే నగు నింద్రియంబులు శబ్దస్పర్శరూపరసగంధంబు లింద్రియవిషయంబు లై యుండు నింద్రియపంచకంబునకు షష్ఠంబై మనస్సు ప్రకాశిల్లు సప్త మాష్టమంబులై బుద్ధియు నహంకారంబును వర్తిల్లు సత్వంబును రజస్సును [3]దమస్సును గుణంబు[4]లై యుండు నీచెప్పంబడిన మహాభూతప్రముఖ ప్రపంచం బంతయు నవ్యక్తం బను తత్త్వంబునం దా[5]విర్భావతిరో[6]భావం బులం బొందుచుండు.

86. క. అవ్యక్తతత్త్వమరయఁగ, నవ్యక్తంబయ్యు [1]నిట్టిదై లత్యమగుఁ
దవ్యక్తేంద్రియ భూతా,దివ్యవహారార్థలింగదృష్టాకృతియై.

87. వ. అనిచెప్పి మఱియు నిట్లనియె.

88. తే. అనఘ శబ్దాదివిషయంబులందుఁ దగిలి, యిచ్చఁ జరియించు నెప్పుడు నింద్రియములు
బుధుఁడు [1]దత్స్వభావముఁ దనబుద్ధి నెఱిఁగి, యేమఱక వానిఁ దగఁ గుదియింప వలయు.

---

84. 1. నను క్రమముతోడ - ఆ. ఐ. ఒ. జ. ఝ. డ. ద. శ. ష; నను క్రమముం బొందియు - వీ. 2. నొక్కడొకటికి - చ.

85. 1. జక్షుస్సులును - శ; చక్షులును - ల. 2. నను నివి యేను నిద్రియంబులు - కొన్ని ప్రతులు; నివి యేనింద్రియములు - ల. 3. దమంబును - ద. 4. లని చెప్పంబడునట్టి మహాభూత - డ. ల. 5. విర్భవ - ఆ ఝ. త. 6. భావంబు- ఔ. త.

86. 1. నిట్టు లాలత్యమగున్ - ఔ. స; దాన యాలత్యమగున్ - ఆ. ఈ. ఐ. ఝ. త.

88. 1. దత్ప్రభావము - ఐ. ఒ. ఝ. ట. శ. స.

89. ఉ. ధీరుఁడు నిర్జితేంద్రియుఁడు దెల్లము[1]గాఁ దనుఁగాంచు భూత వి
స్తార[2]నిగూఢ మైన పరతత్త్వముగాఁ దనయందు భూత వి
స్తారము నెల్లఁగాంచు సతతస్ఫుటదర్శనుఁడై సమగ్ర [3]వి
స్ఫారతఁబొంది నిర్మలతపంబులయందుఁ జెలింపకెన్నఁడున్.

90. క. తపమనఁగ సకలవిషయ, [1]వ్యాపేతమగునట్టి బుద్ధివైభవము సుమీ
తపమున సుస్థిరుఁడగు యో, గపరునకుం గలవె యొండు కర్తవ్యంబుల్.

91. క. స్వర్గనరకంబు లింద్రియ,వర్గసమాచరణమునన వచ్చును వినవే
స్వర్గమగుఁ [1]దన్నివారణ, దుర్గతి యగుఁ దన్నిరోధదుర్బలత మెయిన్.

92. చ. అరదము దేహమింద్రియము లశ్వము [1]లాత్ముఁడు సూతుఁ డమ్మహో
తురగచయంబు [2]ధైర్య మను త్రోరపుఁ బగ్గములన్ దృఢంబుగా
నురవడిఁ బోక యుండ వెరవొప్పఁగఁ బట్టినవాఁడు [3]సేమపుం
దెరువున నేఁగు నప్పరమధీరుఁడు సువ్వె యుదారుఁ[4]డెయ్యెడన్.

93. తే. ఇంద్రియంబులు[1]దివిచినయెడక పాఱు,చుండు మనసెప్డుఁదద్వేగముడుపకున్న
[2]నెడలి చెడిపోవు బుద్ధి యుదీర్ణపవన,హతిఁ బయోనిధిలోఁ గల[3]మవియునట్లు.

94. క. [1]పనింద్రియములు మనసును, బూనితనవశంబయైన [2]బురుషుండు గదా
ధ్యానసమాధిసమగ్రుఁడు, వానింగీర్తింతు రమరవరులున్ మునులున్.

95. వ. అనిన నవ్విప్రుండు సత్త్వరజస్తమోగుణంబుల తెఱంగెఱింగింపు మనిన నెఱు కిట్లనియె.

---

89. దన్నును గాంచు – డ. 2. నిరూఢమైన – డ. వా. పీ. 3. విస్ఫారము (త) బొంది – పీ. శ, ష. పెక్కు ప్రతులు; చిత్సారముఁ బొంది – వా. కొన్ని ప్రతులు; చిద్భారము – ల.

90. 1. వ్యపగతమగునట్టి – ట. డ.

91. 1. దుర్నివారణ – డ.

92. 1. లాత్మయ సూతుడు – ఐ. 2. ధర్మమను – క, ద. 3. సర్గపుం దెరువున – పీ శ. ష. 4. డారయన్, డెమ్మెయిన్–అని పాఠములు.

93. 1. దిగిచిన – పెక్కు ప్రతులు; దిరిగినయెడక – శ. 2 తేట–ఇ. ఏ. 3. మవియు కరణి – ఘ; మవిసినట్లు–కొన్ని ప్రతులు.

94. 1. మానస పంచేంద్రియములు – ఓ. 2. బుణ్యుండు సదా ధ్యాన – స.

-: ధర్మవ్యాధుఁడు కౌశికునకు సత్త్వరజస్తమోగుణంబుల తెఱంగెఱింగించుట :-

సం. 3-203-3

96. క. అతినిందితము తమోగుణ, మతి[1]బోధమయంబు సత్త్వమునయంబుఁ బ్రకా
శత నొప్పు నుభయగుణమి, శ్రతఁ బరగు రజోగుణంబు సన్నుతచరితా.

97. మ. [1]అసుఖాకారత నిద్ర దైన్యము విమోహం బజ్ఞుత్వంబుఁ దా
మసభావంబులు రాగ[2]లోభ జడతా మానంబు లూహింప రా
జసవృత్తంబులు ధైర్య[3]శాంతి కరుణా సంతోష విద్యాదు లిం
పెసఁగన్ సాత్త్వికచేష్టితంబులు నిజం బిట్లాత్మఁ [4]గన్మిన్నియున్.

98. చ. అనఘుఁడు సాత్త్వికుం డగు మహాత్ముఁడు బోధనిరూఢి [1]సత్త్వముం
గనికొని లోకవృత్తములు గావని రోసి సమస్తసంగముం
గనిరతుఁడై తొఱంగు మమకారవికార మహంక్రియాద్యఘాళిం
[2]బనుపడి [3]సంయమప్రకటభావన నుత్తమశాంతి గైకొనున్.

99. వ. సత్త్వ[1]గుణనిబద్ధుం డగునేని శూద్రుం డైనను జన్మాంతరంబున వైశ్యత్వంబు నొంది క్రమంబున రాజభూసురభావంబులు [2]భజించి భవవిముక్తుం డగు నని చెప్పిన నమ్మహీదేవుం డమ్మహానుభావు నభినందిం[3]చి.

100. తే. దేహమున ధాతుసంశ్రయదీప్తుఁ డగుచు, వహ్ని యెట్లుండు శారీరవాయువులకు
నెలవు లెయ్యవి యవి నాకు నిశ్చయముగఁ, జెప్పు మనుటయు నిట్లని చెప్పె నతఁడు.

---

96. 1. మోహమయంబు - శ. మ. కొన్ని ప్రతులు. వావిళ్ళ పూర్వముద్రణము లందును 'అతిమోహమయంబు' అనియే యున్నది.

97. 1. అసురాకారత నిద్ర - ప. ల; అసుఖాగౌరత నిద్ర - ఉ. శ. 2. కోప - ఊ. 3. కాంతి-ఉ. ఏ. 4. గన్మింతయున్ - వా; గన్మిన్నియున్ - వి. శ. మ. పెక్కు ప్రతులు; నూహింపగన్ - ఉ.

98. 1. తత్వముంగనికొని - ఈ. ఐ; సత్వముం - గ. 2. బనుపడు - ఘ. భ. ద. ల. 3. సంయమిప్రకట - ఈ. ఊ. ఝ; సంయమిప్రవర - ర; సంయమివ్రతతి - ఘ.

99. 1. గుణాను బద్ధుండగునేని - ఈ. ఎ. ఐ. ల. 2. భజియించి, ధరించి, వహించి - అని పాఠములు. 3. చియిట్లనియె - ఉ.

101. సీ. [1]మూర్ధదేశమునకు వర్తితంబై పర్వు జాఠరాగ్ని నాభి దదాశ్రయంబు
శిరమునఁ బావకాంతరమునఁ జరియించుఁ బ్రాణుండు భూతాత్మభావుఁ [2]డగుచు
వరుసఁ బ్రాణాపాను లిరువురు నయ్యగ్ని వెలిఁగింతు రనపేతవృత్తు లగుచు
గుద వస్తితలము లాస్పదములు గా వహ్ని పరిగతుం డగుచు నపానుఁ డుండు
తే. గడఁగి విణ్మూత్రనిర్గమకారి యతఁడు, కర్మబలయత్నకారియై కంఠ[3]తలము
నందు దా నుండు వర్తించు నఖిలదేహ,సంధులందును వ్యానుండు సంచరించు.

102. క. విను ప్రాణాపానులు న,య్యనలుఁడుఁ బ్రాపుగ సమానుఁ డన్నదని[1]విపా
చనుఁ డగుచు [2]నాభిదేశం,బున నుండును సకలధాతుపోషకవృత్తిన్.

103. క. ఇది పరమ[1]యోగదర్శన, విదితం[2]బిప్పాటఁ [3]బవనవిదు లైన మునుల్
[4]వదలక యభ్యాసవిధిన్, ముదమున [5]ధరియింతు రాత్మ[6]మూర్ధతలమునన్.

104. వ. ప్రాణాపాన[1]సమాహితుండై సకలదేహంబులందును జరియించుచున్న పావకుండు [2]జీవాత్ముండుగా వెలుంగు నతండు జలంబుల నున్న కమలపత్త్రంబునుంబోలె దేహంబునం దుండియు నిర్లేప[3]స్వరూపదీపితుం డయి వెలుంగుచుండు నిట్టి జీవాత్ముండ కదా పరమాత్ముండు.

105. క. చేతనరహితక్షేత్రముఁ, జేతన[1]ముం బొరయఁ జేయు జీవాత్మ[2]దశో
పేతుఁడు పరమాత్ముఁడు వి,ఖ్యాతుఁడు త్రైలోక్యసం[3]ప్రకల్పనుఁ డనఘా.

---

101. 1. ఊర్ధ్వదేహమునకు నూర్జితంబై - ఎ. 2. డగుచు - ట. క. 3. బలము - వి. వ.

102. 1. పిపాసనుఁడగుచు - ఔ. పీ. ష. 2. గోష్ఠదేశంబున - పెక్కు ప్రతులు; కోష్ఠదేశంబున - ఔ. ఘ. ఠ. ద. పీ. ష.

103. 1. యోగిమానస - ఈ. ఐ. త; యోగిదర్శన - చ. ఛ. శ. ష. 2. విదితాహారము - ఈ. ఐ. శ. 3. వంబు విదులైన - ద. 4. వ్యాదయమున గాంచి యంతయు, ముదమున ధరియింతు - ఓ; వదలక వ్యాఖ్యానవిధిన్ - ష. 5. ధరియింతురాత్మ - ల. 6. మూర్ధ్నితలమునన్ - క. ఝ. శ.

104. 1. సహితుండై - కొన్ని ప్రతులు. 2. జీవుండుగా - కొన్ని ప్రతులు. 3. స్వరూపుండయి - ల

105. 1. మునబొంద - ఎ. ఝ. డ. శ; ముంబొందఁజేయు - కొన్ని ప్రతులు. 2. దశానీతుఁడు - శ; దశాన్వితుఁడు - పెక్కు ప్రతులు; దశాస్థితుఁడు - కొన్ని ప్రతులు 3. వర్తనుడు - ఉ; కల్పుం డనఘా - ఇ. చ. శ.

106. క. భూతములయందు వెలిఁగెడు, భూతాత్ముని నెఱుఁగుదురు ప్రబుద్ధులు నిత్య
జ్యోతిర్మయు [1]నవ్యయు న,ద్వైతం బగుబుద్ధి సూక్ష్మధర్మమువలనన్.

107. వ. [1]అని మఱియుఁ గౌశికునకు ధర్మవ్యాధుండు బ్రహ్మవిద్యాప్రభావంబు
తెఱంగు సంప్రయోగరహస్యంబు దెలియ నిట్లనియె.

108. సీ. తెలివి నొందిన బుద్ధిగల [1]మహాత్ముండు శుభాశుభకర్మములందుఁ బొరఁడు
క్రమమున సౌఖ్యదుఃఖము లాదిగా నశేషద్వంద్వములయందు సమత నుండు
వినుమట్టి పుణ్యున కొనరింపవలయు కార్యం బెఱింగించెద ననుదినంబు
నియతాశియును జితేంద్రియుఁడునై పూర్వరాత్రమ్మున నపరరాత్రమ్మునందు

తే. యోగధారణ[2]నిరతుఁడై యుండవలయు, నపుడు బోధదీపంబున
నాత్మ నాత్మ
యందుఁ గనుచు నివాతదీపానుకారి,యై వెలుంగుచు నమృతమయత్వ
మొందు.

109. క. కామంబును గ్రోధంబును, నేమఱక జయింపవలయు నెల్లవిధములన్
ధీమహిత యిదియ సతత, క్షేమంకర మైన [1]పథము కృతబుద్ధులకున్.

110. క. నిత్యముఁ గర్మియుఁ గర్మఫ,లత్యాగియు నగుట లెస్స లౌల్యవియోగం
బత్యుత్తమయోగము ద,త్ప్రత్యయ[1]లక్ష్యుండు సూవె బ్రాహ్మణుఁడు
మహిన్.

111. చ. అరయఁగ జీవితంబు గడు[1]నస్థిర మింత యెఱింగి యాత్మ నె
వ్వరిదెసఁ గీడు [2]రోయక ధ్రువం బగు మైత్రి[3]భజించి సత్కృపా

---

106. 1. కేవలు — చ.

107. 1. ఈవచనము పెక్కు ప్రతులలో లేదు.

108. 1. మహామతి శుభాశుభకర్మములయందుఁ బొరఁడు వినుము — వ. 2. నియ
తుడై — ర; నిపుణుడై —చ.

109. 1. విధము — ఏ; పదము — ఈ. శ. ట.

110. 1. లక్షణుడు సూవె — అ. ఈ. ఉ. ఎ. ఐ. ఝ. ల.

111. 1. నధ్రువమింత — పెక్కుప్రతులు; నద్భుతమింత — గ. 2. సేయక — ఇ. ఏ. ల.
3. వహించి — అ. ఈ. ఝ. ద.

నిరతుఁడు [4]నిష్పరిగ్రహుఁడు నిత్యతపస్వియు నిత్యతృప్తుఁడుం
బరమ[5]శమాన్వితుండు నగు బ్రాహ్మణుఁ డొందు సనాతనస్థితిన్.

112. వ. నీవడిగిన యఖిలధర్మంబులు సంక్షేపరూపంబున నెఱింగించితి నింక నెయ్యది వినవల[1]తనినం గౌశికుండు మహాత్మా వినవలయు నవి యెల్లను విశదంబుగా వింటిం బ్రబుద్ధుండ నైతి నీవు సర్వజ్ఞుండ వగుట దెల్లం బయ్యె ననిన ధర్మవ్యాధుం డతని కిట్లనియె.

*-: ధర్మవ్యాధుఁడు కౌశికునిఁ దన జననీజనకుల యొద్దకుఁ దోడ్కొని పోవుట :-*

సం. 3 - 204 - 3

113. క. ఏ నిమ్మెయి నుత్తమవిజ్ఞానోన్నతి వడయుటకు నిజం బగు మూలం
బైనది గల దొకధర్మము, [1]భూనుత యది నీకు దృష్టముగ నెఱిఁగింతున్.

114. వ. అభ్యంతర[1]గృహంబునకు రమ్మని యతనిం దోడ్కొని చని మనోహరంబై [2]చతుశ్శాలంబై వివిధసౌరభసంవాసితం బైన హర్మ్యంబునందు మహితాసనాసీను లైనవారిం దన జననీజనకుల నభిమతాహారపరి[3]తోషితు[4]లఁ బరమాంబరాభరణగంధమాల్యాలంకృతమూర్తుల నతనికిం జూపి తానును దత్పాదప్రణామంబు సేసి వారలఁ గుశలం బడిగిన నయ్యిరువురుం బుత్త్రున కిట్లనిరి.

115. సీ. అన్న కుమార నీయట్టి సత్పుత్త్రుండు గలుగ మా కేమిటఁ గడమ సెపుమ
నీచేయుధర్మంబ నీకుఁ దోడయ్యెడుఁ బరమా[1]యురర్థసంపదలుఁ గనుము
నీచరిత్రంబున నిఖిలవంశముఁ బవిత్రిత మయ్యె మానుషదేహ మేల
ధరియించితో కాని త[2]త్త్వ మారయఁ బరదేవత వీవు [3]సందియము వలదు

---

4. నిష్ప్రతిగ్రహుండు — ఠ. 5. శమాన్వితుండు నగు—వీ. శ. ప. కొన్ని ప్రతులు.

112. 1. తవి యడిగిన — ఋ. శ; అడుగు మనిన — ఐ.

113. 1. పూనియదియు — చ.

114. 1. మందిరంబునకు — ఝ. ల. 2. చతుశ్శాలంబై — శ. ప. లలో లేదు.
3. తుష్టుల — ఏ. 4. ల నర్ఘ్యభూషణాలంకృతుల — వీ. ష.

115. 1. యు వర్ధసంపదలు - డ. 2. తథ్యమారయ — వా ; తత్త్వమారయ - అత్యధికసంఖ్యాకప్రతులు. 3. సంచేహమేల; సందియము లేదు - అనిపాఠములు.

తే. వాఙ్మనః[4]కర్మములఁ బితృవత్సలత్వ, మొక్కరూపుగఁ జలుపుచు నున్నయట్టి
సద్గుణాకరు[5] నిన్నెన్ని జామదగ్న్యు, నొకని నెన్నంగఁ దగుఁగాక యొరులు గలరె.

116\. వ. అని పలికి రప్పుడు ధర్మవ్యాధుండు వారికిం గౌశికుం జూపి యీమహాత్ముండు మనలఁ జూచువేడ్క నిట వచ్చె[1]నని చెప్పిన నావృద్ధు లతనికి స్వాగతసత్కారంబులు గావించినం గైకొని యతండు వారలఁ గుశలం బడిగె నంత నవ్విప్రునకు లుబ్ధకుం డిట్లనియె.

117\. సీ. జనసుత వీరు నాజననియు జనకుండుఁ జూవె వీరలకు శుశ్రూష సేసి
యిట్టి పరిజ్ఞాన మేను [1]ప్రాపించితి నమరులఁ బూజింతు రర్థి నెల్ల
వారును నొండుదైవంబు[2]ల నెఱుఁగ నీవృద్ధుల నాపాలివేల్పు[3]లనఘ
కమనీయఫలపుష్పగంధభూషణవస్త్రములు మనోహరభక్ష్యభోజ్యములును

తే. వీరి కెడుపు నివేదింతు వేడ్కఁ బుత్త్ర, దారసహితుండనై నియతముగ సేవ
యాచరింతును వేదముల్ యజ్ఞములు వ్ర, తంబులును వీర నాకను తలఁపు [4]దృఢము.

118\. తే. జనని జనకుఁడు సద్గురుఁ డనలుఁ డాత్ముఁ, డనఁగ నియ్యేవురును నేగృహస్థుచేత
సుగతివాంఛఁ బ్రసాదితు లగుదు రట్టి, [1]వాఁడ చూవె ధర్మాత్ముండు వసుధమీఁద.

119\. వ. అని చెప్పి యిట్లనియెఁ బతివ్రతపనుపునం జేసి నీవు ధర్మజ్ఞానార్థంబు నా[1]యున్నయెడకుం జనుదెంచిన నప్పతివ్రతవలని యనుగ్రహంబున నీకు నెల్లవియు నెఱింగించితిఁ గాని నీదెస నాదుచిత్తంబు ప్రియంపడియుండదు నీచేసిన[2] యకార్యం బొక్కటి గల దది యెయ్యది యనిన.

---

4\. కాయముల-శ. ష. 5. రనినుతెన్ని-ర. త; రనిన్నెన్ని-అ. ఔ. ఘ.ఝ. ల. వి.

116\. 1. ననిన — వా; ననిచెప్పిన — పెక్కు ప్రతులు.

117\. 1. గాంచితినిను-ఔ. 2. లనొల్ల కీవృద్ధులు — ఐ. ఝ. త. వి. శ. ష. 3. లనుచు కొన్ని ప్రతులు. 4. నిజము — వా; ధృఢము — పెక్కు ప్రతులు.

118\. 1. వాడుసూవె — ఝ. ల.

119\. 1. యున్నెడ — ఈ. ఐ. త. 2. కార్యం బొక్కటి — ఊ. ఔ. గ. ద. శ. ష; యవకార్యం బొక్కటి — కొన్ని ప్రతులు; యపకారంబొక్కటి — క. జ. త.

120\. ఉ. ఎంతయు వృద్ధులై తమకు నీ వొకరుండవ [1]తెప్పగాఁగ న
త్యంతముదంబునన్ బ్రదుకుతల్లిని దండ్రిని నుజ్జగించి ని
శ్చింతుఁడవై సదాధ్యయనశీలత వారియనుజ్ఞ లేక యే
కాంతమ [2]యెమ్మెయిన్ వెడలి తక్కట నీవు గరంబు క్రూరతన్.

121\. ఆ. [1]నీక వగచి వగచి నిర్భిన్నహృదయులై, విగతచక్షులైరి వినవె వార
లరిగి యింక నైన [2]నమ్ముదుసళ్ళ యు, దగ్రశోకవహ్ని [3]నార్పవయ్య.

122\. క. నీయధ్యయనమ్మును సుకృ, తాయాసము నిష్ఫలంబులై చను గురుసే
వాయుక్తి లేక తక్కినఁ, జేయుము [1]నాపలుకు మేలు సేకుఱు నీకున్.

123\. వ. అనినఁ గౌశికుం డతని కిట్లనియె.

124\. క. ఇది యట్టిద నీచెప్పిన, సదమలహితవాక్యభంగి సకలము వింటిన్
వదలక [1]యిమ్మెయిన చరిం చెద గురుజనములకుఁ బ్రీతిఁ జేసెద ననఘా.

125\. క. నాదైన భాగ్యవశమునఁ, గాదే నీతోడిచెలిమి గలిగెం బరమా
హ్లాదమనస్కుఁడ నైతి శు, భోదయముల కెల్ల నింక [1]యుక్తుఁడ నైతిన్.

126\. క. [1]పాపకృతం బగు దుర్గతి, [2]మోపుఁ గనక యుండ ననుఁ బ్రబో[3]ధాత్మకళీ
లాపరిణతుఁ గావించితి, నాపాలిటివేల్పు వీవ నరనుతచరితా.

---

120\. 1. తేప – జ. 2. యిమ్మెయిన్ – వా; యిమ్ములన్ – శ. ష. పీ. కొన్ని ప్రతులు; యెమ్మెయిన్ – ల.

121\. 1. నీకు – ర. డ. ల. వీ. శ. స. 2. ముదుసళ్ళకుదుగ్రశోకవహ్ని నుడుపవయ్య– అనియు పాఠము. 3. నార్పవయ్య – శకటరేఫ సంయుక్త రూపము. ప.

122\. శుశ్రూష – ఇ. ఏ. ఓ. ల. న.

124\. 1. యిమ్మెయి చరియించెద – ల.

125\. 1. యోగ్యుడ నైతిన్ – ఓ. ల. స.

126\. 1. పాపాకరమగు దుర్గతి ప్రోపుఁగనకయుండ – వా. సూ; పాపకృతంబగు – అ. ఇ. ఎ. ఏ. ఓ. ఔ. క. ఘ. చ. జ. ఝ. ర. త. ద. స; పాపగతంబగు – ఈ. ఉ. ఐ. వీ. శ. ష 2. పోపడకుండంగనను – ఇ. ఓ. జ. ల; మోపు గనకయుండ – ష; ద్రోపడకుండంగ – ఈ. ఐ. ఘ. ఝ. కాని యీపాఠమున యతి తప్పినది; పాప గతంబగు దుర్గతి మొప్పుగనకయుఁడ – శ. మొప్పు ప్రాసయు, అర్థమును చింత్య ములు. 3. ధాధిక – పెక్కు ప్రతులు.

127. చ. అనుపమ మెట్టివారలకు నందదు ధర్మ[1]పథంబు ధాత్రిలో
వినుమ పదివేవురం దొకఁడు విశ్రుతధర్మపరాయణుండు గ
ల్గునొ [2]కలుగండొ సందియము గోరి సనాతనధర్మ మూఁది యె
వ్వనికిని [3]నీకుఁబోలె బుధవత్సల యిట్లు చరింప వచ్చునే.

128. చ. నినునొక శూద్రుఁగాఁ దలఁప[1]నేర గుణాకర నీచరిత్రముం
[2]గన మది నద్భుతం బొలసెఁ గావున నెయ్యది కారణంబుగా
నొనరఁగ నిట్టి జన్మమును నొందితి చెప్పుము భూతభావివ
ర్తనములయందు నీకు విదితంబులు గానివి గల్గ[3]వెమ్మెయిన్.

129. వ. అనిన నతనికి ధర్మవ్యాధుం డిట్లనియె.

-: ధర్మవ్యాధుఁడు గౌశికునకుఁ దన పూర్వజన్మవృత్తాంతంబు సెప్పుట :-

సం. 3 - 205 - 21

130. క. జనసుత నీ వెయ్యది యడిగినఁ దెలుపుట నా కవశ్యకృత్యము గాదే
విను చెప్పెదఁ బూర్వభవం, బున నేనొక బ్రాహ్మణుండఁ [1]బుణ్యాచరితుఁడన్.

131. వ. వేదవేదాంగ[1]పారంగతుండనై యుండుదు నాకుం బ్రియసఖుం డైన యొక్క రాజపుత్త్రుతోడి సంగతించేసి ధనుర్వేదంబును నభ్యసించితి నొక్కనాఁ డమ్మహీపతి వేఁట వోయిన నేనును నతనితోడన చని వనంబునం బెక్కు మృగంబుల [2]నేయుచుండ నందొక్కబాణంబు దృణ[3]లతాంతరితదేహుండైన మునివరు[4]నొక్కరుం దాఁకిన నతఁడు హా[5]యనుచుం బడియె నంత నేనును.

---

127. 1. ఫలంబు - ఊ. 2. మరిలేడొ - ఝా. ద. 3. నీవుబోలె - శ. చ. ఠ. స.

128. 1. నేను - ఈ. ఐ. త. 2. గనిమది - పెక్కు ప్రతులు; గనుకొనియ - చ.
3. నేర్చునే - ఈ. ఐ. ట. త.

130. 1. బుధచరితుండన్ - ట; బుణ్యరతుండన్ - ఘ. ఠ.

131. 1. పారగుఁడనై - పెక్కు ప్రతులు. 2. జంపుచుండ - ఊ. 3. లతాసంవృత - ఇ. ఏ. ల; లతావళిసంవృత - ఓ. 4. నొక్కరుం - కొన్ని ప్రతులలో లేదు.
5. యనుటవినంబడిన - ఇ. ఏ; యనుచు నార్తరవంబున నేలంబడి నెత్తుటం దొత్తిల్లుచుండ - ద.

132. ఆ. వాయఁ బోయి తీవ్రసాయకవిద్ధుఁడై, పొరలుచున్న విప్రవరునిఁ జూచి
[1]తలఁకి యనునయంపుఁ బలుకులు వలికినఁ, గినిసి యిట్టు లనియె మునివరుండు.

133. ఆ. బ్రాహ్మణుండవయ్యుఁ బాప[1]ప్రవృత్తివై, శూద్రకర్మమునకుఁ జొచ్చి తీవు
గాన నిక్కువము [2]మృగవ్యాధజన్మంబు, వగుము మీఁద ననియె ననిన నేను.

134. చ. ఎఱుఁగక తప్పు సేసితి సహిం[1]పఁగదే కడుదుర్భవంబునం
బఱుపకు మయ్య నావుడుఁ గృపం మునినాథుఁడు [2]దప్ప దివ్విధం
బెఱుకు కులంబునందు జనియించియు ధర్మువు లెల్ల నిమ్మగా
[3]నెఱిఁగెదు తల్లిదండ్రులకు నెంతయుఁ బ్రీతి యొనర్తు భక్తితోన్.

135. వ. గురుశుశ్రూషం జేసి నీకుఁ బరమశోభనం బగు జాతి[1]స్మరత్వంబునుం గలుగు
నపరజన్మంబున బరమబ్రాహ్మణుండ వయ్యెద వని యనుగ్రహించిన న[2]వ్వి
ప్రునిదేహంబునందు నాఁటిన బాణంబు [3]మెత్తన పెఱికి యతనిం దదీయాశ్ర
మంబునకుం జేర్చితి నాచేసిన[4]పుణ్యంబున నమ్మహాత్ముండు [5]నపాయంబు
వొందం డయ్యె నాకు నిట్టి జన్మంబు నొందవలసె నని చెప్పినం గౌశికుం
డి ట్లనియె.

136. తే. జన్మ మిట్టిది చరితంబు చందమిట్టి, దెన్నఁడును నిట్టి [1]చోద్య మే నెందుఁ జూడ
నింక జన్మాంతరముదాఁక నేల యిపుడ, పుణ్య[2]చరితమై నీవు విప్రుఁడవ కావె.

---

132. 1. తలఁకి – పెక్కు ప్రతులు; తఱి – వా.

133. 1. వృత్తుండవై – శ. వ. కొన్ని ప్రతులు. 2. మృగవ్యాధ – వీ. శ. వ. పెక్కు ప్రతులు; గఁగ్రవ్యాధ – వా. సం.

134. 1. పుముకావుము – ఔ. క. 2. నవ్విధంబుగా – వ. 3. నెఱుగుదు – ల.

135. 1. స్మరణంబును – శ. వ. 2. విప్రదేహం – బు (న) నాటిన – కొన్ని ప్రతులు. 3. మెల్లన, నల్లన, నొయ్యన – అని పాఠములు. 4. పుణ్యఫలంబున – ల. 5. నపాయంబునఁబొందండు – శ. వ.

136. 1. చోద్యంబు నెఱుఁగజూడ – గ. త. ల. న. 2. చరితమైనీవు – పెక్కు ప్రతులు; చరితుఁడ. నీవు విప్రుఁడవెకావె – శ. వ; చరితుఁడవీవు – వా.

137\. ఆ. పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును, నిజము శూద్రు[1]కంటె నీచ [2]తముఁడు
సత్యశౌచధర్మశాలి శూద్రుండయ్యు, నతఁడు సద్ద్విజుండ యనిరి మునులు.

138\. క. అనయంబు నాత్మకర్మం, బున నతినీచ మగుభవముఁ బొందవలసె [1]నే
యని నీవు నిరంతరమును, మనమున [2]దుఃఖింపవలదు మహితచరిత్రా.

139\. చ. నిజగుణదోషకర్మముల నెట్టన మేలును గీడు వచ్చుఁ ద
త్త్వజనితసౌఖ్యదుఃఖములఁ బ్రాజ్ఞులు దుల్యమనస్కులై మనో
రుజలను దేహజంబు లగు రోగము[1]లున్ హితధర్మకర్మభే
షజములఁ జేసి పాపుదురు సర్వము సాత్త్విక[2]దృష్టిఁ జూచుచున్.

140\. క. ప్రియములు వాయుటయును న, ప్రియములు వెసఁ బొందుటయును బెల్లుగ నగుఁ ద
త్క్రియ[1]లందు మూఢమతికి హృ, దయతాపము [2]వాయదెపుడుఁ దరికొనుచుండున్.

141\. తే. వగతుమన్న నెవ్వారికి వగవఁ జనదు, చిత్తమున నేమిటికి సంత[1]సింపరాదు
కాన గతమునందును ననాగతమునందు, వగవరార్యులు సంతోష[1]వంతు లగుచు.

142\. క. వగపునఁ దేజోహీనుం, డగు నాత్మహితక్రియలకు నశుముఁ డగు న
వ్వగపు [1]దొఱఁగి యుద్యోగము, దగఁజేయఁగఁ గలుగు నంచితములగు శుభముల్.

---

137\. 1. నట్టినీచ – ఢ. 2. తరుఁడు – ఓ; రతుఁడు – కొన్ని ప్రతులు.

138\. 1. నాకని – అ. 2. దలపోయ – ఒ. ట.

139\. 1. లంచిత ధర్మ – ఖ. 2. సృష్టి – వా; దృష్టి – పెక్కు ప్రతులు.

140\. 1. జెందు – ఔ. గ. 2. మానదెపుడు – ఔ. ద.

141\. 1. సిల్లగాదు; సింపగాదు – అని పాఠములు. 2. వర్తులగుచు – ఇ. ఏ. ర.

142\. 1. దఱిగి, దరగి – అని పాఠములు.

143. వ. కావున భూతంబుల సదసత్ప్రకారంబు[1]లు గనికొని ధీరుండవై యుండు మనిన నా ధర్మవ్యాధుండు మహాత్మా నీ చెప్పినయంతవట్టు [2]నిదర్శ నంబులుగాఁ గొని యేను నిఃఖేదుండ నై [3]యున్నవాఁడ భవిష్యత్కాల సద్భావంబునందు సమాహితుండ నై యుండువాఁడ ననియె నంత నాభూదేవుండు.

144. చ. అతులితపుణ్యమూర్తివి[1]కృతాత్ముఁడ [2]వెందును నీవు ధర్మ మూ
ర్జితముగ నెప్పు డేమఱక చేయుచు నుండుము నిత్యశోభన
స్థితి వెలుఁగొందు మేను భవదీయసమాగతిఁ జేసి ధర్మ[3]సు
స్థితమతి నైతి [4]నన్ననుమతింపు గుణాకర పోయి వచ్చెదఁ.

145. వ. అనివానికిం బ్రదక్షి[1]ణంబుసేసి వీడ్కొని చని కౌశికుండు నిజజననీజనకుల కతిభక్తి శుశ్రూష[2]సేసి కృతార్థుం డయ్యెం బాండవోత్తమా నీయడిగిన తెఱంగునం బతివ్రతా[3]మాహాత్మ్యంబును [4]బితృశుశ్రూషావిశేషంబును హీన వర్ణుండయినవాఁడు ధర్మంబు [5]సలుపునుపాయంబును జెప్పితి ననిన విని ధర్మ [6]తనయుండు సంత[7]సిలి మఱియు మార్కండేయు ని ట్లని యడిగె.

146. తే. అగ్ని దేవుండు[1]తొల్లి మహాతపంబు, సేసె నని విందు [2]నదియేల చేసె ననఘ
యంగిరసుఁ డేమికతమున నగ్నియయ్యె, నగ్ను లెన్ని[3]విధంబుల నతిశయిల్లు.

---

143. 1. లెఱిగి విదితుండవై; లు గనుంగొని - అని పాఠములు. 2. నిజంబుగాఁగొని — ఝు; 3. ఇది వా. లో లేదు.

144. 1. కృతాత్ముఁడ - ఝు. డ; కృతార్థుఁడ - వా. వీ. శ. ప. పెక్కు ప్రతులు. 2. వెంతయు - వ. 3. సంస్థిత - సూ. కొన్ని ప్రతులు. 4. నన్నునుపు ధీర గుణాకర - ఇ. ఎ. ఏ. ఓ. ల.

145. 1. ణంబుగా వచ్చి - ఇ. ఏ. ఓ. ల. 2. సలిపి - కొన్ని ప్రతులు. 3. మహ త్వంబును - కొన్ని ప్రతులు. 4. గురు శుశ్రూషా - శ. 5. నడుపు - కొన్ని ప్రతులు. 6. ఖుండు-సం. పెక్కు ప్రతులు; నందనుండు-కొన్ని ప్రతులు. 7. సిల్లి- పెక్కు ప్రతులు.

146. 1. తొల్లి - పెక్కు ప్రతులు; ప్రీతి - వా. 2. మది - కొన్ని ప్రతులు. 3. భేదం బుల - పెక్కు ప్రతులు.

-: మార్కండేయుఁడు ధర్మరాజునకు నంగిరసుం డగ్నియైన తెఱంగు సెప్పుట :-

సం. 3 - 207 - 5

147. వ. ఇంతయు వినవల[1]తు ననిన నమ్మహాముని యి ట్లని చెప్పె నగ్నిదేవుండు దేవతలతోడి యలుకం జేసి [2]హవ్యంబులు వహింప నొల్లక వనంబునకుం జని బహుకాలంబు ఘోరతపంబు సేయుచు నత్యంతకృశుండై యాత్మగతంబున.

148. చ. అలుకమెయిం [1]దొలంగి విపినాంతరభూమికి వచ్చి యిట్లు నే
వెలుఁగక యున్నచో భువనవృత్తము [2]సర్వము నిల్చు నిల్చినన్
జలరుహసూతి వేఱొకనిఁ జయ్యన నగ్నిపదంబునందుఁ దా
నిలుపక యున్నె నేనిచట నిల్చుట పోలదు [3]పోయెదన్ వెసన్.

149. వ. అని తలంచి తపంబు సాలించి నిజపదంబున [1]కున్ముఖుం డయి [2]చనిచని యంతకుమున్న బ్రహ్మనియోగంబునం ద్రిలోకంబులకు నగ్నియై వెలుంగుచున్నవాని నధికతపోవిజృంభితు [3]నంగిరసుం గని భయంపడి యెప్పటియట్ల [4]మగిడిపోవు నెడ నంగిరసుం డతని పాలికిం జనుదెంచి యి ట్లనియె.

150. చ. అనఘ జగ[1]త్త్రయార్చితుఁడ వై తిమిరాపహారుండ వై తగన్
వనరుహగర్భుచేఁ బ్రథమవహ్నిపదంబునఁ గల్పితుండ వై
తనరుదు [2]రమ్ము నీదగు పదంబున [3]నేనిటు లుండ నోడుదున్
ఘనముగ నీవు నీపదము గైకొనవే యవికల్పభావనన్.

151. వ. అనిన నగ్నిదేవుం డి ట్లనియె.

---

147. 1. తుం జెప్పుమనిన - ల. 2. హవ్యకవ్యంబులు - ఇ. ఊ. ప - కాని ఇచ్చట మూలము హవ్యమనియే యున్నది. "హవ్యమహాదగ్నిర్భూత్వా మహాద్యుతిః".

148. 1. దొరంగి - కొన్ని ప్రతులు; దొలంగి - పెక్కు ప్రతులు; దొడంగి - వా. 2. లన్నియు - కొన్ని ప్రతులు. 3. పోయివచ్చెదన్ - చ.

149. 1. కుసుముఖుండయి - కొన్ని ప్రతులు. 2. చనియతండంతకు - కొన్ని ప్రతులు. 3. నంగీరసుంగని-శ. కొన్ని ప్రతులు. దీనికి ఆకరము కనఁబడలేదు. 4. మరలి - కొన్ని ప్రతులు; మగుడి - పెక్కు ప్రతులు.

150. 1. త్త్రయాంచితుఁడ - త. శ. ష. 2. రమ్మ - ఓ. ల; నీవు - వా. వి. కొన్ని ప్రతులు. 3. నుండగ జాలనోడుదున్ - టొ. ద.

152. క. విను నాకీ ర్త్రిజగంబులఁ, బొనుఁగుపడియె నీవు భువనపూజితవృత్తిం
బనుపడితి గానఁ దగు [1]నీ, యనలపదము నీక నాకు నలవడ దింకన్.

153. వ. నీవు ప్రథమాగ్ని వై [1]యుండు [2]మేను ద్వితీయం బగు ప్రాజాపత్య వహ్ని నై వర్తించెద ననిన నంగిరసుండు దేవా యిట్లాన[3]తీయకుము ప్రథమాగ్నిత్వంబు నీవ కైకొని నన్ను నీకుం బ్రథమపుత్త్రుంగా నాదరింపు మనినం బావకుండు దాని కొడంబడియె నివ్విధంబున నంగిరసుం డగ్నికి నగ్రతనయుండై యగ్ని సారూప్యంబునం దేజరిల్లె నయ్యంగిరసునకు [4]శివ యనుదానికి బృహత్కీర్తియు బృహజ్జ్యోతియు బృహద్బ్రహ్మయు బృహ[5]న్మనసుండును బృహ[6]న్మంత్రుండును [7]బృహద్భానుండును బృహస్పతియును నన నేడ్వురు గొడుకులు మఱియు భానుమతియును [8]రాగయు సినీవాలియుఁ గుహువు నర్చిష్మతియు [9]మహిష్మతియు మహామతియు నన నేడ్వురు గూఁతులుం బుట్టిరి.

154. క. తనయుఁడు బృహస్పతికి న, త్యనఘుఁడు [1]శంయుండు పుట్టి యాగంబులలో
మునుమును హవి[2]షాజ్యము దాఁ, గొనియెడువాఁ డయ్యె నధిక
గుణయుక్తి మెయిన్.

---

152. 1. నీయనలపదము నీక నాకు నలవడ దింకన్ – ఓ; నీయనలపదవి నుండి నాకు నలవడ దింకన్ – గ. ఘ. శ. శ. ష; నీయనలపదవి నీక నాకు నలవడ దింకన్ – బూ, నీకవ ఘ యనలపదము నాకు నలవడ దింకన్ – వా.

153. 1. వెలుగు – క. 2. ముసేను – గ. వీ. 3. తియాదగదు – ఝ. 4. కేశ, అగ్నికేశ – అని పాఠములు. 5. న్మఖుండును – కొన్ని ప్రతులు. మూలము "బృహన్మనాః" అని యున్నది. 6. న్మతియు–శ. ష. కొన్ని ప్రతులు, మూలము 'బృహన్మంత్రః' అనియే యున్నది. 7. బృహద్భాసుడు – సంస్కృత మూలము. 8. రాగ – మూలమునం దన్నిప్రతులలోను 'రాగ' అనియే యున్నది. 'రాగా ద్రాగేతియామాహుః । ద్వితీయా మంగిరస్సుతామ్'; రాక – వా. శ. ష. మున్నగు ప్రతులు. సంస్కృతమూలమునందు 8 పేర్లు కనఁబడుచున్నవి. 9. హవిష్మతి – వీ. శ. ష. పెక్కు ప్రతులు.

154. 1. సంయముడు, సంయుడు, శయనుడు – ఇత్యాది రూపములు గలవు. సంస్కృత మూలమున 'శంయర్నామ మహావ్రతః' అని యున్నది. 2. రాజ్యమున్నగు – శ. మున్నగు ప్రతులు; రాద్యమ్మును – వీ. ష. కొన్ని ప్రతులు. మూలము – హవిరాద్యము. 'ఆద్యం హవిః ఇత్యర్థః'.

155. వ. ఆశంయునకు ధర్మ[1]పత్ని యైన సత్యకు భరద్వాజుండును భరతుండును నా నిరువు[2]రు గొడుకులు పుట్టి రందు భరతునకు భారతుం డను కొడుకును భారతి యను కూఁతురుం బుట్టి[3]రి భరద్వాజునకు వీర యనుదాని-వీరుండు వుట్టె.

156. క. వానికి సరయువునకుఁ బటు, భానుం డై పుట్టె సుతుఁడు భానుఁ డనఁగ నా భానునకు [1]నిశ్చ్యవనుఁ డనఁ, గా వాత్మజుఁ డుద్భ[2]వించెఁ గడు నుజ్జ్వలుఁడై.

157. చ. అతనికిఁ బుట్టెఁ బుత్త్రుఁడు నిరంతరతేజుఁ డు[1]దారకీర్తి ని
ష్కృతి యను పేరివాఁడు విను కిల్బిషభాజను లైనమానవుల్
సతతము నాకృశాను నతి[2]సక్తమనస్థ్సితిఁ గొల్చి దోషని
ష్కృతి దగఁ గాంతు రట్లగుట గీర్తిత మయ్యెఁ దదాఖ్య వానికిన్.

158. క. ఘనుఁడు [1]రుజస్కరుఁ డనఁగా, జనియించెను నాతనికి రుజస్కరునకు న త్యనుపమకాంతిపరుం డై, జనియించెం [2]గ్రోధుఁ డనఁగ జనవరతిలకా.

159. వ. ఆక్రోధునకు [1]రసుండు వుట్టె రసునకు స్వాహా యను కన్యకయుం గాముం డను కొడుకునుం బుట్టిరి కామునకు నమోఘుండు వుట్టె నమోఘునకు [2]నుక్థుండు వుట్టె మఱియుం గాశ్యపుండును వాసిష్ఠుండును [3]ప్రాణుండును నాంగిరసుండును జ్యవనుండును ననువా రేవురు తేజస్వి యైన కొడుకుం బడయుదుమని యనేకవర్షంబులు ఘోరతపంబు సేసి మహావ్యాహృతి స్మరణంబు సేయుచున్నంత.

---

155. 1. వుత్రి – వీ. శ. కొన్ని ప్రతులు. దీనికి ఆధారము కానరాదు. 2. రగ్నులు – కొన్ని ప్రతులు. 3. రందు – కొన్ని ప్రతులు.

156. 1. విశ్రవసుడు – శ. వ. కొన్ని ప్రతులు. 2. విల్లె – ఉ. టొ.

157. 1. దాత్త – గ. 2. పత్య – వీ. శ. వ. కొన్ని ప్రతులు.

158. 1. రజస్కర – శ. వ. పెక్కు ప్రతులు. 2. క్రోధనుండు జనవర – టొ. ద.

159. 1. రజుండు, రజసుండు – అని పాఠములు. నంకుండు, సక్తుండు, సుప్తుండు మున్నగు రూపములు కలవు. సంస్కృత మూలము 'ఉక్థుడు' అనియే యున్నది. 3. ద్రోణుండును – శ. వ. కొన్ని ప్రతులు. మూలము 'ప్రాణుఁడు' అనియేయున్నది.

160. చ. అనలము చాయమ స్తకము నర్కనిభం బగు బాహుయుగ్మముం
గనకసముజ్జ్వలం[1]బులగు కన్నులుఁ జర్మము కృష్ణవర్ణ[2]తం
దన[3]రిన జంఘలుం గల యుదాత్తపుదేహము దేజరిల్లఁగాఁ
దనయుఁడు పుట్టె వారలకుఁ దద్దయు నద్భుత[4]మంద లోకముల్.

161. వ. ఇట్లు పుట్టిన యప్పావకుండు [1]పంచజనకప్రభువుండు గావునం బాంచజన్యుం డనుపేరం బ్రసిద్ధుండై దశసహస్రవర్షంబులు దపంబుసేసి నిజమస్తకంబున [2]బృహద్రథంతరు లనువారలను వదనంబున హరిని నాభియందు శివుని [3]బలంబున నింద్రునిం బ్రాణంబు[4]ల [5]వాయ్వగ్నులను బాహుయుగదంత పుటంబుల విశ్వభూతంబుల సృజియించె మఱియును.

162. క. తపుఁ డను వహ్ని నిరంతర, తపోనిరూఢుఁ డయి పంచదశపుత్త్రుల న
త్యపరిమిత [1]ఘోరతేజో,విపు[2]లాత్ములఁ గనియెఁ గపటవృత్తినిపుణులన్.

163. వ. ఆపదియేవురు [1]సుభీముండు నతిభీముండును భీముండును భీమబలుండును నతిబలుండు ననువా రొక్కమొగియును సుమిత్త్రుండును మిత్త్రవంతుఁడును మిత్త్రజ్ఞుండును మిత్త్రవర్ధనుండును [2]మిత్త్రధర్ముండును ననువా రొక్కమొగియును సురప్రవీరుండును వీరుండును [3]సువేషుండును సువర్చసుండును సురహంతయు ననువా రొక్కమొగియునుగా నిట్లు మూఁడు మొత్తంబులై యజమానుల యజ్ఞఫలంబు [4]లపహరించుచుండుదురు తత్ప్రశాంత్యర్థంబై యాగంబులందు [5]నగ్నిచయనంబు సేయునది.

---

160. 1. బగుచు – ఊ. 2. ముందనరి – కొన్ని ప్రతులు. 3. రెడు – జ. ల. 4. మందెలోకముల్ – వా. వీ. శ. ష; మంద – పెక్కు ప్రతులు.

161. 1. పంచజనకప్రభవుండు – ఆ. ట. ద. ల; పంచజన ప్రభవుండు – వా. వీ. శ. ష. కొన్ని ప్రతులు. మూలము "పంచవర్ణః సతపసాకృతస్తైః పంచభిర్జనైః. 2. బృహ దంతరులను – శ. ష. పెక్కు ప్రతులు. కాని సంస్కృత మూలము 'బృహద్రథంతర' అనియేయున్నది. 'బృహద్రథంతరం మూర్ధ్నో వక్త్రాద్యాతరసా హరో' – చిత్ర శాలాప్రతి అధ్యాయం 220 – శ్లోకం 7 – వనపర్వము. 3. నిటలంబున – శ. ష. మున్నగు అత్యధికసంఖ్యాకప్రతులు. మూలము 'బలాదింద్రం' అనియేయున్నది. 4. న – పెక్కు ప్రతులు. 5. వాయువును – శ. ష. పెక్కు ప్రతులు.

162. 1. భూరి – ఇ. ప. 2. లాతుల – ల.

163. 1. ఈ పేర్లలో కొన్ని భేదములు కలవు. 2. మిత్ర వర్మాండు – శ. ష. కొన్ని ప్రతులు; మిత్త్ర ధర్మయు – వా. 3. సుకేతుండును – ల. శ. ష. కొన్ని ప్రతులు; సుకేతుఁడనియు పాఠము కలదు. 4. లనుభవించు చుండుదురు – ఆ. ఎ. చ. ఝ. 5. నగ్నియజనంబు – ఈ. ఐ. త; నగ్నిచయంబు – కొన్ని ప్రతులు.

164. తే. అధిప [1]విహగాకృతుల నొప్పు నగ్నిచయన,ముల యుదగ్ర
పక్షాఘాతములను వి ప్ర
వరుల మంత్రఘోషములను వారు నిహతు,లై భయంపడి చేరరు యజ్ఞభూమి.

165. వ. [1]తపుండు మఱియు సకలయజ్ఞభాగభుజులైన పుత్త్రుల నేవురం గనియె నందగ్రజుండు.

166. సీ. వైశ్వానరుం డనువహ్ని చాతుర్మాస్యవిధులందు భూసురవితతిచేతఁ
బర్జన్యసహితుఁడై పరమార్చనముఁ గాంచు నధిప రెండ[1]గు నాతఁ
డఖిలమునకుఁ
బ్రభుఁడు దానై విశ్వపతి యన విలసిల్లు వినుము మూఁడ[2]గు వాఁడు
విశ్వమునకు
[3]నాత్ముఁడై విశ్వకుం డన నొప్పు నాల[4]వు నతఁడు భూతముల యాహారవితతి
తే. వెలయఁ [5]బక్వము సేయుట విశ్వభుక్కు, నాఁగఁ బెంపొందు
గోపతినామధేయుఁ
డై సమస్తధర్మక్రియలందు హేతు, వై [6]ప్రశస్తి వహించు [7]నేనగు నతండు.

167. వ. మఱియు భానుం డనువహ్నికి [1]సోమపుత్త్రియైన బృహద్భాసయందు బలదుండును [2]మన్యుమంతుండును ధృతిమంతుండును నాగ్రయణుండును నగ్నియు సోముండును నన నార్వురు గొడుకులు నిశయను కూఁతురుం బుట్టిరి సకలతపఃఫలంబులు నిర్వహించుటకయి పురందరుండు మనునామధేయుం డయిన కొడుకుం బడసె నమ్మనువు భానుపుత్త్రియైన నిశా[3]కన్యం

---

164. 1. వివిధక్రతుతులనొప్పు నగ్నిచయనములనుదగ్రపక్షాఘాతములను – ఈ. ఐ. త. శ. ప. కొన్ని ప్రతులు.

165. 1. తపుండనువహ్ని – కొన్ని ప్రతులు; తపుండనువాడు – వీ.

166. 1. వు నాతఁడు – కొన్ని ప్రతులు; వా యాతడు – వీ; వ నాడు – ఝ. 2. డవ వాఁడు – పెక్కు ప్రతులు. 3. నాత్మయై – వీ. శ. ప. కొన్ని ప్రతులు. 4. వ యతడు – కొన్ని ప్రతులు. 5. భక్ష్యంబు – కొన్ని ప్రతులు. 6. ప్రసిద్ధి వహించు – కొన్ని ప్రతులు. 7. నేనగు నతండు, నేనవు నతండు, నేనవ యతండు – అని పాఠములు; నైదవ యతండు – ల.

67. 1. సూర్య – వీ. 2. మన్యుండును – పెక్కు ప్రతులు. 3. కన్యకం బరిణయమై త

బెండ్లియై ప్రాజాపత్యుం డనుపేరం బరగి పరమబ్రాహ్మణులచేత నర్చితుం డయ్యె నివ్విధంబున ననేకవహ్నులు సకలధర్మక్రియాసాధకు లై వెలింగిరి దక్షిణాగ్ని[4]ప్రముఖంబు లయిన వహ్నులు వాయుహాతిం జేసి యన్యోన్య సంస్పృష్టంబు లయ్యెనేనియు రజస్వలాదిసంకరంబులం బొరసెనేనియు [5]మృతకజాతకాదిసంస్పర్శనంబునం బొందెనేనియుం దత్ప్రాయశ్చిత్తార్థంబై యష్టాకపాలేష్టి సేయవలయు నని చెప్పి మఱియు మార్కండేయుం డి ట్లనియె.

168. క. అపుఁ డనువహ్ని యతులిత, [1]రూప యయిన ముదిత యను తరణియందు జగద్దీపకు నపారతేజు మ, హా[2]పూజ్యుం గనియె నగ్ని నద్భుతనామున్.

169. చ. అతఁడు త్రిలోకతంత్రము నిరంతరమై చన నిర్వహించుచున్
శతముఖుఁ డాదియైన సురసంతతికిం బ్రియ మొప్ప హవ్యముల్
సతతము మోచి యిచ్చును భృశం బగు తద్భర మోర్వలేక ప
వ్రతనిరతుం డథర్వుఁ డను వానికి ని[1]ట్లను నాదరంబుతోన్.

170. వ. ఏను దుర్బలుండ నైతి నీవు దేవతలకు హవ్యంబులు మోచి యిమ్మని వానిం బంచి తాను సముద్రంబు సొచ్చి యందు [1]దాఁగుటయు దేవత లద్దేవముఖుం డున్నయెడ రోయం దొడంగిన నబ్ధిచరంబు లైన మత్స్యంబులు సురలకు నగ్నిదేవుండు జలధి[2]నుండుట చెప్పుటయుం[3]గనలి యనలుండు [4]మీలం జూచి జనంబులు మిమ్ము నిర్దయులై వధియింతురు గావుతమని [5]శాపం బిచ్చె నప్పుడు.

171. ఆ. హవ్యవహనమునకునమరోత్తములు దన్ను, వేయు[1]విధుల నొలసి వేఁడుకొనిన నెట్లు నియ్యకొనక యెంతయు [2]విసిగి స,మీరసఖుఁడు దనదుమేను విడిచె.

---

ఝ. 4. ప్రముఖంబు — కొన్ని ప్రతులు; ప్రముఖులయిన — వా. 5. మృతజాతకాది — పెక్కు ప్రతులు.

168. 1. రూపసియయి ముదితయను — వా; రూపయయినముదితయను — క. గ. ఝ. వీ. శ. 2. పుణ్యుం — పెక్కు ప్రతులు;

169. 1. ట్లనియెన్ బ్రియంబునన్ — ఘ.

170. 1. డాగుటయు — కొన్ని ప్రతులు. 2. నునికి — ద. 3. నలిగి — కొన్ని ప్రతులు. 4. మత్స్యంబుల — కొన్ని ప్రతులు. 5. శపియించె — జ.

171. 1. విధముల — అ. ఈ. ఐ. గ. జ. 2. విసివి — పెక్కు ప్రతులు.

172. వ. ఇట్లు సంత్యక్తశరీరుండై ధరాతలంబు ప్రవేశించుటయు నతనిచేత విడువం బడిన దేహంబువలనం బూయంబున గంధకంబు నస్థుల దేవదారువును శ్లేష్మంబున స్ఫటికంబును [1]బిత్తంబున మరకతంబును వాతంబునఁ గృష్ణ శిలయు [2]నఖంబుల నభ్రకంబును స్నాయుసంచయంబునం బ్రవాళంబునుం బుట్టె నతండు భూగర్భ స్థితుండై ఘోరతపంబు సేయుచున్నంత భృగ్వంగి[3]రః ప్రముఖు లయిన మహామునులు నిజతపోబలంబున నతనికి [4]నాప్యాయనంబు సేయుటయుఁ దేజస్వియై ధరణి వెలువడి వచ్చి యమ్మహాత్ముం డమ్మహా మునులం జూచి తదీయతేజంబు దనకు దుస్సహం బగుటయు భయంపడి క్రమ్మఱ నంబుధి సొచ్చి యడంగిన.

173. క. విను జననాయక సంయమి, జనములు వహ్నిపని యంతఁజాలించి ప్రియం బున నంచితవిధిసంగ్రహ,మునకై పూజించి రధికపుణ్యు నధర్వున్.

174. వ. అయ్యథర్వాగ్ని తేజంబును నమ్మును లతనికిం జేయు బహుమానంబునుం దన్ముఖంబున నమరులు దృప్తు లగుచునికియుం జూచి సహింపక పావకుండు సకలభూతంబులుఁ జూచుచుండ నంబుధి వెలువడి వచ్చి నిఖలలోక హితార్థంబుగా నెప్పటియట్ల హవ్య[1]వహత్వంబు నంగీకరించె నిట్లనేకశాఖం బయిన యగ్ని[2]వంశంబు ప్రశంసాభాజనం బయ్యె నగ్ను లెంద ఱైననుం [3]దదాత్మలైన తేజం బొక్కటి యని చెప్పిన విని సంతసిల్లి యమ్మహా [4]మునికి ధర్మతనయుం డిట్లనియె.

175. క. మునినాథ మహాసేనుం, డనలునకుం గృత్తికలకు హరునకు సుతుఁడై న నిమిత్త మేమి తెలఁ[1]గే,వినవలతుం జెప్పవే సవిస్తరఫణితిన్.

---

172. 1. పైత్యంబున - పెక్కు ప్రతులు. 2. చర్మంబున - శ. వ. పెక్కు ప్రతులు. 3. గిరసప్రముఖులైన - పెక్కు ప్రతులు; గిరసప్రము-కొన్ని ప్రతులు. 4. నాహ్వా నంబు - కొన్ని ప్రతులు.

174. 1. వాహనత్వంబు - డ. వ. 2. వంశంబులు...భాజనంబులయ్యె - వి. శ. వ. 3. దదాత్మకంబైన - వి. శ. వ. కొన్ని ప్రతులు; దదాత్మజంబైన - గ. ఘ. శ; 4. త్మునికి - ట.

175. 1. గో - పెక్కు ప్రతులు.

176. వ. అనిన మార్కండేయుం డతని కిట్లని చెప్పెఁ దొల్లి దైత్యులతోడ రణంబుసేసి యోటువడి దేవగణసహితుండై దేవేంద్రుండు దొలంగిపోయి దానవుల నోర్వనోపునట్టి మహాసత్త్వుం డగు సేనాపతి నెందుఁ బడయుదునొకో యని యొక్కనాఁడు మానసం బను శైలంబునకుం జని యం దొక్కయెడ [1]నొక్కరుండ కార్యచింతాపరుండై యున్నయెడ.

177. తే. ఒక దనుజాధముండు మొఱ్ఱోయనంగ, నన్నుఁ జెఱఁగొని పోయెడు నన్నలార యెవ్వ రిట విడిపింపరే యింతవట్టు, పుణ్యమునఁ [1]బోవరయ్య కారుణ్యబుద్ధి.

178. వ. అని యిట్లు సువ్యక్తం బైన వనితావిలాపంబు వీతెంచినం బురందరుండు నిజాంతరంగంబు గరుణాతరంగితం బగుటయు నోడ[1]కోడకు మిదె యేను వచ్చితిననుచు నద్దిక్కునకు నడచి ముందట నతిభయంకరాకారుం బటుగదాహస్తు[2]న ప్రచలితవిద్యుల్లతారుచిరమూర్తి యైనదాని నొక్క కన్ని[3]యం గొని గగనతలంబునం బఱచువానిం బ్రబలవలాహకవినీల[4]దేహుఁ గేశి యను దానవుం గని [5]సరభసుండై.

-: ఇంద్రుఁడు గేశియనురాక్షసునిఁ బాఱఁదోలుట :-

సం. 3 _ 213 _ 10

179. ఉ. ఓరి దురాత్మ యీయబల నోడక [1]యేటికిఁ బట్టినాఁడ వం
భోరుహ[2]నేత్ర విడ్వు మెటవోయినఁ బ్రాణము గొందు నింకఁ [3]బ్ర
స్ఫార మహీధరప్రకరభంగవిహారధురీణ ముగ్రదై
త్యారుణ[4]రంజితోగ్రకులిశాస్త్రము సు మ్మిదె యంచు డాసినన్.

---

176. 1. నొక్కరుండును - పెక్కు ప్రతులు.

177. 1. బ్రోవరయ్య - ఏ. ఓ. ఘ. ద.

178. 1. కోడకుమిదె - ఈ. ఉ. ఊ. ఎ. ఒ. ఔ. క. చ. ఝ. ఠ. డ. త. ల; కోడకిదె యేను - వా. పీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. నభ్రచలిత - ఆ. జ. ల; నభ్రకలిత - ట. 3. యంగైకొని - పెక్కు ప్రతులు. 4. దేహు నతిరౌద్రాకారు మహాశౌర్యవంతుం గేశియను - కొన్ని ప్రతులు. 5. సంరంభుండై - కొన్ని ప్రతులు.

179. 1. యొంటిని - ఎ. ఒ. 2. నేత్రి - పెక్కు ప్రతులు. 3. విస్ఫార - గ. ఘ. జ. శ. ష. 4. శోణితార్ద్రి - పీ. శ. ష; రంజితాగ్ర - ల.

180. మత్తకోకిలము.

ఘోరవిక్రముఁడైన కేశియుఁ గ్రోధఘూర్ణితచిత్తుఁడై
ధీరుఁ డుక్కున నిల్చి యగ్గద[1] ద్రిప్పి వాసవు వైచె న
వ్వీరుఁడున్ గద చూర్ణితంబుగ వ్రేసె నాసుర[2] భంగిఁ బొం
గారి దారుణవజ్రపాతరయంబునం బటుహాస్తుఁడై.

181. ఆ. అసుర పిఁక నొక మహా[1] చలశృంగంబు, విఱిచి వైచె నమరవిభుని మీఁద
గోత్రవైరి ఘోరకులిశాభిహాతి వ్రయ్య, [2] నడిచె దానిఁ బదల నదరు లెగయ.

182. వ. ఇట్లు దనసాధనంబులు [1] విఫలంబులైనం దలంకి దానవుం డక్కన్నియ [2] దిగ విడిచి పఱచిన నింద్రుండు దానిం జేరం జని నీవెవ్వరిదాన వీరక్కసుచేత నెట్లు పట్టువడి తనిన నది యతని కిట్లనియె నయ్యా యే నరిష్టనేమి యను ప్రజాపతి కూఁతుర దేవసేన యనుదాన దైత్యసేన చెలియల నేనును మా యప్పయుం గేళికౌతుకంబునఁ దండ్రి యనుమతంబు వడసి సఖీజనసహితం బుగా వెడలి [3] యిమ్మానసనగంబు సానుదేశంబులం గ్రుమ్మరుచుండం గేశి నామధేయుం డైన యీ యసురాధముండు.

183. క. పలుమాఱువచ్చి తన దు, [1] ర్విలసితములు మాకుఁ జూపు వేడుక దోఁపన్
బలుకును [2] మేలమునఁ జెనకఁ, దలఁచుఁ గదియు మదనకదనదళిత
హృదయుఁడై.

184. తే. వాని చేష్టలన్నియు దైత్యసేన కభిమ
తంబులై యుండు నాకు నెంతయును దుస్స
[1] హములు వినవె యిమ్మెయిన యక్కమలనయనఁ
గోరి దానవుఁడెలయించి కొంచుఁజనియె.

---

180. 1. దీర్చి - పీ. శ. వ. పెక్కు ప్రతులు. 2. భర్త పొంగారి - ఊ. ఓ. ల.

181. 1. చల - పెక్కు ప్రతులు; నిల - వా. కొన్ని ప్రతులు. 2. నడచె-కొన్నిప్రతులు.

182. 1. వికలంబు - కొన్ని ప్రతులు. 2. డిగ్గవిడిచి - కొన్ని ప్రతులు. 3. యిమ్మ హానగంబు - కొన్ని ప్రతులు.

183. 1. విలసనములు - ఆ. ఎ. ఝ. ల. 2. మెలువున - ఒ.

184. 1. హంబులైయుండు వినవె యయ్యబ్జవదన - ఘ. ల. పీ. శ. ష.

185\. తే. అంతఁబోక వెండియువచ్చి యింతసేసె, నద్దురాత్ముఁడునన్ను మీఁదై నకరుణఁ
దొడరి [1]దుఃఖసాగరమునఁ బడుట దప్పె, ననిన నయ్యింద్రుఁ డనియె
నయ్యతివఁ జూచి.

186\. క. విను దక్షతనూజులు మా, జననియు మీతల్లియును నిజంబుగ మా కీ
వను[1]జవయితి వనజానన, యొనరంగా వేఁడు నీకు నొక వరమిత్తున్.

187\. వ. అనిన దేవసేన దేవేంద్రున కిట్లనియె.

188\. తే. అనఘ మాతండ్రి యొక్కనాఁ డతిముదమున
నన్ను నుపలాలనముసేసి నాతినీవు
ప్రథితపౌరు[1]షుఁడగు భర్తఁబడయుదనియె
నట్టివానిని నీవు నాకరయ వలయు.

189\. చ. అనిమిషదానవేంద్రులకు నైన [1]నజయ్యుఁడు నుగ్రవైరి భం
జనుఁడు త్రిలోకరక్షణవశంవదుఁడున్ భవ[2]దిష్టమిత్రుఁడుఁ
ఘనగుణకీర్తనుండు నగు కాంతునిఁ గోరెద నామనోరథం
బు నెరయ సంఘటించి సురపుంగవ నన్నుఁ గృతార్థఁ జేయవే.

190\. వ. అనిన నింద్రుండు దీనికిం బతి యెవ్వం డగునొకో యని కొండొక విచారించు
నెడ నమ్ముహూర్తంబు రౌద్రనామకం బయి సోమసూర్యసంగమ[1]కారణం
బయిన యమావాస్యాముఖం బై యుండం బూర్వసంధ్యారాగరక్తాంబుద
ప్రతిబింబపటలపాటలితోదకం బైన జలనిధిసమీపంబున నమరాసురసమర
సంకులంబుగా నరుణకిరణుం డుదయించుచుండఁ దత్కాలంబున భృగ్వంగిరః
ప్రముఖు లైన మునులు వేల్చు హవ్యంబులు మోచికొని హవ్య[2]వహానుండు
సూర్యమండలంబు ప్రవేశించుచుండం గనుంగొని యిది సూర్యసోమాగ్ని
సమాగమం బయిన రౌద్రనామకముహూర్తంబు గావున సూర్యసోమాగ్ని
తేజంబున జనియించినవాఁడు దీనికిఁ బ్రియుండు గావలయు నని మనంబున
నిశ్చయించి [3]యతం డాక్షణంబ.

---

185\. 1. దుఃఖాబ్ధిలోపలబడుట తప్పె – ల.

186\. 1. జాతవు – వీ. శ. ప.

188\. 1. షధనుఁడగు భర్త – పెక్కు ప్రతులు.

189\. 1. నజేయుడు – శ. ప. పెక్కు ప్రతులు. 2. దీయ – కొన్ని ప్రతులు.

190\. 1. కాలం బయిన – ప. చ. ల; 2. వాహానుండు – కొన్ని ప్రతులు. 3. యత
ణంబ – కొన్ని ప్రతులు.

191\. క. వాలం దోడ్కొని యబ్జజు,పాలికిఁజని మ్రొక్కి త్రిదశపాలుఁడు దేవా
యీలలనకుఁ దగు[1]వరునిఁ గృ,పాలుఁడవై యొసఁగు మనినఁ
బద్మజుఁ డనియెన్

192\. ఉ. దీపితవిక్ర[1]మాన్వితుఁడు దీనికి వల్లభుఁ డయ్యెడుం ద్రిలో
కీపరిరక్షణక్షముఁడు గీర్తితమూర్తి యొకండు వాఁ[2]డ మీ
యాపద లెల్లఁ బాపుటకునై ధృతిఁ బూను నశేషదేవసే
నాపతిభావమున్ [3]విబుధనాయక శీఘ్రము భావ్య మింతయున్.

193\. వ. అనినం బ్రీతుండై పితామహుపీడ్కొని యింద్రుండు సనియె దదనంతరంబ వసిష్ఠ ప్రముఖు లైన సప్తమహామును లమావాస్యాహోమంబు సేయ సమకట్టిన నమరు లందఱు నందుల హవిర్భాగంబులు గొనుటకు నాసన్ను లగుటయు.

194\. క. ఆహవనీయముఖంబున, నాహూతుండై [1]హుతాశుఁ డమ్మును లిడఁగా
నాహుతులు గొని దివిజసం,దోహమునకు వరుస[2]నొసఁగఁ దొడఁగెం బ్రీతిన్.

–: అగ్నిదేవుండు మునిపత్నులం గామించుట :–

సం. 3 – 213 – 42

195\. సీ. ఆసమయంబున నమ్మునీంద్రులభార్య లందఱు సుస్నాన[1]మొందఁ జేసి
రమణీయమాల్యాంబరవిభూషణాద్యలంకారంబు లొనరించి గారవమునఁ
జనుదెంచి పతులకు [2]సన్మతిం బరిచర్య సేయుచు మెలఁగంగ వాయుసఖుఁడు
మెలఁతల[3]పాలిక మెఱుఁగుఁగన్నులయొప్పుఁ దెలినవ్వు మొగములవిలసనంబు

తే. నడబెడంగులు నన్నువనడుములందు, వెలయు వళులభావంబు[4]లు
వలుఁదచన్నుఁ
గవల [5]నిక్కును నేర్పడఁ గని కరంగి, మదనమార్గణవిదళితహృదయుఁ డయ్యె.

---

191\. 1. మగని – కొన్ని ప్రతులు.

192\. 1. మాన్వితు – ఒ. ఓ. ల. 2. డునీయాపద – కొన్ని ప్రతులు. 3. త్రిదశ, దివిజ – అని పాఠములు.

194\. 1. కృశానుడమ్మును లిడగా – ప. చ. ల. 2. నిడగ – కొన్ని ప్రతులు.

195\. 1. మమరజేసి – కొన్ని ప్రతులు. 2. సన్మతిం – ఒ. చ. జ. శ. ష; సన్నుతిం – ఊ; సమ్మతిం – వా. పీ. 3. పాలిటి – డ. 4. ను – కొన్ని ప్రతులు. 5. లింకము – ఉ; పీకయు – కొన్ని ప్రతులు; యొప్పును – ష.

196\. వ. ఇట్లు వికలేంద్రియుండై వైశ్వానరుం డమ్మునిపత్నులయందుఁ [1]దగిలిన డెందంబు [2]మగిడింప నేరక వారలం గదియ నప్పళించి గార్హపత్య కుండంబునం[3]దావేశించి.

197\. చ. అతివలు దన్నుఁ జేరుటకు నాసపడుం బొరిఁ జేరుచోట నా
యతవిలసచ్ఛిఖాగ్రముల నల్లన వారల నంటుఁ గౌతుకం
బతిశయమై తదంగలత లాదటఁ గౌఁగిటఁ జేర్పఁగోరుఁ గం
పిత[1]ధృతియై కలంగుఁ గడుఁ [2]బెల్లగురాగరసంబు ముంపఁగన్.

198\. వ. అంత నమ్మునీంద్రుల హోమవిధి సమాప్తం బగుటయు జాతవేదుండు మదన వేదనాభరంబు సహింప నోపక [1]నిర్జనం బయిన వనంబునకుం జని మునిపత్నీ సమాగమంబు [2]దుర్లభంబుగా వగచి వెగడంది [3]శరీరంబు దిగవిడువ సమకట్టునెడ దదీయవల్ల[4]భయైన స్వాహాదేవి దత్ప్రకారం బంతయు నెఱింగి యతనికిం బ్రియంబు సేయునదియై [5]సప్తమునులలో నంగిరసుభార్య శివ యనుదాని రూపంబు గైకొని చని యేకతంబ యున్న హుతాశనుం గనుంగొని యిట్లనియె.

199\. తే. అంగిరసుభార్య నేను శివాభిధాన, ననఘ నాకును నాతోడియంగనలకు
ననుదినంబును నతిమనోహరవిలాస,మైన నీమూర్తిపైఁ గోర్కి
[1]యడరియుండు.

---

196\. 1. గిలిన మనంబు – ఇ. ఏ. 2. మగుడింప – పెక్కు ప్రతులు. 3. బ్రవేశించి – కొన్ని ప్రతులు.

197\. 1. మతియై – అ. ఎ. ఘ. ఝ. ద. ల. 2. బెల్లుగ – కొన్ని ప్రతులు.

198\. 1. విజనంబైన – కొన్ని ప్రతులు. 2. దుర్లభంబకావగచి – ల; దొరకొనమికిం జాల వగచి – స. 3. శరీరంబు నదీతీరంబునం దిగవిడువ – వీ. శ. ష. 4. భియైన– ఔ. గ. చ. జ. ద. శ. 5. సప్తర్షులలోనం – ఈ. ఎ. ఐ. త; సప్తరుషులలో – ఇ. ఏ. చ. ఝ.

199\. 1. యలరియుండు – ఇ. ల.

200. ఉ. నీమదిచంద మిట్టిదని నిక్క మెఱుంగక నే మజస్రముం
గామశరాహతిం [1]గలఁగి కాఱియ వొందుదు మాత్మ[2]లందు నీ
కామము మాదెసం గలిమి కౌతుకచేష్టలయం దెఱింగి యు
ద్దామమనోరథప్రచలితస్థితి నందఱముం గ్రమంబునన్.

201. చ. నినుఁ గవయం దలంచి యిట నెమ్మిమెయిం జనుదెంచినార మిం
పునఁ జెలు లెల్లఁ దొల్త ననుఁ బొమ్మని పంచిన వచ్చితిన్ మనం
బనవరతానురాగముగ నంగజ[1]కేళి భజింపు మింక నొం
డని యెడసేసితేనిఁ గుసుమాస్త్రుఁడు సైఁపఁడు నన్నుఁ బావకా.

202. వ. అనిన సంతసిల్లి యగ్ని దేవుండు దానిం గైకొని యె నదియును నతని నభిమత భోగంబులం బ్రీతునిం జేసి తదీయతేజోధాతువు ధరియించి యచ్చోటు వాసి [1]యాక్షణంబ గరుడియై గగనంబునకు నెగసి యతిత్వరితగమనంబున శ్వేతపర్వతంబునకుం జని యం దొక్కయెడ శరవణ[2]స్తంబసంవృతంబైన కాంచనకుండంబునందు నిజభర్తృశుక్లంబు సంగ్రహించి మఱియును.

203. క. మునిపత్నుల రూపులు [1]గైకొని [2]యిట్టుల వరుసఁ బుష్పకోమలి ప్రియుఁ బ్రీ
తునిఁ జేయుచు రేతస్కందన మొనరించుచును వచ్చెఁ [3]దత్కలశమునన్.

204. తే. విను పతివ్రతాతిలకమై వెలయునట్టి, యయ్యరుంధతి రూపంబు నలవరింప
నెట్లు నేరద కాని యయ్యెంతి యున్న, యువిద లార్వురు రూపులు
నొనరఁ దాల్చె.

205. వ. ఇవ్విధంబున నాఱుమాఱులు ప్రస్కందితం బైన యగ్ని తేజంబు[1]న.

---

200. 1. దవిలి - ఘ. 2. నేడు నీ - కొన్ని ప్రతులు.

201. 1. శీల - వీ. శ. ష. కొన్ని ప్రతులు.

202. 1. యక్షణంబ - శ. ష. పెక్కు ప్రతులు. 2. స్తంబ - పెక్కు ప్రతులలో లేదు.

203. 1. గైకొని వరుసన్ వచ్చి పుష్ప - జ. వీ. శ; గైకొని వరుసన్ దానుబుష్ప - ఎ. ఐ. ఒ. ఝ. త; గైకొని వరుసన్ గవిసిబుష్ప - చ; గైకొని వరుసన్ వేడ్క - ఔ. 2. తోడ్తో - ఘ. ఠ. 3. దత్కుండమునన్ - కొన్ని ప్రతులు.

205. 1. వలన - పెక్కు ప్రతులు.

-: కుమారస్వామి యవతారము :-

సం. 3 _ 211 _ 17

206\. క. ఆదిత్యనిభుఁడు విపుల, ద్వాదశబాహుండు షడ్వదనుఁ డఖిలదిశా
రోదోంతరంబు వెలుఁగ మ, హోదారుండై కుమారుఁ డుదయం బయ్యెన్.

207\. వ. ఇట్లు శుక్లపక్షంబునం బాడ్యమియందు వీర్య[1]నిషేకంబును విదియయందు గ[2]ర్భవ్యక్తియుఁ దదియయందు శరీర[3]మాత్రావిర్భావంబునుం జతుర్థియందు సకలావయవసంపూర్ణతయునై యుదయించి[4]న కుమారుండు పంచమియందు సముత్థితాకారుండై పేర్చి త్రిపురదహనసాధనం బైన [5]హరుకార్ముకం బమ్మహీధరంబునందు నిక్షిప్తంబై యున్నదానిం బుచ్చుకొని గుణధ్వనిసేసిన నమ్మహో[6]ధ్వని విని కలుషించి యైరావత [7]సుప్రతీకంబులను దిగ్గజంబు లయ్యగ్నిభవు మీఁదం బఱతెంచిన నమ్మహోభుజుం డా రెంటినిం బెనఁచిపట్టి రెండుచేతుల ధరియించి తన సహజం బైన శక్తి యొక్క కేలం [8]గ్రీడార్థకలితంబైన [9]కుక్కుటం బొక్క కేలను బరిపూర్యమాణనినదం బైన శంఖంబు గరద్వయంబునం దాల్చి హస్తయుగళంబున గగనంబు వ్రేయుచుం బాణియుగ్మంబు వక్త్రంబుల నిడికొని బాల్యోచితంబు లైన యంగుళిచర్వణంబులు పొరిఁబొరి నొనరించుచు నిశితసాయకంబునం గ్రౌంచ పర్వతవిభేదనంబు సేసి పటుశక్తిపాతంబున శ్వేతశైలశృంగఖంగంబు గావించి చెలంగి యాఱుముఖంబుల నొక్కపెట్ట యార్చినం బ్రళయభైరవారావభీషణంబైన తదా[10]ఘోషణంబున.

208\. మ. కులశైలంబులు [1]గ్రక్కునం గదలె దిక్కుల్ [2]వ్రయ్య లయ్యెన్ మహీ
వలయం బంతయు [3]దిర్దిరం దిరిగె దేవవ్రాతముల్ సాధ్వసా

---

207\. 1. నిక్షేపంబును - ఇ. ఎ. ఔ. 2. గర్భోత్పత్తియు - కొన్ని ప్రతులు. 3. మాత్ర విభాగంబును - పెక్కు ప్రతులు. 4. న - కొన్ని ప్రతులలో లేదు. 5. హర మహా కార్ముకంబు - కొన్ని ప్రతులు. 6. నాదంబు - కొన్ని ప్రతులు. 7. చిత్రకంబులను - అ. ఊ. ఎ. ఒ. ఓ. ఔ. గ. ఘ. చ. త. ద. ల. 8. గృహార్థ కలితంబైన - ఊ. ఎ. ఏ. ఐ. ఘ. త. ద. 9. కందుకం బొక్క కేలను - శ. మూలము 'అపరేణాగ్ని దాయాదస్తామ్రచూడంభుజేనసః' శం. 3-214-33. 10. ఘోషంబున- పెక్కు ప్రతులు.

208\. 1. మ్రోసె గ్రక్కదలె - అ. ఇ. ఈ. ఎ. ఏ. ఐ. ఝ. త. ద; గ్రక్కనంగదలె - ల. వ. 2. తల్లడిల్లెన్ - ట. 3. జిట్టు(రు)నం దిరిగె - ఊ. ఒ. ఔ. క. ఘ. వ.

కులతం బొందెఁ బయోధు లన్నియును సంక్షోభించె [4]సప్తాశ్వస
ప్తులు బిట్టుల్కి రథంబు నల్దెసలకుం బోనీడ్చె [5]సంభ్రాంతమై.

209. క. అట్టి మహోత్పాతంబులు, పుట్టినఁ గని మునులు లోకములకు శుభముగా
[1]నెట్టన శాంతికవిధుల, ప్పట్టున నొనరించి రాత్మభావనపరులై.

210. వ. ఆసమయంబునం జైత్రరథవననివాసులైన [1]జను లందఱుం గూడి [2]యంగిరః
ప్రముఖమునీంద్రుల భార్యలకు నగ్నిదేవువలనం బుట్టిన బాలుండు లోకం
బులకు నిట్టి యనర్థంబు సేయం దొడంగె నని యాక్రోశించిన నయ్యప
[3]వాదంబునకు రోసి యాసప్తమునులలోన వసిష్ఠుండు దక్కఁ దక్కిన
యార్వురుఁ దమవనితలం బరిత్యజించిరి మఱియును గొందఱు జను లీ
రేమిసేయుదు రిన్ని పోకలం బోయినది వహ్నిభార్యయకాక యని పలుకం
జొచ్చి రంత నమ్మహామునుల పాలికిఁ బావకాంగన సనుదెంచి యి ట్లనియె.

211. క. వినుఁ డేను వహ్నివలనం, గనిన కుమారుండు వాఁడు గడునిజమిది మీ
వనితలకుం బని[1]గా దిటు, సను నే [2]కులసతుల విడువ సత్పురుషులకుల్.

212. వ. అని యెంత సెప్పిన వా రొడంబడరైరి తదనంతరంబ విశ్వామిత్రుండు
గుమారుకడ కరిగి యద్దేవుశరణంబు సొచ్చి వివిధవాక్యంబులం బ్రస్తుతించి
తదాదేశంబున నతనికి జాతకర్మాదివిధులొనరించిన నది యంతయు
నెఱింగి యమరు లెల్ల నమరేంద్రు[1]ంగానఁ జని యి ట్లనిరి.

---

4. సప్తాశ్వసప్తులు - కొన్ని ప్రతులు. 5. సంభ్రాంతిమై, విభ్రాంతిమై, నుద్భ్రాం
తిమై - అని భిన్న పాఠములు.

209. 1. జట్టన - సూ. కొన్ని ప్రతులు.

210. 1. మునులందరు - ల. 2. యంగి (గీ) రసప్రముఖ - కొన్ని ప్రతులు. 3. రాధం
బునకు - ఆ. ఈ. ఐ. ఒ. ఝ. త.

211. 1. లేదిటు - కొన్ని ప్రతులు. 2. కులస్త్రీలవిడువ - శ. షలు తప్ప పెక్కు ప్రతులు.
ఈ పాఠమున స్త్రీ శబ్దమును తేల్చి చదువవలెను.

212. 1. పాలికింజని - చ.

213. ఉ. దారుణశౌర్యధుర్యుఁ [1]డతిదర్పితచిత్తుఁడు వహ్నిసూనుఁ డ
స్వీరుఁడు నిన్నుఁ గైకొనక వీఁకమెయిం జనుదెంచు నిప్పు డు
ర్వారత నీ[2]పదంబు గొనువాంఛ నవశ్యముఁ గాన యింతలో
నీరస మెత్తి వాని వధియింపుము చెచ్చెర విక్రమో[3]ద్ధతిన్.

214. వ. [1]అట్లయిన నీకు నింద్రత్వంబు [2]శాశ్వతం బగు నేమును బ్రదుకుదుము లోకంబు లవ్యాకులంబు లగు ననినం బురందరుం డప్పుడ సప్తమాతృక[3]లం బిలిచి మీరు సని వహ్నిసంభవుం డైన కుమారు[4]సమయించి నాకుఁ బ్రియంబు సేయుం డని పంచినం బనిపూని వారు ఘోరంబుగా నతనిపై [5]నడచి తదీయ తేజోవిశేషంబునకు భయంబంది యతని శరణంబు సొచ్చి యేము లోక[6]మాతలము మాయందు నీవు మాతృభావంబు సేయ నర్హుండ వనినం గుమారుండు వారి నభినందించి చేకొనియె నంత నగ్నియు నిజపుత్త్రు పాలికి వచ్చి యతనిచేతం బూజితుం డయి తదీయరక్షాపరత్వంబున నిలిచె మాతృగణంబుక్రోధంబునం బుట్టినయది [7]లోహితాస్య యనుభామిని గుమారునకు దాదియై యుపలాలనంబు సేయుచుండె నఖిలభూతగణంబులుం బఱతెంచి క్రౌంచారిం బరివేష్టించె నది యంతయు విని కలుషించి.

-: ఇంద్రుఁడు కుమారస్వామిపై నెత్తివచ్చుట :-

సం. 3 - 216 - 3

215. ఉ. స్కందునిమీఁద నెత్తి [1]బలగర్వితుఁడై [2]నడతెంచె నుద్భట
స్యందనసామజాశ్వభటసంకులసైన్యసమగ్రదేవతా
బృంద[3]సమేతుఁడై భువనభీకరసంగరకాంక్ష నింద్రుఁ డ
స్పందితశౌర్యుఁ డగ్నికణ[4]జాతభయంకరవజ్రహస్తుఁడై.

216. వ. అంత.

---

213. 1. దురుదర్పిత - ఝ. 2. పురంబు - ఈ. ఐ. త. 3. న్నతిన్ - పెక్కు ప్రతులు.

214. 1. అట్లేని - ఆ. ఉ. 2. యేకాధిష్ఠితంబు-క. 3. ల రావించి-ఓ. 4. వధియించి-ఇ. ఏ. ఓ. చ. త. పీ. శ. ష. 5. నడచి - కొన్ని ప్రతులు. 6 మాతృకలము - కొన్ని ప్రతులు. 7. లోహితాస్వి - ద; లోహితాశ్వ - శ ఇచ్చట మూలము 'లోహితస్యోదధేః కన్యా క్రూరా లోహితభోజనా' భం. 3-215-22.

215. 1. కడుగర్వితుఁడై - పీ. శ. స. 2. చనుదెంచె - పెక్కు ప్రతులు. 3. సమగ్రుడై - ఎ. ఒ. 4. పాత - వా. పెక్కు ప్రతులు; జాత - ఔ.

కులతం బొందెఁ బయోధు లన్నియును సంక్షోభించె [4]సప్తాశ్వ సప్తులు బిట్టుల్కి రథంబు నల్దెసలకుం బోనీడ్చె [5]సంభ్రాంతులై.

209\. క. అట్టి మహోత్పాతంబులు, పుట్టినఁ గని మునులు లోకములకు శుభముగా
[1]నెట్టన శాంతికవిధుల, ప్పట్టున నొనరించి రాత్మభావనపరులై.

210\. వ. ఆసమయంబునం జైత్రరథవననివాసులైన [1]జనులందఱుం గూడి [2]యంగిరః ప్రముఖమునీంద్రుల భార్యలకు నగ్నిదేవువలనం బుట్టిన బాలుండు లోకంబులకు నిట్టి యనర్థంబు సేయం దొడంగె నని యాక్రోశించిన నయ్యప [3]వాదంబునకు రోసి యాసప్తమునులలోన వసిష్ఠుండు దక్కఁ దక్కిన యార్వురుఁ దమవనితలం బరిత్యజించిరి మఱియును గొందఱు జనులు వీ రేమిసేయుదు రిన్నిపోకలం బోయినది వహ్నిభార్యయ కాక యని పలుకం జొచ్చి రంత నమ్మహామునుల పాలికిఁ బావకాంగన సనుదెంచి యిట్లనియె.

211\. క. వినుఁ డేను వహ్నివలనం, గనిన కుమారుండు వాఁడు గడునిజమిది మీ
వనితలకుం బని[1]గాదిటు, ననునే [2]కులసతుల విడువ సత్పురుషులకున్.

212\. వ. అని యెంతసెప్పిన వారొడంబడరైరి తదనంతరంబ విశ్వామిత్రుండు గుమారుకడ కరిగి యద్దేవుశరణంబు సొచ్చి వివిధవాక్యంబులం బ్రస్తుతించి తదాదేశంబున నతనికి జాతకర్మాదివిధులొనరించిన నది యంతయు నెఱింగి యమరులెల్ల నమరేంద్రు[1]ంగానఁ జని యిట్లనిరి.

---

4\. సప్తాశ్వసప్తులు – కొన్ని ప్రతులు. 5. సంభ్రాంతిమై, విభ్రాంతిమై, నుద్భ్రాంతిమై – అని భిన్న పాఠములు.

209\. 1. జట్టన – సూ. కొన్ని ప్రతులు.

210\. 1. మునులందరు – ల. 2. యంగి (గీ) రసప్రముఖ – కొన్ని ప్రతులు. 3. రాధంబునకు – ఆ. ఈ. ఐ. ఒ. ఝ. త.

211\. 1. లేదిటు – కొన్ని ప్రతులు. 2. కులస్త్రీలవిడువ – శ. పలు తప్ప పెక్కు ప్రతులు. ఈ పాఠమున స్త్రీ శబ్దమును తేల్చి చదువవలెను.

212\. 1. పాలికింజని – చ.

213. ఉ. దారుణశౌర్యధుర్యుఁ [1]డతిదర్పితచిత్తుఁడు వహ్నిసూనుఁ డ
స్వీరుఁడు నిన్నుఁ గైకొనక పీఁకమెయిం జనుదెంచు నిప్డు దు
ర్వారత నీ[2]పదంబు గొనువాంఛ నవశ్యముఁ గాన యింతలో
నీరస మెత్తి వాని వధియింపుము చెచ్చెర విక్రమో[3]ద్ధతిన్.

214. వ. [1]అట్లయిన నీకు నింద్రత్వంబు [2]శాశ్వతం బగు నేమును బ్రదుకుదుము లోకంబు లవ్యాకులంబు లగు ననినం బురందరుం డప్పుడ సప్తమాతృక[3]లం బిలిచి మీరు సని వహ్నిసంభవుం డైన కుమారు[4]సమయించి నాకుఁ బ్రియంబు సేయుం డని పంచినం బనిపూని వారు ఘోరంబుగా నతనిపై [5]నడరి తదీయ తేజోవిశేషంబునకు భయంబంది యతని శరణంబు సొచ్చి యేము లోక[6]మాతలము మాయందు నీవు మాతృభావంబు సేయ నర్హుండ వనినం గుమారుండు వారి నభినందించి చేకొనియె నంత నగ్నియు నిజపుత్త్రు పాలికి వచ్చి యతనిచేతం బూజితుం డయి తదీయరక్షాపరత్వంబున నిలిచె మాతృగణంబుక్రోధంబునం బుట్టినయది [7]లోహితాస్య యనుభామిని గుమారునకు దాదియై యుపలాలనంబు సేయుచుండె నఖిలభూతగణంబులుం బఱతెంచి క్రౌంచాద్రిం బరివేష్టించె నది యంతయు విని కలుషించి.

–: ఇంద్రుఁడు కుమారస్వామిపై నెత్తివచ్చుట :–

సం. 3 – 216 – 3

215. ఉ. స్కందునిమీఁద నెత్తి [1]బలగర్వితుఁడై [2]నడతెంచె నుద్భట
స్యందనసామజాశ్వభటసంకులసైన్యసమగ్రదేవతా
బృంద[3]సమేతుఁడై భువనభీకరసంగరకాంక్ష నింద్రుఁ డ
స్పందితశౌర్యుఁ డగ్నికణ[4]జాతభయంకరవజ్రహస్తుఁడై.

216. వ. అంత.

---

213. 1. దురుదర్పిత – ఝ. 2. పురంబు – ఈ. ఐ. త. 3. న్నతిన్ – పెక్కు ప్రతులు.

214. 1. అట్లేని – ఆ. ఉ. 2. యేకాధిష్ఠితంబు–క. 3. ల రావించి–ట. 4. వధియించి– ఇ. ఏ. ఓ. చ. త. పీ. శ. ష. 5. నడచి – కొన్ని ప్రతులు. 6 మాతృకలము – కొన్ని ప్రతులు. 7. లోహితాస్వి – ద; లోహితాశ్వ – ఠ ఇచ్చట మూలము 'లోహితస్యోదధేః కన్యా క్రూరా లోహితభోజనా' భం. 3–215–22.

215. 1. కడుగర్వితుఁడై – పీ. శ. స. 2. చనుదెంచె – పెక్కు ప్రతులు. 3. సమగ్రుడై– ఎ. ఒ. 4. పాత – వా. పెక్కు ప్రతులు; జాత – ఔ.

217. తరలము.

[1]తరళదీధితిపుంజనిర్భరదారుణాయుధపాణులై
తెరలఁ ద్రోచి దివౌకసుల్ పఱతెంచి యార్చుచుఁ దాఁకి రా
శరవణోద్భవు నాతఁ[2]డుం దగ సంభ్రమస్ఫుటరోష వి
స్ఫురితనిష్ఠురహాసజృంభణమున్ [3]వహించినఁ జెచ్చెరన్.

218. తే. అతని ముఖగహ్వరంబుల నద్భుతముగ, నుగ్రదహన శిఖావళు లుద్భవించి
వేల్పుమూఁకల నరికట్టి వేల్వఁ దొడఁగె, నంత నెంతయు సంభ్రాంతు లగుచు సురలు.

219. క. నీకింకరులము మమ్ముం, జేకొని కృపఁ గావు మనుచు శిఖినందను న
స్తోకబలు శరణు వేఁడినఁ, జేకొని [1]దాహభయ ముడుగఁ జేసె నతండున్

220. వ. ఇట్లు దేవతలు గుమారు నాశ్రయించినం జూచి బలసూదనుండు క్రోధఘూర్ణిత[1]నయనుండై యతనిమీఁద వజ్రంబు వైచిన నది తదీయదక్షిణపార్శ్వంబుఁ దాఁకిన నందొక్కపురుషుండు గాంచనవర్ణుండును శక్తిధరుండును మేషవదనుండునునై విశాఖుండను పేరం బ్రభవించె మఱియునుం గన్యాకుమారగణంబు లనేకంబులు పుట్టె నదియెల్లనుం గని జనితభయుండై హరిహాయుం డగ్నిసంభవు నభయం బని కొలిచె నంత నమరులు సంతసిల్లి సింహనాదంబులు సెలంగ షణ్ముఖ శతమఖులం బరివేష్టించి రని చెప్పి వెండియు మార్కండేయుం డి ట్లనియె.

221. సీ. అయ్యగ్నిసంభవు నాయతోన్నతబాహు నాముక్తకవచుఁ దేజో[1]మహిష్ఠు
నాలోహితాంబరు హారికుండలకర్ణు గనకరత్నోజ్జ్వలఘనకిరీటు
సంపూర్ణయౌవను సర్వలక్షణయుక్తుఁ గని యనురాగిల్లి కమలనిలయ
సాకారయై వచ్చి [2]యఖిలంబు జూడంగ సితపద్మహస్తయై యతనిఁ బొందె

---

217. 1. తరణిదీధితి - ఆ. ఈ. ఉ. ఎ. ఏ ఐ. ఓ. స. 2. దుర్గత - ద; దుంగత - ఒ. శ ష; దుంఘన, దుంగడు - అనియు పాఠములు. 3. వహించెను జెచ్చరన్ - ఆ. ఎ. ఒ. క. జ. ఝ వీ. శ. ష.

219. 1. తద్దాహముడుగ జేసెనతండున్ - ఈ. ఐ. ఘ. త. వీ; దహనభయము - క. ద; తద్భయమునుడుగ - స.

220. 1. హృదయుండై - వీ. శ. ష. పెక్కు ప్రతులు.

221. 1. మయాత్ము - కొన్ని ప్రతులు. 2. సకలంబు - పెక్కు ప్రతులు.

ఆ. శ్రీసమేతుఁ డై విశేషకాంతిస్ఫూర్తి, నొలసి పూర్ణచంద్రు [3]చెలువు దాల్చి
యున్నవానిఁ జూచి రుత్ఫుల్లలోచన,కుముదు లగుచు
మునులు నమరవరులు.

222. వ. అంత షష్ఠదివసంబు సంప్రాప్తం బయ్యె నందు మహామును లందఱు మహాసేను నతిభక్తిం బూజించి కృతాంజలు లై యిట్లనిరి.

223. ఉ. పుట్టిన యాఱు[1]నాళులకుఁ బొంపిరివోయి జగంబు లన్నియున్[2]
దట్టుఁడ వై జయించితి ముదంబున నీదుమహత్త్వ మెంతయుం
జిట్టలుగాదె యిట్టి యవి జేయుఁడ వింద్రపదంబు నీక కాఁ
బట్టము గట్టి యేలుము కృపన్ మము నెల్లను వహ్నిసంభవా.

224. వ. అనినం గ్రౌంచారి వారలం జూచి యింద్రపదవి నుండువారి [1]కెయ్యది కరణీయం బని యడుగుటయు వా రిట్లనిరి.

225. మ. బలముం దేజము [1]నించి లోకముఁ గృపం బాలించు టర్కేందుభూ
జలతేజఃపవనాంబరంబులకు నస్థైర్యంబు గాకుండ ని
శ్చలశక్తిస్థితి నీగి శిష్టజనరక్షాదుష్టశిక్షా[2]సమా
కలనం బింద్రపదస్థుఁ డౌనతనికిం గర్తవ్యముల్ షణ్ముఖా.

226. చ. అనునెడ నింద్రుఁ డిట్లనియె నట్లయినం గడులెస్స దేవ నీ
వనిమిషనాయకత్వమునయం దభిషిక్తుఁడ వై ముదంబుతో
ననుఁ బనిగొమ్ము [1]నీదుకరుణం దొనఁగెల్లను [2]దీటి యుండెదన్
ఘనతరశౌర్యసారుఁడవు గావున నర్హుఁడ వింద్రలక్ష్మికిన్.

---

3. నలవు - ఈ. ఐ. ఝ. త.

223. 1. నాళ్ళకును - ఆ. ఒ. ఔ. క. గ. చ. ఠ. డ. ద ల. వి. శ. ష. స. సూ; నాళ్ళరక - ఇ. ఏ. 2. దిట్టతమై జయించితి నుతింపగ - ఔ; దట్టివెసంజయించితి ముదంబున - ల; ధట్టుడవై - ఆ. డ. ష.

224. 1. కెయ్యవి కరణీయంబులని - కొన్ని ప్రతులు.

225. 1. జూపి, మించ - అని భిన్న పాఠములు. 2. క్రమాకలనం - ఘ.

226. 1. నీకరుణ నాదొనగెల్లను - శ. కొన్ని ప్రతులు. 2. మానియుండెదన్ - పెక్కు ప్రతులు.

227. వ. ఏను దేవేంద్ర[1]పదవి నుండనోడుదు నెట్లనిన భవదీయతేజోవిశేషంబులు సూచి విస్మితులై కొందఱు నీకు నింద్రపదవియందు వేడ్క పుట్టునట్లుగా [2]నేమేనిం జెప్పి నావలనం గొఱగామి కల్పించి నీకును నాకును భేదంబు సేయం జూతురు దానంజేసి నీవు కుపితుండవై నాయెడం గృప దప్పిన నెవ్వారికి [3]వారింప నలవిగాదు లోకభయంకరం బైన విగ్రహంబు ప్రవర్తిల్లుం గావున నవశ్యంబును దివిజరాజ్యంబు నీక యొప్పించితి మన్మొల్లి నేలి కొమ్మనినం గుమారుండు నవ్వుచు నిట్లనియె.

228. ఉ. [1]అట్టివి యేల పుట్టు నమరాధిప నీవ జగత్ప్రభుండవై
యిట్టలమైన తేజము వహించి సుఖంబున నుండు మేను నీ
చుట్టమనై భుజాబలము సొంపున నీ[2]కెలసంబు దీర్చెదం
జట్టన నన్నుఁ బంపుము భృశంబుగ నెయ్యది కార్య మిత్తఱిన్.

229. చ. అనవుడు సంతసిల్లి యతఁ డాతని కిట్లను [1]నట్టులైన నీ
పనుపున నేను సత్యహితభాషణ యింద్రపదంబునందు ని
ల్చి నెగడువాఁడ నైతి సురసేనల కెల్లను నాయకుండవై
ఘనభుజ నీవు సత్కృప జగద్భయ[2]మోచన మాచరింపవే.

230. వ. అనినఁ గుమారుండు మరుత్పతి కిట్లనియె.

231. ఉ. నీకుఁ బ్రియంబుగా భవద[1]నీకినికిం బతినయ్యెదన్ భుజో
త్సేకపటు[2]ప్రభావము లజేయములై పెనుపొందఁ బేర్చి ఘో
రాకృతు లైన నీరిపుల నందఱఁ దున్మెద సర్వలోకర
క్షాకరమైక[3]వృత్తి నవికల్పుఁడ నయ్యెదఁ గట్టు పట్టమున్.

---

227. 1. పదంబుననుండ – ల. 2. నేమేనియుం జెప్పి – పెక్కు ప్రతులు. 3. నలవరింప – ఓ. ల.

228. 1. అట్టిద, అట్టిది – అని పాఠములు. 2. కలనంబు – ఐ. త. శ. ఇట్టిరూపము శబ్దరత్నాకరమున లేదు.

229. 1. నట్లయేని. నట్టులేని – అని భిన్నపాఠములు. 2. నోదన – స; సూదన – ఓ.

231. 1. నీకపతిత్వము బూనెదన్ – ఈ. ఐ. త. 2. ప్రభావము – శ. ప. పెక్కు ప్రతులు; ప్రతాపము–వా. పీ. 3. బుద్ధి – కొన్ని ప్రతులు.

232. వ. అనిన నతిప్రీతుండగుచుఁ బురుహూతుండు సకలసురమునిగణసమేతుం డయి తత్క్షణంబ కుమారునకు నఖిలదేవసేనాధిపత్యంబు[1]నం దభిషేకం బొనరించె మునివరుల జయజయశబ్దంబులు నమరుల సింహనాదంబులుం గిన్నరగంధర్వ గానంబులు [2]మంగళతూర్యరావంబులు నప్సరోనర్తనంబులుఁ గల్పతరుకుసుమ వర్షంబులు సమకాలప్ర[3]వృత్తంబు లయ్యెం బరార్ధ్యభూషణమణిప్రభాలం [3]కృతంబైన కుమారు మౌళిభాగంబున నుజ్జ్వలంబైన ధవళాతపత్రం బురగిరి శిఖరోపరిగతంబగు శర[5]చ్చంద్రబింబంబు ననుకరించుచుండె నట్టియెడ.

-: ఈశ్వరుండు గుమారస్వామియొద్దకు వచ్చుట :-

సం. 3 _ 218 _ 25

233. శా. నానాసిద్ధగణంబు గొల్వఁ బరమానందంబునం జంద్రరే
[1]ఖానవ్యాంచితమౌళి భూరిభుజగాకల్పోజ్జ్వలాకారుఁ డీ
శానుం డానతశంకరుండు గిరిజాసంయుక్తుఁడై వచ్చెఁ ద
త్సేనానిం బ్రియసూను షణ్ముఖుని [2]వీక్షింపం గడుం బ్రేమతోన్.

234. వ. ఇట్లు వచ్చి మహాదేవుండు [1]మహాసేనుం గౌఁగిలించుకొని యతనికి విశ్వకర్మ నిర్మితంబును హేమమయంబును నయిన పుష్పమాలిక యొసంగె ననిన[2]చెప్పిన విని ధర్మజుండు కుమారుఁడు రుద్రాంశుజుఁ డని చెప్పుదు రది యెట్లనిన మార్కండేయుండు పాండవేయున కిట్లనియె వినుము రుద్రుండు మున్ను నిజవీర్యంబు వహ్నియందు సంగ్రహించినఁ దత్తేజోవిశేషంబునం జేసి పావ కుండు గుమారు నుత్పాదించె నదియునుంగాక యగ్ని రుద్రుం డని వేదవిదు లైన విప్రులవలన వినంబడు నట్లగుటం గుమారుండు వహ్నిసంభవుండును రుద్రసూనుండును నని చెప్పం బడియె నగ్నిభామిని గృత్తికాఖ్యలైన ముని పత్నులార్వురరూపంబులు గైకొని ప్రియసమాగమంబు సలిపి శ్వేత శైలంబున రేతస్కందంబు సేయుటం బ్రభవించిన వాఁడు గావునఁ గార్తి కేయ స్కందనామంబులం బరగె ననిచెప్పి యిట్లనియె.

---

232. 1. నకభిషేకం—కొన్ని ప్రతులు. 2. మాగధ—ఈ. త. 3. వర్తనంబు లయ్యె—శ. కొన్ని ప్రతులు. 4. కృతుంబైన—శ. ష. పెక్కు ప్రతులు. 5. దిందుబింబంబు—కొన్ని ప్రతులు.

233. 1. ఖానందాంచిత—అ. ఎ. ఒ. ఘ. చ. జ. ఠ. ద. ల; ఖానూత్నాంచిత — ఈ. ఐ. త. శ. ష; ఖానద్ధాంచితమౌళి—పి. స. 2. వీక్షింపంగఁ బ్రేమంబుతోన్—పెక్కు ప్రతులు.

234. 1. సేనానిం — అ. 2. చెప్పిన నని ధర్మజుండు కుమారుఁడు రుద్రాంశుజుఁడని చెప్పుదు రదియెట్లనిన — అ. ఈ. ఐ. జ. ట. త. ద. ల; చెప్పి మార్కండే — వా.

235\. తే. అప్పు డింద్రుండు మున్ను దా నబ్జభవు ని, యోగమున సురక్షితముగ నునిచినట్టి
దేవసేనకుఁ గన్యకాతిలకమునకుఁ, జెలువముగ నలంకారంబు సేయఁ బనిచి.

236\. వ. సముచితప్రకారంబున నచ్చటి[1]కిఁ దెప్పించి కుమారుం జూచి యిక్కన్నియ భవదర్థంబై బరమేష్ఠిచేత సృజియింపంబడియెం గావున నివ్వరవర్ణినిం బరిగ్రహింపు మనిన నప్పార్వతీనందనుండు మందస్మితసుందరవదనారవిందుం డయి యమ్మహూర్తంబునందు.

237\. ఉ. మానితవిక్రమోజ్జ్వలుఁడు మంగళతూర్యనినాద మొప్పఁ దే
జోనిధి వహ్నిసాక్షిగ విశుద్ధవిధిజ్ఞుఁడు దేవమంత్రి మం
త్రానుగమం బొనర్పఁగఁ బ్రియం[1]బెసలార వరించెఁ జారుప
ద్మానన దేవసేనఁ గరియానఁ గరగ్రహణప్రయుక్తితోఁ.

238\. ఆ. గుహుఁడు దేవసేనఁ గోరి [1]పెండిలియైన, యాదినంబు షష్ఠియగుటఁ జేసి
యర్చనీయ మయ్యె నాదివసంబు లోకముల నెల్ల వెలసె గారవమున.

239\. క. ఏదినమునందు షణ్ముఖు, శ్రీదేవి వరించెఁ గమల[1]చిహ్నితకరయై
యాదివసము పంచమి లోకాదరణీయంబు లక్ష్మి కాస్పద మయ్యెన్.

240\. వ. ఇట్లు విహితమంగళాచారుం డయిన కుమారుపాలికిం జనుదెంచి నిజభర్తలచేతం బరిత్యక్త లైన మునిభార్య లార్వురు నధికదైన్యవివర్ణవదన[1]లై యిట్లనిరి.

241\. చ. కనుకనిఁ [1]దూరి దుర్జనులు గానక చూడక యేము హవ్యవా
హనునకు నిన్నుఁ గంటి మని యాడిన [2]నిందకు నోడి మమ్ముఁ జ
య్యనఁ బతు[3]లుజ్జగించిరి ప్రియంబున నింకిట నీవు మాకు నం
దనుఁడవు మమ్ముఁ బ్రోవ విహితంబు గుమారక నీకవశ్యమున్.

---

236\. 1. కి రావించి - పీ. శ. ష.

237\. 1. బలరార - పెక్కు ప్రతులు.

238\. 1. పెండిలియైన-ఆ. క. ఝ. ఠ. ల. పీ. శ. ష; పెండ్లియునైన-వా. కొన్ని ప్రతు.

239\. 1. చిహ్నమ్ములతో - ఈ. ఏ. ఓ.

240 1. లగుచు ని - పెక్కు ప్రతులు.

241\. 1. గూడి - పీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. నిందకునోడి - పీ. శ. ష. స. పెక్కు ప్రతులు; నందులకోడి - వా. 3. లుందృజించిరి - ఆ. శ.

242. తే. పుణ్యలోకంబులకుఁ బాసి పొక్కుచున్న, మమ్ముఁ జేకొని కరుణాసమగ్రబుద్ధిఁ
బుణ్యగతియందు నిల్పుము పుత్త్రభావ,దృష్టి వెలయ మా యలమట
దీర్పవయ్య.

243. క. అనినఁ గుమారుఁడు వినయం,బున నిట్లను నేను మీకుఁ బుత్త్రుఁడ మీరల్
ననుఁ గన్న తల్లులరు వినుఁ, డనుమానంబేల మీప్రియం బొనరింతున్.

244. సీ. అనుచుఁ జేరువ నున్న యనిమిషపతిఁ జూచి వీరికిఁ దగుపదం బారయంగ
వలయు నావుడు బలవైరి యిట్లనుఁ జంద్రసతులైన యా దక్షసుతలలోన
రోహిణి [1]పొరువున రుచినొప్పు నభిజిత్తు నా నొక్కచుక్క దాఁ బూని యుప్పు
డంద ఱకంటె నత్యంతవల్లభ నేన యగుదుఁ జంద్రునకని వగచి యర్థిఁ
ఆ. దపము సేయ నరిగెఁ దత్పదం[2]బది రిత్త,యున్నయదియు వీరి కునుపు మచట
ననిన [3]వారిఁ బ్రీతి నతఁడు వీడ్కొలిపినఁ, గడఁగి వారు సనిరి గగనమునకు.

245. వ. నాఁటంగోలెఁ గృత్తిక లార్వురు నగ్ని దైవత్యం[1]బనం బరగు నక్షత్రంబై
దివంబున వెలింగిరి తదనంతరంబ స్వాహాదేవి యేతెంచి కుమారుం గని
నీవు మత్పుత్త్రుండవు [2]నిత్యంబును నీపాల వసియింప వలతు నని నం బ్రీతుండై
యాతం డట్లకాక నీవు మత్సమీపంబుననుండి యేనును నీ[3]కొడలుం
గొనియాడం బ్రియంబు[4]న నుండు మనియె నప్పుడు [5]కుమారమాతృకలు
పావిషయుఁ గాళియుఁ గౌశికయు నుద్ధతయు శారికయు నార్యయు
వైధాత్రియు ననువార లేడ్వురుం గుమారు ముందట నిలిచి యిట్లనిరి.

246. ఉ. మమ్ము జగత్త్రయంబునకు మాతలఁగా నొనరింపు మిష్టు ము
న్నిమ్ములనొప్పు మాతృకల కెక్కుడుగావుత మేము సర్వలో
కమ్ములఁ దొంటిమాతృకలఁ గైకొన కుండుటయుం బ్రియంబుతో
మమ్మనిశంబుఁ గొల్చుటయు మాకువరంబుగ నిమ్ము షణ్ముఖా.

---

244. 1. పొరుగున - ల. 2. బూరకయున్న - క. జ. 3. వారి నచటికతడు - ల.

245. 1. బగునక్షత్రంబై - వీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. నేను నీపాల - కొన్ని
ప్రతులు. 3. కొడుకనుచుం గొనియాడ బ్రియంబున నుండుదు - ఇ. ఏ. 4. నొం
దుమ - ఐ. ఘ. ఝ. ల. వీ. శ. ష. 5. మూలమునందు కుమార మాతృకల
ప్రశంస దొరక లేదు.

-: కుమారస్వామి సప్తమాతృకల బాలగ్రహంబులఁ జేయుట :-

సం. 3 - 219 - 18

247. ఆ. అనిన నగుచు నాతఁ డక్లేల వారల, పేర్మి మాన్పఁ[1]దగవె ప్రీతి నొందు
వరము వేఁడుఁ డిత్తు వదలక యనుడు నా,స్కందమాత లనిరి గారవమున.

248. క. అగుఁగాక [1]యట్ల యే మీ,జగములఁ గల శిశువులకు నజస్రముఁ బీడల్
దగ నొనరించుచు నీకృప,నెగడెద మివ్వరము మాకు నీవొసఁగఁ దగుఁ౯.

249. వ. అనినం గార్తికేయుం డి ట్లనియె.

250. క. అక్కట [1]కీడు దలంచితి, రిక్కార్యము [2]దగవె యైన నిచ్చితి మీకు౯
మ్రొక్కినఁ గొల్చిన వేఁడిన, నక్కటికముతోడఁ గావుఁ డమ్మ శిశువుల౯.

251. క. పాయక పది[1]యాఱేఁడుల, ప్రాయమునందాఁక నరుల బాధింపుఁడు [2]మీ
రాయతమదంశజనితు న,జేయు నొకని మీకు రక్షఁ జేయం బనుతు౯.

252. వ. అని పలికి యమ్మహాసేనుండు నిజదేహంబునం గాంచనవర్ణుం డైన పురుషు [1]నొక్కరు నుత్పాదించిన వాఁడునుం బుట్టినప్పుడ యాఁకలి గదిరి తిరిగి నేలంబడి మూర్ఛితుండైనం గుమారుండు వానికిఁ జైతన్యం[2]బొసంగె నతండును స్కందాప[3]స్మారం బనుపేరి గ్రహంబై [4]మాతృకాగణరక్షకుం డయ్యె మఱియు శకునిమాత యైన వినతయు దైత్యమాత యైన దితియు గోమాత యైన సురభియు శునకమాత యైన సరమయు వృక్షమాత యైన కరంజయు సర్పమాత యైన కద్రువయుఁ గుమారుదాదియైన లోహితాస్యయు మాతృగణసమన్వితలై గర్భపీడనంబును శిశుపీడనంబునుం జేయుచు మనుష్యులవలన బలిమంత్రోపహారదానతర్పణంబులఁ దృప్తిం బొంది బాలురకు నాయురారోగ్యసుఖంబుల నొసంగుదురు షోడశవర్షంబులమీఁదఁ గొన్నిగ్రహంబులు గలవు చెప్పెద వినుము.

---

247. 1. దగునె - ఊ. ఓ. చ.

248. 1. మేము వేడ్కన్ - శ. ష.

250. 1. యొప్పమిదలచితిరిక్కా - జ. ట. 2. దగునె - ఊ. ల.

251. 1. యాఱేడుల - శ ష. కొన్ని ప్రతులు; యాఱేండ్ల-వా. 2. ఘోరాయత-ఓ. ల.

252. 1. నొక్కని - కొన్ని ప్రతులు. 2. బొనరించె - ఎ. ఐ. ఝ. త. 3. సారంబను-గ. ఝ. ఠ. ల. 4. మాతృగణ రక్షకుండు - పెక్కు ప్రతులు.

253. సీ. నిద్రించుతఱినొండె నెఱయ మేల్కనియున్నతఱినొండె సురసము దయముఁ గాంచి
[1]భ్రమసి పల్వాలుకులు పలుకుమానవుఁ [2]జోఁకు నదియ దేవగ్రహ మని యెఱుంగు
నది శయానుం డయ్యు నాసీనుఁ డయ్యుఁ బితృశ్రేణిఁ గని [3]యున్మదించెనేని
నది పితృగ్రహము భ్రాంతాత్ముఁడై నరుఁడు గంధర్వులఁ గనిన గాంధర్వ[4]మనియుఁ
తే. బరగు గ్రహముచోఁకది కాలపర్యయమున, గదిరి భ్రమియించెనేని యతఁగ్రహంబు
వాతపైత్యాదివికృతులవలన బుద్ధి, దప్పుటయు నొక్క గ్రహవైకృతంబ యంద్రు.

254. క. విను డెబ్బది[1]యేడుల దాఁ, కను మానవులకు గ్రహోపఘాతంబులు గ
ల్గు ననంతరంబ గ్రహముల, పని వలవదు [2]ముదిమి యెల్లపనులకుఁ జాలున్.

255. క. నియతి గలిగి యింద్రియముల, జయించి శుచులైన [1]శాంతిసంపన్నులకుఁ
భయ మొనరింపఁగ లేవ, వ్యయ[2]పుణ్యా గ్రహము లేయవస్థలయందున్.

256. వ. మఱియు నొక్కటి సెప్పెద.

---

253. 1. భ్రమసిన పలుకులు పలుకు - కొన్ని ప్రతులు. 2. బొందునదియ - కొన్ని ప్రతులు. 3. బఖ్మరించెనేని - అ. ఆ. ఎ. ఝ. ద. ల. వీ. శ. మ. 4. మనగ - పెక్కు ప్రతులు.

254. 1. యేడులదాకను మానవులకు గ్రహోప ఘాతంబులు - అ. ఈ. ఏ. ఔ. ఘ. చ. ఝ. ల. వీ. ష; యేండ్లగుదాకను జనులకు వగ్రహోప ఘాతంబులు - వా. ఇచ్చట సంస్కృతమూలము యావత్సప్తతి వర్షాణి భవంత్యేతేగ్రహోనృణామ్. 2. ఇచ్చట మూలము 'అతఃపరమ్దేహినామ్ తు గ్రహాతుల్యో భవేజ్జ్వరః'.

255. 1. కాంతి - వా; శాంతి - పెక్కు ప్రతులు. 2. పుణ్యాగ్రహములు - ఝ. శ. ష; పుణ్యగ్రహములు - వా. వీ. కొన్ని ప్రతులు; పుణ్యుల గ్రహములు - ర.

257. ఆ. [1]ఆదిదేవుఁ డగు మహాదేవుమీఁద నె, వ్వాని మనసు భక్తివైభవమున నుల్లసిల్లు నతని నెల్ల[2]కార్యముల డ, గ్గఱదు సూవె గ్రహవికార[3]వితతి.

258. వ. అని చెప్పి మార్కండేయుం డిట్లనియె నట్లు గుహుండు గ్రహంబుల నియోగించునెడ నగ్నివల్లభ యల్లన నతనిం జేర నరిగి యిట్లనియె.

259. తే. పుత్త్ర విను మేను దక్షునిపుత్త్రి నన్నుఁ, బావకున కిచ్చె మాతండ్రి బాల్యముననె నన్ను నతఁ డొల్లఁ డెంతయు నాకుఁ బతికి, నెపుడు నెడలేని పొందుగా నీ వొనర్పు.

260. వ. అనిన [1]నగ్నిభవుండు మహాద్విజులు వహ్నియందు హవ్యంబులు స్వాహాకారకలితంబులైన మంత్రంబుల నొసంగువారు దానం జేసి నీకుఁ బ్రియునితోడి నిత్యసహవాసంబు సిద్ధించు ననియె నప్పుడు సకలమునిగణ సమేతుండై [2]చనుదెంచి కమలాసనుండు మహాసేను నభినందించి యంతకు మున్న [3]సన్నిహితుండై యున్న మహాదేవుదెసఁ జూచి యతని కిట్లనియె.

261. ఆ. అనఘ[1]యితఁడె త్రిపురహరుఁడు త్రిలోచనుం, డిదె త్రిలోకమాత హిమనగేంద్ర తనయ వీరు నీకుఁ దల్లియుఁ దండ్రియుఁ, జువ్వె వీరిఁ గొల్వు [2]సుచిరభక్తి.

---

257. 1. 'ఎ' ప్రతిలో మాత్ర మీక్రింది పద్య మధికపాఠముగాఁ గలదు.

ఆ. సర్వభూతములకు సర్వదేవతలకు
నతని కరుణ జూవె యఖిలమునకు
నాదికాదియైన యమ్మహాదేవు శ
శాంకచిహ్నుఁ దలఁప నగు శుభంబు.

2. కార్యముల – పెక్కు ప్రతులు; కాలముల; వా – కార్యములందు చేరదెపుడు గ్రహవికార – గ. శ. 3. వికృతి – పెక్కు ప్రతులు; నికృతి – శ; గతులు – జ. ట. వీ. ష; తతులు – స.

260. 1. గుహుండు – కొన్ని ప్రతులు. 2. చనుదెంచి – పెక్కు ప్రతులలో లేదు. 3. యంబికాసహితుండై యున్న – ల.

261. 1. యితఁడె – ఈ. ఐ. త; వీఁడె – వా. కొన్ని ప్రతులు. 2. సురుచిరముగ – వీ. శ. ష. పెక్కు ప్రతులు.

262\. వ. అగ్నిదేవునియందును దదీయభార్యయందును దారు నిజయోగబలంబునం జేసి యావేశించి యాదంపతులు లోకహితార్థంబుగా నిన్నుం గని రని చెప్పినఁ బార్వతీనందనుం[1]డు సానందహృదయుం డయి సకలలోకగురువు లైన పార్వతీపరమేశ్వరులం బూజించి సంస్తుతించె నంత నింద్రుండు గార్తికేయునకు నైరా[2]వణభూషణం బైన ఘంటాద్వయంబు నొసంగిన నం దొక్కటి కుమారుండు గైకొని యొక్కటి విశాఖున కిచ్చెం బదంపడి.

*-: ఈశ్వరుండు గుమారసహితుండై భద్రవటంబు సేరుట :-*

సం. 3 - 221 - 1

263\. మ. తనయుం గౌఁగిటఁ జేర్చుచున్ వరుస [1]మూర్ధఘ్రాణముం జేయుచున్
జనితానందమనస్కుఁడై గిరిసుతాసంయుక్తుఁ డీశానుఁ డ
య్యనఘుం దోడ్కొని [2]బద్ధకేసరి సహస్రస్యందనారూఢుఁడై
చనియెన్ భద్రవటస్థలంబునకు నైశ్వర్యం బవార్యంబుగన్.

264\. వ. అమ్మహాదేవు ముందట ననేకయక్షగణపరివృతుండును బుష్పకాధిరూఢుండును కుబేరుండును వెనుకదెస నమరగణసమన్వితుండును నైరావతా[1]రోహణోల్లాసియు నైన వాసవుండును దక్షిణ[2]పక్షంబునం బ్రబలరక్షోయక్షరక్షితుండై యమోఘనామధేయుం డైన యక్షోత్తముండును గృతపరికరు లైన వసురుద్రాదిత్యులును [3]దాపలిపక్షంబున నతిభయంకరవ్యాధిమృత్యుపరివేష్టితుండై పితృపతియును వివిధయాదోనివహసనాథుం డయిన వరుణుండును నడచిరి మఱియు మూర్తిమంతంబు లై శూలపట్టిసగదాముసలాదికంబు లైన యద్దేవు నాయుధంబులుఁ గమండలుప్రముఖోపకరణంబులుం జనియె నయ్యాదిదేవునకు నాసన్నుం డయి చంద్రుండును ధవళాతపత్రంబు ధరియించె ననిలాగ్నులు చామరహస్తులై కొల్చిరి విద్యయు సావిత్రియు గాంధారియుఁ గేశినియు నను దేవాంగనలు దాక్షాయణిం గొల్చి చనిరి త్రిలోచనసఖుం డైన పింగళుం డను యక్షుండు వృషభకేతనంబు దాల్చె నివ్విధంబున నభిరామవిభ[4]వోదారుం డై కుమారగురుండు భద్రవటంబు సేర నరిగి యచ్చటఁ గుమారుం జూచి యి ట్లనియె.

---

262\. 1. డానందహృదయుం డయి - ఓ. క. ఝ. ర. డ. త. ల. వీ. శ. ష. 2. వణ విభూషితం బైన - ఎ. ఏ. ఒ.

263\. 1. మూర్ధ్ని ఘ్రాణము - శ. ష. పెక్కు ప్రతులు. 2. బద్ధకేసరిసహస్రస్యందనారూఢుఁడై - వా. వీ.

264\. 1. రూఢుండై - ఒ. ఘ. శ. ష. 2. పార్శ్వంబున - అ. 3. దాపటివంక - అ. ల. 4. వోద్దాముండై - ఆ. ఝ. ల. శ.

265. తే. సప్తమం బైన మారుతస్కంధమునకుఁ, బతివి గమ్ము కుమార దేవతలకెపుడు
గార్య మొదవినఁ జేకొని [1]కడఁకఁ దీర్పు, మనిశమును మత్ప్రదధ్యాన
ఘనుఁడ వగుము

-: కుమారస్వామి మహిషాసురుం జంపుట :-

సం. 3 - 221 - 29

266. క. చనుము శుభంబుల నొందుము, తనూజ యని కౌఁగిలించి తద్దయుఁ బ్రేమం
బున నతని వీడుకొలుపఁగ, ననఘ మహోత్పాతములు రయంబునఁ
బొడమెన్.

267. ఆ. దెసలు మండె ధరణి దిర్దిరఁ దిరిగె [1]న, భంబు మ్రోసె వడఁకెఁ బర్వతములు
జగము ఘోరతిమిరసంవృత మయ్యె ని, ర్జరుల [2]మనము లెల్ల సంభ్రమించె.

268. వ. తదనంతరంబ.

269. మ. ఘనశస్త్రాస్త్రమహోజ్జ్వలంబు చతురంగవ్యాప్తభూమండలం
బు నితాం[1]తోద్ధతఘోరఘోషబధిరీభూతాఖిలాశాముఖం
బనిరో[2]ధోద్గతవేగ ముగ్రదనుజేంద్రానీక మేతెంచె నీ
సున నీశానముఖామరప్రతతిపై శుంభద్భుజారంభమై.

270. వ. ఇట్లు [1]మహిషాసురసంరక్షితం బయిన దానవసైన్యంబు పఱతెంచి చుట్టు
ముట్టి యసంఖ్యసాయకంబులు గదాఖడ్గముసలపరిఘశతఘ్నిప్రముఖానేక
ప్రహరణంబులు ప్రయోగించి నిమిషమాత్రంబున ననిమిషసైన్యంబునం
బ్రచురమాతంగతురంగరథికపదాతిప్రకరంబులం బరిమార్చినం గార్చిచ్చు
పొదివినం జెదిరిపఱచు మృగంబులుంబోలె నమరులు సమరవిముఖులై
తొలంగం బాఱినం జూచి నముచిసూదనుండు సింహనాదంబు సేయుచు
నెలుంగెత్తి సురగణంబుల కిట్లనియె.

---

265. 1. కడిమి నెరవు - వ.

267. 1. నభంబు - వీ. శ. వ. పెక్కు ప్రతులు. 2. మనసులెల్ల వంచలించె - వీ. శ. వ. వ.

269. 1. తోద్గత-కొన్ని ప్రతులు; తోద్గత - కొన్ని ప్రతులు; తోద్ధతి-వా. కొన్ని ప్రతులు.

270. 1. తారకాసుర - శ.

271. చ. వలవదు సంభ్రమంబు గరువంబుగ నియ్యెడ నెల్లవారు నే
ర్పలవడ వాహనంబులు మహాస్త్రములున్ సమకట్టి క్రమ్మఱుం
[1]డలవునఁ [2]దున్మివైవుఁడు దురాత్ముల దైత్యుల సేన గల్గగాఁ
దలరఁగ నేల మీకు ధృతి దాల్పుఁడు నిల్వుఁడు గెల్వఁ[3]డుక్కునన్.

272. ఆ. అనినఁ బోక నిల్చి యాహవోత్సాహులై, సకలవాహనాస్త్ర[1]శస్త్రచయము
[2]లలవరించి పేర్చి యార్చి తాఁకిరి వసు, రుద్రసాధ్యముఖమరు[3]త్ప్రవరులు.

273. మ. అమరానీకవిసృజ్యమాన [1]బహుశస్త్రాస్త్రాహతిన్ [2]భిన్నదే
హములై ఘోరమదేభముల్ బహుల[3]రక్తాంగంబులై తూలెఁ దీ
వ్రమహావాతనిపాతజాతరభస[4]వ్యాధూతసంధ్యారుణా
భ్రములో నా నవశంబులై యొఱలుచుం బ్రత్యర్థిసైన్యంబులన్.

274. మ. పురుహూ[1]తాగ్రసరప్రభూతబలసంభూతాస్త్రనిర్ఘాతమై
తిరిగెఁ [2]బెంపరి దైత్యవాహినుల నుద్వృత్తాశ్వకశ్రేణి వి
స్ఫురి[3]తోత్పాతసమీరవేగవిముఖీభూతాకృతిం దూలు భీ
కరరత్నాకరజాతసంతతతరంగవ్రాతముం బోలుచున్.

275. చ. అడరుచు దేవసైన్యవిశిఖాగ్నిశిఖావలి చుట్టుముట్టినం
గడువడి [1]దానవధ్వజినిఁ గల్గు రథప్రకరంబు లన్నియుం
బొడిపొడి యయ్యె నుగ్రతరభూరిదవానల మెల్లదిక్కులం
బొడమిన [2]వంటకట్టియలప్రోవులు రూపఱుమాడ్కిఁ దోఁపఁగన్.

---

271. 1. డలముడు – ఈ. ఐ. త. శ; డలమున – ష. 2. దున్మివైచెద – ల. 3. దుర్ధతిన్ – జ. డిత్తరిన్ – కొన్ని ప్రతులు; దుబ్బునన్ – ఘ.

272. 1. శరచయంబు – ద. శ. ష. 2. నలవరించి – కొన్ని ప్రతులు. 3. ద్గణములు, వీ. క. జ; త్ప్రముఖులు–కొన్ని ప్రతులు.

273. 1. ఘన – పెక్కు ప్రతులు. 2. ఛిన్న – కొన్ని ప్రతులు. 3. రక్తాక్తంబులై కూలె–కొన్ని ప్రతులు. 4. వ్యాధూత–వీ. శ. ష. పెక్కు ప్రతులు; వ్యాఘూత–వా.

274. 1. తాశ్వరథ – అ. ర. 2. ఖేదప్పడి – కొన్ని ప్రతులు. 3. తోత్పాత–పెక్కు ప్రతులు; తోద్ధూత – వా.

275. 1. దైత్యవాహినుల – ఈ. ఐ. త. 2. వంట – ఈ. ఐ. త. శ. ష; వట్టి – వా. వీ.

281. ఉ. చూచితె వీనిసాహసము శూరత మద్రథరోధి యయ్యె ని
న్నీచుఁ గృతాపరాధు నవినీతు [1]గతాయువు మృత్యుదేవికిన్
గోచరుఁ జేయు[2]మీవు రణకోవిద నావుడు షణ్ముఖుండు గో
త్రాచలసన్నిభుండు మదనాంతకుమాటకుఁ బొంగి యుక్కునన్.

282. ఉ. లోహితరత్నభూషణుఁడు లోహితమాల్యధరుండు విస్ఫుర
ల్లోహితలోచనుండు నవలోహితవస్త్రుఁడు లోహితాస్యుఁ డై
యాహవకేళికిం గడఁగునప్పుడు సూడఁగ నొప్పె లోకని
ర్దాహ[1]సమిద్ధనూతనపతంగుఁ[2]డ పోలె రథాధిరూఢుఁ డై.

283. ఉ. ఆతని నుగ్రతేజు నిటలాక్షు[1]తనూభవుఁ జూచి నిర్జర
వ్రాతము భీతిఁ బో విడిచి వారక ధీరత నిల్చె నంత ని
ర్ధూతవిరోధి వైరివధదోహలి యై వడి వైచెఁ దీవ్రని
ర్ఘాతముతోడఁబుట్టు వనఁ గాఁ దగు నుజ్జ్వలశక్తి దైత్యుపైన్.

284. క. దారుణకల్పాంతాగ్ని స, మారంభము దోఁప నమ్మ[1]హాశక్తి రయం
బారంగ [2]నడరి దివిజేం, ద్రారాతిం బొదివి భస్మితాంగునిఁ జేసెన్.

285. వ. ఇవ్విధంబున మహిషాసురుం బరిమార్చి కుమారుండు మఱియు నమ్మహాశక్తిం బునఃపునఃప్రయోగంబు గావించుచు ననేకదైత్యదానవశతసహస్రంబుల వధియించె నద్దేవుని [1]పారిషద[2]గణంబుం[3]గవిసి యసురులం దునిమి తూఁటాడి తదీయరక్తపానమాంసఖాదనంబులు సేసి మత్తిల్లి యాడుచుం బాడుచు నతనిఁ గొనియాడుచు విహరించె నిట్లు వైరులం బొలియించి తిమిరంబు విరియించిన తిమిరవైరియుంబోలె వెలుంగుచున్న కార్తికేయు నజేయుం జేర నరుగుదెంచి దేవేంద్రుం డతనిం గౌఁగిటం జేర్చి యిట్లనియె.

---

281. 1. గతాయుషు – అ. ఆ. ఇ. ఊ. ఏ. క. గ. చ. జ. ఝ. ఠ. డ. ద. శ; గతాయుని – ష; మదోద్ధతు – ఓ. ల. 2. మిద్డు – కొన్ని ప్రతులు.

282. 1. సముత్థ–వీ. ష; సముద్ధ–క. ఝ. ద. శ; సముద్ధతాసన–ఠ. 2. డుపోలె–కొన్ని ప్రతులు.

283. 1. తనూజుని – ఎ. ఘ.

284. 1. హోస్త్రంబు – వీ. శ. ష. స. 2, నడచి – ఇ. ఏ.

285. 1. పార్షద–ఉ; యనుచర–ఎ. 2. వర్గంబు–పెక్కు ప్రతులు. 3. గదిసి–కొన్ని ప్రతులు.

286. చ. కమలభవప్రదత్తవరగర్వితుఁడై మముఁ జీరికిం గొనం
డమితపరాక్రముండు దను[1]జాధిపుఁ డీతఁడు నీమహోగ్రకో
పమనుదవాగ్నియందు శలభంబునుబోలె నశించె వీనికిన్
సము లగువారు వెండియును జచ్చిరి [2]నూర్వురు దైత్యు లీయనిన్.

287. క. లోకత్రయంబునందును, నీకీర్తి వెలింగె నమరనికరము నేనుఁ
నీకింకరులము గుణర, త్నాకర రక్షింపు మమ్ము [1]ననిశము కృపతోన్.

288. వ. అని పలికె నప్పుడు పార్వ[1]తీసుందరుండు నిజనందనుఁ బునఃపునరాలింగ
నంబుల నభినందించి పురందరప్రముఖులం జూచి యిక్కుమా[2]రునందు
నాయం[3] దెట్లట్ల సభక్తికచిత్తులరై వర్తిల్లుం డని యాజ్ఞాపించి యనంతరంబ
భద్రవటంబునకుం జనియె నమరులు ప్రమదంబునం దమతమ నివాసంబులకుం
జని రివ్విధంబున.

289. ఉ. ఒక్కదినంబునందు బలియుండు సురారుల నెల్లఁ దున్మి పెం
పెక్క [1]దయార్ద్రుఁడై యభయ మిచ్చె జగంబుల కెల్ల షణ్ముఖుం
డిక్కథ భక్తితో వినిన నెప్పుడుఁ గీర్తన సేసినన్ జనుల్
నిక్కము సర్వదోషముల నీఁగి భజింతురు [2]భవ్యభద్రముల్.

290. వ. అని మార్కండేయుండు సెప్పినఁ బాండవులు సంతుష్టహృదయులై
యమ్మహాత్ముని బ్రశంసించిరి వారివ్విధంబున నభీష్టకథాగోష్ఠిం బ్రవర్తిల్లు
నెడఁ గృష్ణ[1]వల్లభ యైన సత్యభామయుఁ బాంచాలియు నేకతంబ యొక్క
యెడ బ్రియసల్లాపసంసక్తలై యుండి రప్పుడు సత్యభామ ద్రౌపదికి ట్లనియె.

---

286. 1. జాధము డీతడు - ఘ. జ. డ. స. 2. దైత్యులు మూర్వు రీయనిన్ - కొన్ని ప్రతులు.

287. 1. ననిశంబు కృపన్ - పెక్కు ప్రతులు.

288. 1. తీపతి, తీవల్లభుండు - అని భిన్నపాఠములు. 2. రు నెడ - కొన్ని ప్రతులు. 3. దెట్టు లట్టుల - ఇ.

289. 1. దయాళుడై - అ. ఐ. ఝ. డ. 2. సర్వసంపదల్ - శ. ష. కొన్ని ప్రతులు.

290. 1. వల్లభి - అ. గ. డ. శ.

-: సత్యా ద్రౌపదీసంవాదము :-

సం. 3 _ 222 _ 1

291. సీ. నీ ప్రియభర్తల నిర్మల[1]చరితులఁ బ్రకటతేజుల లోకపాలనిభులఁ
బార్థుల నీ వొకభంగిన వదలక చెలువ యెబ్భంగి భజింతు దగిలి
యొక్క [2]రొక్కనికంటె నువిద నీ కేవురు ననురక్తు లగుట యత్యద్భుతంబు
నగుమొగంబుల కాని [3]నలినాక్షి నీదెసఁ బతులకుఁ [4]గింకిరిపాటు లేదు.
తే. వ్రతము పెంపొ మంత్రౌషధవైభవంబొ, సరసనైపథ్యకర్మకౌశలమొ చతుర
విభ్రమోల్లాసరేఖయొ వెలఁది నీ వి,శేషసౌభాగ్యహేతు[5]వు సెపుమ నాకు.

292. క. ఏనును నీవలన నిజము, గా నిది యంతయును నెఱిఁగి కమలదళాక్షుం
బూని వశగతునిఁ జేసి య,నూనస్నేహాను[1]భోగయుక్తిఁ దలిర్తున్.

293. క. అని యడిగిన మది నించుక, గినుక వొడమ నడఁచుకొనుచుఁ గృష్ణ మృదులహా
సిని యగుచుఁ [1]గృష్ణభామినిఁ, గనుఁగొని యిట్లనియె నిర్వికారాకృతియై.

294. క. నను నిట్లు దుష్టవనితా,[1]జనము నటులుగాఁ దలంపఁ జనునే నీకుఁ
మన సొప్పదు పురుషోత్తము, వనితవు గాఁ దగవు నీవు [2]వనరుహనయనా.

295. వ. అని మేలంపుఁజందంబున దాని వివేకవిహీనత యెఱుకపడ నాడి పాంచాలి
మఱియు ని ట్లనియె.

---

291: 1. వృత్తుల - పీ. ప. 2. డొక్కని - పెక్కు ప్రతులు. 3. జాతి నీదెసనెప్పు-పీ. శ. ప. సూ. పెక్కు ప్రతులు. 4. గిన్క యెప్పాట - పీ. శ. ప. 5. వో సెపుమ - ఏ. చ. ఝ. డ. ద.

292. 1. భావ - వా; భోగ - పెక్కు ప్రతులు.

293. 1. సత్యభామం గనుగొని - గ. డ. శ. ప.

294. 1. జనముల నన్నట్లు దలప - డ; జనమట్టులుగాగ దలప - ఔ. 2. వనజదళాక్షీ - ఈ. ఐ. త.

296\. చ. అలయక మంత్రతంత్రవివిధౌషధభంగులఁ జేసి యొంతయుం
వలతురు సాధు[1]లంట మగువా కడు జేతనంబు దానముగా
గలిగిన [2]ప్రేమయుం బొలియుఁ గాని యొకండును సిద్ధిఁ బొంద ద
ప్పొలఁతుకతోడి [3]మన్కి యహిపొత్తుగఁ జూచు విభుం డెఱింగినన్.

297\. చ. మగువ యొనర్చు వశ్యవిధి మందులు [1]మాఁకులు నొందుచందమై
మగనికిఁ దెచ్చు రోగములు మూనక మూకజడాదిభావముల్
మొగి నొసరించు నద్దురితముల్ దన చేసిన చేఁత లై తుదన్
జగమున కెక్కి నిందయును సద్గతిహానియు నచ్చు నింతికిన్.

298\. క. కావునఁ బతులకు నెప్పుడుఁ, గావింపం దగదు కపటకర్మంబులు [1]త
ద్భావమెఱిఁగి యనువర్తిని, నై వనిత వర్తింప [2]నదియు యగు నెల్లవియున్.

299\. వ. పాండవులయెడ నే నెట్టిదాననై యిట్టి సౌభాగ్యంబు [1]గంటి నది నీకు
నెఱింగించెద నేర్పడ వినుము.

300\. సీ. పతు లాత్మ నొండొక్కపడఁతులఁ గలసిన నలుగ నెయ్యంబుల నహంకరింప
[1]మదముఁ బ్రమాదంబు మాని వారికిఁ జిత్త మేకముఖంబుగ నెల్లప్రొద్దు
భక్తి సేయుదుఁ జూపుఁ బలుకును గోర్కియుఁ[2] నెయ్యంబులు వింతగాఁ
జేయ నెపుడు
నమరగంధర్వయక్షాదులందైనను బురుషు నన్యునిఁ దృణంబుగఁ దలంతు
తే. స్నానభోజనశయనాదిసంప్రయోగ, మర్థిఁ బతులకు మున్నెందు నాచరింపఁ
బతులు వచ్చిన నాసనపాద్యవిధుల, భక్తితో[3] నేన కావింతుఁ దనువ నొరుల.

---

296\. 1. లంటిమగువా - ఘ. చ. 2. ప్రేమముం బోలియు - అ. ఔ. క. ఙ. ద.
3. యున్కి - ఙ; పొత్తు - ఔ. చ. ద.

297\. 1. మాయలు - పెక్కు ప్రతులు.

298\. 1. సద్భావ - కొన్ని ప్రతులు. 2. వలయు నతిహితబుద్ధిన్ - ఔ.

299\. 1. నొందితి - కొన్ని ప్రతులు.

300\. 1. మరుపు - ఔ. ఙ. ద. 2. స్నేహంబు - వా; నెయ్యులు - కొన్ని ప్రతులు.

301. చ. తగిరెడు వేళలందు నియతంబుగ మజ్జనభోజనక్రియల్
దగ నొడఁగూర్తు భర్తలకు ధాన్యధనంబులు రిత్తమై [1]వ్యయం
బగుటకు నోర్వనెప్పుడు గృహస్థలభాండవిశోధనంబు లి
మ్ముగ నొకనాఁడు నేమఱఁ బ్రమోదము సల్పుదు [2]బంధుకోటికిన్.

302. క. [1]పలుమాఱుం దలవాకిట, మెలఁగుట యసతీజనైకమిత్రత కలహం
బుల కెలయుట నగుపలుకులఁ, బెలుచ నగుట నాకుఁ గాని పేరివి మగువా.

303. క. పతు లిచ్చమెయిఁ బ్రవాస, స్థితు లైనం బుష్పగంధ[1]దీప్తాభరణ
ప్రతతి ధరియింపఁ దద్గత,మతి నగుచుఁ దదాగమంబ మదిఁ గాంక్షింతున్.

304. ఉ. [1]అత్తకు భక్తిగల్గి మది నాయమ సెప్పిన మాడ్కి [2]జీవికా
వృత్తము [3]లావహింతు గురువిప్ర[4]జనాతిథిపూజనంబు ల
త్యుత్తమభక్తి నేన [5]తగ నోపి యొనర్తుఁ బ్రియంబుఁ దాల్మియుక్
మెత్తఁదనంబు [6]సన్మతియు మేలుగఁ దాల్తు సమస్తభంగులన్.

305. క. కడు మృదువు లనుచుఁ దేఁకువ, సెడి యెపుడుఁ జరింప భరతసింహులు కోపం
బడరిన నాశీవిషముల, వడువునఁ గ్రూరు లని వెఱపు వదలక కొల్తున్.

306. సీ. [1]మాయత్తఁ బృథ్వీసమానఁ బృథాదేవిఁ గుంతిభోజాత్మజఁ గోమలాంగి
సతతంబు భోజనస్నానాదికములయం దిమ్ముగఁ బరిచర్య యేన చేసి
సంప్రీతఁ జేయుదు జనవంద్యుఁ డగు ధర్మతనయుని[2]బంతి నిత్యంబుఁ బసిఁడి
పళ్ళెరంబులఁ గుడ్చుబ్రాహ్మణు లతిపుణ్యు లెనిమిదివేలు సమిద్ధమతులు
తే. యతులు పదివేలు వారల కనుదినంబు, నన్నపానంబు లర్థిసహాయ నగుచు
నొడికముగ నేన కావింతు నుచితవస్త్ర, భూషణాదులఁ బరితోషముగ నొనర్తు.

---

301. 1. ప్రయంబగుటకు (?) శ. ష. పెక్కు ప్రతులు. 2. వారికెప్పుడున్ – ఇ. ఏ. ఝ.

302. 1. పలుమరు దలవాకిటికై – ఝ. ల; పలుమరు దలవాకిటికిని – కొన్ని ప్రతులు.

303. 1. దివ్యాభరణ – కొన్ని ప్రతులు.

304. 1. ఉత్తమ భక్తిగల్గి పతులొప్పగ – జ. ఝ; ఉత్తమభక్తి నేనతగనోపి యొనర్తు–గు. 2. చేటికా – జ. ట. పీ. స. 3. లాచరింతు – ల. 4. సురాతిథి – పెక్కు ప్రతులు. 5. కడు – ఆ. ఈ. ఐ. త. 6. సంతసము–వీ. శ. ష. పెక్కు ప్రతులు.

306. 1. మాయత్త పృథ్వీసమాన పృథాదేవి – ప్రా. 2. పంక్తి – కొన్ని ప్రతులు.

307. వ. మఱియు ధర్మరాజు నగరియందుఁ గనకమణిమయభూషణాలం[1]కృత లయిన పరి[2]చారకులు నూఱువేలు రేయును బగలును బాత్ర[3]హస్తులై యభ్యాగతభోజనంబు లొడఁగూర్చువారు నందఱ కలరు వీరెల్ల నిట్టిట్టి మెలఁకువ మెలంగుదు రని తత్కృతాకృతంబు లేన యెఱుంగుదు నిరంతర మదధారాతరంగితకపోలంబు లయిన భద్రగజశతసహస్రంబులుఁ బ్రభూత జవసత్త్వ[4]సన్నుతంబు లయిన యుత్తమాశ్వశతసహస్రంబులుం గలవు వానికి నన్నింటికి నిత్యోచితంబు లైన ఖాద్యంబు లొనరింపను బాలింపను దగినవారి నేన నియమింతు నఖండభాండాగారపూరితంబు లైన యగణ్యామణికనకాది [5]వస్తువులును బ్రతిదినవిహితంబు లయిన యాయవ్యయంబులు నా యెఱుం గని యవియు లేవు గోపాలజనంబులు దుదిగాఁ గల సకలభృత్యజనంబుల జీవితంబుల నరసి యేన నడపుదుం బరమయశోధను లగు పాండునందనులు నిజకుటుంబభారంబు సర్వంబు నాయంద సమర్పించి తారు నిర్భరులై యిష్టవిహారంబుల నుండుదు రే నెల్ల వెంటల నప్రమత్త నై వర్తింతు.

308. ఆ. వేగ జాము గలుగ వెడనిద్రఁ బొందుదుఁ, గాని రాజ్యభారకార్యయుక్తి
నబ్జనయన నాకు నాహారనిద్రల, [1]కెడయు లేదు సువ్వె యెల్లప్రొద్దు.

309. ఆ. ఇట్టి వర్తనముల నెపుడుఁ బాండవులకుఁ, [1]దగిలి ప్రియము సేయఁ దగితిఁ గాని
మగువ నీవు సెప్పు మందులు మాకులు, నింద్రజాల[2]ములును నే నెఱుంగ.

310. వ. అనిన విని లజ్జాకలితచిత్త యగుచు సత్యభామ పాండవభామిని కి ట్లనియె.

311. క. ఏ నెఱుఁగ[1]మి నిట్లడిగితి, నా నేరమి సైఁపవలయు నగవుగఁ గొనుమీ
మానిని నాపలుకులు సన్మానితము భవచ్చరిత్రమహిమ ధరిత్రిన్.

312. వ. అనినం బాంచాలి మందస్మితానన యగుచు నది యట్ల కాక యని పలికి మఱియు నిట్లనియె.

---

307. 1. కృతలైన - ఇ. ఝ. 2. చారికలు - కొన్ని ప్రతులు. 3. హస్త - ఝ. 4. సంపన్నంబులైన - పెక్కు ప్రతులు. 5. సమస్తవస్తు - పెక్కు ప్రతులు.

308. 1. కెడము - వీ. ష. సూ.

309. 1. దగిన ప్రియము - కొన్ని ప్రతులు. 2. ములును నెరుగ నేను - కొన్ని ప్రతులు.

311. 1. క యిట్లాడితి - పెక్కు ప్రతులు.

-: ద్రౌపది సత్యభామకుఁ బతివ్రతాధర్మంబులు సెప్పుట :-

సం. 3_223_1

313. క. పతి మనసు [1]నాఁచికొనియెడు, చతురోపాయంబు నీకుఁ [2]జపలాక్షి [3]సుని
శ్చితమతిఁ జెప్పెద విను మూ, ర్జితమును ధర్మాన్వితము సుశీలంబునుగన్.

314. చ. [1]పతిఁ గడవంగ దైవతము [2]భామల కెందును లేదు ప్రీతుఁడై
పతి గరుణించెనేనిఁ గలభాషిణి [3]భాసురభూషణాంబరా
న్విత ధనధాన్యగౌరవము విశ్రుతసంతతియున్ యశంబు స
ద్గతియును గల్గు నొండుమెయిఁ గల్గునె [4]యెన్ని తెఱంగు లారయన్.

315. ఆ. కరము దుఃఖపడినఁ గాని యొక్కింత సౌ, ఖ్యంబు ధర్మగతియుఁ
గలుగ దెందు
జూడు మబల భర్తృశుశ్రూషఫలము సం, తత[1]శుభంబు గలదు [2]ధర్మ వొదవు.

316. క. కావున [1]నిత్యము సమ్య, గ్భావము ప్రేమంబు [2]వెరవు భక్తియుఁ బ్రియముం
గావింపుము [3]నీప్రియునెడ, భావముఁ దా నెఱిఁగి భర్త బాగుగ మరగున్.

317. మ. వనజాక్షుండు గడంగి నీదగుగృహద్వారంబు సేరంగ వ
చ్చెననంగా విని లెమ్ము సంభ్రమముతోఁ జెన్నొందునభ్యంతరం
బునకున్ వచ్చిన నాసనాదికరణంబుల్ దీర్పఁ దత్తజ్జనం
బు నియోగించితి నంచు నుండక ప్రియంబుల్ సేయు మీవుం దగన్.

---

313. 1. గాచికొనియెడు - ద. ల. 2. జలజాక్షి - ఓ. 3. సుసమ్మతమతి-గ.

314. 1. పతి మిగులంగ - పెక్కు ప్రతులు. 2. భామిని కెందు - కొన్నిప్రతులు. 3. భాసితభూషణాంబర - పెక్కు ప్రతులు; భావిత - ద. 4. యెన్ని తెఱంగు - ఆ. ఔ. ద. శ; యిన్ని తెఱంగు - వా. కొన్ని ప్రతులు.

315. 1. సుఖంబునందు; సుఖంబుదనరు - అని భిన్నప్రతులు. 2. ధర్మమొదవు, ధర్మ మొందు - అని భిన్నప్రతులు.

316. 1. నిత్యంబును సద్భావము - ఆ. ఝ. 2. వెరవు - ఔ. జ. ఝ. 3. ప్రియు నెడనీ భావ మెఱిఁగి యతఁడు దాన పైఁబడు ప్రీతిన్ (మరగున్) - వీ. శ. ప. స. కొన్ని ప్రతులు.

318. చ. తివిరి మురారి నీకుఁ గడుఁ దీపుగఁ జెప్పినపల్కు గగ్గినఁ
గువలయ[1]నేత్ర నీమనసుగూడినవారికి [2]నైన నెప్పుఁ జె
ప్పవలదు దాన నొండొక నెపంబు ఘటింతు రెఱింగిరేని నీ
సవతులు కృష్ణుబుద్ధి విరసం బగు నీదెసఁ దత్ప్రయుక్తి చేన్.

319. చ. పతికి ననుంగు లైన తగుబంధుల మిత్త్రుల భోజనాదిస
త్కృతముల నాదరించుచు నకృత్రిమభక్తి [1]నియుక్తి [2]సంతతో
త్థితమతి వై చరింపుము తదీయహితేతరవృత్తు లైన వా
రతివ భవత్సుహృజ్జనము లైనను గైకొన కుండు మెప్పుడున్.

320. క. [1]విను ప్రద్యుమ్నాదిభవ, త్తనయుల[2]యొడనైన నేకతంబున నేకా
సనమున నుండుట దూష్యం,బని యెఱుఁగుము సతులకిది యతి[3]దుష్కర
ముల్.

321. క. కులవతులును సతులును ని,ర్మలమతులును నయిన యట్టిసుగుణులతోడం
జెలిమి యొనరించునది దు,ర్విలసితవనితాభియుక్తి విడుము తరుణీ.

322. వ. ఇది నీకుఁ బరమసౌభాగ్యమూలం బయిన యుపాయం బనినం బ్రీతచిత్తయై
సత్యభామ యి ట్లనియె.

323. సీ. నీవు ధర్మజ్ఞవు [1]దేవసన్నిభులు నీభర్తలు మహనీయకీర్తి[2]ధనులు
ధైర్యతేజోబలశౌర్యసంపన్నులు గావున వీరికి నేవిధమున
ధారుణీరాజ్యంబు సేరెడుఁ దడయక మీ కెగ్గు సేసిన లోకనింద్యు
చరితుండు గౌరవధరణీశువనితలు దిక్కులే కలమటఁ బొక్కుచుండఁ

తే. గని ముదంబునఁ బొందెదు వనిత నీవు, సుతుల సద్వంశనిర్మలమతుల శౌర్య
యుతులఁ గాంచిన సద్గుణాన్వితవు వగవ, వలదు చిత్తంబులో నీకు
జలజనయన.

---

318. 1. నేత్రి-శ. కొన్ని ప్రతులు. 2. నైనఁ జెప్పఁగా వలవదు - శ. ప - ప్రాస.?

319. 1. విశేషసంతతో - వీ. శ. ష - పెక్కు ప్రతులు. 2. సంతతస్థితమతివై - అ. త.

320. 1. 'ట' ప్రతిలో 320, 321 పద్యములు లేవు. 2. గెడనైన - మా. 3. దుర్భర
ముల్ - ఉ.

323. 1. నీపతుల్ దేవతామూర్తులు - అ. ప్రాసయతిభంగము 2. విధులు - ఈ. ప.
త; ఘనులు - ద.

324. వ. ప్రతివింధ్యాదు లయిన నీపుత్త్రు లేవురు నిప్పుడు వచ్చి యదుపురంబున నున్న వారు వారికి నొక్కటం గొఱంత లేదు రుక్మిణియు సుభద్రయుం దక్కిన వారలు నక్కుమారుల యెడం దమ కొడుకులకంటె గారవంబు సేయుదురు [1]వారి దెస నిశ్చింతవు గమ్మనియె నయ్యవసరంబునం గృష్ణుండు పాండవుల వీడ్కొని మార్కండేయాదివిప్రజనంబు నామంత్రణంబు సేసి గమనోన్ముఖుం డగుటయు సత్యభామ యాజ్ఞసేనిం గౌఁగిలించుకొని సగౌరవంబుగా వీడ్కొనియె నంత వాసుదేవుండును బ్రియాసహితంబుగా రథారూఢుండై [2]ద్వారవతీపురంబున కరిగె మార్కండేయుండును బాండవేయుల నాశ్వాసించి నిజాశ్రమంబునకుం జనియె నని చెప్పిన వైశంపాయనునకు జనమేజయుం డి ట్లనియె.

325. క. వనము[1]ల ని ట్లనిశంబును, ఘనతరదుఃఖానుభవవికల్పితు లగుచున్
మనుజోత్తము లప్పార్థులు, జననుత యట మీఁద నెట్లు [2]చరియించిరొకో.

326. వ. అనిన నమ్మునీశ్వరుం డి ట్లని చెప్పెఁ గృష్ణుండు సనిన యనంతరంబ పాండవులు గామ్యకవననివాసంబు పరిత్యజించి యనేకవనశైలనదనదీవిశేషంబు లాలోకించుచు ద్వైతవనంబునకుం జని [1]యం దున్న యెడం గరిపురంబున నుండి యొక్క బ్రాహ్మణుండు సరసకథాకథనకుశలుండు సనుదెంచి కౌంతేయులం గని [2]యుచితసల్లాపంబుసేసి [3]మగిడి ధృతరాష్ట్రు పాలికిం జనిన [1]న మ్మహీపాలుండు పాండవుల కుశలం బడుగుటయు నవ్విప్రుండు వా రేవురు ననవరతశీతవాతాతపకర్శితాంగు లై బహుదుఃఖసాగరంబున మునింగియున్న వా రనియును [4]వీరనాథ యయ్యును ననాథయుంబోలెఁ బాంచాలి పరమశోకార్త యై యున్నది యనియుం జెప్పిన విని వైచిత్రవీర్యుండు విషణ్ణహృదయుండై కన్నీరు దొరుఁగం గొండొక సేపు వలుక కుండి పదంపడి నిట్టూర్పు నిగిడించి గద్గదకంఠుం డగుచు ని ట్లనియె.

---

324. 1. వారియందు — కొన్ని ప్రతులు. 2. ద్వారావతీ, ద్వారకాపురంబు — అని భిన్న ప్రతులు.

325. 1. వ — కొన్ని ప్రతులు. 2. సలిపిరి చెపుమా — ఊ. స.

326. 1. రట్టియెడం — వా; యందున్న — పెక్కు ప్రతులు. 2. సముచిత — డ. 3. మగుడి — కొన్ని ప్రతులు. 4. వీరనాథసనాథయయ్యును — ల.

-: ధృతరాష్ట్రుఁడు పాండవుల వనవాసక్లేశంబునకు దుఃఖించుట :-

సం. 3 - 225 - 8

827. క. నాచేసిన కీడునఁ గడు, నీచుం డగు నాతనూజు నేరమి నిమ్మై
నోచెల్ల పార్థులకుఁ బు, ణ్యాచారుల కెందు లేని యాపద వచ్చెన్.

828. క. నాపెద్దకొడుకు ధర్మజుఁ, డాపురుషవిభూరు ధీరుఁ గౌరవకులసం
దీపకు నివ్విధమున సం, తాపితుఁగాఁ జేసె నే[1]విధాత్రుఁ డదయుఁడై.

829. చ. అమలనివాతసౌధములయందు మనోజ్ఞమరాళతూలత
ల్పముల శయించి రేపులు శుభస్తుతి మాగధసూతగీతనా
దములఁ [1]ప్రబోధముం బొరయు ధర్మసుతుం[2]డు కఠోరభూమిభా
గమున శయించి మేల్కను సృగాలనినాదవిదీర్ణకర్ణుఁడై.

830. క. నాగాయుతసత్త్వుఁడు ది, ఙ్నాగాయత[1]బాహుఁ డనిలనందనుఁడు మహో
ద్వేగాత్ముఁ డగుచు డస్సిన, నాగముక్రియ నుండెనొక్కొ నవసి వనమునన్.

831. ఉ. అన్నలుఁ దమ్ములుం బతియు నార్తి మెయిం [1]ఘనాంబుమగ్నులై
యున్న తెఱంగు సూచి విజయుండు యుధిష్ఠిరవాక్యబద్ధుఁడై
సన్నుతుఁ డుగ్రపన్నగము చొచ్చిన రోఁజుచుఁ గ్రోధశోకవే
గోన్నతి నాత్మ నేమనుచు నుండునొ నాసుతుఁ డప్పు డెన్నుచున్.

832. క. అక్కట మృదుగాత్రులు గడుఁ, జిక్కనిమనసులు కుమారసింహులు గవ లిం
పెక్కిన సుఖముల కర్హులు, స్రుక్కి [1]నవయ నోర్వ యునికి చోద్యం బరయన్.

833. వ. అని పలికి [1]వెండియు.

---

828. 1. విధాత యదయుఁడై - ఓ. ల.

829. 1. ప్రమోదముం - వా. వీ. పెక్కు ప్రతులు; ప్రబోధముం - ప. చ. 2. డకొకానభూమి - వా; దుకఠోర - పెక్కు ప్రతులు.

830. 1. బాహుడు - ఈ. ఐ. త; బలుడు - అ. ఝ.

831. 1. బటుదుఃఖ - పెక్కు ప్రతులు.

832. 1. యడవి నవయు చున్కి - క.

833. 1. గ. ఘ. వీ. శ. ష. ప్రతులలో 'వెండియు బ్రాహ్మణునితో భీమునిదలంచి ధృతరాష్ట్రుం డిట్లనియె' అని అధికపాఠము.

334. చ. అనుపమతేజుఁ డున్నతభుజాగ్రుఁ డు[1]దగ్రుఁడు వైరినిగ్రహుం
డనఘుఁడు వాయుసూనుఁడు నిజాగ్రజు చేసిన సత్యపాశబం
ధనమునఁ జిక్కి తత్సమయతత్పరుఁడై యిటు ఘోరదుఃఖవే
దనములు సైఁచెఁ గాక మది తద్దయుఁ గ్రోధమయంబు వానికిన్.

335. సీ. శకునికై తవము దుశ్శాసనుచేసిన దుష్కర్మమును గర్ణు తులువతనము
దుర్యోధనుని దైన[1]దుర్ణయంబును జిత్తమునఁ [2]గిరిశల్యముల్ వోలె నలఁప
దావాగ్ని తెఱఁగున దరికొని క్రోధంబు వనవాసమని యెడు [3]వాయుగతుల
నంతకంతకుఁ బేర్చి యవయవంబుల నెల్ల మండంగ నెప్పుడు మధ్యముండు

ఆ. మొగము జేవురింప ముడివడుబొమలతో, నవుడుగఱచుచును భయంకరముగ
నున్నరూపు వాయకుండు నామది వాఁడ, మిత్తి నాదు పుత్త్రమిత్త్రతతికి.

336. క. అంతకసుతు హృదయంబున, నంత గలుగ నేర దలుక యర్జును మదిలో
నంత గలుగ దమ్మారుతి, యంతకనిభుఁ డధికరోషుఁ డనవరతంబున్.

337. తే. అర్జునానిలప్రేరితం బగుచుఁ బేర్చి, వాయుతనయదవాగ్ని దుర్వారభంగిఁ
గర్ణసౌబలసహితముగా మదీయ, పుత్త్రశతకాననము వేసఁ బొదువకున్నె.

338. క. అగుఁగాక కర్మఫలములు, దగఁ గుడువక పోవ వశమె దైవకృతంబుల్
మగుడునె కౌరవ్యులకుం, దెగు కాలం బయ్యె వగపు తెరు వింకేలా.

339. క. ఏను వలదన్న జూదము, [1]మానఁడ సుతు దుర్ణయంబు మగిడింపక దు
ర్మానమునఁ గులక్షయసం, ధానమునకుఁ దొడఁగితిని విధాతృని చెయిదిన్.

340. తే. రాత్రి తెగుదల దిన మేల రాకయుండు, [1]దినము తెగుదల రాత్రి యేతేరకున్నె
పరగ సుఖదుఃఖములు గాలపర్యయమున, నెందు మనుజులఁ[2]బొందక యేల
[3]యుడుగు.

---

334. 1. దగ్ర విరోధి నిగ్రహుం – ల; దుర్జయవైరి నిగ్రహుం – ఇ. ఏ. ఓ. చ.

335. 1. దుర్నయంబును – ష. 2. గిరశల్యముల్ వోలె – శ; గిలిశల్యముల్ వోలె – ల; 3. వాయువశత – ల.

339. 1. మానదె – ఊ. ఐ. క. చ. జ. ల; మానడె-కొన్ని ప్రతులు; మానఁడు – పీ. శ.

340. 1. దివము – ఎ. ఐ. క. చ. ఝ. 2. పొదువక – స. 3. యణగు – ఇ. ఏ. ఠ; యుండు – కొన్ని ప్రతులు.

341. ఉ. మేలున సంతసిల్లు నెడ మేకొని యాపద లొందు [1]నాపదల్
దూలఁగ [2]భూరిసౌఖ్యములు దోఁచుఁ గృతంబులు [3]దప్ప వెమ్మెయిం
బోలఁగ నింతయుం గని ప్రబుద్ధమనస్కులు ఖేద[4]మోద[5]ని
ర్గాళితధైర్యసాగరులు [6]గాక సుఖింతురు సర్వకాలమున్.

342. చ. సిరికిఁ దొలంగి కానల వసించి కృశించిన పార్థుఁ [1]డట్టె ని
ర్జరుల వరంబునం బరమసమ్మదలీల మహాస్త్రలాభవి
స్ఫురణముఁ బొంది యద్దివికిఁ బోయి శరీరముతోన క్రమ్మఱన్
ధరణికి వచ్చె నిట్టివి గదా వివిధాద్భుతకర్మపాకముల్.

343. క. గాండీవము [1]విల్లఁట యా,ఖండలనందనుఁడు విల్లుగలవాఁ డఁట త
త్కాండంబులు దివ్యము లఁట, యొండేటికి [2]వారిధనమ యుర్వియు
సిరియున్.

344. వ. అని ధృతరాష్ట్రుండు బహువిధంబు[1]లగుపలుకులు వలుక విని దుర్యోధనుండు శకునిం జూచి యీ రాజేల యింత భీతుం డయ్యె [2]ననుచు నతండునుం దానును గర్ణసహితుండై యొక్కవివిక్తప్రదేశంబునకుం జని కార్యాలోచనంబున నున్నయెడం గర్ణుం డిట్లనియె.

345. సీ. పాలితశౌర్యులు పాండవేయులు దుఃఖ[1]శీలురై యడవులపాలు వడిరి
ధరణీశ తొల్లి యింద్రప్రస్థపురమున ధర్మనందనుపాలఁ బేర్మితోడ
శోభిల్లుచున్న విశ్రుతలక్ష్మి నీబుద్ధిబలమున నిన్నుఁ బెంపొలయఁ బొందెఁ
బరువడి దక్షిణపశ్చిమోత్తరపూర్వదేశస్థు లయిన మహీశు లెల్ల

తే. నీక యరిగాపు[2]లై రిప్పు నిఖిలజలధి, శైలకాననద్వీపవిశాల మయిన
మహి సమస్తంబు నేలుము మహిమ యెసఁగ, లీల నింద్రుండు సురలోక
మేలునట్లు.

---

341. 1. నాపదం - పెక్కు ప్రతులు. 2. బూని - ల. వా. పీ. శ. ష. 3. దప్పు నెమ్మెయిన్-డ. 4. మొందరే కాలము - ఈ. ఐ. త. శ. 5. నిఃక్షాలితధైర్య సాగరులు - వా. 6 గాన-జ; గాగ - ఊ. శ.

342. 1. డట్టి - ర. డ. ల. స; డట్టు - ఏ.

343. 1. విల్లట - ఎ. పీ. ష. 2. నతని ధనమ - పెక్కు ప్రతులు.

344. 1. లం బలుకు పలుకులు విని - కొన్ని ప్రతులు. 2. నని నగుచు నతండు - కొన్ని ప్రతులు.

345. 1. శీలులై - అ. ఆ. ఇ. ఊ. ఏ. క. ఘ. చ. జ. ఠ. డ. ద. శ. 2. లై రిపు - ఝ. స.

-: కర్ణ శకుని దుర్యోధనులు మంతనంబుసేయుట :-

సం. 3 _ 226 _ 9

346. ఉ. జానపదుల్ పురీజనులు సంతతముం బ్రమదం బెలర్ప నీ
దైన శుభోదయంబ హృదయంబులఁ గోరుచు నున్నవారు స
మ్మానము నొంది కౌరవసమాజము నిన్ను భజింప భూరి తే.
జోనిధి వై వెలింగెదవు సూర్యుని చాడ్పున నీవ యిమ్మహిన్.

347. వ. పాండవు లిప్పుడు పరమదుఃఖార్తు లగుచు ద్వైతవనసరోవరసమీపంబున నున్నవా రని వింటిమి నీవు సకలసామ్రాజ్యవిభవంబు మెఱసి చని యందు నీతేజంబు ఘర్మసమయంబు నాఁటి తపనుతేజం బై పగతురకన్నులు [1]గమర నతిదుస్సహం బగునట్లుగాఁ జేయుము దొల్లి నహుషపుత్త్రుం డయిన యయాతియుంబోలె నుజ్జ్వలుండ వై యున్ననిన్నుం జూచి పాండవులు హృదయ[2]ఖేదంబుగా వగచెదరు మిత్రజనమోదంబును శత్రుజన ఖేదంబునుం గదా సంపదలకుం దగియెడు ఫలంబు.

348. క. ధనధాన్యపుత్త్రబాంధవ, జనలాభంబులును దలఁప సరిగావు సుఖం
బునఁ దాను దనరి శత్రులు, ఘనతరదుఃఖముల [1]నుండఁ గని యలరుటకున్.

349. ఉ. నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులో విప
ద్భారము నొంది వందురిన ఫల్గును నుజ్జ్వలరాజ్య వైభవో
దారుల మై [1]కనుంగొని ముదంబునఁ బొందఁగఁ గాంచుకంటె నిం
పారఁగ నొండు గల్గునె కృతార్థత యెందును గౌరవేశ్వరా.

350. తే. అతుల సౌభాగ్య [1]పుణ్యసమగ్ర[2]గరిమ, నొప్పుచున్న నీ[3]దేవుల యొప్పు సూచి
ధృతి దఱిఁగి తన్నుఁ దాన నిందించు కొనుచు, హృదయమునఁ
పాండవాంగన యెరియ వలదె.

---

347. 1. గదుర - వా. కొన్ని ప్రతులు; గమర - కొన్ని ప్రతులు. 2. వేదనగా-ఇ ప.

348. 1. బొందగని - కొన్ని ప్రతులు.

349. 1. కనుంగొను - వా. సూ; కనుంగొని - కొన్ని ప్రతులు.

350. 1. భాగ్య - కొన్ని ప్రతులు. 2. మహిమ - కొన్ని ప్రతులు. 3. యువిదల - కొన్ని ప్రతులు.

351. వ. అనిన నిది వోలు నని నాగకేతనుండు సంప్రీతుం డై కొండొక విచారించి
రాధేయుం జూచి యి ట్లనియె.

352. క. నాతలఁపును నిట్టిది నీ, వేతెఱఁ గెఱిఁగించి తట యభీష్టము మన మా
ద్వైతవనంబున కరుగుట, భూతలపతి యనుమతింపఁ డోలదు మనకున్.

353. తే. అందుఁ బాండవు లుండుట యాంబికేయుఁ
డెఱుఁగు మన మవ్వనంబున కేఁగుటయును
గడఁగి పార్థులతోడి విగ్రహము [1]కోఱక
యని యపశబ్దంబు వాటించు నతఁడు మనల.

354. వ. అదియునుంగాక.

355. చ. ఉరుతరవిక్రమాఢ్యు లనియుం మహనీయతపోవిశేషసు
స్థిరు లనియుం బృథాసుతుల దిక్కునఁ దద్దయు భీష్ముఁ డై నిరం
తరమును మానవేంద్రుఁ డెదఁ దాపము నొందుచు నుండు నింక యి
క్కురువిభుఁ డింత సేపు గడుఁ గూర్చి విలాపము సేసె వాఁకిటన్.

356. వ. అతని యొద్దనుండి విదురుండును వారిన [1]పెట్టుచోటు గానక [2]పోఁగడు
చుండు జూదంబునాఁటనుండియు విదురుండు పాండవపక్షపాతి యగుట
దెల్లం బయ్యె మనవిచారించిన యీకార్యంబు [3]చిన్నసన్న దెలిసెం గ
నేనియు నాతం డెల్లభంగుల విఘ్నంబు సేయుం గావున నిది యంతయు
రహస్యంబుగా నొనరించికొని ధృతరాష్ట్రుండు దీని కనుమతించునట్లుం
గెయ్యది యట్టి యుపాయంబు నీవును శకునియు నూహింపుఁడు మనము
రేపకడ వచ్చి కురుపితామహుం డైన భీష్మునిఁ గురువంశోత్తముం డైన
[4]ధృతరాష్ట్రుని నొడం బఱిచి వెడలుద మని వారి వీడ్కొలిపి దుర్యోధనుం
డభ్యంతరగృహంబున కరిగి యారాత్రి సముచితప్రకారంబునఁ గడపెఁ
బ్రభాతంబగుటయుఁ గర్ణుండు దుర్యోధను కడకుం [5]జని యి ట్లనియె.

---

353. 1. కోర్కి యని – శ. ష.

356. 1. పోటు మానిసులుగా బోగడుచుండు – వా. పీ. శ. ప. 2. పోగులుచుండు – ఇ. ఏ. ఝ. ట. 3. చిన్న – కొన్ని ప్రతులలో లేదు. 4. వైచిత్రవీర్యుని – పెక్కు ప్రతులు. 5. జను దెంచి – పెక్కు ప్రతులు.

357. ఉ. భూతలనాథ యే నొకటి పోల నుపాయము గంటి నిప్పుడా
ద్వైతవనంబునందు విదితంబుగ నున్నవి గోకదంబముల్
ప్రీతిగఁ దద్విలోకనము పేరఁ జనం దగు ధారుణీశ్వరుం
డీతెఱఁ గైనఁ [1]బొమ్మనుఁ నభీష్టముఁ జేకుఱు నెల్లభంగులన్.

358. క. నా విని సుబలతనూజుఁడు, దేవా నీయాన యేను దెల్లంబుగ రే
యీ వెరవె [1]నెమ్మనమ్మున, భావించితి ననియె నంతఁ బ్రహసితముఖులై.

359. వ. ఒండొరుల చెయి సఱచి నవ్వుచు నమ్మువ్వురుం దక్షిణంబ సమంగనామ
ధేయుం డయినగోపాలకు [1]నొక్కనిం గఱపికొని ధృతరాష్ట్రు[2]పాలికిం
దోడ్కొని సముచితప్రసంగసేవావిశేషంబుల నమ్మహీవిభు సుముఖుం జేసి
యనంతరంబ దేవా ద్వైతవనంబు నందులకీలారంబుననుండి వీఁడె యొక్క
గోపకుండు వచ్చె ననిన నతండును వాని కభిముఖుండై పసులసేమం
బడుగుటయు వాఁ డి ట్లనియె.

-: కర్ణసౌబలులు ధృతరాష్ట్రుచేత ఘోషయాత్ర కనుజ్ఞ గొనుట :-

సం. 3 _ 227 _ 2

360. ఉ. ద్వైతవనంబునట్టి సుఖవాసము గోవుల కెందు లేదు ధా
త్రీతలనాథ యిప్పుడు ప్రదీప్తములై సతతంబుఁ బేర్చి గో
వ్రాతభయంకరంబు లగువాలు [1]మృగంబులు సంచరించు మీ
కాతెఱఁ గెల్లఁ జెప్పుటకు నై యిట వచ్చితి నేను జెచ్చెరన్.

361. వ. అనిన యనంతరంబ కర్ణసౌబలులు ధృతరాష్ట్రుతోడ దేవా యట్లయినం
దడయక [1]దుష్టమృగనాశనంబును గోగణసంరక్షణంబును జేయుటకు భవ
త్సూను దుర్యోధను నియోగింపు మనిన నతండు గొండొక విచారించి యి
ట్లనియె.

---

357. 1. బొండను — కొన్ని ప్రతులు.

358. 1. నాదుమనమున — ఇ. ల.

359. 1 నొక్కరుం — కొన్ని ప్రతులు. 2. పాలికిం జని — వా. కొన్ని ప్రతులు; పాలి
కిందోడ్కొని సని — ఈ. ఊ. ఎ. ఐ. ఒ. చ. ఝ. డ. త. ద. ల.

360. 1. మెకంబులు — క. ఙ.

362. మ. తగు గోరక్షయొనర్ప దుష్టమృగవిధ్వంసంబు [1]నూహింప నే
లగు నైనన్ వినుఁ డవ్వనాంతరమునం దాసక్తిమై నున్నవా
రు గరిష్ఠాత్ములు పాండురాజుతనయుల్ రూఢప్రతాపాఢ్యు లి
ట్లగుటన్ మీగమనంబు నామదిఁ బ్రియం బై [2]తోఁచ దెబ్బంగులన్.

363. చ. వనమున [1]కేఁగి వందురిన [2]వారని వారల మీ రవశ్యముం
జెనకఁ దలంతు రప్పురుషసింహులు భూతతపో[3]నిధుల్ మునం
బునఁ గలుషించి రేనియుఁ దపోమహిమన్ మిము నిగ్రహింతు రొం
డె నతులితాస్త్రశక్తిని వడిం దుదుమాడుదు రాజి [4]నందఱన్.

364. క. మున్నును మీచేతఁ గడున్, బన్నము వడి నొచ్చినారు పార్థులు మిమ్ముం
గన్నంత నలుగ కుందురె, పన్నగరిపు[1]సన్నిభుండు పవనజుఁ డున్నన్.

365. వ. అదియు[1]నుం గాక.

366. చ. ఒకరుఁడ ధాత్రియంతయును నోర్చెఁ గృతాస్త్రుఁడు గాక యుండియుం
బ్రకటితబాహువిక్రముఁడు ఫల్గునుఁ డిప్డు [1]మహేంద్రుపాల న
త్యకుటిలదివ్యబాణవిదుఁడై యెలమిం జనుదెంచె నట్టివా
నికి నెదురంగ శక్య మగునే రణభూముల నింక నేరికిన్.

367. తే. [1]చెనకి మీరు వారికిఁ గీడు సేయుటయును, వారు [2]మీకెగ్గు సేయుటయు
వగవ మేలు
గాదు వలసిన ఘోషరక్షణ మొనర్పఁ, దగినవారలఁ బుత్తెము దడయ
[3]కుండు.

362. 1. గావింప - ఎ. ల. 2. యుండ దెబ్బంగులన్ - కొన్ని ప్రతులు.

363. 1. నోసి, నొచ్చి, నోర్చి, నోపి - అని పాఠములు. 2. వారిని పాండు నృపాల పుత్త్రులం జెనక - ర. 3. ధనుల్ - ఝ; పి. శర. సూ. 4. నిందఱన్ - ద. ల. స.

366. 1. మహేశుచేత - ర.

367. 1. చెనసి - కొన్ని ప్రతులు. 2. మీకు జేయుటయును - పెక్కు ప్రతులు. 3. కిద్దు - కొన్ని ప్రతులు.

368. వ. అని యొడంబడ కున్న నయ్యాంబికేయునకు శకుని యి ట్లనియె.

369. ఉ. పాలితవిక్రమోన్నతులు [1]పాండుతనూజులు వారి కప్రియం
బేల యొనర్తు మే మధిప యే మటు సేసితి మేనియుం బ్రతి
[2]జ్ఞాలపితుండు ధర్మజుఁడు సత్యము దప్పునె తమ్ము లేల త
చ్ఛీల మతిక్రమింతు రది సిద్ధము నమ్ముము నెమ్మనంబునన్.

370. క. మాకును జిత్తంబుల మృగ, యాకౌతుక [1]మతిశయిల్లినది గోగణర
క్షాకరణము గార్యం [2]బలె, యేకీడును నేల పొందు నిందు మహీశా.

371. క. అనిన నతఁడు గొండొకవడి. మనమున [1]నూహించి బుద్ధిమంతులరై గో
ధనము నరసి తడయక రం, డని [2]వారికి నెట్టకేల కనుమతి యిచ్చెన్.

372. ఆ. ఆక్షణంబ కౌతుకాతిశయవ్యగ్ర, హృదయుఁ[1]డైన ఫణధరేంద్రకేతు
నాజ్ఞఁ గరిపురంబునం దెల్లఘోషింపఁ, బడియె ఘోషయాత్రప్రకటలీల.

—: దుర్యోధనుఁడు ఘోషయాత్రవోవుట :—

సం. 3 - 228 - 23

373. సీ. అంతఁ బ్రహృష్టాత్ముఁడై లలితాంబరాభరణాంగరాగ విస్ఫురితమూర్తి
నొప్పారి విభుఁడు సహోదరులును గర్ణగాంధారులును బ్రియబాంధవులును
సముచితవాహనసైన్యసమేతులై కొలువంగ వెడలె నుజ్జ్వలవిభూతి
నాందోళికాదివాహనములఁ దత్ప్రియప్రమదలు బహుసహస్రములు సనిరి
ఆ. కడఁగి పౌరు లెల్లఁ గై సేసి పడఁతులుఁ, దారు నడచి రతిముదంబుతోడఁ
బ్రకటశకటవైశ్యపణ్యాంగనాది [1]సం, కులత నుల్లసిల్లె ఘోషయాత్ర.

---

369. 1. పాండవ సింహులు - ల. 2. జ్ఞాలలితుండు - వీ. శ. ష. పెక్కు ప్రతులు.

370. 1. ముల్లసిల్లినది - ల. వీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. బిది - ల.

371. 1. జింతించి - వీ. శ. ష - పెక్కు ప్రతులు. 2. వారల కెట్టకేల కనుమతి - కొన్ని ప్రతులు; వారికి ఘోష యాత్రకానతి యిచ్చెన్ - గ. ఘ. శ.

372. 1. డైన యా ఫణీంద్రకేతు - వీ. శ. ష. కొన్ని ప్రతులు.

373. 1. సంకులము నుల్లసిల్లె - వా. వీ. కొన్ని ప్రతులు. సంకులత - ఇ. ఏ. ఐ. ఔ.

374\. వ. మఱియు నమ్మహీపతిపయనంబున కనురూపంబుగా నెనిమిదివేలు రథంబులు ముప్పదివే లేనుంగులుఁ దొంబదివేలు గుఱ్ఱంబులు శతసహస్ర[1]సంఖ్యకాల్బురుం గలమహాసైన్యంబుతోడ నడిచె మృగయాకుశలు లైన మృగయులును విటవిదూషకవందివైతాళికాదిజను లనేకు లనుగమించి రిట్లు గవ్యూతిమాత్రం [2]బగు నేల యరిగి యచ్చట [3]విడిసి యద్దినశేషంబును రాత్రియుం గడపి మఱునాఁడు వివిధగిరిగహనంబు లతిక్రమించి ఘోషంబు లున్న వనంబు సొచ్చి యం దొక్కరమణీయప్రదేశంబున శిబిరంబు గావించి యమ్మనుజేంద్రుండు.

375\. సీ. నానాసహస్రసంఖ్యానంబులై సంతతానందవిగతభయత్వలీల
నక్కాననమున నేదిక్కు సూచిన నతిసంకులంబుగఁ గుంద శంఖ చంద్ర
హార నీహార డిండీర పటీర ముక్తాహార [1]హీర సంకాశములును
గాదంబ [2]కాలేయ కాదంబినీ నీల[3]జాల తమాలికాసన్నిభములు
తే. ప్రౌఢబంధూకపల్లవభాసితములు, వికచ[4]కాంచనచంపకవిస్ఫుటములు
నైన వర్ణంబు లొప్ప నేత్రాభిరామ, భంగి [5]నలరారు గోకదంబములఁ గనియె.

376\. వ. కని తదీయసమృద్ధికి సంతసిల్లుచు గోపాలజనంబులు సవినయంబుగాఁ దన్నుం గాంచిన నాదరించి వారు దనకు నగ్గోవుల పేళ్లును లక్షణంబులు నేర్పడ నెఱింగించుచుండఁ [1]బేరువేఱ వత్సంబులు వత్సతరంబులు మహోక్షంబులు ధేనువులు దర్ణకంబులు మొదలైనగోవిశేషంబుల నాలోకించుచు నయ్యైవిధంబులఁ బసికిం దగినరక్షణంబు గావింప నర్హజనంబుల సవిశేషంబుగా నియోగించి మఱియును.

---

374\. 1. సంఖ్యలగు కాల్బురుం - ల; సంఖ్య కాల్బలంబును - ఈ. ఐ. త. 2. బు నేల - గ. ఘ. చ. శ. 3. నిలిచి - కొన్ని ప్రతులు.

375\. 1. కాశసంకాశ - కొన్ని ప్రతులు. 2. కాశేఖ కాదంబినీ - కొన్ని ప్రతులు. 3. జలజాతమాలికా - శ. ష. పెక్కు ప్రతులు; జలజాతమాల - ల. 4. కేసరి చంపక విస్ఫుటములు - కొన్ని ప్రతులు. 5. దనరారు - కొన్ని ప్రతులు.

376\. 1. వేరువేర - పెక్కు ప్రతులు.

377\. క. గోపాలసమన్వితుఁడై, యాపాలమునఁ దిరిగి గోరసాస్వాదనలీ
లాపరితృప్తిఁ [1]దలిర్చె మ, హీపాలుఁడు నెమ్మితోడ నిష్టులుఁ దానున్.

378\. వ. తదనంతరంబ గాయకనర్తకాదులు వందిమాగధజనంబులుం గనిన నాదరించి వారికి నభిమతధనంబు లొసంగి మృగయావినోదంబునకుం దొడంగి.

379\. మ. హరిణవ్రాతములం గలంచుచు నుదగ్రానేకపశ్రేణిఁ జె
చ్చెర బంధించుచు నుగ్రసింహనివహచ్ఛేదైక[1]సక్రోధబం
ధురతం బేర్చుచుఁ బ్రస్ఫురన్మహిషశార్దూ[2]లోద్ధత[3]క్రోడని
ర్భర[4]పాతంబు లొనర్చుచుం దిరిగె భూపశ్రేష్ఠుఁ డక్కాననల్లోన్.

380\. వ. మఱియు ననవరతసురభిసరసీరుహప్రకరకీర్ణంబు లగు జలాశయంబు లాలోకించుచు నతిమనోహరప్రసూనఫలభరితపాదపవనాభ్యంతరంబుల విహరించుచు [1]మన్మథమయూర మధుకర కీర కోకిలాలాప కోలాహలంబు లాకర్ణించుచుఁ గ్రమంబునం బరిజనసమన్వితుం డై ధార్తరాష్ట్రుండు ద్వైతవన సరోవరంబు సేరం జనియె నంత నట ధర్మనందనుండు తత్సమీపంబున మునిజనసహాయుండై వన్యంబు లగుమూలఫలవిశేషంబులు సాధనంబులుగా [2]సద్యస్కందం బనుయజ్ఞంబు సేయుచుండె నప్పుడు దుర్యోధనుండు నిజభృత్యజనుల నక్కొలనిదరిం [3]గ్రీడాగృహంబులు నిర్మింప నియోగించిన.

381\. క. వారును [1]సంభ్రమమున న, వ్వారిరుహాకరము పొంత వదలక క్రీడా
గారములు గట్టఁ దొడఁగుడు, వారించుచు బాఱుతెంచి వడి గంధర్వుల్.

---

377\. 1. నెలర్చెమహీ - కొన్ని ప్రతులు.

379\. 1. సక్రోధ - వి. శ. మ. పెక్కు ప్రతులు; సంక్రీడ - వా. 2. లోన్నతక్రోధ- మ. 3. క్రోధ నిర్భర - పెక్కు ప్రతులు. 4. ఘాతంబు లొనర్చుచుం - ల.

380\. 1. నున్మద - పెక్కు ప్రతులు. 2. సద్యస్కందంబను యజ్ఞంబు - దీనికిమూలము నం దాకరము కనఁబడదు - మూలమిట్లున్నది. 'ఈజే రాజర్షి యజ్ఞేన సాద్యస్కేన విశాంపతే' సాద్యస్కేన - ఏకాహసాధ్యేన - నీలకంఠీయ వ్యాఖ్యానం 3-229-24. 3. గ్రీడావిహారంబులకు గృహంబులు - ఘ. ద.

381\. 1. సమ్మదమున - అ. జ.

382. వ. ఇది చిత్రసేనుం డను[1]గంధర్వపతికిం గ్రీడార్థంబు కల్పితం బైనది గావున మీ రిక్కొలను సేరక తొలంగి పోవునది యనిన వారు మగుడం జని దుర్యోధనునకుం జెప్పుటయు నతండు రణదుర్మదు లైన సైనికులం గొందఱం బంచిన నరిగి వారలు గంధర్వుల కి ట్లనిరి.

383. మ. బలియుం డాధృతరాష్ట్రసూనుండు మహాబాహుండు దుర్యోధనుం
డలఘుం డీకమలాకరంబునకుం గ్రీడార్థంబు[1] గౌతూహలం
బెలయం[2]గాం బ్రియకామినీసహితుం డై యేతెంచుచున్నాండు మీ
ర్వల దిందుండం దొలంగి పొం డనవుడున్ వారు[3]ద్ధతక్రోధులై.

384. వ. [1]ఒండొరువుల మొగంబులు సూచి పెలుచ నవ్వి వారల కి ట్లనిరి.

385. క. ఎదిరిం దన్నెఱుంగండు, మదమునం బ్రాణంబుం దనదుమానముం గోల్పో
మదిం దలంచినాండు మీనృపుం, డిది యేటికిం జెనంటి [1]చెయ్వు లన్నియు
నిచటన్.

386. వ. [1]బుద్ధిమంతుల రై యూరక [2]చనుట లెస్స [3]యనుం డనిసం [4]గ్రమ్మఱి చని వారు కురుపతికిం దద్వచనంబుల [5]తెఱం గంతయుం జెప్పుటయు నతండు [6]రోషావేశవివశుం డై తమ్ముల దొరలం జూచి [7]మీ రిందఱు మీమీ[8]సైన్యంబుల తోడం గూడి కడంగి దుర్వినీతు లైన [9]గంధర్వులగర్వంబు మాన్పి [10]సరోవరం బాక్రమించు నది వారికి సహాయుం డయి సురగణ[11]సమేతంబుగ నింద్రుండు సనుదెంచె నేనియు నవలీల జయించునది యని నియోగించిన.

---

382. 1. గంధర్వుండు తన సతి క్రీడార్థంబుగా - ఛా.

383. 1. గా కౌతుకం బెలయన్ - అ. ఈ. ఎ. ఏ. ఐ. క. త. 2. గాం బ్రియకామినీ - శ. 3. న్నత క్రోధులై - స.

384. 1. ఒండొరుల - పెక్కు ప్రతులు.

385. 1. మాటలు - ఇ. ఏ. క. స; పలుకులు - శ. ల; చెయ్వురిన్నియున్ - స. ఈ రూపము అపురూపముగా తోంచును.

386. 1. బుద్ధిమంతులై - క. ద. డ; బుద్ధిమంతుండై - వా; బుద్ధిమంతులరై - అ. ఆ. ఙ. శ. ష 2. చనుం డనవుడు - క. 3. యని చెప్పుడనినన్ - ల; యరుగుం డనిన - డ; యనిన - పెక్కు ప్రతులు. 4. క్రమ్మరం. జని - ల. 5. తెఱంగెఱిం గించిన నతండు - శ. 6. కోపావేశ - కొన్ని ప్రతులు. 7. మీరలందరు - ల. 8. సైన్యంబుతో - వా. 9. యాగంధర్వుల - ఎ. ఛా. ల; సైన్యంబులతో - పెక్కు ప్రతులు. 10. తత్సరోవరంబు - క. ల. 11. సహితుండైన - పెక్కుప్రతులు.

387. క. అతులచతురంగసేనా, న్వితు లయి ధృతరాష్ట్రసుతులు నిరతిశయరయో
[1]ద్ధతసింహనాదబధిరీ, కృతదిఙ్ముఖు లగుచుఁ జనిరి గినుక యెలర్పన్.

388. వ. ఇట్లు సను[1]దెంచు కురువీరుల కడ్డంబు వచ్చి కొందఱు గంధర్వులు ప్రియపూర్వకంబుగా [2]నిట యేల వచ్చెదరు మీకు మా[3]తోడ[4]విద్వేషం బేటికి నిలువుం డనినం బెలుచ నార్చి సేనాగ్రచరులు [5]వారల మీఁదం బ్రచుర శస్త్రాస్త్రపాతంబు సేయం దొడంగినం దొలంగి చని యాగంధర్వు లా తఱంబ చిత్రసేనున[6]కు నంతయుఁ [7]జెప్పి పుచ్చినం బ్రబలరోషరంజితాననుం డై యతండు.

389. క. చనుఁడు రయంబున నాదు, ర్జనులం గౌరవులఁ బొదివి సమయింపుఁడు మీ
రని బహుసహస్రసంఖ్యులఁ, బనిచెను గంధర్వ[1]వరులఁ బ్రకటితబలులన్.

390. వ. ఇట్లు పనిచిన.

391. ఉ. ఆయతకుంతకార్ముకగదాసిపరశ్వథశూలపట్టిసా
ద్యాయుధఘోరహస్తులు గులాచల[1]తుంగతనుల్ ప్రచండతే
జోయుతు లావియచ్చరులు శూరత మై [2]నడతెంచి బల్విడిం
గో యని తాఁకి రుగ్రరణకోవిదు లై కురు[3]రాజుసైన్యమున్.

392. వ. ఇవ్విధంబున గంధర్వులు బెట్టిదంబుగాఁ గిట్టి నొప్పింపం దొడంగినం గలంగి దుశ్శాసనాదికౌరవులు ససైన్యంబుగాఁ దెరలి దుర్యోధనుచేరువకుం బఱచినఁ గర్ణుం డొక్కరుండ సుస్థిరుం డయి నిలిచి గంధర్వుల నిలువరించి

---

387. 1. ద్ధతి - వా; ద్ధత - పెక్కు ప్రతులు.

388. 1. దెంచుచున్న - కొన్ని ప్రతులు; దెంచిన - త. 2. నిదియేల - పెక్కు ప్రతులు. 3. తోటి - ఆ. ఓ. చ. డ. శ; తో - కొన్ని ప్రతులు. 4. ద్వేషంబే మిటికి - త. డ. ల. 5. వారిమీద - కొన్ని ప్రతులు; వారిపై - అ. జ. డ. 6. కత్తెరంగు - అ. జ. ట; కెఱింగించిన - క. 7. జెప్పిన - అ. జ. ట. డ. ద. ల; నెఱింగించి - గ. వీ. శ. ష.

389. 1. పతుల - కొన్ని ప్రతులు.

391. 1. శృంగతనుల్ - త. 2. పరతెంచి, బరతెంచి - కొన్ని ప్రతులు. 3. రాజ - వా. వీ; రాజు - శ. ష. కొన్ని ప్రతులు.

భల్లార్ధచంద్రప్రముఖబహులబాణపాతంబులం దదీయదేహంబులుఖండించుచ
నిమిషమాత్రంబునఁ జిత్రసేను [1]సైనికశతంబుల రూపుమాపుటయు
మఱియుం బైపై గంధర్వులు శతసహస్ర [2]సంఖ్యలు తోఁతెంచినం బృథి
యెల్లను గంధర్వమయం బైనట్లుండె నప్పుడు.

393\. చ. శకునియుఁ దమ్ములుం బ్రబలసైన్యముతో [1]నడతేర [2]సాహసో
త్సుకమతి యై సుయోధనుఁడు సూత[3]తనూభవుఁ డున్నచోటికిం
బ్రకటభుజోగ్రతం గడఁగి [4]బల్విడిఁ దద్రిపుకోటి దాఁకినన్
సకల[5]జగద్భయంకరలసత్సమరోత్సవ మయ్యె నయ్యెడన్.

394\. క. కొండొకసేవునకు మహో, ద్దండ[1]నృపానేకఘోరతరవిశిఖవ్యా
ఖండితశరీరులై ధృతి, [2]ఖండితముగఁ బల్లటిలిరి గంధర్వు లనిన్.

-: చిత్రసేనుం డనుగంధర్వరాజు దుర్యోధనునితో యుద్ధము సేయుట :-

సం. 3 - 230 - 21

395\. క. గంధర్వులు దెరలుట [1]విని, గంధర్వవిభుండు [2]క్రోధకలుషితమతియై
గంధగజముచందమున మ, దాంధగతిం గవిసెఁ గౌరవానీకముపై.

396\. వ. ఇట్లు గవిసి చిత్రసేనుండు.

397\. శా. మాయాసంగరకోవిదుండు [1]వికసన్మాయాస్త్రజాలంబులన్
వాయువ్యాప్తి యడంగ నర్కకిరణవ్రాతంబు రుద్ధంబుగాఁ
జేయం జొచ్చినఁ ద్రెళ్ళెఁ దేరులు కరుల్ [2]శీర్ణంబు లయ్యెన్ దళ
త్కాయం బయ్యె హయాలి గూలిరి [3]భటుల్ గౌరవ్యసైన్యంబునన్.

---

392\. 1. సైనికుల - కొన్ని ప్రతులు. 2. సంఖ్యలు - శ. పెక్కు ప్రతులు.

393\. 1. జనుదేర - ఈ. ఐ. త. 2. సాహసోత్సుక - ఔ. ఘ. చ. 3. తనూజుఁడు పోరుచోటికిన్ - ల. స; తనూజుని యున్నచోటికిన్ - కొన్ని ప్రతులు. 4. బల్విడి తద్రిపుకోటి - శ. 5. భయంకరంబునగు సంగర మద్భుతమయ్యె నయ్యెడన్ - ఔ.

394\. 1. నృపానీక - కొన్ని ప్రతులు; తరానీక - కొన్ని ప్రతులు. 2. ఖండితముగ నాజి బడిరి గంధర్వు లటన్ - ర.

395\. 1. గని - కొన్ని ప్రతులు. 2. రోష - ఉ. ఔ.

397\. 1. విలసన్మాయాస్త్ర - ఉ. ఘ. డ. 2. జీర్ణంబులయ్యె - కొన్ని ప్రతులు. 3. నరుల్ - కొన్ని ప్రతులు.

398. క. [1]పొదలి యొకని కొక్కనికిని, [2]బదుగురు పదుగురుగఁ గవిసి పౌరవసేనం
బొదివి సమయింపఁ దొడఁగిరి, వదలక గంధర్వు లని నవార్యోద్ధతులై.

399. వ. [1]అవ్వియచ్చరుల విక్రమంబునకు నోర్వక బెదరి [2]చెదరి కురురాజసైన్యంబు ధర్మనందనుం డున్నకందువకుఁ [3]బాఱం దొడంగె నప్పుడు రాధేయుం డజేయుం[4]డై కులశైలంబునుం బోలెఁ [5]దలరక నిలిచి గంధర్వులు గురియు శరవర్షంబున మునుఁగుచుఁ దనయోపినంత పెనంగుచుండె [6]సోదరసౌబల సహాయుండై దుర్యోధనుండు గర్ణ[7]సాహాయ్యంబు వదలక నిలిచె నంత ననంతసత్త్వులైన గంధర్వు లనేకులు సుట్టుముట్టి.

400. ఉ. కొందఱు సూతు లశ్వములఁ గొందఱు కొందఱు చాపదండముం
గొందఱు చక్రయుగ్మ[1]కముఁ గొందఱు విస్ఫురితాతపత్రముం
గొందఱు కూబరంబు మఱికొందఱు కేతువుఁ గొంద ఱక్షముం
దందడిఁ దున్మివైచి విరథత్వ మొనర్చిరి సూతసూతికిన్.

401. వ. ఇట్లు విరథుం డయి కర్ణుండు వికర్ణురథం బెక్కి రణభూమికిం దొలంగి చనియె దుర్యోధనుండు విముఖుండు గాక పరబలంబు మార్కొని పెనంగం దొడంగినం గినిసి చిత్రసేనుండు వానిం దలపడి తదీయస్యందనంబు

---

398. పొదివి యొకని - పెక్కు ప్రతులు; ముదమున నొకని కొకనికిం బదుండ్రు; పొదివియు నొక్కొక్కరునిం బదురు పదురు గాఁగఁ గవిసి - స. 2. పదుండ్రు-పెక్కు ప్రతులు.

399. 1. ఇట్లు విక్రమించు వియచ్చరుల పరాక్రమంబున కోర్వక - కొన్ని ప్రతులు. 2. చెదరి - పెక్కు ప్రతులలో లేదు. 3. బోవదొడంగె, బఱువందొడంగె - అని పాఠములు. 4. డయ్యుదీర్ణసమరంబున - ఆ. ఈ. ఐ. హ. 5. దెరలక - పెక్కు ప్రతులు; దరలక - పీ. శ. ష. కొన్ని ప్రతులు. 6. సహోదర - కొన్ని ప్రతులు. 7. సహాయంబు - శ. కొన్ని ప్రతులు.

400. 1. కము కొందఱు - శ. ష.

రాధేయు[1]రథంబు నట్లు భగ్నంబు[2]గాఁ జేయించి విరథుం డగునమ్మహా
విభుం గేశాకర్షణంబు[3]న నేలం [4]బడవైచి పెడకేలుగట్టి సింహనాదంబు
సేసినం దక్కినగంధర్వులుం గనుకనిం [5]బేర్చి యతని వనితాజనంబులను
దత్సోదరు లగు దుశ్శాసన[6]దుర్విషహ దుర్ముఖ వివింశతి చిత్రసేన విందాను
విందు లను దత్తనూభవులను దదీయమంత్రులను బట్టి బంధించి చిత్రసేనున
కొప్పించి రంతఁ బెఱకౌరవులును బౌరులు నమాత్యులుం జెదరి యాక్రో
శించుచుం బఱచి ధర్మపుత్త్రు [7]శరణు సొచ్చి యి ట్లనిరి.

402. మ. ఘనబాహాబలదుర్నివార [1]మహిమన్ గంధర్వవీరుల్ సుయో
ధనుఁ దత్కాంతలఁ దత్సహోదరుల బంధప్రాప్తులం జేసి[2] తె
[3]గొని వేపోవుచు నున్నవా రదె రిపుక్షోభంబు [4]గావించి నీ
యనుజవ్రాతముఁ గావవే కరుణ నిండారంగ రాజోత్తమా.

403. వ. అని కృతాంజలు లై పలుకుచున్న[1]వారిం జూచి భీమసేనుండు ప్రవాసితా
ననుం డగుచు ధర్మపుత్త్రున కి ట్లనియె.

404. ఆ. మనకుఁ జులక నయ్యె మనచేయు[1]పనియ గం
ధర్వవరులు [2]గూడి [3]తగనొనర్చి
రింత లెస్స యగునె యేభారమును లేక
యూర[4]కుండ మనల నొందె జయము.

---

401. 1. నరదంబు – జ. 2. గావించి – ఉ. ల. వీ. శ. మ. 3. సేయించి – ఈ. ఐ. త. 4. బడందిగిచి – అ. ఐ. జ. ఝ. ర. 5. బఱచి – వా, బేర్చి – పెక్కు ప్రతులు. 6. దుర్ధర్షణ, దుర్మర్షణ – అని పాఠములు. 7. శరణంబు – పెక్కు ప్రతులు.

402. 1. గరిమన్ – ఎ. 2. కొంచును – శ. 3. కొనుచున్ బోవుచు – ఈ. త. 4. వారించి – ట.

403. 1. వారల – పెక్కు ప్రతులు.

404. 1. పనులు – వీ. శ. వ. పెక్కు ప్రతులు; సేత గంధర్వులు – న. 2. కడగి, కణగి – పెక్కు ప్రతులు. 3. తారొనర్చిరి–డ. 4. కున్నమనల. కుండుమనల – అని పాఠములు.

405. తే. [1]పుట్టుఁగల్లరియై పాపములకు నెల్ల, దిట్టయై లోకములచేతఁ దిట్టువడిన
[2]కట్టెఁడికి నిట్టికష్టంబుగా నొనర్చె,తగ విధాతృఁడు చతురుఁడై నెగడె నేఁడు.

406. మ. విపరీతస్థితి నొంది ఘోరవిపినోర్వీవాసులై నిత్యదుః
ఖపరాధీనతఁ దూలి రంచు మనలన్ [1]గర్వోద్ధతస్వాంతుఁడై
[2]యపలాపింపఁగ వచ్చి [3]దుర్ణయపరుం డాధార్తరాష్ట్రుండు [4]దో
షపరీతాత్ముఁడు దత్ఫలంబు గుడిచెఁ [5]సత్యంబు సామాత్యుఁడై.

407. వ. వాని[1]దెసం గృపసేయ [2]వల దనిన ననుజునకు నగ్రజుం డి ట్లనియె.

408. క. అకట యిది పరుషవాక్యము,లకు సమయమె శరణు సొచ్చి లఘుభావముతో
[1]వికల[2]గతి నున్న కౌరవ, నికరమునకుఁ గరుణ సేయ నీకుం దగదే.

409. వ. ఏకాన్వయజాతులైనవారికి నర్థనిమిత్తంబైన భేదం బొక్కొక్కమాటు ప్రవర్తిల్లు నంతనచేసి సహజస్నేహంబు దప్ప నేరదు జ్ఞాతిజనంబులు దమలో నెట్టివారైన నొప్పుం గాని యన్యుల[1]వలనం బరిభవంబు [2]దొడరినప్పుడు దా రొండొ[3]రులఁ జేకొన కునికి లోకనింద్యంబు దుర్యోధనుండు దుర్వినీతుం[4]డైనను సభార్యుం డయి పరులచేతం బట్టువడియె దీని నుపేక్షించిన మనకుం గులహాని యగు నదియునుంగాక శరణాగతరక్షణంబు రాజ[5]మాత్రుండగు వాని కెల్ల ధర్మంబు నీయట్టి బాహుబలసంపన్నునకు నిట్టిసుకర్మంబు గర్తవ్యం బని వేఱు చెప్పనేల లెమ్ము నీవును నీతమ్ములు నిమ్ముల రథంబు లెక్కి సర్వాయుధ[6]సన్నద్ధులై చని సుయోధనుచెఱ[7]దలుగుం డనినఁ బవననందనుండు ధర్మనందనున కి ట్లనియె.

---

405. 1. పుట్టుకల్లరి — శ. 2. కట్టడికి—శ. ప. పెక్కు ప్రతులు.

406. 1. గర్వాంధిత — ఓ. స. సూ. 2. యవహసింపగ — ఆ. స. 3. దుర్జయపరుండా — సూ. 4. రోషపరీత — ఒ. ట. 5. సద్యంబ (బు) — అ. ఉ. జ. స.

407. 1. వలన — ఉ. ఘ; యెడం — క. 2. వలవదు — కొన్ని ప్రతులు.

408. 1. వికలుగతి — ఆ. 2. మతి — ల. స.

409. 1. వలని పరిభవము — ల. 2. నొందిన యప్పుడు — అ. జ. ఝ. 3. రువులం — ఒ. ఔ. ద. 4. డగునైనను — పెక్కు ప్రతులు. 5. మాత్రంబువాని — వా. వీ; మాత్రుండగువాని — ఈ. ఐ. ఔ. త. 6. సంపన్నులై — ఘ. చ. 7. దలగించుడ — కొన్ని ప్రతులు; దలంగం జేయు — ల.

వలన దేన యరుగుటు నిప్పుడు యజ్ఞదీక్షితుండ నై యున్నవాఁడ గావున నాకుం జనరాదు మీరు వేగచని గంధర్వులం బ్రియపూర్వకంబుగా [4]సను నయించి సుయోధను విడిపించునది సామవచనంబు[5]లం దీరకున్నఁ బరాక్రమంబునను నం బ్రతివీరుల నోర్చి కార్యంబు [6]దీర్చునది నాచేయుజన్నంబు సఫలంబు సేయుం డనిన భీముం డెట్ట[7]కేనియు నియ్యకొనియె నర్జునుండును ధర్మరాజుపనుపు గైకొని కురురాజుచెఱ [8]దలుగఁ బ్రతిజ్ఞ సేసె నకులసహదేవులు నుత్సాహసమేతు లయి రన్నలువురు నాముక్తకవచులు నాబద్ధతూణీరులు నాకలితకార్ముకులు నారూఢరథులు నయి యగ్రజు వీడ్కొని యతిత్వరితగతి నడచినం గౌరవసైన్యం బంతయు వారిం గూడుకొని సింహనాదంబులు సెలంగం జనియె ని ట్లరిగి వారలు గంధమాదనంబునకయి [9]చనుచున్న యవ్వియచ్చరానీకంబుం గూడ ముట్టిన.

-: భీమార్జుననకులసహదేవులు గంధర్వులతో యుద్ధంబు సేయుట :-

సం. 3 – 233 – 5

415. క. కని గంధర్వులు గ్రమ్మఱి, ఘనులం బాండవుల నగ్నికల్పులఁ దేజో
ధనుల నమరేంద్రసదృశుల, ననఘుల మార్కొనిరి ప్రకటితాటోపమునన్.

416. ఉ. అగ్రజువాక్యముల్ దలఁచి యర్జునుఁ డప్పుడు వారితోడ న
త్యుగ్రత [1]దక్కి యెంతయుఁ బ్రియోక్తుల నిట్లను మీకు మాయెడన్
విగ్రహ మేల నెయ్యమున [2]విడ్వుఁడు కౌరవరాజుఁ [3]బార్థివ
ప్రాగ్రసరుండు [4]ధర్మసుతు పన్పిది [5]మీకు నలంఘ్య మిత్తఱిన్.

417. వ. అనిన నతనికి గంధర్వు లి ట్లనిరి.

---

(కురు) సమయంబు – ఇ. ఏ. క. జ. ల. 4. ననూనయించి – శ. వ. పెక్కు ప్రతులు. 5. లవిడువకున్న – ఈ. ఐ. త. 6. చక్కచేసుకొమునది వా – ఔ. 7. కేలకు – కొన్ని ప్రతులు. 8. దలగునట్టి – ల; దలగు – కొన్ని ప్రతులు. 9. నడచుచున్న – కొన్ని ప్రతులు.

416. 1. మాని – ద. 2. విడుడు – శ. వ. కొన్ని ప్రతులు. 3. పాండు భూపా సుతుండు–ఉ.ఊ. 4. ధర్మజుని పన్పిది – అ. క. జ. 5. నీకు నలంఘ్య–ఆం. గు. ప్రా.

422. వ. ఇట్లు కౌంతేయులచేతం బీడితులై గంధర్వులు దుర్యోధనాదుల విడువ లేమఱక కొనుచు గగనంబునకు నెగసి త్రోచిపోవ [1]నుంకించిన నెఱింగి సవ్యసాచి రయంబున నతినిబిడబాణజాలంబులం జేసి దిఙ్నభోమార్గంబులు నీరంధ్రంబులుగాఁ గప్పిన నగ్గగనచరులు వలలోవం జిక్కిన పులుగులుం బోలెఁ బోవ నేరక శరపంజరంబునం జిక్కియు నుక్కు సెడక యన్నలు వురమీఁద వివిధాయుధ[2]ప్రకరంబులు ప్రయోగించిన.

423. మ. అవి యెల్లం దునుమాడి క్రీడి ఘనరోషాభీలుఁడై శాతభ
ల్లవితానం బడరించినం దలలు డొల్లం గాయముల్ మింటనుం
డి వడిం గుంభినిఁ గూలఁగా రుధిరవృష్టిం గాలువల్ వాఱఁగా
దివి గంధర్వుల[1]క్రం దడంగె జగ ముద్వేగంబునం బొందఁగన్.

424. వ. మఱియు నర్జునప్రయుక్తం బయిన యాగ్నేయాస్త్రంబు దావాగ్ని నీరస విపినంబు దహించు తెఱంగున గంధర్వ[1]నివహంబు నీఱు సేయం దొడంగినం గినిసి చిత్రసేనుండు భీమసేనానుజుమీఁదం బటుగదాదండంబు [2]వైచిన నతండు దాని [3]నేడుదునియలుగా నేయుటయు గంధర్వరాజు మాయా బలంబున నంతర్హితుండై.

425. క. నలువురు పార్థుల నత్యు, జ్జ్వలశర[1]వర్షముల ముంచి జలధరముక్రియం
బెలుచన గర్జిల్లుచు [2]మొ, క్కలుఁ డయి తనవిక్రమంబుఁ గడఁకయుఁ జూపెన్.

426. ఆ. దాని నుఱక యింద్రసూనుండు గాండీవి, శబ్దభేదు లయిన సాయకములఁ
జిత్రసేను సర్వ[1]గాత్రంబు భేదించి, యొక్కమాత్రలోన నుడిపెఁ గడఁక.

---

422. 1. నూహించిన – కొన్ని ప్రతులు. 2. పరంపరలు – వా. వీ; ప్రకరంబులు – పెక్కు ప్రతులు.

423. 1. పెల్లడంగె – డ.

424. 1. నివహదాహంబు – పెక్కు ప్రతులు; 2. వైచిన నది నడుమన తునియలుగా – గ. ఘ. వీ. శ. ష. 3. నడుమ (న) దునియలుగా – గ. ఘ. ఝ. శ. ష.

425. 1. వేగమున – పెక్కు ప్రతులు. 2. మొక్కలుడయి – ఇ. ఏ. ఒ. గ. చ. ల; మొక్కలమున – ఔ. ఘ; నుత్కలుఁడయి – వా. వీ; నుక్కలుడయి – ఆ. ఝ. ర.

426. 1. గాత్రముల్ – కొన్ని ప్రతులు.

427. వ. ఇట్లు నొచ్చి గంధర్వనాయకుండు రణసంరంభం[1]బు విడిచి యర్జునుం జేరం
జని [2]తన[3]పొడసూపి నిలిచిన [4]నవ్వీరుండును నాత్మసఖుం డయిన ఖేచరపతి
తెఱంగు సూచి సంహృతాస్త్రుం డయ్యె వృకోదరాదులును సమరవిరా
మంబు నొందిరి వార లందఱుఁ దమతమ రథంబులమీఁదన యుండి
యొండొరులఁ గుశలంబు లడిగి రప్పు డర్జునుండు చిత్రసేనున కిట్లనియె.

428. క. [1]వీరోత్తమ నీ కిమ్మెయి, వైరము దగునయ్య కౌరవ[2]ప్రకరముతోఁ
గౌరవపతి విడువుము త, ద్దారానుజసుతసమన్వితంబుగ నెమ్మిన్.

429. వ. అనిన నతం డర్జునున కిట్లనియె.

430. సీ. ఈదురాత్ముఁడు మిమ్ము నివ్వనంబున నిశాంతాయాసపీడితు లైన వారిఁ
బరమధర్మాత్ముల భార్యాసమేతుల నపహసింపఁ దలంచి యరుగుదెంచె
నింతయు నెఱిఁగి సురేంద్రుండు గలుషించి యనుజవధూసహాయాన్వితముగఁ
జాపవర్తను వీనిఁ[1]బట్టి తెమ్మని నన్నుఁ బనిచిన వచ్చితిఁ బార్థ వినవె

తే. శక్రుపాలికి నిదె కొని చనుచు నున్న, వాఁడ నీవింక నొం డనవలదు [2]వినుము
మత్సఖుండవు గావున [3]మత్సరంబు, నలుకయును లేదు నీదెస ననఘ నాకు.

431. తే. అనిన నర్జునుఁ డతని కిట్లనియె నీసు
యోధనుఁడు మాకు వినుము సహోదరుండు
గాన [1]యీతని విడుచుట గర్జ మిదియ
ధర్మజున కెంతయును బ్రమోదంబు సేఁత.

---

427. 1. బుడిగి – ఇ. ఏ. 2. తన్ను, తను – అని పాఠములు. 3. పొడవు – ఓ. ఘ.
4. నవ్విజయుండు – ఔ.

428. 1. ధీరోత్తమ – కొన్ని ప్రతులు. 2. ప్రవరులతో – శ.

430. 1. బంధించి తెమ్మని పనిచిన వచ్చితి – ఒ. ద. 2. నిలువు – పెక్కు ప్రతులు.
3. మహితచరిత – ఓ. స; మచ్చరంబు – ల.

431. 1. నీతని – ఘ. పీ. శ. ష.

432. చ. అమరవరేణ్యు పన్ప్రయిన నావల నెయ్యది యైన నిప్డు ధ
ర్మమహితుఁ డైన ధర్మజు సమక్షమునం దెఱిఁగించి యాతఁ డే
[1]క్రమమున నెద్ది సెప్పె నది గైకొని చేయుఁ[2]ము నీవు మత్ప్రియా
ర్థము చనుదెమ్ము నావుడును దాని కొడంబడి చిత్రసేనుఁడున్.

-: చిత్రసేనుఁడు ధర్మరాజు నొద్దకు వచ్చి దుర్యోధను విడిచిపెట్టి పోవుట :-

సం. 3 _ 235 _ 11

433. వ. వారలుం దాను ధర్మజు కడకుం జనిన నయ్యజాతశత్రుండు చిత్రసేను నతి[1]ప్రియంబునం బూజించి మహాత్మా యీసుయోధనుండు [2]సానుజామాత్యుం డయి మీచేత వధియింపంబడ కునికి మే లయ్యె మీకారణంబున మావంశంబునకు [3]కొండొక హాని వొంద దయ్యె [4]వీఁ డెట్టియపరాధంబు సేసినను నది యంతయు [5]సహించి మాకుంగా వీని విడువవలయు నని ప్రార్థించిన నతం డట్లకాక యని దుర్యోధనాదుల నందఱ విడిచి పాండుపుత్త్రుల నామంత్రణంబు సేసి దివంబున కరిగి తత్ప్రకారం[6]బు సకలంబును నింద్రునకు నివేదించిన నింద్రుండును సమరనిహతు లయినగంధర్వుల నమృతవృష్టిం జేసి బ్రదికించె నిట యుధిష్ఠిరుండును ధార్తరాష్ట్రు[7]నకు బంధమోక్షణంబు గావించి వాని కిట్లనియె.

434. ఉ. [1]ఎన్నఁడు నిట్టిసాహసము లింక నొనర్పకు మయ్య దుర్జనుం
డన్నన సాహసక్రియలయందుఁ గడంగి నశించు గావునం
గ్రన్నన తమ్ములన్ [2]దొరలఁ గైకొని యిమ్ములఁ బొమ్ము వీటికిన్
సన్నుత దీని కొండొక విషాదముఁ [3]బొందకు[4]మీ మనంబునన్.

---

432. 1. క్రమమని యేది - పెక్కు ప్రతులు. 2. టమేలు - ఈ. ఐ. త.

433. 1. ప్రీతిం బూజించి - కొన్ని ప్రతులు. 2. సామాత్యుండయి - కొన్ని ప్రతులు; సామాన్యుండయి - శ. కొన్ని ప్రతులు. 3. కొండొక - ఆ. ఔ. క. గ. ఝ. ల; నొండొక్క - వా. పీ. కొన్ని ప్రతులు. 4. వీడేమి - కొన్ని ప్రతులు; వీడెంత - అ. జ. ట. 5. సైరించి - కొన్ని ప్రతులు. 6. బంతయు - కొన్ని ప్రతులు. 7. లకు - కొన్ని ప్రతులు.

434. 1. యెన్నడు - పెక్కు తాళపత్ర ప్రతులలో నిట్లు పదాది 'యె'త్వము కలదు. ఇది 'ఎ' త్వమునకు మాత్రమేకాక 'ఇ' త్వ 'ఈ' త్వములకును వ్యాపించినది. 2. దొరల కాంతలఁగైకొని పొమ్ము వీటికిన్ - ప. కొన్ని ప్రతులు. 3. నొందకుమీ - ఆం. 4. నీమనంబునన్ - కొన్ని ప్రతులు. ఇచ్చట 'చ' ప్రతియందు దోషభూయిష్ఠమైన యొక పద్యము అధికపాఠముగా కలదు.

435. వ. అని బుద్ధి సెప్పి వీడ్కొలిపిన నతండును దీనాననుం డగుచుం జనియె ననుజ
సహితుం డయిన ధర్మతనయు ధార్మికత్వంబు ధౌమ్యాదిభూసురులును
దదాశ్రమవాసు లయిన మహామునులును బహు[1]విధంబులఁ [2]బ్రస్తుతించి
రని వైశంపాయన[3]వర్ణితం బయిన కథావిశేషంబు సవిస్తరంబు[4]గా.

436. క. రాజకులతిలక భువనవి, రాజిత[1]సితకీర్తి దివిజరాజవిభవ ని
ర్వ్యాజపరాక్రమ సకలధ, రాజనసంపూజ్య ధర్మరక్షణదక్షా.

437. స్రగ్విణి.
సర్వలోకాశ్రయా [1]సౌమ్యభావోదయా
నిర్వికారాకృతీ నిత్యసత్యోన్నతీ
గర్వితోద్యద్భుజాకల్ప కల్లోల్లస
త్సర్వసర్వంసహాచక్ర చక్రాయుధా.

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతంబునం
దారణ్యపర్వంబునఁ బతివ్రతా[1]చరిత్రంబును ధర్మవ్యాధుండు గౌశికునకుఁ బరమ
[2]ధర్మం బెఱింగించుటయు [3]నగ్నివంశానుకీర్తనంబును గుమారోత్పత్తి[4]యు
సత్యాద్రౌపదీసంవాదంబును బాండవులు ద్వైతవనంబునకుం జనుటయు
ధృతరాష్ట్రవాక్యంబులును [5]దుర్యోధనాదుల దుర్మంత్రంబున ఘోష
యాత్రయుఁ గౌరవగంధర్వయుద్ధంబును దుర్యోధనాదులు
గంధర్వులచేతం బట్టువడుటయు [6]నర్జునుండు [7]వారల
విడిపించుటయు [8]నన్నది పంచమాశ్వాసము.

---

చ॥ చలము మహాత్ములందు విడి చక్కన శత్రుబలంబు నస్మదా
దుల బలముం గ్రహించకను దూకొని వెన్కఁ దలంచు మానవుం
వలుతెరగాపదల్ యపుడు బైకొనుచుండును గాన నీవు ని
శ్చలమతి నింక నుండు చెడుసేతల బోకల బోవ హానగున్.

435. 1. భంగుల - కొన్ని ప్రతులు. 2. కొనియాడిరని - కొన్ని ప్రతులు. 3. కథితం బయిన - కొన్ని ప్రతులు. 4. నక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పిన నత్యంత విస్మితమనస్కులై సంతసంబునం బొంగి తర్వాత కథాప్రకారం బంతయు మాయందలి వాత్సల్యంబున వినిపింపవే యనుటయు - ఎ. ల.

436. 1. చిరకీర్తి - స. కొన్ని ప్రతులు.

437. 1. సర్వబోధోదయా - ఊ.

గద్యము. 1. చరితంబును - పెక్కు ప్రతులు; మాహాత్మ్యంబును - ద. 2. ధర్మంబు సెప్పుటయు - ఒ. 3. గృశానువంశకీర్త - కొన్ని ప్రతులు. 4. కథనంబును - కొన్ని ప్రతులు; యు సత్యభామా - కొన్ని ప్రతులు. 5. కర్ణ దుర్యోధనాదుల - పెక్కు ప్రతులు. 6. ధర్మరాజు నానతి నర్జునుండు - కొన్ని ప్రతులు. 7. దుర్యోధనాదులచెర - కొన్ని ప్రతులు. 8. నను కథలుగల - ఊ. శ.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - షష్ఠాశ్వాసము

—o—o—o—

1. క. [1]శ్రీలలితమూర్తి సుమహా
చ్చాళుక్యవరేణ్య పుణ్యచారిత్ర విచి
త్రాలం[2]కారోజ్జ్వల[3]కవి
తాలాపకలాప [4]సంతతానందమతీ.

*-: దుర్యోధనుని విషాదము :-*

సం. 3 - 236 - 1

2. వ. [1]అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లతిమానుషం బైన [2]యర్జునుపరాక్రమంబును [3]నత్యంతదైన్యాస్పదం బగు దుర్యోధనుపరాభవంబును [4]ధర్మజు దయయు నాకర్ణించి విస్మయజుగుప్సాకలితమానసుం డగుచు జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె.

3. చ. అనిశము పాండుపుత్త్రులకు నప్రియకార్యము [1]రోయునట్టి దు
ర్జనుఁడు సుయోధనుం[2]డటులు శత్రుల[3]చే నవమానితుండుఁ జే

---

1. 1. శ్రీకర శాత్రవరాజీవ, శీకర మృగరాజ రాజశేఖరగంగా శీకర యశఃప్రతాపవని, రాకర రవితేజ రాజరాజనరేంద్రా - ఎ. వ. 2. కరణోజ్జ్వల......తాస్మేర మతీ - స. 3. కలితాలాప - శ. పెక్కు ప్రతులు. 4. సంతత (తా) స్మేరమతీ - వ. పెక్కు ప్రతులు; రంజితాత్మీయమతీ - ఈ. ఐ. త.

2. 1. అక్కథికుండు - ఈ. ఐ. గ. చ. ట. త. ల. 2. యజ్ఞసేను - ఉ. 3. నతి దైన్యాస్ప - ల; నత్యంత దైన్యాస్పదుండగు - ఘ. 4. ధర్మజుదయయు - పెక్కింటలేదు.

3. 1. చేయునట్టి - ఉ. ల. 2. డిపుడు - ఈ. ఐ. త. 3. చేత పరాజితుండు - ఈ.

ర్చిన కృప నొప్పుచున్న కురుసింహులచేత విమోచితుండు నై
మనమున లజ్జ లేక మునిమండన యెమ్మెయి [4]నేఁగ వీటికిన్.

4. మత్తకోకిలము.

మేనఁ బ్రాణము దాల్చి [1]భంగము మ్రింగి యెప్పటి [2]చాడ్పునన్
మానవేంద్రుఁడ [3]నేను దద్దయు మానినన్ దలఁ బోత్మలోఁ
[4]బూను టాతని [5]కెట్లు గల్గఁగఁబోలు నారయ నద్భుతం
బైన తచ్చరితంబు సెప్పుమ యంతయుం బరిపాటితోన్.

5. వ. అని యడిగిన నమ్మహాముని [1]యిట్లను నట్లు కౌంతేయులచేత [2]బంధ మోచి
తుం డై దుర్యోధనుండు లజ్జా[3]కజ్జలితహృదయుం డగుచుఁ [4]జెదరిన సేనలం
[5]గూర్చుకొని కొంత దవ్వరిగి యొక్క సమ[6]తలంబునం బటమండిరవిరచనంబు
నిర్వర్తించి యభ్యంతర[7]మందిరమ్మున నొక్కరుండును దల్పంబుపయిం బడి
చింతాపరవశత్వంబు నొంది రాహుకబళనకలుషితుం డైన రోహిణీపతియునుం
బోలె విషాద[8]వివర్ణుం డయి యున్న[9]యెడఁ గర్ణుండు వచ్చి సముచితంబుగాఁ
గని యన్నరేంద్రున కిట్లనియె.

---

ఐ. త; చేనవమానమొంద – ఒ. 4. బోయె వీటికిన్ – ఈ. ఐ. ఝ; నేఁగ నింటికిన్ – ఔ.

4. 1. బన్నము – ల. స. 2. చాడ్పుమై – ల. కొన్ని ప్రతులు; యట్లయై – ఓ. క. వీ; యట్లనే – వ; యట్లయే – శ. 3. నేనటంచును మానహీనత నాత్మలోఁ – ఇ. ఏ; నేననే బహుమాన మౌ తల పాత్మలోఁ – ఔ; నంచుఁ దద్దయు మాని నేనని యాత్మలోఁ – ష; నంచుం దద్దయు......లోఁ – ఘ. శ. 4. బూనుటల్ (న్) తన కెట్లు – ఐ. త. 5. కేల – ఇ. ఏ.

5. 1. యిట్లనియె – పెక్కు ప్రతులు. 2. లబ్ధమోక్షుండై – ఓ. న; లబ్ధ మోక్షుం డై – ఇ. ల; లబ్ధజీవుండై – ఉ. లబ్ధమోచితుండై – కొన్ని ప్రతులు. 3. కలిత- పెక్కు ప్రతులు; కులిత – జ. 4. విరిగిన – అ; బెదరిన – ఔ. ఝ. 5. గూర్చు కొని – అ. జ. శ. వ; గూడుకొని – వా. కొన్ని ప్రతులు. 6. స్థలంబునం — ఉ ఔ. 7. గృహంబున – ల. కొన్ని ప్రతులు. 8. మానసుం – ఊ; వదనుం - ఔ; వివర్ణవదనుం – ఉ. జ. 9. నయ్యెడకుం గర్ణుండు – ఈ. ఎ. ఏ. ఐ. ఝ. త

6. చ. మనుజవరేణ్య చూడ నతిమానుష మమ్మెయి [1]గయ్య మెందుఁ గ
ల్గునె పటువిక్రమాన్వితులఁ [2]గ్రోధనిబద్ధులఁ గామరూపులం
జెనయఁగ వచ్చునే ఖచరసింహుల [3]నేరికి నట్టివారి [4]నే
పునఁ దునుమాడి గెల్చితి విభూతియెలర్పఁగ నీవుఁ దమ్ములుజ్.

7. ఉ. [1]అప్పుడు నీవు[2]సూడఁగ ననంతము[3]లై ఖచరేంద్రసైన్యముల్
గప్పె ననేక[4]సాయకనికాయములన్ వడి నన్ను నేనునుం
[5]గుప్పలు గూలనేసి రిపుకోటి వధించితి నంతలోన [6]న
[7]న్నొప్పరికించె సైన్యతతి యొక్కఁడనై రణభూమి [8]నొచ్చితిన్.

8. వ. అలోనన విరథుండనై వికర్ణురథంబెక్కిన నది సమరప్రదేశంబునకుఁ [1]దోలంగఁ
బఱచె దేవా[2]నీవు బల[3]విక్రమాతిశయంబులం [4]బ్రతివీరుల నోర్చి [5]యతుతుండ
వై యుండుట గనుంగొని కృతార్థుండనైతి [6]నిట్టి పరాక్రమంబు నేసినవా
రిజ్జగంబున నెవ్వరు గల రిది [7]యత్యద్భుతంబనినం గౌరవేశ్వరుం
డాత్మగతంబున నీతండు [8]మత్ప్రకారం బెఱుంగ[9]క యిట్లు వలికెం గాకేమి
యని లజ్జితుం డగుచు రాధేయున కిట్లనియె.

---

6. 1. భాగ్యమెందు – న. 2. గోటుల సంఖ్యల – గ. ఘ. ల. 3. నెవ్వరికట్టివారి – అ. ఈ. ఐ. త. 4. నేర్పున – ద.

7. 1. ఈ పద్యము వ్రాఁతప్రతులలో లేదని – న. 2. సూడ గగనాంతములై – న. 3. లైన యరీంద్ర – ఔ. 4. సాయకములన్‌వడి నన్నును నేను వారిపై – ఉ; సాయకములన్‌వడి నన్నును నేను నేపునన్ – ఎ. 5. గుప్పున గూరవేసి – ఉ; గుప్పునగూరవేసి – ఝ; గుప్పన గూరవేసి – ఊ. ఎ; గుప్పన గూరచేసి – కొన్ని ప్రతులు; గుప్పనఁగూరనేసి–చ. త. శ. ప. స; గుప్పనఁగూరలేసి–వి. న; గుప్పలుఁ గూరలేసి – శ. 6. నేనొప్పరగించి యొక్కతరి నొక్కఁడనై – ల. 7. న్ను ప్పరిగించి – ఓ. 8. నోర్చితిన్ – ఔ. ద; నిల్చితిన్ – చ; బొచ్చితిన్ – ఇ. వి. ఘ. శ.

8. 1. దోలంగనిచ్చె – వి. శ. ప; దోలంగ – ల. 2. నీవు – ఊ. ల. ప్రతులలో లేదు; నీబల – కొన్ని ప్రతులు. 3. పరాక్రమాతి – అ. ఎ. ఐ. 4. బరవీర – అ. ఎ. ఐ. ఝ. 5. యజేయుండై – ఒ; లక్ష్మీయుతుం – అ. 6. నీయట్టి – కొన్ని ప్రతులు. 7. యద్భుత – పెక్కు ప్రతులు. 8. మత్పరాభవం – క. 9. నేరకయిట్లు – ఘ.

17. ఉ. అక్కట యమ్మహారణమునందు వియచ్చరకోటితోడఁ బే
రుక్కునఁ బోరి[1]యేను మృతి నొందఁగ నేరన [2]యట్లులైన నీ
తక్కువపాటు లేక ప్రమదంబున [3]దేవపదంబు నొందుదుఁ
మిక్కిలి[4]యైన కీర్తియును మేదినియందు వెలుంగు నిత్యమై.

*-: దుర్యోధనుండు ప్రాయోపవేశంబు సేయఁ బూనుట :-*

సం. 3 - 238 - 10

18. వ. [1]కావున నిట్టి దురవస్థ[2]పాలైతి నేను ప్రాయోపవేశంబునఁ బ్రాణపరిత్యాగంబు జేసెద మీరందఱు దుశ్శాసనుం బురస్కరించుకొని పురంబున కరుగునది మిత్త్రులకుఁ బ్రమోదంబును శత్త్రులకు [3]నిర్వేదనంబునుం జేయుచు మనునట్టి యేను నేఁడు బోఁడిమి సెడి పగతురచేత [4]శిరస్తాడనంబు సేయంబడి సిగ్గువడక బంధుజనంబులలోని కేమని యరుగుదు [5]నాంబికేయుం గని యేమని పలుకుదుఁ గురువృద్ధు లయిన భీష్మబాహ్లికులయు నాచార్యు లయిన కృపద్రోణులయు సమ్ముఖంబున నెట్లు నిలుతుఁ బరిజనులుం బౌరులుం బురోహితులు నన్నుం గనిన నేమని [6]సంభాషింతు నిది యాత్మదోషంబున నైన యపాయంబు [7]నాకవశ్యభోక్తవ్యంబు.

19. క. విను దుర్వినయాత్మకుఁ డగు, జనుఁ డుజ్జ్వల మైన సిరియు [1]సద్విద్యయుఁ గ
ల్గిన నందు[2]మెలఁగ[3]నేరక, చెనఁటి [4]తెఱంగునకుఁ జొచ్చి చెడి పోవుఁ దుదిన్.

20. క. [1]అకటకట యిట్టి కష్టము, నకు వచ్చితి నయ్య యేను [2]నన్నలు వైరి

---

17. 1. లోన మృతినొందితినేనియు నిట్టిదైనయాతక్కువ - స. 2. యట్టిదైన - ల. శ; యెట్టిదైన - ఝ. 3. నుండుదు తత్పదంబునన్ - ట. 4. గాగకీర్తి - ట.

18. 1. ఈ వచనము. ఎ. ప్రతిలో లేదు. 2. పాలైన యేను - ల. కొన్ని ప్రతులు; పాలైననేను - కొన్ని ప్రతులు; పాలై యేను - ఘ; పాలై నేను - ఇ. ఏ. 3. నిర్వేదంబునుం - ల. 4. విడిపింపంబడి - చ. 5. నాంబి...పలుకుదు - ఆ. ఈ. ఐ. త. ప్రతులందు లేదు. 6. సంభావింతు - ఊ. ఓ. ఘ; నొడువుదు - ఉ; పలుకుదు- గ. 7. నాకు నవశ్య - ఘ. ల.

19. 1. సద్వీర్యము - ఇ. ఏ. 2. మెదల - ఉ. 3. జాలక - గ. 4. తలంపునకు - గ.

20. 1. అకటాయీవిధి - ట. 2. నన్నల - ల; ననుగంధర్వ - ట; నన్నదె - ఏ.

ప్రకరము లనిఁ బట్టినఁ[3] గృప, నొకరుఁడు విడిపించె దైవ మోపదె[4] యెట్లుల.

21. క. [1]మానము సెడి[2]యును నిమ్మై, మేనం బ్రాణంబు లెట్లు [3]మేకొని తాల్తుం [4]గాన యిది నిశ్చయముగాఁ, బూనితి నాతెగువ మాన్పఁ [5]బోల దొరులకుల.

22. వ. [1]అని పలికి సమీపగతుం డైన దుశ్శాసను నాలోకించి యమ్మహీపాలుం డి ట్లనియె.

23. సీ. [1]అన్న దుశ్శాసన నిన్ను రాజ్యమునకుఁ బట్టంబు గట్టెదఁ బతివిగమ్ము శకునికర్ణులు దీర్పఁ బ్రకటవసుంధరావలయ మంతయు మహోజ్జ్వలత నేలు భ్రాతృవర్గమునకుఁ బ్రీతి సేయుము బంధుజనుల బోషింపుము సద్ద్విజులకు నుత్తమం[2]బుగఁ దగువృత్తులు సెల్లింపు గురుజనంబుల భక్తిఁ గొలువు మెపుడు

తే. నింద్రుఁ డమరగణంబుల[3] నేలునట్లు, [4]ధరణిపతుల నేలుము బాహుదర్ప [5]మొప్పఁ

బగఱ నుక్కడఁగింపుము పరమమిత్రు, లైన శూరులఁ గొనియాడు [6]మర్థ్యభంగి.

24. వ. [1]అనిన నమ్మాట దన[2]హృదయంబునకు నిశితశూలం బయిన నతండు నిలువ

---

3. రిపు లొకటం గృప విడిచిపుచ్చి రున్నతు లగుచున్ — ఔ. 4. యెందున్ — ఘ. ఝ.

21. 1. ఈ పద్యము. ఎ. ఓ. ప్రతులలో లేదు. 2. పోవగనీమేనం — ల. కొన్ని ప్రతులు; పోవగ నెమ్మేనం — ఇ. ఉ. చ. 3. మెయికొని — ఝ. 4. గాననిది — ఖ. ల. వీ; గానిపని మృతియలెస్సని...బోదెవ్వరికిన్ — ఔ; గాన నిదియ నిశ్చయముగ — ఘ. 5. బోల దొకనికిన్ — ల. స. పెక్కు ప్రతులు; బోల దొకరికిన్ — ఇ. ఉ. ఏ; బోలునె యింకన్ — గ.

22. 1. ఎ. ఓ. ప్రతులలో నీ వచనము లేదు.

23. 1. ఎ. ప్రతిలో నీ పద్యము లేదు. 2. బగువను — ఇ; బగుచున్న — చ; బుగ జాగు — కొన్ని ప్రతులు; బుగప్రీతి — ఔ. ద; బగువనువృత్తముల్ చెల్లింపు — స. 3. దానేలునట్లు — ఉ; ల నేలినట్లు — ఝ. 4. ధారుణీశుల — ఔ; ధరణిధవుల — ఈ. ఐ. త. 5. మునను — ఇ. ఏ. 6. హర్షభంగి — ద.

24. 1. ఈ వచనము ఎ. ప్రతిలో లేదు, 2. హృదయశూలం బయిన — ఈ. ఉ; మనంబు

[3]నోపక యగ్రజు పాదంబులపయిం బడి దేవా [4]యి ట్లానతీ[5]దగదు నాకుం బ్రసన్నుండ[6]వగు మని నిజనేత్రజలంబులం దదీయచరణయుగళం బభిషేకించుచు ని ట్లనియె.

25. చ. అవని [1]విదీర్ణ మైనను [2]హిమాద్రి చలించుట గల్గినన్ మహా
ర్ణవ[3]మది యింకినన్ దివసనాథుఁడుఁ జంద్రుఁడు దేజ మేదినం
గువలయనాథ [4]నీకు నొక కుత్సితభావముఁ గల్గ నేర్చునే
భవదుపయోగ్య మైన నృప[5]భారము నాకు వహింప శక్యమే.

26. క. హితు లైనవారిఁ బ్రోచుచు, సతతంబును రిపుల[1]నెల్ల జమరుచు నిఖిల
క్షితితలము నీవ యేలుము, శతసంవత్సరము[2]లధిప జయశీలుఁడ వై.

27. వ. అనుచు నయ్యువరాజు దుఃఖాతి[1]భారవిహ్వలుం డై యెలుంగెత్తి యేడ్చిన నయ్యన్నయుం గన్నీరొలుక నూరకుండె నప్పుడు కర్ణుండు [2]వారలం జూచి యిట్లేల [3]బాలిశులుంబోలె నేడ్చెదరు ధైర్యంబు[4]లు ధరియించి [5]శోకవ్యసనంబులు విడువుండు శోక[6]శీలురం జూచి పగతురు సంతసిల్లుదురు శోక[7]శీలురకుఁ బై పై శోకంబులు వొందు నని దుర్యోధనుం బేర్కొని [8]యి ట్లనియె.

---

నకు – క. 3. నోర్వక – ఔ. చ. ల. నేరక – ఘ. 4. మీరిట్లానతీఁదగదు – ల. 5. దగునే – ఉ; వలవదు – క. వీ. 6. వుక(గ)మ్మని – కొన్ని ప్రతులు.

25. 1. విశీర్ణ – పెక్కు ప్రతులు. 2. మహాద్రి – చ. 3. మది యింకినన్–స. పెక్కు ప్రతులు; జలమింకినన్ – వా. కొన్ని ప్రతులు. 4. తనువుకున్ హత భావము – ఓ. 5. భావము – శ. పెక్కు ప్రతులు.

26. 1. నేల – ఆ. ఐ. ఓ; కాల – ఔ; నెల్లజదువుచు – ఆ. ద. ల. స. 2. లధిక – పెక్కు ప్రతులు.

27. 1. భావ – ఘ. చ. 2. వారింజూచి – కొన్ని ప్రతులు. 3. బాలికలట్ల – ఐ; బాలిశులై బాలశిశువులుంబోలె – క. 4. లు – కొన్ని ప్రతులలో లేదు. 5. శోకంబు విడువుండు – ఉ; వ్యసనంబులు విడువుండు – ఈ. ఐ. త. 6. శీలునిం జూచి – కొన్ని ప్రతులు. 7. శీలునకు – ఘ. ద; శీలుని – కొన్ని ప్రతులు. 8. మరియు నిట్లనియె – కొన్ని ప్రతులు.

28. క. ఒక యల్పమనుజుక్రియ నో, మ[1]కులోత్తమ నీకు నిట్లు మహనీయసుఖ
ప్రకృతి యగు [2]నిజశరీరం, [3]బకట విడువఁ దలఁప నగునె [4]యవిహితబుద్ధిన్.

29. తే. శోకమగ్నుండ వగు నిన్నుఁ జూచి [1]బెగడి, యధిప నీతమ్ములును [2]నేను నధికదుఃఖ
వహ్ని [3]పొల్పడమయ్యు మావలనఁ గరుణ, గలిగి [4]తీర్చవె యిందఱఁ గౌరవేంద్ర.

30. వ. పాండవులచేత [1]విముక్తుండ వైతి నని [2]వగచె దంతియకాని నీకుం గార్య గతియందు వివేకంబు [3]సాల దది యెట్లనిన [4]నేరాజురాజ్యంబున [5]నిశ్చింతు లయిన జనులు తమతమ జీవనంబుల [6]వర్తింతు రారాజునకు [7]నట్టిజనులు బంట్లు గావునఁ [8]దా రమ్మహీ[9]పతికిం దీఱమి గల్గినచోట్ల నెల్లనుం [10]దమ పౌరుషంబులు [11]నెఱప వలయుఁ గౌంతేయులు నీదేశంబుననుండి నీయాజ్ఞావలనం గృతారంభు లై యున్నవారగుటం జేసి వారు నీకింకరులు [12]నీకునైన యక్కఱ [13]దీర్చుట వారికర్తవ్యాకృత్యంబు దీని కింత [14]వనర నేల యదియునుంగాక పాండవులు జూదంబు[15]నాఁడ నీకు [16]దాసు లైరి తదీయంబు లైనమణికనకాది[17]వస్తువులును భవదధీనంబు లై యున్నయవి వారు

---

28. 1. కులోద్భవ – ఉ. గ. ఘ. స. 2. నీశరీరం – ప. కొన్ని ప్రతులు. 3. బకటా విడువంగనగునె – శ. ష; బకటయు పేక్షింపనగునె – ఎ; బకటవిడువఁదగునెతలఁప–ల. 4. యవహిత – ఇ. చ. శ; యనిహిత – శ.

29. 1. యిప్పుడధిప – ల. పెక్కు ప్రతులు. 2. నేము – ఉ. ఊ. ఓ. చ. ఝ. ల; మేము – ఇ. ఏ. డి. 3. పొల్పడనయ్యు – ఉ. ఓ; పొల్పడనయ్యొ – ఝ; పొల్పడ నీవు – అ. ద; పొల్పడియున్న – ఔ; పొల్పడకుండ – ల. స. 4. తీర్పుమమ్మిం దర – క. జ. ల; తీర్పవె మమ్మెల్ల – ఝ.

30. 1. విమోచితుండ – ఇ. ఐ. ల. 2. వగచెదవంతియ – ఉ. ఔ. చ. 3. లేదది – ఎ; చాలదెట్లనిన – ల. శ. ప. 4. నెందును నేరాజు – కొన్ని ప్రతులు. 5. నిశ్చిత్తు– కొన్ని ప్రతులు. 6. వర్తిల్లుదురట్టి – ఉ; వర్తింతురట్టి – పెక్కు ప్రతులు. 7. నజ్జనులు – పెక్కు ప్రతులు. 8. వారు – కొన్ని ప్రతులు. 9. పతికినెడ రైనచోట్ల – ఇ. ఊ. ఏ. ల; ప్రతికిందిరంబు గల్గిన – ఒ. గ. చ. ఝ. 10. దమ తమ – ఉ. జ. ఝ. ల. 11. మెరయ – పెక్కు ప్రతులు. 12. నీకైన – పెక్కు ప్రతులు; నీదైన – జ. ఝ. ల. 13. దీర్చుటయు నర్హ – ఇ. ఉ. ఒ. జ. 14. వగవ – ఖ. జ; మరుగ – ఆ. ఈ. ఊ. ఎ. త. ద. 15. నాటనుండి – ఒ. ఓ. ఘ. జ. ఝ. 16. దారుదాసులైరి – కొన్ని ప్రతులు. 17. సమస్త వస్తు

నిన్నుం గొలిచియుండుట [18]లేకుండెనేనియు నింతటికెల[19]సంబు దీర్పనేనియు వలదే యిది యంతయు [20]నూహించి వలవని వగలం బొగల[21]క [22]లెమ్ము పురంబునకు నడువుము నామాట వినక నిర్బంధపరుండవై తేనియు నిన్నే మన[23]వచ్చు నిందఱము నీపోయిన [24]గతిన పోవంగలవారము [25]నీవు లోకంబుచేత నగుఁబాటును [26]బొందెద వింతియ యని కర్ణుండు సెప్పిన [27]విని దుర్యోధనుండు వెండియుం బ్రాయోపవేశంబునందు [28]నిశ్చయంబు వదల కున్నం గనుంగొని శకుని యిట్లనియె.

31\. క. [1]కర్ణునియాడినమాటలు, నిర్ణయమున కింత యొప్పునే [2]యిప్పలుకుల్
కర్ణంబులఁ జొనుపుము దుః, ఖార్ణవపారంబుఁ బొందు మవనీనాథా.

32\. తరలము.

కడఁగి బుద్ధిబలంబు[1]నంద యకంటకంబుగఁ జేసి యేఁ
బుడమిరాజ్యము సర్వముం దగఁ [2]బుచ్చి యిచ్చిన నిమ్ములం
గుడువ నేరక [3]దీని[4]నిచ్చటఁ గూలఁ దన్ని శరీరమున్
విడుతుఁ గా కని నిశ్చయిం[5]చెద వెట్టి వైతె [6]నరేశ్వరా.

---

వులు – కొన్ని ప్రతులు. 18. లేకుండి రేనియు – ల. 19. సం బైనను దీర్ప వలదే – ఊ; సంబు దీర్పనైనను – ల. పెక్కు ప్రతులు; సంబుదీర్పుదురె – ఓ. క. ఝ. 20. నూహింపక – ఔ. చ. 21. నేల – చ; నేటికి – ఔ. 22. రమ్ము – చ. 23. నేర్తు మిందరము – ఔ. 24. గతింబోవంగలవారము–కొన్ని ప్రతులు; గతింబోవువారము – ల. 25. నీవును – ల. కొన్ని ప్రతులు. 26. బొందంగల వాడవని – కొన్ని ప్రతులు. 27. విని – పెక్కు ప్రతులలో లేదు. 28. కృత నిశ్చయుండై యున్నం – ఝ; నిశ్చయంబుదప్పక యున్నం – గ; నిశ్చయంబు వదలక యున్నం – ఔ. ద. ల.

31\. 1. కర్ణుండాడిన – కొన్ని ప్రతులు. పెక్కు ప్రతులందు నాల్గుపాదములందును 'ర్న' ప్రాసముగలదు. ఈ పద్యము. ఊ. ప్రతిలో లేదు. 2. యప్పలుకుల్ – ద. ల.

32\. 1. దర్పయు – శర. సూ. కొన్ని ప్రతులు; నందె – ల. 2. బూన్చి – ఝ. 3. వీని– క. ఘ. 4. నిశ్చల...వెట్టినైతి – స. 5. చితి – కొన్ని ప్రతులు. 6. వైతి – పెక్కు ప్రతులు.

33. ఆ. నీకు వృద్ధసేవ[1]లేకున్కి యిప్పుడు, నాకుఁ దెల్ల మయ్యెఁ బ్రాకటముగఁ
గోపమును మనోనుతాపంబుఁ [2]బొందుచో, ధీరుఁ డపుడ [3]యడప నేరవలదె.

34. తే. [1]పిఱికితనము నేమఱుటయు [2]నొఱువతనము
మెత్తఁబాటు[3]ను గార్యంబు [4]నత్తెఱంగు
నేరమియు విషయంబులఁ గూరుటయును
గలుగుపతికి నుండదు సిరి దొలఁగి పోవు.

35. వ. కావునఁ గార్యజ్ఞుండ వగుము కార్యజ్ఞానం బెట్టి దనిన.

36. ఉ. కౌరవనాథ నీకు నుపకారము సేసిరి పాండవేయు ల
వ్వీరులయందు నెయ్యమును వేడ్కయు [1]నొప్పఁగ నీ వభీష్టస
త్కారము సేఁత యుక్త మగు గాక ప్రియంపడ నర్హు మైనచో
దారుణశోకవహ్ని పరితాపముఁ బొందుట [2]యిప్డు[3]ధర్మువే.

37. చ. కృతము దలంచి చి తమునఁ గిల్బిష మంతయు నుజ్జగించి స
న్మతులఁ బృథాతనూజుల నమానుషతేజులఁ బిల్వఁబంచి త
త్పితృధనమైన రాజ్యము నభీష్టముగాఁ దగ నిమ్ము నీకు నీ
క్షితివలయంబునం బరమకీర్తియుఁ బుణ్యముఁ గల్గు భూవరా.

38. క. వారలు [1]నీతోఁబుట్టువు, లీరాజ్యము [2]మీరు వారు నేకంబై [3]పెం
పారఁగ నేలుఁడు దీనం, గౌరవకుల[4]నాథ [5]సౌఖ్య గౌరవ మొందున్.

---

33. 1. లేకుండుట యిపుడు – ఈ. ఐ. త; లేకుంట యిప్పుడు – కొన్ని ప్రతులు. 2. బొందిన – ఉ. 3. యడప – ల. స. శ. పెక్కు ప్రతులు; యుడుప – వా. కొన్ని ప్రతులు.

34. 1. ఈ పద్యము ఇ. ఏ. ప్రతులలో లేదు. 2. నెరతనమ్ము – ఈ. ఐ. త; నెఱవతనము – ఝ. స; మఱువతనము; దెఱవతనము – పీ. శర. స. శ; నరవతనము – అ. ఝ; గఱువతనము – ఘ. ప; నెఱవుతనము – కసం. ల; నొఱవతనము – సూ. 3. ను–కొన్ని ప్రతులు; నఁ–వా. కొన్ని ప్రతులు. 4. నెత్తెఱంగు–శ. కొన్ని ప్రతులు.

36. 1. నొప్పగ నీకభీష్టవస్తు – శ; కొన్ని ప్రతులు. 2. నీకు – కొన్ని ప్రతులు. 3. ధర్మువే – పెక్కు ప్రతులు; ధర్మమే – వా. కొన్ని ప్రతులు.

38. 1. మీ – అ. గ. ఘ. 2. నీవు – ఆ. ఈ. ఐ. త. 3. యింపారగ – ఏ. 4. ముఖ్య – స. 5. రాజ్య – గ.

39\. వ. అని శకుని సెప్పుచుండ సగ్గాంధారీనందనుండు నిజచరణసమీపంబునం బడి యున్న దుశ్శాసనుం గ్రుచ్చియెత్తి [1]మూర్ధాఘ్రాణంబు సేసి కర్ణసౌబ లులం జూచి మీ రేల నన్నుం గాఱించెదరు ధృతి రాజ్యధనభోగంబు[2]లందు నా కభిలాషంబు లేదు ప్రాయోపవేశంబునందుం గృతనిశ్చయుండ నైతి [3]మీ రింక నొండువిఘ్నంబులు సేయక యూరికి మీరలయు నెడకుం బొం డనిన వారలు దేవా నీవిధం బిట్టిద యయ్యెనేని మే మెందుం [4]బోవము నీతోడి వారము కాక యని రంతం గమలహితుండు పశ్చిమాచలసమీపగతుం డగు టయు [5]నన్నరనాథుండు సురలోక[6]గమన[7]కామావేశి యై శుచిస్నానంబు సేసి వల్క[8]లంబులు ధరియించి సంధ్యాసమయ[9]సముచితంబు లగు కరణీయంబులు నిర్వర్తించి వివిక్త[10]దేశంబునందు దుర్భాస్తరణంబు నాసీనుండై వాఙ్నియతుండై.

40\. క. క్రమమున బాహ్యేంద్రియముల, గ్రమము దెల్లను మనము విడిచి మహితసమాధి
[1]క్రమదశ నుండె నివాత, స్తిమితం బై వెలుఁగుచున్న దీపముపోలెన్.

—: ప్రాయోపవిష్టుం డైన దుర్యోధనుని గృత్య పాతాళంబునకుఁ గొనిపోవుట :—

సం. 3 – 239 – 18

41\. సీ. [1]ఆసమయమున మున్నమరేంద్రవిజితు లై యహితలోకనివాసులైన యసురవరులు
ధృతరాష్ట్రనందను తెఱుఁగు నెఱింగి యాత్మీయపక్షక్షయమ్మునకు వగచి

---

39\. 1. మూర్ధ్ని – పెక్కు ప్రతులు. 2. లయందు నాకునతి – పెక్కు ప్రతులు. 3. మీరింకనన్ను – అ. క. ఝ. ద; మీరింకనాకు – ఒ. ల. 4. సేరుదము–కొన్ని ప్రతులు; సేరువారము – కొన్ని ప్రతులు. 5. బాహుజా – కొన్ని ప్రతులు. 6. గమనోన్ముఖుం డై – ల. 7. కాముకాంశి – ఉ. ఒ. ఝ; కుతూహలుం డై – ఉ. ద. 8. లాజినంబులు – కొన్ని ప్రతులు. 9. సముచిత కరణీయంబులు – ల. 10. ప్రదేశంబున – కొన్ని ప్రతులు.

40\. 1. క్రమదర్శి యై నివాత – ఒ. శ; క్రమపటుఁడయ్యె నివాత – గ. ల; క్రమవశ దగుచు – ఋ. ప.

41\. 1. ఆ సమయంబున నమరేంద్ర – పెక్కు ప్రతులు.

[2]యాతనిఁ బిలిపింప నప్పుడు శుక్రాదు లైన భూసుర[3]సమూహములచేత
[4]వేల్మి వెట్టించిన వేగంబ యొక[5]కృత్య వెలువడి భీషణవికృతమూర్తి

ఆ. యేమి[6]పనులు గలిగె నెఱిఁగింపుఁ డనిన వా, రిచటి కిపుడు కౌరవేంద్రు ననఘు
నుజ్జ్వలాంగు నాసు యోధనుఁ దెమ్ము ప్రా, యోపవేశ[7]వృత్తి నున్నవాని.

42\. వ. అని పనిచినం [1]గృత్యయు నాక్షణంబ చని ప్రాయోప[2]విష్టుం డై యున్న దుర్యోధను గ్రుచ్చి యెత్తికొని [3]రసాతలంబునకుం దెచ్చి దైత్యుల[4]కు సమర్పించినం బ్రీతు లై వారు వానిం[5]గౌఁగిలించికొని కుశలం బడిగి యిట్లని రయ్యా నీవు శూరుండవు శూరజన[6]రక్షితుండవు భరత[7]కులోద్వహుం[8]డ విట్టిసాహసం బేల [9]చేసితివి మఱి యాత్మ[10]ఘాతకునకు లోకంబున నిందయు హీనతయు దుర్గతియుం బ్రాపించు లోకవిరుద్ధంబు లై [11]మూలఘాతంబు లైన కార్యంబులయందు నీయట్టిబుద్ధిమంతులు ప్రవర్తిల్లుదురే యట్లుగావున [12]నీ వఖలధర్మార్థయశోభోగ[13]నాశం బైన యీదుర్విచారంబు [14]విడువుము [15]ధైర్యంబును బ్రతాపంబును [16]బాటింపుము శత్రుజనభంజనంబు సేయుము నీవు మనుష్యమాత్రుండవు గావు [17]నీపూర్వజన్మప్రకారంబు సెప్పెద మాకర్ణింపుము.

---

2\. యంత బెల్చన చని యప్పుడు – ఆ; యాతని బిలిపింపనని యప్డు–కొన్ని పతులు. 3. సమూహంబుచేత – ల. కొన్ని ప్రతులు. 4. వేలిమి వెట్టిపవేగంబ – పీ. ష; వేలిమి వెట్టించి వేగంబవేల్వంగ నొకకృత్యవెలువడి వికృతమూర్తి – అని కొన్ని ప్రతులందుఁగలదు. కానియతినియమభంగము. 5. కృత్తి – పెక్కు ప్రతులు. ఇచ్చటమూలమున కృత్య అని యేకలదు. కృత్యా సముత్థితా రాజన్ కింకరోమీతి చాబ్రవీత్. పి. పి. ఎస్. ప్రతి. ఆరణ్యపర్వ పుట. 239. 6. పంపుగలదు – ఔ; పనులుగలిగె – ఇ. 7. బుద్ధి – ఇ. ఏ; వృత్తి – పెక్కు ప్రతులు; మందు – ఓ. ఘ. ఌ. నమున – వా. కొన్ని ప్రతులు.

42\. 1. గృత్తి – పెక్కు ప్రతులు. 2. విష్టుండైన – కొన్ని ప్రతులు; వేశనిష్ఠుండై యున్న – అ. ఝ. ద. 3. పాతాళంబునకుం – ఓ. ఝ. ట. 4 కొప్పించినం – పీ. శ. ష; కప్పగించినం – ఒ. 5. గౌగలించుకొని – కొన్ని ప్రతులు 6. రక్షకుండవు – ల. స; సేవితుండవు – పీ. 7. కులోద్భవుండ – స. పెక్కు ప్రతులు 8. డవునీవిట్టి – కొన్ని ప్రతులు. 9. చేసెదవాత్మ – ఈ. ఐ. త. శ. ష. 10. ఘాతకుండు లోకనిందయు దుర్గతియు – పెక్కు ప్రతులు. 11. మూలఘాతంబులై – ఆ. ఇ. ఔ ప్రతులలోలేదు. 12. నిఖిల – పెక్కు ప్రతులు. 13. నాశకంబైన – ఇ. ల; నాశనంబైన – ఊ. ద; విరహితంబైన – అ. ఓ. ఝ. 14 మానుము – 15. వైరంబును – శ; ధైర్యంబును బరాక్రమంబును – ఇ. ఉ. ఏ. ల. 16. బాలింపుము – ద. 17. నీపూర్వ ప్రకారంబు – ఈ. ఐ. త; నీజన్మప్రకారంబు – గ.

43\. ఉ. ఏము తపంబుసేసి పరమేశ్వరు నీశ్వరు బార్వతీమనః
కాముకుఁ గామవైరి నవికారుఁ బురాంతకుఁ బ్రీతుఁ జేసినం
గామిత[1]దాయి యైన[2]శితికంఠుఁడు నిన్ను [3]సృజించి యిచ్చె ను
ద్దామదయావిధేయుఁడు ముదంబున మాకు నధీశ్వరుండుగన్.

44 ఉ. నీ దగు పూర్వదేహము వినిర్మలవజ్రశిలావిశేషసం
పాదిత మస్త్రశస్త్రపరి[1]పాటనభేద్యముగాదు [2]నిత్యనిః
ఖేదము పుష్పకోమలము. ఖేచరభూచరకామినీమనో
[3]హ్లాదన మిట్లుగా నభవుఁ డర్థి నొనర్చె నుమాసమేతుఁడై.

45\. ఉ. నీవు ధరిత్రిఁ బుట్టుటయు నీకు[1]సహాయము సేయఁగోరి నా
నావిధదైత్యదానవగణంబులు రాజకులంబు[2]లందు స
[3]ద్భావన నుద్భవించెఁ బటుబాహులు దివ్యమహాస్త్రకోవిదుల్
[4]ద్రావితవైరు లుర్వి భగదత్త[5]పురస్సరు లైన వీరు[6]లై.

46\. వ. భీష్మ ద్రోణ [1]కృపాదులు గొందఱు దేవాంశసంభవు లైనను దదీయభా
వంబులు రాక్షసావేశంబు [2]నొందెడు [3]దానం జేసి [4]వారు నిర్దయులై విమూ
ఢులుంబోలె నన్యోన్యపరుషంబులు వలుకుచు నలుక మిగులం బుత్రపౌత్ర
మిత్రభ్రాతృ[5]శిష్యగురుబాలవృద్ధజనభేదంబులు విచారింపక సమరంబు సేసి
దివ్యంబులు మానుషంబులు నైన వివిధాస్త్రశస్త్రంబులఁ బాండవపక్ష

---

43\. 1. దాత – కొన్ని ప్రతులు. 2. కరకంఠుఁడు – ల. 3. సృజించెఁదొల్లి – కొన్ని ప్రతులు; సృజించెఁదాన – కొన్ని ప్రతులు.

44\. 1. పాతన – స. శ. పెక్కు ప్రతులు. 2. నిర్మనః – ఈ. ఐ. త, 3. హ్లాదన మట్లుగా – ఓ. క. జ. స. ల; హ్లాదకమట్లుగా – వీ. ష; హ్లాదముగాగ నిట్లభవు – ఉ; హ్లాదమునిట్లుగా – ఘ. చ.

45\. 1. సహాయత – పెక్కు ప్రతులు. 2. నందు – పెక్కు ప్రతులు. 3. ద్భావులు– ఎ. ల. 4. ధావిత – అ. స. 5. పురోగము – ఇ. ఏ. ల. 6. లున్ – అ. గ. ల.

46\. 1. కృపాశ్వత్థామలు గొందరు – కొన్ని ప్రతులు; కృపాదులైన వీరులుం గొందరు – ల. 2. నొందెదరు – ఇ. ఏ. ఔ. ద, 3. దాననచేసి – ల. కొన్ని ప్రతులు. 4. వారు.......సమరంబుసేసి – ఈ. ఐ. తి. ప్రతులలో లేదు. 5. శిష్యబాల వృద్ధ

క్షయంబు [6]గావింపంగలవారు పాండవు[7]లు బంధుస్నేహంబు విడిచి తెగువకుం జొచ్చి నీచేత నిహతు లగుదురు నీమనంబున [8]బీభత్సువలని భయంబు గొంత గలదు దానినెఱింగి [9]నేమునుం [10]దగునుపాయంబు దలంచితి మది యెట్లనినఁ గృష్ణుచేతం జచ్చిన నరకాసురునంశంబు గర్ణు నావే[11]శింపంగల యది తత్కారణంబునం [12]గృష్ణార్జునులతోడ [13]బద్ధవైరుండై యవ్వీరుండు నిజదివ్యాస్త్రంబులం [14]గృష్ణుల నిద్దఱ [15]నిర్దహించు నివ్విధం బెఱింగి యింద్రుండు పాండవ[16]రక్షణార్థంబు వచ్చి కర్ణుకవచకుండలంబులు గపట రూపంబున నపహరింపంగలవాఁడు మఱియును.

47. క. క్షితి సంశప్తకు లనఁగా, శతలక్షసహస్రసంఖ్య [1]జనియించిరి ద
ర్పితు[2]లై దనుజులు దర్పుల, తతిచే సమరమున నింద్రతనయుఁడు [3]సిక్కున్.

48. తరలము.

నిహతకంటక మైన యిద్ధరణీతలం బఖిలంబు నీ
మహితశాసనగోచరం బగు మానవేంద్ర [1]ప్రసన్నతా
మహిమ నొందుము నీవ[2]తేపవు మాకు[3]నందఱకుం గురూ
ద్వహ [4]విషాదము నొందఁ బాడియె దైత్యపక్షభయంబుగన్.

49. మ. చను మిం కొండుదలంపు మాను మని యాశ్వాసించి వానిం బునః
పునరాలింగన మాచరించి యెలమిం బూజించి దైత్యోత్తముల్
[1]జననాథోత్తమ వీడుకొల్పిరి తదాజ్ఞం జేసి యా[2]కృత్యయుఁ
మును దాఁ దెచ్చిన [3]చోటఁ బెట్టె నధిపుఁ [4]మోదంబు సంధిల్లఁగన్.

---

భేదంబులు – పెక్కు ప్రతులు. 6. సేయంగల – కొన్ని ప్రతులు. 7. లును – ల. కొన్ని ప్రతులు. 8. వివ్వచ్చువలని – ల. 9. యేము – పెక్కు ప్రతులు. 10. దగిన యుపాయంబు – గ. జ. ల. 11. శించియున్నయది – ఔ. 12. కృష్ణార్జునుల......రూపంబున – ఊ ప్రతిలో లేదు. 13. ప్రవృద్ధ – కొన్ని ప్రతులు. 14. గృష్ణార్జునుల నిద్దర – ఇ. ఏ. ల; గృష్ణుల నిర్దహించు – ఆ. ఈ. ఎ. ఐ. త. 15. గీటడంచు-ఘ. 16. రక్షణార్థియై కర్ణు-కొన్ని ప్రతులు; రక్షణార్థంబై కర్ణు – కొన్ని ప్రతులు.

47. 1. జన్మించిరి – జ. 2. లగు – ల. 3. నీల్గున్ – చ.

48. 1. ప్రసిద్ధతా-జ. స. 2. తెప్పవు-ల. పెక్కు ప్రతులు. 3. నిందఱకుం-శ. పెక్కు ప్రతులు. 4. విషాదము నీకు-స. పెక్కు ప్రతులు; వివాదము నొందఁ బాడియె-స.

49. 1. జననాథోత్తము – ల. శ. 2. కృత్తియున్ – పెక్కు ప్రతులు. 3. చోన బెట్టి – ఔ. చ. స. 4. గోపంబు – ఘ.

50. ఉ. అంత సుయోధనుండు హృదయంబున [1]విస్మయ మంది యంతవృ
త్తాంతము స్వప్నవృత్తము క్రియం దలపోసి నిజంబ కాఁగ న
త్యంతము [2]నిశ్చయించుచుఁ బృథాసుతులఁ సమరంబులోన ని
ర్జింతున కాక యంచు [3]వికసిల్లె [4]దురాశయభగ్నబుద్ధి యై.

51. క. విను జనమేజయ [1]పౌరవ, జనవిభుఁ డబ్బంగి రాత్రి [2]చరితం బగు న
ద్దనుజసమాభాషణ మె, వ్వనికిని నెఱిఁగింప కుండువాఁ డయ్యె మదిన్.

52. వ. అంతఁ బ్రభాతం బగుటయు రాధేయుండు సుయోధనుపాలికిం[1]జని [2]హేతు
మద్వాక్యంబుల నతని కి ట్లనియె.

53. ఉ. చచ్చినపిమ్మటం [1]గడిఁదిశత్రుల నోర్వఁగ వచ్చునే శుభం
బిచ్చునె చావు లెందును నరేశ్వర యాఱడి చత్తు నంట దా
మెచ్చగు నయ్య [2]యేరికిని [3]మేనికి జీవము గల్గు[4]చోన పెం
పచ్చుగ [5]సిద్ధిఁ బొందు విజయార్థ[6]సుఖంబులు మర్త్యకోటికిన్.

54. ఉ. కావున శోకదైన్యములకాలము గా దిది లెమ్ము విక్రమ
[1]శ్రీ విలసిల్లు మంచుఁ [2]గురుసింహుని సింహసమానుఁ [3]జారుశ
య్యావి[4]వశాంగు నంగపతి [5]యాదటఁ దా నిరుగేల గ్రుచ్చి సం
భావన నెత్తుచుం బ్రణయభాషల వెండియు వాని కిట్లనున్.

---

50. 1. సంతసమంది - చ. 2. విశ్వసింపుచు - ఇ. ఏ. ల. 3. విలసిల్లు - జ. ల. 4. దురాగ్రహాభుగ్న - చ; దురాశయబద్ధ - ఈ. ఐ. త; దూరాశనుభగ్న - ఔ. గ; దురాసదభగ్నబుద్ధియై - తి (?); దురాశనభగ్న - అ. ద.

51. 1. కౌరవ - పెక్కుప్రతులు. 2. చరితమైనయ - కొన్ని ప్రతులు.

52. 1. జనుదెంచి-ల. 2. హితమధుర - కొన్ని ప్రతులు; రహస్యంబున హేతుదృష్టాంత వాక్యంబుల - కొన్ని ప్రతులు; హితవాక్యంబుల - కొన్ని ప్రతులు.

53. 1. గదిసి - ఊ; గడగి - ఝ; గడిమి - ల. 2. యెవ్వరికి - స. కొన్ని ప్రతులు. 3. మేదిని-గ. 4. చోటఁబెం-ల కొన్ని ప్రతులు. 5. వృద్ధి-ఘ. 6. ములెంతయు-గ.

54. 1. శ్రీవిలసిల్లునంచు - ఐ. ల. వీ; శ్రీవిలసిల్లునట్లు - గ. 2. నృప - కొన్ని ప్రతులు. 3. ధీరు - ఉ; జేరి - కొన్ని ప్రతులు. 4. వశాత్ము - ఈ. ఊ. ఎ. ఐ. త. 5. యాదటతో నిడుగేల - స; యాదటతో నిరుగేల - ల. కొన్ని ప్రతులు; నారటవోనిడుకేల - ఊ.

55. క. మది నర్జునుఁ జూచి భయం, బొదవినయది నీకు వానినుగ్రరణమునం
[1]బదునాలవ[2]యేఁడు జయిం, చెద నాయుధ[3]మంటి ప్రతిన [4]సేసితి నధిపా.

*-: దుర్యోధనుఁడు ప్రాయోపవేశము మాని కరిపురంబునకుఁ బోవుట :-*

సం. 3 _ 240 _ 40

56. చ [1]అనవుడుఁ దత్ప్రతిజ్ఞ[2]యు సురారులవాక్యములుం దలంచి య
జ్జనపతి గాఢనిశ్చయ[3]వశంవదుఁడై శయనంబు డిగ్గి చ
య్యనఁ బయనంబు సేయుఁ డని యప్పు[4]డమాత్యులఁ[5]బంచి యిమ్ములన్
దినముఖ[6]కృత్యముల్ [7]సలిపి [8]దీపితుఁడై వెడలెం బ్రియంబు[9]తోన్.

57. వ. అయ్యవసరంబున.

58. చ. రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్ర సం
చయములఁ [1]జంచలచ్చటులసై నికమత్స్యములన్ [2]మహోన్నతం
బయి కురురాజచంద్రునుదయంబున దద్దయు [3]బొంగెఁ [4]బస్ఫుర
ద్భయదమనోహరప్రకటభంగులఁ [5]దద్బలవార్ధి [6]యుద్ధతిన్.

59. ఉ. [1]చామరపుండరీకవిలసిత[2]చారుపతాకలం గురు
గ్రామణి [3]యాత్ర నెంతయును గాంతి వహించె నభంబు [4]శారదో

---

55. 1. బదినాలవ - అ; బదునాల్గవ - ఈ. ఏ. ఐ. త. 2. యేట - ఘ. 3. మంది - కొన్ని ప్రతులు. 4. చేసెద - కొన్ని ప్రతులు.

56. 1. అనుటయు - అ. 2. యమరారుల - ఉ; యనునాసుర - ఇ. ఏ. 3. వశాస్పదుడై - ఊ. 4. యప్పుడు మంత్రుల - ఊ. 5. బంపి - కొన్ని ప్రతులు; బుచ్చి - ఝ. 6. కార్యముల్ - వీ. ష. 7. నడపి - కొన్ని ప్రతులు; నిలిపె- క. 8. దీపితుఁడై - ల. స. శ. పెక్కు ప్రతులు; ధీరతతో - వా. కొన్ని ప్రతులు. 9. నన్ - ఆ. ఏ. ఐ. త. ల.

58. 1. సంచలచ్చటుల-ద. 2. మహార్ణవం-ఇ. ఉ. ఏ. కి. 3. నొప్పె-ఉ. 4. విస్ఫుర - ఓ. ఘ. చ. ల. 5. దద్భటవార్ధి - ల. వా. వీ. శ; దద్బల - పెక్కు ప్రతులు. 6. యున్నతిన్ - ఝ.

59. 1. ఈపద్యము. గ. ప్రతిలో లేదు. 2. చారు పతాకలం - జ. ఝ. ట. స; కేతు పతాకలం - వా. కొన్ని ప్రతులు. 3. యాత్రనెంతయును - ఝ. వీ; యాత్ర

ద్దామమరాళమండల[5]సితస్ఫుటపద్మ[6]వనీపరిస్ఫుర
త్తామరసాక[7]రంబున విధంబున [8]భూచరనేత్రపర్వమై.

60. వ. ఇట్లు దుర్యోధనుండు గర్ణసౌబలసమేతుండై దుశ్శాసనాద్యనుజ[1]గణంబునుం దక్కిన [2]యమాత్యులుం గొలువఁ [3]జెలువు మిగులం జని కరిపురంబు ప్రవేశించి సముచిత[4]వ్యాపారంబుల [5]నుండు నంత నొక్కనాఁడు మంత్రిజనపరివేష్టితుం డై యున్న [6]రాజునకు భీష్ముం డి ట్లనియె.

61. మ. హితులై పెద్దలు బుద్ధి[1]సెప్పఁగఁ గ్రియాహీనుండవై త్రోచి పో
యితి దుష్టాత్ములఁ గూడి దానికి ఫలం బెట్లయ్యెనో చూచితే
గతవిద్వేషుఁడు ధర్మ[2]నందనుఁడు గల్గంబట్టి [3]యప్పాట దు
ర్గతికిం [4]దప్పితి గాక చిక్కితి గదా గంధర్వుచే నాజిలోన్.

62. ఉ. నీవును దమ్ములున్ [1]సతులు [2]నెయ్యురు వైరులచే గృహీతులై
పోవఁగ జాఱిపోయెఁ గడు[3]బొల్లఁదనంబున సూతపుత్త్రుఁ డీ
[4]కావరుఁ గష్టచిత్తు నధికంబుగ నమ్ముదు నీవు వీని బా
హావిభవంబు గయ్యమున నక్కడఁ జూచితె కన్నులారఁగన్.

---

యొంతయును – వా. పెక్కు ప్రతులు. ఈ పాఠమున కర్తృపదము అస్పష్టమైనది. 4. చామరోద్దామ – ఊ. 5. సితస్మిత – అ. ఓ. ఘ; సితాంబుజకోకనదద్యుతిస్ఫుర – ఎ. 6. పటీర విస్ఫుర – అ. 7. రోజ్జ్వలవిధంబున – ఔ; రంబును విధంబున – ఆ. చ. జ. 8. భూవర – కొన్ని ప్రతులు; భూజన–ఘ; భూసుర – చ.

60. 1. వర్గంబునుం దక్కిన – ఉ. 2. యమాత్యులుంగొలువ – ల. పెక్కు ప్రతులు; యమాత్యగణంబులుంగొలువ – వా. 3. భేరీపణవాదితూర్యంబులు సెలంగ గైసేసి కరిపురంబు – గ. 4. వ్యవహారంబు – ఏ; ప్రకారం – క; ప్రకారవ్యాపారం – ఘ. ఝ. 5. నుండెనంత – ల. పెక్కు ప్రతులు; నున్నంత – ఆ. ఎ. 6. యాకురురాజునకు – ఎ. ఓ. ఘ. ఝ. ల; యారాజునకు – కొన్ని ప్రతులు.

61. 1. జెప్పిన – గ. 2. సూనుడట – ఔ; సూనుడును – గ. 3. యిప్పాట – అ. ఇ. ఉ. ల. సం. శ. 4. దక్కితి – ష.

62. 1. సుతులు – శ. పెక్కు ప్రతులు. 2. నెయ్యులు – పెక్కు ప్రతులు. 3. బొల్లు– కొన్ని ప్రతులు. 4. కావలు – పెక్కు ప్రతులు; కావలమైన కష్టు – ఉ. ఒ. స.

౬౩. ఉ. ఆయతబాహు లుగ్రబలు లార్యులు పార్థులు వారి [1]భూరి శౌ
[2]ర్యాయుధనై పుణక్రియలయందుఁ బదాఱవపాలుఁ బోలఁ డీ
వాయపురజ్ఞులాఁ డధిప వారలచందము వీనిచందమున్
నీయెడ నిక్కమై తెలిసెనే ఖచరేంద్రుల పోరిలోపలన్.

౬౪. క. కులమును సిరియును జెఱుపక, యలఘుస్థితి నింకనైన నపాండవులం
గలసి మనవయ్య [1]నాదగు, [2]పలుకు వినగదయ్య హితము పథ్యము నమ్మీ.

౬౫. వ. అనిన భీష్మువచనంబుల[1]దెస ననాదరంబు సేసి దుర్యోధనుండు గర్ణసౌబలులం
జూచి నవ్వుచు వారలుం దమ్ములుం దోడన చన నక్కడ వాసి చనియె
భీష్ముం[2]డును లజ్జితుండై నిజగృహంబున కరిగె [3]నంతఁ గౌరవేశ్వరుండు
గ్రమ్మఱ యెప్పటిచోటికిం జనుదెంచి మంత్రులతోడ మంతనం బుండి మన
కెయ్యది కర్తవ్యం బెయ్యది సేసినఁ దేజోలాభంబు లగు నని యడిగినఁ
గర్ణుండు దేవా[4]నీకింక నేవిచారమ్ములు నేల నిష్కంటకంబైన యీపృథివి
సకలంబునుం బాలించుచు మహేంద్రమహిమతోడ నఖిలసుఖంబులు వనుభ
వింతు గా కనినం బ్రీతుం డై యతండు వాని కిట్లనియె.

౬౬. క. నీయట్టి వీరవరుఁడు న, హోయుం డఱె వడయరాని [1]యదియుం గలదే
ధీయుత నాకెయ్యదియును, బాయక విను మింక నొక్క పని దెల్లముగన్.

౬౭. తే. ధర్మజుఁడు రాజసూయంబుఁ బేర్మిఁ జేసి
నంతనుండియు నమ్మహితా ధ్వ[1]రమున
యందభిప్రాయమై [2]యుండు నొంద నాకు
నమ్మఖంబు సేయింపవే యనఘ నన్ను.

౬౮. వ. అనినం గర్ణుండు గౌరవపతి కిట్లనియె.

---

౬౩. 1. శౌర్యధైర్యాయుధ — అ. ల. 2. ర్యాయత — ఈ. ఐ. ఝ.

౬౪. 1. మఱినా — న. 2. పలుకులు విన నీకు నిజము (హితము)—న; పలుకులు వినవీకు
నిజము పథ్యము నమ్మీ — ల; పలుకులు వినవయ్య — కొన్ని ప్రతులు.

౬౫. 1. యెడ — ఈ. త. ల. వి. శ. 2. డును నిజనివాసంబునకుం జని య — ల.
3. నంత — పెక్కు ప్రతులలో లేదు. 4. యింకనే — పెక్కు ప్రతులు.

౬౬. 1. యవియుం గలవే — ఔ. క.

౬౭. 1. రంబునం దభిప్రాయ — పెక్కు ప్రతులు. 2. యున్నదట్లుగాన — ఔ.

69. క. అగుఁ గాక యేమి యిప్పుడు, జగతిం గల[1]నృపతు లెల్ల జనవర నీ కి
మ్ముగ వశవర్తుల కావునఁ, దగ నుద్యోగింపు [2]మిపుడు తత్క్రతువిధికిన్.

70. ఉ. రాజులఁ బిల్వఁ బంపుము [1]ధరాసురసంఘము నామనింపు పే
రోజ నుదాత్తయజ్ఞగృహయూపతతుల్ సమకట్టఁ బంపు [2]వి
భ్రాజితభక్ష్యభోజ్యవిధిభవ్యపదార్థము లానయింపు మ
వ్యాజవిభూతిమై నమరవల్లభుఁ డాద్యునఁ జేయు జన్నమున్.

71. వ. అనిన [1]సంతోసిల్లి కురుపతి యప్పుడ పురోహితునిం బిలిపించి [2]రాజసూయ
యజ్ఞంబు సంపూర్ణదక్షిణంబుగాఁ జేయవలయుఁ దత్ప్రయోగవిశేషంబులకు
మీరు సాలి[3]యుండునది యనినం బురోహితుండు దగిన విద్వజ్జనంబులతోడ
విచారించి దుర్యోధనున కిట్లనియె.

72. చ. జనవర నీకుఁ బాండవులు శత్రులు గావున [1]వారి నాజి నో
ర్చిన మఱి కాక మున్న యిటు సేయఁగ శక్యమె రాజసూయమున్
వినుము దగంగ నిప్పటికి వేఱొక [2]యజ్ఞము సేయు మిమ్ముఁ గ్రమలం
బనుపుము తత్క్రియావిధిభంగులకుం దగువార వేగ[3]మై

73. తే. రాజ[1]సూయంబునట్టిద రాజవర్య, వైష్ణవం బను యాగంబు వాసుదేవుఁ
డిమ్ముఖము సేసెఁ దొల్లి యభీష్ట[2]మిదియు, చేయు నిర్విఘ్నముగ [3]నిది సెల్లు నీకు.

74. క. అనిన నిది వోలు[1]నని య, జ్జననాథుఁడు సూతతనయసౌబలులు ప్రియం
బున ననుమతింప నభిమత, వినుతాధ్వరసంప్రయోగవిహితోద్యముఁడై.

---

69. 1. రాజులెల్ల – అ. ఝ. ల. 2. మీవు – కొన్ని ప్రతులు; మిపుడ – ఆ. ఓ. త. ద. ల.

70. 1. ధరామరసంఘము – కొన్ని ప్రతులు. 2. ముద్భ్రాజిత – పెక్కు ప్రతులు.

71. 1. సంతసిల్లి – పెక్కు ప్రతులు. 2. రాజసూయంబు – కొన్ని ప్రతులు; రాజసూయమహాధ్వరంబు–కొన్ని ప్రతులు. 3. యుండుడనిన–ఔ; యుండుదురనిన–గ.

72. 1. వారి వాజి – పెక్కు ప్రతులు; నీవు వారినోర్చిన – వా. కొన్ని ప్రతులు. 2. జన్నము – ఔ. ఝ. 3. మైన్ – శ.

73. 1. సూయము వంటిదే – ఉ. 2. మదియు – కొన్ని ప్రతులు. 3. నది – పెక్కు ప్రతులు.

74. 1. నది – కొన్ని ప్రతులు.

75. క. తన యుద్యోగము జననీ, జనకులకును ద్రోణవిదుర శాంతనవకృపా
ది నిఖిలమాన్యజనమ్ముల, కును దగ నెఱిఁగించి భరతకుంజరుఁ డెలమిన్.

-: దుర్యోధనుఁడు వైష్ణవం బను యజ్ఞంబు సేయుట :-

సం. 3 _ 242 _ 1

76. వ. వారిచేత ననుజ్ఞాతుం డయి నగరసమీపంబున నొక్కపుణ్యస్థలంబునం దఖిల యజ్ఞగృహంబులు నతిరమణీయంబులుగాఁ జేయించి యజ్ఞోపకరణంబులును సమస్తవస్తువిశేషంబులును సమకట్ట నియోగించి శుభ[1]దినంబునం బరమ బ్రాహ్మణసహాయుం డై [2]నియతదీక్షాశోభనంబు వహించె నంత.

77. ఆ. అఖిలదేశవాసు లైన [1]రాజులను బ, వి్త్రచరితు లైన విప్రవరుల
నర్థిఁ బిలువ దూత లరిగిరి కౌరవే, శ్వరుని యాజ్ఞఁ జేసి సమ్మదమున.

78. వ. అం దొక్క దూతం బిలిచి దుశ్శాసనుండు నీవు ద్వైతవనంబునకుం జని పాండవులను దదాశ్రమవాసు లయిన భూసురులను గౌరవేశ్వరు నధ్వరం బునకుఁ బిలువు మని పనిచిన వాఁడును[1]జని ధర్మరాజుం గని యి ట్లనియె.

79. ఉ. వీరుఁడు [1]గౌరవుండు నిజవిక్రమలబ్ధసమున్నతార్థసం
భారములన్ మహాధ్వర మపారబలుం డొనరించుచుండి పెం
పారఁగ నిన్నుఁ దమ్ముల మహాద్విజులం బిలువంగఁ బంచె ధా
త్రీ[2]రమణేశ నెమ్మిఁ జనుదెమ్ము తదధ్వరముం గనుంగొనన్.

80. వ. అనిన [1]ధర్మజుండు వాని కి ట్లనియె.

---

76. 1. ముహూర్తంబునం - ఉ. 2. నియత - శ. పెక్కు ప్రతులందు లేదు.

77. 1. భూపతుల - ఉ.

78. 1. నతిత్వరితగతిం జని - గ. ల.

79. 1. గౌరవేశ్వరుడు విక్రమ - క. గ. ల. 2. రమణీశ - కొన్ని ప్రతులు.

80. 1. ధర్మనందనుండు మందస్మితుండై వాని - ఘ. ల; ధర్మతనయుండు మందస్మితాననుండై వాని - గ. పీ. శ. ప. శ.

81. చ. అనఘుఁడు ధార్తరాష్ట్రుఁడు మహాధ్వరకర్మధురీణుఁ డయ్యె నా
వని ప్రియ మందెఁ జిత్తము పవిత్రిత మయ్యెఁ గులంబు [1]వింకె నై
నను దగ [2]మేము వూనిన-ఘనం బగు [3]వూనికి దీర్ప [4]కెవ్విధం
బున [5]నట రా[6]నొడంబడము భూవరుతో నిది సెప్పు మేర్పడన్.

82. వ. అనియె నప్పుడు భీమసేనుం[1]డాదూతం జూచి యోరి వినుము పదు[2]మూఁ
డగునేఁటి కడపటఁ బాండవాగ్రజుండు దీప్తం[3]బగు శస్త్రాస్త్రదహ
నంబునందు ధార్తరాష్ట్ర[4]సుతశతకంబులు బలు[5]వరించి వేల్చి [6]రణసత్త్రంబు
సేయుటకునై వచ్చుంగాని యందాఁకం జనుదెంచుట గలుగ దని యా
దుర్యోధను నెదుర[7]నవాయోడక చెప్పు మనిన వాఁడును [8]మగిడి చని
ధర్మనందను ప్రియవచనంబులను వృకోదరు[9]నిష్ఠురోక్తులను ధార్తరాష్ట్రుల
కెఱింగించెఁ దదనంతరంబ.

83. క. చనుదెంచిరి [1]కౌరవుశా, సనమున [2]ధరణిఁగల [3]నిఖిలజన[4]పతులును స
న్మునులును సమస్తజనులును, ఘనభుజు జన్నంబుఁ జూడఁ గరిపురమునకున్.

84. వ. [1]వారి కెల్లను దగిన సత్కారంబులు సేయను బాత్రదానంబులు గావింపను
ధృతరాష్ట్రుండు విదురుం[2]బనిచె నివ్విధంబునఁ బ్రసిద్ధదక్షిణాన్వితం బై
ప్రభూతాన్న[3]పానసంతర్పితసకలజనం బై యభిమతాంబరాభరణపరి
[4]పూజితభూసురప్రకరం బై యథాకాలవిహితకర్మకలాపం బై [5]యథా
శాస్త్రీయం బై వైష్ణవయాగంబు నిర్విఘ్నంబు[6]గఁ బరిసమాప్తం బగుటయు.

---

81. 1. నింకనైనను - ఓ. ఘ. ల; నిట్టిదైనను - ఆ. 2. నేము - పెక్కు ప్రతులు. 3. వూనికె - చ. ఝ. ల. శ. 4. కివ్విధం - గ. ల. 5. నటు - కొన్ని ప్రతులు. 6. నొడంబడుదు - కొన్ని ప్రతులు.

82. 1. డు - పెక్కు ప్రతులు. 2. మూఁడవయేటికడపట - కొన్ని ప్రతులు. 3. బైన- పెక్కు ప్రతులు. 4. పలుశతంబుంబలువరించి - పెక్కు ప్రతులు. 5. వధించి - కొన్ని ప్రతులు 6. నరసత్త్రంబు - పెక్కు ప్రతులు. 7. నావచనంబుగా - కొన్ని ప్రతులు. 8. మగుడి- పెక్కు ప్రతులు. 9. నిష్ఠుర వచనంబులును-ఔ; నిష్ఠురంబులను-ద.

83. 1. కౌరవశాసనమున - స. కొన్ని ప్రతులు. 2. ధరలోనగల్గు - ఉ. 3. యఖిల - ల. కొన్ని ప్రతులు; సకల - పీ. స. 4. వరులు - కొన్ని ప్రతులు.

84. 1. వారలకెల్లం - ఈ. త. 2. బంచె - ఒ. ఓ. గ. ల. 3. దాన - కొన్ని ప్రతులు. 4. పూరిత - కొన్ని ప్రతులు. 5. యథాశాస్త్రంబై - ల. పీ. 6. నసమాప్తం - కొన్ని ప్రతులు.

85. క. అవభృథశోభితుఁ డై [1]కా, రవముఖ్యుఁడు భూరికనక[2]రత్నతతుల భూ
దివిజులఁ బూజించి నృపుల, వివిధవిధుల సత్కరించి వీడ్కొలిపెఁ [3]దగన్.

86. వ. అట్టియెడ [1]నధ్వరోత్సవాగతు లైన జను లనేకులు ధృత[2]రాష్ట్రనందను సమ్ముఖంబున [3]ని ట్లనిరి.

87. క. జనపతు లెవ్వరు నివ్విధ, మున నిర్విఘ్నముగ నఖిలభూజనసమ్మో
దనముగఁ [1]జేసిరె సత్క్రతు, వనఘ భవత్పుణ్యమహిమ [2]లాశ్చర్య మిలన్.

88. శా. సారోదారవిభూతిమై మును హరిశ్చంద్రుం డొనర్చెం [1]గ్రియా
పారీణుం డయి రాజసూయ మది సెప్పన్ వింటి మయ్యజ్ఞముం
గౌరవోత్తముఁ డైన ధర్మసుతుఁడుం గావింపఁగాఁ గంటి మే
మా రెండున్ సరిగావు నీమఖముతో నత్యున్నతిన్ భూవరా.

89. క. జన్న మొనర్చియ [1]కా, దే [2]జగదావర్తకీర్తి దీపితులై య
వ్యాజసురలోకసుఖముల, భ్రాజిల్లిరి రఘు యయాతి [3]భరతాదినృపుల్.

90. తే. [1]అని నుతింపంగ మఱియును [2]నందకొంద, ఱయ్యుధిష్ఠిరు రాజసూయంబు [3]చిదుర
[4]పాలుఁ బోల దీమఖము వై భవసమృద్ధి, నని తలంచిరి నిజహృదయంబులందు.

---

85. 1. పౌరవ – ఘ. 2. రత్నాదుల – ఆ. 3. గృపన్ – ఒ.

86. 1. నధ్వర దర్శన సమాగతు – కొన్ని ప్రతులు. 2. రాష్ట్రాగ్రనందను – ఇ. ఏ. ల. 3. నిలిచి యిట్లనిరి – గ. ఘ. ల.

87. 1. జేసిరి – కొన్ని ప్రతులు. 2. యాశ్చర్య – ల. కొన్ని ప్రతులు; మాశ్చర్య – వీ. న.

88. 1. గృపా – వీ. ప. స.

89. 1. గాదే – వా. కొన్ని ప్రతులు; కాదే – కొన్ని ప్రతులు. 2. జగదారాధ్య – కీర్తి – ఈ. ఐ. త. ల. వీ. శ. ష. స; జగదావర్తి కీర్తి – ఇ. ఏ. ఔ. ద. స. శ. 3. భరతదిలీపుల్ – ఆ. ఈ. ఐ. త.

90. 1. అనుచు గీర్తింప – ల. కొన్ని ప్రతులు. 2. నందు గొంద – పెక్కు ప్రతులు. 3. చిదుర – ల. శర..స. శ. కొన్ని ప్రతులు; చివర – వా; చిదుఱ – ష. శకట రేషము తోడిరూపము. 4. పాలు – కొన్ని ప్రతులు; పాలి – వా.

91. వ. అనంతరంబ [1]నిరంతరానందమంద[2]మందాయమానమానసుం డగుచు మానవేశ్వరుండు దమ్ములు దొరలు బంధుజనంబులుం బరివేష్టింపఁ బౌరజనదత్తాశీర్వాదజయజయశబ్దశబ్దాయమానదిగ్విభాగుం డగుచుఁ బుణ్యాంగనాకర[3]కలితలలితాక్షతవిక్షేపంబులును బటువందిమాగధసంకీర్తనంబులును గైకొనుచుఁ బురప్రవేశంబు సేసి రాజమందిరగతుం డై ధృతరాష్ట్రునకు గాంధారికిఁ గృపద్రోణ భీష్ములకుం బ్రణమిల్లి యుల్లంబు [4]వికసిల్లఁ గనకాసనాసీనుం డయ్యె నప్పుడు కర్ణుం డతని కిట్లనియె.

92. ఉ. భాగ్యము గాదె కౌరవనృపాల భవన్మఖ మిష్టసత్క్రియా
యోగ్యత నిర్వికల్పముగ నొందె సమాప్తి నశేషధాత్రియుఁ
భోగ్యము నీకు నింక రణభూమిఁ బృథాసుతులన్ జయించి [1]స
మ్యగ్యమశాలి వై భువనమాన్య యొనర్పుము రాజసూయమున్.

93. క. అది యెమ్మెయి నగునో యని, మదిలో వగవంగ వలదు మఘవతనూజుం
[1]గదనంబునఁ జంపక యే, పదనఖధావన మొనర్పఁ బార్థివ[2]ముఖ్యా.

94. తే. అనినఁ గర్ణుఁ గౌఁగిటఁ జేర్చి యన్నరేంద్ర
నందనుఁడు నీసహాయత నాకుఁ గలుగఁ
బాండవుల నోర్చు టెంతటిపని మహాత్మ
యని సహోదరసహితుఁడై హర్ష మొందె.

95. వ. అట ధర్మతనయుండు సూతతనయు ప్రతిజ్ఞ విని వాని బలశౌర్యవిభవంబును నభేద్యకవచప్రభావంబును దలంచి విషణ్ణహృదయుం డై రేయెల్లను గన్ను[1]మూయుటలేక వగచుచుండె నిట దుర్యోధనుండునుం గర్ణసౌబలప్రవర్తిత

---

91. 1. యనంతానందామందాయమాన – ఈ. ఐ. త. 2. కందళితమానసుం – క. జ. 3. కలితాక్షతవిక్షేప – ఈ. ఊ. ఐ. ఔ. క. త. ద. 4. నివ్వటిల్ల – ఇ. ఏ; విలసిల్ల – పెక్కు ప్రతులు.

92. 1. సమ్యగ్యశశాలి – వా. 1960 ముద్రణము. రూపము విచార్యము; సమ్యగ్యమశాలి – వీ. శ. ష. స. కొన్ని ప్రతులు.

93. 1. గదనమున జయింపక యే – పెక్కు ప్రతులు; గదనమున నే జయింపక – ఘ. వీ. శ. ష. స. శ. 2. తిలకా – కొన్ని ప్రతులు.

95. 1. ముయ్యక – ల; మూయక – వీ.

కార్యఖడ్గుం డై భీష్మద్రోణకృపాదులకును మహనీయు లైన మహీసురులకు ననుదినంబును బ్రియసత్కారంబులు సలుపుచు ధనంబు దత్తభుక్తఫలంబుగా వగచి నిరంతరత్యాగభోగంబుల ననురాగంబు నొందు చుండె ననిన వైశంపాయనునకు జనమేజయుం డి ట్లనియె.

96. క. దుర్యోధను చెఱ[1]దలిగి య, వార్యపరాక్రములు పాండవప్రభులు మహై
శ్వర్యచరితు లవ్వనమున, నార్యులు మఱి యెట్టివార లై రి [2]మునీంద్రా.

-: ద్వైతవనంబునందలి మృగసమూహము ధర్మజు స్వప్నంబునందు వచ్చి తమ దుఃఖంబు సెప్పుట :-

సం. 3 _ 244 _ 2

97. వ. అని యడిగిన నమ్మహాముని యమ్మహీపతి కి ట్లనియె.

98. సీ. ద్వైతవనంబున ధర్మజుం డొకనాఁడు [1]నిద్రింపఁగాఁ దద్వనేచరంబు
లగునట్టి మృగజాతు లన్నియుఁ గలలోన వచ్చి కన్నుల నశ్రువారి [2]దొరుఁగఁ
ద మ్మెఱింగించి యాతనితోడ నిట్లను ధర్మాత్మ మీరు నిత్యంబుఁ [3]గడఁగి
చంపంగఁ జంపంగ సమసి యల్పావశిష్టము లయ్యె నిప్పు డస్మత్కులంబు
తే. లేము బీజమాత్రమ[4]దక్కి యిట్లు వనరు, చున్నవారము మీ రింక
నొందు గడకు
నరిగి మముఁ గావ రే కరుణార్ద్ర[5]బుద్ధి, ననిన నట్లకాకని వాని కభయ[6]మిచ్చి.

99. క. జనపతి మేల్కొని యంతయు, ననుజుల కెఱిఁగించె యిట్టులను నబ్దమువై
నెనిమిది నెలలుండితి మి, వ్వనమునఁ దగు నింక నొందు[1]వలనికిఁ బోవన్.

---

96. 1. దలఁగి – పీ. శ. ష; దగిలి – వా. ?; మాన్పి – బొ. 2. మహాత్మా – ఇ. ఏ. బొ.

98. 1. తనర నిద్రింప దద్వనచరంబు – ల. ప్రాసయతి? 2. గురియ – ఆ. ఏ; యొలుక – ఉ. 3. దగిలి – ఈ. ఐ. త. 4. చిక్కి – శ. కొన్ని ప్రతులు. 5. దృష్టి – బొ. గ. ఖ. చ. 6. మొసగి – కొన్ని ప్రతులు.

99. 1. వనమున కరుగన్ – ఇ. ఏ. ల; వనముననేఁగన్ – పీ. శ. ష. శ.

100. వ. ఇప్పుడు కామ్యకవనంబు బహుమృగాకీర్ణం బై సరసఫలభరితభూరుహప్రకరం బై విమలకమలాకరాభిరామం బై యున్నయది యని వింటిమి గావున నం దగ్రమ్మఱ నుండుటకుం జని శ్వఃప్రభాతంబున నాశ్రమంబున వసియించుట లెస్స యనినం దమ్ములు దేవా నీ వెట్లు నిశ్చయించితి మాకు నదియ యిష్టం బని పలికిరి తదనంతరంబ.

101. క. అనుజన్ములుఁ బాంచాలియు, ననుచరవర్గంబు బ్రాహ్మణాలియును దోఁ
జనుదేరఁగ సమ్మదమున, ఘనతేజుఁడు చనియెఁ గామ్యకవనంబునకున్.

102. వ. ఇట్లరిగి యందుఁ గృతనివాసు లై యుధిష్ఠిరులు శాక[1]ఫలమూలంబులం జేసి దేహయాత్రలు నడుపుచు నొండొరుల యొఱవడి చూచి యత్యంతదుఃఖపరవశులగుచు జూదంబువాఁడు దమపడినపాట్లు దలంచి కలంగుచుఁ గ్రోధశోకంబులు దమలోన [2]నుపశమించికొనుచు వర్తిల్లం [3]బదునాల్గేండ్లగు నేఁడు సనిన నందఱుం గాలంబు గడగాంచినవారై వెడవెడ వికసిల్లిన చిత్తంబులతో నుచితవ్యాపారంబుల [4]నుండు నంత.

103. శా. ప్రీతుం డై చనుదెంచె నాశ్రితజనాభీష్టక్రియాశీలుఁ డు
ద్గీతామ్నాయుఁడు నిర్విధూతదురితక్లేశుండు [1]యోగామృత
స్ఫీతస్వాంతుఁ డనంతసంతత [2]సమావిర్భూతకారుణ్యధా
రా[3]తోయన్నవనైక [4]శీలుఁ డగు పారాశర్యుఁ డచ్చోటికిన్.

104. క. మునిపతి [1]దోదవ్వులఁ గని, జనపతి దమ్ములును దాను సంప్రీతి నెదు
ర్కొని యర్ఘ్యాదివిశేషా, ర్చనలం బరితుష్టుఁ జేసె [2]సంధృతభక్తిన్.

---

102. 1. మూలఫలంబులం జేసి – శ. వ. పెక్కు ప్రతులు. 2. నడంచికొనుచు – చ. పి. 3. బదనకొండగు – కొన్ని ప్రతులు. 4. నున్నంత – పెక్కు ప్రతులు.

103. 1. యోగామృతాన్విత స్వాంతుఁడు – ల. వ. శ. కొన్ని ప్రతులు. 2. శమావిర్భూత – ఎ. స. 3. తోయాశ్రితనిత్యశీతలుఁడు – ట. 4. శీతలుఁడు పారా – ఉ. ఊ. ఎ. ఐ. ఒ. త. స; శాలియగు – ఘ.

104. 1. దవుదవ్వుల – కొన్ని ప్రతులు; దొదవ్వుల – శ; దవ్వుల గని యజ్ఞపతి – ఝ. ల. స; రా దవ్వులగని – ఉ. ఐ. త. 2. సంభ్రమభక్తిన్ – ఉ. త; సంప్రీతి మెయిన్ – క; సంతతభక్తిన్ – క; సంతతభక్తిన్ – ఉ.

105. వ. [1]కృష్ణద్వైపాయనుండును ననవరతవనవాసాయాస[2]కృశదేహుల నధిక [3]దుఃఖాయమాన[4]హృదయులం దన మనుమలం జూచి వగచి ధర్మపుత్త్రున కిట్లనియె.

106. ఉ. కాలవిపర్యయంబున సుఖంబును దుఃఖము వచ్చుచుండు నె
క్కాలము నేరికిన్ ధ్రువము గాదు సుఖంబును దుఃఖమున్ మహీ
పాల బుధుండు దద్ద్వివిధభంగు లెఱింగి ప్రమోదఖేదసం
శీలుఁడు గాఁడు రెంటను బ్రసిద్ధపథంబున నప్రమత్తుఁ డై.

107. క. విను నీవును [1]నాపదలకు, [2]మనమున నొక్కింత యోర్చి మహనీయముగా
నొనరింపుము తపము దపం, బునన కదా సకలసౌఖ్యములు సిద్ధించున్.

108. క. క్షమయు నహింసయు సత్యము, సమతయు నింద్రియజయంబు శమముఁ బరిత్యా
గమును దపోలక్షణములు, గ్రమమున నిన్నియును నూర్ధ్వగతికారణముల్.

109. తే. ఇందుఁ జేసిన [1]పుణ్యంబ యందుఁ గుడుచు, మీఁది జన్మంబునకు నది మేలుఁ జేయుఁ
గాన తనశక్తితోఁగూడ దానధర్మ, చిరపరోపకారంబులు సేయ వలయు.

110. వ. అనినం బాండవాగ్రజుండు దానతపంబుల[1]లో దుష్కరం[2]బెయ్యది యెద్దాన నధికఫలం బగు నని యడిగిన వేదవ్యాసుం డిట్లనియె.

111. సీ. దాన మూర్జితఫలదం బర్థసాధ్య మై పరగుటఁ [1]గరము దుష్కరము [2]నదియ
నరులకు [3]నధిప ప్రాణంబులకంటెను రూపింప నర్థంబు [4]తీపు వినవె
యుగ్రంబు లైన యాయుధముల మొనలపై నుఱుకుట యంభోధి దఱిసి చనుట
కృషి పాశుపాల్యసంక్లేశంబు నొందుట యడవులఁ గొండల [5]నిడుమ వడుట

105. 1. కృష్ణ — ల. పెక్కు ప్రతులలో లేదు. 2. కృశీభూతదేహుల — గ. ఘ. ద. ల. స; కృశీకృతదేహుల—ఎ. ఓ. 3. దుఃఖదోదూయమాన—ఊ. 4. మానసులం దన—వీ. శ. ష.

107. 1. నాపలుకులు — శ. 2. మనసున — అ. ఒ ఔ. క.

109. 1. పుణ్యంబు లందుఁగుడుచు - ల. శ. పెక్కు ప్రతులు.

110. 1. లోన — కొన్ని ప్రతులు; లోనధిక — ఆ. 2. బెయ్యది యగు — ఈ. త. ల.

111. 1. నధిక — ఆ. ఎ. 2. నదియు — శ; యదియు — వీ. 3. ననఘ — పెక్కు ప్రతులు. 4. తీపి — న. కొన్ని ప్రతులు; ప్రీతి — ఐ. త. 5. నిడుము - కొన్ని

అ. నవసి [6]పావసి యనుదినముఁ బరప్రేష్యు లై, యునికి దలఁప
నర్థమునకు చూవె
యట్టి దుఃఖలబ్ధ [7]మైన యయ్యర్థంబు, విడుచు టెవ్విధమునఁ గడిఁది గాదె.

112. శా. అన్యాయార్జిత మైన విత్తమునఁ జేయం బూను దానంబు మూ
ర్ఖన్యాయం బది దానఁజేసి ఫలపాకం బేమియుఁ లేదు యు
క్తన్యాయార్జిత మించుకంత యయినం గాలంబు దేశంబు స
మ్మాన్యం బై [1]తగఁ బాత్రయోగమున సౌమ్యం బై ఫలించుం దుదిన్.

113. వ. తొల్లి ముద్గలుం డను మహాద్విజుండు సన్మార్గోపార్జితం బైన వ్రీహిద్రోణంబు సత్పాత్రంబునఁ [1]వినియోగించి కాదె పరమ[2]సిద్ధిం బొందె ననిన విని ధర్మ నందనుండు మునీంద్రా ముద్గలుండు వ్రీహిద్రోణం బెట్లుంగి నుపార్జించె నెట్టి పాత్రంబునఁ బ్రతిపాదించె వినవలతుం జెప్పవే యనిన నతం డిట్లనియె.

-: వ్యాసుఁడు ధర్మజునకు వ్రీహిద్రోణాఖ్యానంబు సెప్పుట :-

సం. 3 _ 246 _ 3

114. క. అతిథిప్రియుఁడు విశిష్ట, వ్రతుఁడు విమత్సరుఁడు సత్యవచనుండు [1]విని
ర్జితవిషయేంద్రియుఁడు సము, న్నతపుణ్యుఁడు ముద్గలుఁడు [2]ఘన
స్థిరబుద్ధిఁ.

115. వ. పుత్త్రదారసహితంబుగాఁ గురుక్షేత్రంబున వసియించి యుంఛవృత్తి పరాయణుం డై పాడ్యమిం దొడంగి పదునాలుగు దివసంబు లొక్కొక్క గింజయ[1]కా నేరి దూమెఁడు [2]వడ్లు సమకూర్చి పర్వదినంబునఁ బాకంబు

---

ప్రతులు. 6. నవసి - చ. ఝ. ల. 7. మైనట్టి యర్థంబు - పెక్కు ప్రతులు.

112. 1. తగు - ఝ. ల.

113. 1. వినియోగించి - పెక్కు ప్రతులు; ప్రతిపాదించి - వా. 2. స్థితిం బొందె - ఝ.

114. 1. వివర్జిత - టొ. 2. ఘనస్థిరబుద్ధిన్ - ల. శ. పెక్కు ప్రతులు; సనాతనబుద్ధిన్ - వా. ఇచ్చట మూలము-అత్రాప్యుదాహరంతీమమ్, ఇతహాసం పురాతనమ్. పి. పి. ఎస్. ప్రతి. ఆరణ్యపర్వ. పుట. 1268.

115. 1. కాఁదూమెడు - వా. కొన్ని ప్రతులు; కానేరిదూమెడు - అ. ఝ. ల. 2. ధాన్యంబు - కొన్ని ప్రతులు.

[3]సేయించి దేవపితృపూజనంబు లొనరించి యతిథుల కన్నంబు వెట్టి మిగిలిన యన్నంబునఁ దాను బుత్త్రకళత్రంబులును దేహయాత్ర నడుపుచు నివ్విధంబునఁ బక్షోపవాసవ్రతంబున వర్తిల్లుచున్న యెడ నొక్క [4]పర్వ దినంబునందు.

116. మ. మతి [1]నత్యంతజుగుప్సితం బయిన యున్మత్తస్వరూపంబుతో
గతవస్త్రుండును ముక్తకేశుఁడు [2]బహుగ్రామ్యోక్తిశీలుండు నై
హితపుణ్యుండు మునీశ్వరుం డతిథి యై యేతెంచె దుర్వాసుఁ[3]డన్
యతి యమ్ముద్గలుపాలికిం [4]బటు బుభుక్షా[5]యత్తతం దూలుచున్.

117. క. అతనిఁ గని యించు కంతయు, మతి ననుమానంబు లేక మానుగఁ బ్రత్యు
ద్గతుఁడై యర్ఘ్యముఁ బాద్యము, నతిభక్తి నొనర్చి మునికులాగ్రణి నెమ్మిన్.

118. క. [1]అన్నంబు వెట్టె [2]నతఁడు త, దన్నం బంతయును గుడిచి యాత్మఁ దనిసి శే
షాన్నంబు మేన నిండఁగ, సన్నుతుఁ [3]డలఁదికొని మగుడిఁ జనియె నిజేచ్ఛన్.

119. క. మునిపతి పర్వము [1]పర్వం, బున మఱియును నరుగుదెంచు ముద్గలుఁడును దా
ననశనుఁడై యుండియు న, మ్మునివరునకు నొసఁగు నన్నముం బ్రియ మెసఁగన్.

120. వ. ఇవ్విధంబున నాఱు పర్వంబులు గుడిచి [1]దుర్వాసుండు వాని చిత్తంబున [2]నొక్క కొఱంతయుం గానక యద్భుతప్రమోదమగ్నమానసుం డై వానికి ట్లనియె.

---

3. చేసి - ల. కొన్ని ప్రతులు. 4. పర్వంబునందు - కొన్ని ప్రతులు.

116. 1. కత్యంత - ఔ. 2. లఘు - ఈ. ఐ. ఝ. త. 3. డాయతి - కొన్ని ప్రతులు. 4. ఘన - న. 5. యత్తుఁడై - స; పేక్షతన్ - ట; యుక్తతం - వి.

118. 1. అన్నమువెట్టిననతడాయన్నం - ల. 2. నతడయ్యన్నంబిం - ఈ. ఝ. త. 3. డలదికొని మగుడి చనియె నిజేచ్ఛన్ - ల. స. కొన్ని ప్రతులు; డై యలమి కొనుచుఁజనియె - వా.

119. 1. పర్వము జనుదెంచిన ముద్గలుండు సంభ్రమమున దా - ఔ.

120. యాత్మం దనిసి యాదుర్వాసుండు - ఓ. ల. 2. నెప్పుడు నొక్క - ఒ. క. ల.

121. క. నీయట్టి దానశీలుని, నీయఖిలమునందు గాన [1]నెన్నండును స
త్త్వాయత్తమతివి సాధువి, ధేయుండవు నీవు పుణ్యతేజుఁడ వనఘా.

122. చ. [1]మనమున సేవగింప [2]కవమానము [3]సేయక యించుకంతయుం
[4]గినియక [5]యోల మందక యకృత్రిమభక్తి [6]నొనర్చి తీవు స
జ్జనసుత యన్నదానము [7]ప్రసాదము [8]సత్యము [9]ధైర్యమున్ దమం
బును నపరిగ్రహత్వమును బొల్పుగ నీధన మయ్యె [10]నియ్యెడన్.

123. చ. చవులకుఁ [1]బ్రేముడించు ననిశంబును నాలుక దాల్మి[2]పెంపు ధ
ర్మువును శమంబుఁ ద్రెక్కొను సముద్ధతి నాఁకలి [3]పిని [4]రెంటనుం
దవులకు జీవిత స్థితి[5]విధాయక మన్నము నీవు జీవితే
చ్ఛ విడిచి తిప్పు డేమని ప్రశంస యొనర్తు నినుం దపో[6]నిధీ.

124. క. [1]మనమున నింద్రియ[2]ముల వ,[3] ర్తనమును సరిగా నొనర్చు ధర్మంబు దపం
బని చెప్పుదు రట్టితపం, బనఘా [4]నీయంద కలిగె [5]నభినవభంగిన్.

125. ఉ. ప్రీతుఁడ నైతి నీవలనఁ బేర్చిన పుణ్య[1]ఫలంబు లెల్ల నీ
[2]చేతివ యయ్యె నీదగు ప్రసిద్ధతపోవిభవంబు నిర్జర

---

121. 1. నెన్నడు సత్వాత్రాయత్తమతివి – ల.

122. 1. ట ప్రతిలో నీ పద్యము లేదు. 2. కనుమానము – అ. ఆ. ఈ. ఉ. ఊ. ఐ. ఓ. గ. ఘ. చ. జ. ఝ త. ల; 3. పొందక – ఔ. 4. గినుకయునోల – ఇ. 5. సోల – వీ. స. 6. యొనర్చితీవు – ఇ. చ. 7. ప్రశాంతిదమం బపరిగ్రహత్వమం – అ. ? 8. శాంతము – ఒ. 9. ధర్మముం దముం – చ. 10. నెయ్యెడన్ – ల.

123 1. జేవురించు – ఔ; ప్రేమతించు – ద. 2. కుంచు – ఈ. ఐ. త. 3. దప్పి – ఔ; నీరువట్టునుం – స; దీననేమియుం – శ. 4. వెంట – ఈ. ఝ. త; రెంటినిం – చ. 5. కిఁదావల – వా; విధాయక – పెక్కు ప్రతులు. 6 ధనా – ఆ.

124. 1. మనసును – పెక్కు ప్రతులు; మనసున – కొన్ని ప్రతులు. 2. జయ – ఇ. 3. వర్తనమున – ఇ. ఓ; వర్తనముల – ఈ. త; వర్తనములు – ఔ. ఝ. 4. నీయందుగలిగె – ఈ. ఔ. ఝ. 5. నభిమత – స. కొన్ని ప్రతులు; నభినుత – ఒ.

125. 1. పదంబులెల్ల – ఐ. వీ. శ. ష. స; తపంబు – ద; 2. చేతివి – ఔ.

వ్రాతము [3]లిప్డు [4]సాఁకె [5]త్రిదివంబున [6]కీవును మేని[7]తోఁడ వి
ఖ్యాతిగ దేవయానమున [8]గ్రక్కున [9]నేఁగెదు [10]సంయమీశ్వరా.

126. వ. అని పలికి దుర్వాసుం డరిగెఁ దదనంతరంబ హంస[1]సారస[2]యుక్తంబును [3]గింకిణీమాలికామనోహరంబును గామగమనంబును నయిన విమానంబు [4]గొనుచు దేవదూత ముద్గలు[5]కడకుం [6]జనుదెంచి యి ట్లనియె.

127. క. అనఘ భవత్సుకృతంబున, ననిమిషలోకాభి[1]గమ [2]మవాప్తం బయ్యెం
జనుదెమ్ము విమానము చ, య్యన నెక్కుము చిత్తమునఁ బ్రహర్షం బెసఁగన్.

128. వ. అనిన దేవదూతం జూచి ముద్గలుండు మహాత్మా దివిజలోకం బెట్టిది విన వలతు నందుల గుణదోషంబు [1]లెఱింగింప వలయు సత్పురుషులతోడి [2]మైత్త్రి [3]సాప్తపదీనం బని చెప్పుదురు గావున [4]మైత్త్రిం బురస్కరించి ని న్నడిగెద ననిన నతం డమ్మునీంద్రున కి ట్లనియె.

-: ముద్గలునకు దేవదూత పుణ్యలోకంబు తెఱంగు సెప్పుట :-

సం. 3 _ 247 _ 2

129. క. ఈలోకమునకు మీఁదై, [1]చాలఁగ వెలు గొందు చుండు స్వర్లోకము నా
నాలంకారయుతము ది, వ్యాలోకము దేవయాన మది మునినాథా.

---

3. సన్నుతింప – అ. క; సంస్తుతించె – ఓ. ఝ. 4. సూ (చూ) పెడు దివంబున–ఉ. ఊ. ఘ. పీ. శ. ష. స. 5. ననివారణ – అ. ఓ. ఝ. 6. నియ్యోడ – అ. ఓ. క. ఝ. 7. తోనె – ఆ. 8. గ్రమ్మర – కొన్ని ప్రతులు; గ్రమ్మన – అ. ఉ. చ. పీ. శ. ష. స; గ్రన్నన – ఆ. ఈ. ఎ. ఐ. ఘ. ఝ. 9. నేఁగుము – ఈ. ఐ. ఒ. జ. ఝ. ద. ల. పీ. శ. స. 10. సన్మునీశ్వరా – జ.

126. 1. వాహనసం – ట. 2. సంయుక్తహయసహస్రసంయుతంబును – ఈ. త. 3. గింకిణీమణి–ల. 4. గొని–ఊ. 5. పాలికివచ్చి–ఔ. 6. వచ్చి–కొన్ని ప్రతులు.

127. 1. గమనమాత్తంబయ్యె – స; గమనమబ్బెను వేగం – ఆ. ఈ. ఎ. క. జ. త. ల. స. 2. న మర్త్యం బయ్యెన్ – ఉ. పీ. శ. ష.

128. 1. లెఱుంగవలయు – కొన్ని ప్రతులు; తెరంగెరుగవలయు–గ. ద; లు నాకెరిగింపుము–జ. 2. చెలిమి – ఓ. ఝ. 3. సార ధర్మంబని – క. ఘ; సప్తభాషంబులనె సంభవించె – ఔ. 4. నీవనేకవిధంబుల సంభాషించిన భాషణంబులవలన సన్మైత్రి సంఘటించుటం జేసి – ఔ.

129. 1. చాల న్వెలుగొందు – ఆ. ఈ. ఎ. ఐ. త. ల.

180\. చ. అమలతపోనివాసులు [1]మహాధ్వరశీలురు సత్యసంధు లు
త్తములు జితేంద్రియుల్ సములు దానపరుల్ రణశూరు లందు హ
ర్షమున వసింతు [2]రచ్చరలు సాధ్యులు దేవమునుల్ మరుద్వసు
ప్రముఖులు వేలువేల తగు[3]పట్టుల నుండుదు[4]రంద యిమ్ములన్.

181\. వ. మఱియు ముప్పది[1]మూఁడువేల[2]యోజనంబులు విస్తృతం బైన మేరుశిఖరంబునందు నందనప్రముఖంబు లైన దేవోద్యానంబులు పుణ్యా[3]పరులకుం గ్రీడాస్థానంబులై [4]విలసిల్లు నయ్యెడల నాఁకలియు నీరువట్టును శీతోష్ణభయంబులును జరారోగ[5]వికృతులును బుట్ట వెయ్యెడలం జూచిన నతిమనోహరం బై సకలేంద్రియతర్పణం బై యుండు[6]నిట్టి పుణ్యలోకంబునకు నర్హులయిన పుణ్యపురుషులు విధినియోగ[7]పక్వంబు లయిన మానుషశరీరంబులు విడిచి తేజోమయంబు[8]లగు దివ్యదేహంబులు ధరియించి వివిధాంబరాభరణభూషితులును [9]నమ్లానకుసుమమాలికామనోహరులును నై కనకవిమానంబులందు దేవదూతలచేతం గొనిపోవంబడి యందు [10]శోకభ్రమశ్రమాయాస విరహితు లై [11]వివిధసుఖంబు [12]లనుభవించు చుండుదురు.

182\. ఆ. అనఘ యింద్రలోకమున కంటె మీఁద ని, శ్శోక మగుచు బ్రహ్మలోక [1]మమరు
నది యనన్యదీప్తసదన మై తనదైన, వెలుఁగునను జగంబు వెలుఁగఁజేయు.

---

180\. 1. మహాద్భుత – ఈ. 2. రప్సరలు – ఆ. క. గ. ఝ. ద. శ. ష. 3. క్రందుగ – ఔ. 4. రందు నిమ్ములన్ – ఈ. ఎ. ఐ. త. శ. ష; రందు వేడుకన్ – ఓ. ఝ.

181\. 1. రెండు – ఉ. 2. యోజనంబుల – ఈ. వీ. 3. పురుషులకుం – ల. కొన్ని ప్రతులు. 4. వెలుంగు – ఈ. ఐ. త. 5. వికృతంబులుం – ల. 6. నట్టి – ఈ. చ. ల. ష. 7. వివశంబులైన – ఆ. ఎ. ఔ. జ. 8. లైన – ఓ. ఔ. చ; 9. నసమాన – వా; నమ్లాన – కొన్ని ప్రతులు. 10. శోకభ్రమాయాస – ల. వీ. శ; శోక క్రమాయాస – జ; శోకశ్రమాదిరహితులై – ఓ. 11. విపుల – కొన్ని ప్రతులు. 12. లనుభవింపుచుండుదురు – క. ట. ద. ల; లనుభవింపుదురు – ఏ; లనుభవింతురు – ఇ.

182\. 1. మొప్పు – అ. ఆ.

133. చ. మనువులు [1]ధాతలుఁ మునులు మానుగ నుండుదు రందు లోభముం
గినుకయుఁ [2]గిల్బిషంబు నపకీర్తియు దుఃఖము జన్మవైకృతం
బును జనియింప వీభువనముల్ దెగునప్పుడు నాశమొంద ద
వ్వీనుతపదంబు దానియెడ వేడుక సేయుదు రింద్రముఖ్యులున్.

134. వ. స్వర్గంబునం[1]గల గుణంబు [2]లెఱింగించితిఁ [3]దదీయ దోషంబు[4]లు సెప్పెద వినుఁ[5]ము.

135. తే. ఇందుఁ జేసిన[1]పుణ్యంబు లెల్ల నందుఁ
గుడుచుఁగాని మర్త్యున కందు గడఁగి పుణ్య
మాచరింపంగఁ [2]గాదు పుణ్యావసాన
మగుడు [3]భూమికిఁ ద్రోతురు మగుడ నతని.

136. క. కడు[1]మరగిన సౌఖ్యంబులు, విడుచుటఁ జిత్తంబు దుఃఖవివశముగ మహిం
బడుఁ జూవె [2]పుణ్యలోకం, బెడలిన [3]మనుజుండు [4]దేజ[5]మేది [6]యబలుఁడై.

137. క. [1]తన తక్కువయునికియు న, న్యుని[2]యున్నత [3]శీలతయుఁ గనుంగొని చిత్తం
బున నెరియుచునికి [4]గలుగును, జననుత సురలోకవాసజనులకు నెల్లన్.

---

133. 1. దాతలుం — ఝ; 2. దాపముం బగయు గిల్బిషమున్ ఘనదుఃఖ వైకృతం — ల. స. శ. పెక్కు ప్రతులు; శోకమున్భయము కిల్బిషమున్ ఘనదుఃఖవైకృతం—ఝ.

134. 1. గలుగు — అ. ఎ. ఏ. ఒ. గ. ఝ. 2. తెలుంగించితి — శ. ష. 3. దాని — ఘ; నింక దదీయ అ. క. జ. 4. లుం జెప్పెద — ల; 3. లె (లునె) రింగించెద — క. గ. ఘ. 5. మని యిట్లనియె — ఈ. ఐ. త.

135. 1. పుణ్యంబు లందు గుడుచుగాని మర్త్యున కందును — ఉ. యతి నియమము చెడును. 2. లేదు — ల. స. పెక్కు ప్రతులు; లేదు — ఉ. ఒ. గ. ద. 3. ద్రోతురు భూమికి — అ. ఉ. ఊ. ఒ. ఓ. క. ఘ. చ. జ. ద. ల; నవనిపైఁ ద్రోతురు — ఆ, ఈ, ఎ. ఐ. ఝ. త. శ; నవనిక ద్రోతురు — పీ. ష.

136. 1. మరిగిన — కొన్ని ప్రతులు; మఱగిన — శ; మరఁగిన — శ. 2. పుణ్యకర్మం — స. 3. తేజంబు సుఖము నెడలి — స. 4. పుణ్యమేది — అ. 5. మెడలి — అ. ఇ. ఏ. ఒ. ఘ. ఝ. 6. సభయుఁడై — ల. స. పెక్కు ప్రతులు.

137. 1. తనదౌ తక్కువయును నన్యుని — ఎ. స. 2. యున్నతి — అ. ఊ. ద; యున్నతి యుండగ—ఒ. పీ. 3. శీలతయు — శ. ష. కొన్ని ప్రతులు; లీలయుం — వా. కొన్ని ప్రతులు. 4. మిగులును — స.

138. వ. బ్రహ్మ[1]లోకంబునం దక్కఁ దక్కిన పుణ్యలోకంబులం దెల్ల [2]నిదియ మేరయై [3]చెల్లు [4]మఱియుఁ బుణ్యలోక[5]పరిభ్రష్టుండ మర్త్యలోకంబున [6]సుఖశీలుం డయి [7]పుట్టు నీలోకంబు గర్మభూమియు నాలోకంబు [8]ఫలభూమియు నని యెఱుంగుము నీవలని యాదరంబునం జేసి [9]యింతయుం జెప్పితి నీవింకఁ దడయ నేల చనుదె మ్మనిన ముద్గలుండు గొండొక విచారించి దేవదూతం [10]జూచి యి ట్లనియె.

139. ఆ. ఇట్టి దివ్యసుఖము [1]లే నొల్లఁ బదివేలు, వచ్చె నాకు [2]నమరవర్గమునక
యుండ నిమ్ము వాని నో యన్న విచ్చేయు, మిష్ట మైన [3]యెడకు [4]నిపుడ నీవు.

140. క. ఏయ్యెడకుఁ [1]జనినఁ బురుషుం, డెయ్యెడకును మగుడ కుండు నెక్కాలము నే
నయ్యుత్తమ[2]పదవికి[3]నై, యెయ్యనువున[4]నైన నుత్సహించెద బుద్ధిన్.

141. వ. [1]అని దేవ[2]దూత వీడ్కొలిపి ముద్గలుండు శిలోంఛవృత్తి విడిచి పరమశాంతిం గైకొని [3]నిర్వికల్పుం డైన జ్ఞానయోగంబునం జేసి తుల్యనిందా[4]స్తుతియును సమ[5]లోష్టాశ్మకాంచనుండును నై పరమసిద్ధిం బొందెఁ బాండవోత్తమా నీవును రాజ్య[6]రహితుండ నైతి నని వగ[7]వక తపంబుసేయుము తపంబునం జేసి శుభంబులు సేకుఱుఁ బదు[8]మూడవునేఁటికడపటఁ బితృ[9]పైతామహం బైన రాజ్యంబు నిన్నుం బ్రాపించు నని యిట్లు సాత్యవతేయుండు [10]గాంతేయుల నాశ్వాసించి నిజాశ్రమంబునకుం జనియె[11]నంత.

---

138. 1. లోకంబు దక్క — ల. పెక్కు ప్రతులు. 2. నిట్టి మేరయై — ఇ. ఏ. 3. చను—ఔ. 4. తుది — అ. క. 5. భ్రష్టుండు — ఉ. ఓ. ఔ. ద. 6. సుఖశీలుం డయి — అ; సుఖయయి — చ. 7. యుండు — అ. జ. 8. భోగ — స; భోగ్య — ఓ. ఝ. ల; పుణ్యఫల — ఘ. 9. యంతయుం — చ. జ. ల. 10. జేరి — ట.

139. 1. తెల్లను—ఊ. ఐ. త. శ. ప. 2. దివిజ — ఐ. 3. కడకు — పెక్కు ప్రతులు. 4. నిపుడు — కొన్ని ప్రతులు.

140. 1. జన్న — జ. 2. పదమునకై — ఓ. ఔ. 3. కి జనునె — ఈ; ఏ. ఐ. ఝ. త. శ. ప. 4. నేని — ఉ; నేగ — ఎ. ల.

141. 1. అని పలికి — క. జ. 2. దూతను — ఔ. ఘ. ల. 3. నిర్విఘ్నంబున — ఊ. 4. ప్రశంసుండును — ఉ. 5. లోష్టకాంచనుండును — ల. పెక్కు ప్రతులు. 6. హీనుండ — గ. 7. వకు — ఔ. 8. మూడగు — కొన్ని ప్రతులు; మూడవ యేటి — కొన్ని ప్రతులు. 9. పితా — కొన్ని ప్రతులు. 10. పాండవేయుల — జ. 11. తదనంతరంబ — అ. ఈ. ఎ. ఐ. ఝ. త. ల.

142. మ. వితతానేకమృగాకులంబును [1]సదావిర్భూతనానాతరు
[2]ప్రతతీపుష్పసుగంధబంధుర[3]శుభావాసంబు బ్రహ్మర్షిసం
[4]శ్రితపుణ్యాశ్రమమండలం[5]బు నగుచుం జెల్వొందు నక్కాననలో
[6]ధృతపుణ్యుల్ [7]విహరించి రేవురును గుంతీపుత్రు లిచ్ఛా[8]గతిన్.

143. వ. ఒక్కనాఁ డమ్మహారథులు దృణబిందునాశ్రమంబున ధౌమ్యసహితంబుగాఁ బాంచాలి నునిచి యేవురు నొక్కట [1]మృగయార్థంబు నలుదిక్కులకుం జనిన [2]యనంతరంబ.

-: సైంధవుఁడు ద్రౌపదిం జూచి మోహించుట :-

సం. 3 - 248 - 6

144. ఉ. వీరుఁడు సైంధవుండు [1]జనవిశ్రుతశౌర్యుఁడు సాల్వకన్య [2]నిం
పారఁగఁ [3]బెండ్లియాడుటకునై నిజవైభవ ముల్లసిల్ల వి
స్ఫారచతుర్వి[4]ధోరుబలసంగతుఁడై చను[5]చుండి యాశ్రమ
ద్వారమునందుఁ గాంచె ద్రుపదక్షితిపాలతనూజ నచ్చటన్.

145. ఉ. నీలపయోదమండ[1]లము నిశ్చలలీల వెలుంగఁ జేయుచుం
గ్రాలెడు [2]వాలుఁగ్రొమ్మెఱుఁగుకైవడిఁ దద్వనభూమి [3]నెంతయుం
లాలితదేహకాంతిపటలంబునఁ జేసి వెలుంగఁ జేయు [4]న
బ్బాల వినీలకుంతలవి[5]భాసినిఁ జూచి సవి[6]స్మయాత్ముఁడై.

---

142. 1. సమావిర్భూత - ఘ. 2. వ్రతతీ - కొన్ని ప్రతులు. 3. సుఖావాసంబు - ఐ. ఔ. ఘ. శ. ష. స. శ. 4. ధృత...బెంపారునక్కాననలో - ఓ. స 5. బగుచు దా జెల్వొందు - ఔ. ద. 6. గృతపుణ్యుల్ ...మనఃకేలిన్ బృథానందనుల్ - జ. స; కృతకృత్యుల్ - ద. 7. చరియించి - చ. 8. రతిన్ - కొన్ని ప్రతులు.

143. 1. మృగయావినోదార్థంబు - ఔ. శ. ష. 2. యవసరంబున - పెక్కు ప్రతులు.

144. 1. నయవిశ్రుత - వా. శ; బలవిశ్రుత - గ. ల. స; జనవిశ్రుత - పెక్కు ప్రతులు. 2. బెంపార - గ. 3. బెళ్ళి - జ. ఝ. 4. ధోగ్ర - ఉ. 5. దెంచి - ఘ. చ.

145. 1. లి వినిశ్చల - వీ. శ. ష. శ. 2. నట్టిక్రొమ్మెరుగు - ల. కొన్ని ప్రతులు. 3. నంతయున్ - ఔ. ద. ష. స; యంతయున్ - పెక్కు ప్రతులు; కెంతయున్ - గ; యొంతయున్ - శ. 4. నబ్బాలకి నీల-శ. 5. భాసిత - ఈ. ఐ. త. శ. ష. 6. విస్మితాత్ముడై - ఉ. ఝ.

146. తే. మగువఁ దగిలిన[1]చూడ్కుల మగుడఁ దిగువ
నేర్చు సాలక [2]యతఁడు కందర్ప [3]దర్ప
గోచరాత్ముఁడై నిజసఖుఁ [4]గోటికాస్యుఁ
డను నృపాత్మజుఁ జూచి [5]యిట్లనియె బ్రీతి.

147. ఉ. ఇన్నలినాక్షి యెవ్వ[1]తియొ యివ్విపినంబున నేకతంబ యి
ట్లున్న నిమిత్తమేమియొ సురో త్త[2]మకన్యయొ యక్షకాంతయో
పన్నగ[3]భామయో మనుజభామిని [4]గామి నిజంబ యిట్టి చె
ల్వున్న[5]దియే మహీతలము నుగ్మలు [6]లెవ్వరి[7]యందు నారయన్.

148. ఉ. లీల [1]యెలర్పఁగా నబల లేఁజిగురాకును బోలె నొప్పు కెం
గేలు కదంబశాఖ [2]తుదిఁ గీల్కొనఁ జేసి వసంతవిభ్రమో
న్మీలితబాలవల్లి[3]క్రియ [4]మేలగు చూడ్కుల [5]మించి పావక
జ్వాలయ పోలెఁ జిత్తము నిజం బెరి[6]యింపఁ దొడంగెఁ [7]జూచితే.

149. ఉ. ఈ కమ[1]లాక్షి నాకు హృదయేశ్వరి యైనఁ ద్రిలోకరాజ్యముం
జేకుఱ నేలినట్లు [2]విలసిల్లనె దర్పకవీరు బంటుఁ గాఁ

---

146. 1. చూపులు - జ; చూడ్కులు - కొన్ని ప్రతులు. 2. యవుడు - స. శ. కొన్ని ప్రతులు. 3. బాణ - ఉ. 4. గోపికాస్య - ఔ. ఘ; గోటికాశ్వ - అ. మూలమున కోటికాస్యుఁడనియే కలదు. చిత్రశాలాప్రతి, అరణ్యపర్వ, పుట, 429. 5. యిట్లనుచు బలికె - ఒ.

147. 1. త - ష; తె - ల. శ. 2. మభామ - కొన్ని ప్రతులు; ముఖామ - కొన్ని ప్రతులు; ముకన్నె - శ. ష; ముఖార్య - ఎ. ఘ. 3. కన్య - పెక్కు ప్రతులు. 4. గాదు - అ. ఝ. 5. దెయిమ్మహీ - కొన్ని ప్రతులు; తి చేర్చెనెమ్మనము యుగ్మలియందును నాకు నారయన్ - ఇ. ఏ. 6. లందుననేరికారయన్ - ఔ. 7. కెందు - ఓ. ల. వీ. ష.

148. 1. యొనర్ప - ఔ. చ. ఝ. స. శ. 2. తుద - కొన్ని ప్రతులు; రుచి - చ. 3. గతి - క. 4. మేలుగ - కొన్ని ప్రతులు; మెల్లన - ద; మెల్గుచు - గ; నేడును - ఈ. ఐ; మేలగుచుం దులకించి - ల. 5. నేచి - ఉ; నిల్చి - ఈ. ఐ. త; కించి - ఊ. ఓ. గ. ద. శ; నించి - ఝ. వీ. 6. యింపగ జొచ్చె - ఘ. 7. గంటివే - కొన్ని ప్రతులు.

149. 1. లాస్య - శ. పెక్కు ప్రతులు. 2. వికసిల్లనె - శ. కొన్ని ప్రతులు; వికసిల్లెద-

[3]గైకొని సర్వభోగములుఁ గాంతు నోడంబడఁ బల్కి దీనికిఁ
నాకును బోం దొనర్చి కరుణం జరితార్థునిఁ [4]జేయవే [5]ననున్.

150. వ. అని[1]పనిచినం [2]గోటికాస్యుండు గ్రక్కునం బాంచాలి [3]పాలికిం జని ప్రణయ[4]సుభగంబుగా నమ్మగువ కిట్లనియె.

151. సీ. మృగ[1]నేత్ర దారుణమృగసమాకుల మైన యివ్వనాంతరము[2]న నేకతంబ
[3]యిట్లు నీయున్కికి నెయ్యది మూల మివ్వనదేవతవో సురేశ్వరునితోడ
నలిగి ధరిత్రికి నరుగు దెంచిన శచీ[4]లలనవో హరి[5]యురస్స్థలి [6]దొరంగి
కేలిఁ గ్రుమ్మరు పద్మ[7]గేహవో భవదీయజనకత్వమున సముజ్జ్వలితుఁడైన
తే. [8]పుణ్యుఁ డేవంశమునవాఁడు పొలఁతి[9]నీదు, జీవితేశ్వరుఁ డగు సుఖజీవితాత్ముఁ
డెవ్వఁ డబల నీనామమై యింపుమిగులు, శబ్ద మెయ్యది నాకు నిజంబు సెపుమ.

152. క. కరిరాజగమన [1]మా తెఱఁ, [2]గరయఁ దలఁచితేని వినవె యధికబలుఁడ నే
సురథుఁ డను [3]రాజుపుత్త్రుఁడ, నరి[4]మథనుఁడఁ గోటికాస్యుఁ[5]డనఁ
జనువాఁడన్.

---

ఉ; వికసిల్లుదు-జ. 3. గైకొనవేవయస్యవెసఁ (మును) గాంత - ల. న. శ. పెక్కు ప్రతులు. 4. జేయుమన్ననన్ - ఇ. ఏ. 5. తగన్ - వెసన్ - జొ. క; దయన్-గ. ఘ.

150. 1. పలికినం - కొన్ని ప్రతులు; పలికిపనిచినం - ఇ. ఏ. చ. ల. 2. గోపి - జొ. గ. 3. కడకుం - కొన్ని ప్రతులు. 4. సురంగమృదు (వచన రచన - గ) మధుర వాక్యంబుల నందంద యక్కలకంఠి కిట్లనియె - గ. ఘ. ల.

151. 1. నేత్రి - ల. పెక్కు ప్రతులు. 2. నం దేకతంబ - కసం. వ. 3. యిట్టినీయునికికి- ఇ. ఏ; యిట్లున్నయునికికి - ఈ. ఐ. కసం. త. శ. వ. 4. దేవివో - వ. శ. పెక్కు ప్రతులు; తరుణివో - ఇ. ఏ. ల. 5. యురఃస్థితి - శ. కొన్ని ప్రతులు. 6. దొలంగి - కొన్ని ప్రతులు; దొఅంగి - శ. శ. 7. గేహినివో భవజ్జనకత్వమున - ఈ. ఐ. త. వీ. శ. వ. 8. పుణ్యుఁడేమివంశమువాడో - ఈ. ఎ. ఐ. త. ల. శ; పుణ్యుఁడేవంశమునవాఁడు పువ్వుబోఁడి - కసం. 9. నీకు - కొన్ని ప్రతులు.

152. 1. నా - పెక్కు ప్రతులు. 2. గరయం గా దలచితేని యధికబలుడనే-ద. 3. రాజపుత్త్రుఁడ - శ. పెక్కు ప్రతులు. 4. దమనుఁడ - క. జ. వీ. శ. వ. 5. డను వాడ మహిన్ - ఘ.

153\. తే. [1]అల్లకాంచనరథముపై నలరు[2]వాఁడు
ఘనుఁడు క్షేమంకరుండు [3]త్రిగర్తవిభుఁడు
మఱియు నినుఁ జూచుచున్నాఁడు మగువ వాఁడె
[4]దీప్తభుజుఁ డైన కాళింగ దేశవిభుఁడు.

154\. తే. [1]ఉల్ల పద్మాకరముపొంత [2]నుండి నిన్ను
మెచ్చి కనుఁగొనుచున్న యున్మీలితాక్షుఁ
[3]డుత్పలాక్షి యిక్ష్వాకువంశోద్భవుండు
సుబలభూపతి [4]పుత్త్రుండు సుభగుఁ డతఁడు.

155\. వ. అరుణాశ్వయుక్తంబు లయిన రథంబులయందు రత్నమయ [1]భూషణు లయి [2]సమిద్ధవహ్నులుంబోలె వెలుంగుచున్న [3]యాసౌవీరకుమారులు పన్నిద్దఱుం దన్నుం జేరికొలువ ననేకసహస్రకరితురగరథపదాతిపరివృతుం డై మహాగజంబుపై శోభిల్లుచున్న [4]యవ్వీరుండు సింధుసౌవీర[5]నాథుం డైన జయద్రథుం డమ్మను[6]జేశ్వరుం డిప్పుడు నీతెఱం గెఱుంగఁ [7]దివిరి నన్ను నిట పుత్తెంచె ననినఁ [8]బాండవపత్ని మృదుసంభ్రమంబునం [9]గదంబశాఖ విడిచి యుత్తరీయంబు సంగతంబు [10]గావించుకొని కోటికాస్యున కిట్లనియె.

---

153\. 1. ఉల్లకాంచన...నున్నవాఁడు – స. సూ. శ; పొన్నకాంచన...నున్నవాఁడు – ఔ. శ. 2. చున్న – ఉ. క. జ. ల. 3. త్రికర్త – పెక్కు ప్రతులు. 4. పృథునిభుండు పుళింద ధాత్రీవిభుండు– ఈ. ఐ. త; దీప్తభుజుఁడు కళింగధాత్రీవిభుండు – అ. పెక్కు ప్రతులు; దీప్తభుజుఁడు కళింగ ధాత్రీవరుండు–పీ. శ. ష; దృప్తవిభుడు–ఊ.శ.

154\. 1. ఉల్లపద్మాకర – ఊ. ఒ. చ. ట. శ; నిండు పద్మాకర – ఈ. ఐ. త. శ; ఉవిద పద్మాకర – వా. కొన్ని ప్రతులు; ఒనరఁబద్మాకర – జ. పీ. ష; అల్లపద్మాకర – ఉ. 2. నమరనుండి నిన్ను కనుగొనుచున్న–ఉ; నదిగో నిలిచి నిక్కి నిను కనుచున్న–ఔ. 3. డుర్వి నిక్ష్వాకువంశోద్భవుండు సూవె – వా; డుత్పలాక్షి యిక్ష్వాకువంశోద్భవుండు – పీ. శ. ష. పెక్కు ప్రతులు; డుజ్జ్వలాక్షి యిక్ష్వాకు వంశోద్భవుండు – అ. ఇ. ఈ. ఉ. ఎ. ఏ. ఐ. త. 4. తనయుండు – ఈ. ఐ. త.

155\. 1. భూషులయి – ఉ; భూషితులయి– అ. 2. సముజ్జ్వల– ఇ. ఏ. ఓ. ఝ. 3. యవ్వీరకుమారులు – కొన్ని ప్రతులు; సౌవీరకుమారులు – జ. ల. పీ. శ. ష. 4. యప్పురుషుండు – ఓ. 5. నాయకుండైన – ఔ. ద. 6. జేంద్రుండు – కొన్ని ప్రతులు. 7. గోరి – చ. 8. పాంచాలి – ఓ. 9. గరశాఖ విడిచి – జ. 10. చేసుకొని – అ.

156. తే. అన్న యిచ్చట నే[1]నొంటి నున్నదాన
[2]నీవిచటి కేఁగుదెంచుట [3]నియతి యగునె
[4]సుతవతిని ధర్మవతి నన్ను నితరకాంతఁ
గాఁ దలఁచి [5]పెక్కులు వల్కఁ గాదు నీకు.

157. వ. నీవు శిబివంశోద్భవుం డైన సురథపుత్త్రుండ[1]వగు టే నెఱుంగుదు నస్మత్ప్రకా[2]రంబు సెప్పెద వినుమేను బాంచాలపతి యైన [3]ద్రుపదుకూఁతురఁ గృష్ణ యనుదానం బాండునందను లగు యుధిష్ఠిర భీమార్జున నకుల సహదేవులకు [4]ధర్మపత్ని [5]నవ్వీరు లిప్పుడు నన్ను నివ్వనంబున [6]నునిచి.

158. తే. ధర్మజుఁడు దూర్పు భీముఁడు దక్షిణంబు, నర్జునుఁడు [1]పడమర గవలర్థి నుత్త
రంబుగా వేఁటవోయిరి రాజముఖ్య, [2]లనఘు లింతకు వత్తురు వినుత[3]బలులు.

159. వ. మీ రమ్మహాత్ములకు మాననీ[1]యులరు గావున నార్యజనమిత్త్రు లగు నక్కురుకులపవిత్రులు సేయు సత్కారంబులు గైకొని [2]పోవుదురు గాని యొక్కింత [3]తడ వియ్యాశ్రమసమీపంబున నిలువుం డని పలికి యల్లన యవ్వరవర్ణిని భయంబునం బర్ణగృహంబు [4]సొచ్చినం గోటికాస్యుండును[5] గ్రమ్మఱి చని జయద్రథునితోడ నబ్భామిని పాంచాలకన్యక యనియును బాండవపత్ని యనియునుం జెప్పిన నద్దురాత్ముండు [6]మదనకంపితహృదయుం డగుచు

---

156. 1. నొంటి యున్నదాన — స. శ. 2. నీకు నిచ్చోటి కరుదేర నీతి యగునె — వ. కొన్ని ప్రతులు. 3. నీతియగునె — ల. శ. కొన్ని ప్రతులు. 4. సుతసతీధర్మవతి నన్ను నితర — ఇ. ఏ. ఔ. 5. పెక్కు పల్కంగగాదు నీకు — ల.

157. 1. వగుట యెఱుంగుదు — పెక్కు ప్రతులు. 2. రం బెఱింగించెద — ఔ. ద. 3. పృషదు — ఈ. ఐ. త. 4. కులపత్ని — కొన్ని ప్రతులు; సతిని — గ; భార్య — ఓ. 5. నప్పురుషసింహు — అ; నప్పురుషు లి — ట. 6. నిలిపి — ఓ.

158. 1. పడ్మరయు గవలర్థి — అ. 2. లనఘు యింతకువత్తు రవ్వినుత బలులు — పెక్కు ప్రతులు. 3. బలురు — ఈ. ఐ. త. ?

159. 1. యులు — కొన్ని ప్రతులు. 2. పోదురు — పెక్కు ప్రతులు; పోయెదరు — ఇ. ఏ. ఘ. 3. ప్రొద్దియ్యాశ్ర — అ. 4. సొచ్చుటయు గోటి — కొన్ని ప్రతులు; సొచ్చెంగోటి — ల. 5. సైంధవు కడకుం జని యప్పొలతి వృత్తాంతం బంతయు నెఱింగించిన నెఱింగియు నద్దురాత్మ — ఆ. ఈ. ఎ. ఐ. ఝ. త. 6. కదన కంపిత—

[7]నమ్మగువ నపహరింపం[8] దివిరి కతిపయజనసమేతంబుగా నరిగి [9]సింహా గారంబు సొచ్చు [10]వృకంబునుంబోలెం బాండవనివాసంబు సొత్తెంచి [11]పాంచాలిం గని [12]దాని కిట్లనియె.

160. క. వామాక్షి నీకుఁ గుశలమె, నీ[1]మన సెవ్వారియందు నిత్యప్రేమం బై మెఱయు నట్టి [2]సొబగులు, నీమగ లేవురకు నిపుడు నెమ్మదియె మదిన్.

161. వ. అనిన వానికి [1]నమ్మానవతి యిట్లనియె.

162. చ. స్థిరమతులైన పార్థులకు సేమము [1]నీకు ననామయంబె భూ
వర [2]తగ వింద వైతి [3]కురువర్యుల యింటికి నట్లుగావునం
బరువడి నాసనక్రియయుఁ బాద్యముఁ గైకొను మాదరంబుతో
సరసకురంగమాంసములఁ జల్పుము భోజనకృత్య మిత్తఱిన్.

163. ఆ. వేఁట వోయినారు విభు లిప్డు వత్తురు, వారు[1]వచ్చి నీకు వలయునట్టి ప్రియము [2]లాచరింపఁ బ్రీతుండ వై [3]మఱి, యిష్టజనులు నీవు నేగుఁ మనఘ.

164. చ. అనవుడు సైంధవుం డనియె నంబుజలోచన నీవు మాకుఁ జే
యు [1]నతిథిపూజ లన్నియును [2]నొక్కటనైనఁ గొఱంత[3]లేక వ
చ్చిన[4]వియ మన్మథాస్త్రముల చిక్కునఁ [5]గాఱియవోండె డెంద మిం
క ననుఁ గృతార్థుఁ జేయుము దగఁ రథ మెక్కుము లెమ్ము [6]నెమ్మితోన్.

---

కొన్ని ప్రతులు; కదనదళిత — కొన్ని ప్రతులు; శరకంపిత — ఉ. క. చ; బాణ కదంబకంపిత — న. 7. దుర్మదంబున నమ్మగువ — కొన్ని ప్రతులు. 8. దలంచి — ల. వీ. కొన్ని ప్రతులు. 9. సింహ గుహాంతరంబు — జా. 10. మృగంబు — శ. ష. 11. సైంధవుండు పాంచాలిం—ల. కొన్ని ప్రతులు. 12. యిట్లనియె—కొన్ని ప్రతులు.

160. 1. మన మెవ్వారి — ఈ. ఐ. త. 2. సుభగులు — అ. క.

161. 1. నమ్మానిని యిట్లనియె — పెక్కు ప్రతులు; నమ్మగువ యిట్లనియె — అ. గ.

162. 1. నాకు — ఆ. ఈ. ఐ. క. త. 2. విను — గ; తగు — ష. న. 3. గుణవర్యుల — ట. వా. న; కురువర్యుల — వీ. శ. ష. పెక్కు ప్రతులు.

163. 1. నీకుమెచ్చ — చ. 2. లోరగింప — ఘ. 3. తుది — చ.

164. 1. నిపుణపూజ — జా. 2. నొక్కటియైన — క. 3. లేదు — ల. న. శ. పెక్కు ప్రతులు; లేవు — కొన్ని ప్రతులు. 4. యవి — ఓ. చ. శ. ష; యది — అ; వియు— ఆ. ఉ. ఎ. ఝ; వియె — కొన్ని ప్రతులు. 5. బొందెను వాడు డెందమిం — ఓ. ఘ. ల. 6. వావుడున్ — ఇ. ఏ; పేర్మితోన్ — జా.

165. మ. ధరణీరాజ్యము గోలుపోయి ఘనకాంతారస్థలీవాసులై
సరివా రెల్లను నవ్వఁ గుత్సితదశా[1]సంప్రాప్తిమై నున్న ము
ష్కరులం బార్థులఁ [2]గొల్చినం గలదె సౌఖ్యం బెంతయుం బేలవై
తరవిందానన శ్రీవిహీనులఁ గరం బర్థింతురే కామినుల్.

166. ఆ. చిగురుఁ[1]బోఁడి నిఖిలసింధుసౌవీరభూ, వలయరాజ్యగౌరవంబు[2]తోన
నన్ను నేలి[3]కొని మనఃప్రియభోగైక, యోగ్య వగుము విడువు
మొందు దలఁపు.

167. వ. అనినం బాంచాలి [1]ప్రకంపితచిత్త యగుచుఁ గొండొక దొలఁగి వాని దెస [2]ననాదరదృష్టిం జూచుచుఁ దనపతుల రాకయ కోరుచుం బ్రతివాక్యంబుల గొంత కాల[3]క్షేపంబు సేయుటకై వాని కి ట్లనియె.

168. తే. తలఁపఁ బాండవధార్తరాష్ట్రులకుఁ జెలియ
లైన యాదుస్సలకుఁ బతి వనఘ నీవు
నాకుఁ [1]దోఁబుట్టువవుగావె నీకుఁ [2]జనునె
[3]పాడిదప్పిన[4]మాటలు పలుక[5]నిచట.

169. క. నయమును ధర్మము గల య, న్వయమున [1]జనియించినాఁడ వక్కట ధర్మ
క్రియ యెఱుఁగంగా వలదె యు, భయలోక విరుద్ధ మైన పథ మేమిటికిన్.

170. వ. అనిన నద్దురాత్ముండు [1]దరస్మితాననుం డగుచు ని ట్లనియె.

---

165. 1. సంప్రాప్తులై యున్న — అ. చ. జ. ల. 2. గూడినం — ల. కొన్ని ప్రతులు; పొత్తునం — ట; బొందినం — ఊ; గల్సినం — అ. స. శ.

166. 1. బోఁడియఖిల — ల. కొన్ని ప్రతులు. 2. తోడ — ల. కొన్ని ప్రతులు. 3. కొమ- కొన్ని ప్రతులు.

167. 1. భయకంపిత — క. 2. ననాదర — బొ; నవమాన — వా. పెక్కు ప్రతులు. 3. క్షేపణంబు — ఇ. ఏ.

168. 1. దోడబుట్టువుగావె — ల. 2. దగునె — ఇ. ఏ. 3. పాటి — అ. ఈ. ఎ. 4. పలుకులు — చ. 5. నకట — ఝ. ల.

169. 1. నక్కట జనించినాడవు — ల.

170. 1. మందస్మితాన — కొన్ని ప్రతులు; దరహాసితాన — జ. ల. కొన్ని ప్రతులు.

171. క. వనజాక్షి రాజధర్మము, వినవే యెన్నఁడును [1]మనుజవిభులకుఁ బ్రమదా
[2]జనులయెడ వావి వెదకం, జనదు వలసినట్లు వేడ్క సలుపంగఁ [3]జెల్లున్.

172. క. విను మదియుఁగాక జగమున, వనితారత్నంబు లెల్లవారికి భోగం
[1]బునయెడ సాధారణ[2]ము లో, కని ధన మని [3]గురుతు గలదె కరినిభగమనా.

173. వ. అనిన నయ్యంగన క్రోధకలుషి[1]తాంతరంగ యై యప్పాపాత్ము[2]డు ప్రియ వచనం[3]బులం బోవండు వెట్టిదంబులం గాని చక్కంబడఁ డని [4]తలంచి యి ట్లనియె.

-: ద్రౌపది సైంధవునితో నిష్ఠురోక్తులు వలుకుట :-

సం. 3 - 252 - 1

174. చ. ప్రకటిత [1]శౌర్యసారుల న[2]భగ్నపరాక్రమనిర్జితాహిత
ప్రకరులఁ బాండునందనులఁ బాండుయశస్కుల నాత్మలోఁ దలం
పక నను ధిక్కరించెదు నృపాలకులాధమ నీదుగర్వదు
ర్వికసన మింతఁ [3]బోదు తుది ప్రేఁగగుఁ దక్కుము [4]దుష్ప్రలాపముల్.

175. మ. హిమవత్పాదవనాంతకేలి[1]రతిమై [2]నేపారి కోపారుణ
[3]క్రమనేత్రాంచలమై ప్రభూతమదరేఖం బైన గంధద్విపేం
ద్రము డాయం జని [4]సిళ్లు[5]సూపుట సుమీ ధర్మాత్ము నత్యుగ్రవి
క్రముఁ గాంతేయ[6]వరిష్ఠు నీవు దొడరంగాఁ [7]జూచు టూహింపఁగన్.

---

171. 1. రాజవిభులకు - ఔ. 2. జనములెడ - ట. గ. 3. వలయున్ - ట. ఔ. చ. ఝ;

172. 1. బునెడను - ట. ల; బునెడల - జ. వ. 2. మొక్క నిధనమని - అ. ఈ. ఐ. జ. త. 3. గరుసు-స. శ. పెక్కు ప్రతులు; గురుదు-స; గురుసు-గ. ఝ. శ; వలుక-అ. ద.

173. 1. తాంతఃకరణి - ట. 2. డెట్లును ప్రియ-జ. ల. 3. బు లగు వలుకుల చక్కం బరచెద నని తలంచి - ఔ. 4. తలంచి - కొన్ని ప్రతులందు లేదు; కలుషించి-ట.

174. 1. ధైర్య - పెక్కు ప్రతులు. 2. భంగ - ల. స. శ. పెక్కు ప్రతులు. 3. బోక - స. శ. కొన్ని ప్రతులు. 4. దుర్విలాపమున్ - ఘ; మత్ప్రలాపముల్ - ఝ.

175. 1. గతి-కొన్ని ప్రతులు. 2. నెవ్వారికిం దారుణ - ఈ. ఐ. త. ద. 3. భ్రమ... ...కుధరాభం బైన - అ. 4. కేలి-ఇ. ఏ; సీల్లు-ఘ; సుళ్లు - అ. 5. సూపు నరు చందం బీవు నత్యంత వి - ఔ. 6. గరిష్ఠు - ట. గ. ఝ; వరిష్ఠుతోడ - ఔ. 7. జూచుదూహింప - ట. జ.

176. ఉ. శాతనఖాగ్రఖండితలసన్మదకుంజరకుంభముక్తము
క్తాతతశైలకందర[1]గుహాంతరసుప్త[2]మృగేంద్రకేసర
వ్రాతము వేడ్క [3]నూఁచికొన వారక చేరుట గాదె క్రోధని
ర్ఘాత[4]మహోగ్రు భీముఁ జెనకం దలపోయుట నీకు నెమ్మెయిన్.

177. మ. చల[1]జిహ్వాగ్ర[2]విలీఢవిస్ఫురితదంష్ట్రాభీషణం బైన బె
బ్బులిఁ గోలం గొని వ్రేసి[3]త్రోసి తొలఁగం బోవచ్చినన్ వచ్చుఁ గా
క లసత్త్రూత్కారశరాగ్నిదుస్సహుని నగ్గాండీవి నల్గించి యె
వ్వలనన్ మానధనాఢ్యులై బ్రతికి పోవన్[4]వచ్చునే యేరికిన్.

178. ఉ. [1]బోరన విస్ఫులింగములు [2]వొడ్మఁగ నుగ్రవిషంబు గ్రక్కుచుం
గ్రూరవిచేష్ట నాలుకలు గ్రోయు మహోరగరాజయుగ్మముం
జేరి పదాహతిం గినియఁ జేయఁ దలంచుట గా నెఱుంగు దు
ర్వారులు మాద్రిపుత్త్రుల కవజ్ఞ యొనర్పఁ దలంచు [3]టేర్పడన్.

179. ఉ. ఆలములోన [1]వీఁక నమరాసురకోటికి నైన దుర్జయుల్
[2]వాలిన వీరు లవ్విభులు వారికి నెగ్గొనరించి పోయి పా
తాళము సొచ్చి డాఁగినను దప్పదు మృత్యువు నీకు నక్కటా
కాలము నిండె నీవశముగాదు విధాతృ[3]ని చెయ్వు త్రోవఁగన్.

---

176. 1. గృహాంతర — పెక్కు ప్రతులు. 2. మృగేంద్రు నేప దుర్నీతి గురంగముం దలచి నేరక చేరుట — ఔ. 3. నాఁచికొన — శ; పెక్కు ప్రతులు. 4. మహోగ్రభీము — కొన్ని ప్రతులు.

177. 1. దంష్ట్రాగ్ర, దంష్ట్రోగ్ర – స. 2. నిశాత – కొన్ని ప్రతులు; మహోగ్ర – ఒ; లిలితు – త. 3. డాజి – అ. ఉ. ఎ. ఝ; త్రోచి – కొన్ని ప్రతులు; త్రుంచి – ద. 4. శక్యమే – ల. పెక్కు ప్రతులు.

178. 1. భోరన – పెక్కు ప్రతులు; భోరున – కొన్ని ప్రతులు. 2. పుట్టగ – ల. 3. చెప్పడున్ – స. కొన్ని ప్రతులు.

179. 1. నిక్క మమరాసుర – అ. జ; నింక నమరాసుర – కొన్ని ప్రతులు. 2. వ్రాలిన– ఔ. ఘ. వ. 3. నిచైదె – కొన్ని ప్రతులు; సి చెయ్యు – ఈ. ఐ. త. ల. వీ. శ. ష. స; డు తప్పద్రోవగాన్ – ఒ.

180. క. తేలును గర్కటియును దెగు, కాలము[1]నకుఁ జూలు దాల్చుగతిఁ బార్థుల యి
[2]ల్లాల నయిన నాదెస దు, శ్శీలుఁడ[3]వై తిది వినాశచిహ్నముగాదే.

181. వ. అనిన జయద్రథుండు నవ్వుచు నవ్వేలంది కిట్లనియె.

182. ఉ. వారిజ[1]నేత్ర పాండుసుతవర్గము [2]నేఁ డీట మాకు [3]వింతయే
[4]భీరులఁ బోలె [5]నేల వెఱపించెదు మాటల [6]మమ్ము వింటె సౌ
వీరకులప్రసూతులము వీరుల మే మితరక్షితీశసా
ధారణబుద్ధి[7]సేయకు ము[8]దాత్తచరిత్రుల మైన మాదెసన్.

183. వ. వలవని మాట[1]లఁ దేర్చినం దీరదు వేగంబ యల్ల కనకరథం బొండె [2]నల్ల
మహాగజంబు [3]నొండె నెక్కుము వీరంపు మాట లాడక ప్రియవచనంబుల
నస్మత్ప్రసాదభాజనంబ వగు మనిన విని యాజ్ఞసేని వాని కి ట్లనియె.

184. ఆ. వీరపత్ని నయ్యు వీర[1]సహోదరి, నయ్యు నీకుఁ జూడ ననదవోలె
నున్నదాన నెట్టు లున్నను [2]నాకు నీ, దెలుపనేల పలుకుతియ్య మేల.

185. చ. అతులితవృష్ణి[1]కేకయబలావళితోఁ బటు[2]శంఖఘోష [3]భీ
షితభువనత్రయుం డగుచు శీఘ్ర[4]తురంగరథాధిరూఢుఁడై

---

180. 1. నన చూలు - ఈ. ఎ. ఐ. త. 2. ల్లాలైన - ద. 3. వై తి విది నాశ - ల.

182. 1. నేత్రి - పెక్కు ప్రతులు. 2. నేఁడుగ - శ. స. శ. 3. క్రొత్తయే - ఈ. ఐ. త. 4. భీరము వోవ - స; వీరుల బోలె - ఇ. ఎ. 5. మమ్ము - ఈ. ఐ. త. 6. నీవు - చ; మమ్మునీవు - ట. 7. చూడకు - ఓ. ట. చ. ఝ. 8. దార - పెక్కు ప్రతులు; దర్పమహోగ్రుల మైన - ట.

183. 1. లు పేర్చినం - పెక్కు ప్రతులు; లనేర్చినం - స. శ; వర్ణించినం - స; లు నె(చె)ప్పినం - వీ. శ. ష; లు వెక్కులు పలుకక - ట. 2. కాకున్న నల్ల మణిమయ కుథాస్తరణాలంకృతం బైన భద్రదంతావళంబుపై నొండె - ట. 3. నొండె యెక్కుము - ఇ. ఈ. ఐ. ట; ఒండెద్రుతాంతమని - శర.

184. 1. సోదరినయ్యు కాలగతి ననాథవోలె నున్న - ఇ. ఏ; సోదరినయ్యు వీరజనని నయ్యు వెఱ్ఱివాడ - ట. 2. నేనిన్ను - కొన్ని ప్రతులు; వాకునిన్ దెలపనేల - శర.

185. 1. భోజక - ట. 2. సింహనాద - ఆ. ఉ. ఎ. 3. భీష్మిత - అ. క; నిర్జిత - ట. 4. మ యిద్ద - ట.

[5]జితదనుజాన్వయుండు యదుసింహుఁడు [6]వెన్నుఁడు [7]ముట్టి నీ బరి
క్షతబలుఁ [8]జేయ నాకు దెస గల్గు[9]టెఱింగెదు గాక యత్తఱిన్.

186. సీ. గాండీవరేఖ యాఖండ[1]లు చాపంబుకరణి గాఁ దద్గుణక్వణము ఘోర
[2]గర్జగా నవి[3]రళగంభీరవీరరసాపూర్ణ మై సంతతా[4]వలిప్త
శత్రుప్రతాపోష్ణసమయంబు శమితంబు గా మిత్రబర్హికేకారవంబు
లెసఁగంగఁ దోఁ[5]తెంచి యింద్రనందనమహాజలధరం బాయతసాయకోరు

ఆ. వృష్టి ముంచుటయును [6]వెరఁగంది నిలువంగ, నలవిగాక [7]పఱచు నప్పు డైన
నాత్మదోషవృత్తి కై మనంబున వగ, చెదవు. గాక [8]యిపుడు సెప్ప నేల.

187. ఉ. ఘోరగదా[1]విదారణ [2]విఘూర్ణితశాత్రవకుంభికుంభ[3]ముల్
[4]చీరుచు మౌక్తికంపుతతిచే రణభూమి నలంకరించు కే
[5]లీరసలోలుఁడై సమదలీల బకాంతకుఁ డేఁగుదేరఁ గ[6]
న్నారఁగఁ జూచి[7]కాక యిటు లంతకు నీమది త్రుళ్ళడంగునే.

---

5. శ్రితజనరక్షణుండు – ఔ. 6. వెన్నడిముట్టి – ప. పెక్కు ప్రతులు. 7. నిన్ను ముట్టివే – ఓ. ఝ. ల. 8. జేయునచ్యుతుడు – అ. ట. 9. టెఱుంగుదు – పెక్కు ప్రతులు; టెఱుంగవె దుష్టమానసా – అ. ట.

186. 1. ల – పెక్కు ప్రతులు. 2. భీషణముగ వపుః పృథుకాంతి సౌదామనీవిలాసముగ యుద్ధావలిప్త – ఇ. ఏ. (?) గర్జ (మ్ము)గా నతిరథగంభీర సంపూర్ణమై పంతతంబైన యాగ్రహంబు – ట. 3. రత – ఊ. చ. ల; 4. గ్రహమున – అ. 5. తెంచు నింద్ర – ల. కొన్ని ప్రతులు. 6. వెగడొంది చేష్టింప – ల. స. శ. కొన్ని ప్రతులు; వేగంబచేష్టింప – కొన్ని ప్రతులు; వేగంబ చెప్పింప – ఉ. ఝ. 7. నిలిచి యప్పు డైన – ల. స. శ. పెక్కు ప్రతులు. 8. వేఱచెప్ప నేల – స.

187. 1. భిదారణ – ఊ. స. 2. గభీరమహారణసాగ – ల; విఫేనసమిద్ధన సాగ – ఔ; గభీర వసాకర సాగ – ఓ; గభీరతరాహత – ఇ. 3. విస్ఫార – చ; ముల్ –అ. జ. ల. వీ. ష; కుంభీర – వా – కొన్ని ప్రతులు. అన్వయము సుగమముగాలేదు. 4. చీరుచు మౌక్తికప్రతతి చెన్నుగ భూమి యలంకరించుచున్ – ట; చీరుచు మౌక్తికవ్రతతిచే రణభూమి నలంకరించుఁ (ప) గే – అ. క. జ. వీ. శర. ష. సూ; భీరచిరోరు మౌక్తిక గభీర తరారుణ సాగరాంబు కే – వా. కొన్ని ప్రతులు; స్ఫార తరోరు మౌక్తిక విభాసి తరారుణ – చ; భీరుచిరోరు – పెక్కు ప్రతులు. 5. భూరిప్రతాపియై సమరభూమి బకాంతకు – ట. 6. గండ్లారగ – ఔ. 7. కాకిటు లలంతుల – వ. శ (యతి?)

188. క. [1]నను బెఱవసితల చందం, బున నవమానింప నీకుఁ బోలదు మత్పా
వనపాతివ్రత్యమహిమ, ననిశము [2]నేకీడునెందు నందదు నన్నున్.

189. వ. అని పలికి ద్రౌపది యద్దురాత్ముండు దన్నుఁ బట్టి సమ[1]కట్టుక న్నెఱింగి తమ పురోహితు ధౌమ్యునిం బేర్కొని యాక్రోశించిన నతం[2]డతిరయంబునఁ జనుదెంచు [3]నాలోన.

-: సైంధవుఁడు ద్రౌపదిని బలాత్కారముగా నెత్తికొని పోవుట :-

సం. 3 - 252 - 23

190. ఉ. పాపవి[1]నిశ్చయుండు సతి పయ్యెదకొంగు గడంగి [2]పట్టినం
గోపముతో [3]నుదల్చికొని కోమలి[4]యుఁ ౼ వెస వానిఁ ద్రేయుడుం
[5]బోపడి వాఁడు [6]చిత్రముగ భూమితలంబునఁ [7]ద్రెళ్లె [8]మారుత
[9]క్షేపవిభగ్నమూల మయి చెచ్చెరఁ ద్రెళ్లు మహీ[10]రుహంబునాన్.

191. వ. ఇట్లు నేలం బడి తడయక [1]యొగసి జయద్రథుం[2]డు మగువం దిగిచి రథం[3]బుపై నిడికొని సపరివారుం డయి యరుగం [4]దొడంగె నప్పు డప్పాంచాలి పురోహితునకు మ్రొక్కిన నమ్మహాత్ముండు సైంధవుం బేర్కొని యిట్లనియె.

---

188. 1. ఈ పద్యమునకుముం దొకానొక ప్రతియం దీ క్రింది పద్యముకలదని స. శ.
చ. ఘనతరచాపదండభవకాండమహానిలధారచేఁ జమూ
ఘననికురంబ మంతయును గంపము చేయుచు వేగ మాద్రినం
దను లిటు వచ్చు నంతట మదంబును శౌర్యము మాని యాత్మలో
నను గణియింపు కార్యమును నాదగునిర్మలవాక్యపద్ధతుల్.
2. నిను గీడు వొందు నందును నిందున్ - ఇ. ఏ.

189. 1. కట్టుసన్న యెరింగి - ఆ. ల; కట్టుట యెఱింగి - చ. పి. శ. ష; కట్టినకన్నెరింగి - ఎ. 2. డును నతి - కొన్ని ప్రతులు. 3. నాసమయంబున - ఘ. పి. శ. ష.

190. 1. నిశ్చితుండు - ఒ. ఝ. 2. యీడ్చి - ఊ; ముట్టి - ఘ. 3. నదల్చి - పెక్కు ప్రతులు; సదల్చివెస - ఔ. 4. చేవడి చెంపఁ ద్రేయుడున్ - ఔ. 5. బ్రోపఱి - పి. ష; బోపరి - కొన్ని ప్రతులు; పూపరి - ఔ. 6. శీఘ్రముగ (న) - ఘ. ట. ల. 7. వ్రాలె - అ. క. జ. ల. 8. మారుత - ఘ. ల. పి. శ. స; మారుతాక్షేప - వా. కొన్ని ప్రతులు. 9. క్షేపితభగ్న - అ; క్షేపవిభిన్న - ఊ. 10. రుహం బనన్ - ల. స. పెక్కు ప్రతులు.

191. 1. లేచి - ఉ. ఘ. పి. శ. 2. డగణిత సుందరాంగి యగు నమ్మగువం - ఔ. 3. బున - ఊ; బుమీద - క. 4. దొణంగె - ల.

192. మ. తగునే రాజకులప్రసూ[1]తులకు నత్యంతంబు నేతాదృశం
బగు దుష్కర్మము నాదుపల్కు విను మీయజ్ఞాతి పుణ్యాత్మ యి
మ్మగు[2]వన్ వే విడు పాండునందనులు నీమానంబుఁ బ్రాణంబు నే
పగిదిం గొందురు గాని [3]పో విడువ రీపాపంబు నిన్ ద్రెక్కొనున్.

193. వ. అని యాక్రోశించుచు నమ్మహీసురవరుండు వాని పిఱుందన చనియె నిట పాండవు[1]లునవ్వనంబున ననేక[2]మృగంబుల వధియించి యందఱు నొక్క యెడం [3]గూడంబడి [4]యాశ్రమాభిముఖులై [5]వచ్చునెడఁ దమ్ములం జూచి ధర్మ[6]జుం డిట్లనియె.

194. సీ. ఇనుఁడున్న దెసనుండి [1]యెలుఁగింపఁ దొడఁగెఁ బక్షులు మృగంబులు నతిఘోర[2]రుతుల
[3]మగిడెడు నిప్పుడు మనకు [4]దాపలిదెస నతి[5]భీషణాకృతి నఱచె వఱదు
పగఱచే నవమానపాటును [6]గయ్యంబుఁ గలుగు నీశకునప్రకార మరయఁ
[7]గడుకొని చెయి వెట్టి కలఁచిన ట్లయ్యెడుఁ జిత్తంబుఁ దనువు [8]నిశ్చేష్ట మయ్యె
ఆ. నరుగుదెందు వేగ [9]యాశ్రమంబునఁ గృష్ణ, మునిచి వచ్చినార మొంటి నకట
తలఁపఁ గ్రూరమతులు ధార్తరాష్ట్రులు గడు, నెగ్గు సేయఁ[10]జూతు రెడమ వేచి.

---

192. 1. తులరు – గ. 2. వస్వీడుము – అ. 3. హా విడువ–వా; పో విడువ – పెక్కు ప్రతులు.

193. 1. లు వనంబున – పెక్కు ప్రతులు; లనేకమృగంబుల – ఊ. ఔ. ల. 2. మృగకులంబుల – కొన్ని ప్రతులు. 3. గూడికొని – కొన్ని ప్రతులు. 4. మగిడి యాశ్రమాభి – ల. పెక్కు ప్రతులు. 5. చనునెడ – ఈ. ఏ. 6. తనయుం – కొన్ని ప్రతులు.

194. 1. యెలిఁగింప – ఈ. ఐ. త. వీ. స. శ. 2. భంగి – ఇ. ఏ. గ; రుతుల – ఉ. ఔ. వీ. శర. ష. శ; గతుల – వా. కొన్ని ప్రతులు. 3. మగుడెడు – పెక్కు ప్రతులు. 4. దాపటి – ల. శ. పెక్కు ప్రతులు. 5. భీకరాకృతి – కొన్ని ప్రతులు. 6. యుద్ధంబు – కొన్ని ప్రతులు. 7. గడుపులో జెయి – క. వీ. శ. 8. విచేష్ట – ఔ. ద. 9. నాశ్ర – పెక్కు ప్రతులు. 10. దలతు – చ; జూతు రెవుడు రేచి – ట.

195. అ. కమలహీన మైన కమలాకరమువోలె, [1]రాజహీన మైన రాత్రివోలెఁ
గూడఁ [2]గామ్యకంబు శూన్యమై యున్నట్లు, దోఁచె నేమికీడు [3]దొడరు నొక్కొ.

196. వ. అని యె ని[1]ట్లయ్యేవురు నరదంబులు సత్వరంబుగాఁ దోలుకొని యాశ్రమంబునకు వచ్చునెడఁ బాంచాలి పరిచారిక [2]ధాత్రేయిక యనునది, [3]యతికరుణంబుగా నేడ్చుచున్నం గని ధర్మతనయు సారథియైన యింద్రసేనుండు రథంబు [4]డిగ్గనుఱికి చని యిది[5]యేల నేలం బడి పొరలుచు [6]నేడ్చెదవు నీ [7]కపకారంబు సేసిన వా రెవ్వ రని[8]న నది వానిం జూచి సైంధవుచేతం బాంచాలి చెఱవోయె నని పలుకుచుఁ [9]బె ల్లేడ్చిన నింద్రసేనుం డిట్లనియె.

197. సీ. [1]పాండుపుత్త్రుల బహిఃప్రాణంబు నుత్తమశీల సమగ్రఁ బాంచాలతనయఁ
గొని[2]పోవు నంతటి [3]గుండె గల్గెనె విమోహాంధమానసుఁ డైన సైంధవునకు
నేఁగుఁ గా కేమి మహీతలగతుఁ డైన గగనంబునకు [4]వేగ యెగసి చనినఁ
[5]బోనిత్తురే పొరివుత్తురు గాక [6]యుద్ధురవృ[7]త్తిఁ బార్థు లాదురితచరితు

---

195. 1. రహితకీరపంజరంబుభంగి – ఇ. ప; భూమిపతియు లేని పురమువోలె – అ; రాజహీనమగు పురంబువోలె – కొన్ని ప్రతులు; రాజులేనియట్టి రాత్రివోలె – ఓ. చ. ట. స. 2. గామ్యకవని – ఈ. ఐ. శ. 3. దొడరె – అ. ప. ఓ. చ. ల.

196. 1. వగచుచునట్లేవురు రథంబులు – అ; యె నట్లేవురు రథంబులు – కొన్ని ప్రతులు. 2. ధాత్రియనునది – ల. కొన్ని ప్రతులు; ధాత్రిక – కొన్ని ప్రతులు. 3. యతిశయకరు – ఓ; యతికారుణ్యంబుగా – అ. 4. డిగ్గి – ఓ. ఘ. ఝ. దిగనురికి–ద. 5. యేల నేలం బొరలుచు–పెక్కు ప్రతులు; యేమి నేలం బడి పొరలి–ల; యేలనేలం బొరలి యేడ్చెదవు – అ. జ. 6. నేడ్చుచున్నదానవు – క. ఘ. వీ. శ. ష. 7. కపమానంబు – అ. జ; కపరాధంబు – ఈ. ఐ. త. 8. యడిగిన నది – ఐ. త. ల. 9. బి (బె) ట్టేడ్చిన – ఔ. గ. చ. ద.

197. 1. పాండవోత్తములకు ప్రాణంబు – చ; పాండుసూనుల బహిః – ఈ. ఊ. త; పాండుపుత్రుల బహిష్ప్రాణంబు – సూ. 2. పోవ నెంతటి – ఇ. ప. ల; పోవ నంతటి – ఊ. ద. 3. గుండియగల్గె మోహాంధ–గ. ఘ. 4. వెస నెగసి–పెక్కు ప్రతులు. 5. బోనిచ్చెదరె పోరఁ బొరివుచ్చెదరుగాక దుస్సహతేజు లాదురితచరితు– వీ. శ. ష. శ; బోనిచ్చెదరె వారు బొరి గొంద్రుగాక–గ; బోనిచ్చెదరె పొరి – స. కొన్ని ప్రతులు. 6. యుద్ధతవృత్తు బార్థు లుత్తమచరితులు – ఇ. ఎ. 7. గతి – కొన్ని ప్రతులు.

ఆ. వీరవరుల ఘోరవివిధాస్త్ర [8]కౌశలం, బెఱుఁగఁ డయ్యెఁ గాక యేమి[9]వాఁడు
వగవ కుండు మబల [10]వైరి నుగ్రత దున్మి, మగువఁ దెత్తు రిపుడ మనుజ
[11]విభులు.

198. వ. అనిన నయ్యంగన యపాంగతరంగితంబు లగు [1]బాష్పజలంబు లల్లన కర
పల్లవప్రమార్జనంబు[2]ల నపనయించుచు నతనిం గనుంగొని యి ట్లనియె.

199. ఆ. ఇంద్రకల్పు లైన యేవురు నృపతుల, [1]నాత్మఁ గొనక యుఱక యంబుజాక్షి
నపహరించినపుడ యద్దురాత్మునకును, జేటు మూఁడె [2]వేఱ చెప్ప నేల.

200. ఉ. ఇంతకు [1]మున్న వాఁడు సనియెం గడు దవ్వుగఁ [2]బోవ కుండ న
త్యంతరయంబునం బటురథావలి యొప్పఁగఁ [3]నేఁగుఁ డుగ్రు లై
సంతనకట్టుఁ డస్త్రములు [4]శస్త్రములుం దొడగుండు వర్మముల్
సంతతదివ్యబాణముల శాత్రవుఁ దున్మఁడు [5]డెందు నెచ్చెలిన్.

201. సీ. [1]బూదిలోఁ దొరఁగిన పూర్ణాహుతియుఁబోలెఁ గుక్కతో ల్తిత్తిలోఁ [2]గూరినట్టి
రా జితకపిలగోరసధారయునుబోలె [3]మసనంబులోఁ బడ్డ మహితపుష్ప

---

8. నైపుణం – ల. 9. యివుడు – ఈ. ఐ. త. 10. వైరుల నిర్జించి – ఈ. ఐ.
త; వైరుల వెస ద్రుంచి – ఆ. ఏ; వానినుద్ధతిఁ (తుఁ) దున్మి – వీ. శ. వ.
11. వరులు – ఈ. ఐ. ఘ. చ. త.

198. బాష్పంబుల నల్లన – ఓ. 2. న – కొన్ని ప్రతులు.

199. 1. నాత్మలోననుఱక – స. శ. కొన్ని ప్రతులు; నాత్మవోలెఁ దలఁప కంబుజాక్షి –
స. శ; యాత్మవోలె నురక–శ. వ; నాత్మలోన దల్ప కంబుజాక్షి – ద; నాత్మలోన
నెఱుఁగ కంబుజాక్షి – ఔ. వీ. 2. వేయుజెప్ప – ఔ. చ. ద; నదియు – ఘ.

200. 1. మున్ను – కొన్ని ప్రతులు. 2. బోకయుండ – కొన్ని ప్రతులు; బోవకుండ –
ఆ. వ. ల. 3. నెక్కు డుగ్రులై – ఐ. త. 4. సయ్యన వేతొడుగుండు – ద;
సాహసవృత్తి దొడంగుడు – గ. 5. వులన్ దునుముండు ప్రేల్మిడిన్ – ఔ; వులం
దునుమాడుడీ వెసన్ – ట.

201. 1. బూర్దెలోబోసిన – కొన్ని ప్రతులు; బూడిదెలో బోయు – జ; బూర్దెలోకెట్టిన –
ఈ. ఐ. త; బూదిలోఁబెట్టిన – వీ. శ. వ; బూదిలోఁబూసిన – ల. న. 2. గూర్చి
నట్టి – వ. శ. 3. మలినంబులో – ఆ. ఇ. ఏ. వ.

మాలికయునుబోలె మదిరాక్షి దుర్జనుకతమున దూషిత గాక [4]మున్న
[5]చనరయ్యా వేగంబ చనునె సన్మంత్ర[6]విశ్రుతపురోడాశంబు శునకమునకుఁ

తే. జనునె [7]కమలసుగంధికాసారకేళి, కలుష[8]శవఖాది యైన సృగాలమునకుఁ
జనునె తన్వంగి సౌందర్యచతురభావ, [9]భంగి యాదుష్టచరితునిపాలు వడఁగ.

*-: పాండవులేవురు సైంధవుపై యుద్ధమునకుఁ బోవుట :-*

సం. 3 - 253 - 21

202. వ. అని పలుకుచున్న [1]ధాత్రేయిక పలుకులు విని దాని నాశ్వాసించి యక్కురు[2]వీరు లేవురు [3]నాతఃణంబ సన్నద్ధులై [4]క్రోధావేశంబునం జేసి మహోరగంబులుం బోలె రోఁజుచు జయద్రథు [5]వెన్నడి దాడి వెట్టి[6]కూడముట్టి తత్తైన్యంబు పిఱుంద నాక్రోశ[7]వచనవిహ్వాలుం డై పోవుచున్న ధౌమ్యుం గని నమస్కరించి మీ రింక [8]విగతఖేదుల రై యొయ్యన [9]రం డని యామిషంబునకుం గవియు డేగలుఁబోలె సైం[10]ధవసేనపయిం గవిసి సింహానాదంబులు సేసి రప్పుడు పాండుపుత్త్రుల రథంబు[11]లు నడియాలంబు[12]లు చూచి సైంధవుండు ద్రౌపదికి ట్లనియె.

203. క. ఈవచ్చురథంబుల వా,రేవురు నీ మగలె యంబుజేక్షణ [1]వీరిన్
భావించి [2]యెవ్వఁ డెవ్వం, డేవిధమునవాఁడు [3]సెప్పుమ
యెఱుఁగఁగ వలయున్.

---

4. యుండ - ఇ. ఏ. 5. చనుడయ్యా - ఊ. 6. మిశ్రిత - ఆ. ఈ. ఐ. త. యతి?. 7. పుష్పసుగంధి - ఔ; సౌగంధిక కమల సారకేళి - ఓ; కమలసుగంధ - కొన్ని ప్రతులు. 8. పలలాశి - క. జ; జలపాని ? - ఇ. ఏ. 9. భంగి దుష్టచరిత్రుని - కొన్ని ప్రతులు; మునకు దుష్టచరిత్రుడిమ్ములనలంప - గ. ల.

202. 1. ధాత్రిక - పెక్కు ప్రతులు; ధాత్రి - ఓ. ఝ. ల. 2. వృషభు - ఔ. ద. 3. తత్క్షణంబ - ల. పెక్కు ప్రతులు. 4. రోషావేశంబున - ల. పెక్కు ప్రతులు. 5. వెన్నాడి - ల. కొన్ని ప్రతులు. 6. కూడముట్టి - కొన్ని ప్రతులందులేదు. 7. వివశ (త) విహ్వాలుండగుచు జనుచున్న - కొన్ని ప్రతులు. 8. వీతఖేదులరై - అ. వీ. శ.ష. 9. రండనుచు నామిషం - అ. ఒ. క. 10. ధవు - కొన్ని ప్రతులు. 11. లునడియాలంబులు - ల. పెక్కు ప్రతులు; లడియాలంబులు - వా. 12. లగని - ఘ. చ. ఝ.

203. 1. వారిన్ - అ. ఆ. ఒ. ట. 2. వీరితెరగులు ? యీవిధమని వేరువేర యెరుగగ జెపుమా - ఔ. సంధి. 3. చెప్పుమెరుగగ వలయున్ - ఇ. ఏ. చ. ల.

204. వ. [1]అనిన నప్పాంచాలి యనాదరక్రోధఘూర్ణిత యగుచు [2]నతని కిట్లనియె.

205. ఆ. ఇంక వీరి నెఱిఁగి తేనియు నెఱుఁగక, యుండుతేనిఁ జేయ నొండు గలదె
దుర్మదమునఁ గరము దుశ్చరిత్రమునకుఁ, జొచ్చి [1]నీకుఁ జేటుఁ దెచ్చికొంటి.

206. వ. అయినను నన్నడిగితివి గావునం జెప్పెద నింతియకాని [1]నీవలన నాకు [2]భయ మించుకంతయుఁ [3]గలుగదు [4]సోదరసహితుం డైన ధర్మ[5]నందనుం గంటి [6]నింకఁ గుశలంబ యని పలికి యిట్లనియె.

207. మ. తన్ను వృ[1]త్తాంగుఁడు శుద్ధకాంచనసముద్యద్వర్ణుఁ డ[2]భ్యుల్లస
ద్వనజాతాయతచారులోచనుఁడు [3]దివ్యద్యూభరి తేజో[4]ఘనుం
డనఘుం [5]డల్ల రథంబుపై వెలుఁగు పుణ్యాత్ముండు ధర్మాత్మజుం
డనిరోధ [6]ప్రతిభాప్రభావనిధి [7]యత్యాశ్చర్య [8]శౌర్యుం డనిన్.

---

204. 1. ఈ వచనమునకు ముందు ఔ ప్రతిలోని క్రింది కందపద్యము కలదు.

కం. కనికొనవలయున్ నాకన, విని ద్రౌపది క్రోధమాన విలసితయై యూ
డిః యట్టి యనాదరమున, ననియెన్ యాతనికి నిష్ఠురాలాపములన్;

అనినం బాంచాలి - ల. కొన్ని ప్రతులు; అనిన బాంచాలి - పెక్కు ప్రతులు.

2. వానికిట్లనియె - ల. కొన్ని ప్రతులు.

205. 1. నీకుచేటు దెచ్చుకొంటి - ల. స. శ. పెక్కు ప్రతులు; నీవుచావుఁ దెచ్చుకొంటి- వా.

206. 1. నీవలనిభయము - ఆ. ఝ. ల. 2. భయంబొక్కింతయు - కొన్ని ప్రతులు; భయంబొక్కించుకయును - ఈ. ఐ. చ. ఝ. త. ల; భయంబించుకయు - కొన్ని ప్రతులు. 3. లేదు - కొన్ని ప్రతులు. 4. సహోదర - ల. కొన్ని ప్రతులు 5. తనూజుం - ఉ; తనయుంగంటి - కొన్ని ప్రతులు. 6. నింకనాకు - ఔ.

207. 1. రుద్రాంగు - ట. 2. డత్యుల్లస - పీ. స. శ. కొన్ని ప్రతులు; దుత్ఫుల్ల సద్వన - ఘ. శ. ష. స. ల; దుద్యల్లస - ఇ. ఏ. 3. మూర్త్యద్యూభరి - అ; దివ్య స్ఫూర్తి - కొన్ని ప్రతులు; సుద్యద్యూభరి - ఔ; విద్యద్యూభరి - ఝ. 4. ధనుం - ట. ఔ. క. జ. 5. డుల్ల - శ. శ. 6. ప్రతిభా ప్రబోధ - వా; ప్రతిభా ప్రభావనిధి - ల. పెక్కు ప్రతులు; ప్రతిభావబోధనిధి - ఇ. ఏ. ఓ; ప్రతిభావ భావ నిధి - ఉ. 7. యత్యాశ్చర్యుడేమేదినిన్ - ట. 8. ధుర్యుండనిన్ - కొన్ని ప్రతులు; ధౌర్యుండిలన్ - ల.

208\. చ. కురుకులశేఖరుం [1]డతఁడు ఘోరరణంబు[2]ల నెట్టిశత్రు[3]లున్
శరణని సొచ్చి రేని విలసత్కరుణా[4]మతిఁ గాచు [5]నీవు చె
చ్చెరఁ [6]జెడిపోక నా[7]పనుపు సేసి వినీతి యెలర్ప [8]నమ్మహా
పురుషుని నాశ్రయింపుము విభుండును నీదగు తప్పు లోఁగొనున్.

209\. చ. ఘన[1]జవసత్త్వచారుతురగంబులఁ [2]బూనిన [3]యల్లవిస్ఫుర
త్కనకరథంబు[4]పై నుదితకాయుఁడు సాలమహీరుహంబు చా
డ్పునఁ [5]దనరారుచున్ [6]వెలయు భ్రూకుటియున్ దశనోష్ఠపీడనం
[7]బును నయి యున్నవాఁ డనిలపుత్త్రుఁడు [8]భీముఁడు భీముఁ డా[9]జులన్

210\. ఉ. ఈతని పౌరుషం బరయ నెందు నమానుషకృత్య మప్రతీ
ఘాత మనేక మద్భుతము [1]గర్వితులౌ ధరణీశ్వరుల్ నిజం
బీతని నాజిలోఁ [2]జెనయ నెవ్వరు నోడుదు రిమ్మహాభుజుం
డాతత[3]రోషుఁ డైనఁ బ్రళ[4]యానలు నట్టిఁడ యాఱఁ డేమిటన్.

---

డితఁడు - ల. పెక్కు ప్రతులు; డతుల - ఈ. ఐ. త. 2. న నెట్టి - అ. ఉ. ఘ. ఝ; న నేచి - ఆ; నంట్టె - ఊ. 3. లన్ - కొన్ని ప్రతులు. 4. రతి- ఆ. ఈ. ఉ. ఎ. ఐ. త; గతి - ఇ. ఏ. 5. చుండు - ఇ. ఏ. 6. గొనిపోక - ఆ; గడుబుద్ధి - ట. 7. పలుకు - ఘ. ల. 8. నిమ్మహా - కొన్ని ప్రతులు.

1\. తర - వీ. ష; భుజ - ఒ. ఘ. శ. 2. బూన్చిన - ల. కొన్ని ప్రతులు. 3. యుల్ల - శ; యట్టి - చ. 4. పైనుదిత - స. శ. పెక్కు ప్రతులు; పైరుచిర - ఉ; నందుదిత - గ; పైనతుల - వా; పైనతుల కాంతి విశాలమహీధరం - ఊ; పై నతులకాయుడు సానుమహీధరంబు - ద. 5. నల - ఆ. ఈ. ఝ; ఘనమూర్తియై చలిత - చ. 6. బొలయు - అ; బెరయు - స. శ. 7. బును దగనున్న - ఊ. జ. ల; బునునగు - ఔ; బుననగు - ఒ. 8. శూరుడు - ఘ. 9. డాజిలోన్ - ల. కొన్ని ప్రతులు.

210\. 1. గర్వితులై - ల. పెక్కు ప్రతులు. 2. జెనక - చ; జెనయ నెంతయు - ఔ. 3. కోపు - ఓ. 4. యానిల మట్టిద - అ; యానలుడట్టిడ - కొన్ని ప్రతులు; యాంతకునట్టిడ - క; యానలు చాడ్పున - ఘ; యానలుడట్టిదయాళు - ఆ.

211. ఉ. ధర్మజు కూర్మితమ్ముఁడును దత్ప్రియశిష్యుఁడు నైనవాఁడు స
త్కర్ముఁడు వాఁడె చూడుము ప్రగాఢ [1]వికీర్ణజితేంద్రియుండు దు
ష్కర్ములఁ గన్న సైఁపఁడు [2]నికామభయంకరవిక్రమక్రియా
నిర్మథితారి ఫల్గునుఁడు నిర్మలతేజుఁ డజేయుఁ [3]డేరికిన్.

212. క. [1]అవశగతిఁ గామరోషాది వికారము [2]లొందినను [3]మదిని ధర్మపథ
ప్రవిహతి గానీఁ[4]డతఁడా,దివిజేంద్రతనూజుఁ[5]డద్వితీయుఁడు పేర్మిన్.

213. చ. అయనయసంగ్రహుండు విన[1]యవ్యవసాయి భయార్తలోకసం
శ్రయుఁడు గృతాస్త్రుఁ డాహవవిశారదశౌర్యుఁడు [2]శిష్టబాంధవ
ప్రియుఁ డసమానసుందరగభీరశుభాకృతి [3]యల్లపుణ్యుఁ డా
రయ నకులుండు [4]పాండుసుతరత్నము భాసురకీర్తి [5]యిమ్మహి[6]న్.

214. ఉ. [1]వీరుఁడు చిత్ర[2]యోధి దృఢ[3]వేధి గృతాస్త్రుఁడు భూరిబుద్ధి[4]వి
స్ఫారుఁడు వాగ్విశారదుఁడు పార్థుల కూరిమి తమ్ముఁ డుజ్జ్వలా
కారుఁడు [5]ధర్మదక్షుఁ డవికారుఁడు ప్రౌఢపతంగ[6]తేజుఁ డ
ద్ధీరుఁడు పాండవుండు సహదేవుఁడు దేవనిభుండు [7]పెంపునన్.

---

211. 1. వితీర్ణ – ఉ. ఘ; వితీర్ణి – జ. స. శ. 2. వికార – ఘ. చ. 3. డేరికిన్ – స. శ. పెక్కు ప్రతులు; డాజులన్ – అ. ఈ. ఉ. ఎ. ఐ. త; డాజిలోన్ – వా.

212. 1. అవశమతి – ట; వివశతగామక్రోధాది – ఔ. 2. వొంది – కొన్ని ప్రతులు; 3. దుదిన్ – చ; మదిన్ – అ. ట. క. చ. ల. 4. డిత – ల. కొన్ని ప్రతులు. డెపుడా – ఘ. 5. డును దృతీయుడు నెమ్మిన్ – గ; డద్వితీయుడు జగతిన్ – చ.

213. 1. యధ్యవసాయి – వా; యాధ్యవసాయి – స. శ; యవ్యవసాయ, యవ్యవ సాయి – కొన్ని ప్రతులు; యవ్యవసాయుడునార్త – ఈ. ఐ. త; యవ్యవసాయ జయార్ధ – ట; యవ్యవసాయదయార్త – జ 2. సిద్ధబాంధవ – ఊ. 3. యుల్ల – శ. 4. మాద్రిసుత – ఔ. 5. యున్మహిన్ – ఈ. ఐ త. 6. ఈ పద్యము తరువాత ల. స. ప్రతులలో యీ క్రింది పద్యము కలదు.

కం. ఈతని కీఁత డెసాటి, మహీతలభూభృత్సమాజబృందములోనన్
శీతనగసేతుమధ్యో, ర్వీతలవిఖ్యాతయశుఁడు వీరుఁడు తలఁపన్.

214. 1. ధీరుడు చిత్రయోధి దృఢదీప్తకృతాస్త్రుడు – స. 2. వాజి – క. జ; యోధ– ఇ. ఒ. త. 3. వేది – పెక్కు ప్రతులు. 4. విస్తారుడు – కొన్ని ప్రతులు. 5. దారశౌర్య – ఓ. ఝ. ల. స. 6. తేజుడా – ఔ. చ. ఝ. ల; తేజుడీ – ఈ. త; తేజుడున్ – గ. ఘ. 7. మించునన్ – ట.

218. వ. ఇట్లు [1]త్రిగర్త[2]శిబిసింధు[3]సైన్యంబులతో ననేక [4]నరపతిపరివృతుం డై నిలిచిన [5]జయద్రథుం జూచి భీమసేనుండు [6]క్రోధారుణలోచనుం[7]డై రథంబు డిగ్గి [8]హేమ[9]బంధబంధురంబును నయోమయంబును నగు [10]గదాదండంబు ద్రిప్పుచు వానిపయిం గవిసిన [11]నడ్డపడి కోటికాస్యుండు నిజ[12]సైన్య సంఘంబుతో [13]నమ్మహావీరుం బొదువుటయు నతండు.

219. క. మదగజముల రథయోధులఁ, బదాతులను[1] దురగములను [2]బలువిడిఁ గలయం జదుపుచు దుర్వారగతిఁ, విదితబలుఁడు [3]ఘనగదాప్రవీణత [4]మెఱసెన్.

220. వ. ఇట్లు [1]విహరించి యహితసైన్యంబు [2]నిహతం బగుటయుఁ జెలంగి సింహనాదంబు సేసి యతండు [3]సారథి [4]సముపనీతం బైన రథంబు [5]సాదరంబుగా నెక్కి గృహీతశరాసనుం డై [6]విక్రమించె మఱియును.

221. క. [1]అలిగి యుధిష్ఠిరుఁడును న, గ్గలికం బ్రతి[2]వీరు లడరఁ గార్ముకవిద్యా విలసనము మిగుల [3]సౌవీ, రుల నూర్వుర [4]రథికవరుల రూపడఁగించెన్.

---

218. 1. త్రికర్త - పెక్కు ప్రతులు. 2. శిబి - ఓ. ఔ. పీ. శ. ప. ప్రతులలో లేదు. 3. సింధుసౌవీర - వా; సౌవీర - పెక్కు ప్రతులలో లేదు. 4. రథికవర - పెక్కు ప్రతులు. 5. సైంధవుం - ఝ. 6. క్రోధదారుణారుణ - ఐ. త; క్రోధారుణిత - ఆ. ఓ. ఔ. చ. ఝ. ల. 7. డగుచురథంబు - ఉ. ఐ. త. 8. హైమ - చ; భీమసత్త్వ - అ. 9. బిందు - కొన్ని ప్రతులు; పట్ట - ఔ; బిందుబంధ - ఘ. 10. కఠోరగదాదండంబు-ల. 11. గని కోటికా - కొన్ని ప్రతులు; నతనికడ్డపడి కోటికా - ఇ. ఏ. 12. సైన్యంబుతో - కొన్ని ప్రతులు. 13. నవ్వీరుం - అ. ఈ. ఎ. ఐ. ఝ. త.

219. 1. దురంగములను - ల. పెక్కు ప్రతులు; దురంగమముల బలువిడి - ఔ. 2. లరువడి - చ; బలువడి - శ. 3. పటుగదా - ఓ. చ. ప; తనగదా - ఉ. 4. చూపెన్ - ఓ. ఝ. ట. స.

220. 1. విహరించుచు నహిత - ఓ. ఝ. ల. 2. వినాశం - ఇ; విఫలం - ఒ; విహతం-క. 3. సారథి - కొన్ని ప్రతులలో లేదు. 4. సముపాసితంబైన - క. జ; సమీపగతుండైన రథం - ఈ; సహితనియతంబైన - ఔ; సమీపానీతంబైన - ఓ. 5. సాధనంబుగా - ట. 6. విహరించె - అ.

221. 1. అలసి - ఇ. ఏ. 2. వీరవరుల గార్ముక-అ. ఆ; వీరు లడల - ఔ; వీరులందు - జ. 3. నవ్వీరుల - స. పెక్కు ప్రతులు. 4. నధికబలుల - స. పెక్కు ప్రతులు.

222. క. నకులుఁడు నిశాతసాయక, నికరంబుల [1]సమరధారుణీతల మెల్లం
బ్రకట[2]పరవీర[3]వరమ,స్తక [4]బంధురముగ నొనర్చె దారుణభంగిన్.

223. క. నారాచపాతముల దు, ర్వా[1]రుఁడు సహదేవుఁ డాహవముఖంబు [2]న
శ్వారోహకులం గూల్చుచు, వీరవిహారంబు సలిపె వేడ్క [3]యెలర్పన్ [4].

224. ఆ. సింధురాజసైన్యసింధు[1]పూరమునందు, మహితఫల్గునాఖ్య[2]మంథనగము
దిరిగి కలఁపఁ దొడఁగెఁ బరనృపాలక [3]మహా, జలచరవ్రజంబు సంచలింప.

225. సీ. వారణకోటి [1]దదారోహకులతోన వివశమై యొఱలుచు [2]నవనిఁ ద్రెళ్లె
సూతహయ[3]ధ్వజపాతపూర్వకముగ రథములు దుమురయ్యె రథుల[4]తోన
వెస [5]రావుతులతోన [6]వసమఱి హయములు గెడసి [7]యెల్లెడలను
బుడమిఁ గప్పె
దండడి [8]దెరలుచు సందడి[9]పెల్లుగాఁ [10]గాలుబలంబులు గూలెఁ గలయఁ

ఆ. దుముల మధిక మయ్యె సమరతలంబున, ఘోరరుధిరవారిపూర మెసఁగె
జితవిరోధిబలుఁడు శతమఖ[11]సూనుండు, చాప[12]నైపుణంబు సూపునపుడు.

---

222. 1. జేర్చిధారు - ఈ. ఐ. త; ప్రచురధారు - ఔ. గ; సకల - ఘ. 2. తరవీర - ఈ. ఐ. త; వరవీరనర - ఆ. ఔ. 3. ఘనమస్తక - ఊ. 4. దంతురముగ - ద. ల. వీ. శ. ష. స. క; తుములముగా-పెక్కు ప్రతులు; ములు దుత్తుము రొనర్చె- ఇ. ఔ; ములు శకలము లొనర్చె - గ.

223. 1. రత - అ; రణ - ఆ. ఈ. ఐ. త. 2. సహాస్త్యారోహ - పెక్కు ప్రతులు. 3. దలిర్పన్ - ఔ. 4. ఈ పద్యముతరువాత నీ క్రింది వచనము ల. వీ. శ. ష. ప్రతులలోఁ గలదు. వ॥ మఱియు (నతి) భయంకరాకారంబున.

224. 1. తోయంబుల-ల. 2. మందశాద్రి-ల; మందరంబు-కొన్ని ప్రతులు 3. బల-ఔ.

225. 1. రథారోహ - గ. శ. రెండవ చరణమ నందును రథుల ప్రశంసగలదు. 2. విచ్చి పఱచె - ఎ. ప్రాసయతిభంగము. 3. వ్రాతపాత - ఈ. ఐ; ధ్వజవ్రాత పూర్వ - క. జ. 4. తోడ - పెక్కు ప్రతులు. 5. నురౌతుల - ష; రావుతుల - స. శ. పెక్కు ప్రతులు. 6. వసుమతి-క. గ; వసవరి-ఈ. ఐ. త. 7. యెయ్యెడల - శ. కొన్ని ప్రతులు. 8. దేరులు నందందు పెల్లుగా - ఎ. 9. జెట్టుగా - ల. కొన్ని ప్రతులు. 10 గాల్బలంబులు చాలగూలె - గ. 11. తనయుండు - ఇ. ష. 12. వీరరణము - ఔ. ద.

226. తే. సవ్యకరము[1]నందును నపసవ్యకరము
నందుఁ బర్యాయ సంగత [2]మగుచుఁ జూడఁ
గొఱవి ద్రిప్పిన [3]యొప్పున మెఱసెఁ బార్థు
గాండివము వాలుఁదూపుల [4]గనియనంగ.

227. వ. అట్టియెడం ద్రి[1]గర్తపతి యైన సుధన్వుండు గదాహస్తుండై [2]రథంబు డిగ్గి చని ధర్మతనయు రథ్యంబులఁ గూల[3]నేసిన నతండు నిశితసాయకంబున వానియురంబు వ్రచ్చి విగతజీవుం గావించి సత్వరంబుగా[4]ఁ జని సహదేవు [5]నరదం బెక్కె మఱియును ద్రిగర్తులలోన మహాముఖక్షేమంకరు లనువారు నకులుం బొదివి ఘనశరా[6]సారంబు గురిసి జలధరంబులుంబోలె [7]గర్జిల్లిన నమ్మాద్రీసూనుండు వారి [8]నిద్దఱఁ బెక్కమ్ముల [9]నొప్పించె నంతఁ దదీయాగ్రజుం డగు [10]సురథుండు.

228. చ. కరినికరంబుతోఁ [1]దొడరి గర్వితుఁడై [2]తనవారణేంద్రు న
క్కురు[3]కులవీరుమీఁద [4]నెసఁ గొల్పినఁ దద్రథఘోటకంబులం
బరుషతఁ [5]జంపు నగ్గజము [6]వాయక వాఁ డసిచర్మహస్తుఁడై
ధరణికి [7]దాఁటుచో నది [8]మదంబున వెండియుఁ బైఁ గడంగినన్.

---

226. 1. నమరియపసవ్య – ఇ. ఏ. 2. మయ్యెనమర – ఆ. ఉ. ఎ. 3. యట్లను – ఇ. ఏ; తెరగున – ఔ. జ. ద. ల. 4. గమియెనంగ – ఊ. ల; గమియవంగ – అ. ఔ. ఘ. ఝ. స; గవియనవుడు – గ; గమియెయనగ – కొన్ని ప్రతులు.

227. 1. కర్త – పెక్కు ప్రతులు. 2. యరదంబు – ఆ. ఎ; రథంబు డిగ్గనురికి – చ. 3. వైచిన – ఊ; వ్రేసిన – ఒ. 4. బోయి – కొన్ని ప్రతులు; నరిగి – ల. కొన్ని ప్రతులు. 5. రథంబెక్కె – పెక్కు ప్రతులు. 6. సారంబులు గురిసి – కొన్ని ప్రతులు; సారంబులం బొదివి – చ. 7. గర్జిల్లుచున్న – ల; ఘూర్ణిల్లుచున్న – గ. 8. నందరం – ఆ. ఊ. ఓ. ఝ. 9. నొంచె – ల. పెక్కు ప్రతులు. 10. శూరుండు – ఆ; బృహద్రథుండు – గ.

228. 1. గడగి – పెక్కు ప్రతులు. 2. వెస – క; తనవారణేంద్రమున్ – గ. ల; తన వారణేంద్ర మక్కురు – ఘ. జ. శ. ష. 3. కులవీరు – శ. పెక్కు ప్రతులు; బలవీరు – వా. 4. నెసకొల్పిన – వీ. శ; బురికొల్పిన – ఉ; వెసగొల్పిన – వా; నెసకొల్పిన – శర. 5. జంపె – ల. శ. పెక్కు ప్రతులు. 6. పాండవసింహుడు ఖడ్గహస్తుడై – జ. ష. 7. వేగదాటిన మదం – అ. ఎ. 8. ముదంబున – ఓ. క. ఘ. చ.

229. చ. తొలఁగక యమ్మహా[1]బలుఁడు దోర్బల మొప్పఁ గృపాణపాతభం
గులఁ గరినాథు [2]కేలు నిరుగొమ్ములతోఁ బెరయంగఁ [3]ద్రుంప బె
ట్టిలకు విచేష్టమై [4]నొఱగు [5]నేనుఁగుపై నతి[6]మాత్రభీతివి
హ్వలుఁ డగు శత్రు [7]నుద్ధతిఁ గృతాంతవిధేయునిఁ జేసె వ్రేల్మిడిన్.

230. క. వైరులు [1]దలఁకఁగ [2]నిమ్మై, దారుణపౌరుషవిశేష[3]దక్షుం డై య
వ్వీరుఁడు రయమున నరిగి స, మీరతనయు నరద మెక్కి మెఱసెం బోరన్

231. చ. ఘనుఁడు వృకోదరుండు [1]దనుఁ గట్టలుకం దల[2]పడ్డ కోటికా
[3]స్యునితురగంబులం దునిమి సూతుని[4]కంఠముఁ ద్రుంచివైచి తీ
వ్రనిశిత మైన ప్రాసమున వానియురంబు వగిల్చి [5]చంపినం
[6]గనుకనిఁ బాఱె భీతిఁ బెసఁగంగఁ దదీయచమూసమూహముల్.

*-: అర్జునుఁడు సౌవీరకుమారులం బన్నిద్దఱ జంపుట :-*

సం. 3 _ 255 _ 27

232. వ. [1]అంత నంగారకుండును గుంజరుండును [2]సృంజయుండును [3]సుప్తకుండును [4]శత్రుంజయుండును సుప్ర[5]బుద్ధుండును [6]శుభంకరుండును [7]భ్రమంకరుం

---

229. 1. రథుడు - పెక్కు ప్రతులు. 2. కేల్నిడుదకొమ్ముల - శర. పెక్కు ప్రతులు; కేలునిడుగొమ్ముల - ఓ. ఘ. స. శ. 3. ద్రుంచి - ల పెక్కు ప్రతులు; ద్రుంప బి - ల. కొన్ని ప్రతులు. 4. యొరగు - పెక్కు ప్రతులు. 5. నేనుగుతో - ఎ. జ. ల. 6. భీతితోడ విహ్వలు - అ. ఔ. 7. నంతట - ల; నుద్ధతకృతాంత - పెక్కు ప్రతులు; నుద్ధురకృతాంత - క.

230. 1. దరలక - గ. ద. 2. నిమ్మెయి - ఎ. ఏ. ఓ. జ. ల. 3. దక్షుడునై - ఓ.

231. 1. గని - ఔ; నినుగట్టలుకం - వా; దనుగట్టలుకం - సూ. పెక్కు ప్రతులు. 2. పడ్డగోటికాస్యుని - వా. పీ. ల. పెక్కు ప్రతులు; పడ్డకోటికాస్యుని - శ. ష. సూ. 3. శ్యుని - చ. ల. 4. తోడనె - గ. 5. పేర్చి - ఊ. 6. కనికని - ఓ. చ; గనుకొని - ల. కొన్ని ప్రతులు.

232. 1. అంత - ల. పెక్కు ప్రతులలో లేదు. 2. క్రంజరుండు - ఆ. 3. గుప్తకుండు - ల. కొన్ని ప్రతులు; సప్తకుండు - ఆ. ఏ; ప్రమదుండు - ఔ. 4. హార్దిదోణుండు - ఈ. ఐ. త. 5. బంధుండు - ఆ ఇ. ఏ; బద్ధుండు - ఓ. 6. భయంకరుండు - ఇ. ఏ. 7. భ్రమకరుండును - కొన్ని ప్రతులు; భ్రవరుండు - ల; బలా

డును శూరుండును రథియును [8]గుహాకుండును [9]బలాఢ్యుండును ననుసౌ
వీరకుమారులు [10]పన్నిరువురు నిక్ష్వాకు శిబి సైంధవ త్రిగర్త [11]సైన్యంబులం
[12]గూడి క్రీడి మార్కొని [13]పటుబాణజాలంబులం గప్పిన.

233. మ. అతుల[1]క్రోధవిఘూర్ణమానహృదయుం డై చండగాండీవని
ర్గత [2]భల్లౌఘములం దదస్త్ర [3]వితతుల్ ఖండించి సౌవీరసం
తతిఁ [4]బన్నిద్దఱవిండ్లులం దునిమి దోర్దర్పంబు [5]మీఱంగ [6]స
స్మితుఁ డై [7]యాతఁడు [8]దచ్ఛిరఃప్రకరవిచ్ఛేదంబు సేసెన్ [9]వెసన్.

234. క. ఆకులముగ [1]శైబ్యుల ని, క్ష్వాకుల సైంధవులనుం[2] ద్రిగర్తులనుం బో
నీక పొదివి రయమున న, స్తోకపరాక్రముఁడు [3]దునిమి తూఁటాడె [4]వడిన్.

235. వ. [1]అప్పుడు రణభూమి యంతయు [2]శవమయం బయ్యె నంబరం [3]బంతయుం [4]గబంధమయం బయ్యెఁ [5]జారుకేయూరవీరాంకవిభూషితంబు లైన బాహుచరణ[6]చ్ఛేదంబులును గార్ముకతూణీర[7]కాండఖండంబు[8]లు నతకూబర

---

ఘుండు - అ; దథియును - ఔ; సుభ్రమనుండును - ఘ. 8. గుహాండును - కొన్ని ప్రతులు; గుహానుండు - ఇ. ఉ. ఏ. ఒ. 9. పరాకుండు - కొన్ని ప్రతులు; పతాకుండు - కొన్ని ప్రతులు. 10. పన్నిద్దరు - ల. కొన్ని ప్రతులు. 11. బలంబుల - ఈ. త. 12. గలయంగూడి - ల; గూడుకొని - కొన్ని ప్రతులు. 13. బహుబాణ - పెక్కు ప్రతులు.

233. 1. క్రూర - ఇ. ఏ. 2. బాణౌఘములన్ - ఓ; శాతాస్త్రములన్ - ఔ. 3. తతులన్ - ఈ. ఐ. త. 4. బన్నిద్దరి - కొన్ని ప్రతులు; బన్నిద్దఱవీరులం - ఇ. ఏ. శ. ష; బన్నిద్దరవిండ్లు దున్మిపటు - ఎ. ఓ. ల; బన్నిద్దర విండ్లు దున్మిఘన- ఈ. ఐ. త; బన్నిద్దరివిళ్ళు - అ. జ. ఝ. 5. దీరంగ - వీ. శ. ష. 6. సంస్మితు- పెక్కు ప్రతులు. 7. కృష్ణుడు - అ. వీ. 8. దద్భుజప్రకర - ఇ. ఏ; వారి నందఱ శిరశ్ఛేదంబు - న. 9. వడిన్ - ల. కొన్ని ప్రతులు.

234. 1. శైభ్యుల - కొన్ని ప్రతులు; చైత్యుల - ఊ. 2. మరిత్రిగర్తులనుం - ఉ. ఎ. ల. 3. దున్మితూటాడె - అ. ఒ. ఔ. ఘ. ల. 4. వెసన్ - అ. జ. ల; ననిన్ - ఊ. ఓ. స.

235. 1. ఇట్లు - అ. క. 2. శర - ఇ. ఏ. 3. బెల్లను - ల. కొన్ని ప్రతులు. 4. దమం బయ్యె - ఔ. 5. బాహుకేయూర - ట; జారు కేయూరాదివీరాంక భూషణ భూషి - ఔ; జారుకేయూరహారవీరాంక - ఒ. 6. భేదంబు - జ. ఝ. 7. కాండంబులు - ఇ. ఏ. 8. నష్టకళేబర - అ; ననతకూబర - కొన్ని ప్రతులు.

రథాంగకేతన[9]త్రివేణుకశకలంబులును బుండరీకవ్యజనచామర[10]ఖంగంబులుం [11]గరవాల పరిఘ శక్తి గదా [12]ముసల పట్టిస ప్రాస[13]శకలంబులు నెక్కటఁ జూచిన రాసులై [14]యుండెఁ [15]గీలాలపూరంబును మాంసపంకంబును గేశశైవాలంబును నైన [16]యపూర్వనదీప్రవాహంబునందు బహు[17]విధక్రవ్యాదగణంబు లవ[18]గాహంబు సేయుచుఁ బ్రకట[19]కోలాహలవ్యాకులం [20]బగుచుండె నివ్విధంబున.

236. క. [1]గాండీవపవనప్రేరిత, చండాంబకఘోర[2]శిఖల శతముఖతనయో
ద్దండదహనుఁ డొకమాత్రన, ఖండితసౌవీర[3]సైన్యకాననమే[4]ర్చెన్.

237. వ. అట్టి[1]క్రందున జయద్రథుండు ద్రౌపదిని [2]దిగ విడిచి రథంబు దోలుకొని పఱచె నంత ధర్మ[3]జుండు ధౌమ్యసమన్విత[4]యై యున్న పాంచాలిం[5]గని నిజ[6]రథంబుపై [7]నిడికొనియె సైంధ[8]వుపలాయనం బెఱింగి యర్జునుండు శత్రుసేనా[9]హననసంరంభంబున నున్న [10]భీమసేనున కిట్లనియె.

---

9. నాతపత్రశకలం - కొన్ని ప్రతులు; నాతపత్రరేణు శకలం - అ. ఉ. ఎ. ద. 10. తుండంబులుం (?) - క. జ; ఖండంబులుం - ట. 11. గుఠారపరిఘ - క. 12. ముసలముద్గర - ల. కొన్ని ప్రతులు. 13. శకలంబులు - ల. కొన్ని ప్రతులు; నారాచశకలంబులు - ఎ. ఓ; కేశశకలంబులు - అ. ఝ. 14. పిక్కటిల్లి యుండె - ఆ. ఉ. ఎ. ఝ; యుండ - ఘ. ల. 15. రజఃపూరంబును - అ. 16. యపూర్వ రక్తనదీ - ఒ. 17. విధభూత బేతాళక్రవ్యాద - ల. కొన్ని ప్రతులు; భూతబేతాళాదిక్రవ్యాద - పి. శ. ష. శ. 18. గాహనంబు - ల. పెక్కు ప్రతులు. 19. కోలాహలంబులగుచు - అ; కోలాహల బహులం - క. జ; క్రేంకణ బాహుళ్యంబు ? - ట. 20. బులగుచునుండె - ఉ.

236. 1. గాండీవవనప్రచలిత - ఔ; గాండీవ పవనప్రేరిత - వా. ఈ పాఠమున 'న' గురువుకాలేదు; గాండివ - శ. 2. విశిఖ - ఉ. ఘ. 3. తనయ - స. కొన్ని ప్రతులు. 4. మెరిసెన్ - ఈ. ఐ. త. పాఠము చింత్యము.

237. 1. క్రందున దలరి - పెక్కు ప్రతులు; క్రందునం దల్లడపడి - అ. క. ల. 2. డిగ్గ విడిచి - ఊ. ఔ. గ. 3. నందనుండు - ఇ. ఏ. ఒ. ల. 4. యైన పాంచాలిం - అ. ఈ. ఉ. ఐ. త. 5. జూచి - కొన్ని ప్రతులు. 6. రథంబున - ల. 7. నిడుకొనియె - అ. క. ఘ. ల. 8. వుండు పలాయనుండగుట - శ. ష. 9. హననంబుననున్న - అ. ఘ. 10. భీమునకిట్లనియె - ఆ. ఎ. ఐ. ఝ. త. ల.

238. తే. [1]వీతలజ్జుఁడై పఱచె సౌవీర[2]విభుఁడు
[3]బొనుఁగు ప్రజ నేల యాఱడి దునిమి వైవ
నద్దురాత్ముని వెనుకొని యసువు లిపుడు
గొనఁగ వలయు లేలెమ్ము [4]సద్వినుతశౌర్య.

239. వ. అనిన నతండు గయ్యంబు సాలించి ధర్మతనయుం జూచి.

240. క. జననాథ ద్రుపదసుతఁ దో
డ్కొని [1]ధౌమ్యుఁడు నీవుఁ గవలుఁ [2]గుఱుకొని మగుడం
జనుఁ డాశ్ర[3]మంబునకు నే
మును [4]సైంధవు వెనుకఁ గూడ ముట్టెదము వెసన్.

241. క. అతలంబునఁ [1]గ్రుంగిన న
ద్భుతముగ దివమునకు [2]నెగసి పోయినఁ [3]బగతుఁ
[4]హతుఁ జేయక మగుడము విని
హతుఁడుగఁ జేయుదుము [5]దివిజు లడ్డం బైనన్.

242. తే. అనిన ధర్మజుఁ డిట్లను నద్దురాత్ముఁ
బొలియఁ [1]జేయుట దగదు దుస్సలఁ దలంచి
వాని నొక తప్పునకు సైఁపవలదె యాంబి
కేయమహిపికి [2]ఖేదంబు సేయఁ[3]దగునె.

---

238. 1. విగత – కొన్ని ప్రతులు; విరథుడై పోయె నవ్వీర విభుడువాడె – చ. 2. వరుడు – ఓ. ల. 3. చెనటు ప్రజ – ల; బెనగు – ఒ. క. స; బెనగు – ఘ. పిన్నప్రజనేటి కిప్పుడు బెట్టుదునుము – ఇ. ఏ; పినుగలనేల తునుమంగ భీమసేన – ఔ. 4. సద్వినుత చరిత – ఔ. చ; సద్వినుత కార్య – క; సద్విమల శౌర్య – ఊ.

240. 1. ధౌమ్యులు – పెక్కు ప్రతులు. 2. గూడుక – ల; గూడ్కొని – ఇ; గురుకొనికూడం – శ. 3. మమునకును మేమును – కొన్ని ప్రతులు. 4. నిట సైంధవుని గూడముట్టెదము వెసన్ – అ; మునుసైంధవుగూడ వెనుకముట్టెదము వెసన్ – ఘ. వీ. శ. ప.

241. 1. గ్రుంకిన – శ. కొన్ని ప్రతులు; గ్రుక్కిన – స. 2. వెరిగి – ఔ. 3. శత్రువున్ – కొన్ని ప్రతులు. 4. మృతు జేయక – అ. జ. వీ. వ. 5. బలియు – అ.

242. 1. జేయంగ – అ. చ. జ. 2. వరకువ – శ. పెక్కు ప్రతులు; మరుకువ – మా. కొన్ని ప్రతులు. 3. జనునె – ఊ. వీ. శ. వ. శ; దగనె – ఇ. ఏ.

243\. వ. అనినం బాంచాలి భీమార్జునులతోడ [1]నప్పాపాత్ముని దెసం గృప[2]సేయవలవ దవశ్యంబును వాని వధియించి [3]నాకుం బ్రియంబు గావించునది [4]యిట్టి ద్రోహి యెల్లభంగుల వధ్యుం డ[5]నియెం దదనంతరంబు ధర్మనందనుం[6]డు ధౌమ్య ద్రౌపదీ నకుల సహ[7]దేవసహితుం డై [8]మగిడి యాశ్రమంబునకుం జనియె నిట భీమవిజయులు [9]రథంబులు రయంబునం దోలు[10]కొని చని క్రోశ[11]మాత్రాంతరంబున సైంధవుం గని రప్పుడు కిరీటి దూరాపాత [12]విశిఖంబుల జయద్రథు రథ్యంబులం బడ[13]నేసిన.

244\. క. తల్లడపడి యరదము డిగి, విల్లును [1]నమ్ములును విడిచి వెల్ల నగుచు మే
నెల్లం జెమర్పంగ నూర్పులు, పెల్లుగ నమ్మనుజపశువు పెలుచం [2]బఱచెన్.

245\. ఆ. వానిం జూచి నగుచు వార లోరోరి యిం, కెందుం [1]బోవ వచ్చుం బంద నిలువు
మిట్టి కడిమి నమ్మి యే ప్రల్లదంబులు, సేయం[2]దొడంగి తనుచు
డాయుటయును.

246\. వ. [1]మరలి చూచి [2]వాం డొక్క గుల్మమధ్యంబుం దూఱుటయుం గని [3]భీమ సేనుండు [4]రోషసందష్టాధరుం డగుచు రథంబు డిగ్గ [5]నుఱికి.

---

243\. 1. నద్దురాత్మువలనం - కొన్ని ప్రతులు; నిట్లును నప్పాపాత్మువలన - ఔ. 2. సేయ - అ. జ. ప్రతులలో లేదు. 3. నాకుం బ్రియంబు సేయునది - కొన్ని ప్రతులు; యట్టి - వా. 5. యనియ - అ. ఔ. క. ద. 6. డు వాడు సమర విముఖుండై పారిపోయినవాడగుటం జేసి చంపం దగదు పట్టి తెండని ధౌమ్య - అ. ఈ. ఉ. ఎ. ఐ. త. ల. 7. దేవులం దోడ్కొని-ఇ. ప. 8. నిజాశ్రమంబునకుం - ఈ. ఉ. ఐ. ఎ. త. ల. 9. నిజరథంబులు - అ. క. ల. 10. కొనుచు గ్రోశ - ఆ. ఈ. ఉ. ఊ. ఎ. ఐ. త. 11. మాత్రంబున - క. గ. చ. 12. శిలీముఖంబుల - ఔ; విశిఖంబులు దొడిగి - ఈ. ఉ. 13. వైచిన - ఊ. ఐ.

244\. 1. నంబు - ద. 2. బారెన్ - కొన్ని ప్రతులు.

245\. 1. బారవచ్చు - ఔ. 2. గడగితనుచు - కొన్ని ప్రతులు.

246\. 1. అదరిమరలిచూచి - ల; మగుడిచూచి - కొన్ని ప్రతులు. 2. యందొక్క - కొన్ని ప్రతులు. 3. భీముండు - కొన్ని ప్రతులు. 4. రోషావేశ కంపితాధరుం డగుచు - ఓ. ఝ. చ; రోషదంష్ట్రాధరుండగుచు - కొన్ని ప్రతులు; రోషదష్టాధరుండగుచు-ల; రోషావేశకంపిత దంష్ట్రాధరుండగుచు-అ. 5. నుఱికిచని-క. జ. ల.

247. క. ఒడిసి తల వట్టి నేలం,[1]బడఁ దిగిచిన వాఁడు [2]పెనఁగఁ బడుటయుఁ [3]జిక్క‌ఁగ
మెడఁ ద్రొక్కి గాఢముష్టిం, బొడిచె మొగం[4]బవియ రక్తపూరము దొరుఁగన్.

248. క. ఒడ లెల్లఁ బిండి[1]కూడుగఁ, బొడిచి [2]యెగయ నెత్తి త్రిప్పి భూస్థలి[3]మీదన్
బడ వైచి యురము మొగమును, నడిచెను వడముడి [4]తలప్రహార [5]కుశలుఁడై.

249. వ. ఇట్లు [1]బెట్టుగా నడఁచినఁ బగతుండు వివశుం డగుటయుం జూచి యర్జునుం
డోహో యింత సాలు నింక నొచ్చినం బ్రాణవిముక్తుఁ డగుం గావున నజాత
శత్రువచనంబులు దలంచి [2]వీనిఁ గరుణింపు మనిన నతండు గవ్వడిదెసఁ
గనుంగొని ధర్మ[3]నందనుం డెప్పుడుఁ గరుణయ కాని కార్యంబు [4]చేటుపాటు
[5]విచారింపఁ జొరండు నీవును[6] నతనిభంగిన బేల వై తిద్దురాత్ము నెట్లు
[7]సైఁపవచ్చునని [8]పలికె ననంతరంబ.

*—: భీముఁడు సైంధవుం బట్టికొని పరిభవించుట :—*

సం. 3 _ 256 _ 9

250. ఆ. వాఁడి యైనకత్తి వాతియమ్మునఁ గొని, పగతుశిరము చెక్కి తెగయ గొఱిగి
నరుల కెల్లఁ జూడ నవ్వగునట్లుగాఁ, గలయ నైదు గూఁకటు[1]ల నొనర్చె.

---

247. 1. బడ వేసిన — ఇ. ఎ; నేలబడుటయు — జొ. 2. తూలిపడుటయు — ల. స. కొన్ని ప్రతులు. 3. జక్కన్ — కొన్ని ప్రతులు. 4. బవిసి — ల. శ. కొన్ని ప్రతులు.

248. 1. కూరగ—ఐ. జొ. క. వీ. శ. స. శ. 2. యు నెగనెత్తి — ఘ. శ. 3. మఱి యున్ — శ. పెక్కు ప్రతులు. 4. కరప్రహార — కొన్ని ప్రతులు. 5. ముల గ డున్ — జొ.

249. 1. బెట్టుచఱచిన — స; బెట్టడచిన — అ. ఓ. క. జ. ట. వీ. స. శ; బెట్టువరచిన — కొన్ని ప్రతులు. 2. వీనికిం గరుణ సేయు మనిన — కొన్ని ప్రతులు. 3. జుండె ప్పుడు — అ. ఆ. ఉ. గ; తనయుండెప్పుడు — ఓ. ఘ. 4. చేటూపాటు — ల. 5. దలంప జూరండు — కొన్ని ప్రతులు. 6. నట్లబేలవై తివిద్దురాత్ము — కొన్ని ప్రతులు; నతనియట్లనబేల — ల. 7. సైరింపవచ్చు — కొన్ని ప్రతులు; సహింప — జొ. ద. 8. పలికి యనంతరంబ — జ. ల.

250. 1. లను దీర్చె — జొ.

251. వ. ఇట్లు రాజవేషంబు [1]వికలంబుసేసి యమ్మహాభుజుండు వాని [2]కిట్లను నో
బ్రతుక వలతేని నేఁడు మొదలుగా నెల్లసభలయందును పాండవదాసుం
డని [3]పలుకునది యనిన వాఁడును [4]దండాఘాతభయంబున నట్ల చేయుద
ననియె నంత [5]నయ్యిరువురు నతనిం బెడకేలు గట్టి రథంబుపై నిడికొని
నిజాశ్రమంబునకుం జని ధర్మపుత్త్రునకు నివేదించి వీఁడె పాండవదాసుం డని
నతం డక్కెని [6]వీని విడువుం డనియెఁ బాంచాలియు జయద్రథుం జూచి
నవ్వుచు నిప్పాపాత్ముండు భవదీయదాసుం డయ్యెం గావున వీనిం
బో విడువుం డని విడిపించె నాసైంధవుండును ధర్మ[7]జునకుఁ దత్సభాగ[8]తు
లైన మునులకు మ్రొక్కి[9] నజాతశత్రుం డిట్లనియె.

252. ఆ. ఎట్టి కష్టుఁ డైన నిట్టిపాపము సేయ, నెత్తికొనునె [1]ధరణి నీవు దక్క
నరుగు మింక నేమి యందుము నిన్ను నిం, ద్రియవిలోలు నల్ప ధృతివిహీను.

253. వ. ఇంక [1]నెవ్వారికి నిట్టి కొఱగాములు సేయక బుద్ధిమంతుండ వై యుండు
మనిన నతండు లజ్జావనతవదనుం డగుచు నచ్చోటువాసి గంగాద్వారంబున
కరిగి యందు.

254. శా. [1]ఆదిత్యార్చితపాదపద్ము జగదేకాధీశు [2]నీశుం ద్రిలో
కాదిం గామ[3]విభేదిఁ బర్వతసుతాహ్లాదైకసంపాది ని
[4]ఖేదుం డై శివు నాత్మలో నిలిపి యక్షీణవ్రతా[5]రూఢతం
బాదాంగుష్ఠము [6]నేల మోపి తప మొప్పం జేసె సద్భక్తి[7]మైన్.

---

251. 1. వికలంబు – కొన్ని ప్రతులు; వికృతంబు – క; వికల్పత్వంబు – ల; వికల్పితంబు – వా; వికల్పంబు – చ. 2. కిట్లనియెనోరీ – ఔ. జ. ల. 3. పలుకవలయునని – కొన్ని ప్రతులు. 4. దదాఘాత – కొన్ని ప్రతులు. 5. నయ్యిద్దరువానిం – ల. 6. వీఁడు వధ్యుండుగాఁడు విడువుండనియె – కొన్ని ప్రతులు. 7. రాజునకు – కొన్ని ప్రతులు. 8. సదులైన – కొన్ని ప్రతులు. 9. వానికి నజాత – కొన్ని ప్రతులు.

252. 1. ధరణి – ల. స. శ. పెక్కు ప్రతులు; యోరి – వా.

253. 1. నెచ్చోనైన – ఉ. క; నెచ్చోనిట్టి – కొన్ని ప్రతులు; నౌదానికి – ఊ. శ; నెన్నండు – ఇ. ఏ. ల; నైనను నిట్టికోఁడములు – వీ. శ; నైనను – కొన్ని ప్రతులు.

254. 1. ఈ పద్యమునకు ముందు ఔ. ప్రతిలో నీక్రింది వచనముగలదు. వ. యందు గంగా స్నానంబుచేసి నిజభంగపరిభవశాంతికై సకలతీర్థస్నానదానోత్సుకుండగుచు భూప్రద క్షిణంబుచేసి పరిత్యక్తదోషుండై ధర్మక్షేత్ర భూమియందు సిద్ధసంకల్పుండై సిద్ధ మనోరథంబు చేకూర సిద్ధాశ్రమస్థలంబున సిద్ధగిరీశ్వరు మనంబున ఘనంబుగానిడికొని. 2. నీశాను లో –ల. స. శ. పెక్కు ప్రతులు. 3. విరోధి–ఇ. ఏ. 4. ఖేదుండై –ల.

255. ఉ. వానికి [1]నమ్మహేశ్వరుఁడు వత్సలుఁడై పొడసూపి యీప్సితం
బై నది వేఁడు మన్న నతఁ డానతుఁ డై [2]పరమేశ విక్రమా
హీనులఁ బాండునందనుల నేవుర సైన్యయుతంబుగా ననిం
బూని జయించునట్టి వరముం గృపసేయుము నాకు నావుడున్.[3]

256. క. ఇది[1]వొసఁగదు పాండవులం, గదనమున జయింప [2]నలవి గా దింద్రాది
త్రిదశులకు [3]విన్నవె యైనను, వదలక నీకోర్కి దీర్ప వలయున [4]యెట్లున్.

257. చ. విజయుఁ డొకండు దక్క [1]నతివీరులఁ బార్థుల [2]నున్న నల్వురఁ
నిజ మొకనాఁటి కయ్యమున నీవు జయిం[3]పుము ఫల్గునుండు స
ర్వజగ[4]దజయ్య విక్రముఁడు వాని [5]నెదుర్కొని నాకు నైనఁ బో
ర జితునిఁ [6]జేయు టెంతయు భరం బగు [7]నిక్కము వల్కితిం జుమీ.

258. వ. అస్మత్ప్రసా[1]దవిశేషంబునం జేసి వాని కిట్టి ప్రభావంబు గలిగె నదియునుం
గాక.

259. క. నిఖిలాస్త్రశస్త్ర [1]విద్యా, సఖుఁ డపరాజితయశో[2]విశాలుఁడు [3]విష్ణుం
డఖిలేశ్వరుఁ డతనికిఁ బ్రియ, [4]సఖుఁ డటు యవ్వీరు గెల్వ శక్యమె నీకున్.

---

255. 1. సిద్ధశంకరుడు – టొ. 2. గురులింగ – టొ. 3. ఈ పద్యము తరువాత 'ఉ' ప్రతిలో నీక్రింది వచనముగలదు.
వ॥ అనిన విని రుద్రుం డి ట్లనియె.

256. 1. పోలదు పాండవులను – స. కొన్ని ప్రతులు. 2. నొప్పగా నింద్రాదిత్రిదశులకు నలవియైనను – అ. ఉ. ద. 3. నలవె – కొన్ని ప్రతులు. 4. యేనిన్ – ల. కొన్ని ప్రతులు.

257. 1. నరివీరుల – న. 2. బూనినల్వురన్ – ఈ. త; నల్వురన్దగన్ – ట. 3. చెదు-ఉ. 4. దజేయవిక్రముడు – ల. పెక్కు ప్రతులు; దజేయుదెవ్వరికి – టొ. 5. నెదుర్కొనరాదుగాని – టొ. 6. జేయనెంతయు – అ. ఇ. ఏ. ఐ. త. 7. నిక్కమ – గ. ల.

258. 1. దంబునంజేసి – కొన్ని ప్రతులు.

259. 1. విద్యాలఘు – ఈ. ఐ. 2. విలాసుడు – ఈ. ఐ. త. శ. 3. కృష్ణుం – జ. ల. 2. సఖుడల – ల.

260. వ. [1]అని పలికి యీశ్వరుం డంతర్హితుం డయ్యె సింధుపతియు నిజదేశంబునకుం జనియె ననిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

261. తే. ధర్మపత్నీసమేతులై [1]ద్వైతవనము, నం దపారదుఃఖాతురు లగుచు నున్న రాజముఖ్యులు [2]సత్యైకరతులు పాండుసుతులు మఱి[3]యేమి
సేసిరి సూరివర్య.

262. వ. అనిన నతం డిట్లనియె నట్లు ద్రౌపదీమోక్షణం బొనరించిన పిదపం గామ్యక [1]వననివాసం బై భూసుర[2]నివహంబుతో నున్న ధర్మ[3]జుపాలికి మార్కండేయుండరుగుదెంచిన ననుజనహితంబుగాఁ బ్రత్యుద్గతుండై [4]యమ్మునివరుం బ్రభూత[5]సపర్యల సంతుష్టహృదయుం గావించి యవ్విభుండు పాంచాలియెడ జయద్రథుచేసిన దుర్వ్యవసా[6]యంబు వానిం బరిభవించు[7]టకునై తమపడిన యాయాసంబును నమ్మహా[8]త్మున కెఱింగించి మహనీయ శౌర్యధైర్య[9]ధర్మారంభసమగ్రుల మైన మా కివ్విధంబున [10]నఖిలసామ్రాజ్య భోగవియోగం బై దుస్తరం బగు వనవాసంబు సంప్రాప్తం బయ్యెం గావున విధి[11]కృతం బెవ్వనికి నెబ్భంగుల [12]నలంఘ్యం బని తలంచెద [13]నని పలికి మఱియు నిట్లనియె.

---

260. 1. నీమహాస్థలంబున సిద్ధమనస్కుండవై నన్ను భజించితివి కావున నీదురితంబు లడంచి యింతమాత్రంబు శక్తి నీకుంగలుగ నను గ్రహించితి నీవింక నొండు బలుకక నీపురంబునకుం జను మని పరమేశ్వరుం డానతి యిచ్చి యంతర్హితుం డయ్యె సింధుపతియు-ఔ.

261. 1. తద్వనంబునందపార - ల; ధర్మవనము - పెక్కు ప్రతులు. 2. సత్యైక - న. 3. యెట్టులుండిరి - ఔ; యేమియైరిభూసురవరేణ్య - ట; యేమిచేసిరి సూరివంద్య - ల. స; యేమిచేసిరి సూతవర్య - క. ఘ. చ. వీ. శ. ళ.

262. 1. వన - కొన్ని ప్రతులలోలేదు. 2. సహస్రంబుతో - ల. పెక్కు ప్రతులు. 3. రాజు - ల. పెక్కుప్రతులు. 4. యమ్మునీశ్వరుం - అ. ఔ; యమ్మునిప్రవరుం - ఆ. ఈ. త. 5. సపర్యావిశేషంబుల - ల. కొన్ని ప్రతులు. 6. యంబును - ల. శ. కొన్ని ప్రతులు. 7. పనికై - ల. కొన్ని ప్రతులు; కొఱకై - ఊ. ఒ. గ. 8. ముని - శ. పెక్కు ప్రతులు. 9. ధుర్యగాంభీర్యవార్యదయాసమగ్రార్యమచర్యులమైన - ఔ. 10. నిఖిల - ఊ. ఘ. చ. శ. 11. కృతంబులెబ్భంగుల - ల. పెక్కు ప్రతులు; కృతాభంగసమస్త దుఃఖాలంఘనీయంబులెఖ్భంగి నిస్తరింపగలమో యని - ఔ. 12. నలంఘనీయం బని - ల. 13. దళం బైన చింతనని మరియు నిట్లనియె - ఔ.

263. తే. ద్రుపదనందన [1]క్రియఁ గడు దుఃఖపడిన
నృపవధూటియు నాయట్ల నియతశోక
[2]వనధి నిర్మగ్నుఁ డైన భూవరసుతుండుఁ
[3]గలఁడె వినఁ జూడ ననఘ యెక్కాలమునను.

264. వ. [1]అనిన నతనికి న త్తపోనిధి యి ట్లనియె.

265. క. కడు దుఃఖము నొందితి నని, యుడుగక [1]యిటు వగచె దేల యుర్వీశ్వర వీ
[2]పడు చేటిది రఘురాముఁడు, [3]గడఁగి యిడుమ వడఁడె తొల్లి
కానడవులలోన్.

266. ఉ. ఆవిభుకాంత గాదె జనకాత్మజ రావణుచే గృహీతయై
పోవదె వానర[1]ప్రకరముల్ వెసఁ దోడుగ నేఁగి యాధరి
త్రీ [2]విభుఁ డబ్ధి గట్టఁడె వధింపఁడె దివ్యశరంబులన్ దశ
గ్రీవునిఁ గ్రమ్మఱం జని యకిల్బిషరాజ్యవిభూతి నొందఁడే.

*—: ధర్మజునకు మార్కండేయుఁడు రామాయణకథ సెప్పుట :—*

సం. 3 — 258 — 4

267. వ. అనిన విని ధర్మ[1]జుండు మునీంద్రా [2]రాముం డెవ్వని వంశంబునవాఁడు
రావణుం డెవ్వని తనయుం డేమి నిమిత్తంబున సీతాపహారణంబు సేసె

---

263. 1. గతి — ఉ. త; క్రియమున్ను — వి; గతి మున్నుదుఃఖ — స. 2. వార్ధి — ఔ. ద.
3. గలదె వినజూడ వేకాలమునను నైన — చ.

264. 1. అనిన న త్తపోనిధి — కొన్ని ప్రతులు; అనిన త్తపోధనస త్తముం డిట్లనియె — ల;
అనిన నతనికి న త్తపోధ నుండిట్లనియె — కొన్ని ప్రతులు.

265. 1. వగవంగనేల — ఘ. శ. ష; యిటువగచెదీవు — ఉ. 2. పడుటెంతది — స. శ.
కొన్ని ప్రతులు; పడుచేయది — స. శ. 3. కడు నిడుమల బడదె తొల్లి — కొన్ని
ప్రతులు.

266. 1. ప్రముఖముల్ — చ. ట. ? 2. వరు — అ. ఒ. ఔ. ట. ద.

267. 1. తనయుండు — గ. ఘ. ల. 2. రాఘువుండన నెవ్వనివంశంబువాడు — కొన్ని

రామరావణులకు [3]సంగ్రామం బెట్లు వర్తిల్లెం జెప్పవే యని [4]రామాయణ కథాశ్రవణ [5]కుతూహలి యై యడిగిన [6]నమ్మహాముని యిట్లనియె.

268. క. విను మిక్ష్వాకుకులంబున, జనియించె నజుండు నాఁ బ్రశస్తచరితుఁ డా
తనికొడుకు దశరథుఁడు ముద, మున నాతఁడు పెండ్లియయ్యె
మువ్వురు సతులన్.

269. వ. అందుఁ గౌసల్యకు రాముండును [1]కైకేయికి భరతుండును సుమిత్రకు లక్ష్మణశత్రుఘ్నులును [2]జనియించి రందు రామునకు విదేహరాజనందన యైన సీత ప్రియాంగన యయ్యె నిఁక రావణు [3]జన్మంబు సెప్పెద వినుము.

270. ఆ. అఖిలలోకకర్తయగు విరించికిఁ బులస్త్యుండు [1]నాఁగ మానసుఁడు దనూజుఁ డుద్భవించె నతని కుదయించె వైశ్రవణాభిధానుఁ డైన యాత్మజుండు.

271. వ. ఆవైశ్రవణుండు దన తండ్రి యగు పులస్త్యుని విడిచి తాతయగు [1]చతుర్ముఖునకుం దపంబుసేసి నలకూబరుం డను కొడుకును లోకపాలకత్వంబును ధనేశ్వరత్వంబును లంక యను పురంబును శంకరు[2]తోడిసఖ్యంబును [3]వరంబులుగాఁ బడసి మహావిభూతితో వర్తిల్లుచున్నం గని యలిగి పులస్త్యుండు నిజశరీరంబునం దర్ధంబున విశ్రవసుం డను [4]వాని సృజియించి యావైశ్రవణున కహితంబు సేయు మని పనిచిన [5]నెటింగి కిన్నరేశ్వరుండు విశ్రవసుపాలికరుదెంచి మహాత్మా [7]యేను నీకుం బుత్త్రుండ నయ్యెద నాకుం గరుణింపు మని

---

ప్రతులు; రాఘవుండన నే వంశంబువాడు–ల. 3. సంగరం బెట్లు (ప్ర) వర్తిల్లె–ల. పెక్కు ప్రతులు. 4. రామకథాశ్రవణ – కొన్ని ప్రతులు 5. కుతూహలుండై – ల. 6. నమ్మహీపతికి నమ్మహాముని – శ. కొన్ని ప్రతులు; నమ్మహీపతికి నమ్మహాత్ముండైన మార్కండేయుండిట్లనియె – ఇ. ఏ. ర. ల.

269. 1. కైకకు – ల. పెక్కు ప్రతులు. 2. జనియించిరి రామునకు – ల. పెక్కు ప్రతులు. 3. జన్మంబు వినుము – కొన్ని ప్రతులు.

270. 1. నామనస్యుతుండుదనుజు – ల.

271. 1. చతుర్ముఖుంగూర్చి – ల. కొన్ని ప్రతులు; చతుర్ముఖునింగురించి – ఊ. శ. 2. తోటి – ఓ. ఔ. గ. ఘ. చ. శ. 3. వరంబుగా – ల. 4.ముని – ల. పెక్కు ప్రతులు. 5. విని – కొన్ని ప్రతులు. 6. కరుగుదెంచి – ఔ. గ. చ. ద. ల; కినరుగుదెంచి – కొన్ని ప్రతులు. 7. యేను – కొన్ని ప్రతులలోలేదు.

యతనిం [8]ప్రసన్నునిం జేసి [9]నృత్తగీతవిద్యావిశారద లయిన రాక్షసస్త్రీలం [10]బుష్పోత్కటయు మాలినియు [11]పాకయు ననువారి మువ్వుర నవ్వి [12]ప్రవరునకుఁ బరిచారికలం[13]గా నిచ్చిన.

272. క. పురుడున నయ్యువతులు [1]నోం, డొరులం గడవంగ విలసదుప[2]చారసమా
[3]చరణప్రవీణభంగులఁ, బరి[4]తోషితుఁ జేసి రాతపస్విపరేణ్యున్.

273. వ. ఇట్లు ప్రీతుం డై [1]యతండు వారలకుఁ బుత్త్రదానంబు సేసిన నందుఁ బుష్పోత్కటకు రావణకుంభకర్ణులును [2]మాలినికి విభీషణుండును [3]పాకకు [4]ఖరుండును [5]శూర్పణఖ యను[6]కన్యకయు [7]మిథునం బై ప్రభవించి రక్కుమారు[8]లకు నలువురకుఁ దజ్జనకుండు జాతకర్మాది[9]సంస్కారంబు లొనరించి సగౌరవంబుగాఁ బెనిచి యుపనీతులం [10]జేసె నందు.

274. ఉ. ఆతతతేజుఁ డున్నతభుజాగ్రుఁడు లోకభయంకరుండు వి
ఖ్యాతపరాక్రముండు దశకంఠుఁడు సంతతరోషమానసుం
డాతని యట్ల దుర్మదమయాత్ముఁడు క్రూరుఁడు గుంభకర్ణుఁడుం
భీతివిదూరుఁ డార్యుఁడు విభీషణుఁ డుత్తమచిత్తుఁ డారయన్.

---

8. ప్రసన్నుం జేసి – కొన్ని ప్రతులు. 9. నృత్యగీత వాద్యవిశారదల – కొన్ని ప్రతులు; నృత్యగీత విద్యా – ల. 10. బుష్పోత్కట పాకమాలినులను వారి – ఈ. త. 11. బకయని యొక యచ్చుప్రతి 'పాక' యనుటయే సమంజసము – స; బక యునను – ఓ. గ. చ. శ. 12. శ్రవసునకు – ఉ. 13. గావించిన – కొన్ని ప్రతులు.

272. 1. నొండొరువుల గడువంగ – శ. 2. చారములం – కొన్ని ప్రతులు. 3. పరిణయ భంగుల నెంతయు – ఉ. శ. 4. తుష్టిం జేసి – ఓ.

273. 1. యమ్మునివారికిం బుత్త్ర – ఓ. ల; యమ్మునివారలకు – ఇ. ఏ. గ. 2. మాలిక– ఊ. ఏ. ల; సుమాలినికి – జ. 3. బకకు – గ. చ. శ; 'బక' అనుపేరునకుబదులు చిత్రశాలాప్రతియందు 'రాక' అని కలదు. వనపర్వ. పుట. 425. 4. ఖర దూషణ – ఈ. ఐ. త. 5. త్రిశిరులును శూర్పనఖయుం బ్రభవించి రక్కుమారు లేవురకుం ? – ఈ. ఐ. త. 6. కన్యకయు బ్రభవించి – ల. కొన్ని ప్రతులు. 7. మిథునంబై – వీ. శ. ష మున్నగు ప్రతులలో లేదు. అయినను మూలమునందు మిథునము అని కలదు 'బకాయాం మిథునం జజ్ఞే ఖరః శూర్పణఖా తదా' పి. పి. ఎస్. ప్రతి. పుట. 1327. 8. లునలువురకు జనకుండు – ఈ. ఉ. ఐ. జ. త. ల. ష. 9. సంస్కారణంబు – ఘ. 10. జేసిననందు – ఈ. ఎ. త;– జేసియందు – ఊ. శ; జేసిననతండు – ద.

275. క. ఖరుఁడు ఖరతేజుఁ డవనీ, సుర [1]పరిభవకారి మాంస[2]శోణితభుజుఁ డు
ద్ధుర[3]చిత్తుఁడు శూర్పణఖయు, [4]దురితచరిత ధర్మకర్మ[5]దూషిత యెపుడున్.

276. వ. ఆరాక్షసకుమారులు దండ్రివలన నఖిలవేదవేదాంగధనుర్వేదపారగులై గంధమాదన [1]గిరియందు సుఖంబుండి యొక్క[2]నాఁ డతనికి మ్రొక్కవచ్చువాని నధిక[3]విభవసమన్వితు వైశ్రవణుం జూచి తత్ప్రభావంబు దపోలబ్ధం బగుట [4]విని [5]జాతమత్సరు లయి [6]తారును బితామహు నుద్దేశించి తపంబు సేయం దొడంగిరి [7]తత్ప్రకారంబు వినుము.

277. తే. [1]మండువేసవిఁ బంచాగ్ని మధ్యమున ఘ
నాగమంబున బయల నత్యంత [2]తుహిన
సమయమున [3]నీరియందు నిశ్చలత నిలిచి
దశముఖుఁడు వాయు[4]భక్షుఁడై తపమొనర్చె.

278. మ. నియతాహారుఁడు నిర్జితేంద్రియుఁడునై నిష్కంపవృత్తిన్ మహీ
శయనుం డై వ్రత[1]ముల్ చరించె నధికేచ్ఛం గుంభకర్ణుండు ధై
ర్యయుతుం డై ఘనుఁ డవ్విభీషణుఁడు పర్ణాహార[2]వృత్తిన్ జపా
ధ్యయనాసక్తిఁ దపంబు సేసె [3]మది నత్యంతంబు [4]సంశుద్ధితోన్.

---

275. 1. నికరశరీర – అ. ఉ. ఎ. గ. స. 2. శోభితకరుడు – ఙ. 3. చరితుడు – ట. ఘ. 4. దురితాన్వయచరిత ధర్మదూషిత – ఔ. ద. 5. దూషిణి – అ. ట. ల; దూషణి – అ. ఓ. ల; దూషణి – ఉ. గ. ఘ. చ. పీ. స.

276. 1. పర్వతంబునందు – అ. జ. 2. నాడు తండ్రికి మ్రొక్క – ఔ. 3. వైభవ – కొన్ని ప్రతులు. 4. యెరింగి – ఇ. ఏ. ల. 5. జ్ఞాతిమత్సరులై – చ. 6. వారును – ఏ. త; తామును – ట. 7. తత్ప్రకారంబు సెప్పెద వినుము – ల; తత్ప్రభావంబు – శ.

277. 1. మండ్రు ?–కొన్ని ప్రతులు. 2. శీత – అ. క. జ. ట. ల. 3. నీటియందు – కొన్ని ప్రతులు; నీరిలోన – ఉ. ల; నదియందు – అ. 4. భోజియై – ఇ. ఏ; భక్షుడై తపముచేసె – క. ఘ.

278. 1. మాచరించె–ఉ. 2. యుక్తిన్ – క. ఘ. ట. ల. పీ. శ. శ. 3. మహి – ఒ. ఔ. 4. సంశుద్ధుడై – ల. కొన్ని ప్రతులు; సంసిద్ధుడై – ఈ. ఐ. త. శ; సంసిద్ధితోన్ – గ. ఘ.

279. వ. ఖరుండును శూర్పణఖయు వారికిం దగిన పరిచర్యలు సేయుచుండి రంత సహస్రవర్షంబులు [1]నిండినం బంక్తివదనుండు దనమస్తకం బొక్కటి ఖండించి మండెడు [2]నగ్నియందు వేల్చి మఱియు [3]వేయేండ్ల కొక్కటిగాఁ [4]దలలు దొమ్మిదియుం దఱిగి వేల్చి ధైర్యంబు [5]దఱుఁగక పదియగు తలయును [6]ద్రెంప సమకట్టినఁ బితామహుండు ప్రత్యక్షం బై వారించి వానిశిరంబు లెప్పటియట్ల కలుగ నొసంగి యమరత్వం[7]బు దక్క నొండు నీ కభిమతం బగునది యెయ్యది యైనను [8]నడుగు [9]మనుటయు నన్నిశాచరుండు.

280. శా. దేవా [1]యేను సమస్తదేవపితృదైతే[2]యాహిగంధర్వర క్షోవిద్యాధర[3]యక్షజాతులకు నక్షోభ్యుం[4]డగాఁ బ్రీతితో
నీవిశ్వంబునఁ గామరూపగతి నాత్మేచ్ఛావిహారుం[5]డఁగా
నీవే నావుడు వాని కవ్వర [6]మజుం డిచ్చెం గృపా[7]లోలతన్.

-: బ్రహ్మ రావణకుంభకర్ణవిభీషణులకు వరంబు లిచ్చుట :-

సం. 3 – 259 – 26

281. వ. [1]మనుష్యజాతి యొక్కండు దక్క నీచెప్పిన యందఱవలనను నీకు [2]మరణ భయంబు [3]లేదని పలికి పరమేష్ఠి గుంభకర్ణుం జూచి [4]వరం బడుగు మనిన

---

279. 1. నిండుటయు – ఉ; నిండునంత – త; నిండినంత – ఎ. ఐ. 2. నగ్నిలో – ల. 3. వెయ్యేండ్ల – కొన్ని ప్రతులు; వెయ్యేండ్లకు నొక్క – ల. కొన్ని ప్రతులు; వెయ్యేళ్ళకు – ఆ. జ. 4. క్రమంబునదలలు – పెక్కు ప్రతులు. 5. దరలక – కొన్ని ప్రతులు; వదలక – ఈ. ఐ. ఘ. 6. దరగసమకట్టిన – ఈ. ఐ. త. ల; ద్రుంప సమకట్టిన – ఘ. వీ. శ. ష; ద్రెంపగడగిన – కొన్ని ప్రతులు. 7. బొక్కఁడు దక్క నీకభిమతంబెయ్యది యడుగుమనుటయు – ల; బొక్కటిదక్క తక్కినయభిమతంబులెయ్యవి యడుగు – ఈ. ఐ. గ. త; బు దక్కదక్కిన యభీప్సితంబు లెయ్యవి యడుగు–ఆ. ఈ. ఉ. జ. త. 8. వేడు – ఈ. ఉ. ఎ. ఐ. క. త. 9. మనిన నన్నిశాచరుండు – కొన్ని ప్రతులు.

280. 1. నేను – కొన్ని ప్రతులు. 2. యాది – ఓ. క. ద. 3. సిద్ధ – చ. 4. డుగా– కొన్ని ప్రతులు. 5. డుగా – ఔ. 6. మతండిచ్చెం – గ. 7. లోలుడై – ల. స. శ. పెక్కు ప్రతులు.

281. 1. మనుష్యజాతుం డొక్కరుండు – ఆ. ఘ. చ. స. శ; మనుష్యజాతి యొక్కటి దక్క దక్కిన వాటియందు నీచెప్పిన – అ. 2. మరణంబు – పెక్కు ప్రతులు. 3. లేకుండునవి – ఓ; లేదుసుమ్మని – అ; లేదుపొమ్మని – జ. 4. వరంబువేడు

[5]వాఁడు దైవోపహతుం డై తనకు [6]నాత్యంతికం బైన నిద్ర యడిగిన నట్లు యగునని విభీషణున కభి[7]ముఖుం డగుటయు నతండు కృతాంజలి యై జలజాసనుఁ బ్రస్తుతించి.

282. క. పరమాపద యైనపుడును, దురితంబులు [1]నామనంబు దొడరమియును భా
సుర మగు బ్రహ్మాస్త్రంబును, గరుణింపవె యనిన [2]నిచ్చి కమలజుఁ[3]డనియెన్.

283. క. [1]నిరతము రాక్షస [2]భవమును, బొరసియు నీ విట్లు ధర్మబుద్ధి వగుట య
చ్చెరు[3]విది గావున [4]నీకును, దిరముగ [5]నమరత్వ మిచ్చితిం గృప వత్సా.

284. వ. అని పలికి పితామహుం డంతర్హితుం డయ్యెఁ దదనంతరంబ.

285. మ. వర[1]గర్వోన్నతుఁడై దశాననుఁడు దుర్వారోద్ధతిన్ దాడిమై
నరిగెం గిన్నరనాథుపై నతఁడు కార్యం బాత్మ నూహించి సం
గరసన్నద్ధుఁడు గాక కింపురుషయక్షశ్రేణితోఁ [2]గూడఁ దా
నరిగెన్ లంకఁ బరిత్యజించి రభసోద్యత్పుష్పకారూఢుఁడై.

286. వ. ఇట్లతండు గంధ[1]మాదనంబునకుం జను నెడ [2]వెన్నడిం దగిలి [3]దానవుండు వానిమానంబు[4]తోన విమానంబు నపహ[5]రించినం గనలి యక్షేశ్వరుండు గురుండ[6]నగు నన్ను నవమానించితివి గావున నివ్విమానంబు నీ[7]పగతు పాలయ్యెడు మని [8]శపించె నంత.

---

మనిన - పెక్కు ప్రతులు. 5. వాడు దేవోప - కొన్ని ప్రతులు; వాడునద్దేవోప- ఆ. 6. నత్యంతిక యైన - ల; నత్రాంతంబైన - అ; నాత్యంతిక యైన - ఇ. ఏ; నాత్యంతికంబగు - ఆ. ఈ. ఉ. ఐ. త. 7. ముఖుం డైన - కొన్ని ప్రతులు; ముఖుండై వరంబు నడుగుమనుటయు నతండు - ఊ.

282. 1. నామనమున - ఘ. చ. 2. నవ్వి - ఈ. ఐ. 3. డెలమిన్ - ఒ. చ. ట.

283. 1. నిరుపమ - అ. 2. భావముబొరసియు - కొన్ని ప్రతులు; భయమున - చ; భవమున్బొరసియు - ఔ. 3. వటు - అ. ల. 4. నీకున్ - ఔ. ల; నీకుం దిరముగ - కొన్ని ప్రతులు. 5 నవవర్గ - ఐ. త.

285. 1. దర్పోద్ధతిమై - ఎ. స; దర్పోన్నతుడై - ఊ. 2. గూడగా-పెక్కు ప్రతులు.

286. 1. మాదనపర్వతంబునకుం - ద. 2. వెంబడిదగిలి - ఒ; వెన్నాడి - ఘ. చ. ల. 3. రావణుండు - ఎ. ఓ. 4. నవ్విమానంబు - కొన్ని ప్రతులు. 5. రించిన నలిగి - ల. పెక్కు ప్రతులు. 6. నైన - పెక్కు ప్రతులు; నైన నన్నవమానిం - కొన్ని ప్రతులు. 7. పగతురపాలయ్యెడమని - కొన్ని ప్రతులు. 8. శాపంబిచ్చె - కొన్ని ప్రతులు; శపియించె - కొన్ని ప్రతులు.

287\. క. రాక్షసలక్ష్మీమహిమకు, రక్షకు[1]డుగఁ బంక్తిముఖుని రాక్షసమాయా
దక్షు నభిషిక్తుఁ జేసిరి, రాక్షసబేతాళ[2]వరులు రాగం బెసఁగన్.

288\. వ. వాఁడును బల[1]దర్పమోహితుం డై కడంగి యింద్రాదిదేవతల [2]నోడిచి [3]తత్పదంబు లాక్రమించి యీసు మిగిలి జగద్ద్రావణంబు సేయుటం జేసి రావణుం డను పేరం బ్రఖ్యాతి వహించి సకలభూతభయంకరుం డయ్యె నట్టి యెడ దేవర్షులును రాజర్షులునుం గూడి చని తత్ప్రకారం బగ్నిదేవునకుం జెప్పిన నతండు వారిం దోడ్కొని వారిజాసనుపాలికిం [4]జని యి ట్లనియె.

289\. ఉ. భూరిభుజుండు విశ్రవసుపుత్త్రుఁడు పంక్తిముఖుండు దర్పదు
ర్వారుఁడు రాక్షసేంద్రుఁడు భవద్వర[1]శక్తి నవధ్యుఁడై మహా
ఘోరముగాఁ ద్రిలోకములకుం [2]గడుఁ బీడ యొనర్పఁ జొచ్చె వృ
త్రారిపురోగమత్రిదశు లందఱుఁ గింకరు లైరి వానికిన్.

290\. ఉ. దానవుచేతఁ [1]గష్టపడి దైన్యము నొందుట కోర్వలేక నీ
దైన పదాంబుజంబు లభయం[2]బని చేరితి మింక మమ్ము నె
ట్లైనఁ గృపార్ద్రమానసుఁడవై తగఁ [3]జేకొన వయ్య మాకు ది
క్కై కనను కాకయున్నఁ గమలాసన నీవ కదయ్య యెయ్యెడన్.

---

287\. 1. డగు పంక్తికంఠు రావణు మాయా – అ; డగు పంక్తిముఖు దురాసదు మాయా– కొన్ని ప్రతులు. 2. పతులు – ఔ. గ. చ. అ. స.

288\. 1. దర్పాధికుండై – కొన్ని ప్రతులు. 2. నోడించి – ఒ. 3. తత్తత్పదంబు – కొన్ని ప్రతులు; తత్పురంబు–ఘ. పి. ళ. ష. 4. బోయి–ఇ. ఏ. గ; జని తాను వారును వవ్వారిజాపసున కిట్లనిరి – ఔ.

289\. 1. దత్తి – అ. ఎ. ఏ. ఐ. ఒ. త. పి. ళ; దత్త – ఆ. ఈ. ఉ. ఔ. ఘ. ద; దత్తన వంద్యుడై – ఉ. 2. గడుభీతి – అ.

290\. 1. గొట్టువడి – ఈ. త; గట్టువడి – ఊ. 2. బుగ నమ్మిన మమ్మునింక నె – అ; బనిచేరితిమిప్డు – ల. కొన్ని ప్రతులు; బనిచేరగ వచ్చినార మె – ఙ; బనిచేరితిమిట్లు– ఈ. ఐ. త. 3. జేకొనుమయ్య – ఏ. ష.

291\. వ. అనినం బరమేష్ఠి వారల[1]కిట్లను నిక్కార్యంబునకు నేను మున్న తగిన యుపాయంబు నిశ్చయించి [2]నారాయణుం బ్రార్థించితి నద్దేవుండు మనుష్య [3]భావంబున నవతరించి యారాక్షసు వధియించువాఁ డయ్యె నింద్రాది [4]సురులునుం [5]దమ తమ యంశంబులం[6]జేసి ఋక్షవానర[7]జాతులయందు జనియింపగలవారు మీకు భయంబు [8]వల వదని యగ్ని ప్రముఖు లైన యమ్మహా మునుల సమ్ముఖంబున దుందుభి యను గంధర్వకామినిం బిలిచి నీవు [9]కుబ్జ రూపంబున మంథర యను పేర [10]భూలోకంబున [11]నుద్భవించి నీ నేర్చు విధంబున దేవకార్యంబు[12]లు [13]నిర్వహింపు మని[14]పనిచి [15]వారి వీడ్కొలిపెఁ [16]బదంపడి దివిజుల యంశావతారంబులం జేసి.

292\. మ. గురుశై లోన్నతగాత్రు[1]లుద్ధత[2]భుజోగ్రుల్ వజ్రపాషాణ[3]క
ర్కరు లర్కప్రతిమానతేజులు గుణాకల్పుల్ మహాకల్పభీ
కరకాలాంతకకల్పు లాజినిపుణుల్ గర్వోన్నతుల్ ఋక్షవా
నరవీరుల్ జనియించి రెల్లయెడలన్ [4]నాగాయుతత్రాణు లై.

293\. క. అన విని యుధిష్ఠిరుం డ, మ్మునివరుతో ననఘ ధర్మమూర్తి[1]ని నారా
ముని నేల [2]యరణ్యంబున, కనిచెను దశరథుఁడు [3]సెపుమ యక్కథ యెల్లన్.

---

291\. 1. కిట్లనియె నిక్కార్యంబు – త. 2. నారాయణుం డైన యాదిమూర్తిం (బ్రస్తుతించి) బ్రార్థించితినద్దేవుండును మనుష్య – అ. ఈ. ఉ. ఎ. ఐ. త. ల. 3. రూపంబున – ఆ. ఒ. ట. 4. సురలును – కొన్ని ప్రతులు. 5. సంతసిల్లి తమతమ – ఆ. ఉ. ఎ. గ. 6. జేసి రాక్షసవధకు ఋక్ష – గ. 7. జాతులందు – ఏ. ల. 8. వలవదని పలికి – ల. పెక్కు ప్రతులు; వలదని – అ. ట. వా. వీ. శ. ష. 9. కుబ్జారూపంబున – ల. 10. జనియించి నీనేర్చు – క. 11. జనియించి – అ. జ. 12. లు – పెక్కు ప్రతులలో లేదు. 13. నిర్వర్తింపుమని – ల. కొన్ని ప్రతులు. 14. పలికి – ఓ. 15. వారల వీడుకొలిపె – అ. క; దాని వీడుకొలిపి – చ. 16. దదనంతరంబ – ఘ.

292\. 1. లుద్ధుర – ఎ. ఐ. 2. భుజాగ్రుల్ – ల. పెక్కు ప్రతులు. 3. దుష్కరు – ల. 4. నానాయుధ త్రాణులై – ఇ. ఏ; నాగాయుత త్రాణులై – పెక్కు ప్రతులు; నాగాయుత ప్రాణులై – వా. వీ.

293\. 1. యైన (యయిన) రాముని – ల. పెక్కు ప్రతులు. 2. యరణ్యమునకు ననిచెను – అ. ఎ. ద; వనమునకు ననిచెను దశరథుడదియు నాకు జెప్పుము వేడ్కన్ – చ. 3. చెప్పుమక్కథ యెల్లన్ – ల.

294. వ. అని యడుగుటయు మార్కండేయుం డి ట్లనియె దశరథుఁడు నిజసుకృత పాకంబునం జేసి రామ[1]ప్రముఖు లయిన కొడుకుల నలువురం గని త్రైలోక్య రాజ్యంబు సంప్రాప్తం బయిన యట్లు సంతసిల్లె నక్కుమారులు క్రమంబున నుపనీతులు నఖిలవేదవేదాంగ[2]వినీతులు యథాక్రమ[3]పరిణీతులు నై విలసిల్లి రంత.

295. సీ. అభినవపద్మ[1]దళాక్షు నక్షీణవిస్తృతవక్షు నాజానుదీర్ఘబాహు
మధురస్మితానను [2]మదగజగమను నారూఢయౌవను [3]నభిరూపతేజు
శ్రీరమణీయుఁ బ్రసిద్ధయశో[4]రమ్యు నిఖిలవిద్యాగమనిపుణచిత్తు
నింద్రసమాను జితేంద్రియు [5]ధర్మజ్ఞుఁ బౌరబాంధవజనప్రార్థనీయు
ఆ. దుష్టనిగ్రహైకధుర్యు విశిష్ట[6]సం, రక్షణాభిలోలు రామ[7]భద్రుఁ
గులపవిత్రుఁ బెద్దకొడుకుఁ గనుంగొని, రాజవరుఁడు [8]గరము రాగ మెసఁగ.

296. వ. యౌవరాజ్యపదంబున[1]కు నతని [2]నభిషేకం బాచరింపం గోరి యాప్తమంత్రి జనసమ్మతంబునఁ బురోహితనిరూపితం బైన శుభ[3]దినంబున నక్కార్యంబునకు సమకట్టు నెడ [4]భరతు దాది మంథర యనునది [5]యమందగతిం గైకేయి పాలికిం జని యి ట్లనియె.

297. ఉ. అక్కట నీదెసం బతికి నాఁడి కూరిమి యయ్యె [1]మాయపుం
జొక్కులు నీవు నిక్కముగఁ జూచి మనంబున మోసపోయి [2]తా

---

294. 1. ప్రముఖులైన నలువురు గొడుకులం గని-ఈ. ఉ. ఎ. ఐ. త; ప్రభృతులగు - ఘ; ప్రభృతుల నలువురు కొడుకులం గని - ఆ. 2. విదులు - ల. కొన్ని ప్రతులు; పారీణులును - ద. 3. పరిణయులునై - ఆ. ఉ. ఎ. గ.

295. 1. దళాయతేక్షణుని విస్తృత - చ. 2. మన్మథాకారు నారూఢ-ట. 3. నవరూప - జ. 4. ధుర్యు - ఆ. ఈ. ఉ. ఎ. త; గమ్యు - గ. 5. ధర్మాత్ము - క; సర్వజ్ఞు-చ. 6. సంరక్షణైకలోలు - జ; సంరక్షణాభిరాము-ల. కొన్ని ప్రతులు. 7. చంద్రు-ల. కొన్ని ప్రతులు. 8. తద్ద - అ. క. జ; పేర్మి - గ.

296. 1. కు - ల. పెక్కు ప్రతులలో లేదు. 2. నభిషేకింపంగోరి - ఘ. చ; నభిషేకంబు సేయంగోరి - అ. క; నభిషేకం బొనరింపం - ఇ. ఏ. 3. దివసంబున నక్కార్యంబు - ల. 4. భరతుదాసి - ఎ; కైకేయిదాని - ల. 5. మందగమనంబునం - అ. క. చ.

297. 1. వాయవుం - అ; ప్రాయవుం - ఈ. ఉ. ఊ. ఐ. త. 2. తా - ఇ.

[3]టక్కరి కోసలాత్మజయెడం బ్రియుఁడై [4]యదె తత్తనూజు నిం
పెక్కఁగ యౌవరాజ్యమున [5]నిప్పుడు పట్టము గట్టఁ [6]బూనెడున్.

298. ఆ. పుడమిఱేని మదికి నెడ యైతి నీవింక, నేమి[1]సెప్పఁగలదు వామనయన
కడఁగి[2]నిన్నుఁ గొడుకుఁ బెడవడ వైచి యా, సవతికొడుక
యేలు నవని యింక.

299. క. అనిన నుదరిపడి కేకయ, తనూజ గడు[1]సంభ్రమమునఁ దత్క్షణమ నరేం
ద్రునిపాలి[2]కిఁ జని యేకత, మున నిట్లనుఁ బ్రణయపూర్వకముగ నాతనితోన్.

300. క. ధరణీశ తొల్లి నాకుం, గరుణించిన వర[1]మొకండు గల దది మదిలోఁ
బరికించి యిప్పు డొసఁగుము, [2]చిరముగ సత్యవ్రతంబు [3]సెల్లింపు తగన్.

301. వ. [1]అనిన నతం[2]డయ్యతివం గనుంగొని [3]యవధ్యుల వధియించుటయును వధ్యులం[4]గాచుటయును బ్రాహ్మణ[5]ధనంబులు దక్క నన్యుల ధనం బపహరించుటయును [6]నభీష్టధనంబు నిచ్చుటయును మొదలుగా నతిదుష్కరంబు [7]లైన వాని నైనను భవత్ప్రియార్థంబు సేసెద [8]నెయ్యది సెప్పు మనిన [9]ప్రీతయై భరతమాత యిట్లనియె.

---

3. తక్కరి కోసలాత్మజకు దానుప్రియుం డయి-ఔ. 4. యిదె-ల. 5. కిప్పుడు-ఏ. 6. జూచెడున్ - అ. ట.

298. 1. చెప్పుదాన - ల; సెప్పుదాననింతమీద - అ. ప్రాసయతిభంగము. 2. కొడుకు నిన్ను బెడవాడద్రోచి - చ; నిన్నుగొడుకుబెడవాడద్రోచి - కొన్ని ప్రతులు; కొడుకునిన్నుబెడవాడవైచి - ల.

299. 1. మచ్చరమున - ఉ. 2. కేగి - గ.

300. 1. మొకింత - ఘ. 2. స్థిరముగ - ఒ. వీ. ౯; తిరముగ - గ. ద. 3. చెల్లింప దగున్ - అ. ఆ. ఇ. ఏ. క. జ; చెల్లించుతగన్ - ల; చేనొప్పు తగన్ - చ.

301. 1. అనిననయ్యింతిం - ల. 2. దయ్యంగనం - అ. క. జ; డయ్యువతిం - ఊ. ఎ; డయ్యింతిం - ఓ. గ. 3. వధ్యుల గాచుటయు నవధ్యులం-అ. క. జ. 4. వధియించుటయు - ఆ. క. జ. 5. ధనంబు లపహరించుట మొదలుగా - కొన్ని ప్రతులు; ధనంబు లపహరించుటయు-కొన్ని ప్రతులు. 6. దక్క నన్యుల ధనంబు లపహరించుటయు మొదలుగా - అ. క. జ; భవదభీష్టంబు లిచ్చుటయు - ఔ. 7. లైనవియెవ్వి యైనను - ఔ. 8. నదియెయ్యది చెప్పు మనిన-కొన్ని ప్రతులు. 9. బ్రీతచిత్తయై - ల. కొన్ని ప్రతులు; ప్రీతయై - కొన్ని ప్రతులలో లేదు.

302. తే. యూవ[1]రాజ్యపదంబునయందు భరతు, నధిప యభిషేక మొనరెంపు మడవిలోవ [2]నొలసి పదునాల్గువర్షంబు లుండ నాన, తిమ్ము [3]రాముని నురువర మ్మిదియ నాకు.

303. క. అనవుడు వీనులు గోఱవిం, గొని [1]చూఁడిన యట్టు లై నఁ గువలయపతి పె ల్చన పిడు గడఁచినక్రియఁ జే, తనరహితుం డగుచు ధరణితలమునఁ బడియెన్.

304. వ. [1]అంతయు నెఱింగి రాఘవుండు నిజజనకుండు సత్యప్రతిజ్ఞుండు గావుత మని యాతఁణంబ సీతాసమేతుం డై వనంబున[2]కు వెడలె నతని పిఱుందన లక్ష్మణుండునుం జనియెఁ దదనంతరంబ.

–: దశరథుఁడు రామవిశ్లేషముచే సురలోకగతుం డగుట :–

సం. 3 – 61 – 292

305. క. రాముఁడు [1]సనుట విని మహో, ద్దామం బగు శోకవహ్ని దరి[2]కొనఁగను హా రామ గుణధామ [3]యని యని, [4]భూమీశ్వరుఁ డసువియోగముం బ్రాపించెన్.

306. వ. ఇట్లు దశరథుండు సురలోకగతుం[1]డగుటయుఁ గై కేయి [2]దన కొడుకు రావించి భూవల్లభుండు దేవభావంబు నొందె రాముండును [3]వనంబున కరిగె

---

302. 1. రాజ్యంబు సత్ప్రథమందుభరతు – ? ఔ; రాజ్యపదంబున నమర భరతు – ల. 2. నోలి పదునాల్గు–పెక్కు ప్రతులు. 3. రామునకిదియవరమ్మునాకు – ఐ. త. వి. శ. ష; రాముని నిడియవరమ్మునాకు – ల. స. కొన్ని ప్రతులు; రాముని నిరువ ర మ్మిదయ నాకు – శ.

303. 1. చూడినట్లైనంగువలయ – ఊ. ట; చూడినభంగియైనం గువలయ – ఈ. ఉ. ఎ. ఐ. త. స; చూడినయట్లయైనకువలయ – అ. ద.

304. 1. అంతయు వినిరాముండు...ప్రతిజ్ఞుండు గావున నాతఁణంబ – ల; అంతయు(ను) వినిరాముండు – అ. ఈ. ఎ. ఐ. త; అంతయు రామచంద్రులువిని – ఉ. 2. కరిగె– అ. ఈ. ఎ. ఐ. త.

305. 1. చనుటయునుమహో – కొన్ని ప్రతులు. 2. కొనగా – పెక్కు ప్రతులు. 3. యనియా – శ. కొన్ని ప్రతులు; యనుచును – గ. 4. భూమీశుడు తమ వియోగమును బ్రాపించెన్ – ల. కొన్ని ప్రతులు.

306. 1. డైన గై కేయి – పెక్కు ప్రతులు; డయ్యె నంతగై కేయి–చ. 2. దన – ల. కొన్ని ప్రతులలోలేదు. 3. వనవాసంబున కరిగె – ఇ. ఏ. ల.

నింక [4]నర్హుండవు నీవ కావున నఖిలమహీ[5]రాజ్యరక్షణంబు సేయు మనిన నక్కుమారుండు క్రోధశోకదందహ్యమాన[6]మానసుం డగుచుఁ దల్లి కి ట్లనియె.

307. సీ. దురితంబు [1]లెన్నండుఁ [2]బొరయక వెలుఁగొందు కమలాప్తకులమునఁ గసటు గలిపి
పరమ[3]ధర్మాత్మకుఁ బురుహూతసన్నిభుఁ బతి మ్రింగికొని కృపఁ బాసి[4]వైచి
యాయతబాహుఁ దేజోయుక్తు మాయన్న బటుధైర్యు నడవులపాలు [5]వటిచి
[6]జీవితహంత్రి వై త్రోవంగరాని [7]దుష్కీర్తి నా[8]యెడలఁ గీలుకొల్పి
ఆ. శ్రీకి[9]నెడలి సకలలోకంబు [10]చేతను, దిట్టు[11]గుడిచి కోర్కి దీర్చుకొంటి
పాపజాతురాల యీపాతకం[12]బేమి, సేయ దింక నేమి సేయువాఁడ.

308. వ. అని దుఃఖించి భరతుండు దండ్రికి నుచితక్రియ[1]లు నిర్వర్తించి యనంతరంబ [2]సమస్తమంత్రి సామంత భూసుర[3]పౌర జానపద[4]సహితుం డై కదలి ముప్వురు దల్లులను వసిష్ఠవామదేవులనుం బురస్కరించుకొని తానును శత్రుఘ్నుండును [5]రామా[6]నునయార్థంబు చిత్ర[7]కూటశైలంబున కరిగి యందు.

---

4. రాజ్యభారార్హుండవు - ఔ. 5. రాజ్యపాలనంబు - ఔ; రాజ్యంబు రక్షణంబు - ద. ల. 6. హృదయుండగుచు - కొన్ని ప్రతులు.

307. 1. నెన్నడు - ల. 2. దొడరక - అ. క. జ. ప్రాసయతి నియమ భంగము; దొరయక - ఇ. ఏ. ష. 3. ధర్మాత్ముని - కొన్ని ప్రతులు. 4. విడిచి - ఈ. ఐ. త. 5. చేసి - ఔ. ల. 6. జీవితహంత్రివై - ఈ. ఐ. త. శ; జీవితైకార్థివై - ల. శ; జీవితహంతవై - వా. కొన్ని ప్రతులు. 7. దుర్వృత్తి - ఘ. 8. యెడలను - ఉ. జ. ద. 9. నుడిపి - స. కొన్ని ప్రతులు; నెడపి - శ; గాక - ఔ; గాను - ఇ. ద. 10. లందును - ఘ. శ. ష. స. శ; నందును - ఊ. ఔ. ద. 11. కోర్చి - అ. 12. బేమిసేయునింక - ఇ. ఏ; బేమి చేసితి పుదు నేమి చేయువాడ - ల.

308. 1. లొనరించి - చ. 2. సప్తమంత్రి - అ. ఉ. 3. పౌరజనసహితుండై - కొన్ని ప్రతులు. 4. సమేతుండై - ఇ. ఏ; సమన్వితుండై - ద. 5. రాముడున్నచిత్రకూటంబున కరిగి-ఇ. ఏ. 6. ను నయార్థంబు-ల; న్వేషణార్థంబు-ఘ. 7. కూటంబున కరిగి - ల. కొన్ని ప్రతులు.

309. మ. కనియెం గోమలనీలమేఘసుభగాకారుఁ జటావల్కలా
జినధారుఁ [1]సితభూతిభూషితుని రాజీవాక్షుఁ గల్యాణకీ
ర్తనుఁ [2]గాకుత్స్థకులప్రదీపకుని సీతాలక్ష్మణోపేతు స
న్మునిలోకార్చితు సత్కృపాభరణు రాముఁ రాజచూడామణిన్.

310. వ. కని యంతంత [1]నాక్రందనపరుం డగుచుం జని తదీయచరణంబులపయిం బడి
పితృమరణ[2]ప్రకారం బంతయు నెఱింగించి దేవా [3]సకలసామ్రాజ్య [4]ధురీ
ణుండవై మమ్ముందఱ ననుశాసింపవే యని [5]యర్థిజనసహితంబుగా నతనిం
బ్రార్థించిన.

311. క. గురు[1]వాక్య రతుఁడై కా, దరచిత్తుం డైన యయ్యు[2]దాత్తచరితుఁ డె
ప్పరుసున నొడఁబడఁ డయ్యెను, సరసమహీరాజ్య[3]సమనుశాసనమునకున్.

312. వ. భరతుండును [1]రామునిచేతఁ బ్రత్యాఖ్యాతుండై తదీయ[2]పాదుకంబులు గొని
చని వాని నర్చించుచు నందిగ్రామంబు[3]నందు వసియించి [4]రాజ్యానుసంధా
నంబుసేయు చుండె నిట రాఘవుం[5]డయోధ్యాపురసమీపం [6]బగుటం జేసి
క్రమ్మఱ భరతాగమ[7]నంబు శంకించి చిత్రకూటంబు వాసి శరభంగు[8]పాలికిం

---

309. 1. భసితాంగభూషితుని — అ; సితభూతిభూషణుని — స. 2. మార్తాండకు
లేంద్రు నింద్రనమునీతా — ఓ. ఔ. ద. ల. స. శ.

310. 1. నాక్రోశపరవశుండగుచుంజని — ఏ; నాక్రందనలాలసుండగుచు — కొన్నిప్రతులు;
నాక్రందన పరవశుండగుచు — ల. కొన్ని ప్రతులు. 2. ప్రకారంబెఱింగించి — ల.
పెక్కు ప్రతులు. 3. నీవు సర్వసామ్రాజ్య — ల. కొన్ని ప్రతులు; సర్వసామ్రాజ్య-
కొన్ని ప్రతులు. 4. ధుర్యుండవై — ద; ధురంధరుండవై — ఏ. 5. యర్థిజన
సమేతంబుగా — ఊ. ఓ. ఔ. గ. ల; యప్పౌరజన సమేతంబుగా — ఊ.

311. 1. కార్య — ఔ. ద. 2. దారచరితు — క. ఘ. చ. జ. 3. సంప్రశాసనమున
కున్ — కొన్ని ప్రతులు; మహిత శాసనమునకున్ — ట. శ. స. ముఖ్యశాసనమున
కున్ — ఓ; ప్రథమశాసనమునకున్ — ఘ.

312. 1. రామునిచేత — క. గ. ల. 2. పాదుకలుగొని — పెక్కు ప్రతులు. 3. నం
దవసియించి — ల. 4. రాజ్యానుపాలనంబు — అ. క. ఙ. ల. 5. డయోధ్యా
పుర సమీపం — ఇ. ఏ. క. గ; డయోధ్యాసమీపం — వా. పెక్కు ప్రతులు.
6. బగుటగ్రమ్మర — ఉ. ఎ. త. ల. 7. నంబునకు — పెక్కు ప్రతులు. 8. నాశ్ర

జని యతనిచేత సత్కృతుం డై [9]దండకారణ్యంబు సొచ్చి యందు గోదావరీ
తీరంబున ననుజ[10]వధూసహితంబుగాఁ గృతనివాసుం డై [11]యున్నంత దశ
[12]గ్రీవు చెలియలు శూర్పణఖ ననుదెంచి వారికి నపకారంబు సేయ మొనసినం
గినిసి యారాజపుత్త్రులు దత్కర్ణనాసికావైకృతం బొనరించినం బదంపడి.

313. ఉ. [1]శూర్పణఖానిమిత్తమున శూరు లనేకులు [2]రక్కసుల్ [3]మహో
త్సర్పితరోషులై బహుళసైన్యయుతంబుగ నెత్తి వచ్చుదుర్
దర్పితవైరిభంజనుఁ డుదారుఁడు రాఘవుఁ డస్త్రవిద్య నే
ర్పేర్పడఁ గేలిఁబోలె సమయించె రణాంగణభూమి నందఱన్.

314. వ. ఇట్లు ఖర[1]దూషణాదులం గొట్టి పదునాలుగువేల [2]రాక్షసులం జంపి దండ
కారణ్యంబు విగతకంటకంబు [3]గావించె నంత [4]శూర్పణఖయు రయంబున
రావణు[5]పాలికిం జని తచ్చరణంబులపయిం బడి యేడ్చినం జెలియలకైన
[6]వైకృతంబేర్పడఁ జూచి [7]యన్నిశాచరనాథుం డిట్లనియె.

315. సీ. ఎఱిఁగి యెఱింగి నేఁ[1]డెవ్వాఁడు నిశితవిస్ఫారశూలాగ్రంబు[2]పయికి నుఱికెఁ
[3]దలయంపియం దగ్గి దరికొల్పి [4]యెవ్వండు నేఁడు నెమ్మది శయనింప [5]జూచె

మఁబునకుం - పెక్కు ప్రతులు. 9. దండకావనంబు - ఔ. ల. 10. సతీసహి - ఊ; దారయుతం - ఉ: వధూసమ - జ. 11. యున్న - కొన్ని ప్రతులు; యుండె నంత - అ. క. జ. 12. కంధరు - ఇ. ఏ. ఓ.

313. 1. శూర్పనఖ - ల. 2. రాక్షసుల్ - కొన్ని ప్రతులు. 3. మహాదర్పిత...... బహుళదైత్యయుతంబుగ - క. ద.

314. 1. దూషణత్రిశిరులందొట్టి - ల. కొన్ని ప్రతులు; దూషణులందొట్టి - ఊ. ఔ; దూషణత్రిశిరులందోలి - జ. 2. కంచురథంబుల రాక్షసుల సమూలంబు చంపి యుద్దండత బేర్చిదండకా - గ. 3. గావింప - ఈ. ఐ. త. 4. శూర్పణఖ - ఆ. గ. జ. 5. పాలికి నరిగి - పెక్కు ప్రతులు; కడకుం జని - గ; కడ కరిగి - ల. 6. వైకృతవేషం - ఈ. త; వైకృతం బుపలక్షించి - చ. 7. రావణుండు వెరగంది యిట్లనియె - కొన్ని ప్రతులు; యన్నిశాచరుం డిట్లనియె - ఒ. గ. శ.ష.

315. 1. డెవ్వడు - వా. శ; డెవ్వాడు - కొన్ని ప్రతులు. 2. పైకి-పెక్కు ప్రతులు. 3. దలయంపునందగ్ని - స. కొన్ని ప్రతులు. 4. యెవ్వఁడు - వా; యెవ్వండు- కొన్ని ప్రతులు. 5. బూనె - ఊ; దొడగె - ఘ.

నుగ్రవిషానలం బుమియుచున్న యహీంద్రుఁ గడఁగి [6]నేఁ డెవ్వండు గాలఁ దన్నె
హుంకార[7]ఘోరమై [8]యుదరు బెబ్బులి [9]మీస లుఱక యెవ్వాఁడు నేఁ డూఁచికొనియె

ఆ. [10]నిన్ను నెవ్వఁ డకట [11]నేఁ డిట్లు గడు భంగ, పఱిచెఁ జెపుమ నాకుఁ బద్మనయన
[12]యాయువును సిరియును [13]నవశంబు లయ్యె నేఁ, డెవ్వనికొ తలంప నిజ్జగమున.

316. క. అని[1]పలుకు నప్పు డాతని, ఘనతర[2]ముఖనేత్రనాసికా[3]కర్ణములం
దనవరతరోషపావక, జనితశిఖావితతు లక్కజంబుగ [4]వెడలెన్.

317. వ. శూర్పణఖయు నతనికి రాఘవు లున్నతెఱంగును నిజపరిభవం[1]బు దత్కృతం[2]బగుటయు ఖరదూషణాదిరాక్షసవధయునుం జెప్పిన విని [3]ధనదానుజుం డాక్షణంబ పురసంరక్షణంబు[4]నం దాప్తజనంబుల నియోగించి సన్నద్ధుం డై యొక్కరుండ [5]వెలువడి [6]త్రికూటకాలపర్వతంబులు గడచి సముద్రతీరంబునఁ బరమేశ్వరనివాసం బైన గోకర్ణస్థానంబునకుం జని యచ్చటం దొల్లి రామువలనం బ్రాప్తపరాభవుం డై [7]ప్రవ్రజనంబునొంది తపంబు సేయు

---

6. నేఁడెవ్వఁడు – వా; యెవ్వడు నేడు గాల దన్నె – కొన్ని ప్రతులు; నేడెవ్వండు– జ. వీ. శ. ష. 7. ఘోషమై–ఇ. ఏ. 8. యొదరు–శ. కొన్ని ప్రతులు; యొురలు–చ; యురలు – స; యొదవు – వీ. ప. శ. 9. మీద కొదుకకెవ్వడు నేడు కోలసాచె– ఔ; మీసలుఱక యెవ్వడు నేడు పెరికివైచె–స. ప్రాసయతి. 10. వాడు మత్ప్రతాపవైశ్వానరార్చుల బోలియు నీక్షణంబ శలభ మనగ–స. శ. 11. నేడిట్టులను– ఈ. ఐ. త; నేడిట్లుభంగంబు – కొన్ని ప్రతులు. 12. నాయువును సిరియు నపాయంబు లయ్యె నే డెవ్వనికొ–ఓ. ప. శ; వాడు మత్ప్రతాపవైశ్వానరార్చుల బోలియు నీక్షణంబ శలభ మనగ–ఊ; నాయువును శయంబు నలసిరి గడవంగ నెవ్వ డొకొ తలంప–ఇ. ఏ. 13. నల్పంబు లైయుండ నెవ్వ డొక్కొ–అ. క; నల్పంబు లయ్యె – జ.

316. 1. పలుకగ నపుడాతని – ఇ. ఏ. ఓ. 2. మగు – ఇ. ఏ. 3. కర్ణములం – పెక్కు ప్రతులు; వివరములం – ఓ. ల; రంధ్రములం – వా. సం. 4. పొడమెన్ – ఓ. ల

317. 1. బును – ఏ. ఓ. ఘ. 2. బును ఖర – ఇ. ఏ. ఓ. గ. 3. కుంభకర్ణాగ్రజుం – అ. జ; కుబేరానుజుం – ట. ల; దనుజుం – ఔ. గ. ఘ. ద. 4. నకు నాత్మజుల– ఔ. ద. 5. వెడలి – కొన్ని ప్రతులు. 6. త్రికూటకులపర్వ – గ. ద; త్రికూటాచలంబుగడచి – ఆ; త్రికూటపర్వతంబుగడచి – ఊ. ఓ. క. 7. మునివృత్తి నొంది – ల. కొన్ని ప్రతులు; విరక్తినొంది – క. జ. ట; పరాజయంబునొంది – ఒ;

చున్నవానిం దన పూర్వామాత్యు[8] మారీచుం గనిన నతండును బ్రియ
సంభ్రమంబు[9]లతోడ నతనిం బూజించి కుశలం బడిగి భవదాగమ[10]ననిమిత్తం
బేమి యని [11]యడిగిన నసురేశ్వరుం డిట్లనియె.

818. ఉత్సాహము.

[1]వినవె రాముఁ డనఁగ నొకఁడు విపులదర్పహృదయుఁడై
మన ఖరుండు లోనుగా సమగ్ర[2]శౌర్యులైన య
ద్దనుజవరులఁ దునిమి యిపుడు దండ[3]కస్థలంబునం
దొనర నిర్భయత్వ మొప్ప నున్నవాఁడు మేటియై.

819. ఆ. వానిఁ బరిభవింపవలయు [1]నప్పనికి సా, హాయ్యకం బొనర్పు మనఘ నాకు
ననిన నధికభయసమావిష్టహృదయుఁడై, యమరవైరి [2]కిట్టు లనియె నతఁడు.

820. చ. ఎఱుఁగవు[1]గాక రాఘవు నుదీర్ణభుజాబలరూఢి నాజిలో
నుఱక తదీయ[2]బాణరయ మోర్వ వశంబె పినాకికైన [3]సు
క్కఱ [4]మఱి నీకు నిత్తెఱఁగు గాదన కే ఖలుఁ [5]డొక్కొ బుద్ధిఁగాఁ
గఱపినవాఁడు సేటునకుఁ గాలముః [6]సేరెనొ కాక యిమ్మెయిన్.

821. ఆ. రాము[1]తోడఁ దొల్లి రణమునఁ గడు భంగ, మొంది కాదె [2]దైన్యయుక్తి నిట్లు
దపసి నైతి [3]నేఁడు తగ దమ్మహాత్ముని, యందు వైరబుద్ధి [4]యధిప నీకు.

---

ప్రాయోపవేశంబు నొంది–ట. 8. నీచుం డైన మారీచుం–గ. 9. లెసంగనతనిం–అ. జ. ట. 10. నం బేమి నిమిత్తం బని–చ. 11. యడిగి – కొన్ని ప్రతులలోలేదు; యడుగుటయు నాయసురేంద్రుం డిట్లనియె – ఉ.

818. 1. వినుము – ఇ. ఏ. 2. వీర్యు – ఘ. 3. కాస్థలంబునం – ల. కొన్ని ప్రతులు; కావనంబునం – ఉ.

819. 1. నిప్పనికి – కొన్ని ప్రతులు. 2. తోడననియె నతడు – కొన్ని ప్రతులు.

820. 1. నీవురాఘవు – పెక్కు ప్రతులు. 2. శౌర్యబలమోర్వ – కొన్ని ప్రతులు. 3. నుక్కరయుగ – శ. కొన్ని ప్రతులు; నాకరయగ – శ; దుష్కరమగు – ఇ. ఏ. 4. గడు – ఈ. ఐ. త. 5. డొక్క బుద్ధిగా – కొన్ని ప్రతులు. 6. చేసెనొ – ఒ. ఔ. గ; చేరిక – ఇ; చేరిన – ఏ.

821. 1. దొడరి నేను – పి. శ. ష; తోడ దొడరి–ల. శ. పెక్కు ప్రతులు. 2. ధైర్యయుక్తి – ఆ. ఉ. ఎ. 3. నేను – ల. పెక్కు ప్రతులు. 4. యనఘ – ఈ. జ.

322. వ. అనినం గలుషించి లంకేశ్వరుండు వానిం జూచి నాపనుపు సేయ[1]వై తేవేని [2]నిన్నిప్పుడ కృతాంతగోచరుం జేయుదు ననిన వాఁడును దన మనంబున వీనిచేతం జచ్చుటకంటె[3]ను రాఘవకృతం బైన మరణంబు మేలని [4]తలపోసి మహాత్మా నీకు హితంబు [5]గోరి చెప్పితి నిది యిష్టంబు గాదేని భవదీ[6]య శాసనంబు గైకొని చేసెదం బనుపు మనినఁ బౌలస్త్యుం[7]డిట్లను నీవు రత్న మయతనూరుహం బగు కనకమృగంబ వై చని జానకిం [8]బ్రలోభింప వలయు సీతాచోదితుం డై రాముండు నిన్నుం బట్ట సమకట్టి నీచేత నతిదూరంబు గొనిపోవం బడు నప్పు డేను [9]దద్భామిని నపహరించెదఁ[10] బ్రియావిరహదు ర్మనస్కుం డై యతండు చెడిపోవు ననిన నట్లకాక యని మారీచుండు.

-: మారీచుండు మాయామృగం బై చనుదెంచుట :-

సం. 3 – 262 – 24

323. క. కనకమృగరూపమునఁ జని, యిన[1]వంశ్యుఁడు సతియు నున్న యెడ [2]మెలఁగుటయుం
గని జానకి కౌతూహల, మునఁ [3]బ్రియుఁ బ్రార్థించె హరిణ[4]పుంగవుఁ బట్టన్.

324. ఆ. [1]ధరణిసుతయు విధియుఁ దన్నుఁ బ్రేరేపంగ
వివశబుద్ధి యగుచు నవనివిభుఁడు
మృగముఁ[2]బట్టఁ దివిరె మృగ[3]నేత్ర కావ స
ద్వినుతబలు సుమిత్రతనయు నునిచి.

---

322. 1. వై తేని – ల. పెక్కు ప్రతులు. 2. నిన్నునిప్పుడు – పెక్కు ప్రతులు. 3. ను – పెక్కు ప్రతులలోలేదు. 4. తలంచి – ల. కొన్ని ప్రతులు. 5. గా జెప్పితి – క. వ. గ. 6. యానుశాసనంబు – ఈ. 7. డిట్లనియె – ల. కొన్ని ప్రతులు; దు సుముఖుండై యిట్లను – కొన్ని ప్రతులు. 8. ప్రబోధింప – కొన్ని ప్రతులు; భ్రమియింప – ల; నపలాలింప – ఈ. ఐ. త. 9. దళ్ళామిని – కొన్ని ప్రతులు; దద్భామ – కొన్ని ప్రతులు; నభ్భామిని – ఊ. 10. వంతప్రియా – అ. ఒ. క. జ; ప్రియాంగనావిర – ఔ. ద.

323. 1. వంశుడు – శర. పెక్కు ప్రతులు. 2. బొలయుటయున్ – శ. పెక్కు ప్రతులు 3. విభు – కొన్ని ప్రతులు; బతి – ల. స. కొన్ని ప్రతులు. 4. మును బట్టంగన్ – ఉ

324. 1. ధరణి సుతయనువిధి దన్నుఁ బ్రేరేపగ – ఈ. ఐ. గ. త. 2. పట్టజనియె – ఒ జ. స. 3. నేత్రి (త్ర) కావు – ల. ప. శ. కొన్ని ప్రతులు.

325\. క. అసదృశకార్ముకధరుఁడై, మసలక యామృగము [1]వెనుక మర్దిత[2]రిపుఁడై పెసఁగంగ నరుగఁ దొడఁగెను, వెస రుద్రుఁడు యజ్ఞమృగము వెనుకొను మాడ్కిన్.

326\. వ. [1]అట్టియవసరంబున.

327\. మ. పఱచున్ దవ్వగఁ [1]జేయలంతి నిలుచుం బట్టిక యాసాస[2]లం [3]బిలువోవుం బొదలందు [4]డిందుఁ బొడమున్ [5]బి ట్టుల్కి వేదాఁటుఁ గ్ర మ్మఱఁ జూచుం [6]జెవి దార్చి నిల్చు [7]మలయుః మట్టాడుఁ [8]గ్రోరాడు నే మఱిన ట్లుండుఁ దృణంబు [9]మేయు [10]నెలయున్ మాయామృగం బిమ్ములన్.

328\. వ. [1]ఇ ట్లతిదూరంబుగా [2]నెలయించి యలయించిన నది రాక్షసమాయగా [3]నూహించి [4]రాఘవుం డమోఘబాణంబు [5]దొడిగి తడయక యమ్మృగంబు నేసిన.

---

325\. 1. వెంట - అ. ఉ. ఎ. ఘ. జ. 2. రిపు డేపెసగంగ - ఈ. ఐ. గ. చ. త. ల; రిపుడై వినవక - ఇ. ఏ; రిపు డింపెసగగ - వా. కొన్ని ప్రతులు.

326\. 1. ఆసమయంబున - ఉ. ఎ. ప; అట్టి సమయంబున - పెక్కు ప్రతులు; ల. ప్రతిలో నీవచనములేదు.

327\. 1. జేరి యంతనిలుచుం - ఉ. ఎ. ఏ. ఓ. గ. చ. స. 2. గా-ల. స. శ. పెక్కు ప్రతులు. 3. బిరివారుం - కొన్ని ప్రతులు. 4. దూరు - ఆ. ఈ. ఉ. ఎ. ఐ. త; పోదు - చ. 5. బిట్టుల్కు - కొన్ని ప్రతులు. 6. జెవులొరగించుగలగున్ - ఆ; జెవిదాల్చి - కొన్ని ప్రతులు; జెవిపోల్చు - స; జెవిర్వాల్చి - ఔ. 7. గలగున్ - కొన్ని ప్రతులు; మెలగున్ - గ; గలయన్ మట్టాడు - ఎ. జ; గలచున్ - కసం. 8. గ్రోడాడు - వా. పీ. శ; గోరాడు - శ. ష. కొన్ని ప్రతులు; గోడొడ్డు - స. శ$_1$; గొట్టాడు - చ; గూడంగ - ఇ. ఏ. 9. లాను - ఊ. క. ఘ. జ. ద. 10. మల యున్ - కసం. కొన్ని ప్రతులు; నెలయున్ - కొన్ని ప్రతులు; నెలమిన్ - ఓ; సొల యున్ - గ; నలయున్ - వా.

328\. 1. ఇట్లు దూరంబుగా - కొన్ని ప్రతులు. 2. నెలయించిన నదిరాక్షస - ల. కొన్ని ప్రతులు; నలయించిన నదిరాక్షస - కొన్ని ప్రతులు. 3. దలంచి - కొన్ని ప్రతులు. రాముండు ఘోరబాణంబు - గ. 5. సంధించి - అ. జ.

329\. క. వాలమ్ము దాఁకి యొఱలుచు, నాలోనన రాము[1]నెలుఁగునట్టి యెలుఁగుగా
[2]హా లక్ష్మణ సీతా యని, కూలి కపటమృగము [3]దన్నికొనుచుం జచ్చెన్.

330\. తరువోజ.
ఆయెలుఁ గేర్పడ నవనీతనూజ యాలించి [1]తల్లడం బడరు చిత్తమున
నోయన్న లక్ష్మణ యొలసి మీయన్న యుగ్రరాక్షసబాధ [2]నొందంగఁ బోలు
నాయతభుజ [3]పింకెు యమ్మహాభాగుఁ డత్యంత[4]దుఃఖార్తుఁ డై [5]నిన్నుఁ జీరెఁ
బోయి [6]వే కావు విస్ఫురితపుణ్యైకభూషణో[7]దార యప్పురుషరత్నంబు.

331\. వ. అనిన [1]నఖండమ్మానిని కిట్లనియె.

332\. ఆ. అబల వెఱవ కుండు మఖిలలోకములను, రాఘవేశ్వరునకు రణములోన
[1]నెదురఁ గలఁడె శూరుఁ డెవ్వాఁడు నతనికి, నెట్టియెడల దురిత మేల పొందు.

333\. క. ఇనవంశోత్తముఁ డిప్పుడ, చనుదెంచుఁ బ్రియంబు నొందు జల[1]జానన నా
[2]విని జానకి లక్ష్మణునెడ, జనితాశంక యయి [3]క్రోధసంభ్రాంతమతిన్.

---

229\. 1. నట్లగు ధ్వనితో – జె; నట్టియెలుగుతో – ల. కొన్ని ప్రతులు. 2. హాలక్ష్మణా యటంచును – ఇ. వ. ఓ. ఘ. చ. ల; హాలక్ష్మణ సీత యనుచు గూలి – కొన్ని ప్రతులు. 3. దన్నుకొనుచున్ – కొన్ని ప్రతులు.

330\. 1. తల్లడమందుచిత్తమున – కొన్ని ప్రతులు; తల్లడంబంది – టొ. ద. 2. నొందె గాబోలు – కొన్ని ప్రతులు; నొందంగనోవు – ఆ. చ. 3. వీర్యుడమ్మహా – ఇ. ఉ; వీర్యునమ్మహాభాగు – కొన్ని ప్రతులు; వీర్యుడమ్మహాబాహు – ఘ. ల. వ. 4. దుఃఖాత్ముడై – కొన్ని ప్రతులు. 5. చీరెనిన్ను – పెక్కు ప్రతులు. 6. వేగావవే పుణ్యగుణైక – చ. ద. ల వి. శ. వ. న. శ; కావవె నీవు పుణ్యగుణైక – కొన్ని ప్రతులు; కావవె సత్యభూషణోదార పుణ్యగుణాత్మ నప్పురుషరత్నంబు – జె; కావవె మహాపుణ్యగుణైక – శ. 7. దారునప్పురుష – ల. వ. శ; పెక్కు ప్రతులు; దారుసత్పురుష – ఈ. ద. త.

331\. 1. లక్ష్మణుం – టొ.

332 1. నెదురుగలరె శూరులెవ్వారు – కొన్ని ప్రతులు.

333\. 1. జేక్షణ – కొన్ని ప్రతులు 2. వినిలక్ష్మణు వెడనెంతయు – న. 3. రోష – అ. శ. జ; క్రోధసంప్రాప్తిమెయిన్ – ఇ. ఏ. గ.

384. సీ. సీతలం[1]పెలుఁగుదు [2]నీకేల వలవని జాలి [3]నీ కిట్లేల సంభవించె
నతిఘోరశస్త్ర విషాగ్ను[4]లయం దొంట [5]వేగంబ [6]ప్రాణముల్ [7]విడుతుఁగా
యే నేల [8]నిను వరియింతు బెబ్బులికాంత యక్కటా నక్క పొం దాసపడు
యని యిట్లు సత్పురుషాగ్రణి సౌమిత్రిఁ బడఁతి [9]యప్రియములు
వలుకుటయును

ఆ. చెవులు మూసి[10]కొనుచుఁ జిత్తంబు [11]గలఁగ లక్ష్మణుఁడు దక్షిణంబ
మహితశౌర్యు
డతులబాణచాపహస్తుఁ డై [12]తన యన్న, సనిన చొప్పునంద
[13]చనఁ దొడంగె

385. వ. అయ్యవసరంబున దశాననుండు.

386. మ. కమనీయం బగు జన్నిదంబు శిఖయుం గౌపీనముం [1]ధాతువ
స్త్రము దండంబును[2] గుండియుం గుశపవిత్రంబుం గడుం వృద్ధభా
వము [3]సంధిల్లఁ ద్రిదండివేషధరుఁ డై వచ్చెం [4]బథిశ్రాంతి దే
హమునం [5]దోఁపఁగ సీత యున్నెడకు మాయాదక్షుఁ డక్షీణతన్.

387. తే. వాని [1]నిక్కంపు మునియ కా వగచి [2]రాము
వనిత గడుభక్తిఁ [3]బూజించి వన్యఫలము
లొసఁగుటయు వానిఁ జేకొన నొల్ల కసుర
మదన [4]వివశుఁ డై యి ట్లను మగువ[5]జూచి.

---

384. 1. పెరిగితి – అ. ఒ. క. జ. ల. 2. నీకిప్పువలవని – ఐ. త. 3. యిట్లేటికి సంభవించు–ల. కొన్ని ప్రతులు; మానసమున సంభవించె–ఇ. ప. 4. లందొక్కట–ల. స. పెక్కు ప్రతులు; లయ దొంద – శ. 5. వెరవున ప్రాణంబు – ఒ; వేగ ప్రాణంబులు – చ. 6. ప్రాణంబు – ల. పెక్కు ప్రతులు. 7. విడుచుదాన–ద. 8. నిన్ను వరింతు – ఆ. ఊ. ఎ. ద; నినువరియించెద బులికాంత – ఇ. ప. ల. 9. యప్పలుకులు–గ. 10. కొని విచేష్టితు డగుచు సంతప్తచిత్తుడగుచు దక్షిణంబ–చ. 11. గలుగంగ లక్ష్మణుడు నయవిలక్షణుండు – ఔ. 12. తమ – పెక్కు ప్రతులు. 13. చనగదొడగె – ల. కొన్ని ప్రతులు.

386. 1. ధాతవస్త్రము – ఆ. ఊ. ఒ. క. 2. గమండులుం – ఒ. 3. శోభిల్ల–ఔ. 4. బథశ్రాంతి – ల. పెక్కు ప్రతులు. 5. దొప్పగ – ఘ.

387. 1. నిక్కము – ల. పెక్కు ప్రతులు. రామవనిత – జ. ల. 3. భూషించి – ఊ. 4. పరవశుడగుచు నమ్మగువజూచి–ఉ; శరవివశాత్ముడై మగువజూచి–ఔ. 5. తోడ– ఇ. ప. స.

338. మత్తకోకిలము.

ఏను దానవనాయకుండ నహీనసత్త్వుఁడ రావణా
ఖ్యానిరూఢుఁడ లంకనాఁగ జగత్ప్రసిద్ధము [1]మత్పురం
బానతాంగి మదీయ[2]వల్లభ వై [3]భజింపఁగ రాదె ది
వ్యానుభోగము [4]లిష్టచేష్టితహారియౌవనలీలలన్.

339. క. ఎక్కడి రాఘవుఁ డక్కట, తక్కువ యగు పేదమనుజుఁ దగిలి [1]వనమునం
బెక్కిడుములఁ [2]బడఁదగునే, తక్కుము [3]మది నింక నొండు దలఁపులు తరుణీ.

340. వ. అనిన [1]విని వైదేహి భయకంపిత[2]దేహ యగుచు [3]నతని కిట్లనియె.

341. సీ. ఇట్లాడ నర్హమే [1]యే నేడ నీ వేడ నక్షత్రతారాగణంబుతోడ
నాకసం బంతయు నవనిపైఁ గూలిన వసుమతి[2]ప్రస్సిన [3]వనధు లెల్ల
నింకినఁ జంద్ర[4]దినేశ్వరు లన్యోన్య [5]విపులతేజంబులు [6]విడువడిన
నే నేల యన్యుని [7]నెడలోనఁ గామింతు గరిణి యేనాఁట సూకరముఁ[8]గలయు
ఆ. మహితకమల[9]మధురమధురసాస్వాదన, పరవశాత్మ యైన భ్రమరకాంత
[10]రిత్తబుద్ధి నకట రేఁగుపువ్వుల [11]రసం, బాను నెట్లు బేల వైతి[12]గాక.

---

338. 1. నాపురం – అ. జ. 2. వల్లభి – ఆ. జ. ల. సుఖింపగ – స. కొన్ని ప్రతులు; భుజింపగ – స. శ; సుఖింపగరావె – ఊ. 4. తెల్లనిష్టవిహారలీలలతోడుతన్ – ఊ. ఐ. త. శ; లిష్టమెట్లగునట్లు యౌవ్వనలీలతోన్ – ఔ.

339. 1. యడవులన్ – ఘ. వీ. శ. ష; వనములం – ల. కొన్ని ప్రతులు; మనమునం – ఊ. ఓ. ఔ. గ. 2. బడనేటికి – ల. స. కొన్ని ప్రతులు. 3. మదిలోన–చ. ప.

340. 1. విని – కొన్నిప్రతులలో లేదు. 2. హృదయ యగుచు – కొన్ని ప్రతులు. 3. నిట్లనియె – కొన్ని ప్రతులు.

341. 1. యే నేల నీ వేల – ఓ. క. స. శ. 2. ద్రస్సిన – స. 3. వారినిధులు – చ. 4. దినేశులయన్యోన్య – కొన్ని ప్రతులు; దినేంద్రు లన్యోన్యంబు – ఈ. ఐ. త. 5. విషయకాలంబులు – ఊ. స. శ. 6. విడువబడిన – ల. ప. పెక్కు ప్రతులు. 7. నెడదలోగామింతు – కొన్ని ప్రతులు; నెడదలో భావింతు – ఘ. వీ; నెదలోన నరమింతు – గ. 8. గవయు – ఈ. ఐ. త. 9. వనము – ఇ. ఏ; కుసుమ – క; మందు – ద. 10. రిక్తబుద్ధి – అ. ఒ. ఔ. ఘ. 11. తేనె యానునెట్లు – ఔ; రసమానుచెట్లు – ఇ. ఏ. శ; మానునెట్లు – కొన్ని ప్రతులు. 12. గాదె – ద.

-: రావణుఁడు సీత నెత్తికొని లంకకుఁ బోవుట :-

సం. 3 _ 262 _ 39

342\. వ. అని పలుకుచు నొయ్యనొయ్యన తొలంగం జనిన [1]నద్దురాత్ముఁ డతిభయంకరంబుగా జంకించి యమ్మగువం[2]బట్టికొని గగనంబున కెగసి [3]లంకాపురాభిముఖుం డై యరుగఁ దొడంగిన నయ్యింతి యెంతయుం [4]దలరి యిట్లని [5]విలాపంబు సేసె.

343\. ఉ. దేవతలార యోధరణి దేవతలార జగత్త్రయోన్నతుం
డై వెలుఁగొందు [1]రామునికులాంగన జానకి నేను నన్ను మో
హావిలుఁ డొక్కరక్కసుఁ [2]డనర్గళుఁడై కొనిపోయెడుం గృపం
గావరె పుణ్యమున్ యశముఁ గైకొనరే యిదె [3]మీకు మ్రొక్కెదన్.

344\. క. అని[1]యేడ్వఁగఁ దద్వచనము, లనఘుఁడు గిరిగహ్వ[2]రాంతరాలయగతుఁడై
విని యరుణసుతుఁడు దేజో, ఘనుఁడు జటాయు[3]వను పక్షి గారుణ్యమునన్.

345\. క. ఎఱకలు గల కులశైలము
తెఱఁగు మెయిన్ రయము [1]మెఱయ దివికి నెగసి [2]బె
ట్టుఱుము జలధరము క్రియ [3]ను
క్కఱి భువనం బెల్ల నద్రువ నార్చుచుఁ [4]గడిమిన్.

---

342\. 1. నద్దురాత్ముడును దనపూర్వాకారంబు గైకొని యతిభయంకరం-కొన్ని ప్రతులు. 2. బట్టుకొని - శ. వ. 3. లంకాభిముఖుండై - ల. పెక్కు ప్రతులు. 4. దల్లడిల్లి - అ; దలంకి - టొ. ని. శ. వ. 5. విలపింపదొడంగె - ఘ. చ; ప్రలాపించె - క; విలాపంబు సేయం దొడంగె - ఓ.

343\. 1. రాఘవు - అ. 2. దహాంకృతుడై - ఈ. ఐ. త. 3. మిమ్ము వేడెదన్ - ఊ.

344\. 1. యేడ్చెడు తద్వచనము-ఇ. ప. వ. 2. రాలయాంతర్గతుడై - ల. 3. వను వాడు - ఊ.

345\. 1. మెయిన్ రయము మెఱయ - వా. శ; మెరయరయము నెరయ - పెక్కు ప్రతులు. 2. బిట్టురుము - ల. పెక్కు ప్రతులు. 3. నుక్కరి తద్వన మెల్ల నదుర (నద్రువ)-ఊ. వి. శ. వ. స. శర. శ; నుక్కరి భువనము లెల్ల నద్రువ - ల. పెక్కు ప్రతులు. 4. గడకన్ - ఓ; గరిమన్ - వి. ఖా.

346. ఉ. ఓరి దురాత్మ యీయబల [1]నోడక యేటికిఁ బట్టినాఁడ వం
భోరుహ[2]నేత్ర విడ్వు మెట వోయినఁ బ్రాణముఁ గొందు [3]నింక ను
గ్రారివిభేది [4]విక్రమ జటాయు[5]నెఱుంగవె యంచు దర్పదు
ర్వారుఁడు వీఁక దాఁకె సురవర్గ[6]విఘాతకు నద్దశాననున్.

347. మ. ఘనపక్షాహతులం [1]బ్రకాండపరిఘాఘాతంబులం దీవ్రశా
త[2]నఖోచ్ఛేదములం బ్రదీప్త శర[3]వేధక్రీడలం గ్రూరచం
చు[4]నిపాతంబులఁ బ్రౌఢకుంతముఖ [5]విస్ఫోటంబులం దక్షగేం
ద్రనిశాచేంద్రుల పోరు [6]సాధనసమత్వస్ఫూర్తి నొప్పెం గడున్.

348. చ. పటుతరపక్షిపక్షముఖపాద[1]నఖప్రవిఘాతఖండిత
స్ఫుటితశరీరుఁడై బహుళశోణితధారలు మేనఁ గ్రమ్మఁగాఁ
దటసముపాంతనిర్గళితధాతురసారుణసాంద్రనిర్ఝరో
త్కటకులశైల[2]లీల దశకంఠుఁడు [3]నిల్చె నకుంఠితస్థితిన్.

349. వ. తదనంతరంబ.

350. క. తెలిపి గని [1]దానవేశ్వరుఁ, డులుక కృపాణమున నాఖగోత్తము [2]నెఱకల్
[3]నఱికినఁ గూలె నతం డిల, నఱవఱలై పవనహత[4]మహాభ్రమపోలెన్.

---

346. 1. నూరక - ఇ. ప. ల. స. 2. నేత్రవీడు యెట - ఈ. ఐ. త; నేత్రినివ్విడువు - ఊ. ద. 3. నిన్ను - ఆ. ఎ. ఐ. ల. 4. నన్నునుజటాయు - అ. జ. ల. 5. వెఱుంగవె - ఆ. శ. 6. విమానను - స. శ. కొన్ని ప్రతులు; విభేదను - ఒ; నిషూదను - క. శ. ప.

347. 1. బ్రకాశ - అ. 2. నఖచ్ఛేదములం - కొన్ని ప్రతులు. 3. పాత - ఔ; భేద - క; వేగ - ఒ. ఘ. శ. ప. 4. నిపాతాహతి - ఆ. ఉ. ఎ. స. 5. సంస్ఫోటంబు- ఇ. ప. 6. చూడగ - ఔ. గ; విక్రమ - ట; సాధనసమగ్ర - స. కొన్ని ప్రతులు.

348. 1. నఖాగ్ర - కొన్ని ప్రతులు; నఖోగ్రవిఘట్టనక్షత - ఔ. 2. ఖాతి - శ. 3. నొప్పె - ల; పొల్చె - గ; నిల్చెనకంపిత - స. కొన్ని ప్రతులు.

350. 1. దానవేంద్రుడు - ఓ. గ. 2. రెక్కన్ - ఔ. ద. 3. నఱికిన - ల. ష; నరికిన - శ; నరకిన నిలగూలెనతం డరవరలై - గ. 4. మహాభ్రములీలన్ - ఔ; మాహాభ్రముపోలెన్ (వోలెన్)-అని పాఠములు.

351. వ. ఇట్లు జటాయువుం గూల్చి రావణుం [1]డధికరయంబున నరుగు నెడ జానకి దనకు [2]దిక్కెవ్వరు [3]లేమిం జేసి నిరాశ యై యొక్క[4]శైలశృంగంబునందుఁ గొందఱు వానరులు మెలంగు[5]చున్నం గని తన కట్టినపుట్టంబు [6]కొంగు సించి భూషణంబు[8]లు ముడిచి [9]తత్ప్రదేశంబున వైచెం బంక్తి[10]వదనుండును లంకాపురంబునకుం జని యం దశోకవనమధ్యంబున నా[11]సుమధ్య నునిచి తదీయ[12]రక్షణార్థంబు [13]రాక్షసీనివహంబు [14]నియోగించె నిట రాఘవుండు మాయామృగంబు వధియించి మగుడం జనుదెంచువాఁడు దన[15]కెదురుగా వచ్చు లక్ష్మణుం గని రాక్షసగోచరం బైన [16]వనంబున జానకి[17]నొంటి యునిచి [18]వచ్చి తప్పు సేసి తని పలుకుటయు సుమిత్రానందనుండు ధాత్రీతనయ [19]దన్ను నవమానించి పలికిన [20]తెఱంగు సెప్పిన.

352. మధురాక్కర.

కనకమృగ మట్లు [1]దను దవ్వుగాఁ ద్రిప్పి తెచ్చుటకు
వనజముఖి నేకతమ శూన్యవనము[2]నయం దునిచి

---

351. 1. డతిరయంబున – ల. 2. దిక్కొరులు – ఓ. 3. లేకునికిం జేసి – అ. జ. ట; లేమింజూచి – ఊ. 4. శైలేంద్రంబునందు – ఘ; శైలగుహాయందు – ఔ. 5. చుండం దనకట్టిన – ల. కొన్ని ప్రతులు. 6. చెరగు – ఇ. ఓ. గ; చెఱంగు కొంతసించి – వ. 7. తనభూషణం – ఇ. ఏ; తనభూషణవితతులన్నియు – ఔ. 8. లూడ్చితత్ప – ఊ. శ; లుగట్టి – ఇ. ఓ. గ. 9. వారల ముందరబడునట్లుగా నందున బదిలంబుగా వైచె నంత – ఔ. 10. ముఖుండును–అ. క. జ. ట; కంధరుండును – ఔ. చ. 11. తనుమధ్య – అ. జ. ట; హరిమధ్య – ఇ. ఏ. 12. రక్షార్థంబు – ఇ. ఒ. ఔ; రక్షణార్థంబుగా – కొన్ని ప్రతులు. 13. రాక్షసస్త్రీ నివహంబు – ఈ. ఐ. ఒ. గ. ద. 14. నునిచె – ఇ. 15. కెదురువచ్చు – ఆ. ఈ. ఉ. ఎ. ఐ. ల; కెదురుగా వచ్చిన – ఏ. గ. 16. యవ్వనంబున – అ. ఎ. క. జ. ల. 17. నొంటిని డించి యిటు – ఉ. ఎ. ద; డిగవిడిచి – అ. క. ట; నొంటిని డించి – కొన్ని ప్రతులు. 18. వత్తురే యని పలుకుటయు – కొన్ని ప్రతులు. 19. దన్నవమానించి – కొన్ని ప్రతులు. 20. పలుకుల తెరంగు – ఇ. ఏ. ఒ; తెరం గెరింగించిన – ఓ.

352. 1. తన్ను – ఎ. ఔ. శ. ష. 2. నందు నునిచి–కొన్ని ప్రతులు; నందున నునిచి – ఉ. ల; నందునిచి – శ. ష; నందు నిలిపి – ఓ; న నట్లు నిలిపి–ఘ; నం దట్లునిచి–ఔ.

[3]వెనుక ననుజుండు వచ్చిన విధమునకు మదిలోన
ననఘుఁ డెంతయు [4]వగచుచు [5]నరిగె నాశ్రమమునకు.

353. వ. [1]అట్లు సని చేతనారహితం బయిన శరీరంబునుంబోలె సీతా[2]విహీనంబై యున్న పర్ణగృహంబుం గనుంగొని రాఘవుండు మూర్ఛితుం డై లక్ష్మణ [3]ప్రయత్నంబునఁ గొండొకవ[4]డికిఁ [5]దెలివొంది నంత నయ్యన్నయుం దమ్ముం డును [6]దత్ప్రదేశంబులయందు సుందరిం దడవుచుం జనువారు ముందట.

354. తే. కులిశ[1]పాతభంగుర మైన కులనగంబు
కరణిఁ బడియున్న [2]గృధ్రంబుఁ గాంచి [3]బుద్ధి
నదియు రాక్షసమాయ [4]యగా నని తలంచి
యేయ సమకట్టుటయు విహగేంద్రుఁ [5]డెలిఁగి.

355. క. ఓయయ్యలార యేను జ, టాయు [1]వనం బరగు పక్షి [2]నరుణతనయుఁడఁ
మీయయ్య దశరథక్షితి, నాయకునకుఁ బ్రియసఖుండ నావుడు [3]వారల్.

356. వ. [1]డాయ నరుగుదెంచుటయు నతండు వారితో రావణుండు వైదేహిం గొని పోవుటయుఁ దదర్థంబై [2]తాను నద్దను[3]జుం దొడరి పెనంగుటయుం జెప్పి

---

3. వెనుక యనుజుండు - శ. 4. దుఃఖమున - క. 5. జనియె - అ; నరిగె నయ్యాశ్రమమునకు - ఐ; నరిగె నాశ్రమమునకును - ఒ. ఔ. క.

353. 1. ఇట్లు - ల. శ. పెక్కు ప్రతులు. 2. విరహితంబైన - కొన్ని ప్రతులు. 3. ప్రయత్నంబున - ల. స. శ. పెక్కు ప్రతులు; ప్రయుక్తంబున - వా. 4. సేపునకు - చ; తడవుకు - ఘ. 5. దెలిసియయ్యన్నయు - కొన్ని ప్రతులు. 6. దత్తత్ప్రదే - ఔ.

354. 1. పాతాహతంబైన - ఇ. ఏ; పాత భగ్నంబైన - ల. స; పాత భంగంబైన - ఆ. ఈ. ఐ. 2. విహగేంద్రు - క. ట. 3. యందు - ఒ. ఔ. ఘ. ద. 4. యోయని - స. పెక్కు ప్రతులు; బొమ్మని - ఇ. ఏ. ఓ. గ. చ. ల. 5. దనియె - ల.

355. 1. వనెడు పక్షివరుడ - ఆ. ఈ. ఉ. ఐ; వనగ బరగు పక్షి - క. గ. ఘ. ద. శ. ష. 2. నరయుడు నన్నున్-ల. స. శ. పెక్కు ప్రతులు. 3. వారున్-కొన్ని ప్రతులు.

356. 1. డాయంజనుటయు నతండు - ఘ. పీ. శ. ష; డాయనరుగుదెంచిన నతండు - ల. కొన్ని ప్రతులు. 2. తానద్దనుజుం - ల. కొన్ని ప్రతులు. 3. జుతోదొడంగి

రావణుం డరిగిన దెస నెఱిఁగించి [4]విగతజీవుం డయ్యె నయ్యిరువురు నప్పు
లుఁగు జేనికి [5]నతిగౌరవంబున నగ్ని[6]సంస్కారాదికరణీయంబులు నిజ[7]జనక
నిర్విశేషంబుగా నాచరించి దక్షిణాభిముఖు లై చని చని.

357. చ. ఉరమున[1]యందుఁ గన్నులుఁ [2]బృథూదరదేశమునందు నోరుఁ [3]బ్ర
స్ఫురితభుజద్వయంబుఁ [4]గులభూమిధరోన్నత[5]భావమ్ముం గరం
బరుదుగ నుగ్ర మైన వికృతాకృతితోడ నశేష [6]సత్త్వఘ
స్మరుఁ డగుచున్న [7]వానిఁ బటుసత్త్వుఁ గబంధునిఁ గాంచి రచ్చటన్.

358. ఆ. అక్కబంధుఁ డామిషార్థి యై లక్ష్మణుఁ, బట్టికొనియె బాహుబల మెలర్ప
నతఁడు గడువిషణ్ణుఁడై [1]యన్న ననుఁ జూడు, మనుచు
రాముఁ జూచి యనియె మఱియు.

-: శ్రీరాముఁడు కబంధుఁ డను రాక్షసుం జంపుట :-

సం. 3 _ 263 _ 27

359. సీ. మహనీయసామ్రాజ్యమహిమ [1]వాయుటయును బితృమరణంబు నాభీలవిపిన
భూములఁ గడుదుఃఖమునఁ జరించుటయు వైదేహి గోల్పడి
వగఁ దిరుగుటయును
దుదిఁ బోయి యే[2]నిట్టు దొడరి యీదానవు[3]వాతఁ జిక్కుటయును వగవ నీకు
[4]బైపయిఁ బెక్కు లాపద లయ్యె నక్కట [5]ధరణీశ నీవు నాధరణిసుతయుఁ

---

పెనంగటు-స; జునితోడం బెనంగుట-అ. ఎ. 4. పరమాత్మునవతారంబగు నయ్యాది హరి (నిధను) రఘురాముం గనుంగొనుచు విగతజీవుండై పుణ్యలోకప్రాప్తుండయ్యె-అ. క. ట. వీ. స; విగతజీవుండై పుణ్యలోక ప్రాప్తుండయ్యె నయ్యిరువురు - శ; విగతజీవుండైన నయ్యిరువురు - గ. జ; విగతజీవుండయ్యె నంత నయ్యి రువురు-ఆ. ఎ. ఐ. త. 5. సగౌరవంబుగ - శ. ష. 6. సంస్కారంబులు నిజ - ఔ. క. 7. జనకునకంటె విశేషంబుగా - ఔ. ద; జనకుకన్న - స; జనకునట్లు లాచ - ల.

357. 1. నొప్పుకన్నులు - శ. 2. బృథూరుప్రదేశము - చ. 3. విస్ఫురిత - క. జ. సం. 4. గలభూమిధరోన్నతక-సం. 5. బాహుయుగ్మమున్ నరుదుగ-ఔ. ద; భారము-అం. ప్ర. ర. 6. సర్వ - ఆ. చ. క. జ. సం. 7. వాని దివిజారి కబంధుని-ఉ; వాని బటుసత్త్వని వారలు - ఆ. ఈ. ఐ గ; యట్టి దివిజారిని - క. జ. సం.

358. 1. యన్న-కొన్ని ప్రతులు; నను జూడవె యనుచు రాముజూచి యనియె మరియు-ల.

359. 1. వోవుటయును - క. 2. నిట్లు - పెక్కు ప్రతులు. 3. వలన - ఇ. ఏ; వశమున జిక్కుట వగవనీకు - శ. 4. బైపని - కొన్ని ప్రతులు; బైపైన - కొన్ని ప్రతులు. 5. ధారుణి నీవును ధరణి - ఉ; ధరణీశ నీవును ధరణి-ల. - పెక్కు

ఆ. గలసి [6]పూజ్యరాజ్యగౌరవంబున వెలుఁ, గంగ నెలమిఁ జూడఁ గాన నైతి
నేను దలఁప నెట్టి హీనభాగ్యుండనో,[7]యనుచు ననుజుఁ డార్తి నడలుటయును.

360. తే. విగతసంభ్రముఁ డై రామవిభుడు గడఁగి, యన్న లక్ష్మణ యోడకు మన్న యేను
గలుగ నీ కేల యాపద గలుగనేర్చు, [1]ననుచు గ్రక్కున నశితమహాసి వెటికి.

361. వ. ఆరక్కసు [1]డాచేయి దునియ వ్రేసిన లబ్ధమోక్షణుం డయి లక్ష్మణుండు ప్రకటసైంహికేయ [2]దంష్ట్రాయంత్రవిముక్తుం డయిన [3]తిగ్మభానుండునుం బోలెఁ బ్రదీప్తుం[4]డయి తీక్ష్ణగాఢేయకంబునఁ దదీయదక్షిణ[5]బాహుఖండనంబు సేసి పార్శ్వద్వయంబు [6]భేదించిన నాక్షణంబ కబంధుండు దివ్యరూపధరుం [7]డగుటయుం గని రాఘవుండు విస్మితుం డై.

362. క. ఈవనమునందు రాక్షస, భావంబున [1]నున్న నీకుఁ [2]బ్రకటితదివ్య
త్వావాప్తి యైన కారణ, మేవిధ మనుటయును నాతఁ డిట్లని చెప్పెన్.

363. వ. ఏను విశ్వావసుం డను గంధర్వుండ బ్రహ్మశాపంబునం జేసి రాక్షసత్వంబు [1]నొంది మీవలన శాప[2]మోక్షంబు వడసి[3]తి రావణుం డను రక్కసుండు జానకిం గొనిపోయి లంకానగరంబున నునిచినవాఁడు మీకు హితోపదేశంబు సేసెద నిట పోవంబోవఁ బంపాభిధానం బయిన సరోవరంబు గలదు దాని

---

ప్రతులు. 6. పూర్వరాజ్య – టౌ. ఘ. చ. 7. యనుచు నార్తితోడ నడలుట యును – ల. కొన్ని ప్రతులు.

360 1. నని యమోఘాసి గ్రక్కున నవ్విభుండు – టౌ.

361. 1. డాపలిచేయి – గ. చ. పి. శ. ష. 2. దంష్ట్రాంతర విముక్తు – ఎ. ఓ. గ; దంష్ట్రావిముక్తు – ఈ. ఐ. 3. గ్రీష్మభానుండు – ఆ. 4. డయి లక్ష్మణుండు తీక్ష్ణ – కొన్ని ప్రతులు. 5. బాహుదండంబు ఖండించి – గ; హస్తంబు ఖండితంబు సేసి – శ. ష. 6. ఖండించిన – ట. 7. డైనం గని – కొన్ని ప్రతులు.

362. 1. నుండి యిపుడు – అ. ఒ. జ. 2. బరమగు దివిష – ఇ. ఏ.

363. 1. నొందితి భవత్కౌక్షేయకంబువలన – ఈ. ఎ. ఐ. త; నొందితి నేడు భవత్కౌక్షేయకంబువలన – ఉ; నొందితి – కొన్ని ప్రతులు. 2. (వి) మోక్షితుండనైతిని – అ. ఓ. క. జ; మోక్షణంబు (బొ) నొందితి – ఊ. ఏ; విముక్తుండనైతి – టౌ. ద; మోక్షంబు నొందితి–ఇ. ఏ. 3. తిననిచెప్పి మరియు నిట్లనియె రావణుండు – టౌ. ద.

[4]యావల [5]బుశ్యమూకం బను శైలంబు[6]నందు వాలిసహోదరుండు సుగ్రీవుం డను వానరుండు సచివచతుష్ట[7]యసహితుం డై యుండు నతనితోడ సఖ్యంబు సేయుము దానం జేసి నీకుం గార్యసిద్ధి యగు నని పలికి గంధర్వుండు వారి వీడ్కొని నిజేచ్ఛం జనియెం దదనంతరంబ [8]యట చని చని.

364. సీ. కమనీయకమలినీ[1]కహ్లారదళ కేసరాన్వితజలముల నర్ఘ్యవిధియుఁ
దరళతరంగహస్తములఁ బాద్యంబు [2]నున్మదచక్రసారసమధుపహంస
రుతులఁ బ్రియోక్తులు రుచిర[3]వానీరనివేశనచ్ఛాయల విశ్రమంబు
మందసంచారితమారుతంబుల నురుతాప[4]నో[6]దనమును దగిలి యెప్పుడు

ఆ. నాచరించుచును సముచితాతిథిజన, సేవనమునఁ దనదుజీవనంబు
ఫలము నొంద [5]నొప్పు పంపాసరోవరం, బెదురఁ గాంచి [6]రన్న రేంద్రసుతులు.

365. వ. [1]ఆసరోవరతీరంబునం గౌసల్యానందనుండు [2]దత్తద్విషయవిశేషోల్లాసంబుల వలనం గ్రొత్త[3]యై చిత్తజానలంబు దరికొని చేతోవృత్తంబు నెరియింపం దొడంగినం దాల్మి దొఱంగి జానకిం బేర్కొని యాక్రందన [4]వచనవివశుం డగుటయు నతనికి లక్ష్మణుం డి ట్లనియె.

366 చ. పురుషవరేణ్య యిట్లు మిముఁ[1]బోఁటులకుం జనునయ్య యాపదల్
వొరసిన[2]చోఁ గలంగుట ప్రభుత్వ మెలర్పఁగ దాల్మి యూఁది దు
స్తరతరమానసవ్యథలు [3]దల్గుము సంభృతపౌరుషుండ వై
యరయుము దేవి యున్నయెడ యారసి కార్యము [4]దీర్పనేర్పునన్.

---

4. చేరువ - కొన్ని ప్రతులు. 5. బుష్యమూక - సంస్కృత ప్రతులలోఁ గలదు. 6. గలదందు - అ. జ; గలదు - ల. 7 యుండైయుండు - ఔ. 8. యచట గడచిచని - ల; యటుగడచి - ఇ. ఏ.

364. 1. కల్హార - పెక్కు ప్రతులు. 2. పృథుచక్ర - ఉ. ఔ. 3. వాస్తీరనివేశన - ఈ. ఐ. త. వీ. శ. ష. ళ. 4. నోదంబునందగిల - ఈ. ల. 5. నెసగు బంపా - కొన్ని ప్రతులు. 6. నరవరేంద్రసుతులు - ఔ.

365. 1. ఇట్లుగాంచి యాసరోవర - స; అసరోవరంబున - చ. ల. 2. దత్తద్వియోగాతి విశేష (పాది) విషయోల్లాసంబుల - స. ళ; దత్తద్విషయోల్లాసంబుల - ల. 3. యైన - ల. కొన్ని ప్రతులు. 4. వచన - ఈ. ఐ. ఓ. ప్రతులలోలేదు.

366. 1. బోంట్లకునుం దగునయ్య-కొన్ని ప్రతులు. 2. లోగలంగుట - ఇ. ఏ; బొంగ ణంగుట - ఒ; చో నలంగుట - శ. 3. దల్గగ జేయుము పౌరుషంబుమై - కొన్ని ప్రతులు. 4. దీర్పు మేర్పడన్ - స. శ. కొన్ని ప్రతులు.

౨౬౭. ఆ. అధిప శిష్యుఁడను సహాయుండ భృత్యుండ, నైన యేను గల్గ వాస్తు సిరి.
నేల వగవ నని మహీపతిచిత్తంబు, [1]నలఁత డిందుపఱిచె [2]నవరజుండు.

౨౬౮. వ. తదనంతరంబ యయ్యిరువురుం బంపాసరోవరంబునం గృతస్నాను లయి [1]దేవ
పితృతర్పణంబులు సేసి[2]చని ముందట నతిబహుళజలావాహ[3]వ్యూహాసన్నాహ
సమున్నతంబు లైన [4]యభంగోత్తుంగశృంగసముదయంబుల [5]నజలగగన
క్రోడపీడనంబు సేయుచున్నదాని ఋశ్యమూక[6]శైలంబుఁ జేరి [7]తదుప
కంఠప్రదేశంబున విశ్రమించి యున్నంత.

౨౬౯. సీ ఆరాజపుత్త్రుల నారూఢతేజుల [1]వీరుల నున్నతోదారభుజులఁ
గనుఁగొని సుగ్రీవుఁ డనఘుఁ డగ్గిరిశృంగమునందుండి తానును దన సచివులుఁ
జింతించి వారి[2]వృత్తాంతము నెఱుఁగంగ సంతతోత్సాహు ధీమంతు శౌర్య
వంతు [3]నుత్తము హిమవంతుఁడు బోని యత్యంతసుస్థిరు హనుమంతుఁ బనిచె
ఆ. నతఁడు నరిగి [4]నృపతిసుతుల తెఱం గెల్ల, నెఱిఁగి వనచరేంద్రు [5]నెఱుఁగఁ
జెప్పి
యుగ్రతేజుఁ డైన సుగ్రీవుతోఁ జెల్మి, యొనర సంఘటించె మనుజపతికి.

౨70. వ. సుగ్రీవుండును [1]మున్ను సీతాపరిత్యక్తం బై తమ ముంగటం బడినం [2]దాదు
గైకొని సంగ్రహించి యున్న భూషణనిచయంబు రామునకు నివేదించినం
జూచి యతండు సముత్సుకుం డై వానికి [3]వానరైశ్వర్యంబు [4]ప్రతిశ్రుతంబు

౨౬౭. 1. నడలు – ల. కొన్ని ప్రతులు. 2. ననుజుడవుడు – ఇ. ఏ. ఔ. చ. ల. ష.

౨౬౮. 1. దేవర్షిపితృ – ల. పెక్కు ప్రతులు. 2. యరిగి – అ. ఈ. ఉ. ఎ. ఐ శ.
3. వ్యూహామున్నతంబులైన – గ; సమన్వితంబులై యుత్తుంగ – ల. 4. యభంగ
శృంగంబుల – ఐ. త. 5. వలనగగన – ల. కొన్ని ప్రతులు. 6. పర్వతంబు –
ఈ. ఉ. ఎ. ఐ. త; శైలంబు గని చేరి–ల. కొన్ని ప్రతులు. 7. తదుపకంఠర ప్రదే
శంబు – స. శ.

౨౬౯. 1. ధీరుల – ఔ. 2. వృత్తాంతం బెరుగవేడి – ల. న. కొన్ని ప్రతులు. 3. నుత్తమ
హిమ – కొన్ని ప్రతులు; నుత్తమ సామంతుని – ఓ; నుత్తము హిమవంతునిబోని –
ఇ. ఏ. ఓ. ల. వీ. ష. శ. 4. భూపసుతుల – ఓ. చ. ల. 5. తెరుగ–ల. పెక్కు ప్రతులు.

౨70. 1. మున్ను – కొన్ని ప్రతులలో లేదు. 2. దారు సంగ్రహించిన భూషణ – ల.
కొన్ని ప్రతులు. 3. వానరేశ్వరత్వంబు – ఔ. 4. ప్రతిశ్రుతంబు – ల. న. కొన్ని

సేసి తదీయశత్రుం డైన వాలిం [5]జంపఁ బ్రతిజ్ఞ[6]సేసెఁ గపీశ్వరుండును [7]జానకిం దెచ్చుటకు సహా[8]యంబుగా నొడంబడియె [9]నంతట నందఱుం గూడికొని వాలినివాసం బైన కిష్కింధానగరంబున కరిగి రప్పుడు తాను [10]సూనుండును.

371\. క. వాలిగృహద్వారంబున, వాలి మదం బెసఁగ నార్చి [2]వారక బాహా స్ఫాలనము సేయుటయు [3]విని, వాలి మహారో[5]షదుర్ని[4]వారోద్ధతుఁ డై.

372\. వ. సమరసన్నా[1]హం బమర వెలువడం బోయినఁ దదీయ[2]వల్లభ యగు తార [3]యతని వారించి [4]యిట్లను నేఁటి చందంబు సూడ సుగ్రీవుండు [5]బలవత్స హాయుం డై వచ్చినవాఁ డది యెట్లనిన దశరథనందనుం డైన రాముండు రావణుచేత నపహృత[6]దారుం డయి నిజసహోదరుం డగు లక్ష్మణుండును దానును సుగ్రీవస[7]హాయత్వంబు పేక్షించి [8]యతని కార్యంబు దీర్పం బూనెనని వింటి నదియునుంగాక మహాబలు లయిన [9]మైందద్వివిదులు నతిలోక [10]పౌరుషుం డయిన హనుమయుఁ [11]బ్రసిద్ధబుద్ధి యగు జాంబవంతుండును వానికి మంత్రులై యుండుదురు గావున నీ[12]విప్పుడు గయ్యంబునకుఁ [13]బోక నాకిష్టంబు గా దనిన [14]నవ్వుచు నవ్వనచరవీరుండు.

---

ప్రతులు. 5. జంపుటకు – కొన్ని ప్రతులు. 6. సేసిన వాన రేశ్వ – అ. ఎ. త. 7. రావణుంజంపుట – కొన్ని ప్రతులు 8. యుండుగా–కొన్ని ప్రతులు. 9. నిట్లం దరుం – కొన్ని ప్రతులు; నంత నందరుం – ల. కొన్ని ప్రతులు. 10. సూనుండు– ల. శ. పెక్కు ప్రతులు.

371\. 1. వ్రాలి – ఒ. ఔ. శ. ష; వాలిన మద మెసగ నార్చి – ఇ. ఏ. ల; వాలిరవంబెసగ నార్చి – కొన్ని ప్రతులు. 2. వదలక – ల. పెక్కు ప్రతులు. 3. గని – అ. ఎ. త. 4. వారోద్ధతిమై నే – ఊ. శ.

372\. 1. హంబుమెరసి – ఒ. వీ. శ. ష; హం బలపడ – ఔ. ద. 2. వల్లభి – ల. కొన్ని ప్రతులు. 3. మగని – అ. జ. 4. యిట్లనియె నేటి – ల. 5. బలో త్సాహుండై – ఘ. 6. భార్యుం డయి – ల. కొన్ని ప్రతులు 7. హాయం – కొన్ని ప్రతులు. 8. వానికార్యంబు – పెక్కు ప్రతులు; వానికార్యంబు దీర్పంబూనిన వాడని – ఓ. ల. 9. మైంధద్వివిధులు – కొన్ని ప్రతులు. 10. పౌరుషుండగు హనుమంతుం డును – ల కొన్ని ప్రతులు. 11. బ్రదీప్త – ట. 12. విప్పు డెదురై కయ్యంబు– జ; విప్పుడు కార్యంబునకు – ట. 13. బోవుట – ల. కొన్ని ప్రతులు. 14. నవ్వుచు నవ్వనచరవిభుండు – ల. కొన్ని ప్రతులు; నవ్వనచరుండు – కొన్ని ప్రతులు; నవ్వీ రుండు – చ; నవ్వనచరవీరుండు – వా వీ. శ. ష. కొన్ని ప్రతులు.

౩౭౩ క. అవనిత వచనములు సు, గ్రీవవిషయపక్షపాత[1]కృత్రిమములుగా
భావించి యాదరింపక, తా వెడలె ననూన[2]బాహుదర్పం బెసఁగన్.

౩౭౪. వ. ఇట్లు వెడలి కట్టెదుర నున్న సుగ్రీవుం[1]జూచి యి ట్లనియె.

-: వాలిసుగ్రీవుల యుద్ధము :-

సం. 3 - 264 - 27

౩౭౫. తే. ఓరి[1]దుష్టాత్మ [2]యే నిట్లు పోరఁ బెక్కు, మాఱు[3]లెగువంగ సిగ్గఱి పాఱుచుండు
[4]నట్టి [5]నీకున్న యునికిన [6]యిట్టలముగ, నిట్టిబీర మెక్కడనుండి పుట్టెఁ జెపుమ.

౩౭౬. వ. అనినఁ బ్రహసితముఖుం డగుచు నబ్బలిముఖుం డి ట్లనియె.

౩౭౭. క. ఆలిని రాజ్యముఁ గోల్పడి, యాలంబునఁ [1]దూలపోయి యక్కట బ్రదుకిం
కేలా యని తెగువమెయిన్, [2]వాలిరణము సేయ నమరి వచ్చితి నీతోన్[3].

౩౭౮. తే. [1]చక్కఁ గమ్మింక ముందటి చందమొందఁ
గలదె [2]తొంటి సుగ్రీవుండు గాఁడు[3]నేఁడు

---

౩౭౩. 1. కృత్యంబులుగా - స. శ. కొన్ని ప్రతులు. 2. భావదర్పంబెసగన్ - న.

౩౭౪. 1. గని యతని కిట్లనియె - కొన్ని ప్రతులు.

౩౭౫. 1. దుర్మార్గ - ఈ. పొ. త; నీచాత్మ - ఇ. ఫ; దుష్టుడ - గ. 2. యేనెప్డు - ల. కొన్ని ప్రతులు. 3. లెదురంగ - అ. క. 4. దట్టి నీకున్న - అ. ఓ. జే; నట్టి నీయున్న - ఎ. ల; దట్టి నీకు నాయునికిన యిట్టలము వట్టిబీర మెక్కడనుండి వచ్చె- అ. ప్రాసయతి. 5. నీవున్నయునికిని - ఒ. చ; నీకిట్టలంబుగ ననికి నిట్టిపట్టునను బీరమెటనుండిపుట్టె - ఔ. 6. యిట్టిబీరమిట్టలంబుగ నెందుండిపుట్టె - కొన్ని ప్రతులు.

౩౭౭. 1. నోడిపోయి - ప. ల; గోలుపోయి-శ. 2. వాలిన మరి రణము సేయ వచ్చితి- ల; వ్రాలి మెనసి రణము సేయ వచ్చితి-శ. వ. వాలిరణం బిట్లు సేయవచ్చితి - ఒ. 3. ఈ పద్యము తరువాత 'ఎ' ప్రతిలో 'యివ్విధంబున' అను వచనము కలదు.

౩౭౮. చక్కనగుమింక...... మెందుగలదు - ఓ. ఔ. ఘ. ల; చక్కరమ్మింక ...... మెందు గలదు - జ; చక్కనగునింక ...... మెందుగలదు - ఊ. 2. వాటి - అ. క. జ. 3. సుమ్ము - ఎ.

నిన్నుఁ బోరివుచ్చి[4]కాని [5]పోనేర్చు నెట్లు
[6]ననుచు నుగ్రుఁడై యవ్వీరు నార్చి[7]కవిసె.

379\. వ. [1]ఇవ్విధంబున.

380\. ఉ. [1]భూవినుతప్రభావులు ప్రభూత [2]బలోద్ధతు లుగ్ర[3]వైరితే
జోవిజయుల్ నిరంతరయశో[4]జయకాంతులు భూరిభూరుహ
గ్రావ[5]నఖాయుధుల్ బలిముఖప్రవరుల్ [6]గడుఁ బొంగి వాలి సు
గ్రీవులు దాఁకి రొండొరు [7]లకృత్రిమరోషకషాయవక్త్రులై.

381\. మ. తరుసంఘంబులు [1]పూన్చి యొండొరుల నుద్యద్బాహులై [2]వ్రేయ ని
ష్ఠురవజ్ర[3]స్థలపాత[4]వేగవిరళస్తోకంబులై పోయె న
త్తరుసంఘంబులు వెండియుం గడఁగి [5]యుద్యల్లీల నయ్యోద్ధలుం
బరుషా[6]నేకశిలాప్రయోగముల [7]నొంపం జొచ్చి [8]రన్యోన్యమున్.

---

4\. కాక - ల. పెక్కు ప్రతులు. 5. పోనేర్తు నెట్టు లనుచు - ఆ. ఉ. గ. ల; పోనిచ్చు - ఔ. ద. 6. ననుచు నుగ్రుడై సుగ్రీవు డార్చి-ఇ. ఏ. ల; ననుచు సుగ్రీవు డుగ్రుడై యార్చి కదిసె - స; ననుచు నుగ్రుడై యవ్వీరు నార్చి తాఁకె - స. 7. కదిసె - కొన్ని ప్రతులు; కదిసి - ఆ ఈ. పో. త; తాకె - వీ. శ. ష.

379\. 1. ఈ ప్రకారంబుగా - ఎ; ఇవ్విధంబునందాకి - క. ట.

380\. 1. భూవిదితప్రభావులు - ల. స. కొన్ని ప్రతులు; భూవిదితప్రతాపులు - అ. ఎ. జ. త; భూవిదితప్రదీపులు - ద. 2. బలోన్నతు - ట. 3. ధైర్య - ఘ. 4. ధనకాంతులు - అ. ఔ. జ. ట. 5. నిజాయుధుల్ - ఔ. గ. ద. 6. వడి - ఔ. 7. నకృత్రిమ - కొన్ని ప్రతులు.

381\. 1. పూచి - పెక్కు ప్రతులు; జూచి - ల ? 2. వైవ - కొన్ని ప్రతులు. 3. స్థిర - పో. త. 4. నంబున నతి - ఇ. ఏ; వేగవివిధ-ఈ. పో. త; వేగవికల - ఉ. ల. వేగవిదళ - కద; వేగనిగళ - అ. 5. యుద్యల్లీల - ఔ. క. ద; మాద్య ల్లీల - వా. కొన్ని ప్రతులు. 6. వేళ - ఇ. ఏ. 7. నొవ్వం జొచ్చి - కొన్ని ప్రతులు. 8. రన్యోన్యులన్ - ఔ; రత్యున్నతిన్ - క.

382. క. అతులితశిలావితా[1]నం, బిత రేతర[2]తనునిపాత హేలా[3]సంచూ
ర్ణిత మగుటయు వారలు పటు, గతిఁ[4]గవిసిరి [5]బాహుయుద్ధ[6]కౌతుక
మతులై.

383. ఉ. ఒండొరుఁ బట్టుచుం [1]దిగుచు చొండొరుఁ [2]బాయుచు వ్రేయుచున్ మహో
ద్దండత నొండొరుం [3]దొలఁగఁ దాఁకుచు [4]నీఁగుచు [5]లోఁగుచుం [6]జలం
బొండొరు [7]మీఱు చొండొరుల యుద్ధతి సైఁపక [8]వీఁకఁ బోరి రా
ఖండలభానుసూను లవిఖండితచండ [9]భుజాప్రచండతన్.

384. శా. [1]దేహోత్సాహ మెలర్ప [2]నుద్ధతమదాంధీభూతులై యాహవో
త్సాహవ్యగ్రులు [3]విగ్రహంబు మిగులన్ సంరంభశుంభద్గతిన్
[4]బాహాబాహిఁ బెనంగ నప్పు డమరేంద్రబోధద్విపద్ద్వంద్వహే
లాహస్తద్వయగాఢకర్షణ[5]రణోల్లాసంబు విస్పష్టమై.

385. వ. మఱియు నన్యోన్యదంతనఖముఖవిఖండితశరీరులై హరివీరులు రుధిరధారలం
దడిసి [1]పుష్పితంబు లగు నశోకంబులుంబోలె నొప్పి [2]చలంబులు మెఱయం

---

382. 1. నము లితరేతర – ట. 2. సన్నిపాత – ఔ. ద. 3. సంపూర్ణిత – ఎ. 4. గదిసిరి – ట. 5. యుద్ధకేళి – ఊ. శ; మల్లయుద్ధ – క. జ. ట; బాహుయుద్ధకేళి – ఔ. ఘ. చ. స. 6. కౌశలపరులై – జ; కౌశలమతులై – క.

383. 1. దిరుగు – ఉ; విడుచు – ఔ. 2. బాహుల – చ. 3. దరలదాకుచు – స. కొన్ని ప్రతులు; దలరదాకుచు – ఎ. ఐ. ఖ. గ. ఘ. చ. త; దలకదాగుచు – ఏ. ల; దెరల – స. శ. 4 వీగుచు – కొన్ని ప్రతులు; లోగుచు – చ. 5. బొంగుచుం – ఈ. ఊ. త; లాగుచుం – ఏ. ఘ; గ్రాగుచుం – చ. 6. బలం – కొన్ని ప్రతులు. 7. మీరనొండొరుల – శ. కొన్ని ప్రతులు; మీదనొండొరులు – ఔ. శ. 8. వీక దాకిరా – క; పోరిరంతనా – గ. 9. భుజాప్రకాండతన్ – ల. శ; భుజాగ్రచండతన్ – ఇ. ఏ; భుజాప్రచండతన్ – గ. ద; భుజాప్రకాండతన్ – వా. పెక్కు ప్రతులు.

384. 1. దేహోద్రేక – ఈ. ఐ. త; దేహోత్సేక – ల. స. శ. కొన్ని ప్రతులు. 2. నుత్థిత మదాంధీ – వీ. శ; నుద్ధతమహాంధీ – ఔ. 3. నాగ్రహంబు – ద. 4. బాహాబాహిని బోరునప్పు – క. శ; బాహాబాహుల బోరునప్పు – ఊ. ఒ. ద; బాహుల్ బాహులబట్టి రప్పు – ఔ; బాహాబాహిత బోరు – చ; బాహాబాహి బెనంగునప్పు – ఉ. ఎ. ల. వీ. ష. 5. రసోల్లాసంబు – శ.

385. 1. పుష్పితాశోకంబులుంబోలె – ల. 2. చలంబు మెరయ – పెక్కు ప్రతులు; చలంబు నెరయ – కొన్ని ప్రతులు.

388\. మ. ఉరుఘర్మౌఘ[1]విఘాతసంవిహిత విశ్వోల్లాస మై [2]సంచల
త్సరసాంభోద[3]నినాదతూర్యరవమై చంచద్బలాకా[4]గరు
[5]ద్భరలీలానవచామరస్ఫురణ మై పర్జన్యసామ్రాజ్య మొ
ప్పె రమా[6]మందిర మై యుదగ్రశిఖినీపింఛాతపత్రంబులన్.

389\. వ. ఆసమయంబున నక్కడ.

390\. క. దానవనాయకు చెఱఁ బడి, జానకి యుఱఁబడిన [1]హరిణశాబము పోలెన్
[2]మానిని సంతతభర్తృ, [3]ధ్యానవివశ యగుచు నుండెఁ దాపం బెసఁగన్.

391\. వ. [1]అమ్మగువ కాపున్న దనుజాంగనలు [2]త్ర్యక్షియు [3]లలాటాక్షియుఁ ద్రిస్త
నియు నేకపాదయు దీర్ఘజిహ్వయు నజిహ్వయుఁ ద్రిజటయు నేకలోచ
నయు మొదలయిన[4]వారు పెక్కండ్రు వికృతాకారంబులతోడ నయ్యాలిం
బరివేష్టించి యహర్నిశంబును [5]నరక యదల్చువారు[6]ను బెలుచం దిట్టు
వారును [7]ఖరోష్ట్రనిస్వనంబులు సెలంగ [8]వెఱపించువారును ద్రిభువనాధి
పతి యైన [9]మన దశగ్రీవుం డొల్లని యీదుష్ట[10]మానుషిఁ బట్టి చెండి కండలు
[11]దిందు మనువారును నై [12]యున్న నయ్యుగ్మలి [13]గళద్బాష్పయు గద్గద
కంఠియు నగుచు నా[14]రాక్షసస్త్రీల కిట్లనియె.

---

388\. 1. వితాన – ఒ; విధూత – ద; విఘాతసంవిహిత – అ. ఈ; విశాఖ సంవ్యాతము – ఘ.
2. సాంద్రనిర్ఘరవారోత్కర వారిదప్రచయమై–ఉ; సంచరత్ – క. 3. వివాద–వ.
4. గమత్వర – ఈ. చ. త. 5. ద్వారశీలా – ఎ. 6. మండితమై – ఙ. ద. అ.

390\. 1. హరిణచందముపోలెన్ – ఎ. ఏ. ఓ; హరిణచందంబునన – క. 2. మానిని
సంభృత – ఊ 3. ధ్యానావశయగుచు – ఔ.

391\. 1. అమ్మగువకుగాపున్న – ల. 2. దీప్తాక్షియు – పెక్కు ప్రతులు. 3. దీర్ఘ
జిహ్వయు నేకస్తనయు – ఈ. ఐ; ఈవచనమున పేళ్ళు వివిధముగా మన్నవి.
4. రాక్షసస్త్రీలు పెక్కండ్రు వికృతాటోపంబులతోడ – ఉ. 5. నేమరక – క.
పెక్కు ప్రతులు. 6. ఘనదంష్ట్రనిస్వనంబులు – ఈ. ఉ. ఐ. త; ను బెలువం
దిట్టు – ట. ద. 7. ఘనదంష్ట్రనిస్వ – ఆ. గ. జ. 8. వినిపించు – ఊ. 9. మన–
పెక్కు ప్రతులలో లేదు; యీ పురుష దశవదను – క. ఏ; దశకంధరు – ఓ ఖ
10. భామిని – కొన్ని ప్రతులు; మానిని – కొన్ని ప్రతులు. 11. దిందమను –
కొన్ని ప్రతులు; తినువారమనువారునై – ఓ. 12. యుండ – కొన్ని ప్రతులు;
13. బాష్పగద్గదకంఠయగుచు – ల. కొన్ని ప్రతులు. 14. రక్కసియల – న.
కొన్ని ప్రతులు; రక్కసియబల – కొన్ని ప్రతులు; రాక్షసభామల – ఓ; రాక్షసాం
గనల – ఆ; రక్కెసల – ల. వ.

392\. తే. అమ్మలార మీ[1]వలసినయట్ల చేయుఁ, డిది నేటికిఁ బదియంగ నేను రాము
[2]దప్ప నొండొక పురుషుఁ జిత్తమునఁ దలఁప, నింత నిజము [3]నాకును
జీవితేచ్ఛ లేదు.

393\. వ. అనిన [1]నజ్జానకి తెగువ రావణున కెఱింగింపఁ గొంచనియు ననిరి మఱియు సంతత[2]ప్రియవాదినియు ధర్మజ్ఞయు [3]నైన త్రిజట యను రక్కసి [4]రామాంగనం జేరం జని యిట్లనియె.

-: త్రిజట దన స్వప్నవృత్తాంతము సీతతోఁ జెప్పుట :-
సం 3 - 264 - 53

394\. సీ. [1]అమ్మ నీ కెంతయు హర్షంబుగా నొక వార్త [2]నెఱింగింతు వనజవదన
నామాట నిజముగా నమ్ముము [3]వినవె యవింధ్యుఁడు నాకు [4]వృద్ధధైర్యుఁ
డనఘుండు రామహితాన్వేషి యై నీకు నా కిట్లు చెప్పె నింకిట నిల నన్నుఁ
బనిచెను[5] విను నిన్నుఁ బాసిన పిదప లక్ష్మణుఁడును దాను వనమునఁ గలసి

ఆ. యఖిలవానరేంద్రుఁ డైన సుగ్రీవుతోఁ జెలిమి సేసి [6]యిపుడు శీఘ్రమునన
వీరవరుఁడు నిన్ను విడిపించుపనికి నై, [7]యొదవి యుత్సహించి
యున్నవాఁడు.

395\. వ. రావణునకు రంభానిమిత్తం[1]బయిన నలకూబరు శాపంబు గలదు గావున [2]నీయందు బలాత్కారంబు సేయ[3]రాదు నీకు వీనివలని భయంబు

---

392\. 1. వలచినయట్ల - త. 2. దక్క - ఉ. క. 3. నాకిజీవి - జొ.

393\. 1. విని జానకి - జొ; జానకి తెగువ - ల. 2. ప్రియాలాపయు - ఒ. 3. నైన యది త్రిజట - కొన్ని ప్రతులు. 4. రాముని దేవింగని - ఘ; రామాంగనం గదిసి యిట్లనియె - గ.

394\. 1. అమ్మనీకెంతయు - న. 2. (నె) యెఱింగింతు - ల. పెక్కు ప్రతులు. 3. వినయ సంవిదుడు నా గల డొక్క - ఇ. ప. ఓ. చ; వినవెయవిద్ధుండు - కొన్ని ప్రతులు; వినుము య విద్ధుండు - ల. 4. వృద్ధధైర్యుడనఘుండు- న. 5. రాముడు నిన్ను - ల. కొన్ని ప్రతులు. 6. యిపుడశీఘ్రమునను - ల. 7. యువిదయుత్స - ఏ; యొదవి నుత్స - ల. శ; కొన్ని ప్రతులు; యొనర నుత్స - ఘ.

395\. 1. బైన - ఈ. మ; బుగానైన - అ; బుననలకూబరు - చ. 2. నీయెడ - ఉ; నీవలన - ట. 3. రాదు వీనిభయంబు వలవదు - చ; రాదు మరియిద్దు - ఒ.

[4]వలదు[5]మఱి యిద్దురాత్మునకుం జేటు [6]దెలుపునట్టి దుస్స్వప్నంబుఁ [7]గలిగె
నది యాకర్ణింపుము.

396\. క. ఖరములఁ బూనిన రథమున, విరిసిన వెం్రుకలు [1]వెంట వ్రేలఁగ వరకం
ధరుఁడు బహుళతైలా[2]ప్లుత, శరీరుఁడై దక్షిణంబు [3]సనఁ గలఁ గంటిన్.

397\. తే. అతని[1]చుట్టును గుంభకర్ణాదులెల్ల, నరుణమాల్యానులేపను లై [2]వికీర్ణ
[3]పతితకేశులై [4]నగ్నులై పరగఁ బ్రేత, పతి [5]దిశకు నేఁగుగతి
గానఁబడియె వాకు.

398\. ఉ. [1]చారుసితోష్ణవారణలసత్సితమాల్యసితాంగరాగుఁడై
ధీర[2]గుణోత్తరుం డధికధీనిలయుండు విభీషణుండు వి
స్ఫారసితాద్రిశృంగమున భవ్యుఁడు మంత్రిచతుష్టయాన్వితుం
డై రమణీయలక్ష్మిఁ బొలుపారఁగ [3]నేఁ గల గంటి నుగ్మలీ.

399\. చ. తన సితకీర్తి విశ్వవసుధాగగనాంతరపూరితంబుగా
ఘనభుజుఁ [1]డున్నతద్విరద[2]కంధరసుస్థితుఁడై ముదంబుతో
ననుజుఁడు దాను రాఘవకులాగ్రణి [3]సన్మధుసిక్తపాయసం
బొనర భుజింపఁ గంటి వికచోత్పలలోచన నిక్కమింతయున్.

---

4\. వలవదు — ల. కొన్ని ప్రతులు. 5. మరియు (ని) నద్దు — ల. కొన్ని ప్రతులు.
6\. గలుగునట్టి దుస్స్వప్నంబును గాంచితి — ల. 7. గంటివాకర్ణిం — గ; గాంచితి—
ఈ. ఉ. ఎ. త; గలిగియున్నయది యాకర్ణింపుము—ఇ.

396\. 1. వెనుక — ఎ. ఐ. ల; వెనక — ఈ. ఉ. త. ద; నెరసి — జ. 2. వ్రుత — కొన్ని
ప్రతులు. 3. సనగనుగొంటిన్ — స. కొన్ని ప్రతులు; సనగనుగంటిన్ — వ. కొన్ని
ప్రతులు.

397\. 1. చుట్టలు — జ. ల. స; చుట్టాలు — కొన్ని ప్రతులు. 2. విముక్త — న. కొన్ని
ప్రతులు. 3. భయద — ల. స. కొన్ని ప్రతులు; పలిత — ఓ. శ. ష. న. పరిత —
కొన్ని ప్రతులు. 4. యందరు — ఉ. ఘ. మునుకొని — జొ; యంతకు వరగు — చ.
5\. దెసకు — ఇ. ఉ. ఏ. ద. స; దిశకునేగు కలగానబడియె — ఐ.

398\. 1. చారుసితాంబరుండువిల — ల. వీ. ష. శ; చారుసితోష్ణధారణ — జొ. చ.
2\. గుణోన్నతుండధిక — ఆ. ఈ. ఉ. ఐ. త; గుణోత్తరుం డఖిలధీ—గ. న. 3. నేలగ
గంటి — చ. ట. త. స; నేలగగంటిగోమలీ — ట.

399\. 1. డుజ్జ్వల — ఘ. 2. కంఠతటస్థితు — ఆ. ఉ. ఎ. స; కంఠతటస్ఫుటుడై — ఈ.
ఐ. త; కంధర సంస్థిరుడై — గ; కంధరసుస్థిరుడై — ఇ. ఘ. జ. ద. వ. స. శ.
3\. సన్మధుమిక్త — చ. ద.

404\. క. ఏల [1]మదిరాక్షి వలవని, జాలిం బడి నవసెదవు [2]లసద్భూషణాళీ
లాలంకృతవై ననుఁ గృప, నేలికొనం [3]గదవె వేయు నేటికి [4]నీఁకన్.

405\. చ. అనిమిషయక్షరాక్షస వియచ్చరకిన్నరపన్నగాసురాం
గనలఁ గరంబు చిత్తమునఁ గైకొన కే ననురాగశీలనై
నిను మది నాదరించు[1]టిది నీదగుభాగ్యము గాదె యింతయుఁ
వనిత యెఱుంగవైతి గరువంపు విచారము [2]లేల నీయెడన్.

406\. ఉ. రాముఁ డనంగఁ బేర్మి[1]యుమ రాజ్యముఁ గోల్పడి కానలోన దుః
ఖామయమగ్నుఁడైన యొక యల్పమనుష్యుఁడు వానిపైఁ గడుం
బ్రే[2]ముడి సేయుచుఁ [3]వగపువెల్లునఁ జిత్తము [4]వల్లడిల్లఁగా
నీ మెయి [5]నుండు నీయునికి యేసుఖ[6]మంద్రు లతాంగి చెప్పుమా.

407\. వ. [1]ఏను సకలలోకేశ్వరుండ నాకుం గింకరులై పదునాలుగుకోట్లు [2]నిశాచర
భటులును [3]నిరువదియెనిమిదికోట్లు రాక్షసులు[4]ను నెనుబదియాఱు కోట్లు
యక్షులును [5]వర్తిల్లుదురు [6]నిఖిలధనాధ్యక్షుం డయిన యక్షేశ్వరుండు
[7]నాయగ్రజుండు బ్రహ్మసమానుం డగు విశ్రవసుండు మదీయజనకుండు
గుబేరునకు వినోదపాత్రంబు లైన గంధర్వాప్సరోగణంబులు నన్ను
[8]సేవించుఁ బంచమలోకపాలుం డని నన్నుఁ ద్రిభువనంబులుఁ [9]గీర్తించు

---

404\. 1. వనజాక్షి – జ. 2. లసద్భూషాలీలా – శ. 3. గాదె – ల. వ. శ. పెక్కు ప్రతులు. 4. నీకున్ – చ.

405\. 1. టది – ఊ. ఏ. శ; నది – చ. 2. లేదు – ల. శర. స. సూ. కొన్ని ప్రతులు

406\. 1. యువరాజ్యము – ఈ. 2. మము – కొన్ని ప్రతులు. 3. వగలవెల్లువ – ఎ. ఓ. ఔ. ల. వీ. శ; వగపువెల్లుగ – ఊ. 4. వల్లటిల్లగా – ఔ; వల్లడింపగా – ఊ. 5. నిందునీయునికి – కొన్ని ప్రతులు. 6. మందు – చ.

407\. 1. ఏను మేనుసకల – క. జ. ల. 2. పిశాచభటులు – కొన్ని ప్రతులు; నిశాచరులును – గ. చ. 3. నిరువై యెనిమిది – ఇ ఉ; నిరువదెనిమిది – ల; నరువదియెనిమిది – ఔ. 4. నేబదియారుకోట్లు – స. కొన్ని ప్రతులు. 5. తొంబదితొమ్మన్నూరుకోట్లు భేతాళులును – గ; ప్రవర్తిల్లుదురు – అ. ఉ. గ. ల. 6. తక్కిన నిశాచరు లసంఖ్యులుం గలరు – గ. 7. భ్రాతబ్రహ్మ – ఔ. 8. సేవింతురు – కొన్ని ప్రతులు; సేవింపుదురు – ల. 9. గీర్తించుచుండు – ఎ. చ; గీర్తింపు

భక్ష్యభోజ్యాది[10]వస్తువులును [11]సురేశ్వరగృహంబునం దెట్లట్ల నాగృహం బు[12]న నక్షయంబు లిట్టి నా[13]విభవం బింతటికిని మదీయజీవితంబునకు నధీశ్వరి వై [14]సుఖంబున భోగింపు మనిన [15]విని వైదేహి [16]క్రోధశోకవ్యాకుల హృదయ యగుచు వానిదెసం జూడక యొక్క [17]తృణాంకురం బుపలక్షించి యి ట్లనియె.

408. సీ. అకట పరాంగన నబల బతివ్రతఁ బరికింపఁగా మర్త్యభామ నేను
రాక్షసుండవు నీవు రాగంబు మది నించుకయు లేని నాదు సంగమమునందుఁ
గలిగెడు నట్టి సౌఖ్యం బెంత యదియును గాక [1]యాఢ్యుం డైన కమలగర్భు
పౌత్త్రుఁడ నని లోకపాల[2]తుల్యుఁడ నని హరసఖుం డైన ధనాధినాథు
ఆ. భ్రాత నని భవత్ప్రభావంబు సెప్పితి, విట్టి నీవు [3]ధర్మ మెఱిఁగి దురిత
వర్తనంబు [4]విడువ వలదె [5]సిగ్గేది యి, ప్పగిదిఁ బ్రల్లదములు వలుకఁ[6]దగునె.

409. వ. అని పలికి [1]జానకి యుత్తరీయసంవృతవదన యై యతికరుణంబుగా నేడ్చిన నద్దురాత్ముండు వెండియుఁ గొన్ని దుర్వచనంబులు [2]పచరించి యనంతరంబ యంతర్ధానంబు [3]నొందె నప్పొలతియు నెప్పటియట్ల [4]రాక్షసీరక్షిత యై యుండె నని మార్కండేయుండు ధర్మరాజునకు [5]నిర్దేశించిన తెఱఁగు[6]వైశంపాయనోక్తం[7]బైన యాఖ్యానంబు విఖ్యాతమాధుర్యమనోహ [8]రంబుగా.

---

చుండు - అ. గ. 10. సమస్తవస్తు - కొన్ని ప్రతులు. 11. సురేంద్రు - కొన్ని ప్రతులు; సురేశ్వరు మందిరంబునం - ల. 12. నందక్షయంబు - ఉ. ఎ; నందట్ల క్షయంబు - ఘ; ననక్షయంబులై యుండు - చ. 13. విభవంబు లన్నింటికిని - ఒ. ఘ. ద. ల; విభవంబు లన్నిటికిని - ఇ. ఏ; విభవంబులింతటికి - ఈ. ఉ. ఎ. ఐ. 14. సుఖంబనుభవింపుమనిన వైదేహి - ఇ. ఏ. ఐ. క. ల. స; సుఖంబున జీవింపు మనిన - స. శ. పెక్కు ప్రతులు. 15. విని - పెక్కు ప్రతులలో లేదు. 16. శోక వ్యాకులచిత్తయగు - ఒ; క్రోధశౌర్యాకులయగుచు - ద; క్రోధశోకవ్యాకుల మానసయై - ల; క్రోధశోకవ్యాకులితయగుచు - క; క్రోధశోకవ్యాకులయై - ఇ. ఏ; క్రోధశోకవ్యాకులయగుచు - శ. 17. తృణంబుపలక్షించి - ఉ. ఐ. త; తృణాగ్రంబుపలక్షించి - ఘ; తృణాంకురంబు పరికించి - ద.

408. 1. యాఢ్యుండైన - స. కొన్ని ప్రతులు; యార్యుండైన - జ. 2. ముఖ్యుడనని - ల. శ. ష 3. ధర్మమెరిగి - కొన్ని ప్రతులు. 4. లుడుగ - అ. ఏ. 5. సిగ్గరి - ఒ. ఓ. జ; సిగ్గారి - చ; పెంపేది - వీ. శ. ష. 6. జనునె - కొన్ని ప్రతులు.

409. 1. జానకి - పెక్కు ప్రతులలో లేదు. 2. పలికి - వీ. శ. ష; వచియించి - ల. 3. జేసె - ఏ. ఓ. ఔ; చేసెనప్పొలతి యెప్పటియట్ల - ల. 4. రాక్షసరక్షిత - కొన్ని ప్రతులు; రాక్షససంరక్షిత - ఈ. ఐ. గ. త. ద. 5. నుద్దేశించిన - ఘ. చ; నెరింగించిన - వీ. ష. 6. జనమేజయుండు వైశంపా - జ. ల. 7. బయ్యెనీ వ్యాఖ్య - ఈ. ఐ. త. 8. రంబుగా నాకర్ణించెనని - ల.

410. క. విమలక్షాత్ర [1]గుణోన్నత, విమలాదిత్యాత్మజన్మ విలసత్కమలా
రమణీకరకమలోజ్జ్వల, [2]విమలాంబుజరేణురాగ[3]విలసితవక్షా.

411. వనమయూరము.

భూసురకదంబసురభూరుహ వికాసో
ద్భాసిత [1]కృపారసవిపాక [2]సుగుణైకో
[3]ల్లాస హారహీర మృగలాంచన మృణాళీ
[4]హాసినవకీర్తి[5]విసరాకలితలోకా.

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతంబునం దారణ్యపర్వంబునందు దుర్యోధను ప్రాయోపవేశంబును బాతాళ[1]గతు లయిన [2]దానవు లతని నాశ్వా[3]సించుటయు[4] వైష్ణవయాగప్రవర్తనంబును బాండవులు [5]గ్రమ్మఱం గామ్యకవనంబున [6]కరుగుటయు [7]వ్రీహిద్రోణాఖ్యానంబును ద్రౌపదీహరణంబును జయద్రథుభంగంబును రామాయణకథాప్రవృత్తియు నందు రామరావణుల జననంబును రాఘవు వనప్రస్థానంబును సీతాపహరణంబును సుగ్రీవమిత్రత్వంబును, వాలివధయును ద్రిజటాస్వప్నకథనంబును రావణుదుష్టవచనంబులు నన్నది [8]షష్ఠాశ్వాసము.

---

410. 1. గుణోజ్జ్వల – ఈ. ఐ. 2. విమలాంభోరాశిరాగవిలసిత – ఔ. ద; విమలాంబుజ వేణుగాన వికసితవదనా – ఈ. ఐ. త. 3. వికసితరక్షా – స. శ$_1$; వికసితదీక్షా – గ. స. శ$_1$; విలసితదీక్షా – ద.

411. 1. కృపాణకరుణైక – ఔ. 2. గుణధైర్యో – గ. 3. ల్లాసిదరహాస – ఇ. ఈ. ఉ. ఐ. త; ల్లాసమదహాస – ఊ. ఎ; ల్లాసదరహాస – ల. కొన్ని ప్రతులు; ల్లాసహారహాస – ఔ. స. శ. 4. హాసనవకీర్తి – ఈ. చ. త; హాసనిత – ఊ. 5. విసరాశినతలోకా – క.

412. 1. వాసులయిన – ఒ. ఓ. ల. 2. రాక్షసు – కొన్ని ప్రతులు. 3. సించి వీడుకొల్పుటయు – ఓ. ల. 4. కౌరవేశ్వరుండు క్రమ్మరి కరిపురంబున కరుగుటయు వైష్ణవ – ఎ. ల; వైష్ణవ యాగంబును – ఆ. ఎ. ఝ. ల; వైష్ణవ యాగంబును వ్రీహిద్రోణకాఖ్యానంబును – ఈ. ఉ. ఐ. త. 5. సైంధవుచేత ద్రౌపదీహరణంబును జయద్రథుభంగంబును రామాయణ కథా – ఈ. త. 6. కు వచ్చుటయు – ఎ. ఓ. చ. 7. వ్యాస భట్టారకుండు చనుదెంచుటయు ద్రౌపదీ – ఒ; వ్రీహిద్రోణకాఖ్యా – ల. కొన్ని ప్రతులు. 8. ఈ గద్యము వివిధ ప్రతులందు వేరువేరు విధములుగా నున్నది.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము - సప్తమాశ్వాసము

—o—o—o—

1. క. శ్రీకర సోమాన్వయర
త్నాకరహిమధామ ధార్మికాంచితవినయో
త్సేక [1]భువనైకవీర మ
హాకావ్య రసప్రయోజనారూఢమతీ.

-: రాముఁడు లక్ష్మణుని సుగ్రీవునొద్దకుఁ బంపుట :-

సం. 3 - 266 - 4

2. వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం [1]జెప్పె నట్లు పరమతపో[2]నిలయుం డయిన మార్కండేయుండు పాండవేయులతో మఱియు [3]నిట్లనియె నంత మాల్యవత్కందరమందిరుం డైన దశరథాగ్రనందనుండు [4]నవకందళితసుందరంబులును జనకనందినీవియోగదుస్సహంబులు నగు [5]ఘనసమయదివసంబుల నెట్టకేనియుం గడపి నిరతిశయసాంద్రచంద్రాతపసన్నపనశీతలసమీర వాహ్యమాన వినిద్రకుముద[6]కేదారసౌరభ్యనిర్భరంబులు నతిదీర్ఘయామంబులు నైన శారద [7]యామినులు సైప[8]నోపక యొక్కనాఁడు దమ్మునిం జూచి యిట్లనియె.

---

1. 1. రమణీయ వరద మహా - ట.

2. 1. జెప్పినట్లు - పెక్కు ప్రతులు. 2. నిరతుండైన - ఇ. ఏ. 3. నిట్లను, నట్లు మాల్య - ఆ. ఉ. ఎ. ల. వీ. శ. మ. 4. నవనందనవల్లీ సుందరం - పెక్కు ప్రతులు. 5. నాఘన దివసంబుల - ఈ. ఉ. ఎ. ఐ. క. త. వీ. శ. మ. 6. కైరవ- కొన్ని ప్రతులు. 7. యామిను లవనయింప నోపక - వా; యామనులు సైనోపక - పెక్కు ప్రతులు. 8. నేరక - పెక్కు ప్రతులు.

3. సీ. చూచితే లక్ష్మణ సుగ్రీవుకొలఁగామి యమ్మెయిఁ దనపగ యడఁచి మనము
కపిరాజ్య మిచ్చినఁ గైకొని యింద్రియసుఖముల నెంతయుఁ జొక్కి నేఁడు
మనదిక్కు [1]దలపఁడు మనతోడఁ బల్కినసమయంబుఁ జెల్లింపఁ జనదె తనకు
గడుఁ గృతఘ్నతసేసెఁ గపికులాధముఁడు నీ వనఘ కిష్కింధకు నరుగు మిపుడ

ఆ. యద్దురాత్ముఁ గృపణు నాత్మీయకార్యత, త్పరుని నధికరాగపరవశాత్ముఁ
దొడరి వాలి చనిన [2]త్రోవన యనిచి ర, మ్మేల తడయ మనకు నింక నిచట.

4. ఆ. నీవు సనకమున్న నెఱితోడ మనకార్య, మునకుఁ దగిన యత్నములు [1]ఘటించి
యుండెనేని వాని నొండేమియుం జేయ, వలదు తోడితె మ్మవార్య [2]శౌర్య.

5. చ. [1]అనుడుఁ దదాజ్ఞఁ బూని యతఁ డాతతకార్ముకహస్తుఁ డై రయం
బునఁ [2]జనియెం గపీశ్వరునిప్రోలికి వాఁడును సంభ్రమంబుతో
ననుఁగులుఁ దాను రాజసుతు నర్థి నెదుర్కొని మ్రొక్కి యర్ఘ్యపూ
జన మొన[3]రించుచుండ విభునిశాసన మాతఁడు సెప్పె వానికిన్.

6. వ. చెప్పిన విని భయకంపితగాత్రుం డగుచుఁ గమలమిత్త్రపుత్త్రుండు సుమిత్త్రాపుత్త్రున కి ట్లనియె నయ్యా యే నేల కృతఘ్నుండ నగుదు జానకి నన్వేషించుటకు నై బలవంతులు బుద్ధిమంతులు నగు వానరుల ననేకుల నలు దెసలకుం బనిచితి వారును సకల వన శైల [1]సాగర నగర గ్రామ నదీసహితం బైన భూచక్రంబునం దెల్ల రోసి యొక్క మాసంబులోనం గ్రమ్మఱి వచ్చువా రై సమయంబు సేసి పోయి రింక నైదుదినంబులు గొఱంత యింతియ యటమీఁద వైదేహీవార్త గొనుచు [2]దేవరం గొలువ వచ్చువాఁడ నై యున్నవాఁడ ననినం బ్రీతుం డై లక్ష్మణుండు.

---

3. 1. బలుకడు – ఈ. ఐ. త. 2. త్రోవనే – వా. పీ; త్రోవన – కొన్ని ప్రతులు.

4. 1. వహించి – పెక్కు ప్రతులు. 2. చరిత – వా; శౌర్య – పెక్కుప్రతులు.

5. 1. అనిన – కొన్ని ప్రతులు. 2. గపినాథుపాలికిని బోయిన వాడును – ఆ. ఈ. ఉ. ఎ. ఐ. త. పీ. శ. 3. రింపుడున్ – కొన్ని ప్రతులు.

6. 1. సాగరగ్రామ–వా; సాగర నగర గ్రామంబులు లోనుగా భూచక్రం బెల్ల వెదకి – పెక్కు ప్రతులు. 2. రామదేవుం – పీ. శ. ష. కొన్ని ప్రతులు.

7. క. వానిం దోడ్కొని చని యా, భూనాథునిఁ [1]గానుపించి పొందుగఁ దత్కా
[2]ర్యానుష్ఠానవిశేషము, దా నెఱిఁగించుటయు విభుఁడు దద్దయు నలరెన్.

8. వ. పదంపడి [1]కొన్ని దివసంబులకుఁ బూర్వపశ్చిమోత్తర[2]దిక్కులకుం జనిన వనచరు లరుగుదెంచి రాఘవుం గని దేవా సకలసాగరమేఖలావలయితం బైన భూవలయుం బంతయు వెదకితిమి [3]దేవిం బొడగాన మని చెప్పిన నతండు దుఃఖితుం డయి దక్షిణదిశకుఁ బోయిన [4]వానరులవలన వైదేహితెఱం గెఱుంగుదు నను నాసం జేసి ప్రాణంబులు ధరియించి [5]యుండె నంత వెండియు నొక్క మాసంబు సెల్లినఁ గొందఱు [6]వనచరులు పఱతెంచి సుగ్రీవుం గని యి ట్లనిరి.

9. సీ. నీవును వాలియు నేఁడును నాఁడునుఁ [1]బ్రియమునఁ బాటించు పెద్దతోఁట
మధువనం బదె నేఁడు మన యంగదుండును హనుమంతుఁడును మొదలైన వారు
బలువిడిఁ జూఱాడి ఫలము లానెదరు తద్రక్షకు లగు మమ్ము రయము మీఱ
భంగించి రనవుడు భానునందనుఁ డాత్మ నంగదప్రముఖులు యామ్యదిశకుఁ

తే. జనినవారలు గావున జనకపుత్త్రిఁ, గనిన యు బ్బిది గాఁబోలుఁ గాక యిట్లు
సేయ వెఱవరె పతికార్యసిద్ధి సలుపు, జనుల కీ చన వెందును జనునకాదె.

10. వ. అని యూహించి తత్ప్రకారంబు రఘుపతికిం జెప్పె నంత.

11. ఉ. [1]తేనెలు గ్రోలి క్రోలి కడుఁ దియ్యని కమ్మనిపండు లింపు సొం
[2]పానఁగ నాని యాని పర పందిన నీడలు [3]మెచ్చి మెచ్చి మం
దానిలశైత్యసౌరభసమగ్రతకుం గడుఁ [4]జొక్కిచొక్కి యు
ద్యానమునందు మారుతసుతప్రముఖుల్ విహరించి తృప్తులై.

---

7. 1. గానుపింప బొందుగ – శ. ష; గానిపించి – సూ. సం. పీ. వా. 2. ర్యానుష్ఠానం బంతయు దా – ఈ. ఐ. త.

8. 1. కొన్ని దివసంబులకు – ఇది కొన్ని ప్రతులలో లేదు. 2. దిగ్భాగంబులకుం జనిన – పీ. శ. ష. 3. మీదేవిం – అ. ఉ. జ. ట. వా. పీ. శ. ష. 4. వారివలన–కొన్ని ప్రతులు. 5. యున్నంత వెండియు–కొన్ని ప్రతులు. 6. వానరులు–పెక్కు ప్రతులు.

9. 1. నయంబు పాటించు నాకతోట – పెక్కు ప్రతులు. (ఆఁకతోట – అజ్ఞ వెట్టిన తోఁట); నయంబు పాటించునట్టితోట – ఎ.

11. 1. తేనియ – కొన్ని ప్రతులు. 2. పూనగనాని యాని పరపొందిన – అ. ఈ. ఊ. ఐ. ఒ. ఓ. ఔ. క. ఘ. జ. త. 3. చొచ్చి చొచ్చి–శ. ష. 4. మెచ్చిమెచ్చి–శ. ష.

12\. వ. అందఱుం గూడుకొని చని సుగ్రీవలక్ష్మణసహితుం డై యున్న జననాథుం గని దండ[1]ప్రణామంబులు సేసినం గాకుత్స్థకులప్రదీపకుండు [2]వారల ముఖవర్ణవిశేషంబు లుపలక్షించి సీతం గనినవారకా నిశ్చయించె నప్పు డత్యంత మతిమంతుం డయిన హనుమంతుండు రాఘవునకుఁ గృతాంజలి యై యిట్లనియె.

13\. క. దేవిఁ బొడగంటి నేను ధ, రావల్లభ శైలసరిదరణ్యానగరపా
రావారకలిత మగు వసు, ధా[1]వలయము వెదకి వెదకి దక్షిణపు [2]దిశన్.

*-: హనుమంతుఁడు రామునితో సీతం జూచిన వృత్తాంతంబు సెప్పుట :-*

సం. 3_266_38

14\. తే. అవధరింపుము దేవ నేమందఱము న, నేకముఖమునఁ దొలితొలి యిందు నందు
నరయుచును బోయి యొక్కెడ నతివిశాల, మైన భూవివరము గంటి మద్భుతముగ

15\. వ. కని దానిం బ్రవేశించి నిరంతరతిమిరసంవృతంబును బహుకీట[1]సంకులంబును నైన మార్గంబున ననేకయోజనంబులు సనునెడ ముందట నర్కప్రకాశం బైన పురంబు గానంబడియె నం దొక్క తాపసాంగన యుండి మమ్ము నాదరించి తనపేరు ప్రభావతి యనియును నప్పురంబు మయుని పురం బనియునుం జెప్పి మధురంబు లయిన భక్ష్యభోజ్యంబు లొసంగినం దృప్తుల మై తదుపదిష్టమార్గంబున మహీవివరంబు నిర్గమించి సహ్యాదర్దురశైలంబులు గడచి మలయశైలశిఖరం బెక్కి.

16\. స్రగ్ధర.
లీలం గల్లోల [1]మాలోల్లిఖితగగనమై లీననానాకులీర
వ్యాళోగ్రగ్రాహమీనావళుల నెసఁగి దుర్వార[2]వారోఘగంభీ
రాలంఘ్యప్రౌఢవేగం బగుచు బహుతరాయామవిస్తార మై బి
ట్టాలోకింపంగ నుగ్రం బగు జలనిధి [3]నంతంతటం గంటి మంతన్.

---

12\. 1. ప్రణామంబు – పెక్కు ప్రతులు. 2. వారిముఖవర్ణ – పెక్కు ప్రతులు.

13\. 1. వలయంబెల్ల వెదకి – అ. స. ల; 2. దెసన్ – ఉ. ఓ. ఔ. ద.

15\. 1. కసంకటంబును – ఇ. ఓ. చ. ల. స; కసంభృతంబైన – ఈ. త; కావృతంబును– పీ. శ ష.

16\. 1. భాగోల్లిఖిత – స. కొన్ని ప్రతులు. 2. వారౌఘ – కొన్ని ప్రతులు. 3. యం తంతటన్ – పెక్కు ప్రతులు.

17. క. కని యిది రత్నాకర మి, వ్వననిధి [1]సీమమునఁ గల్గు వసుమతిలోనన్
జనకసుత వెదకి కానము, చన దివ్వారాశి దాఁటి చన నెవ్వరికిన్.

18. ఉ. భూమితనూజఁ గాన మని పోయి రఘూద్వహుతోడఁ జెప్పి [1]య
య్యామిపుచిత్త మాతురతఁ బొందఁగఁ జేయుటకంటెఁ జూడఁగా
[2]సీమెయిఁ జావు మేలు మన కేల విచారము లింక నంచు సం
దేము గడంగి యందఱము నేక[3]తమం బగు నిశ్చయంబుతోన్.

19. వ. అనశనవ్రతంబు సంకల్పించి నియతచిత్తుల మై యుండి రాఘవు కార్యార్థం బై
తెగిన జటాయువు గృతార్థుం డయ్యె మనము నట్టి పుణ్యలోకంబు వడయుద
మని పలుకు చున్న యెడ.

20. క. గిరిశృంగతుంగవిగ్రహుఁ, డురుతరసత్త్వుఁడు విహంగమోత్తముఁ డండో
క్కరుఁ డొయ్యన మాయున్నెడ, కరుదుగఁ జనుదెంచి విగళితాక్రుం
దగుచున్.

21. సీ. అయ్యలార జటాయు వని [1]పల్కెదరు మీర లెవ్వరు సెప్పరే యేను వాని
కగ్రజుండ ననూరునాత్మజన్ముల మేము సంపాతి నాపేరు సమ్మదమున
నేనును దమ్ముఁడు నినమండలమునకుఁ జనువేడ్క నొకనాఁడు [2]చదల నెగసి
చనఁ జనఁ దీవ్రాంశు [3]సంతాపమునఁ జేసి కమరె నారెక్కలు గమర వయ్యె
తే. ననుజుపతమ్ము లే నిమ్మహాచలమున, నాఁటఁగోలె నెచ్చటి[4]కిఁ జనంగ నేర
కున్నవాఁడ నాతమ్ముఁడెట్లున్నవాఁడొ, యెఱుఁగ నెఱిఁగింపరే నాకు
నిష్ట మెసఁగ.

---

17. 1. మధ్యమున - ఇ. ఏ.

18. 1. యాభూవిభు - ఇ. ఏ. ఒ. ఓ. గ. చ. ల. 2. నీమహిఁజావు - అ. ఉ. ఐ. త. వీ. శ. ష. 3. మతం బగు-ఓ. ఔ. క. గ. త. వీ. శ. ష. స; మనం బగు - ఉ.

21. 1. పల్కితిరి - ఓ. ల. 2. చదలికెగసి - వా. చదలనెగసి - పెక్కు ప్రతులు. 3. సంతప్తమున - ఆ. ఈ. ఉ. ఎ. ఐ. గ. త. 4. కినేవరుగనేర - అ. ఆ. ఇ. ఏ. ఐ. ఒ. శ.

22. వ. అనిన నే మతనికి భవదీయవృత్తాంతంబును రావణుండు దేవిం గొనిపోవుటయు [1]దదర్థం బై రావణునితో జటాయువు సమరంబు సేసి యీల్గుటయుం జెప్పిన విని దుఃఖితుం డై సంపాతి యస్మదీయ [2]ప్రవర్తనం బేర్పడ నడిగి మా కి ట్లనియె.

23. ఉ. రావణు నే నెఱుంగుదుం బరాక్రమదుస్సహుఁ డన్నిశాచరుం
డీవనరాశిమధ్యమున నిచ్చటికిన్ శతయోజనంబులన్
భూవిదితంబు లంక యను ప్రోలు తదీయనివాస మచ్చటన్
[1]భూవరుదేవిఁ గాన నగుఁ బొం డరయుండు కృతప్రయత్ను లై.

24. క. అని యతఁడు సనిన నందఱ, మును సాగరతరణకార్యమునకు నుపాయం
బొనరఁ దలపోయునెడ [1]నేనని యుత్సాహంబు సేయఁ డయ్యె నొకండున్.

25. మ. జననాథోత్తమ యేను బూని [1]భవదాజ్ఞాలీల చెల్వొంబు మ
జ్జనకుం డైన సమీరదేవు కృపయున్ సత్త్వోన్నతుం జేయఁగా
ఘనవాఃస్తుంగతరంగసంగత[2]మహోగ్రాహోరగాత్యుగ్రద
ర్శన మై పేర్చు పయోధి దాఁటితి జనాశ్చర్యైకసంపాది నై.

26 ఉ. ఆలవణాబ్ధి[1]మధ్యమునయందుఁ ద్రికూటనగంబుమీఁద ను
త్తాలవిశాల [2]హేమమణిధామసముజ్జ్వల మైన లంకయన్
[3]ప్రో లొగి గంటి నెంతయు నపూర్వము దద్విభవంబు దేవ య
చ్చో లలితాంగి [4]నారయుచుఁ జొచ్చి యనేకవిధంబులం దగన్.

---

22. 1. దదర్థమై (మయి) - పీ. శ. ష; దదర్థంబు - వా. 2. ప్రవర్తనంబును బేర్పడ విని - చ. ల.

23. 1. భూవిభు - ఇ. ఏ. ఓ. గ.

24. 1. నేనని - పెక్కు ప్రతులు; నొయ్యన - వా. పీ.

25. 1. భవదాజ్ఞాభీలసామగ్రి - అ. 2. మహోగ్రగ్రాహ మత్యుగ్ర - శ. ద; మహోగ్రగ్రాహతాత్యుగ్ర - జొ; మహోగ్రాహగ్రహోత్యుగ్ర - ష.

26. 1. మధ్యమమునందు - పీ. శ. ష. 2. సాలమణిధామ - ఊ. ఏ. ఒ. ఓ. జౌ. క. గ. ద. చ. స. 3. ప్రోలును - ఇ. ఒ. ఓ. జౌ. ఘ. చ; ప్రోలది - అ. ఉ. ఎ. ఐ. పీ. 4. నారసితిఁ జొచ్చి యనేకవిచేష్టితంబులన్ - వా; నారయుచుఁ జొచ్చి యనేకవిధంబులం దగన్ - కొన్ని ప్రతులు.

27. వ. అరసి యొక్కెడ రావణాంతఃపురం బయిన యశోక[1]వనంబు నందు.

28. సీ. కన్నీరు జడిగొని [1]క్రమ్మఁ గ్రాఁ కెక్కిన క్రమకపోల భాగములు గలిగి
యవశమై యొఱఁగిన యం గవల్లిక పొంత నున్న భూమీరుహం బూతగాఁగ
వెడలు నిట్టూర్పుల వేఁడిమిఁ [2]బగిలిన యధరపల్లవము గారాకుఁ బోలఁ
దలఁపులసందడి దందడించిన [3]తాల్మి గదిరి శిరఃకంపగతుల బెరయ

ఆ. నున్న పుణ్యమూర్తి [4]నుత్తమసౌందర్య, నవనతాస్య నార్తయైన దానిఁ
గని విదేహతనయఁ గా నెఱింగితి నేను, హా రఘుప్రవీర యనుచు నడల

29. క. వినయమున దేవిఁ [1]జేరం, జని యభివాదనము సేసి జానకి రఘునం
దనుదూత నేను మారుత, తనయుఁడ వానరుఁడ నిన్నుఁ దడవ నిచటికిన్.

30. వ. అరుగుదెంచితి రామలక్ష్మణు లత్యంతకుశలంబున నున్నవారు వానరేశ్వ
రుం డయిన సుగ్రీవుండు వారితో సఖ్యంబు సేసి తత్కార్యంబు [1]దీర్పంబూనె
నింక మసలక నీహృదయేశ్వరుండు సనుదెంచు నూఱడిల్లుము.

31. క. రక్కసుఁడఁ గాను నమ్మీ, నిక్కము వానరుఁడ నేను నీమదిలోనం
దక్కు మనుమాన మనవుఁడు, నొక్కింత దలంచికొని సముత్సుక యగుచున్.

32. వ. అద్దేవి నాకిట్లనియె నన్నా నిన్నెఱింగితి నది యెట్లనిన రామహితాన్వేషి
యగు[1]వాఁ డవింధ్యుం డను వృద్ధరాక్షసుం[2]డు మున్న యింతయుం ద్రిజటచేత
నాకెఱింగించె నతనిపలుకులు దప్పవు రాఘవుండు సుగ్రీవసహాయుండయి
యునికి [3]గలిగెం గావున [4]నింకఁ దడయక యవ్వీరవరుం దోడ్కొనివచ్చి
నాకుం బ్రియంబు సేయుము నీకుఁ గార్యసిద్ధి [5]యయ్యెడు మరుగు

---

27. 1. వనమధ్యంబునందు - ఎ. ఘ.

28. 1. క్రమ్మజారెక్కిన - ఈ. ఐ. త. శ. 2. నవసిన - వీ. శ. ష; బడినయ్యధర- వా. బగిలినయధర - కొన్ని ప్రతులు. 3. తాల్మికడలు - అ. ఊ. గ. శ. ష; 4. నూతన - ఈ. ఐ. త.

29. 1. జేరువ జని - ఐ.

30. 1. సేయంబూనె - ఈ. ఐ. త.

32. 1. వాడవిద్ధుండను - ఎ. ఏ. డ. ల. శ. ష. 2. డింతకుమున్న (న్ను) - కొన్ని ప్రతులు. 3. గలిగినది గావున — వా; గలిగెం — కొన్ని ప్రతులు. 4. నీవింక తడయక - కొన్ని ప్రతులు 5. యయ్యెడ మరుగు - గ. ద.

మని తన శిరోభూషణం బయిన యీరత్నంబు [6]మీకు నభిజ్ఞానార్థంబుగా నాచేతి కిచ్చి మఱియుఁ జిత్రకూటచరితం బైన కృతకవాయసకథయునుం జెప్పి వీడ్కొల్పిన నేను లంకాపుర[7]దాహంబు సేసి యిట దేవర కింతయు విన్నవింప వచ్చితి నని చెప్పి హనుమంతుండు జానకి హృదయంబు మూర్తి మంతం బైన పగిది నున్న యమ్మహామణి రాజచూడామణికి సమర్పించిన.

33. ఆ. అమ్మనోజ్ఞరత్న మక్కునఁ గదియించి, పులక[1]లెగయఁ గొంతప్రొద్దు విభుఁడు జానకీకుచాగ్ర సంగమ[2]సుప్తుఁ డై, నట్ల యుండె ముకుళితాక్షుఁ డగుచు.

34. వ. ఇట్లు రాఘవుండు సీతావృత్తాంతంబు విని తత్సమాగమకుతూహలవ్యగ్రుం డై సుగ్రీవుం జూచి [1]దండయాత్ర కాయితంబు సేయు మనినఁ బ్రసాదం బని యతండు నలుదిక్కులం గల వానరనాయకులం బిలువం [2]బంచిన.

*—: వానరవీరులు నానాదేశంబులనుండి సుగ్రీవునొద్దకు వచ్చుట :—*

సం. 3 – 267 – 1

35. క. శతకోటిద్వయ హరివరి, వృతు లై చనుదెంచి [1]రతులవీరులు ధీరో
ద్ధతులు గజుఁడు గవయుఁడు వి, శ్రుతముగ రఘుపతికిఁ దోడు సూపిరి
గడఁకన్.

36. క. అఱువది కోటులు గపివరు, లుఱక జగత్త్రయముఁ [1]బెలుచ నువ్వెత్తు గొనం
దఱి[2]గొన్నయట్లు నడవఁగ, నెఱసి కుముదుఁ డరుగుదెంచి నృపవరుఁ
గనియెన్.

---

6. మీకు నిమ్మని యిచ్చె – అ. కొన్ని ప్రతులు. 7. దహనంబు – ల. శ. వ.

33. 1. లెసఁగ – పెక్కు ప్రతులు. 2. తృప్తుడై – న.

34. 1. దండున కాయితంబు – వా. దండయాత్ర కాయితంబు – కొన్ని ప్రతులు.
2. దోడంగిన – వా; బంచిన – కొన్ని ప్రతులు.

35. 1. ఘోరవీరులు – ఊ. ఏ. ఒ. ఓ. ఔ. చ. ద.

36. 1. బెలుచ నువ్వెత్తు – ఈ. ఉ. ఎ. ఐ. కసం. త. పీ. శ. మ. స; గణక నువ్వెత్తు – ఋ. ఏ; లో (నొ) కట నువ్వెత్తు – ఒ. ఔ. క. గ. వా. 2. బేర్చినట్లు – అ. క.

37. ఉ. కోటి సహస్రసేన [1]తనుఁ గొల్వఁగ వానర[2]కోటి కెల్ల దా
మేటి మహా[3]బలుండు నిరమిత్త్రుఁడు మిత్త్రసహాయుఁ డై [4]తగన్
వీటికి నుబ్బుగాఁ జటులవేగసముచ్ఛ్రితపుచ్ఛగుచ్ఛవి
స్ఫోటితదిగ్విభాగుఁ డగుచుం జనుదెంచె సుషేణుఁ [5]డత్తఱిన్.

38. క. గణుతింప రాని వానర, గణములతో [1]దధిముఖుండు కాకుత్స్థకులా
గ్రణికిఁ బ్రియంబుగ వచ్చె ధ, రణిభాగము వాహినీచరణచలితముగన్.

39. ఆ. శతసహస్రకోటిసంఖ్యల యెలుఁగుల, గొలువ జలదనీలఘోరమూర్తి
జాంబవంతుఁ డతులసత్త్వుఁ డేతెంచె నా, [1]భూపవరుని కార్యమునకుఁ బూని.

40. వ. మఱియు ననేకు లనేక[1]సహస్రసంఖ్యా బలంబులతోడం జనుదెంచి రిట్లు గూడిన కపివీరులు వివిధాకారు లపారబలశౌర్యసారు లతిఘోరంబుగాఁ బేర్చి నిగుడుచు మగుడుచుం దాఁటుచుఁ బాఁటుచుం దిరుగుచు సురుఁగుచు మలయుచుఁ బొలయుచు మత్తిల్లి గిరి[2]గుహాలయందును [3]దరువనంబుల యందును సరిదుపాంతంబులయందును నానందంబున విహరించు చుండిరి తదనంతరంబ.

41. మ. ప్రభ నొప్పారి యనుంగుఁ దమ్ముఁడు మహా[1]భాగుండు సౌమిత్రి వీ
తభయుం డై కొలువం [2]గపీంద్రబలసంతానంబుతో నుద్ధతిన్
శుభలగ్నంబున రాఘవుండు గదలెన్ సుగ్రీవసాహాయ్య [3]సం
ప్రభవోత్సాహ మెలర్ప దర్పితరిపుప్రాలేయతిగ్మాంశుఁ డై.

---

37. 1. తగఁ గొల్వగ - వా; తనుఁగొల్వఁగ - కొన్ని ప్రతులు. 2. సేనకెల్ల - వా. కోటికెల్ల - కొన్ని ప్రతులు. 3. భుజుండు - ఇ. ఏ. ఒ. ఓ. ఔ. క. ఘ. ద. చ. స. 4. నలిన్ - వా; తగన్ - కొన్ని ప్రతులు; 5. డున్నతిన్ - అ. క.

38. 1. వలిముఖుండు - ఇ. ఏ.

39. 1. భూపవర్యు - ఇ. ఏ. ఒ. ఔ. క. ఘ. చ.

40. 1. కోటిసహస్ర - పెక్కు ప్రతులు. 2. గుహాలయంబులయందును - వా; గుహాలయందును - కొన్ని ప్రతులు. 3. దరువనంబులందును - కొన్ని ప్రతులలో లేదు.

41. 1. బాహుండు - చ. ఠ. డ. ల. 2. గపిప్రబల - ఇ. 3. సుప్రభవో - అ. డ.

42. ఉ. ఆహరి[1]వీరవాహినుల కన్నిటికిన్ మొగమై మరుత్సుతుం
డాహవ[2]దోహళుం డమరె నంగద నీల నలాది వీరు లు
త్సాహము మీఱ [3]నయ్యయి దెసం దగు కావలి యై సమగ్ర స
న్నాహమహోగ్రతం జనిరి నాకవిరోధి [4]వధాభిలాషు లై.

43. వ. ఇట్లు నడచి యెడ నెడం బ్రభూతవన్యఫలజలాశయంబు లగు ప్రదేశంబుల విడియుచుం గపిసైన్యంబు గతిపయదినంబులకు దక్షిణోదధితీరంబు సేరి [1]రెండగు వారాశియుంబోలె ఘూర్ణిల్లుచుండె నంత రాఘవుండు రవి తనయుంజూచి యిట్లనియె.

44. క. మనబల[1]మును నతిబహుళము, వననిధియును దుస్తరంబు వానరవర యి
వ్వననిధిఁ గడచు నుపాయము, మనకొక్కటి నిశ్చయింపుమా తగు[2]భంగిన్.

45. తే. అని విచారించునెడఁ గొంద అధిపుఁ జూచి, జడధి బలితంపుఁ దెప్పలఁ గడత మనిరి
ఘనపుఁ గలముల సమకట్టి గడత మనిరి, కొంద అంతయు విని రఘునందనుండు.

46. సీ. అల్లన నగుచు నిట్లనియె మీచెప్పుటల్ దగిన యుపాయంబు లగు[1]న యయిన
నగణితం బైన యీవారిసైన్యముల కెల్లఁ గలములుఁ దెప్పలు వలయునన్ని
సమకట్టు టరయ నశక్యంబు శత[2]యోజనంబుల పరపైన యంబురాశిఁ
గలములఁ దెప్పలఁ గడుచుచో రిపుకోటి యెదరునఁ బైఁబడి పొడువకున్నె

---

42. 1. వీరవాహినికి నన్ని ముఖంబులనమ్మరుత్సుతుం – క. ట. 2. దోహలుండగుచు – అ; దోహలుండు మరియంగద – క. 3. నొక్క మొగి తద్దయు కావలియై – ఒ. ట. ఔ. క; నొక్కవడి తద్దయు కావలియై – ట. 4. జయాభిలాషులై – క. ఘ.

43. 1. రెండవ – కొన్ని ప్రతులు.

44. 1. మిదియతి – వా; మును నతి – పెక్కు ప్రతులు. 2. బుద్ధిన్ – వా; భంగిన్ – పెక్కు ప్రతులు.

46. 1. ను నైన – పెక్కు ప్రతులు. 2. యోజనాయితంబైనట్టి యంబురాశి – ఈ.

ఆ. యదియుఁగాక యల్పులగు వణిగ్జనముల, యోజ రఘురాతతి[3]కిఁ దేజ మగునె
కాన నాదుమతము [4]గా దివ్విధంబు నా, మనసు నిశ్చయంబు వినుఁడు మీరు.

47. చ. వ్రతము ధరించి నిష్ఠ నుపవాసవిధిం గొలుతున్ సముద్రు నా
కితఁడు [1]ప్రసన్నుఁడై తెరువు నిచ్చుట యంతయు గల్గెనేని మే
లితరునిగా [2]ననుం దలఁచెనేని నమానుషరోష[3]వేగదీ
పితశరవహ్ని నిజ్జలముఁ బీల్చెదఁ బ్రేల్చెద నొక్కవ్రేల్మిడిన్.

*-: రాముఁడు దర్భశయనుం డై సముద్రుం బ్రార్థించుట :-*

సం. 3 - 267 - 30

48. వ. అని పలికి దశరథాగ్రసూనుండు దానును దమ్ముండును నుపవసించి దర్భ[1]శయను లై జలధీంద్రు [2]నుపాసించి యున్నంత సముద్రుండు సకలజలచరప్రకరపరివారుం డై రాఘవునకుం బొడసూపి యయ్యా నీవలనఁ బ్రీతుండ నైతి నీ కెయ్యది ప్రియంబు సేయుదుఁ జెప్పుమనిన నతండు నాకు లంకపై నరుగం [3]దెరు విచ్చునది యీనినాఁడు సూర్యనిభంబు లయిన మదీయ దివ్యాస్త్రంబుల నిన్ను శోషింపం జేయుదుననిన విని సరిత్పతి రఘుపతి కి ట్లనియె.

49. సీ. జననాథ నీకార్యమునకు నేవిఘ్నంబు గావింప నోడుదు నేవిధమున
వినుము నావాక్యంబు జను లెల్ల నెఱుఁగ నీ[1]కి త్తఱి నేఁ దెరు విత్తునేని
నిల[2]నెల్ల వాఁడును విలసితదివ్యాస్త్రబలమున సాధింపఁ దలఁచు నన్ను
మీయందుఁ గపివీరుఁ డాయతమతి విశ్వకర్మసూనుఁడు శిల్పికర్మవిదుఁడు

---

ఉ. ఎ. ఐ. గ. త. వీ. శ. ష. ప్రాసనియమభంగము. 3. కి నైజ మగునె - ఎ. వీ. శ. ష. 4. గాదు నివ్విధమున మనకు నిశ్చయించి -క.

47. 1. ప్రియంబుతోడఁ దెరువిచ్చుట యంతన కల్గెనేని - వా; ప్రసన్నుఁడై తెరువు నిచ్చుట యంతయు గల్గెనేని - కొన్ని ప్రతులు. 2. మదిందలచె - అ. 3. వేస - వా. వీ. పెక్కు ప్రతులు; వేగ - ల.

48. 1. శయనుడై - కొన్ని ప్రతులు. 2. నుపాసించుచున్నంత - వా. వీ; నుపాసించి యున్నంత - పెక్కు ప్రతులు. 3. దెరువి మ్మినినాడు మదీయ - ఇ. ఏ. ఓ.

49. 1. కి త్తరి నేదెరువిత్తునేని - పెక్కు ప్రతులు. 2. నెల్లవారును......సాధింపగలరు

ఆ. [3]నలుఁడు నాఁగ నొకఁడు గలఁడు వాఁడొలసి నా, యందుఁ దరులు గిరులు నొందవైవ
నవి ధరింతు నేను దివిరి నీకది సేతు, వుగఁ గడంక నరిగి పగలఁ గెలుము.

50. వ. అని యతని నొడంబఱిచి సముద్రుండు సనుటయు నమ్మహీపతి నలు రావించి సేతుబంధనంబు సేయ [1]నియోగించిన ననేక వానరసహస్రంబులు నలుదిక్కులకుఁ బఱచి గిరిశిఖరంబులుఁ దరునికరంబులు విఱిచి తెచ్చి యిచ్చుచుండ నన్నలుండు మున్నీటియందు శతయోజనాయామంబును దశయోజన విస్తారంబునుంగా నతిదృఢం బగు సేతుబంధనంబు నిర్మించె నయ్యవసరంబున.

51. ఆ. అన్నతోడ నలిగి యాప్తులుఁదాను వి, భీషణుండు వినయభూషణుండు
నెమ్మి నరుగుదెంచి నృపశిరోమణి రాము, శరణుఁ జొచ్చె భక్తి[1]భరితుఁ డగుచు.

52. క. ఆరాక్షస[1]వృషభుని యా, కారము నింగితముఁ జూచి కాకుత్స్థకులో
ద్ధారుఁ డతని నతిధార్మికుఁ, గా రూపించి ముద మొప్పఁ [2]గైకొనియెఁ దగన్.

53. ఉ. వానికి [1]దానవేంద్రువిభవంబు సమస్తము నిచ్చువాఁడు గాఁ
బూని ప్రతిజ్ఞ సేసి కృతపుణ్యుఁడు లక్ష్మణు[2]తోడి చెల్మియున్
వానికి నిచ్చె చెచ్చెర నవారితవానరసైన్యయుక్తుఁ డై
వానిఁ బురస్కరించుకొని వారిధి దాఁటె మహోగ్రలీలతోన్.

---

నన్ను — ఈ. ఐ. త. ద. శ. 3. నలుడనంగ నొకడు గలడు వానరుడు — కొన్ని ప్రతులు.

50. 1. నియమించె — ఇ.

51. 1. చరితు డగుచు — ఇ. ఔ. ద.

52. 1. ముఖ్యుని — అ. ఈ. ఉ. ఊ. ఎ. ఐ. గ. త. పీ. శ.ష. 2. గైకొని — కరుణన్ — వా; గైకొనియెఁ దగన్ — కొన్ని ప్రతులు.

53. 1. రాక్షసేంద్ర — ఖ. 2. తోడ — ఎ. గ. గు. చ.

54. వ. ఇట్లు సేతుమార్గంబున సాగరోత్తరణం బాచరించి త్రికూటపర్వతం బెక్కి లంకానగరంబు చుట్టును శిబిరంబు[1]లు సంఘటింపం బంచిన.

55. క. [1]తాళైలాగరుసాలర, సాలతమాలామ్రనింబజంబూజంబీ రాలంకృతలంకావన, జాలంబుల విడిసె వృక్షచరసైన్యంబుల్.

56. వ. తదనంతరంబ రావణుచారు లయిన శుక సారణు లను[1]వారలు వానరా కారంబులు దాల్చి శిబిరంబునఁ గ్రుమ్మరుచున్న నెఱింగి విభీషణుం డా [2]రాక్షసులం బట్టించి రామునకు సమర్పించిన నతండు వారికి నిజ[3]సైన్యం బంతయుం జూప నియోగించి విడిచి[4]పుచ్చినఁ జని య య్యిరువురు నమర వైరిం గని కపిసైన్యంబు దుర్జయం బనియును రామలక్ష్మణుల తేజోమూర్తి విశేషంబులును నెఱింగించిన నతండు దాని సరకు సేయక సమరంబునకు [5]మోహరించి.

57. సీ. బద్ధశిలాయంత్రబహుళ మై యుత్తాలితాట్టాలకాఖిల మై యుదగ్ర కేతుపతాకాప్రకీర్ణ మై తోమర[1]ముద్గరాలాతకముసలశూల శరశతఘ్నీముఖసాధనోపేత మై [2]యుగ్రవిగ్రహధీరయోధవీర సంకులం బై హయస్యందనవేదండచండ మై సముదితసప్తసాల

ఆ. మై యలంఘ్యపరిఖ మై తృణకాష్ఠజ, లాదివస్తుభరిత మైన లంక కధికరక్షఁ జేసి యప్రమాదంబున, నుండె రిపుజిగీష నుదితబలుఁడు.

58. వ. ఇట రాఘవుండును సుగ్రీవసహితుం డై యుండి యంగదుం జూచి నీవు రావణుంపాలికిం జని యతనికిం దగిన తెఱంగున బుద్ధిగాఁ జెప్పి జానకి విడుచుట మే లని చెప్పు మని పనిచినం బని పూని యవ్వీరుండు.

---

54. 1. గా విడియం బంచిన - అ.

55. 1. తాళైలాగురుచందనసాల - వా. తాళైలాగరుసాలరసాల - కొన్ని ప్రతులు.

56. 1. రాక్షసులు - ఏ. 2. రక్కసులం - ఒ. ఓ. క. చ. ల. 3. సైన్యంబు సకలం బును జూప - ఇ. ఏ. ఓ. గ. ఘ. చ. ద. 4. పుచ్చుటయు - వా. వీ; పుచ్చినఁ జని - శ. ష. 5. నుత్సహించి - పెక్కు ప్రతులు.

57. 1. చక్రముద్గర పట్టిసత్రిశూల - ఈ. త. వీ. శ. ష. 2. యుగ్ర మహాసురయోధ వీర - వీ. శ. ష.

59. శా. లంకాద్వారము [1]దుర్నివారగమనోల్లాసంబునం జొచ్చి ని
శ్శంకుం డై సుగళత్రుసై నికసహస్రంబుల్ దనుంజూచి యా
శంకం బొందఁగ లీలమైఁ జని సుహృత్సంఘంబు [2]గొల్వన్ నిరా
తంకుం డై కొలు వున్న దైత్యుఁ గని యుద్యన్మూర్తి యై యిట్లనున్.

:- అంగదురాయబారము :-

సం. 3 _ 267 _ 54

60. క. ఇనకులతిలకుఁడు బాణా, సనవిద్యాగురుఁడు రామచంద్రుఁడు నీతో
నను ని ట్లను మని పనిచెను, వినుము తదీయోక్తిభంగి విస్పష్టముగన్.

61. సీ. అనపరాధుల గానన్నాంతరమ్మునసున్న పేదతాపసులఁ జంపితి పలువుర
నమరుల [1]యీలువుటాఁడ్రను జెఱవట్టి యఖిలలోకములకు నలఁత సేసి
తివి యెల్ల నొకతల యేపు మీఱఁగ నన్నుఁ జెనకుట యొక తల సెప్ప నేల
బలిమి[2]యొప్పఁగ మంచి బంటవై వెడలుము కయ్యంబునకు నట్లుగాక యున్న

ఆ. శరణుఁ జొచ్చి నాకు జానకి నొప్పింపు, మొందు వెంట బ్రతికి [3]యుండఁ దీఱ
[4]దస్మదీయశితశరాళీవిషంబుల, కెరయ నీదు ప్రాణ మింత నిజము.

62. క. మనుజుండ నై న నా తెఱఁ, గనుమానము వాయఁ జూడు మాహవభూమిన్
విను రాక్షసులను నామం, బును నడఁపక యేను రిత్త వో[1]నిచ్చెదనే.

63. వ. అని పలుకుచున్న యంగదు పరుషభాషణంబులకు రోషించిన యసురపతి
కన్నెఱింగి నలువురు రక్కసులు గ్రక్కున నవ్వాలినందనుం [1]బొదివి పట్టిన
బిట్టెగసి హర్మ్యశిఖరంబు పై కి దాఁటుటయుఁ దదాక్షేపవేగంబున నన్నిశా
చరులు ధరణీతలంబున జర్జరితశరీరు లై పడిరి [2]హరివీరుం డచ్చటనుండి శిబిర

---

59. 1. దుర్నివారముగ నుల్లాసంబునం - వా. దుర్నివారగమనోల్లాసంబునం - వా. కొన్ని ప్రతులు. 2. తోడన్నిరాతంకుండై - ఈ. త.

61. 1. యిల్లాండ్ర నటమునఁ జెరవట్టి తఖిల - వా; యీలువుటాండ్రను జెఱవట్టి యఖిల - కొన్ని ప్రతులు. 2. మించగ - వి. శ. ప. 3. యుండ వింకనస్మదీయశర - కొన్ని ప్రతులు. 4. దస్మదుగ్ర శరశతా - వా. దస్మదీయశితశరాళీ - కొన్ని ప్రతులు.

62. 1. నేర్చెదనే - వి. శ. ప.

63. 1. బొదువం బట్టిన - వా. బొదివిపట్టిన - కొన్ని ప్రతులు. 2. హరివీరుండు నవ

మధ్యంబునకు లంఘించి భూనాథునకుఁ దనపోయివచ్చిన తెఱంగు విన్న
వించెం దదనంతరంబ రాఘవు ననుమతంబున.

64. మత్తకోకిలము.

తాలసాలశిలాగ్రహస్తు లుదగ్రగోత్రమహీధరో
త్తాలదేహు లనేకవర్ణులు దారితాఖిలదిఙ్ముఖా
ఖీలవాలశిఖాగ్రు లుగ్రగభీరసత్త్వులు వానరుల్
గాలకల్పులు పేర్చి సంతనకట్టి రాహవకేళికిన్.

65. క. పరువడి మొత్తము లై బలం, బురఘోషం బెసఁగఁ బొంగి తోఁతెంచు [1]హరి
శ్వరబలమునఁదు ఘనసా, గరవీచివికాసరేఖ గానఁగ నయ్యెన్.

66. మత్తకోకిలము.

కోటఁ బన్నినఘోరదానవకోటిఁ [1]జల్కనఁ దోలి యు
క్కోట [2]నల్లడలన్ మహోగ్రతఁ గూలఁ[3]ద్రోచి సమున్న[4]తో
త్కోటతోరణయంత్రకేతనగోపురాట్టకసంహతుల్
వీటతాటము సేసి రక్కపివీరు లొక్కట మాత్రలోన్.

67. వ. మఱియుఁ బ్రాకారంబులపై నున్న గదా[1]పరిఘకుంతప్రముఖంబులు
గైకొని లంకామధ్యంబునపై వంగొడంగిన నానాలక్ష్యంబగు పౌరలోకంబు
హాహాకారవ్యాకులంబై కలంగంబడియె నంత రావణాభ్యుదితులైన దానవులు
నానాకోటిసహస్ర[2]సంఖ్య లరిగి యెక్కడ జిక్కెడ యను [3]తలపడి కపిసముద
యంబులం దోలి యెప్పటియట్ల ప్రాకారంబుం గైకొని నిల్చి రప్పుడు.

---

రత్నమయం బగు దదీయాస్థానమండపంబున శిఖరంబు రాక్షస రాజ పేంతు సంఘాత
మహోల్కయుంబోలె బడదన్ని యాతుఁడంబ యచ్చటనుండి శిబిరమధ్యంబునకు
లంఘించి – ట. వీ. స.

65. 1. కపీశ్వర – ఈ. బ. ల

66. 1. నల్లడదోలి – అ. ఈ. ఉ. ఎ. బ. గ. త. వీ. శ. వ. 2. యెల్లెడలన్ – అ. ఈ.
ఎ. బ. ల. పి శ. వ. 3. దాచి – ఊ. ఎ. వ. పి. 4. తోత్కూట – ఈ. చ.
శ. 5. రాదికసంహతుల్ – ట. శ.

67. 1. కుంత ముసల పరిఘ ప్రకరంబులు – అ. ఉ. ఊ. ఎ. ద. వీ. శ. వ. 2. సంఖ్యాలం
గలిసి – కొన్ని ప్రతులు. 3. కపిని – ఎ. క. చ; తలపడి – పెక్కు ప్రతులలో
లేదు

68\. క. మును మర్కటబలములచే, ననయంబును గపిలవర్ణమైనది మగుడన్
దనుజబలసంవృతం బై, ఘనపటలచ్ఛాయఁ [1]గోట కర మొప్పారెన్.

69\. క. వనచరసేనలు దెరలిన, నినవంశోత్తములు నృపతు లిద్దఱుఁ గయ్య
మ్మునకుఁ [1]గడంగుటఁ గ్రమ్మఱ, గొనకొని [2]కపిసేన యెల్లఁ గోటకుఁ గవిసెన్.

70\. వ. ఇట్లు గవిసినం బ్రాకారరక్షకు లైన [1]రాక్షసవీరులు వారలం జేరనీక శిలాశూలపరశుతోమరాలాతశరకుంతప్రముఖంబులు ప్రయోగించినం గయికొనక వనచరులు పృథుశిలాప్రకరంబులు వఱపించుచుం గడంగి ప్రాకారంబుఁ బ్రాఁకుటయు నయ్యిరుదెఱంగుల వారికిం గేశాకేశి యగు సమరం బయ్యెఁ బదంపడి రావణుండు ననుపఁ [2]బర్వతుండును బ్రఘసుండును ఖరుండును గ్రోధవశుండును బ్రరుజుండును నను రాక్షసు లేపు రనేకరాక్షసపిశాచసేనాపరివృతు లయి పురంబు వెలువడి మాయ గావించి యదృశ్యాకారు లై కపిసైన్యంబు నొప్పింపం దొడంగినం గని.

71\. ఉ. దారుణవిక్రముండు రిపుదర్పవిభేది మహాస్త్రవేది మా
యారణకోవిదుండు గడు నల్గి విభీషణుఁ [1]డేఁగుదెంచి య
వ్వీరుల మాయయుం [2]జలము వ్రేల్మిడిలోఁ [3]గుదియించి వీరశే
ఖరసికుండు వారి నవలీలమెయిం దునుమాడె నందఱన్.

72\. క అతని శరపాతంబుల, చేతం గడు నొచ్చి దైత్యసేన నగము ధా
త్రీతలపతితం[1]బయ్యె వి, భీతిఁ బఱచి పురము సొచ్చెఁ బెలుచగము వెసన్.

---

68\. 1. గోట కడు నొప్పారెన్ – కొన్ని ప్రతులు.

69\. 1. గడఁగుటయుఁగ్రమ్మఱ – ఇ 2. కపికోటియెల్ల – కొన్ని ప్రతులు.

70\. 1. రాక్షసులు వారింజేరనీక – పెక్కు ప్రతులు. 2. బర్హణుండును జంఘుండును పూతనుండును క్రోధుండును ఖరుండును నను రాక్షసులేడ్వురు ననేక రాక్షస – అ. పెక్కు ప్రతులు.

71\. 1. డగ్గిదర్పి – ఊ. ఔ; దేచిపేర్చి – ఔ. 2. బలము – అ. ఈ. ఉ. ఒ. క. ఠ. 3. నడ (ఱ) గించి – అ. ఔ. ద

72\. 1. బగుటయుభీతి – అ. ఉ. క; బయ్యెనుభీతి – ఏ. గ. చ. ల

73. క. అది యెల్ల విని దశాననుఁ, డుదితక్రోధుఁ డయి మంత్రియుతముగ వెడలెన్ మదగజఘోటకసైనిక, [1]పదభరభగ్నావనీవిభాగుం డగుచున్.

74. వ. ఇట్లు వెడలి యభేద్యం బగు నౌశనసవ్యూహంబు సంఘటించి వనచరబలంబు పయి [1]నడచినం గని రాఘవుండును బార్హస్పత్యవ్యూహంబు దీర్చి పేర్చి యెదురుకొనియె నా సేనలు రెండు నకాండక్షుభితసాగరయుగళంబు తెఱంగు దోఁప నొండొంటిం [2]గవిసె నప్పుడు రాముండు [3]రావణుం దల పడియె లక్ష్మణుం డింద్రజిత్తును సుగ్రీవుండు విరూపాక్షునిఁ దారుండు నిఖర్వటుం దాఁకి రిట్లిరువాఁగునకును దేవాసురులకుంబోలె నాభీల సమరం బయ్యె నందు.

75. క. సౌమిత్రి నిశితవిశిఖ, స్తోమంబుల నసురపతిసుతుం [1]బొదివిన సం
గ్రామమునకుఁ దొలఁగక యతఁ, డామనుజోత్తముని ముంచె
నాశుగవృష్టిన్.

76. ఉత్సాహము.
అమరవైరివిభుఁడు దశరథాగ్రసుతుఁడు నేపునన్
సమరసత్ప్రతాపకోపజాజ్వలచ్ఛరీరులై
తుములబాణపటలవృష్టిఁ దొప్ప[1]దోఁగి యిర్వురుం
దమక మేది తమక తమక తనిసి రాహవంబునన్.

77. వ. తదనంతరంబ.

78. క. ఆరావణుండు నిజ[1]దో, స్సారమునకు రాముబాహుసారం బతిదు
ర్వారం బగు టేర్పడఁ గని, వీరారంభంబు కడఁక విడిచి రయమునన్.

---

73. 1. పదహతిభగ్నా – ఈ. ఐ. త. ల.

74. 1. గవిసినం – అ. ఈ. ఉ. ఎ. ఐ. త. వీ. శ. ష. 2. గదిసె – అ. ఇ. ఏ. ఐ. ఘ. చ. శ. 3. రావణుతోడం దలపడి – వా. వీ; రావణుం దలపడి–పెక్కు ప్రతులు.

75. 1. బొదివెను సం – వా; బొదివిన సం – కొన్ని ప్రతులు.

76. 1. దోఁగి రిర్వురుం – వీ. శ. ష.

78. 1. దోస్సారంబున – వా; దోస్సారమునకు – వీ. కొన్ని ప్రతులు.

79. క. మగిడి నగరంబు సొచ్చిన, బెగడి నిశాచరబలంబు పెల్లగిలుటయున్
విగతభయుండు ప్రహస్తుఁడు, దగఁ గోల్తలసేసె నత్యుదగ్రస్ఫురణన్.

80. ఉ. ఆతనిఁ గాంచి తద్బలము లన్నియుఁ గ్రమ్మఱ సాహసోత్సవ
స్ఫీతములై కడంగుటయుఁ జేర్చి విభీషణుఁ డుగ్రవానర
వ్రాతసమన్వితంబుగ నవారణ మార్కొనినన్ మహారణం
బాతత మయ్యె సైన్యనివహంబులు రెంటికి నద్భుతంబుగన్.

81. వ. అంత.

-: ప్రహస్త ధూమ్రాక్షుల యుద్ధము :-

సం. 3 _ 270 _ 1

82. మ. కృత[1]హస్తుండు ప్రహస్తుఁ డాహవ[2]కళాకేళీ విదగ్ధుండు ద
ర్పితుఁడై తాఁకె విభీషణుం గడఁకమై బెంపారి వారిద్దఱున్
[3]శితశల్యోగ్రమయూరపత్త్రవిశిఖశ్రేణీ [4]శతచ్ఛన్నులై
ధృతి నొప్పారిరి చిత్రవారిధరపంక్తిచ్ఛన్నశైలాకృతిన్.

83. చ. కదిసి ప్రహస్తుఁ డార్చి పరిఘంబు రయంబున నెత్తి భీకరో
న్మదకరిహస్త[1]తాడనము మాడ్కి దలిర్పఁగ [2]వేసె నీసుమై
నదయత రావణానుజుని నాతఁడు వ్రేటున కించుకంతయుం
గదలక హేమకూటగిరికైవడి నిల్చి యుదీర్ణ[3]కోపుఁడై.

84. మ. శతఘంటాపరిభూషితంబును జగత్సంహారఘోరానలో
త్థితకీలాసదృశంబునై మెఱయు శక్తిం బూన్చి మంత్రించి యు
ద్ధతతేజుండు ప్రహస్తువైచిన వెసం దత్క్రూరసంపాత [1]పా
టితవక్షుం డయి కూలె వాఁడు శతకోటి[2]చ్ఛిన్నశైలాకృతిన్.

---

82. 1. శస్త్రిండు - అ. ట. 2. లసత్కేళీ - ట. 3. శితశల్యోగ్ర - పెక్కుప్రతులు; శితభల్యోగ్ర - వా; శితనవ్యోగ్ర - ఐ. త. 4. పరిచ్ఛన్నులై - అ. వీ. మ.

83. 1. పాతనము - ఈ. ఎ. ఐ. త. ల. శ. 2. వేసె - ఇ. ఉ. ఏ. ఓ. ల; వైచె - ఆ. ఉ. ఎ. ఐ. త. వీ. శ. ష. 3. దీప్తుడై - ఈ. ఐ. త.

84. 1. తాటిత - అ. ఆ. 2. ఉక్త - పెక్కు ప్రతులు.

85. వ. ఇట్లు ప్రహస్తుండు పడినం దత్సైన్యంబులు [1]విముఖంబు లగుటయు ధూమ్రాక్షుండు రోషతామ్రాక్షుం డగుచు నతినిబిడబలాహకానీకభీకరం బై కాఱుకొను చున్న నిశాచరచక్రంబుతో [2]నురులం బఱతెంచినం జలించి [3]బలీముఖబలంబులు దుర్బలంబు లై తొలంగినం జూచి [4]యాంజనేయుం డజయ్యుం డై నిల్చినం బెల్చిన యెప్పటియట్ల యూథపతులుం గూడుకొని రప్పుడు.

86. సీ. అనిలతనూజ ధూమ్రాక్షరక్షితసైన్య[1]యుగ్మంబునకు నయ్యె నుగ్రసమర
మందు నిష్ఠురచరణాఘాతముల డొల్లు నరదంబులును శిలాహతులఁ దూలి
యొఱలు నేనుంగులు నుత్తాలతరుహతిఁ ద్రెళ్లు ఘోటకములు దీవ్రనఖర
దంతక్షతంబుల దళితాంగు లై నేలఁ బడి పన్ని కొను వీరభటులు నగుచు

ఆ. నధికశౌర్యసారు లగు కపివీరుల, చేత నొచ్చి దైత్యసేన భీతిఁ
బఱచెఁ గొంత బెండువడి యుండెఁ గొంత ధూమ్రాక్షు[2]వెనుక
కొదిఁగె నంతఁ గొంత.

87. మహాస్రగ్ధర.

కని ధూమ్రాక్షుండు విశ్వగ్రసన[1]రయలసత్కాల[2]మేఘంబ పోలెన్
ఘన[3]గర్జాఘోష మొప్పం గడఁగి శరశతా[4]కల్పితాసారదుర్ధ
ర్షనవీరారంభుఁ డై నన్ సకలహరిచమూసంఘమున్ విహ్వలం బై
[5]చనెఁ దూలెం గూలె లావుం జలమును జెదరన్ సంగడిన్ విచ్చె నొచ్చెన్.

---

85. 1. సమర విముఖంబగుటయు - పెక్కు ప్రతులు. 2. మరలం - చ; నురులం - కొన్ని ప్రతులలో లేదు. 3. బలీముఖులు - కొన్ని ప్రతులు. 4. యేచి యాంజనేయుం - ఈ. ఊ. గ. త. ల.

86. 1. యుగళంబునకు - ఆ. ఇ. ఈ. ఎ. ఏ. ఘ. త. వి. శ. ష. స. 2. వెనుక నొదిగె - ఆ. ఈ. ఎ. ఐ. త.

87. 1. రయలసత్కాల - శ. ష; రసలసత్కాల - వా. వి. 2. మేఘంబువోలెన్ - కొన్ని ప్రతులు. 3. మౌర్వీఘోషగర్జంగడగి - ఆ. ఈ. ఐ. త. వి. శ. ష. 4. ఘాత విస్ఫార దుర్దర్శ - ఐ. 5. చనఁజొచ్చెన్ - ఆ. గ. ల.

88. తే. అతనియుద్ధతి సైఁపక యనిలసూనుఁ
డనిలవేగుఁడై పఱతెంచి [1]యార్చి తాఁకెఁ
బ్రథన మయ్యిద్దఱకు నుగ్రభంగి నమర
పతికి [2]ప్రహ్లాదునకుఁబోలెఁ బ్రకట మయ్యె.

89. క. పరిఘంబులు గదలును బె, క్కురుదుగ రక్కసుఁడు వైచె నమ్మారుతి పై
నురుగండశైలములు ఘన, తరువులు వాఁడును గురిసె దానవుమీఁదన్.

90. వ. ఇట్లు[1]ం బెనంకువ సెల్లుచుండ గొండొక సేపునకు.

91. స్రగ్ధర.
లంకాలుంటాకుఁ డుద్యల్లఘుతరగమనోల్లాసి యై డాసి పీఁకం
బోఁకం బేపారఁ జంచద్భుజరచితమహాభూరుహం బెత్తి [1]వైచెం
గింకన్ ధూమ్రాక్షు వాఁడుం గెడసెను వదనోద్గీర్ణకీలాలధారా
పంక[2]ప్రాగ్భాగమగ్నా[3]పఘనవిఘటితప్రాణుఁడై యాహవోర్విన్.

92. వ. ఇత్తెఱంగున ధూమ్రాక్షుండు [1]దెగిన గపిసైనికు లార్చి హనుమంతుని ననేకభంగులం బ్రస్తుతించుచు రజనిచరులం గనుకనిం దోలినం దూలి యందఱుం బఱచి పురంబు సొచ్చి [2]దనుజేంద్రునకుం బ్రహస్తధూమ్రాక్షుల మరణప్రకారంబులు విన్నవించినఁ బ్రకటబాష్పనిశ్వాసవివర్ణవదనుం డగుచుఁ బంక్తివదనుండు.

93. క. కలవారెల్లను మడిసిరి, కలిగియు లేఁ డయ్యెఁ గుంభకర్ణుఁడు వీనిం
దెలుపుదునో యేను గొడుకుం, జల[1] మెడపక రిపులతోడ నరిఁ బెనఁగుదునో.

---

88. 1. యతనిదాకె - ఓ. 2. వృత్రునకుంబోలె - వా; బ్రహ్లాదునకుబోలె - అన్ని ప్రతులు, మూలం. "జిగీషతోర్యథాన్యోన్య మింద్ర ప్రహ్లాదయోరివ" శం 3-270-12.

90. 1. సమరంబగుచుండ గొంతసేపునకు - కొన్ని ప్రతులు.

91. 1. వేసెన్ - వా. కొన్ని ప్రతులు; వైచెన్ - కొన్ని ప్రతులు. 2. ప్రాగ్గార - అ. ఆ. ల. న. 3. ప్రబలవిఘటన - ఆ. ఈ; పఘనవిగళిత - అ.

92. 1. దెగిన పిదపఁ గపివరసైనికు - వా. పీ; దెగినఁగపిసైనికు - పెక్కు ప్రతులు. 2. దనుజేశ్వరునకుం - కొన్ని ప్రతులు.

93. 1. మడరగ - ఇ; మెడలని - చ.

## –: కుంభకర్ణుండు యుద్ధము సేయుట :–

సం. 3 – 271 – 1

97. లయగ్రాహి.

దారుణదవానలశిఖారుణశిరోరుహుఁ డగాధఘనకర్బురశరీరుఁ డటురోష
క్రూరనయనాంతగళితోరుతరవహ్నికణ¹ఘోరముఖుఁ దంతవలయారభస
దంభో
ద్గారిరుధిరాధరు నుదాగభుజసారుఁ²విదూరితదిగంతుఁ బదభారవినమద్భూ
భారుఁ ద్రిజగద్విజయభూరిబలు నద్దనుజవీరుఁ గని రచ్చెరువుఁ గూరఁ గపివీరుల్.

98. క. రక్కసుఁడును దనమదిలో, నక్కపి¹వీరులను జీరికైనఁ గొనక పే
రుక్కున రఘుకులవీరుల, దిక్కునకుం ²గవియుదెంచెఁ దీవ్రస్ఫురణన్.

99. మ. వడి నడ్డం బరికట్టి సెట్టన హరివ్రాతంబు పెన్ ద్రొక్కులం
బిడుగుల్వోని మహోద్ధ¹తాశ్మముల నాభీలంబుగా దైత్యు వి
ట్టడువన్ వైవఁగఁ జొచ్చెఁ గొందఱు ²బలం బారంగ వే డాసి దం
దడి తత్కాయము సించి రుగ్రనఖదంతన్యాససంక్రీడలన్.

100. ఉ. కన్నుల నిద్ర¹దేలఁగ నకంపితుఁ డై యతఁ ²డెంత చేసినం
దన్ను నెఱుంగ కొక్క మొగిఁ దత్కపిసైన్యచయంబుఁ బోరఁ జే
రన్నన మ్రింగఁ జొచ్చె విలయాగమసంభృతదర్పరోషవే
గోన్నతలీలఁ గాలుఁడు జనోత్కరమున్ గ్రసియించుచాడ్పునన్.

101. వ. ఇట్లు ¹బల చండబల వజ్రబాహులు లోనుగాఁ బెక్కండ్ర యూథపతులను
బహుసహస్రసంఖ్యల వానరయూథంబును మ్రింగియు గొనకొని వచ్చు

---

97. 1. ఘోరముఖు – అ. ఈ. ఊ; ఘోరముఖు – వా. వీ. కొన్ని ప్రతులు 2. విదా
రిత – ఆ. ఇ. ఈ. ఏ. ఐ. డ. త.

98. 1. సైన్యముల జీరి – అ. ఇ. ఎ. ఏ. ఒ. ఓ. ఔ. క. గ. ఘ. వ. 2. గదియవచ్చె –
ఉ. వీ. ష.

99. 1. తాశ్మముల – కొన్ని ప్రతులు; తాస్త్రముల – వా. 2. బవంబారంగ – అ. వ.

100. 1. వ్రేలగ – ఒ. 2. దేరిసేసినం – వా. డెంతచేసినం – కొన్ని ప్రతులు.

101. 1. బలచండబలాఖ్యంచ వజ్రబాహుంచ వానరమ్. 13–288–8. కుంభకర్ణంప్రతి;

చున్న యన్నిశా²చరుని మార్కొనవోడి ³తారప్రముఖు లైన బలిముఖులు
నలువంకలం జెదరి పఱచిన.

102. మ. కని సుగ్రీవుఁడు బిట్టదల్చుచును వేగం¹బార దైత్యేంద్రు మా
ర్కొని ²సాలంబున వానియౌదలఁ గడున్ ఘోరంబుగాఁ ³బూన్చి వ్రే
సిన నావ్రేటున నిద్రదేఱి కడఁకం జేదోయి సారించి య
⁴మ్మనుజాశుండు గపీంద్రుఁ బట్టె రభసోన్మాదంబుమై నార్చుచున్.

103. క. పట్టువడిన సుగ్రీవునిఁ, ¹గట్టెదురం గాంచి ²యధికకలుషితమతి యై
³దట్టుఁడు లక్ష్మణుఁ డసురన్, బిట్టేసెం బిడుగుఁబోని పృథుబాణమునన్.

104. సీ. ఉరమాడి యాశరం బుచ్చి పోవుట యును గడు నొచ్చి యాకుంభకర్ణుఁ డలిగి
వెస వాలితమ్ముని విడిచి తోరపుశిలఁ గొనుచు నుక్కున రాముకూర్మి తమ్ము
దెసఁ బాఱుతెంచిన ధీరుండు సౌమిత్రి భల్లయుగ్మమునఁ దద్బాహుయుగము
నఱక మాయాబలోన్నతుఁడు దైత్యుఁడు చతుర్బాహుఁడై తోఁచిన
భానుకులుఁడు

ఆ. చేతు లెల్లఁ దునిమె శితభల్లముల వాఁడు, మఱి యనేకహస్తమస్తకాంఘ్రి
భాగుఁ డైనఁ గినిసి బ్రహ్మాస్త్ర మేసినఁ, గూలె నసుర కొండ గూలినట్లు.

105. వ. ఇట్లు కుంభకర్ణుండు దెగటారినం జూచి దూషణానుజులు వజ్రవేగుండును
ప్రమాథియు రాఘవానుజుం దలపడి నిబిడబాణౌఘ¹నిర్మగ్నుం

---

పవనచండి పవనాశ – పెక్కు ప్రతులు; వనచండవనాశ – డ. ల. 2. చరునకు మార్కొన – కొన్ని ప్రతులు. 3. తారాసుత (తనయ) – కొన్ని ప్రతులు.

102. 1. బేగి – అ. ఈ. ఎ. ఐ. గ. త. ల. శ; బేర్పు – అ. ఇ. ఉ. ఏ. ఓ. ఔ. క. చ. ద. 2. వాలంబున – శ. 3. బూన్చివైచిన – ఉ. ఘ; బూన్కి – వా. 4. మ్మనుజాదుండు – కొన్ని ప్రతులు; ద్దనుజేంద్రుండు – ద. శ.

103. 1. గట్టెదురుగ వచ్చి యడరి కలుషిత – కసం. 2. యడరి కలుషిత – ఎ. గ; యెర్పు కలుషిత – వా; యధిక కలుషిత – పెక్కు ప్రతులు. 3. ధట్టుడు – కొన్ని ప్రతులు; దట్టించి – శ; నెట్టన – ఔ.

105. 1. నిమగ్నుం – వా; నిర్మగ్నుం – కొన్ని ప్రతులు.

జేయుటయు నతండును వారి నతిబహుళశరజాలంబులం బొదివినఁ గయ్యం
బొక్క ముహూర్తంబు చూపఱకు రోమహర్షణం బై చెల్లెఁ దదనంతరంబ.

106. చ. అనిలసుతుండు నీలుఁడు రయం బెసఁగం [1]బఱతెంచి యమ్మహో
దనుజులమీఁద నేపున నుదగ్ర[2]నగాగ్రయుగంబుఁ బూన్చి వై
చినఁ గడు రూపఱం [3]జదిసి చెప్పఁగఁ జూపఁగ లేక పోయి ర
ద్దనుజులు వానరోత్కరము దద్దయు నుబ్బిన [4]నార్చె నత్తరిన్.

107. క. [1]ఆకులపడి నలుదెసలం, గాకులక్రియఁ జెదరి కడు వెగడుపడి రక్షో
నీకములు లంక యొనిమిది, [2]వాకిళ్ళను దూఱెఁ బౌరవర్గము దలఁకన్.

108. క. అంత దన కూర్మితమ్ముం, డంతకుఁ గూడుటయు దూషణానుజమృతివృ
త్తాంతంబును విని యెంతయు, వంతఁ దలరి యఱచెఁ బంక్తివదనుఁ డవశుఁడై.

109. వ. అయ్యవసరంబున నాముక్తకవచుండును నాబద్ధతూణీరుండును బ్రచండ
[1]కోదండుండును గృపాణబాణాసనాదివివిధసాధనోపేతసన్నిహిత
స్యందనుండును బురందరహృదయసాగరమందరుండును [2]నైన మేఘ
నాదుండు దండ్రిం జేరం జనుదెంచి వినయంబున ని ట్లనియె.

110. చ. వగవఁగ నేల దైత్యకులవల్లభ యేఁ గలుగంగ [1]నెమ్మెయిన్
జగముల నీదు శత్రులకు శౌర్యము సెల్లునె వృత్రవైరి లో
నగు సురకోటి యే పడఁచి యప్రతిమోన్నతి నున్న [2]నీకుఁ గ్రోఁ
తిగముల నోర్చు టెంతపని [3]దేవ ననుఁ గృపఁ బంపు మాజికిన్.

---

106. 1. జనుదెంచి - ఐ. ఘ. చ. త. ద. 2. మహాద్రియుగంబు - క. వీ. వ. 3. జెదరి - వా; జదిసి - పెక్కు ప్రతులు. 4. నార్చెనత్తరిన్ - పెక్కు ప్రతులు; నార్చిరెంత యున్ - వా.

107. 1. ఆకులగతి నలుదెసలం గాకులగతి జెదరి పారి కడువడి రక్షో - ఉ. క. ద. ల. 2. వాకిళ్ళం - వా. వీ; వాకిళ్ళను - పెక్కు ప్రతులు.

109. 1. కోదండ పాణియుఁ గృపాణ బాణ బాణాసనాది - వా. వీ; కోదండుండును గృపాణబాణాసనాది - ఈ. ఎ. ఐ. గ. త. 2. వరదానశక్తియుక్తుండును నైన అ. ఊ. గ. ల.

110. 1. నిమ్మెయిన్ - వా. వీ; నెమ్మెయిన్ - కొన్ని ప్రతులు. 2. నీకు - వీ. ల. శ. ష. కొన్ని ప్రతులు; నాకు - వా. 3. ధీరతనన్ - వా; దేవననున్ - పెక్కు ప్రతులు.

జేయుటయు నతండును వారి నతిబహుళశరజాలంబులం బొదివినఁ గయ్యం
బొక్క ముహూర్తంబు చూపఱకు రోమహర్షణం బై చెల్లెఁ దదనంతరంబ.

106. చ. అనిలసుతుండు నిలుఁడు రయం బెసఁగం [1]బఱతెంచి యమ్మహో
దనుజులమీఁద నేపున నుదగ్ర[2]నగాగ్రయుగంబుఁ బూన్చి వై
చినఁ గడు రూపఱం [3]జదిసి చెప్పఁగఁ జూపఁగ లేక పోయి ర
ద్దనుజులు వానరోత్కరము దద్దయు నుబ్బున [4]నార్చె నత్తరిన్.

107. క. [1]ఆకులపడి నలుదెసలం, గాకులక్రియఁ జెదరి కడు వెగడుపడి రక్షో
నీకములు లంకయెనిమిది, [2]వాకిళ్ళను దూఱెఁ బౌరవర్గము దలఁకన్.

108. క. అంత దన కూర్మితమ్ముం, డంతకుఁ గూడుటయు దూషణానుజమృతివృ
త్తాంతంబును విని యెంతయు, వంతఁ దలరి యలచెఁ బంక్తివదనుఁ డవశుఁడై.

109. వ. అయ్యవసరంబున నాముక్తకవచుండును నాబద్ధతూణీరుండును బ్రచండ
[1]కోదండుండును గృపాణబాణాసనాదివివిధసాధనోపేతసన్నిహిత
స్యందనుండును బురందరహృదయసాగరమందరుండును [2]నైన మేఘ
నాదుండు దండ్రిం జేరం జనుదెంచి వినయంబున నిట్లనియె.

110. చ. వగవఁగ నేల దైత్యకులవల్లభ యేఁ గలుగంగ [1]నెమ్మెయిన్
జగముల నీదు శత్రులకు శౌర్యము సెల్లునె వృత్రవైరి లో
నగు సురకోటి యే పడఁచి యప్రతిమోన్నతి నున్న [2]నీకుఁ గ్రో
తిగముల నోర్చు టెంతపని [3]దేవ ననున్ గృపఁ బంపు మాజికిన్.

---

106. 1. జనుదెంచి - ఐ. ఘ. చ. త. ద. 2. మహాద్రియుగంబు - క. వీ. వ. 3. చెదరి - వా; జదిసి - పెక్కు ప్రతులు. 4. నార్చెనత్తరిన్ - పెక్కు ప్రతులు; నార్చె రెంత యున్ - వా.

107. 1. ఆకులగతి నలుదెసలం గాకులగతి జెదరి పారి కడువడి రక్షో - ఉ. క. దః ల. 2. వాకిళ్ళం - వా. వీ; వాకిళ్ళను - పెక్కు ప్రతులు.

109. 1. కోదండ పాణియుఁ గృపాణ బాణ బాణాసనాది - వా. వీ; కోదండుండును గృపాణబాణాసనాది - ఈ. ఎ. ఐ. గ. త. 2. వరదానశక్తియుక్తుండునునైన ఆ. ఊ. గ. ల.

110. 1. నిమ్మెయిన్ - వా. వీ; నెమ్మెయిన్ - కొన్ని ప్రతులు. 2. నీకు - వీ. లః శ. ష. కొన్ని ప్రతులు; నాకు - వా. 3. ధీరతనన్ - వా; దేవననున్ - పెక్కు ప్రతులు.

నడచుటయు నతండు [4]వారి నించుకయు సరకు[5]గొనక కరతలం బెత్తి లక్ష్మణునిం బిలిచిన.

-: ఇంద్రజిత్తు లక్ష్మణునితోడ యుద్ధము సేయుట :-

సం. 3 – 272 – 8

116. క. విని యాతండును మౌర్వీ, [1]నినదంబున గగనధారుణీమధ్యం బె
ల్లను మ్రోయ మత్త[2]గజముం, గనిన మృగేంద్రుండపోలెఁ గడఁగెం బెలుచన్.

117. వ. అంత.

118. ఉ. చైత్రులు [1]గోత్రభూమిధరసారులు సాగరధీరు లుల్లస
చ్చిత్ర [2]ధనుఃకళావిదు లజేయులు భూరిజయార్థు లప్డు సౌ
మిత్రియు మేఘనాదుఁడు [3]నమిత్రవిభేదులు దాఁకి రార్చి లో
కత్రయభీకరప్రధనకౌతుకవేగితచిత్తవృత్తులై.

119. క. మచ్చరము మీఱ నొండొరుఁ, జిచ్చఱ పిడుగులను బోని శితవిశిఖములం
జెచ్చెర [1]నొంపగ విలుసే, ర్పచ్చటఁ దుల్యంబు లయ్యె [2]నయ్యిరువురకున్.

120. క. తనకంటె నపుడు రావణ, [1]తనయుం డన్ని మీఱఁ [2]జూచుఁ దా నాతనికం
టెను [3]మున్న రాఘవానుజుఁ, డనుపమశరలీల నతిశయంబుగ మెఱయున్.

---

చర బలంబు లార్చియెదురు – పెక్కు ప్రతులు. 4. దాని – వా. వీ; వారి – కొన్ని ప్రతులు. 5. సేయక – కొన్ని ప్రతులు.

116. 1. నినదము దిగ్గగన ధారుణీ – ఒ. 2. గజమును గనిన మృగేంద్రుడువోలె గడకం గవిసెన్ – శ. ష.

118. 1. గోత్రభూమిభృతిసారులు వార్ధిగభీరు లుల్లస – ఈ. ఐ. త. వీ. శ. ష; గోత్ర భూధరవిశాలపరాక్రమవంతు లుల్లస – ట. 2. ధనుష్కళా – అ. ఉ. ఓ. ఔ. క. గ. త. 3. నమేయబలుల్ వడిదాకి యార్చి లో – ఘ.

119. 1. బోరగ – వా; నొంపగ – అను పాఠమే పెక్కు ప్రతులందు గలదు – 'నొప్పింపగ' – అను నర్థమున ప్రయుక్తము. 2. నయ్యిద్దరకున్ – వా. వీ; నయ్యిరువురకున్ – కొన్ని ప్రతులు.

120. 1. తనయుడు తలమీరజూచి – ఈ. త. 2. జూచితానాతని......నతిశయంబుగ మెరసెన్ – అ. ఈ. ఎ. త. వీ. శ. ష. 3. మిగుల రాఘువా – అ. ఈ. ఎ. ఐ. త.

121. క. అంతఁ బటుతోమరంబుల, నెంతయు ¹వేస నృపతనూజు నింద్రజి వైవన్
²సంతతశరముల నన్నిటి, నింతింతలు శకలములుగ నేసె ననంతుఁడున్.

122. వ. అట్టియెడ నంగదుండు గడంగి లక్ష్మణునకుం దలకడచి యున్నంద¹వేగంబున మందోదరీనందనుం ²గదిసి ఘనమహీరుహంబున నుత్తమాంగంబు వ్రేసినం జలింపక ³నిలింపవైరి నిశిత⁴ప్రాసంబు వాసవపౌత్త్రుం జంప నెత్తుటయు లక్ష్మణుండు దానిం ⁵దునియ నేసిన నయ్యసురయు గదాదండంబున ⁶నేర్చి యంగదు ⁷వక్షంబు వ్రేసినం ⁸దొలంగక చెలంగి వాలిసూనుండు సాలవృక్షంబున నా రాక్షసు రథంబు రథ్యసారథిసహితంబుగాఁ జదియ నడిచె నట్లు విరథుం డయి ⁹యచ్చోటన యంతర్ధానంబు నొంది గగనగతుం డయ్యెఁ బదంపడి.

123. క. ఎవ్వలన నులుకునో యతఁ, డెవ్వగి నెటు సేయు నొక్కొ ¹యనుచుం గడున్
నివ్వెఱపడి కపిసేనలు, గ్రొవ్వ సెడం బడ్డ దనుజనాథుఁ డుద్ధతుఁడై.

124. చ. ఉఱుముచు సంధ్యకాల¹చలితోగ్రబలాహకలీలఁ దోఁచి యా
దఱచగు ఘోరపుం బిడుగు తండము వోలె శరప్రకాండము
క్కఱఁ దొరఁగించుచుం గపిబలావలిఁ ద్రుంచి కలంచె నేపునన్
నెఱఁకులు నొంచి బాణమయనీరధి ముంచె రఘుప్రవీరులన్.

---

121. 1. నృపతనయు నసురకులమిన్ వైవన్ — ఇ. ఈ. ఎ. ఏ. త. ద. ఱ. వీ. శ. స.
2. సంతసముగ నాశరములనింతింతలు — ఇ. ఏ; సంతతశరముల — ఱ.

122. 1. గమనంబున — కొన్ని ప్రతులు. 2. గవిసి — వా. వీ; తలపడి — ఇ. ఈ. ఎ. త. 3. నిలింపపతివైరి — వా. వీ; నిలింపవైరి — పెక్కు ప్రతులు. 4. ప్రాసంబున వాసవపౌత్త్రు వైచుటయు — ఇ. ఏ. ఓ. గ. ఱ. 5. దుత్తునియలు — వీ. శ. స. 6. దీర్చి — వా; ద్రిప్పి — ఈ. ఐ. త; దిగిచి — ట; పేర్చి — ద; నేర్చి — ఉ. శ. 7. సవ్యపార్శ్వంబు — స. కొన్ని ప్రతులు. 8. దొలంగి వాలిసూనుండు — గ. ఘ. ద. 9. యచటనంత — వీ. శ. స; యతం డచ్చట నంత — కొన్ని ప్రతులు.

123. 1. యితడనుచు — ఇ. ఏ. ఒ. ఓ.

124. 1. చరితోగ్ర — వా; విలయోగ్ర — ట; జనితోగ్ర — ఉ. కసం. వీ. శ. స; చలితోగ్ర — కొన్ని ప్రతులు.

125. క. [1]మాయాధికు నంతర్హిత, కాయుఁ బురందరవిరోధిఁ గాకుత్స్థులు క్రో
ధాయత్తు లగుచు నేసిరి, ధీయుక్తులు శబ్దభేదిదివ్యాస్త్రములన్.

126. వ. వానికి నలిగి సుగ్రీవాదివానరులు వృక్షశిలాప్రకరంబులు గైకొని యాకసంబున [1]కెగసిన నద్దానవుండు వారినందఱ వెఱచఱవ నేయుటయుఁ జేవ సెడి మగుడి పుడమి [2]కెఱఁగిరి వాఁ డంత నిలువక వాఁడితూపులు వఱపి రామలక్ష్మణులఁ గరంబు నొప్పించినం [3]జె య్వేది యయ్యన్నయుం దమ్ముండును గపిబలంబు లడల ధరణీతలంబునకు నొరగి విలయకాలపతితు లయిన [4]సూర్యేందుల చందంబున మన్నం గని సింహనాదంబు సేసె.

127. మ. పరమో[1]దాత్తులఁ బార్థివోత్తముల శుంభద్విక్రమారంభులన్
సురసంకాశులఁ గోసలప్రభుల నస్తోక[2]ప్రభోద్దాములన్
వరలాభోన్నతుఁ డన్నిశాచరుఁడు గర్వం బొప్ప దుర్వారని
ర్భర[3]నాగాస్త్రములం దదాహవ[4]మహిన్ బంధించె నయ్యుద్ధలన్.

128. వ. [1]తదవసరంబున సుగ్రీవ సుషేణ జాంబవత్ప్రముఖు లయిన కపివీరులు రామలక్ష్మణు లున్నయెడకుం జనుదెంచి యెయ్యదియునుం [2]జేయునది నేరక దుఃఖితు లగుచుండ నవ్విభీషణుండు వారి నాశ్వాసించి బ్రహ్మాస్త్ర ప్రయోగంబున నారాజకుమారులకు బంధ[3]మోక్షంబు గావించె [4]సుగ్రీవుండు విశల్యకరణి యను నౌషధంబున వారల [5]విశల్యదేహులఁ జేసె నిట్లు ప్రబుద్ధు లై రాఘవులు గ్రమ్మఱఁ గయ్యంబునకుం గడంగి రప్పుడు రావణానుజుండు రామునకుఁ గృతాంజలి యై యి ట్లనియె.

---

125. 1. మాయాహితు - ఇ. ఎ. ప.

126. 1. కుఱెగసిన - కొన్ని ప్రతులు. 2. కొరగిరి - ఈ. ఐ. త. డ; కెదిగిరి - అ. ఘ. చ. 3. జేయునది లేక యయ్యన్నయుం - పెక్కు ప్రతులు. 4. సూర్య చంద్రుల చందంబున - కొన్ని ప్రతులు.

127. 1. దారుల - అ. ఉ. వీ. శ. 2. ప్రభాధాములన్ - అ. ఔ. క. ఘ. చ. డ. ద. స. 3. నాగాస్త్రమునన్ - ఈ. త. శ. 4. మునన్ - ఇ. ప.

128. 1. తదనంతరంబ - వా. వీ; తదవసరంబున - ఒ. ఓ. గ. ల. 2. జేయనేరక దుఃఖితులై యున్నం జూచి విభీషణుండు - ఈ. ఎ. ఐ. త. 3. మోక్షణంబు - వా; మోక్షంబు - కొన్ని ప్రతులు. 4. సుగ్రీవుండును విశల్య - పెక్కు ప్రతులు. 5. విశల్యులం జేసె - శ. ష.

129. సీ. నరనాథ కిన్నరనాథుని పనుపున [1]శ్వేతుండునాఁగఁ బ్రసిద్ధుఁ డైన
గుహ్యకుఁ డిదె మీకుఁ గొనివచ్చె దివ్యతోయంబు లీజలముల నంబుజాత
నయనపద్మక్షాళనము[2]సేయుఁ డిప్పు డదృశ్యభూతము లెల్లఁ దెల్లముగను
గానంగఁ బడు నన్నఁ గైకొని రాఘవుం డనుజసహాయసమన్వితముగ
ఆ. నట్లచేసి కనియె నంబరమధ్య సం, చారుఁ గృత[3]విపక్షసంప్రహారు
నింద్రజాలశీలు నింద్ర[4]విద్రావణు, రావణాగ్రతనయు రహితవినయు.

130. వ. అరక్కసుండునుం దనచేసిన పౌరుషంబు ప్రతిహతం బగుటకు [1]విస్మయంబంది మగుడి [2]హోమకార్యంబునకుం బోవం దొడంగిన నెఱింగి విభీషణుండు లక్ష్మణుం జూచి యన్నిశాచరుడు హోమసమాప్తి యయ్యెనేని [3]నెవ్వరికిం గెలువ నశక్యుంబు వీని వెన్నడిం దగిలి తెగటార్పు మనిన నతండు.

131. ఆ. అర్చి వెనుకఁ దగిలి యశనికల్పము లైన, శరము లేయుటయును [1]నిశాటవరుఁడు
గినిసి వడి నెదిర్చి కీలించె లక్ష్మణు, నంగకముల నుజ్జ్వలాంకములు.

132. వ. ఇట్లు దలపడి యవ్వీరు లిరువురు నిశాచరవనచరబలంబులు రణం బుడిగి వెఱఁగుపడి తమపోరు చూచుచుండ నుద్దండవేదండ[1]యుగళంబు పోలిక నాఖిలశార్దూలద్వయంబుకరణి నసహ్యసింహ[2]యుగళంబు లై వడి నతిఘోరయుద్ధంబు సేయం దొడంగి రంత.

---

129. 1. శ్వేతకేతుఁడు నా ప్రసిద్ధుడైన-ల. 2. సేయు మిప్పు డదృశ్య-పి. శ. వ; సేయు మిపుడ యదృశ్యభూతములెల్ల దెలివిగాఁగ – ఈ. ఎ. ఐ. త. 3. కపీంద్రసంప్రహారు – అ. 4. జిద్రణలోలు రావణాగ్ర – వా; విద్రావణురావణాగ్ర – కొన్ని ప్రతులు.

130. 1. విస్మయంబునొందుచు – పెక్కు ప్రతులు. 2. హోమకార్యంబును దొడంగం బోయిన – వా; హోమకార్యంబునకుం బోవందొడంగిన – పి. శ. వ. 3. రెవ్వరికిం – ఉ. ఏ. ఓ. ఔ. క. గ. ద. శ. వ.

131. 1. నిశాచరుండు – పెక్కు ప్రతులు.

132. 1. ద్విపయుగంబు చందంబున (తెరంగున) – పెక్కు ప్రతులు; ద్విపయుగంబు పోలిక – పి. శ. వ. 2. యుగ్మంబు – పెక్కు ప్రతులు.

133. క. వడి నొక్కపెట్ట లక్ష్మణుఁ, డడరించె నిశాత[1]శరము లారక్కసుపైఁ
గడఁగి యతఁడు నాతనిపై, నెడపక [2]నాఁటించెఁ గలయ నెనిమిది
యమ్ముల్.

134. ఆ. వాఁడితూపు లొడల వడి నాఁటుటయు [1]నొచ్చి, తోన కలుషరోష ధూమకేతుఁ
[2]డతిశయిల్ల రాఘవానుజుం డురుచాప, శింజినీరవంబు సెలఁగఁ గదిసి.

*-: ఇంద్రజిత్తు లక్ష్మణునిచేతఁ జచ్చుట :-*

సం. 3 _ 273 _ 22

135. మ. శితభల్లద్వితయంబునం గడు వెసం జేదోయి ఖండించి ఖం
డితగోత్రాచలతుంగశృంగశతకోటిస్ఫారఘోరానల
ద్యుతిసాంద్రం బగు శాతభల్ల మొకటం ద్రుంచెం గనత్కుండలా
న్వితమై యొప్పు నిశాచరేంద్రుశిరముం వీరక్రియాదక్షుఁడై.

136. ఆ. భగ్నశాఖ మైన పాదపంబును బోలె, నిట్లు సంగరమున నింద్రజిత్తు
పడినఁ జూచి దైత్యబలములు భయ మంది, పఱచెఁ జెలఁగి యార్చెఁ
బ్లవగబలము.

137. క. తనయుని మరణం బేర్పడ, విని [1]దశకంధరుఁడు శోకవివశుం డై బో
రన బాష్పము లొలుకఁగ [2]హా, యనుచుఁ బదినోళ్ళఁ దెఱచి యఱచెం
బెలుచన్.

138. క. శోకంబు సైఁపలేక య, శోకవనంబునకు నరిగి సురశత్రుఁడు [1]రో
షాకులుఁడై జానకిఁ బ, ట్యాకారం జంపఁ జంద్రహాసము వెఱికెన్.

---

133. 1. శరచయమురక్కసుపై - అ. క. చ. 2. నాటంగ నేసె నెనిమిది శరముల్ - ఆ. ఎ. ఐ.

134. 1. నొచ్చితోన కలుషరోష - పెక్కు ప్రతులు; నేపుతోడ పరుషరోష - వా. 2. డతిశయిల్లి - వా; డతిశయిల్ల - పెక్కు ప్రతులు.

137. 1. దశకంఠుండు శోక - కొన్ని ప్రతులు. 2. హాయని పదినోళ్లలును - శ; హా యని పదినోళులును - ఈ. ఉ. ఐ. ఔ; హాయని తన పదినోళ్ల - ల.

138. 1. కోపాకులుడై - ఈ. ఊ. ఐ. త.

150. వ. [1]ఇట్లు దలపడి రామరావణు లతిఘోరంబుగాఁ బోరం దొడంగి రంతఁ బంక్తివదనుండు నిబిడ[2]జ్వాలాకరాళం బగు శూలంబు రాఘవుమీఁదం బ్రయోగించిన నతండును నడుమన దానిఁ దునియలు సేసిన నీసునం బెరిఁగి సురవైరి మఱియునుం దరతరంబ శతసహస్రసంఖ్యల శూలంబులు భిండివాలంబులుఁ దోమరంబులు శరంబులుం బఱఁగించి యంబరం బెల్ల నస్త్రమయంబు గావించిన నఖిలభూతంబులు హాహాకారవ్యాకులంబు లయ్యె నసురసైన్యంబున, భేరీప్రముఖతూర్యనినదంబులు సింహనాదంబులు సెలంగెఁ గొండొక సేపునకు రావణప్రయుక్తం బైన శస్త్రాస్త్రప్రవాహం బంతయు నిరంతరవిశిఖధారాసారంబునం గబళించి రామజలధరంబు గంభీర [3]సారంబునం బొదలుటయు సకలప్లవంగసముదయంబును బ్రహర్ష[4]కోలాహలబహుళం బయ్యెఁ బదంపడి.

## -: శ్రీరాముఁడు రావణాసురుని సంహరించుట :-

సం. 3 - 274 - 24

151. సీ. కమనీయకనకపుంఖప్రభాభాసియుఁ [1]దీక్ష్ణముఖంబును దివిజ యక్ష
ముని సిద్ధ సాధ్య [2]సమ్మోదావహంబు నై విలసిల్లు [3]బాణ మవ్వీరవరుఁడు
గైకొని బ్రహ్మాస్త్రకలితమంత్రాభియుక్తంబుగా నొనరించి కార్ముకమున
సంధించి జగములు జయపెట్టఁ జెచ్చెరఁ దివిచి యేయుటయును దీవ్రభంగి.

ఆ. గడఁగి యాశరంబు గల్పాంత [4]వహ్నియ, పోలెఁ బంక్తికంఠుఁ బొదివి నీఱు
గా నొనర్చె సూతఘనరథరథ్యస, మన్వితముగ నొక్క మాత్రలోన.

152. వ. అప్పు డంబరంబున దివ్య[1]తూర్యనాదంబులు సెలంగం గలంగి [2]యసురు లెల్లఁ దొలంగిరి గంధర్వగానంబులు నప్సరోనర్తనంబులుఁ బ్రవర్తిల్లె నింద్రాది దేవోత్తము లన్నరదేవోత్తముం బ్రస్తుతించుచుం బ్రమోదంబు నొందిరి.

---

150. 1. ఇట్లు రామరావణు - వీ. శ. ష. 2. జ్వాలంబగు - వా; జ్వాలాకరాళంబగు- అ. ఆ. ఈ. త. ల. వీ. శ. ష. 3. సంరంభంబునన్ - వా. వీ; సారంబునం - ట. శ. ష. 4. కోలాహలంబయ్యె - వా. వీ; కోలాహలబహుళంబయ్యె - కొన్ని ప్రతులు.

151. 1. దీప్తముఖంబు - క. ఘ. చ. ఠ. డ. 2. సమ్మోహనంబునునయి - ఈ. ఐ. త. 3. బాణంబు వీరవరుడు - ఆ. ఈ. ఎ. ఐ. త. 4. దహనంబు - వా; వహ్నియ- కొన్ని ప్రతులు.

152. 1. తూర్యరవంబులు - ఏ. ల. 2. యసురులు - పెక్కు ప్రతులు.

153. క. ఏకోత్సవంబు లయ్యెఁ ద్రి,లోకంబులు నఖిలలోక లుంటాకుఁడు ఘో
రాకారుఁడు దశ[1]వదనుఁడు, [2]గాకుత్స్థని శాతశరముఖంబునఁ బడినన్.

154. ఉ. అంత ననంతకీర్తి శరణాగతరక్షణశాలి రాఘవుం
డెంతయు వేడ్కతోడ నసురేంద్రుపదంబున నవ్విభీషణున్
సంతత[1]పుణ్యుఁ బుణ్యజనసంతతివర్ధనుఁ గట్టెఁ బట్ట మ
త్యంతదయాంతరంగుఁడు కృతాహితభంగుఁడు దానుఁ దమ్ముఁడున్.

155. వ. తదనంతరంబ [1]యవింధ్యుండు విభీషణసహితుం డై జానకి నుచితయానంబున నునిచికొని [2]రామదేవు పాలికిం[3]దెచ్చి దేవా దేవిం బరిగ్రహింపు మని వి[4]న్నవించిన నతండు.

156. చ. అతి[1]మలినాంగి జీర్ణమలినాంబర[2]ధారిణి సంతతాశ్రుపం
కితవిలసత్కపోలఁ బరికీర్ణ [3]జటాయితకేశ[4]భార నా
యతఘనదుఃఖదూషితఁ బ్రియాంగనఁ గన్గొని యప్రియాత్ముఁ డై
నుతచరితుండు దద్దయు మనోవ్యథ సేయుచు నింతి కిట్లనున్.

157. సీ. అధికదుష్టాచారుఁ డైన దశాననుఁ డింతకాలముఁ దనయింటఁ బెట్టి
కొని యున్న నిన్నుఁ [1]గై కొనిన నస్మచ్చరిత్రమునకుఁ దొడరదే ధర్మహాని
పరిభవంబునకు నై ప్రతికారముగ వైరిఁ గూల్చితిఁ గాని నీకొఱకుఁ గాదు
మెలఁత నీచరితంబు మేలైనఁ గీడైనఁ గానిమ్ము నిన్ను నిక్కముగ నొల్లఁ

---

153. 1. కంఠుడు – పెక్కు ప్రతులు. 2. గాకుస్థకులోత్తరు విశిఖమున బడుటకున్ – అ.

154. 1. పుణ్యశీలిజన – ఔ.

155. 1. యవిద్ధుండు – ఉ. ఓ. చ. ర; యావిభీషణుండు వృద్ధరాక్షససహితుండై – అ; నయువిదుండగు విభీషణుండు జానకి – ఆ. ఈ. ఎ. ఐ. త. ద; యవ్విభీషణుండు జానకి – శ. ష. 2. రామునకు నివేదించి కృతాంజలియై దేవా – ఆ. ఈ. ఎ. ఐ. త; 3. దెచ్చి కృతాంజలియై – ల; దెచ్చివై దేహిం – ఔ. ద. 4. విన్న వించుటయు – వా. వీ; విన్నవించిన – పెక్కు ప్రతులు.

156. 1. కృశితాంగి – ఔ. 2. వాసిని – పెక్కు ప్రతులు. 3. జటాయత కేశభార – ఉ. ఊ. గ; జటాయుత – కొన్ని ప్రతులు. 4. పాశ – అ. ట.

157. 1. గై కొన్న నస్మచ్చరిత్ర – ఈ. ఉ. ఏ. చ. త. వీ. శ. ష.

ఆ. బరగఁ గుక్కవాతఁబడిన హావ్యముభంగి
యయ్యొ నీతెఱంగు [2]నరయ నిపుడు
[3]గాన యిచటఁ దడయఁగాదు చెచ్చెర నీకు
నిష్ట మయిన [4]యెడకు నేఁగు[5]మతివ.

158. ఆ. అనినఁ జెవులఁ గోఱవి గొని చూఁడినట్లైనఁ, దాల్మి [1]పెల్లగిల్లఁ దరళనయన
మొదలు నఱక నొఱగు కదళిచందంబున, నెలఁత [2]దల్లడమున నేల వ్రాలె.

159. క. వెఱఁగుపడి హర్షరాగము, [1]దఱిఁగిన [2]వెలువెల్లనై వదనములు వ్రాలం
[3]దెఱఁ గేది ఱిచ్చపడి ర, త్తఱిదర్పితజనము లెల్లఁ దద్దయు [4]వంతన్.

160. తే. పడఁతి యల్లన [1]మఱి కొంతవడికిఁ దెలిసి
యలసమూర్తి యై [2]దందడి నశ్రు లురులఁ
గేలు[3]ముకుళించి వసుమతీపాలుఁ జూచి
యెలుఁగు గుత్తుకఁ దగులంగ నిట్టు లనియె.

161. క. [1]నినుఁ గీడు[2]వొరయ కుండఁగ, జనులకు నానిక్క మెక్క జననాయక యే
ననలంబుఁ జొచ్చి వెడలెదఁ, గనుఁగొను మిచ్చనవు నాకుఁ [3]గరుణింపు
దగన్.

---

2. నతివయిపుడు - అ. ఎ. ఐ. 3. గాననిచట దడయగారా (గా) దు చెచ్చెర నిష్టమైనయెడకు నేగుమతివ - ల. పీ. శ. ష. 4. కడకు - వా; యెడకు - కొన్ని ప్రతులు. 5. మబల - అ. ఘ. చ.

158. 1. యెల్లగిల్ల - ఉ. ఒ. ఓ. గ. ర. థ; యెల్లనోడి ధవళనయన - ఇ. ఏ. 2. దల్లి డిల్లి నేలబడియె - ఔ.

159. 1. వరలియు వెలవెల్లనైన వదనము వ్రాలన్ - ఈ. ఐ. త. శ. 2. గడువెల్లనై - కపం. పీ. 3. తెరవేది - ఈ. ఐ. త; తెఱువేది - శ. 4. నలుగన్ - ట.

160. 1. యొక్కింత వడికి - అ. అ. ద. 2. కనుదోయి నశ్రులురుల - ఈ. ఎ. ఐ. త. పీ. శ. ష; కనుదోయి నశ్రులొలుక - అ; కందోయి - ల. 3. మొగిడించి - వా. కొన్ని ప్రతులు; ముకుళించి - ఉ. ఔ. ద. పీ. శ. ష.

161. 1. నినుఁగీడు - సూ. 2. వొందకుండగ - ఏ. ఓ. గ. చ. శ. ష. 3. గరుణింపదగున్ - అ. ఇ. ఉ. ఏ. ఒ; గరుణింపనగున్ - ఓ. ఘ. స.

162. ఉ. నాదగుబుద్ధి నీదు చరణ[1]స్మరణంబ యొనర్చుఁ గాని యొం
డేదియు నెన్నఁడుం దలఁప దిట్టిద [2]యొండొక చందమైన ని
మ్మేదినియుం గృశానుఁడు సమీరుఁడు శీతకరుండు నర్కుఁడుం
గా దన కీక్షణంబ ననుఁ గాల్పరె వేల్పులు [3]చెట్ట[4]సైతురే.

163. వ. అని పలుకుటయు [1]నప్పుడు పృథివ్యాదిభూతంబు లెలుంగులు సెలంగ నెల్లవారును వినం దమ తమ నామంబు లెఱింగించి యి ట్లనిరి.

164. క. [1]విను ముత్తమురాలు సుమీ, జననాయక జనకతనయ సందేహపడం
బనిలేదు మాకుఁ దెల్లము, జనులకు మము మొఱఁగరాదు సకలక్రియలన్.

165. వ. అనిన యనంతరంబ సకల[1]సురమునిగణసహితంబుగా బితామహుండు సనుదెంచి రాఘవుచేత [2]సత్కృతుం డై యిట్లనియె నయ్యా నీవు [3]సకలభూతదుస్సహుం డైన రావణుం బరిమార్చి లోకహితంబు సేసితివి వినుము నలకూబరు శాపంబునం జేసి దశగ్రీవునకుఁ బరస్త్రీలయందు బలాత్కారంబు [4]సెల్లదు గావున నీధర్మపత్ని [5]యం దొక్క దురితంబును బొరయదు నీవు [6]నిర్విచారుండ వై యిప్పతివ్రతం బరిగ్రహించి నెమ్మదిఁ బురంబున కరుగుమని పలికి యతనికిఁ బ్రియంబుగాఁ దత్సమరనిహతు లైన వానరులఁ బ్రాప్తజీవులం జేసి పరమేష్ఠి సనియెఁ బురందరసారథియును దాశరథి వీడ్కొని [7]హరిసహస్రయుక్తం బయిన రథంబు [8]గొని [9]నాకలోకంబున కరిగె నంత.

---

162. 1. స్మరణం బొనరించుగాని — ఈ. ఐ. త. 2. యిందొక చందమైన — అ. ఉ. ఓ. ఔ. గ. చ. ద. ల. పీ. శ. ష. 3. బెట్టుసైతురే — ఈ. ఔ. చ. త. ద. శ. ష; చూచిసైతురే — ల. 4. సైతురే — పెక్కు ప్రతులు; సేతురే — వా.

163. 1. నప్పుడు — కొన్ని ప్రతులలో లేదు.

164. 1. విను ముద్దరాలు సుమ్మీ జనకతనూజాత యిందు సందేహపడం — ట. డ.

165. 1. దేవమునిసహితంబుగా — ఉ. డ. పీ. శ. ష. 2. నమస్కృతుండై — వా. సత్కృతుండై — కొన్ని ప్రతులు. 3. సర్వభూత — పెక్కు ప్రతులు. 4. సే రాదు — ఈ. ఆ. క. 5. యొండొక్క — వా; యందొక్క—పెక్కు ప్ర 6. నిర్వికారుండవై — ఈ. ఐ. త. 7. హరియుక్తంబైన — ఈ. ఐ 8. గైకొని — వా. పీ. కొన్ని ప్రతులు; గొని — కొన్ని ప్రతులు. 9. కరిగె — పెక్కు ప్రతులు.

త్రంబు వినవలతుం జెప్పవే [3]యనిన నతనికి మార్కండేయుండు సావిత్రి యను రాజపుత్త్రి చరిత్రంబు విను మది నీప్రశ్నంబునకు నుత్తరం బగు నని యిట్లనియె.

*-: మార్కండేయుఁడు ధర్మరాజునకు సావిత్ర్యుపాఖ్యానంబు సెప్పుట :-*

సం. 3 – 277 – 5

170\. సీ. కలఁడు మద్రేశుండు ఘనుఁ డశ్వపతి యను [1]ధరణీశుఁ డతఁడు సంతాన[2]కాంత
నెంతయు ధృతిఁ బదునెనిమిది [3]యేఁడులు సావిత్రిఁ [4]గొల్చె నజ్జనవిభునకు
నద్దేవి ప్రత్యక్షమై వర మడుగుము నావుడు నతఁడు వినమ్రుఁ డగుచు
నాత్మజుఁ గోరెద ననవుడుఁ గన్నియ వుట్టు నీ కనియె నా భువనమాత

తే. [5]యనుడు దేవి భవత్కృప నస్మదీయ
వాంఛితము సఫలంబు గా వలదె యని నృ
పోత్తముఁడు [6]విన్నవించె నయ్యోగమూర్తి
గాఢకారుణ్య వికచహృత్కమల యగుచు.

171\. వ. ఏను నీమనోరథంబు తెలిసంగు [1]మున్న చతుర్ముఖున కెఱింగించిన నతండు గన్నియఁగా నిర్దేశించె నద్దేవుని యానతి యమోఘంబు విను మక్కన్నియ కారణంబున నీకు నొక్కవిధంబునం బిదపఁ బుత్త్రశత[2]లాభంబు నగు సంత సిల్లు మని యనుగ్రహించి యద్దేవి యంతర్ధానంబు నొందె నశ్వపతియును సావిత్రీప్రసాదంబున నిజధర్మపత్ని యయిన మాళవియందు సావిత్రి యను [3]కూతుం గని యక్కన్నియ నతి[4]గౌరవంబునం బెనిచె నంత.

---

దుఃఖంబుల కోర్చి – వా; దుఃఖంబులునోర్చి – పెక్కు ప్రతులు. 3. యనిన మార్కండేయుండు – పెక్కు ప్రతులు.

170\. 1. ధరణీశ్వరుండు సంతానవాంఛ – ఎ. 2. వాంఛ – పెక్కు ప్రతులు. 3. యబ్దములు – ద. 4. గొల్వనజ్జన – ఈ. ఐ. త. 5. యతడు – ఔ; [యపుడు – యని పాఠమై యుండనోపు]. 6. విన్నవింప – వా; విన్నవించె – పెక్కుప్రతులు.

171\. 1. మున్ను – కొన్ని ప్రతులు. 2. లాభంబగునని – పెక్కు ప్రతులు; లాభంబు సంభవించునని – శ. ష. 3. కూతురుం – ఈ. ఎ. ఐ. చ. త. 4. గారవంబున – ఇ. ఏ. చ.

172. క. అవనజాతి పరిస్ఫుట, యౌవన యై సిద్ధ సాధ్య యక్షాసుర క
న్యావలిఁ దనసౌందర్య, శ్రీవిలసనరేఖ నవహసించుచు నొప్పెన్.

173. తే. కోరి జనపతి దనకూర్మి కూఁతుఁ జూచి
గుణవయోరూపముల [1]ననుకూలుఁ డైన
భర్త నెమ్మెయి దీనికిఁ బడయువాఁడ
నొక్కొ యని [2]యెందు దడవుచు నుండె నెలమి.

174. వ. అదియును సాళ్వపతి యైన ద్యుమత్సేనుకొడుకు సత్యవంతుండు రూపవంతుం డనియును గుణవంతుం డనియును విని వానియందుఁ జిత్తంబు దగిలి యున్నను సిగ్గుపెంపున నెవ్వరికి నెఱింగింప కుండె నంత నొక్కనాఁడు మద్రపతి కడకు నారదుం డరుగుదెంచిన నతం డమ్మహామునిని నుచితసపర్యాపరితోషితుం జేసి [1]సద్గోష్ఠీవిశేషంబులు సలుపుచున్న యెడ.

175. క. నెచ్చెలులు దన్నుఁ గొలువఁగఁ, బచ్చవిలుతు కలిమి యెల్లఁ బద్మానన యై
యచ్చుపడినట్లు మెఱయుచు, నచ్చటి కేతెంచె భూవరాత్మజ యెమ్మిన్.

176. వ. ఇట్లు వచ్చి సఖీజనంబు నంతంత నిలిపి మెలుపుతోడి పొలుపు[1]న నమ్ముగ్ధలీలా[2]మధురం బగుచుండఁ దండ్రికి మ్రొక్కిన నతండు [3]గాఢస్నేహదోహళంబగు చిత్తంబుతో నత్తన్వి గ్రుచ్చి యెత్తి నిజాంకతలంబున నునిచికొని [4]సముచితోపలాలనకేళీపరవశుం డయ్యె నప్పుడు నారదుం డమ్ముగ్ధియం జూచి యశ్వపతితోడ నిక్కన్నియం దగినవరున కొసంగక యి ట్లేల యునిచినవాఁడ వనిన నతండు గూఁతున కిట్లనియె.

---

173. 1. కనుకూలుడైన – వా. కొన్ని ప్రతులు; ననుకూలుడైన – ఆ. ఏ. ఐ. ఓ.
2. యెద్ద – వా; యెందు – పి. శ. వ. కొన్ని ప్రతులు; యెందగలచుచునుండె–ల.

174. 1. ప్రసంగగోష్ఠి – ఉ. ఠ. వి; యుచితగోష్ఠి – ఞ; సుఖగోష్ఠి – ఛా.

176. 1. మిగులవిముగ్ధ – వా; ననమ్ముగ్ధ – ఎ. ఐ. ఔ. చ. ఝ. త. 2. మధురంబుగ దండ్రికి – పి. శ. వ. 3. ప్రగాఢ స్నేహసన్నాహ దోహళం – వా. పెక్కు ప్రతులు; గాఢ స్నేహదోహళం – ఘ. 4. సమంచిత – వా; సముచిత – పెక్కు ప్రతులు.

177. తే. తల్లి నీగుణరూపవృత్తములకెందుఁ, దగిన [1]వరు నీవ యిమ్ముగ నరసి వెచ్చి
నీదు మనమున కెక్కిన నృపకుమారుఁ, గోరి వరియింపు మిదియ
నాకుఁ బ్రియంబు.

178. వ. అనిన నదియుఁ గొండొక లజ్జించి కోర్కి పెంపున సిగ్గు దొలంగం ద్రోచి ప్రకటకౌతూహల [1]తరళితాంతరంగ యగుచుఁ దండ్రి కిట్లనియె.

179. క. చిరకీర్తి సాళ్వభూవరు, వరతనయుం డయిన సత్యవంతుఁడు నాకున్
[1]వరుఁడుగఁ గోరుదు మదిలో, నరవర యాతనికి నిమ్ము నన్నుఁ బ్రీతి మెయిన్.

180. వ. సాళ్వపతి[1]యును నిపుడు దైవయోగంబునం జేసి విగతచక్షుం డయి తన రాజ్యంబు వైరులచేతం గోల్పడి పుత్త్రదారసహితంబుగా వనంబున నున్నవాఁ డట్లయినను సత్యవంతున వరియింతు ననిన మంత్రేశ్వరుండు నారదుం జూచి మునీంద్రా మీ యెఱుంగనివారు లేరు సావిత్రిచేత వరియింపఁ బడిన కుమారుం డెట్టివాఁడు వాని గుణరూపశీలంబు లెఱింగింపుఁ డనిన నారదుం డిట్లనియె.

181. సీ. సత్యంబు పలుకుట సత్య[1]వంతుండన నతఁడొప్పు మఱియుఁ జిత్రాశ్వుఁ డనఁగ
నామాంతరంబు [2]నన్నరనాథసుతునకుఁ గలదు తేజంబునఁ గమలమిత్త్రు
బుద్ధి నింద్రాచార్యుఁ బురుడించు శూరత వాసవుఁ దాలిమి వసుధఁ బోలుఁ
గాంతిఁ [3]జంద్రుని కెనగాఁదగు [4]రూపున నాశ్వినేయుల నరయనఁ [5]దలిర్చుఁ

177. 1. వరు గాంచనైతిని చదవి కానవి మూన్సున కెక్కిన—వా; వరు నీవ యిమ్ముగ వెచ్చి నీదు మనమున కెక్కిన — పీ. శ. ప. పెక్కు ప్రతులు.

178. 1. తరంగితాంతరంగ — క. పీ. టొ.

179. 1. వరునిగ — ఈ. ఎ. ఱ. ఝ. శ.

180. 1. యును నిపుడు — కొన్ని ప్రతులు; యిప్పుడు — వా. కొన్ని ప్రతులు.

181. 1. వంతుండు వా గడు నొప్పు నతడు చిత్రాశ్వ—ఐ. 2. మ నరనాథ — ఆ. ఇ. ఉ. పీ. టొ; వా నరనాథ — ఎ. ఝ. 3. జంద్రుకు సరిగాదగు — అ. ట. 4. అశ్వమున వాంజనేయున కెనయనగ వచ్చు — అ. ట. 5. దనర్చు — అ. ఇ. ఉ. టొ. ఘ. చ.

ఆ. తపము శమము దమము దానంబు బ్రాహ్మణ, భక్తియును [6]మహానుభావతయును
నతనియందకాని యన్యులందుం లే, దింత నిక్క్ష్మువము మహితలేశ.

182. వ. వానియందు నీ డొక్కటి గలదు [1]పరిణయంబు మొదలుగా నొక్క సంవత్స
రంబునకు మృతిం బొందు నిది నీకుఁ జెప్పవలయుటం జేసి చెప్పితి ననిన
నతండు గూఁతు మొగంబు సూచి తల్లీ యిమ్మహాత్ముండు దేవరహస్యం
బెఱుంగు నీతని వచనం బమోఘంబు నీకు నట్టి వరుం[2]డేటికి నొండొక్క
వరుని వెదకికొ మ్మనిన [3]నక్కన్యక యిట్లనియె.

183. క. వినుము మనోవాక్కాయము, లను మూఁడు దెఱంగులందు నంతఃకరణం
బనఘ ప్రధానము గావున, మనసునఁ గైకొన్న భర్త [1]మానుట[2]దగునే.

184. వ. సత్యవంతుం డెట్టి[1]వాఁడైననుం గాని మ్మే నింక నొరుల వరియింప [2]నొల్ల
ననిన నశ్వపతి [3]నారదు దెసఁ జూచుటయు నతం డిట్లనియె.

185. చ. [1]గొనముల[2]ప్రోక నీ యనుఁగుఁ గూఁతురు దీని తలంపు మాన్పఁగా
మనకు నశక్య మింక ననుమానము లేల నరేంద్ర [3]కూఁతుఁ జ
య్యన నృపసూతి కిమ్ము కమలాననచేసిన పుణ్యగౌరవం
బున నయినం బ్రియుండు పరిపూర్ణ చిరాయురుపేతుఁ డయ్యెడున్.

---

ద. 6. మహాప్రభావతయును – వా. కొన్ని ప్రతులు; మహానుభావతయును – వా. కొన్ని ప్రతులు; మహానుశావతయును – ఓ ఝు.

182. 1. నేఁడు మొదలుగా – వా. కొన్ని ప్రతులు; పరిణయంబు మొదలుగా – వీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. డేటికి నొండొక్క – కొన్ని ప్రతులు; డేలయొండొక్క– వా. 3. నక్కన్నియ దండ్రి కిట్లనియె–వా; నక్కన్యకయిట్లనియె–పెక్కు ప్రతులు.

183. 1. మానందగునే–వా; మానుటదగునే–కొన్ని ప్రతులు. 2. దగవే–కొన్ని ప్రతులు.

184. 1. వాడైన నగుంగాని యేనింక – వా. వీ. ష. ష. కొన్ని ప్రతులు; వాడైననుంగా నిమ్మేనింక – కొన్ని ప్రతులు. 2. నొల్లననిన – వా. కొన్ని ప్రతులు; ననిన – కొన్ని ప్రతులు. 3. నారదుం జూచిన నతం – కొన్ని ప్రతులు.

185. 1. గుణముల – ద. 2. ప్రోగు – ఉ. ఔ. ఘు. ద. శ. ష. 3. యింతి – వా. కొన్ని ప్రతులు; కూతు – ఙ. ఏ. చ.

186. వ. అనిన నమ్మహీపతి [1]మునిపతికి మ్రొక్కి నీవు మాకుం బరమగురుండవు నీయానతిచ్చినట్లు చేసెద ననియె [2]నారదుండును దాని దీవించి దివంబునకుం జనియె నంత.

187. సీ. అమరఁ బుణ్యదినంబునందు బాంధవ [1]మంత్రి వృద్ధపురోహితవితతితోడ
సావిత్రిఁ దోడ్కొని జననాయకుండు వై వాహికమహనీయవస్తుకోటి
గొనుచుఁ బుణ్యారణ్య[2]గోచరుం డై [3]తపస్విస్తుఁ డైన
యాద్యుమత్సేను కడకుఁ
జనిన నారాజును సంభ్రమంబున నశ్వపతికి నర్ఘ్యాదిసంభావనంబు
ఆ. [4]లాచరించి సముచి[5]తాభిమతాలాప, పూర్వకముగ [6]సుజనపూజ్యుఁ డతని
యాగమననిమిత్త మడిగిన మద్రేశుఁ, డెలమి సాళ్వపతికి నిట్టులనియె.

188. క. ఈకన్నియ నాకూఁతురు, మాకులమున కెల్లఁ దెప్ప మనుజోత్తమ నీ
వీకన్నియఁ [1]గోడలుగాఁ, గై కొను[2]ము మదీయవచనగౌరవ[3]బుద్ధిన్.

189. వ. అని పలికి సావిత్రి నతనికి నభివందనంబు సేయించి మఱియు నతండు.

190. క. నీకొడుకు సత్యవంతున, కీకన్నియ దగు నరేంద్ర యీకన్నియకుఁ
నీకొడుకు దగు [1]ననన్యగు, ణాకరు లియ్యిరువురును సమంచితమూర్తుల్.

191. వ. అనిన నతనికి ద్యుమత్సేనుం డి ట్లనియె.

---

186. 1. యమ్ముని – వా. కొన్ని ప్రతులు; ముని – శ. మ. కొన్ని ప్రతులు. 2. నారదుండు వారి – వా. కొన్ని ప్రతులు; నారదుండును దాని – కొన్ని ప్రతులు. 3. కరిగెనంత – కొన్ని ప్రతులు.

187. 1. మిత్రవిశ్వస్తపురోహిత – అ. ఆ. ట. 2. గోచరసంతపస్విరుడైన – ఇ. ఎ. 3. తపస్విస్రుడైన – వా. కొన్ని ప్రతులు; తపస్వితుడైన – పీ. శ. మ. కొన్ని 4. లలరజేసి – ఆ. ట. 5. తాతిథిసత్కార పూర్వకముగ – అ; తాలాపప్రియ పూర్వకముగ – డ. 6. విబుధ పూజ్యు – అ. ట.

188. 1. కోడలిగా – ఝ. త. డ. ల. వీ. ష. 2. నీకొడుకు తగునుకన్నియ కెలమిన్ – ఊ. 3. యుక్తిన్ – ఓ.

190. 1. నగణ్యగుణా – ఘ.

192. తే. విగతరాజ్యుల మై ఘోరవిపినములకు
వచ్చి యిమ్మెయిఁ దప మున్నవార మేము
బాల[1]సుకుమారి యిది జనపాల యడవి
నుండి మా[2]తోడి యిడుమకు నోర్చునయ్య.

193. వ. అనిన నశ్వపతి యతని కిట్లనియె.

194. చ. కలిమియు లేమియుఁ జతనుఁ గా వవి సెందినచోఁ జెలంగుచుం
గలఁగుచు నున్కి ధీరుల ప్రకారమె లెస్సగ నింతవట్టు నేఁ
[1]దెలియుదుఁ జెప్పెదన్ వసుమతీవర విన్న యనంగ[2]నేల నే
కొలఁదియుఁ గాదు ధీరమతి గూఁతురు పేర్కొనఁ [3]జాలు పెంపునన్.

195. క. నీతోడ [1]వియ్య మందఁగ, దేజోగతి నాసఁ జేసి చెచ్చెర [2]ని ల్లే
నేతెంచితి మత్ప్రార్థన, భ్రాంతిగఁ జేకొనక యునికి పాడియె నీకున్.

-: సావిత్రి సత్యవంతుని వివాహం జరుగుట :-

సం. 3 – 279 – 25

196. వ. [1]అనుటయు నయ్యంధనృపతి తత్సంబంధంబునకు [2]సంతసిల్లి నిజాశ్రమవాసు లైన మునులం గూర్చుకొని శుభలగ్నంబున సత్యవంతునకు సావిత్రిం బరిణయంబు [3]సేసె నయ్యశ్వపతియునుం గూఁతునకు నల్లునకు వివిధాంబరాభరణాది వస్తువిశేషంబు లొసంగి నిజపురంబున కరిగెఁ బదంపడి.

---

192. 1. సుకుమార (?) – ఆ. ఊ. ఏ. ఐ. ఒ. గ. ఘ. ఝ. త. ద. త. ద. శ. మ.
2. తోడ నిడుమల కోర్చునయ్య – చ. త. వీ. శ. ప.

194. 1. దెలియగ జెప్పెదన్ – ఊ. ఏ. గ. ఘ. 2. నేరమే కొలదియు – ల; నేరనే-
న. 3. జాల పెంపునన్ – వా; జాలు పెంపునన్ – పెక్కు ప్రతులు.

195. 1. వియ్యమందం జేతోగతి – వా. సూ; వియ్యమందగ జేతోగతి – పెక్కు ప్రతులు.
2. నేనిందే తెంచితి – ల; నిందే నేతెంచితి – గ.

196. 1. అనవుడు – ఈ. ఐ. త; అనిన – చ. 2. సమ్మతించి – టొ. ద. 3. సేసిన
నయ్యశ్వ – కొన్ని ప్రతులు.

197. తే. పడఁతి రమణీయభూషణాంబరవిలాస, ముజ్జగించి వనాంతరయోగ్యలీల
వల్కలాజిన[1]వసన యై [2]వల కధిక, భక్తి భర్తృశుశ్రూషణ పరత నుండె.

198. క. ఆమెలఁత సేయు సవినయ, [1]సామకథల మృదుగభీరసంభావనలన్
మామయు నత్తయు సంతో, షామృతమునఁ [2]దేలి రంతరంగములఁ దగన్.

199. వ. సావిత్రియుఁ దన మగని యాయుఃప్రమాణంబు నారదముని చెప్పిన దినంబు మొదలుగా ననుదినంబును లెక్క యిడికొను చుండె నిట్లు వర్తిల్లుచుండ నాలుగు దివసంబులు గొఱంతగా [1]నొక్క సంవత్సరంబు గడచిన.

200. క. [1]నాలవు[2]దినంబు పతిమృతి, కాలం బని మది నెఱింగి కడు నిష్ఠ మెయిం
జాల భరంబుగఁ బూనెను, బాల త్రిరాత్రోపవాసపరమవ్రతమున్.

201. వ. దానికి విస్మయం బంది ద్యుమత్సేనుండు గోడలిం బిలిచి తల్లీ యి ట్లేల దుస్తరం బగు వ్రతంబు దొడంగి త[1]నిన నమ్మద్రరాజతనయ వినయంబుతో ని ట్లనియె.

202. క. మీరు మదీయం బగు వ్రత, భారము[1]నకు వగవ వలదు పరమశుభంబుల్
గోరి[2]యొనరింపఁ బూనితిఁ, గారణమును [3]మీకు నెఱుగఁ గా నగుఁ బిదపన్.

203. వ. అనిన నతం[1]డట్లైన మేలు గాక యనియె నంతఁ జతుర్థదివసంబున.

---

197. 1. ధారియై – ఉ. శ. 2. వలయుభక్తి భర్తసేవలనను – ద. ఢ; వలయు నధిక భర్తృశుశ్రూష జేయుచు – ఠ.

198. 1. సామగ్రిని నతిగభీర – శ. ప; సామవచ గభీరచారుసంభా – ఘ; సామగ్రగభీర చారుసంభా – అ. ఆ. ద. 2. దెరలి – గ.

199. 1. నేడుగాలంబు – ఉ. ఓ.

200. 1. నాలవ – వా. పెక్కు ప్రతులు; నాలవు – ఠ. వ. 2. దినమున – ఏ. ఘ.

201. 1. తి వనిన – వా; తనిన – పెక్కు ప్రతులు.

202. 1. వల దనకు డతిశుభం బగువ్రతమే – అ. ట. 2. వ్రతమేనుబూనితి – పెక్కు ప్రతులు. 3. మీకెఱుంగఁగా నగు మీఁదన్ – వా. కొన్ని ప్రతులు; మీకెరుగగా నగు బిదపన్ – ఇ. గ. చ. ఝ.

203. 1. డట్లేని – వా. కొన్ని ప్రతులు; డట్లైన – వీ. శ. మ. కొన్ని ప్రతులు.

204. సీ. కడు రేపకడయ ¹మేల్కని యింతి నిజభర్తృమరణదినం బని మౌనవ్రతమున
దద్దయు శోకసంతాపంబు గదురంగ దినముఖోచితవిధుల్ దీర్చి భక్తిఁ
బతికి సముచిత ²పావనపరిచర్య యొప్పుడు ³కడువేడ్క నాచరించి
యత్తకు మామకు నచటి ⁴వృద్ధులకును వేర్వేఱ బ్రణమిల్లి వేడ్క వారు
తే. దనకు సౌభాగ్య ⁵భాగ్యవర్ధనము గాఁగ, నిచ్చు ⁶దీవన లుచితోక్తిఁ
గ్రహించియున్నఁ
బ్రొద్దు జాఁ మెక్కుటయుఁ బూవుఁబోఁడిఁ ⁷బిలిచి, మామ యిట్లని
పలికె ⁸సమ్మాన మొసఁగ.

205. క. కడు నుగ్రం బగు వ్రత మిది, దొడఁగితి వనుసృత్యయోగంబుతో నది సల్పెం
¹బడలితొ యెంతయు డస్సితి, దడయక ²పారణ యొనర్పఁ దగదె ³యింకన్.

206. వ. అనిన సావిత్రి యతని కిట్లనియె.

207. ఆ. అధిప ప్రొద్దు గ్రుంకు నంతకు నేఁడును, గుడువ నని యనంగ నేఁడు యిట్లు
గాఁగ వ్రతముఁ బూను కాలంబునన ¹యేను, నిశ్చయించుకొనిన
నియమ²మిదియు.

208. వ. అనియె నప్పుడు సత్యవంతుండు ¹సమిత్కుశఫలాహరణార్థంబు వనంబునకుం
గదలినం జూచి సావిత్రి యతనిం జేరం జని వనంబున కేను నీతోడం
జనుదెంచెదఁ దోడ్కొని పోవలయు ననిన నతండు నీవు త్రిరాత్రోపవా
సంబునం జేసి యెంతయు డస్సిన దానవు రానోప వనిన ²నత్తన్వి వానికిట్లనియె.

---

204. 1. మేల్కని నిజభర్తకుమరణ – వా. కొన్ని ప్రతులు; మేల్కని మెత్త – అ. ఎ. ఓ. గ. ఘ. చ. ఝ. ద; మేల్కని యింతి నిజభర్తృమరణ – కొన్ని ప్రతులు 2. పావకపరిచర్య – శ; పావనపరిచర్యలప్పుడు – ఓ. ఔ. ల. 3. కడకతో – ల. 4. విప్రులకును – వా; వృద్ధులకును – పి. శ. ష. పెక్కు ప్రతులు. 5. మధిక వర్ధనము – ఈ. ఐ. త. శ. ష; శీలవర్ధనము–ఎ. ఓ. గ. ఝ. ల; విభవవర్ధనము–డ. 6 దీవనల్ – కొన్ని ప్రతులు. 7. జూచి – ఆ. ఈ. ఎ. ఐ. త. ల. 8. సన్మాన మెసగ – పెక్కు ప్రతులు; సమ్మాన – వా.

205. 1. బడలి – వా. పెక్కు ప్రతులు; బడలితిరో యెంతయు – ల. 2. పారణమొనర్ప– ఈ. ఉ. ఐ. త. 3. నీకున్ – కొన్ని ప్రతులు.

207. మున్ను – వా; యేను–పి శ. ష. పెక్కు ప్రతులు. 2. విధియు వా; మిదియు – పి. శ. ష. పెక్కు ప్రతులు.

208. 1. సమిత్ఫలహరణార్థంబు – పెక్కు ప్రతులు; సమిత్ఫల ప్రసూనాహరణా – ఔ. డ. ద; సమిత్పుష్ప – ల. 2. నమ్ముదిత – ఇ. ఏ. ల; నది – వా. పెక్కు ప్రతులు; నత్తన్వి – ఉ. పి. శ. ష.

217. మ. కనియెం గోమలి నీలమేఘ [1]విలసత్కాలాంజనాకారు ఘో
ర నిశాతోత్కటదంష్ట్రు నుజ్జ్వలచలద్రక్తాక్షుఁ బ్రత్యుగ్రకాం
చనవర్ణాంబరు నంత్యకాలదహనజ్వాలాప్రచండుఁ జగ
జ్జన [2]సంత్రాసను నొక్క దివ్యుఁ బటుపాశప్రౌఢ [3]హస్తోద్ధతున్.

218. వ. అప్పురుషుండును నధికసంరంభంబున సత్యవంతుం గదిసిన నయ్యింతి యెంతయు భయంబునం బ్రియుని శిరం బొయ్యన దిగువం[1]బెట్టి నిల్చి కృతాంజలి యై యయ్యా [2]నీ వెవ్వఁ డెయ్యెడకు నెయ్యది సేయం దలంచి విజయం[3]చేసి తనిన నతం డిట్లనియె.

219. సీ. కాలుండఁ జువ్వె యేఁ గమలాక్షి నను నీవు మహితపాతివ్రత్యమహిమఁ జేసి
కానంగఁ జాలితి కానరా దన్యుల కిదె నీదు భర్తకు నిపుడు కాల
మగుటయు వీఁడు మహాపుణ్యనిధి గాన యితరులఁ బనుపక యేన వీనిఁ
[1]గ్రచ్చఱఁ గొనిపోవఁగాఁ జనుదెంచితి నని యుగ్రభంగి నయ్యంతకుండు
ఆ. ధరణినాథతనయు తనువునఁ [2]బ్రాణేశ, పరిమితాత్ముఁ డగుచుఁ బ్రజ్వరిల్లు
జీవు వెడలఁ దిగిచి చెచ్చెర నతిదీర్ఘభయదపాశనికరబద్ధుఁ జేసి.

220. మ. కొని వేగంబున దక్షిణాభిముఖుఁ డై ఘోరంపు మార్గంబునం
జనఁగాఁ జొచ్చె ననంతరంబ మదిలో సావిత్రి శోకంబు పై
కొనఁ బ్రాణేశ్వరు దేహ మొక్క యెడ సంగుప్తంబు [1]గావించి యా
తని పజ్జం దగఁ దాను వేఁగఁ బదపద్మంబుల్ [2]పోటం బొట్రిలన్.

---

217. 1. వికళత్కాలాంజనా - అ. ఆ. ఉ. ఊ. ఎ. ఏ. ఐ. ఔ. ఒ. 2. సంత్రాసకు - అ. ఈ. ఏ. ఘ. ల. పీ. శ. స. 3. హస్తోన్నతున్ - ఇ. వీ. ఆ.

218. 1. బెట్టి - పీ. శ. వ. కొన్ని ప్రతులు. 2. నీ వెవ్వ - వా. పీ. కొన్ని ప్రతులు; నీ వెవ్వ - శ. పెక్కు ప్రతులు. 3. చేసితివి - వా. కొన్ని ప్రతులు; చేసితివి- శ. కొన్ని ప్రతులు

219. 1. గ్రచ్చర - శ. వ. 2. సంగుష్ఠ పరిమితా - [illegible]

220. 1. గావించి-ఉ.ఊ.ఒ.చ.వ. 2. వడిం బొట్రిలన్-వా. పోటం బొట్రిలన్-పెక్కు ప్రతులు.

221\. ఆ. దానిఁ జూచి [1]దండధరుఁడు నీ వి క్లేల, వచ్చెదవు లతాంగి వలదు నిలువు
[2]మింక నీ కగమ్య మిటమీఁది తెరు, వెల్ల [3]ననిన నతని కిట్టు లని యెఁ బొలఁతి.

222\. క. పతు లెందుఁ జనిన నచటికి, [1]సతులుం జనవలదె నీప్రసాదమునను మ
త్పతిభక్తికతమునను సం, స్తుతగుణ నాకరుగరాని [2]చోటుం గలదే.

223\. వ. సకలమార్గంబులయందును ధర్మమార్గంబు ప్రధానం బట్టిధర్మంబునకు నాధారంబు సజ్జనుల యని వినంబడు సజ్జనసందర్శనం బెప్పుడు వృథగాదు గావున సజ్జనశేఖరుండ వనంజను నీదైన సందర్శనంబునం బరమ [1]శుభంబు నొందక యేను రిత్తజనంబుల తెఱంగున నూఱక యెట్లు మగుడుదు ననిన దాని ప్రగల్భవచనంబులకు నద్భుతం బంది ధర్ముం డిట్లనియె.

224\. ఆ. తనులతాంగి భవదుదార [1]వాగ్భంగికి, మెచ్చు వచ్చె నాత్మ నిచ్చువాఁడ
[2]వేఁడు మొక్కవరము విభునిజీవిత మొక్క, టియును దప్ప నేదియైన
నొండు.

-: సావిత్రి యమునివలన నభీష్టవరంబులు వడయుట :-

సం. 3 – 281 – 26

225\. చ. అనవుడు మద్రరాజసుత ప్రాంజలి యై సమవర్తితోడ ని
ట్లను రిపుకోటిచే నపజయంబును బొంది వనాంతరంబునం

---

221\. 1. కరుణ ధర్ముండు నీవేల – వా; దండధరుడు నీవిక్లేల – పీ. శ. ష. పెక్కు ప్రతులు. 2. మింతి – వా. కొన్ని ప్రతులు; మింక – ఎ. ఏ. ఐ. 3. ననలతత్త మనిన నతని కనియె – ద.

222\. 1. సతులకు జనవలదె – వా. పెక్కు ప్రతులు; సతులుం జనవలదె – ల. 2. చోటులు గలవే – వా. పీ. శ. ష. కొన్ని ప్రతులు; చోటుంగలదే – ఈ. ఊ. ఎ. ఐ. చ. త.

223\. 1. శుభంబులం బొందక – వా. పీ; లాభంబు నొందక – అ. ఆ. ట; శుభంబు నొందక – ఉ. ఖ. ఝ. త. శ. ష.

224\. 1. వాగ్భంగికి మెచ్చు వచ్చె నీయభీష్టమిచ్చువాడ – ఓ. న; వాక్యములకు – అ. ట. 2. వేడుమెద్దియైన విభుని జీవిత మొక్కటియును దక్క నెద్దియైన నొందు – అ. శ. ష. కొన్ని ప్రతులు.

దనవరతవ్రతాభిరతుఁ డై న మహాత్ముఁడు [1]సాళ్వ[2]భూవిభుం
[3]డనఘుఁడు లబ్ధచతుఁ డగునట్టులుగాఁ గరుణింపవే [4]మదిన్.

226. క. నావుడు నట్టుల యయ్యెడు, నీవిట [1]రావలవ దుడుగు [2]నెమ్మి నని వేసం
బోవఁ దొడంగెను బిత్రుపతి, యా వెలఁదియు నంత నిలువ కరిగెఁ బిఱుందన్.

227. వ. ఇట్లు సని చని మఱియు ని ట్లనియె.

228. చ. ఎడపక వాఙ్మనఃక్రియల నేరికి [1]హింస యొనర్పఁ బూన రె
య్యెడలను దీనులం గరుణ యేర్పడఁ [2]బ్రోవగ చూతు రిచ్చుచోఁ
గడమ వడంగనీ రెదిరికాంక్షితముల్ దుదిముట్టఁ దీర్తు రె
క్కుడు మదిఁ గూర్తు రాశ్రితులకుం విను మిన్నియు నార్యధర్మముల్.

229. క. నీ వెఱుఁగని [1]యది యెయ్యది, దేవోత్తమ ధర్మగతుల తెఱఁ గెల్ల భవ
ద్భావాధీన మగుటఁ గా, దే వెలసితి వీవు ధర్మదేవత వనఁగాన్.

230. క. సమబుద్ధి[1]తోడఁ ద త్త, త్సముచితకర్మఫల మఖిలజంతుతతులకున్
సమకూర్చుట నీకయ్యెను, సమవర్తియనంగఁ బేరు జగ[2]దభినుత మై.

231. క. యముఁ డంద్రు నిన్ను నార్యులు, [1]యమియింపుదు భూతతతుల నట్లగుటఁ[2]దగఁగా.
శమనుండ వై తి కల్మష, శమనంబునఁ జేసి నీవు జలజాప్తసుతా.

---

225. 1. లబ్ధచతుర్దై యనుపమమూర్తి నొప్పులరునట్లుగ దయవేయవే మదిన్ - ట. 2. భూవరుం - ఈ. ఐ త. 3. డనయము - ల. 4. దయన్ - వా; మదిన్ - వీ. శ. ప. పెక్కు ప్రతులు.

226. 1. రావలదు మగుడునెమ్మి - వా; రావలవ దింక నిలువు మనుచు దా-ఒ; రావల వ దుడుగు - వీ. శ. ప. కొన్ని ప్రతులు. 2. నెలత - అ. ల; రామ యని - ట.

228. 1. నెగ్గొనరింప బూనరె - వా. కొన్ని ప్రతులు; హింస యొనర్ప - వీ. శ. ప. కొన్ని ప్రతులు. 2. బ్రోవన-వా. కొన్ని ప్రతులు; బ్రోవగ-ఇ. ఈ. ఎ. ఏ. ఐ. ఝ. ద.

229. 1. యదియెయ్యదిదేవోత్తమ - అ. ఎ. ఓ. ఔ. ఘ. ఝ.

230. 1. తోడుతను తత్సముచిత - ఓ. ఔ. ద. 2. దభిమతయై - ఉ. ఘ. చ. ద. శ.

231. 1. యమింతు భూతములనెల్ల - వా. వీ. కొన్ని ప్రతులు; యమియింపగ భూత వితతి - ఇ. ఏ; యమియింతువు భూతతతుల - ఈ. ఐ. ఒ. త; యమియింపుదు భూతతతుల - శ. ప. 2. దగున్ - వా; దగన్ - పెక్కు ప్రతులు.

232. వ. అనినం బ్రేతపతి యాపుణ్యసతి కిట్లనియె.

233. క. తృషితుఁ డగువాని [1]శీతల, తుషారతోయములు మోదితునిఁ జేయుగతిన్
[2]హృషితాత్ముఁ జేసె ననుఁ గ, ల్మష[3]హారణములైన నీ సమంజసఫణితుల్.

234. వ. కావున సత్యవంతుని ప్రాణంబు దక్కం దక్కిన కోర్కి యెయ్యది యైనం జెప్పుము సఫలంబు సేసెద ననిన సావిత్రి దేవా వైరులచేత నపహృతంబైన రాజ్యం బెప్పటియట్ల [1]ద్యుమత్సేనుం బ్రాపించునట్లుగా ననుగ్రహింపవే యని వేడుటయు వైవస్వతుం డట్ల యగు నని పలికి యిట్లనియె.

235. ఆ. [1]వలదు నిలుపు మింక వదలక నీభక్తి, మగని కెక్కె దుర్గమంపుఁ ద్రోవ
యిది కృతంబు లయ్యె [2]నెల్లయు నీవిట, వచ్చు సెలవు లేదు వనజ[3]నయన.

236. వ. అనిన నమ్మహాభాగ యతని కిట్లనియె.

237. క. ధర్మాత్ములు దమసలిపెడు, ధర్మక్రియ దప్ప రెట్టి దశలందును మో
[1]హోర్ములఁ [2]దాపముఁ బుట్టవు, ధార్మికహృదయములఁ బ్రథమ
ధర్మాధ్యక్షా.

238. క. కావునఁ బతియనుగమనం, బేవిధమున విడువఁ [1]దగునె యెట్లయినను మో
హావేశముఁ బొందక [2]ధ, ర్మావస్థితి సలుప వలదె యవహితబుద్ధిన్.

---

233. 1. పరిలఘు తుషార – వా. పెక్కు ప్రతులు; శీతల తుషార – ఈ. ఐ. త. వీ. శ. ష. 2. హృషితాంగు – వా. కొన్ని ప్రతులు; హృషితాత్మ – ద. 3. రహితములైన – కొన్ని ప్రతులు.

234. 1. ద్యుమత్సేనునకు – ఇ. ఈ. ఏ. ఐ. ఔ. త; ద్యుమత్సేనుం బ్రాపించు – శ. ష; ద్యుమత్సేనుండు ప్రాపించు – వా.

235. 1. వలవదుడుగుమింక – ఈ. ఐ. త. శ. ష. 2. నెల్లవియమనిటవచ్చు – పెక్కు ప్రతులు. 3. వదన – కొన్ని ప్రతులు.

237. 1. హోర్మియు – వా. కొన్ని ప్రతులు; హోర్ములు – అ. ఆ. ఈ. ఐ. త. వీ. శ. ష. 2. దోషము – అ. ఇ. ఏ. ఔ. డ. ప. ల. స.

238. 1. దగునె – ఉ. ఔ. గ. ఘ. ల. వీ. శ. శ. ష; దగవె – వా. కొన్ని ప్రతులు. 2. ధర్మావేశము నిలుపవలదె – ల.

239. తే. అనిన నంతకుఁ డిట్లను నతివ నీవు, ప్రకటధర్మవిశేషతత్పరవు గాన
[1]యింక నొక వర మిత్తుఁ బ్రాణేశుబ్రతుకు, వలదుగాని యొం డడుగుము వలయుదాని.

240. వ. అనుటయు నక్కాంత కృతాంజలి యై మాతండ్రి మద్రేశ్వరుం డపుత్త్రకుం డతనికిఁ బుత్త్రశత[1]లాభంబు గావలయునని యభ్యర్థించిన నట్ల కా నిచ్చితి నని పల్కి ధర్మ[2]రాజు నీవు గడు దూరంబు వచ్చి దప్పి తింక [3]మగుడుట లెస్స యని పలికిన నప్పతివ్రత యి ట్లనియె.

241. తే. నాకు దప్పి యెక్కడిది మనంబు భర్తృ
చరణపంకజాసక్తమై కరము భక్తి
నలరుచున్నది సతులకు నన్య మెట్టి
దియును [1]ధర్మమె భర్తృసంశ్రయము కాక.

242. వ. మఱియు నొక్క విన్నపంబు సేసెద.

243. ఆ. ఆత్మధర్మనిరతు లైన పుణ్యాత్ములు, దుర్లభులు సమస్తదురితములును
శాంతిఁ బొందు వారి సంసర్గమునఁ [1]దీర్ఘ, భూతమతులు వారు భూతలమున.

244. ఉ. వారల పేర్మిఁ గాదె శశివారిజమిత్త్రులు నిర్వికారసం
చారత నుల్లసిల్లెదరు సర్వపయోనిధులున్ నిరాకులా
కారతఁ గ్రాలెదుం గులనగంబులు నిశ్చలరూఢిఁ జాల నొ
ప్పారెడు భూతధాత్రి నిఖిలైకధురీణతఁ బేర్మిఁ బొందెడున్.

245. వ. అని పలికి మఱియు ని ట్లనియె.

---

239. 1. యిత్తునింకొకవరము-ఈ. ఎ. త; యిత్తునీకొక్కవరము-ఉ. ఐ; నింక-వీ. శ. వ.

240. 1. లాభంబగునట్లుగా బ్రసాదింపుమని — వా; లాభంబుగావలయునని — వీ. శ. వ. పెక్కు ప్రతులు. 2. రాజు నేఁడునీవు — వా; రాజునీవు — కొన్ని ప్రతులు. 3. మరలుట — సూ.

241. 1. ధర్మువె — కొన్ని ప్రతులు.

243. 1. దీర్ఘపూతమతులు — వా. కొన్ని ప్రతులు; దీర్ఘభూతమతులు — వీ. శ. వ. పెక్కు ప్రతులు.

246. తే. పరుమాటలాడినయంత నెట్టివారు, నార్యజనులకుఁ జుట్టంబు లగుదు రనినఁ
జిరసమాలాపసంసిద్ధిఁ జేసి నీకు, నేను జుట్టము నని [1]చెప్ప నేల వేఱ.

247. వ. కావున మిత్త్రమనోరథం బవశ్యకర్తవ్యంబుగాఁ జిత్తగింపు మనిన
నమ్మహానుభావుం డబ్బాలిక నిట్లనియె. నీవును గనుంగొని నీకుం బ్రసన్నుండ నైతి
[1]నీకిష్టం బైన వరం బొక్కటి యిచ్చెద [2]నడుగు మనిన నమ్మానిని యి
ట్లనియె.

248. క. మది సత్యవంతు జీవిత, ముది యిమ్మగఁ దొలఁగఁ బెట్టి యన్యంబుల ని
చ్చెద నని పలుకుదు మును నీ, వది యిప్పుడు లేదు యుండ నడిగెదఁ బ్రీతిన్.

249. చ. పతి [1]విరహంబు దుస్సహము భర్తృవినాశకృత యైన కాంత దూ
షిత యగు సర్వమంగళవిశేషములందును గాన మత్ప్రియుం
డతులితకీర్తిశాలి సుగుణాఢ్యుఁడు [2]సాళ్వసుతుండు లబ్ధజీ
వితుఁడుగ నిమ్ము ధర్మపదవీపరిరక్షణ పుణ్యవీక్షణా.

250. వ. అనిన నట్లు చేయుదు నని యక్షణంబ కృతాంతుండు సత్యవంతు నపగతపాశుం
జేసి యాసుందరి కిట్లనియె.

251. చ. కొను మిదె నీమనఃప్రియునిఁ గోమలి వీఁడు చతుస్సముద్రముల్
మను నిటమీఁదఁ బుత్త్రులఁ గ్రమంబున నూర్వురఁ గాంచుఁ గీర్తివ
ర్ధనుఁ డగు సంతతాధ్వర [1]వితానములం బరితుష్టిఁ జేయు న
య్యనిమిషకోటి కెల్లను నిజాన్వయమౌళి [2]విభూషణం బగుణ్.

---

246. 1. వేఱ యేల చెప్ప - వా. కొన్ని ప్రతులు; చెప్ప నేల వేగ - ఓ. గ. ఝ.

247. 1. నభీష్టం బైన - వా. కొన్ని ప్రతులు; నీ కభిమతం బైన - ఈ. బ. ద; నీకిష్టం
బైన - ఝ. శ. ప. 2. నడుగుమనిన - వా. కొన్ని ప్రతులు; నడుగుమనిన -
కొన్ని ప్రతులు.

249. 1. గహనంబు - వా; విరహంబు - పి. శ. వ. పెక్కు ప్రతులు. 2. సాళ్వమహీసు
తుండు జీవితు - గ.

251. 1. వితానములం - ఇ. ఏ. ఒ. ఔ. ఘ. ల; విధానములం - వా. 2. విభూష
ణుండగున్ - వా. కొన్ని ప్రతులు; విభూషణంబగున్ - పెక్కు ప్రతులు.

257. వ. అని పలికి తదీయవిషాదచేష్టితంబు లుపలక్షించి వెండియు.

258. చ. తమమును బెల్లుగాఁ [1]బరగె దవ్వు నిజాశ్రమభూమియున్ [2]మదిన్
శ్రమమును బాయ [3]దిప్పు డను చందమయ్యెనఁ జనంగనేల యిం
పమరఁగ నింతప్రొద్దు సుగుణాకర యిచ్చట నిల్చి [4]రేపు వో
దమె తెఱఁగెద్ది నావుడును దన్వికి సాళ్వతనూజుఁ డిట్లనున్.

259. క. మానె శిరోవేదన నా, మేనికిఁ [1]దగ లావు వచ్చె మెల్లన [2]జరుగం
గా నేర్తుఁ దల్లిదండ్రులఁ, గానక యేనెట్లు నిలుతుఁ గాననభూమిన్.

260. క. ఇంతకు మున్నెన్నఁడు నే, నింత తడవు వారిఁ బాసి యెందుఁ దడయ నేఁ
[1]డింతవడి మసలుటకు వా, రెంత వడిరో యేమియైరొ యెట్లున్నారో.

261. ఆ. సంధ్యప్రొద్దు నన్ను జనని యెన్నఁడు నిల్లు, వెడలనీదు నేఁడు విపినభూమి
మధ్యరాత్రి[1]వేళ మసలుట కాయము, యెట్టిపాటు[2] పడెనొ యేనెఱుంగ.

262. సీ. కౌఁగిట ననుఁ[1]జిక్కఁ గదియించి శిరము [2]మూర్కొంచును బాష్పముల్ గురియుచుండఁ
బట్టి మా[3]యొడలుల ప్రాణంబులును నెల్ల [4]యర్థముల్ నీవ మాయన్న నీవు

---

258. 1. దొడరె - అ. ఈ. ఎ. ఐ. త; జెరిగె - బొ. 2. తనుశ్రమమున - వా; మదిన్ శ్రమమును - వి. శ. ప. పెక్కు ప్రతులు. 3. దిప్పునను - వా; దిప్పుడను - పెక్కు ప్రతులు. 4. రేవ (పె) పోదము - కొన్ని ప్రతులు.

259. 1. దగు - వా. కొన్ని ప్రతులు; దగ - వి. శ. ప. కొన్ని ప్రతులు; గడు - ఊ. 2. యరుగంగానోర్తు - వా; జరుగంగానేర్తు - పెక్కు ప్రతులు.

260. 1. నింతవడి - ఆ. ఎ. చ. త.

261. 1. దాక - ఒ; దనుక - బొ; యందు - ద. 2. వడునొ - వా. కొన్ని ప్రతులు; పడెనొ - కొన్ని ప్రతులు.

262. 1. చక్కగదియించి - బొ. ద. శ. ప. 2. మూర్కొనుచు బాష్పంబులు - పెక్కు ప్రతులు. 3. యొడలను - వా; యొడలుల - కొన్ని ప్రతులు. 4. యర్థంబులును నీవయన్న - ఇ. ఏ; యర్థముల్ నీవసుమ్మన్న - శ. ప. కొన్ని ప్రతులు.

[5]దెప్పగా సంసారతీరంబు సేరెద మని తలంచెదము సుమ్మన్న యన్న
కన్నులు లేని మా[6]కన్నులుఁ గాళులు నీవ [7]కదన్న మానిఖిలవంశ
ఆ. మును సముద్ధరించు [8]మోపు నీయదియ క, దన్న యనుచు నిట్టు లగ్గలంపుఁ
బ్రేమ ననుదినంబుఁ [9]బ్రేముడింతురు వృద్ధు, లక్కటకట [10]యేమి యైరొ నేఁడు.

263. ఆ. అడవి కేఁగుదెంచి యడరంగ ఫలమూల, తతులు గొనుచు నేను దడయ కపుడ
[1]పోవఁగాన నైతి దైవోపహతి [2]నింత, చిక్కువడితి నేమి సేయువాఁడ.

264. క. నాయున్న చో టెఱుంగక, [1]యాయాశ్రమవాసు లైన యందఱ నతిదుః
ఖాయత్తుఁ డగుచు నడుగును, మాయయ్య దలంకి మాటిమాటికి [2]నింకన్.

265. క. నావార్త వినక [1]యింతకు, నావృద్ధులు భిన్నహృదయు లై ప్రాణంబుల్
పోవిడుతురు [2]గాకచటికిఁ, బోవం బని గలదె యేనుఁ బుచ్చెద నసువుల్.

*–: సత్యవంతుఁడు సావిత్రితోడ మరలి తన యాశ్రమంబునకు వచ్చుట :–*

సం. 3 – 281 – 97

266. వ. అని బహుప్రకారంబులం [1]జలవించి కన్నీరు నించిన నక్కాంత దుఃఖాక్రాంత యగుచు నతని నాశ్వాసించి నవమృణాళమృదులంబు లగు భుజంబులం గౌఁగిలించి యెగయ నెత్తిన మెత్తన[2] లేచి యతండు ధూళిధూసరితం బైన శరీరంబు [3]దుడిచికొని గమనంబున కుత్సహించిన.

---

5. దేవగా – వా; దెప్పగా – పెక్కు ప్రతులు. 6. కన్నులుగాళ్ళును నీవగదన్న – ల; కన్నయ్యగాల (ళ్ళ) యునీవకదన్న – కొన్ని ప్రతులు. 7. సుమన్న – ఈ. ఐ. త; సుమ్మన్న – శ. ష. 8. పెంపు – ద; ప్రోపు–ఊ. 9. బ్రేముడింపుదు రట్టి వృద్ధు లకట యేమి విధమువడిరో – ఈ. ఎ. ఐ. త. శ. ష. 10. యెట్టులైరొ నేడు – కొన్ని ప్రతులు.

263. 1. పోవ నోపనైతి–ఘు. ట. వా. వీ; పోవగాననైతి–పెక్కు ప్రతులు. 2. జేసి–ఇ. ఏ. ల. స.

264. 1. యీ యాశ్రమవాసులైన యిందర – కొన్ని ప్రతులు. 2. నమ్మన్ – ఝ. ట. వా; నింకన్ – పెక్కు ప్రతులు.

265. 1. యెం (యం) తయు – అ. ఇ. ఏ. చ. ద. 2. నాకచటికి – పెక్కు ప్రతులు.

266. 1. బలవరించి – వా; బిలవించి – పెక్కు ప్రతులు. 2. నిలిచి – వా. కొన్ని ప్రతులు; లేచి–వీ. శ. ష. కొన్ని ప్రతులు. 3. దొడిసికొని–వా; దుడిచికొని–పెక్కు ప్రతులు.

267\. క. ఫలభారము దుర్భర మని, వెలఁది [1]యచట నొక్కవృక్షు విటపంబున ని
మ్ముల [2]గరడియ దగిలిచి యు, జ్జ్వలపరశువుఁ గొనుచు
మృదులసంభ్రమలీలన్

268\. వ. జీవితేశ్వరు వామబాహువు నిజవామభుజంబుపయి నిడికొని దక్షిణ
హస్తంబున నతని గ్రుచ్చి కౌఁగిలించి మందగమనంబున నాశ్రమ
దేశంబునకు మగుడె [1]నంత నక్కడ.

269\. ఉ. కన్నులు[1]వచ్చి [2]యెల్లెడలుఁ గన్గొని వృద్ధనరేంద్రుఁ డాత్మజుం
[3]గన్నులుఁ బోలెనైన తన గాదిలి పుత్త్రుఁడు గాననంబులో
నెన్నఁడు లేని యింత [4]తడ వేటికిఁ జిక్కెనొ యంచు నార్తితోఁ
గన్నులు లేని [5]యట్లతఁడుఁ గానక యేడ్చె సతీసమేతుఁ డై.

270\. తరలము.
[1]కొడుకు నిందును నందు రోయుచుఁ గోరి ప్రేమభరంబునం
గొడుకు సద్గుణ[2]కోటి యెల్లను గోటిభంగుల [3]నోలి ను
గ్గడన సేయుచు సత్యవంతునిఁ గానరే మునులార యే
యడవిలోపల నంచు హా సుత యంచు ధైర్యము డించుచున్.

---

267\. 1. యునిచెనచట నొక్క వృక్షంబుననిమ్ముల-ఔ. 2 గరిడియ-ఇ.ఓ.ఘ.వీ.శ.వ సూ.

268\. 1. నంతకుమున్న యక్కడ - వా. కొన్ని ప్రతులు; నంత నక్కడ-పెక్కు ప్రతులు.

269\. 1. విచ్చి - ఇ. ఎ. ఏ. ఒ. ఘ. వ. 2. నల్గడలు - ఇ. ఏ. 3. గన్నను - ఈ. ఎ. ఐ. చ. ఝ. డ. త. 4. వడియేటికి - ఉ. ఊ. ఒ. ఓ. ఔ. గ. ఘ. చ. 5. యట్లొ కడుఁ - వా. కొన్ని ప్రతులు; యట్లతఁడు - ఉ. ఓ. వీ. శ. వ.

270\. 1. ఈ పద్యమునకు ముందు. ఘ. స. ప్రతులలో నీ క్రింది పద్య మధికముగా కలదు.

ఉ. యెందులకేగి తన్న తరళేక్షణ నీసతితోడ రావు మ
మ్మిందుల నీగతిన్విడిచి యేగగ బాడియె పుత్ర యింక నే
కందువ నున్న వాడవని కానగ నేర్తు వనంబులోన మా
కందసుచంద నాగరుసుగంధికదంబకదంబిలోలతన్.

ఈ పద్యమే చ ప్రతిలో 270 పద్యము తర్వాత కలదు. 2. కోటులెల్లను - ట. వా. వీ. శ. వ. సూ; కోటియెల్లను - పెక్కు ప్రతులు. 3. మక్కువన్ గడన - వా; నోలి నుగ్గడన - పెక్కు ప్రతులు.

271\. వ. ఉన్నంతఁ దదాశ్రమవాసు లైన మును లందఱు నతనిం జొచ్చికొని తదీయ నయనలాభంబునకు విస్మయం బందుచు నుచితవాక్యంబుల [1]నతని నాశ్వాసించుచుండిరి తదనంతరంబ యొక్క ముహూర్తంబునకు సావిత్రీసహితుం డై చిత్రాశ్వుండు సనుదెంచిన నావృద్ధదంపతు లత్యంతహర్షంబున [2]నతనిం గౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణంబు సేసిరి మునులు గరంబు సంతసిల్లి రప్పు డా రాజర్షి ముఖ్యుండు పుత్త్రునిం జూచి యయ్యా యి ట్లేల వనంబున మసలి తని యడిగిన నతండు దాను జని పండ్లు గోయుటయును గాష్ఠవశనంబు సేయుచెడం [3]దలయేరు గదిరి నిలువ[4]నోపక విశ్రమించుటయుఁ దన్నొక్క పురుషుండు గలలోన నిగ్రహించుటయుం [5]జెప్పుచెడ సావిత్రి మామ కి ట్లనియె.

272\. సీ. ఈరాజ[1]సుతునకు నిద్దినంబున [2]మరణం బని మును చెప్పె నారదుండు మునినాథువచనం బమోఘంబు గావున[3] నేమఱ కేను నేఁ డితనితోడ నడవికి నేఁగితి నచట నీతఁడు సుప్తుఁ డై యున్నయెడ వచ్చె నంతకుండు వచ్చి యివ్విభుని జీవముఁ గొని పోవఁగ వెనుకన చని యేను వివిధభంగి

ఆ. సత్యధర్మఘణితి సంస్తుతించుటయుఁ గృ, పార్ద్ర[4]చిత్తుఁ డగుచు యజ్ఞముండు [5]వాకు నెమ్మి నొసఁగె నాలుగు వరము లం,దొకట నితఁడు జీవయుక్తుఁ డయ్యె.

273\. వ. మఱియు నొక్కవరంబు భవదీయనయనోన్మేషణకారణం బయ్యెఁ దక్కిన వరద్వయంబున మీకు వైరిహృతరాజ్యసంప్రాప్తియు మదీయజనకునకుఁ బుత్త్రశతలబ్ధియు నగు నని చెప్పిన నయ్యిద్దఱుఁ [1]బరమానందకందళితశీతల శిశిరహృదయు లై కోడలి కి ట్లనిరి.

---

271\. 1. నతనికి నాశ్వాసం బొనరించుచు - కొన్ని ప్రతులు. 2. వానిం కొన్ని ప్రతులు. 3. దలయొరవు - ఊ. ఔ. 4. నోర్వక - ఇ. ఊ. ఎ. ఔ. ఘ. చ. ఠ. 5. జెప్పుటయు - ఇ. ఏ.

272 1. పుత్త్రున కీ దినంబున - శ. వ. 2. మరణ మని చెప్పె నారదుడు మున్ను - ఒ. 3. నేనను నేమర కితనితోడ - ఈ. ఎ. ఐ. త. 4. దృష్టిజూచి యజ్ఞముండు - ఒ. 5. వరున నొసగె నాల్గు వరములు నెమ్మి నం,దొకటి నితడు జీవయుక్తు డయ్యె-ఔ.

273\. 1. బరమానంద కందళిత హృదయు లై - వీ. మ. స; బరమానందకలితులై - అ. ఆ. ఈ. ఐ. ఝ. త; బరమానందశీతల శరీరులై - శ. ల కొన్ని ప్రతులు.

ఆ. లోకనుతుఁడు బ్రాహ్మణాకార మొప్పంగ, నతనియున్న[4]యెడకు నరుగుదెంచి
యేకతంబ యున్న యాకర్ణుతోడ న, భీష్టభంగి దోఁప నిట్టు లనియె.

284. క. ఓ కర్ణ సుజనవినుత[1]గు, ణాకల్ప భవద్ధితార్థ మై యొక కార్యం
బేకతము చెప్ప వచ్చితిఁ బ్రాకటముగ వినుము నాదువలుకులు [2]ప్రీతిన్.

285. వ. పాండవపక్షపాతి యై పాకశాసనుండు భవదీయంబు లయిన కవచకుండ
లంబు[1]లు హరియింపం గోరి నీవు బ్రాహ్మణప్రియుండ వనియును బ్రాహ్మణు
లడిగిన నెయ్యది యైనను గాదన[2]సేయక యొసంగుదు వనియును నెఱుంగుం
గావునఁ గపటబ్రాహ్మణుం డై వచ్చి యడుగం గలవాఁడు నీవును గవచ
కుండలంబు[3]లీ వలవదు రత్నకాంచన[4]ప్రముఖంబు లయిన పదార్థంబులు
సూపియుం బ్రార్థిం[5]చియు మఱియు నెవ్విధంబున నయినం గడపి పుచ్చ
వలయు నట్లు గాక వీని నతని కిచ్చితేని మృత్యువశంబునం బొందఁగల
వాఁడవు.

286. చ. అమృతమయంబు సువ్వె సుగుణాకర యిమ్మహనీయవస్తుయు
[1]గ్మము నిది యుండునేనిఁ ద్రిజగంబులయందు నశేషశత్రులో
కమునకు నీవు వధ్యుఁడవు గావు నిరంతరసౌఖ్య[2]సాంద్రమో
దమున [3]వెలుంగు దే నిది హితంబుగఁ జెప్పితి మోసపోకుమీ.

---

4. కడకు – వా. కొన్ని ప్రతులు; యెడకు – కొన్ని ప్రతులు.

284. 1. గుణాకర భవదీప్సితార్థమై – ఇ. ఏ. ఓ. 2. వరుసన్ – వా. పెక్కు ప్రతులు; ప్రీతిన్ – అ. ఆ. ట

285. 1. లపహరింప – కొన్ని ప్రతులు. 2. సేయవనియును – వా. పెక్కు ప్రతులు; సేయకొసంగుదువనియు – పీ. శ. ష. 3. లియ్యవలవదు – ఈ. ఐ. త. 4. వనితా ప్రముఖంబు – వా. కొన్ని ప్రతులు. పెక్కు ప్రతులలో వనితా లేదు. 5. చియు నెవ్విధంబున – వా. కొన్ని ప్రతులు; చియు మరియు నెవ్విధంబున – కొన్ని ప్రతులు.

286. 1. గ్మ మిదియ – వా; గ్మము నిది – పెక్కు ప్రతులు. 2. సాంద్రమో – అ. ఇ. ఎ. ఏ. ఐ. ఝ. త. శ. ష; సంభ్రమో – వా. కొన్ని ప్రతులు. 3. వెలింగెదీవు విహితంబుగ – అ. ఈ. ఐ. త. పీ. శ. ష; వెలుగు దీవిది – వా.

287. క. అనిన విని సూత[1]తనయుఁడు, వినయంబున నిట్టు లనియె విప్రాకారం
బున వచ్చిన వేల్పవు నీ, వనఘా యెవ్వఁడవు నాకు నానతి యీవే.

288. క. [1]అనుఁడు నతఁ డేను సూర్యుఁడ, మనమున నీయందుఁ గలుగు మక్కువ గర్వం
బొనరఁగ నుపదేశింపఁగ, జనుదెంచితి ననిన నతఁడు సంభ్రమ మొప్పన్.

289. వ. [1]అభివందనంబు సేసి దేవా దేవరవు నాకత్యంత[2]హితుండ వగుటం జేసి
కృతార్థుండ నైతి నిం కొక్క విన్నపంబు సేసెద నవధరింపుము.

290. ఉ. భూసురకోటి వేఁడుటయుఁ బోఁడిగ ప్రాణము లైన [1]నీకి నా
శాస దినేశ[2]లోకమునఁ బ్రస్ఫుట[3]మింతయు నట్లు[4] గాకయున్
వాసవుఁ డట్టె నన్నడుగ వచ్చుఁ బ్రియంబడి నాకు నొక్క ప్రా
తే సురలోకవందిత మదిం గవచంబును గుండలంబులున్.

291. క. జగముల నెల్లను నిండిన, పొగడ్త గడు[1]వెలితి సేసి పొల్లు యొనరికై
[2]తగవే జన్మవ్రత మిటు, [3]దిగ విడువఁగ వేఁడు నాకుఁ ద్రిభువన[4]దీపా

292. మ. మఱిఁ గుంతీసుతపక్షపాతి యగుచుం మాయాస్వరూపంబుతో
జిత[1]దైత్యుండు శతక్రతుండు నను [2]భిక్షింపంగ నేతెంచు న
ట్టి తెఱం గైనఁ [3]దదీయకీర్తియ చుమీ డిందుం ద్రిలోకీసము
[4]న్నత మై యొప్పు మదీయకీర్తి యిది నూ వాపుణ్య మెబ్బంగులన్.

---

287. 1. సూనుడు - కొన్ని ప్రతులు.

288. 1. అనిన - వా. కొన్ని ప్రతులు; అనుడు - కొన్ని ప్రతులు.

289. 1. అభివాదనంబు - వా. కొన్ని ప్రతులు; అభివందనంబు - కొన్ని ప్రతులు.
2. ప్రియుండ వగుటం - ఇ. ఈ. వీ. ఐ. ల; ప్రీతుఁడ వగుటం - అ. ఆ.

290. 1. నిత్తు-శ. ప. 2. లోకముల-కొన్ని ప్రతులు. 3. మెంతయు (మింతయు)-అ. ఉ. ఊ. ఎ. ఒ. ఘ. త. శ. 4. గావునన్ - ట. వా. వీ. ప; గాకయున్ - పెక్కు ప్రతులు.

291. 1. వెత్తి - అ. ఆ. ఈ. ఐ. ఘ. త. 2. తగునే - అ. ఆ. ఓ. ఘ. 3. తెగ విడువగ - ఒ. న; దీవి విడువగ నాకు నిప్పుడు - ఛం. 4. వంద్యా - ఔ. ఘ. వే; వినుతా - ఉ. ఒ. చ. ట.

292. 1. దైర్యుండు - వా; దైత్యుండు - పెక్కు ప్రతులు. 2. వీక్షింపంగ - ఒ. గ. 3. దదీయ వర్తనము నిందించు - న; వదీయకీర్తియ (యొ) టుబున్ (అన్) డిందుం - వీ. శ. ప. 4. న్నతిదై - ఊ. ఔ. ఘ. చ.

293. ఆ. కీర్తి విడువఁ జాలఁ గీర్తితో మెలఁగంగఁ, జావు వచ్చెనేనిఁ జత్తుఁ గాని
జగములోన నెల్ల నడికంబెఁ జావు మే, లనఁగఁ బరగు మాట యనఘ వినవె.

294. ఉ. కీర్తియ యిచ్చుఁ బుణ్యగతిఁ గీర్తియ తల్లియుఁబోలెఁ బ్రోచు[1]న
త్కీర్తియ యాయువుం సిరియుఁ గీర్తివిహీనుఁడు చూ శవంబు దు
[2]ష్కీర్తను నెల్ల[3]చేటులును గిట్టి హరించు ననండె తొల్లి ధ
క్తార్త[4]హరుండు నాఁబరగు నంబుజసూతి జగద్ధితంబుగన్.

295. సీ. [1]విప్రులు గడు నర్థి వేఁడినఁ [2]గలిమితోఁ [3]బొచ్చెంబు సేయక యిచ్చు టొకటి
బలితంపు బగతురఁ బరిమార్చు టొక్కటి [4]దండినై యనిఁ జచ్చు టొండె నొకటి
శరణాగతుని నెట్టి[5]శత్రువు నైనను [6]గరుణించి చంపక గాచు టొకటి
భామినీద్విజవృద్ధబాలాతురుల కైన యాపద చెచ్చెరఁ బాపు టొకటి
ఆ. [7]యనఁగ నివి వ్రతంబు లై చెల్లు నాకు నిం, దొకటి దప్పెనేని [8]వికలకీర్తి
నగుదుఁ గాన [9]నిత్తు [10]నఖిలమ్ము నెఱుఁగ నా, ఖండలునకుఁ గవచకుండలములు.

296. వ. అనినఁ గర్ణునకు సూర్యుం డి ట్లనియె.

297. క. కడు [1]నెయ్యురు హితముగఁ జె, ప్పెడు పలుకులు వినవు [2]గరము బేలవు నీ వె
క్కడ బుద్ధిఁ దెరువు లెక్కడ, [3]చెడక వినుము నీకుఁ దెలియఁ [4]జెప్పెదఁ గర్ణా.

---

294. 1. తత్కీర్తియ – ఈ. ఐ. త. 2. ష్కీర్తుల నెల్ల – ల; ష్కీర్తిని – ఈ. ఐ. త. 3. ఘాతములు – అ. ఆ. ఈ. ఎ. ఐ. త. 4. హరుండనా – కొన్ని ప్రతులు.

295. 1. విప్రుఁడుగడు వేడ్కవేడిన – ఉ. శ. వ; విప్రుండు – ల. 2. గడిమితో – వా. కొన్ని ప్రతులు; గరిమిలో – కొన్ని ప్రతులు. 3. బొచ్చము – ఒ. చ. 4. సమరంబులోపల జచ్చుటొకటి – అ. ఆ. ఇ. ఈ. ఎ. ఏ. ఐ. త. శ. వ. ప్రాసయతినియమభంగము. 5. శత్రునినైనను – వా. కొన్ని ప్రతులు; శత్రువునైనను – ఉ. ఒ. గ. చ. 6. గరుణగయ్యమున రక్షించుటొకటి – అ. ఊ. గ. ఘ. ద. యతిభంగము; గరుణఁ గయ్యంబునఁ గాచుటొకటి – ఉ. ఔ. వీ. శ. వ. గరుణించి రయమున గాచుటొకటి – ఝ. 7. యనఘ యివి – వా. కొన్ని ప్రతులు; యనగ నివి – ఇ. ఘ. చ. 8. వికటకీర్తి – ఔ. ద. డ. 9. యిత్తు – వా. కొన్ని ప్రతులు; నిత్తు – ఈ. వీ. వ. 10 నఖిలమ్ము నెఱుఁగ – ఉ. ల. వీ. శ. వ; నఖిలభావమున – ఔ. ద; నఖిలభావముల – వా. కొన్ని ప్రతులు.

297. 1. నెయ్యుఁడు – ల; నెయ్యము – కొన్ని ప్రతులు. 2. నీవుబేలవు – అ. ఆ. ఈ. ఎ. ఐ. త. 3. మడపక ముమువినుము నాదుమాటలు కర్ణా – ట. 4. జెప్పితి గరుణన్ – శ. వ.

298\. క. [1]తనకుఁ దనయులకు సతులకు, జననీజనకులకు బంధుజనములకుఁ గీర్తిం
దని తెరువునఁ గీర్తి [2]గనినఁ, జనుఁగా [3]కంఠజ్ఞుని బెడు యశం [4]బేమిటికిన్.

299\. ఉ. కావున నీవు ప్రాణములు గావుము కీర్తి యటుండ నిమ్ము పి
జీవిత మున్నఁ గీర్తి మఱి[1] చేరదె కీర్తి [2]యనంగ నొక్కఁ డే
లా వనితల్ దనూభవులు లక్ష్ములు బంధులు సార్వభౌమతే
జోవిభవంబు [3]నిమ్మదరఁ జొప్పడుఁ బ్రాణ మొకండు గల్గినన్.

300\. క. మృతుఁ డైన [1]నరుఁడు వెస విస్మృతుఁ డై [2]చనుఁగాక కీర్తి మేలిమి గనునే
మృతదేహంబునకు నలం, కృతిఁ జేసిన యట్లు మృతుని కీర్తి [3]గలంచెన్.

301\. వ. నీవు నాకు నత్యంతభక్తుండ వగుటం జేసి భక్తజనరక్షణంబు [1]కర్తవ్యం
బగుట ని ట్లన్నియుం జెప్పవలసె మఱియు దేవనిర్మితం బైన రహస్యం
బొక్కటి గలదు దాననేని నీయందు నాకు వాత్సల్యంబు మిగిలియుండు
నది యిప్పు డేను జెప్పఁ బిదపఁ దనయుండవ యొఱుఁగం [2]బడు నీకు నర్జును
నకుం దెగని పగయై యుండు మీకుఁ గయ్యంబు నవశ్యం బగు నందు నీవు[3]
సహజకవచకుండలమండితుండ వగుటం జేసి యర్జును నకు జేయుండ వయ్యెద
వట్లుంగాక వీనిం గోలుపోయితి వేని యొంతయు దెప్పరం బగు ననినం గర్ణుం
డి ట్లనియె.

---

298\. 1. తనకును తనతనయులకును జననీ – ఘ. 2. గొనంబును – వా. కొన్ని ప్రతులు; గనినజను – కొన్ని ప్రతులు. 3. కింకరుపు – ఊ. ఒ. ట. ద. 4. బడియేలా – ట. ఔ.

299\. 1. చెందెదు – ఉ. ఓ. గ. శ. ప. 2. యొకండనంగ నేలా – వా. కొన్ని ప్రతులు; యనంగ నొక్కఁడే – ఈ. ఐ. ట. శ. 3. విమ్ముననద – వా. విమ్మదర – పెక్కు ప్రతులు.

300\. 1. యతడు కడు భస్మితుడై – ఇ. ఏ; యతడు విస్మృతుడై – ఔ. వ. 2. చెడు గాక – శ. ష. 3. యుఁ గిదవన్ – వా. కొన్ని ప్రతులు, తలంచన్ – త. శ. ష.

301\. 1. కర్తవ్యంబుగావున నీకిట్లన్నియుం–వా. కొన్ని ప్రతులు; కర్తవ్యం బగుట నిట్ల న్నియుం – అ. ఈ. ఎ. ఐ. ఝ. త. 2. బడియెదు – వా. కొన్ని ప్రతులు; బడు – ఉ. ఓ. ఔ. ద. శ. ప. 3. సహజకుండల – వా. పెక్కు ప్రతులు; సహ జకవచకుండల – ఉ. చ.

302. మ. కరుణామూర్తివి నీవు సంతతము భక్తశ్రీసమాధానత
త్పరచిత్తుండవు గావునం గడఁగి నాపై [1]మక్కువం బద్మినీ
వర మే లానతి యిచ్చి తిం [2]కొకటి దేవా నిన్నుఁ బ్రార్థించెదం
గరుణన్ నాప్రతికూల[3]దుర్లపితవాక్యంబుల్ సహింపం దగున్.

303. క. అనృతమున కెంత వెఱతును, విను మంతకునకును నంత వెఱవ మును[1]వహిం
చిన వ్రతము విడిచి దుర్గతిఁ, జనఁ జాలుదు నయ్య నన్నుఁ జనునే మాన్పన్.

304. వ. అర్జునుండు దుర్జయుం డని చూడ వలవదు నీవును మదీయంబు లగు [1]దివ్యా
స్త్రంబు లెఱుంగుదు జామదగ్న్యుండును ద్రోణుండును నాకు నొసంగిన
దివ్యాస్త్రంబు లల్పంబులు గావు గావున నవశ్యంబును సమరంబున [2]నమర
రాజనందనుం దెగటార్ప నోపుదు నీ వింక నొండు దలంపక నాకు ననుజ్ఞ
యి మ్మనిన నొక్కింత విచారించి యా దేవుండు రాధేయున కి ట్లనియె.

-: సూర్యుఁడు గర్ణునితో నింద్రుచే శక్తిఁ గైకొను మని చెప్పుట :-

సం. 3 - 286 - 14

305. తే. ఎల్లభంగుల నిశ్చయం బిదియ యేని, వత్స విను మింక నొక్కటి వాసవునకుఁ
గలదు [1]దారుణంబును నమోఘంబు నైన, శక్తి యది నీకు నడుగుము
సవినయముగ.

306. క. తొలి తొలి బలసూదనుచేఁ, జెలువుగ నాదివ్యశక్తి[1] చేకుఱఁ గొని కుం
డలములుఁ గవచంబును మఱి, యలఘు[2]మతీ యిమ్ము భద్ర మగు
[3]నిట్లయినన్.

---

302. 1. మక్కువం బఱది ధీవర-శ. 2. దొకటి-అ. ఊ. ఒ. 3. దుర్లలిత-వా; దుర్లపిత-ల.

303. 1. గ్రహించిన - వా. పీ; వహించిన - పెక్కు ప్రతులు.

304. 1. దివ్యాస్త్ర విశేషంబు లెఱుంగుదు - వా. కొన్ని ప్రతులు; దివ్యాస్త్రంబులెఱుం
గుదు - పీ. శ. వ. కొన్ని ప్రతులు. 2. నర్జునుం - ఆ. ఎ. ఝ.

305. 1. దారుణమును - ఔ.

306. 1. చేకొని నీకుండల - ఊ; చేకుర నీకుండల - శ. వ. 2. మతిని నిమ్ము - ఈ.
ఊ. త. శ. 3. నట్లయినన్ - వా. కొన్ని ప్రతులు; నిట్లైనన్ - చ. శ. వ.

307. ఉ. [1]వైరులఁ జంపి చంపి వెస వచ్చుఁ గరంబున కాఁజిలోన న
ద్దారుణశక్తి వాసవుఁడు దానన తొల్లి సహస్రసంఖ్యలం
గ్రూరసురారిసంఘములఁ గూల్చె మహోభుజ నీకు నెమ్మి నా
ఘోరపుసాధనంబు దొరకొన్న నవశ్యము గెల్తు [2]వైరులన్.

308. వ. అని చెప్పి కమలహితుం డంతర్హితుం డయ్యెఁ గర్ణుండును వాసవు రాక కెదురు చూచు చుండె ననిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె.

309. మధురాక్కర.
కలదు దేవగుహ్యం బని కమలబాంధవుఁడు గర్ణుఁ
బలికె నని చెప్పి తది యెద్ది బలియుఁ డా సూతజుండు
లలితకవచంబు మణికుండలములు నెమ్మియిఁ బడసె
[1]వెలయ నివ్విధ మంతయు వివరింపవలయు నాకు.

310. వ. అనిన వైశంపాయనుం డది యంతయుం జెప్పెద విను మని యి ట్లనియెఁ దొల్లి కుంతిభోజు[1]నింటికి దుర్వాసుం డతిథి యై వచ్చి వానిచేత [2]సత్కృతుం డై నాకు నీయింటఁ గొంతకాలంబు వసియింప నిష్టం బై నది నాయున్నంత కాలంబును నీవును నీయనుచరులును నిర్వ్యాజం బగు భక్తి సేయవలయు ని ట్లోపుదే యనుటయు నొడంబడి యతండు దనకూఁతుం బృథ యను కన్యం బిలిచి యమ్మహామునిం జూపి.

---

307. 1. ఈ పద్యమునకు పూర్వము – అ. ఈ. ఐ. త. ద. పీ. శ. ష. స. ప్రతులలో నీ క్రింది యధికపాఠము కలదు. "అమ్మహాసాధనంబు తెఱంగుఁ జెప్ప నచ్చెరువు దాని విశేషంబుఁ జెప్పెద విను మని మఱియు నిట్లనియె. 2. వైరులన్ – ఓ. ల. స; వర్జునున్ – ఔ; పోరులన్ – వా. కొన్ని ప్రతులు.

309. 1. వెలసె నివ్విధమింపుగ – వా. కొన్ని ప్రతులు; వెలయ నివ్విధ మంతయు – పెక్కు ప్రతులు.

310. 1. కడకు – వా. కొన్ని ప్రతులు; నింటికి–ఉ. ఓ. గ. శ. ష. 2. బూజితుండై – వా. కొన్ని ప్రతులు; సత్కృతుండై – కొన్ని ప్రతులు. 3. కూతురు – అ. ఈ. ఊ. ఎ. ఐ. ఝ. త.

311. ఉ. దేవసమానుఁ డీ ధరణిదేవుఁడు వేడుక మద్గృహంబునం
దా వసియింపఁ గోరుటయు దానికి [1]నేనును నియ్యకొంటి నిం
దీవర[2]నేత్ర నీవుఁ గడు ధీరవు [3]సద్వినయోపచారసం
భావితవృత్త వట్లగుట భక్తి భజింపుము బ్రాహ్మణోత్తమున్.

312. క. ఇతఁ[1]డెత్తఱి నెయ్యది స, మ్మతిఁ గోరిన నది ఘటించి [2]మచ్చిక నిడి తో
షితుఁ జేయు మిమ్మహాత్ముని, మతి యలుగక యుండవలయు మానిని యెపుడున్.

313. ఆ. వినుము విప్రవరులు వెడవెడ గినిసిరే, నియును ధరణి యెల్ల నీఱు సేయఁ
జాలుదురు తపఃప్రశస్తులు దుర్వార, తేజు లెందు నధికధీరమతులు.

314. క. భూదేవపరాభవమునఁ, గాదే వాతాపి దండకప్రభృతులు పెం
పేది చెడిరి భూదేవస, మాదరమునఁ గాదె [1]బ్రతికినవి యిజ్జగముల్.

315. సీ. పసిబిడ్డ వయ్యును బడఁతి నీ వెంతయు గుణవంతురాలవు గురులయందు
[1]పెద్దలయందును బృథివీసురులయందుఁ గడుభక్తి సేయుదు కమలనయన
బంధులుఁ జెలులు సంబంధిజనంబులుఁ బురము వారును నంతిపురము వారుఁ
బూఁబోఁడి నిను నెమ్మిఁ బొగడని వారు లే రేమని వర్ణింతు నేను నిన్ను

తే. యదుకులంబునఁ బుట్టి యత్యంత సౌఖ్య, మమరఁ బెరిఁగితి నాపుత్త్రివై త్రిలోక
సుందరము రూపు ప్రాయంబు సొంపు [2]నిట్టి, నీచరిత్రంబు సతులకు నెందుఁ గలదు.

---

311. 1. నే తగ నియ్యకొంటి – అ. 2. నేత్రి – అ. ఆ. ఇ. ఊ. ఎ. ఐ. ఔ. ఘ. చ. ఝ. ల. శ. ష. (నేత్రి – ఇత్యాదిరూపములు తాళపత్ర ప్రతులలో పెక్కుచోట్ల గలవు. శబ్దసామ్యమున నేర్పడిన యీ రూపములు తెలుఁగులో సాధువులగును). 3. ధీవినయోపచార– వా. కొన్ని ప్రతులు; సద్వినయోపచార – ఈ. ఎ. ఐ. ఝ. త.

312. 1. దేశరి నెయ్యది తన్మతి – ఇ. ఏ. ల; డెయ్యదియెత్తరి–వా; డెత్తరి నెయ్యది – పెక్కు ప్రతులు. 2. మంచిగ – ఆ. ఎ.

314. 1. బ్రదికె నఖిల జగంబుల్ – ఇ. ఎ.

315. 1. పేదల – ఈ. ఐ. త. 2. నిట్టి దిచ్చరిత్రంబు – వా; నిట్టి నీచరిత్రంబు – పెక్కు ప్రతులు.

316. వ. నీగౌరవం బంతయు నెఱింగి కాదె వహ్నిసమానుం డైన యీ మహాముని నారాధించుటకు నీయందు భారం బెక్కించెద నీవును [1]దర్పంబును నహంకారంబును [2]దూరంబున నిడి యిప్పుణ్యపురుషుం బరితుష్టుం జేసి కృతార్థతం బొందు మనిన [3]నక్కన్య యి ట్లనియె.

317. ఉ. కోరుదు నేను విప్రతతిం గొల్వంగ [1]నెప్పుడు నాత్మలోన నా
కోరిన కోర్కె నేఁడు దలకూడె నరేశ్వర యట్లుఁ గాక నీ
కోరిన యట్టి యవ్విధము గోరి యొనర్చుట నాదు భాగ్యసం
భారము గాదె యూఱడుము భార మిది నాపయిఁ బెట్టి నెమ్మదిన్.

318. వ. [1]అనిన సంతసిల్లి కుంతిభోజుండు దుర్వాసున కక్కన్నియం జూపి యి ట్లనియె.

319. క. ఈపిన్నది నాకూఁతురు, తాపసజనముఖ్య [1]మిమ్ముఁ దాఁ గొలువంగా
నోపుదు నని పూనెం బసి, పాప[2]సుఁడీ కినుక లేక పని గొనవలయున్.

-: కుంతి దుర్వాసునకుఁ బరిచర్య సేయుట :-

సం. 3 - 288 - 12

320. చ. ఎఱుఁగక తప్పుగా మెలఁగె నేనియు దానికి సైఁచి [1]నేరుపుల్
గఱపి ప్రియంబుతోఁ గొలువు గైకొనఁగాఁ దగు మీకు బాలురుం
దెఱవలు వృద్ధులుం దమకుఁ [2]దెల్లము దప్పులు సేసి రేనియున్
మఱతురు గాని యల్గరు [3]సమగ్రశమాన్వితు లైన తాపసుల్.

---

316. 1. గర్వంబును నహంకారంబునుమాని - వీ. శ. ష. 2. మాని - ఉ. ఓ. చ. 3. నక్కన్నియ దండ్రి కిట్లనియె-వా. పీ; నక్కన్య యిట్లనియె - కొన్ని ప్రతులు.

317. 1. నెంతయు - ఈ. ఐ.

318. 1. అని పలికిన - వా. పీ. శ; అనిన - పెక్కు ప్రతులు.

319. 1. నిన్ను - ఎ. ఐ. ఔ. త. 2. సుమీ - ఊ. గ. ఘ. ల.

320. 1. నేరుపుల్ - ఆ. ఈ. ఏ. ఐ. ఔ. స. శ. ష; నేరుముల్ - వా. కొన్ని ప్రతులు. 2. దెవ్వగ - ఔ. తెలియక - అనువర్తమున - తెల్వగి? 3. సమశ్వశమాన్వితు— ఈ. ఐ. త.

321. వ. అని యప్పగించి యప్పార్థివేంద్రుండు మునీంద్రునకుఁ జంద్రికాధవళం బైన సౌధంబునందు శయనాసనప్రముఖోపకరణంబులు నభిమతాహారసాధనద్రవ్యంబులు నాయితంబులు సేయించి తాను సంతసంబున నూఱడి యుండె నంత.

322. క. భావించి నాఁడునాఁటికి, వేవిధముల [1]మిగుల భక్తివినయంబులతో
దేవోపచారముల భూ, దేవోత్తముఁ గొల్చెఁ గుంతిదేవి [2]నియత యై.

323. సీ. అతఁడును దద్భావ మరయంగ మదిఁ గోరి రూపించి [1]యొకమఱి రేపవత్తు
నని పోయి [2]నడురేయి నర్థి[3]తోఁ జనుదెంచు రేయి వచ్చెద నని రేప వచ్చు
నేప్రొద్దు వచ్చిన నింతి[4]యప్పుడ క్రొత్తలుగ భక్ష్యభోజ్యాదు లొగి నమర్చి
నెయ్యది గోరిన నిచ్చుకు రాఁబెట్టు నలయదు మది నైన నలుగ దెపుడు

ఆ. ననుదినంబు [5]నధిపుఁ డాత్మజఁ బిలిచి త, ద్వర్తనంబు లడుగ వనజముఖియుఁ
[6]దాను గొలుచు తెఱఁగుఁ దాపసవరుని చం, దమును జెప్పుచుండుఁ దండ్రి యలర.

324. వ. అంత నొక్కసంవత్సరంబు పరిపూర్ణం బయినఁ బ్రీతుం డై దుర్వాసుండు కుంతిం జూచి నీచేసిన యారాధనంబునకు మెచ్చితి నభిమతంబు లిచ్చెద నడుగు మనిన నమ్మానిని కృతాంజలి యై మీరు నావలనం [1]బ్రసన్ను లై తిరి దీనికి మాతండ్రియుం [2]గరం బలరు నింతియ చాలు నొం డేల యనిన నతం డశ్లేని నిది యొక్క మంత్రంబు గైకొనుము దీనంజేసి [3]యెయ్యేని వేల్పు నాహ్వానంబు సేసెద వవ్వేల్పు ననుదెంచి నీవశంబున నుండు ననిన నొం డన వెఱచి [4]కుంతియుం బ్రసాదం బనియె నమ్మునీంద్రుండు దాని కమ్మంత్రంబు విధియుక్తంబుగా నుపదేశించి [5]నిజేచ్ఛం జనియె నంతఁ గొంత కాలంబునకు.

---

322. 1. భక్తిమిగుల – ఔ. ఘ. 2. వినయమై – ఆ. ఈ. ఎ. ఝ. త.

323. 1. యిటపోయి – వా; యొకమఱి – పెక్కు ప్రతులు. 2. నడికి రేయర్థితో – వా; నడురేయినర్థి – పెక్కు ప్రతులు. 3. తోడుతవచ్చు – ఉ. ఔ. ష; తో వచ్చు రే వచ్చెద – అ. ఇ. ఈ. ఏ. ఐ. ఓ. గ. త. 4. యప్పుడ క్రొత్తలుగ భక్ష్య భోజ్యాదు లొగి నమర్చి – పెక్కు ప్రతులు; యప్పుడ భక్ష్య భోజ్యముల్ గ్రొత్త పొల్పుగ నొనర్చు–వా. పీ. శ. ష. 5. భోజుఁ డాత్మజఁ బిల్చి–వా. కొన్ని ప్రతులు; 6. నందు గొలుచు చుండు చందంబు దాపసి తెరగు తండ్రి యొద్ద దెలుపుచుండు–ఉ.

324. 1. ప్రీతులై తిరి – ఆ. ఈ. ఎ. ఐ. ఝ. డ. త. ల. 2. గడు నలరు – అ. ఉ. ట. పీ. శ. ష. 3. యెయ్యేని యొక్కవేల్పు – ల; కొన్ని ప్రతులు; యేవేల్పు నారాధనంబు–ఈ. ఐ. త. పీ. శ. ష. 4. కుంతి యెంతయుం బ్రసాదం బనియె – పీ. శ. ష. 5. కుంతి భోజుని దీవించి నిజేచ్ఛం – వా. కొన్ని ప్రతులు.

325. మ. మదిఁ గారుణ్యముసేసి విప్రవరుఁ డీ మంత్రంబు నాకిచ్చె నే
నిది యేచందమొ చూతు నంచు నొకనాఁ డిచ్చన్ [1]ఋతుస్నాత యై
సుదతీరత్నము పూర్వశైలతటిపై శోభిల్లు [2]తిగ్మాంశుఁ జూ
చి [3]దళత్పద్మము మాడ్కి నుల్లసిత మై చిత్తంబు [4]రాగిల్లఁగన్.

326. వ. సహజకుండలకవచాభిరాముం డైన తదీయమూర్తివిభవంబున కోటు వడి దేవా భవత్సమాన[1]సుందరుం డగు నందనుం గరుణింపవే యని మనంబునం గోరుచు మంత్రోచ్చారణంబు [2]చేసినఁ బ్రభాకరుండును నిజయోగబలంబున మూర్త్యంతరంబు ధరియించి కుంతిపాలికిం జనుదెంచి మధుర[3]స్వరంబున.

327. తే. అబల నీమంత్రబలంబున నరుగుదెంచి, నాఁడ నీవాఁడ నైతి మనఃప్రియంబు
నీకు నెయ్యది యొనరింతు నిజము చెపుమ, యనినఁ బడఁతి యిట్లనుఁ
గమలాప్తుతోడ.

328. తే. కార్య మొక్కటియును లేదు కౌతుకమున, నేను మంత్రంబు నొడివితి నింతమాత్రఁ
జేసి [1]నీకు నిచ్చుటకి విచ్చేయ నేల, దివికి నరుగుము క్రమ్మఱ దేవ నీవు.

329. వ. అనిన దానికి సూర్యుం డిట్లనియె.

330. ఉ. క్రమ్మఱి పోక తప్పెడినె కామిని యేమని మున్ను నీవు చి
త్తమ్మునఁ గోరి తద్విధము దప్పక యిప్పుడుఁ [1]బల్కరాదె తే
జమ్మున మత్సమానుఁ గవచస్ఫుటకుండలమండితాంగు స
త్సమ్మతుఁ బుత్త్రుఁ గోరవె నిజమ్ముగ నావలనం దలోదరీ.

---

325. 1. కృతస్నాతయై – వా. కొన్ని ప్రతులు; ఋతుస్నాతయై – ఇ. ఈ. ఊ. ఎ. ఏ. ఒ. ఔ. గ. ఘ. చ. త. 2. తీవ్రాంశు – ఔ. ద. 3. దళత్పంకజ భంగి – అ. ఉ. పీ. శ. ష. 4. రంజిల్లగన్ – ఉ. ల.

326. 1. రూపసుందరుండగు – ల. కొన్ని ప్రతులు. 2. సేయుచున్న – వా. కొన్ని ప్రతులు; చేసిన – పెక్కు ప్రతులు. 3. స్వనంబున – వా. కొన్ని ప్రతులు; స్వరంబున – కొన్ని ప్రతులు.

328. 1. నీవిచ్చటికిని విచ్చేయ నేల – ఆ. ఇ. ఉ. ఎ. ఏ. ద. పీ. శ. ష; నీవిచ్చటికిని వేంచేయనేల – ఈ. ఒ. ఓ. గ. ఘ. ఝ. త.

330. 1. బల్కగాదె – ఉ. ఊ. చ. స; చెప్పరాదె – కొన్ని ప్రతులు.

331. వ. కావున నిప్పుడు మదీయసమాగమంబున కొడంబడుము నీకోరిన యట్టి తనయుండు [1]జనియించు నిట్లు సేయనినాఁడు [2]నిన్నును భవజ్జననీజనకులను భస్మంబు సేయుదు మఱియు నీదైన శీలవృత్తంబు లెఱుంగక మంత్రంబు గర్వంబునం జేసి నీ కుపదేశించిన తాపసు నీక్షణంబ నిర్దహింతు నిదె యంబరంబుననుండి యింద్రాదిసురవరులు నీకతమ్మునఁ జిక్కువడి యున్న నన్నుం జూచి నవ్వుచున్న[3]వా రిదె సూడుము దివ్యదృష్టి యిచ్చితి ననినం జూచి కుంతిభోజనందన డెందంబున నమందలజ్జావివశ యగుచు దినేశ్వరున కిట్లనియె.

332. క. నను నిచ్చుటకుం గర్తలు, జననియు జనకుండుఁ గాక చను నే నాకుఁ
వనితా[1]ధర్మము విడువఁగ, ననఘా యిట్లయిన [2]వంశహానియుఁ గాదే.

333. ఆ. మంత్రబల మెఱుంగ మదిఁ గోరి తప్పు సే, సితి మహాత్మ దీనిఁ జెట్టగాఁగ
నవధరింప కెట్టులైన నా[1]బాల్యంబుఁ, గరుణ సైఁపవలయుఁ గమలమిత్ర.

334. వ. అని మఱియు ననేకప్రకారంబుల దివాకరు ననునయించి యెట్లునుం గ్రమ్మఱింప నేరక దనకారణంబునఁ గులంబునకును గురుజనంబులకును నపాయం బగు ననియుం దలపోసి భయంబు మిగులఁ దెగువ సేసి యతని కిట్లనియె.

335. చ. ముదము దలిర్ప బంధుజనముల్ గురువర్గముఁ గూడి యూధి నొ
ప్పిదముగ ధర్మమార్గమునఁ [1]బెండిలి సేయఁగఁ బిమ్మటఁ సము
న్మద[2]రసకేళిలీలకుఁ గ్రమం బగుఁ గాక కులంబు శీలమున్
వదలి వధూజనంబులకు వచ్చునె యిమ్మెయి వేడ్క సల్పఁగన్.

---

331. 1. జన్మించు - ఈ. ఎ. ఘ. ఝ. త. 2. నిన్నును - అ. ఉ. ఓ. ఘ. వీ. శ. వ. ప్రతులలో లేదు. 3. వారు వీరిం - వా. కొన్ని ప్రతులు; వారిదె - ఈ. ఎ. ఙ. ఝ. త.

332. 1. ధర్మువు - వా. కొన్ని ప్రతులు; ధర్మము - పెక్కు ప్రతులు. 2. ధర్మహానియు - వా. కొన్ని ప్రతులు; వంశహానియు - పెక్కు ప్రతులు.

333. 1. ధార్ష్ట్యంబు - అ. ఈ. ఐ. ఝ. డ. త. ల.

335. 1. పెండ్లి యొనర్పగ జేసి పిమ్మటన్మద - ఆ. ద. 2. రతికేళి - గ. చ. ల; రసకేళి లీలకుఁ గ్రమం బగు - ఈ. ఘ. త. వీ. శ. ష. స; రసకేళి లీల గరిమం బగు-వా. కొన్ని ప్రతులు.

336. క. బంధుమతి నైన నను [1]ని, ర్బంధము మెయి ధర్మబాహ్యపథమున నలినీ
బాంధవ యిటు సేయుటయు న, మంధరభవదీయకీర్తి మలినము గాదే.

337. చ. జగములయందు ధర్మువును సత్యము [1]నీయవి గావె [2]దేవ యే
తగవులు నీయెఱుంగని విధంబులె యిట్టిది నీదు [3]బుద్ధికిం
దగ వగునేని మార్పులుకుదాననె యే నగుఁగాక నీకు నిం
పగు తెఱఁ గాచరింపు మట యావల నయ్యెడు నింద [4]కోర్చెదన్.

338. సీ. అనుటయు నద్దేవుఁ డయ్యిందుముఖిఁ జూచి తల్లిదండ్రులును బాంధవ[1]జనంబు
కారు [2]నిన్నిగికిఁ గర్తలు విను నీవ యొడయురాలవు [3]నీకు నుజ్జ్వలాంగి
కామంబు లెల్లను గామించి పొందుట నయ్యెఁ గన్యాశబ్ద మట్లు[4]గాక
[5]యాత్మతంత్రత్వంబునందు నీకెగ్గు లే దే నేల నడతు ధర్మేతరంబు

ఆ. మత్సమాగమమున మదిరాక్షి [6]నీదు క, న్యావ్రతంబుఁ జెడదు నందనుండు
నధికతేజుఁ డుదయ మగు నిన్ను [7]నొక్క నిం, దయును బొంద కుండుఁ
దథ్య మబల.

*–: కుంతి సూర్యునివరంబున గర్భంబు దాల్చి కర్ణుం గాంచుట :–*

సం. 3 – 292 – 1

339. వ. అని యొడం బఱిచి సూర్యుండు దత్సమాగమంబునం బ్రీతుం డై దానికి గర్భాధానంబు సేసి గగనంబున కరిగె నంతఁ బూర్వపక్షంబునందు చంద్రుండునుం బోలె గర్భంబు క్రమంబునఁ బ్రవర్ధనంబు నొందుచు నభి

---

336. 1. నిర్బంధముమై సేత ధర్మబాహ్యము నలినీ – ఇ. ఐ. త. శ. ష.

337. 1. నీయవికావె – డ. ల; నియ్యదిగాదె – పెక్కు ప్రతులు; నీయదిగాదె – వా. కొన్ని ప్రతులు. 2. యెందు నే–వా. కొన్ని ప్రతులు; దేవ యే – పీ. శ. ష. కొన్ని ప్రతులు. 3. భంగికిం – వా. కొన్ని ప్రతులు; బుద్ధికిన్ – పీ. శ. ష. పెక్కు ప్రతులు. 4. కోర్చితిన్ – పెక్కు ప్రతులు.

338. 1. జనులును – వా. కొన్ని ప్రతులు; జనంబు – పెక్కు ప్రతులు. 2. నీయాగికి – ఈ. ఎ. ఐ. త. పీ. శ. ష. 3. వినుము యుజ్వలాంగి – ఓ. గ. ఝ; గానయు జ్వలాంగి – ఓ. 4. గాన – వా. పెక్కు ప్రతులు; గాక–ఓ. ఔ. ఝ. 5. యాత్త మంత్రత్వంబునందు – డ. 6. నీకు – ఈ. ఎ. ఐ. ఓ. త. 7. లోకనింద – వా. పెక్కు ప్రతులు; నొక్కనింద – పీ. శ. ష.

వ్యక్తం బయ్యెను బ్రభాకరుని మహిమం జేసి లోకవిదితంబు గాకుండం దత్ప్రకారంబు దాది కూఁతు రొక్కతియ యెఱుంగు నిట్లు[1]వర్తిల్లుచుం బది యగు మాసంబున నొక్కనాఁటి నిశాసమయంబునం గన్యాంతఃపురంబునందు.

340. ఆ. కొడుకుఁ గనియె సహజకుండలకవచాభి, రాము విమలకమల [1]కోమలాక్షు
దీర్ఘబాహుఁ జారుదృఢ[2]దేహుఁ దరుణార్క, తేజుఁ గుంతిభోజరాజపుత్త్రి.

341. వ. ఇట్లు జనియించిన యర్భకుం జూచి లోకాపవాద [1]భయంబునకుం దలరి యా క్షణంబ యొక్క మంజూషలోన [2]నబ్జాలకుం బదిలంబుగా నిడి దాని నతి దృఢంబుగాఁ దెప్పం బంధించి సఖియునుం దానును గొని పురసమీప గతంబైన యశ్వనదీప్రవాహంబున విడిచి కుంతి యెంతయు సంతాపంబున నిట్లని [3]విలాపంబు సేసె.

342. ఆ. కొడుక నిన్నుఁ గాంచు కొఱఁత నోములె కాని, పెంచి గారవించి పేర్మి నీదు
ప్రోపుఁ గుడువఁ గాంచు పుణ్యంబు దుదిముట్ట, నేల చేయనైతి నేను గుఱ్ఱ.

343. మ. నెలయం బున్నమ [1]చందురుం బెనయు నీనెమ్మోమునం [2]దియ్యనై
చిలున వ్వొప్పఁగఁ జూడ నీకపులకల్ [3]చెన్నొంద నిన్ గ్రుచ్చి య
క్కఱ [4]దీఱం బొరి నక్కునం గరము [5]వేడ్కం జేర్ప నీ కిమ్మెయిన్
[6]వలుతం ద్రోవఁగఁ జేసెనే యకట దైవం బెందుఁ జొత్తున్ సుతా.

---

339. 1. వర్ధిల్లుచుం - వా. కొన్ని ప్రతులు; వర్తిల్లుచుం - కొన్ని ప్రతులు.

340. 1. కోమలాంగు - ఇ. ఎ. 2. వక్షు - ఔ.

341. 1. భయంబునం దలరి - ఇ. ఊ. ఏ. ఒ. చ. ద. 2. నబ్జాలుం-కొన్ని ప్రతులు. 3. విలపించె - చ.

343. 1. చంద్రుతో నెనయు - ఆ. ఈ. ఎ. ఐ. ఝ. త; చంద్రునిం దొరయు - ఠ. న. 2. దియ్యమై - వా. కొన్ని ప్రతులు; దియ్యనై - కొన్ని ప్రతులు. 3. సెల్వొంద - వా. కొన్ని ప్రతులు; చెన్నొంద - ఆ. ఈ. త. శ. ష. 4. వోవన్ - ఆ. ఈ. ఐ. ఝ. త. ద. శ; తోడంబొరి - ఎ. ఓ. గ. ఠ. 5. వీఁకం - వా. కొన్ని ప్రతులు; వేడ్కం - ఈ. ఐ. త. వీ. శ. ష. 6. వలదం - వా. కొన్ని ప్రతులు; వలుతం - కొన్ని ప్రతులు.

844. సీ. ఏపుణ్యసతికి నీవింక [1]నందనుఁడ వై యెక్కడఁ బడియెదో యే నెఱుంగ
నేపుణ్యురాలొకో [2]యెప్పుడు నినుఁ బుత్త్రుఁ గాఁ గాంచుటకు మేలికలను గాంచు
లలిఁ బాంసుకేళి నల్లన [3]నడయాడుచు నవ్యక్తమధురవాక్యామృతంబు
వీనులఁ గురియుచు వెడఁద[4]కన్నులఁ బిన్ననవ్వును శుభలక్షణములు [5]నమరఁ
ఆ. దేజరిల్లు నిన్నుఁ [6]దెలివ యెవ్వత యొక్కొ, యడరఁ గ్రుచ్చి యురమునందుఁ జేర్చి
[7]వేడ్కమిగుల వేనవేలభంగులఁ గొని, [8]యాడి నగుచు ముద్దులాడుఁ గొడుక.

845. ఉ. లాలితయౌవనోజ్జ్వలవిలాసములం [1]దిలకించు సుందరా
ఖిలవిచేష్టితం బమర భీమమనోభవసింహరేఖ మై
వాలవె యింక నీ వెలమి వామవిలోచన లంగజన్మలీ
లాలస లై విపత్తులు భయాలసు లై ధృతి యేది చూడఁగన్.

846. ఆ. ఎచట నున్న నైన నెల్లప్పుడును నిన్నుఁ, గన్నులారఁ జూడఁగాంచుఁ గాన
తనయ నిన్నుఁ గనిన తపసుండు గడు ధన్యుఁ, డయ్యొ
మందభాగ్య నైతి నేను.

847. చ. ఇనుఁ డఱచేత మాటుపడు చెన్నఁడుఁ గల్గునె నిన్ను నెమ్మినేఁ
గని యెదఁ గాక యింక నొకకాలమునం దయినం దనూజ నీ
వినుతశరీరభావమును వీనుల సన్మణికుండలంబులుం
ఘనతరవజ్రవర్మముఁ బ్రకాశత నొందక యుండ నేర్చునే.

---

844. 1. జేపడియెదో - వా. కొన్ని ప్రతులు; నందనుఁడవై - ఈ. ఐ. ఘ. త. వీ. శ. ష. 2. యిప్పుడు - వా. సం. కొన్ని ప్రతులు; యెప్పుడు - కొన్ని ప్రతులు. 3. నడపాడుచు - వా. కొన్ని ప్రతులు; నడయాడుచు - ఔ. వీ. ష. 4. కన్నుల బిన్ననవ్వును - అ. ఉ. ఐ. ఒ. ఓ. ఔ. ఘ. చ. ఝ. ద. శ. ష; కన్నులుఁ బిన్న - వా. కొన్ని ప్రతులు. 5. మెరయ - కొన్ని ప్రతులు. 6. దెచ్చి యెవ్వత - ఆ. ఇ. ఈ. ఎ. ఏ. ఐ. త. 7. లీలనొత్తి - ఇ. ఈ. ఐ. త. సగ్వయతినియమభంగము; వేడ్కమిగిలి - వా. కొన్ని ప్రతులు; వేడ్కమిగుల - కొన్ని ప్రతులు. 8. యాడియాడి - వా. కొన్ని ప్రతులు; యాడినగుచు - ఐ. త. వీ. శ. ష.

845. 1. విలసించు - ల; దిలకించు - వా. పెక్కు ప్రతులు; దిలకింప - వీ. ష.

348. చ. [1]దివి భువి నంతరిక్షమున దిక్కుల గాడ్పున నగ్నియందు న
ర్ణవములయందు ఘోరవిపినంబులయందును నీకు నెప్పుడున్
శివ మగుఁగాక దిక్పతులు సిద్ధులు సాధ్యులు రుద్రు లాశ్వినుల్
[2]భువనము లర్కచంద్రులును బుత్త్రక నిన్ గృపఁ గాచుచుండెడున్.

349. వ. అని యేడ్చుచుం గుంతి యచ్చటం దడయ వెఱచి గూఢప్రకారంబునఁ గన్యాంతఃపురంబునకు వచ్చి యెప్పటియట్ల వర్తిల్లుచుండె నట మంజూషయు నశ్వ[1]నదీవేగంబునఁ జర్మణ్వతికిం జని యందుండి యమునాగత మయ్యె నట చని భాగీరథింబడి సూతవిషయంబునం [2]బంపానగరంబు చేరువ నరుగుచుండె నాసమయంబున.

350. సీ. ధృతరాష్ట్రసఖుఁ డైన యతిరథుం డను సూతుఁ డతివయుఁ దానును నతివిభూతి
గంగలో జలకేళిసంగతుం డై యుండి తుంగతరంగానుషంగవశతఁ
జనుదెంచు మంజూషఁ [1]గని కడు వేడుకఁ దనపరిజనములఁ బనిచి పట్టి
తెప్పించి ధీయుక్తి యొప్ప నేకతమున నప్పెట్టెఁ దెఱచి తా నప్పు డందు
ఆ. వినుతహేమకవచుఁ గనకకుండలధరు, ననుపమానతేజు ఘనుఁ గుమారుఁ
గని మనంబులోన ననయంబు విస్మయం, బొనర గ్రుచ్చి యెత్తి[2]కొని ముదమున.

351. వ. తన జీవితేశ్వరి యైన [1]రాధం జూచి యి ట్లనియె.

352. క. అనపత్యుల మగు మనకును, మనపాలిటి వేల్పు నిక్కుమారుని నిచ్చెఁ
వనజాక్షి [1]వీఁడు మానుష, జనితుఁడు గాఁ డరయ దేవసంభవుఁడు సుమీ.

---

348. 1. దివియును నంతరిక్షమును దిక్కులు గాడ్పును నగ్నియు న్మహార్ణవములు శైల ఘోరవిపినంబుల యందును...అని కొన్ని ప్రతులు. 2. పవనులుఁ బుత్త్ర నిన్నుఁ గృపఁ బాయక యెప్పుడుఁ గాచుచుండెడున్ - వా. పెక్కు ప్రతులు; భువనము లర్కచంద్రులును బుత్త్రక నిన్ గృపఁ గాంచుచుండెడున్ - డ.

349. 1. నదీప్రవాహవేగంబున - వా. కొన్ని ప్రతులు; ప్రవాహ - పెక్కు ప్రతులందు లేదు. 2. జంపానగరం - కొన్ని ప్రతులు.

350. 1. గని వేడుకలరంగ దన - ఏ. 2. కొని యతండు - ఆ. ఈ. ఎ. ఐ. ఝ. త.

351. 1. రాధకుం జూచి - వా. కొన్ని ప్రతులు; రాధం జూచి - కొన్ని ప్రతులు.

352. 1. యితడు - వా. కొన్ని ప్రతులు; వీడు - కొన్ని ప్రతులు.

353. క. అని దానిచేతి కిచ్చినఁ, గొని యురమునఁ నదిమి కొనియెఁ గొడుకు నతివ య
వ్వనితకుఁ [1]బాలెంతతెఱం, గునఁ జన్నులు సేఁపె నపుడు గూరిమి పేర్మిన్.

354. వ. ఇట్లాదంపతులు [1]ప్రమోదసంపద సొంపారఁ గుమారుం గొని నిజమందిరంబున కరిగి యాత్మీయకులోచితంబు లగు జాత[2]కర్మసంస్కారం బొనరించి సహజకుండలాలంకృతకర్ణుం డగుటం జేసి కర్ణుం డను నామకరణంబు [3]సేసి రంత.

355. క. వసువర్మధరుఁడు గావున, వసు[1]సేనుం డనెడు పేరు వాని కిడిరి పెం
పెసఁగఁగ భూసురు లాది, త్యసుతుం డిబ్భంగి సూతతనయుం డయ్యెన్.

356. వ. తద్వృత్తాంతం బంతయుఁ గుంతి తన యాప్త[1]చారులవలన విని [2]శిథిలీకృతసంతాప యై యుండె నతిరథుం[3]డును గ్రమంబున సంప్రాప్తయౌవనుం డైన కొడుకుం దోడ్కొని వచ్చి ద్రోణాచార్యుల యొద్ద నస్త్రశిక్ష సేయం బెట్టె నాసూతసూనుండు మఱియుఁ గృపాచార్యులవలనను జామదగ్న్యువలనను వివిధాస్త్రలాభంబు నొంది క్రమంబున దుర్యోధనుతోడ బద్ధసఖ్యుం డై యతనికిఁ బ్రియంబుసేయం దివిరి దివిజరాజనందనుతో మచ్చరించుచుఁ బాండవుల కప్రియంబు సేయుచుండె.

357. ఉ. ఆతని యస్త్ర[1]వీర్యము సమంచితకుండల [2]వజ్రవర్మవి
ఖ్యాతియు నాత్మలోఁ దలఁచి కౌరవనాయక ధర్మసూనుఁడున్
భీతమనస్కుఁ డై యతఁ డభేద్యబలుం డని సంతతంబు దై
న్యాతిశయంబు డించి హృదయవ్యథఁ బొందుచు నుండెఁ గానలోన్.

---

353. బాలింత — అ. ఐ. ఔ. ఘ. ట. ద. శ. ష.

354. 1. ప్రమోదం బొప్పార—ఈ. ఐ. 2. కర్మాది సంస్కారంబు లొనరించి—వా. కొన్ని ప్రతులు; కర్మ సంస్కారం బొనరించి—కొన్ని ప్రతులు. 3. గావించి రంత—పెక్కు ప్రతులు.

355. 1. సేనుం డనఁగఁ బేరు వానికి నిడి రింపెసఁగ—వా. కొన్ని ప్రతులు; సేనుం డనెడు పేరు వాని కిడిరిపెంపెసగ — వీ. శ. ష. కొన్ని ప్రతులు.

356. 1. చెలుల — ఈ. ఐ. ఔ. ఘ. శ; చారుల — ల; చరుల — వా. కొన్ని ప్రతులు. 2. విగతసంతాప — ఉ. గ ఝ. 3 డును సంప్రాప్త — వా. కొన్ని ప్రతులు; డును గ్రమంబున సంప్రాప్త — కొన్ని ప్రతులు.

357. 1. వీర్యము — అ. ఇ. ఉ. ఎ. ఏ. ఒ. ఓ. ఔ. గ. చ. ఠ. డ. ల; విద్యయు — వా. కొన్ని ప్రతులు. 2. వజ్ర వర్మ — ఈ. ఐ. త. వీ. శ. ష. స; ధర్మవర్మ — వా. కొన్ని ప్రతులు.

358. వ. అయ్యుధిష్ఠిరునకుఁ బ్రియం బాచరింపం గోరి కర్ణు కవచకుండలంబులు కొనుటకై పురందరుం డొక్కనాఁడు బ్రాహ్మణరూపంబునం జని మధ్యాహ్నసమయంబునఁ గర్ణుండు సూర్యోపాస్తి సేయుచుండి బ్రాహ్మణుల [1]కభీష్టధనంబు లిచ్చుతఱి నతనిం గని భిక్షాం దేహి యనుటయుఁ గర్ణుం డతని కి ట్లనియె.

359. చ. అలసవిలాసలాలస[1]రసాన్విత లైన నితంబినీజనుల్
వలసిన భూరివిస్ఫురితవస్తుసమగ్రము లైన గ్రామముల్
వలసిన నుల్లసన్మణిసువర్ణవిభూషణగోధనావళుల్
వలసినఁ గోరు మిచ్చెద ధ్రువంబుగ నావుడు [2]నాతఁ డిట్లనున్.

360. క. విను మిని యెయ్యవియును నా, కు నభీష్టము గావు నీదు కుండలములు [1]నీ వినుత కవచంబు నిచ్చినఁ, గొనియెద [2]నిమ్మోపు దేని గుణరత్ననిధీ.

361. చ. అనవుడుఁ గర్ణుఁ డిట్లనియె నక్కట యేను విశిష్టవస్తువుల్
గొనకొని యిత్తు నాఁగ నిటు [1]గోరెదు నీవు దలంప నప్రయో
జన మగువాని భూమిసురసత్తమ యెంతయు బేల వైతి ము
న్నెనయఁగ [2]నిట్టి వెవ్వరును నెవ్వరి వేఁడిరె యిజ్జగంబులన్.

362. క. కుండలములుఁ గవచము న, ట్లుండఁగ ని మ్మనఘ వేఁడు [1]మొండు ధనంబుల్
నిండింతు నీమనోరథ, మొండేమియు నన కు మింక నూర్జితచరితా.

---

358. 1. కు నభీప్సితంబు లిచ్చు తఱిం గని-వా. కొన్ని ప్రతులు; కభీష్టధనంబు లిచ్చు తరి నతనిం - కొన్ని ప్రతులు.

359. 1. రసాస్పదులైన - ట. 2. వానికిట్లనున్ - గ.

360. 1. నద్వినుత - వా. కొన్ని ప్రతులు; నీవినుత - పెక్కు ప్రతులు. 2. నీనోపుదేని - వా. కొన్ని ప్రతులు; నిమ్మోపుదేని - పెక్కు ప్రతులు.

361. 1. గోరుదె నీవు దలంపక ప్రయో-వా; గోరెదు నీవు దలంప నప్రయో - పెక్కు ప్రతులు. 2. నిట్టు లెవ్వరును నెయ్యెడ - వా; నిట్టి వెవ్వరును నెమ్మెయి - ల; నిట్టి వెవ్వరును నెన్నడు - ఇ. ఎ. ఏ. ఝ; నిట్టి వెవ్వరును నెవ్వరి - ఈ. ఉ. ఐ. ఒ. చ. త.

362. 1. మొలసిన ధనముల్-వా. కొన్ని ప్రతులు; మొండు ధనంబుల్-పెక్కు ప్రతులు.

363. వ. అనిన నతం డెవ్విధంబున [1]నొడంబడక కవచకుండలంబులయందు బద్ధాభిలాషుం డయి పలికినఁ గర్ణుం డతనిం బ్రార్థించియుఁ బూజించి[2]యు ననేక మణి[3]కనకాదిద్రవ్యంబులు నివేదించియు నెట్లును నొడం బఱుపనేరక [4]యి ట్లనియె.

364. తే. సహజములు [1]నాకు నిక్కవచంబుఁ గుండ, లములు నివిలేక యున్న నే సమరభూమిఁ
గడిఁదిశత్రులచేత [2]భంగంబు వచ్చుఁ, గాన యీఁజాల నయ్యేద వీని నేను.

365. క. నానాజనపదబహుళము, నానాధన[1]యుతము నైన నారాజ్యము స
[2]మ్మానంబున నిచ్చెదఁ గొన, వే ననుఁ గారింప కింక విప్రవరేణ్యా.

366. వ. [1]అనియును నతనియందు సుముఖత్వంబు [2]గానక కానీనుండు దరహసితాననుం డగుచుఁ గృతకభూసురు నుపలక్షించి యి ట్లనియె.

367. చ. ఎఱిఁగితి [1]నిన్ను నేను విబుధేంద్రుఁడ వీవు జగత్త్రయంబు [2]గ్ర
చ్చఱ భవదీయరక్షణమునందు వెలుంగుచు నుండు నట్టి ని
న్నుఁ బవుగ నేను వేఁడుకొన [3]యుక్తుఁడఁగాక మొఱింగి నన్ను న
క్కఱ పడి నీవు వేఁడు టిది కర్జమె నిర్జితదైత్య చెప్పుమా.

---

363. 1. మగుడక — ఘ. ల; మగుడం బడక — అ. ఇ. ఎ. ఏ. ఔ. గ. ఘ. చ. ఝ. ద. 2. యు బుజ్జగించి — వా. ఇది పెక్కు ప్రతులలో లేదు. 3. కనకాది వస్తువులు — పీ. శ. ష. 4. యిట్లనియె — పెక్కు ప్రతులు; యతని కిట్లనియె — వా.

364. 1. సూవె నాకు నీమహితకవచకుండలంబులు నివి లేక యుండెనేని—అ. ఇ. ఈ. ఎ. ఏ. ఐ. త. ద. శ. 2. భంగంబు వచ్చు—పెక్కు ప్రతులు; భంగంబు వడుదు — వా.

365. 1. సంయుతంబు నా — వా; కొన్ని ప్రతులు యుతము నైన — కొన్ని ప్రతులు. 2. న్మానంబు — పెక్కు ప్రతులు.

366. 1. అని యతనియందు — చ. ల. 2. వడయ జాలక — ఇ. ఈ. ఎ. ఏ. ఐ. త. ల.

367. 1. నిన్ను నేను — కొన్ని ప్రతులు; నేను నిన్ను — వా. కొన్ని ప్రతులు. 2. చెచ్చెర భవదీయ రక్షణము జెంది — అ. ఘ. చ. ల. 3. నుత్తుడగాక — తి; నొప్పవు గాక — ఔ.

368\. తే. అనిన నింద్రుఁ డిట్లనియె మీయయ్య పద్మ
హితుఁడు మున్నింత[1]యును జెప్పె నిష్ట మెసఁగ
[2]గాన నెఱిఁగితి నీ వింకఁ [3]గడప నేల
యనఘ మాబోఁటులకుఁ బ్రియమైన పనికి.

369\. వ. అనిన రాధేయుండు దేవా యట్లయిన నిఖిలశత్రుఘాతిని యైన నీయమోఘ శక్తి నాకుం గృపసేసి కవచకుండలంబులు గొను మనినం బాకశాసనుం డిట్లనియె.

370\. ఉ. ఇచ్చెద శక్తి నీకు విను మేర్పడ నాజి మదీయశత్రులం
గ్రచ్చఱఁ [1]జంపి చంపి యది గ్రమ్మఱ చేతికి వచ్చుచుండు నీ
కిచ్చుట యట్లుగాదు భువి నెందును దుర్జయుఁ డైన నీరిపుం
జెచ్చెరఁ దున్మ[2]నొక్కరుని [3]చేకుఱ నన్ను భజించుఁ [4]గ్రమ్మఱన్.

371\. వ. ఇట్టిది సమయంబుగాఁ [1]బరిగ్రహింపు మనినఁ గర్ణుండు నాకుం గల [2]పగతుండును నొక్కరుండ వాని వధియించుటయ మదీయమనోరథం బనుటయుఁ బురందరుండు [3]దరహాసితవదనుం డై.

372\. ఉ. నీయభిలాష మేను మది నిక్క మెఱుంగుదు [1]నుగ్రశౌర్యతే
జోయుతుఁ బార్థు నోర్తునని చూచెదు [2]నీకది యేల తీరు రా
ధేయ దయావిధేయుఁడు విధేయజగత్త్రయుఁ డవ్యయుండు నా
రాయణుఁ డమ్మహాత్మునకు రక్షకుఁ డేరికి వాఁడు సాధ్యుఁడే.

---

368\. 1. సెప్పె నీకిష్టమెసగ – వా. కొన్ని ప్రతులు; యును జెప్పె నిష్టమెసగ – పెక్కు ప్రతులు. 2. దాన నెరిగితి నీవింక దడయనేల – అ. 3. గడవనేల – వ.

370\. 1. చంపి చంపి – పెక్కు ప్రతులు; చంపి చింపి – వా. కొన్ని ప్రతులు. 2. నొక్కరుని జేకొని – ఉ. పీ వ. 3. జేకొని, గైకొని – అని పాఠములు. 4. బిమ్మటన్ – ఆ. ఉ. ఊ ఒ. ఓ. ఔ. గ. చ.

371\. 1. బతిగ్రహింపు మని – ఉ. ఊ. ఊ. ఒ. ఓ. ఔ. గ. చ. 2. పగతుండును నొక్కరుండ – ఆ. ఇ. ఊ. ఎ. ఏ. ఒ; పగతుం డొక్కరుండ – వా. కొన్ని ప్రతులు. 3. దరస్మిత, మందస్మిత – అని కొన్ని ప్రతులు.

372\. 1. నుగ్రశౌర్యుఁదేజో – వా. కొన్ని ప్రతులు; నుగ్రశౌర్యతేజో – పెక్కు ప్రతులు. 2. నీకటులేల తీరు – పెక్కు ప్రతులు; నీ కిటు లేలతీరు – ఉ. చం.

373. వ. అనినం దపనందనుం డది యట్లుండె [1]సహజం బైన కవచం బొలిచి యిచ్చిన మదీయదేహంబు వికృతంబగు నిది యేమని [2]యవధరించెదవనిన నింద్రుండు నీశరీరంబు భవజ్జనకుం డైన యరుణకిరణువర్ణం బెట్టి దట్టి దీప్తిం జెలువొందు నని పలికి [3]వానికి నమోఘశక్తి యొసంగి దీని నాపత్కాలంబునం దక్కం దెఱయప్పుడు ప్రయోగించిన నీకపాయం బగు నని చెప్పెం దదనంతరంబ యవ్వీరుండు [4]కవచకుండలంబులం బుచ్చి యతని కిచ్చె.

374. చ. అలఘునిశాతశస్త్రమున నంగము[1]లెల్లను నిర్వికారుం డై
యొలువం [2]దొడంగినట్టియెడ హో యని కిన్నర యక్ష సిద్ధ సా
ధ్యులు దివినుండి యార్చుచును దూర్యరవంబు సెలంగ [3]నద్భుతం
బెలయంగం బుష్పవృష్టిం గురియించిరి [4]కర్ణునిపైం బ్రియంబునన్.

375. వ. ఇట్లు సూతపుత్త్రుని వికృతగాత్రుం జేసి వాసవుండు ప్రమోదవికాసభాసితుం డగుచు నిజలోకంబున కరిగెం దద్వృత్తాంతం బంతయు విని కౌంతేయు లత్యంతసంతోషంబునం బొదలిరి గాంధారేయులు దుఃఖవిదారితహృదయు లై రని యిట్లు [1]కవచకుండలాభిహారణంబు సవిస్తరంబుగాం జెప్పిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

376. క. అనయము దుస్తర మగు న, వ్వనవాసము నిస్తరించి ద్వాదశవర్షం
బున కడపట నేమివిధం, బొనరించిరి మత్పితామహులు మునినాథా.

---

373. 1. నాకు సహజం బైన — వా. కొన్ని ప్రతులు; సహజం బగు — కొన్ని ప్రతులు. 2. వివరించి తనిన — డ; యనుగ్రహించి తనిన — శ. 3. వానికి — కొన్ని ప్రతులలో లేదు. 4. కవచ — కొన్ని ప్రతులలో లేదు. కాని మూలమున కర్ణుఁడు కవచకుండలములు రెండును ఇచ్చినట్లే కలదు. తతశ్ఛిత్వా కవచమ్ దివ్య మంగాత్ తథైవార్ద్రం ప్రదదౌ వాసవాయ, తథోత్కృత్య ప్రదదౌ కుండలే తే కర్ణాత్తస్మాత్కర్మణా తేన కర్ణః. చిత్రశాలాప్రతి. వనపర్వ. పుట. 483.

374. 1. లన్నియు — వా. కొన్ని ప్రతులు; లెల్లను — ఊ. ట. గ. శ. వ. 2. దొడంగె— కొన్ని ప్రతులు. 3. బూవుసో నలుగురియించి రా తపననందనుమీద నుతించి వేడ్కతోన్—ఆ. ఈ. ఎ. ఐ. త — కొన్ని ప్రతులు. 4. కర్ణుపయిం—వా; కర్ణునిపై — పెక్కు ప్రతులు.

375. 1. కుండలాపహారణంబు — వా. కొన్ని ప్రతులు; కవచకుండలాభిహారణంబు—కొన్ని ప్రతులు.

377. వ. అనిన నమ్మహీపతికి నమ్మహీదేవుం డి ట్లనియె నట్లు మార్కండేయువలనఁ బుణ్యకథలు విని పాండవు లనంతరంబ క్రమ్మఱి ద్వైతవనంబున[1]కుం జని యం దొక్కనాఁడు సుఖాసీనుం డయి యున్న ధర్మరాజుపాలికి నొక బ్రాహ్మణుండు సంభ్రమంబునఁ [2]జనుదెంచి యి ట్లనియె.

*-: ధర్మరాజు బ్రాహ్మణుని యరణిఁ దెచ్చుటకుఁ బోవుట :-*

సం. 3 _ 295 _ 7

378. క. తరుశాఖఁ దగిల్చిన నా, యరణి యొక మృగంబు వచ్చి యతిరయమున వ [1]త్తరువును నొరసి కొనంగా, ధరణీశ్వర తగిలెఁ జువ్వె తచ్ఛృంగమునన్.

379. క. దానిఁ గొని పఱచె నమ్మృగ, మానత[1]రిపులోక నాకు నయ్యరణిఁ దగం గా నిపుడు దేరఁ [2]బనుపవె, భూనుత నిత్యవిధిలోపమునఁ జనకుండన్.

380. చ. అనవుడు [1]నతఁణంబ మనుజాధిపుఁ [2]డుద్ధతచాపహస్తుఁ డై
యనుజులుఁ దాను నెంతయు [3]రయంబున నాహరిణేంద్రుపజ్జఁ గై
కొని చని కూడముట్టి మెఱుఁగుల్ నిగుడం బటు[4]సాయకంబు లే
సిన నొక యమ్ము నమ్మృగము [5]సెందద చేరద యద్భుతంబుగన్.

381. వ. అదియును వారి నతిదూరంబుగా నెలయించికొని చని యొక్క ఘోర విపినంబున నదృశ్యం బైన [1]ప్రయత్నంబు విఫలం బగుటకు విషాదంబు నొందుచు నయ్యేవురు నతిశ్రాంతు లై శీతలచ్ఛాయం బగు నొక్క వటమహీరుహంబుక్రింద విశ్రమించి రప్పుడు నకులుండు ధర్మనందనున కి ట్లనియె.

---

377. 1. కరిగి యందున్నయెడ నొక్కనాడు – వా. కొన్ని ప్రతులు; కుం జని యందొక్క నాడు–కొన్ని ప్రతులు. 2. బరదెంచి–వా. కొన్ని ప్రతులు; జనుదెంచి–పెక్కు ప్రతులు

378. 1. త్తరువున – వా. పెక్కు ప్రతులు; త్తరువును – గ.

379. 1. నృపలోక – వా. కొన్ని ప్రతులు; రిపులోక – పెక్కు ప్రతులు. 2. బనువుము (బంపుము) – అ. ఆ. ఈ. ఎ. ఐ. త.

380. 1. నతఁణంబ – పెక్కు ప్రతులు. 2. డాతతచాప – ఆ. ఈ. ఎ. ఐ. త; దంతట చాప – ఓ. 3. నునాహరిణేంద్రుని చన్నపజ్జగై – అ. 4. మార్గణంబు – ఆ. ఈ. ఉ. ఎ. ఐ. త. 5. చెందదు చెచ్చెర నద్భుతంబుగన్ – ఆ. ఈ. ఎ. ఐ. త – త. ద. ల. శ. ష; చేరవు తాకవు నద్భు – అ; సెందెద తూలద – వీ.

381. 1. నయ్యత్నంబు – ట. వా. వీ; ప్రయత్నంబు – పెక్కు ప్రతులు. 2. మహీజంబు – ఈ. ఐ. త.

382. క. [1]కులశీలోన్నతియు విని, శ్చలకరుణారతియు ధర్మసంగ్రహమతియుం
గలమనకు నివ్విధంబున, నలజడి వచ్చుటకు మూల మది యెయ్యదియో.

383. వ. అనిన నమ్మహా[1]ప్రాజ్ఞుం డతని కి ట్లనియె.

384. క. వినుము సుఖమునకు దుఃఖం, బునకుం గారణము దనదు పూర్వకృతం బై
చను [1]కర్మము కారణ మిది, యని యన్యము గలుగనేర దం దొక్కటియుఁ.

385. వ. అనుటయు భీమసేనుండు నకులున కి ట్లనియె.

386. ఆ. ప్రాతికామి వోయి పాంచాలి గొలువులో, పలికిఁ [1]దెచ్చి నపుడ యలుక యెసఁగ
నాంబికేయసుతుఁ నందఱఁ దునుమ [2]క, యునికి నిట్టి యెడరు మనకుఁ [3]బుట్టె.

387. చ. అనవుడు నర్జునుం డనియె నా సభ సూతసుతుండు పేర్చి ప
ల్కిన[1]పటువాక్యముల్ వినియుఁ గిన్కకుఁ బూనక యేఁ దొలంగి కా
ననమున కిట్లు కాతరజనంబుల చాడ్పున నేఁగుదెంచుటన్
మనకు దురంతదుఃఖములు మానక [2]పైకొని వచ్చెఁ దమ్ముఁడా.

388. వ. అనిన యనంతరంబ సహదేవుం డి ట్లనియె.

389. ఆ. దుష్టశీలుఁ డైన దుర్ద్యూత[1]పరుని గాం, ధారుఁ బట్టి యేను దడయ కపుడ
తునుమ కునికి నిట్టి దుర్దశపా లైతి, మనఘ మనము కాననాంతరమున.

---

382. 1. బలశౌర్య ధైర్యములు నిశ్చల కరుణారతియు నధిక సత్యప్రౌఢిం - అ.

383. 1. ప్రాజ్ఞునకు నమ్మహీపతి యిట్లనియె. - కొన్ని ప్రతులు.

384. 1. కర్మ మది యనుమానము గలుగనేర దం దొక్కటియున్ - అ. ఇ. ఉ. ఏ. ల.

386. 1. దేర - వా. కొన్ని ప్రతులు; దెచ్చినపుడ - పెక్కు ప్రతులు. 2. కేమ - వా. కొన్ని ప్రతులు; క యునికి - పెక్కు ప్రతులు. 3. గలిగె - పెక్కు ప్రతులు; వొలసె - ఉ. ఒ. గ. చ.

387. 1. కఠినోక్తులున్ - గ. 2. పైబడె నిట్లు దమ్ముడా - ఉ.

389. 1. కితవు - పెక్కు ప్రతులు.

390. వ. అని యిట్లందఱు నన్నితెఱంగులం బలుకుచుండ నజాతశత్రుండు నకులుం జూచి భవదీయసోదరు లత్యంత[1]పిపాసితులైనవారు నీ విమ్మహీరుహం బెక్కి జలంబు లున్నయెడ యరయు మనిన నతండు[2]ను నవ్వనస్పతిసమారోహ[3]ణంబు సేసి దెసలు గలయం బరికించి దూరంబున సలిలంబు లున్నవని యన్నకెఱింగించిన నతం డక్లేని నీవు పోయి జలపానంబు సేసి మాకును జలంబులు గొని రమ్మని పనుచుటయు మాద్రేయుండు వృక్షావతీర్ణుం డయి రయంబునం జని ముందట నతిమనోహరం బగు తటాకంబుఁ గని జలంబులు ద్రావం బోయిన నొక్క యశరీరభూతం బి ట్లనియె.

-: నకులాదులు యక్షుని నిరాకరించి నీరు ద్రావి మూర్ఛితు లగుట :-

సం. 3 - 296 - 12

391. క. ఓయన్న యీతటాకము, నాయది నీ వీజలము [1]గొనఁగ వలతేనిన్
నాయడిగిన ప్రశ్నములకు, ధీయుత యుత్తరము లిమ్ము తేటపడంగన్.

392. క. అనుటయు నవ్వాక్యముదెస, ననాదరము సేసి నకులుఁ డక్కొలనం ది
య్యని నీరు ద్రావి నిశ్చే, తనుఁ డై [1]యక్షుణమ పడియెఁ దత్తీరమునన్.

393. వ. అట ధర్మపుత్త్రుండు సహదేవుం గనుంగొని నకులుండు జలంబులకుం జని తడసె నీ వరిగి యతనిం దోడ్కొని జలంబులు గొనుచు రమ్మ[1]నివ నక్కుమారుం డతిశీఘ్రగమనంబునం బోయి [2]యాపద్మాకరతీరంబునంబడి యున్న [3]యన్నతెఱంగుఁ జూచి విస్మయశోక[4]వ్యాకులహృదయుం డగుచు

---

390. 1. పిపాసాకులులైన - గ. ఝ; పిపాసాపరవశులై - ఒ. ఘ. 2. దన్వచవామ రూపంబున నవ్వనస్పతి-వా. కొన్ని ప్రతులు. 3. ణం బాచరించి నలుదిక్కులుం (దెసలు) - వి. శ. ష; కొన్ని ప్రతులు.

391. 1. గొనన్ వలతేనిం - ఇ. ఈ. ఏ. త.

392. 1. యక్షుణమ - పెక్కు ప్రతులు; యాక్షణమ - వా.

393. 1. ని పని చిన నక్కుమారుం - వా. కొన్ని ప్రతులు; పనిచి-పెక్కు ప్రతులలో లేదు. 2. పద్మినీ తీరంబున - వా. కొన్ని ప్రతులు; యాపద్మాకరతీరంబున - కొన్ని ప్రతులు. 3. యన్నం జూచి - కొన్ని ప్రతులు. 4. వ్యాకులుం డై ఇ.

నిది యేమి నిమిత్తంబున [5]నయ్యోనో యని యూహించుచుఁ బెల్లడరు
తృష్ణాభరంబు సహింప[6]నోపక జలంబులదెస నాసఁజేసి కొలనికి డిగ్గిన
నెప్పటిభూతం బి ట్లనియె.

394. ఆ. అనఘ యీ జలాశయము [1]నాయధీనంబు, సాహసంబుఁజేసి చనదు చొరఁగ
నాదుప్రశ్నములకు నలి నుత్తరములిచ్చి, వారి గొనుము [2]నీకు వలసినట్లు

395. క. అనిన నది యాదరింపక, ఘనుఁ డాసలిలములు ద్రావి గ్రక్కున విషమె
క్కినవిధమునఁ బరవశుఁడై, ఘనసాలమహీరుహంబు[1]కైవడిఁ బడియెన్.

396. సీ. అంత నంతకసూనుఁ డంతరంగంబున సంతాప మెసఁగ వాసవతనూజుఁ
గనుఁగొని యన్న నీయనుఁగుఁదమ్ములు వోయి కడుఁ దడవయ్యె
నిక్కాననమున
నెయ్యది వుట్టెనో చయ్యన[1]నీవేఁగి వారిని దోడ్కొని వారి గొనుచుఁ
జనుదెమ్ము నావుడు ఘనభుజుం డధికరయంబున నరిగి జలాశయంబు

ఆ. తీరభూమిఁ బడిన వారి[2]నవారిత, మహితశౌర్యధనుల మాద్రిసుతులఁ
జూచి విస్మయైకగోచరుఁ డై సవ్య, సాచి యుల్లమున విషాద[3]మడర.

397. క. నాలుఁగు దిక్కులుఁ గనుఁగొని. యాలో నెవ్వరిని గాన కత్యంతపిపా
సాలసుఁడై సలిలంబులు, గ్రోలఁగ సమకట్టి యొయ్యఁ గొలనికి డాసెన్.

398. వ. డాయుటయు [1]నయ్యశరీరభూతం బి ట్లనియె.

---

కొన్ని ప్రతులు. 5. వయ్యె నొక్కొ యిది – పీ. శ. ష. 6. జాలక – అ. ఇ.
ఈ. ఎ. ఏ. ఐ. త.

394. 1. నాయది నీవు సాహసంబు – చ. పీ. శ. ష. 2. నీవు – వా. కొన్ని ప్రతులు;
నీకు – అ. ఉ. ఊ. ఒ. ఓ. గ. చ. ఝ. ద.

395. 1. కరణిం – వా. కొన్ని ప్రతులు; కైవడి – పెక్కు ప్రతులు.

396. 1. జని నీవు వారి దోడ్కొనుచు వారిగొనుచు–ఇ. ఈ. ఎ. ఏ. ఐ. త; నీవేగి వారి
దోడ్కొనుచును వారిగొనుచు – పీ. శ. ష. 2. మహాత్ముల మహిత–పీ. శ. ష.
3. మంది – ఈ. త.

397. 1. డిగ్గెన్ – ఓ. గ.

398. 1. నాకాశవాణి యిట్లని పిలిచెంచె – వా. కొన్ని ప్రతులు; నయ్యశరీర భూతం బిట్ల
నియె – ఆ. ఈ. ఉ. ఎ. ఏ. ఐ. ఝ. త.

399. మ. బలిమిం జొచ్చిన నెట్టివారి కయినం బ్రాణంబుపై వచ్చు నీ
సలిలావాసము మత్పరిగ్రహము తృష్ణా[1]ఖేద మారం జలం
బులు[2]ద్రావక వలతేనిఁ బ్రశ్నములకుం [3]బొం దొందఁగా నుత్తరం
బులు నా కిమ్మనుడున్ [4]మనంబునఁ బృథాపుత్త్రుండు సక్రోధుఁడై.

400. ఉ. క్రుచ్చిలి [1]నిల్చి దుర్వచనముల్ పచరించినఁ[2]జెల్ల నిత్తునే
చెచ్చెర నీయెలుం గడఁగ జేసెద నిప్పుడు సూడు మంచు వి
వ్వచ్చుఁడు శబ్దభేది శరవర్గముఁ దద్వచనంబు చక్కటిం
గ్రచ్చఱ నించె మౌర్వీరవకంపితసర్వదిగంత[3]రాళుఁడై.

401. ఆ. ఇట్టులేయుటయును నెప్పటివాక్యంబు
మఱియు వినఁగఁ బడిన మఘవ [1]సూనుఁ
డలసి [2]కొలను జొచ్చి యంబుపానము సేసి
యిలకు నొఱగె వివశహృదయుఁ డగుచు.

402. వ. తదనంతరంబ యుధిష్ఠిరుండు భీమసేను నాలోకించి కవలును గవ్వడియును [1]నింత దడయుటకు [2]నిమిత్తం బెయ్యదియొ నీవరుగు మనినం గిమ్మీరవైరి మారుత[3]జవంబున నమ్మువ్వురుఁ జనిన చొప్పునం జని పద్మాకరకూలంబున నిద్రా[4]పరవశులుంబోలెఁ బడియున్న తమ్ములం గని దుఃఖితుండై.

---

399. 1. ఖేదమొందం - పెక్కు ప్రతులు; చ్ఛేదమొందం - వా. కొన్ని ప్రతులు. 2. గ్రోలన్ - ల. 3. బొల్పారగా - ఓ. ల. స; బొందొప్పగా - ఔ. 4. ధృతిన్ దివిజరాట్పుత్త్రుండు - అ.

400. 1. వచ్చి - ఈ. ఊ. ఎ. ఐ. త. శ. ష. స. 2. బోవ నిత్తునే-ఇ. ఏ. గ. ఝ. స. 3. భాగుఁడై - వా. పెక్కు ప్రతులు; రాళుఁడై - ఉ. వీ. ష.

401. 1. సుతుడునలసి - పెక్కు ప్రతులు. 2. కొలనిఁ జొచ్చి - ఝ. ష.

402. 1. నింతవడి దడయుటకు - వా. కొన్ని ప్రతులు; వడి - పెక్కు ప్రతులలోలేదు. 2. గతంబెయ్యది - అ. ఆ. ఈ. ఉ. ఏ. ఐ. ఔ. త. 3. వేగంబున - అ. ఈ. ఎ. త. 4. వివశులుం - వా. శ. ప. కొన్ని ప్రతులు; పరవశులుం - ఒ. గ. ఘ. చ. ఝ. ద.

403. తరలము.

ఇది మనుష్యకృతంబుగాదు సురేంద్ర కిన్నర పన్నగ
త్రిదశనిర్మిత మైన కర్మము దీని నింతయు నేర్పడం
బిదపఁ జూచెదఁ గాక యంచు[1]ను భీతిదూరుఁడు నీరువ
ట్టొదవఁ దత్సలిలాశయంబు [2]సముత్సుకుం డయి చొచ్చినన్.

404. వ. అంతరిక్షగోచరం బైన వచనం బిట్లని వినం బడియె నయ్యా నీ విట్లేల సాహసంబు సేసెద విక్కొలను మత్పూర్వపరిగ్రహంబు నీవోపు దేని నాయడిగిన యర్థంబులకు నుత్తరం[1]బు లిచ్చి జలంబులు ద్రావు మనిన నప్పలుకులు గైకొనక వృకోదరుండు నిపీతసలిలుం డై యచ్చోటన మూర్ఛితుం డై పడియె నిట-పాండవాగ్రజుండు.

405. క. తమ్ములు నలువురు నొక్కట, నమ్మెయి మసలుటకు నాత్మ నత్యంతవిషా
దమ్ములయ సముత్థితుఁ డై, క్రమ్మఱ[1]నమ్మార్గ మపుడు గైకొని నడచెన్.

406. సీ. అపగతజనశబ్ద మై యనభివ్యక్తమార్గ మై యవిరళదుర్గశైల
తరుగుల్మవల్లీవితాన మై గజ సింహశరభ శార్దూలసూకరలులాయ
బహుళ మై బహువిధపక్షికోలాహలభయద మై కడుఁ బరపైన యడవి
ననుజుల వెదకుచు ననఘుండు సని కాంచెఁ గమలాకరంబుతీరమునఁ బడిన

ఆ. వారిఁ బూరువంశవరుల భీమార్జున, యముల నమితబలుల విమలమతులఁ
బ్రళయపతితలోకపాలసంకాశుల, భూరిపుణ్యధనుల వీరవరుల.

407. మ. కని డెందంబునఁ దల్లడం బడర దీర్ఘ[1]శ్వాసవై వర్ణ్యముల్
దనుకం దాల్మి చలింప విస్మయపరీతస్వాంతుఁ డై శోకబా
ష్పనిరుద్ధాకులలోచనుం డగుచు [2]మూర్ఛల్ పైకొనం గొంతసే
పు నరేంద్రోత్తముఁ డుండెఁ జిత్రమున రూపుంబోలెఁ దా నచ్చటన్.

---

403. 1. నుభీతి — ఇ. ఏ. ద. ఘ. శ; విభీతి — వా. కొన్ని ప్రతులు. 2. సముత్సుకా కృతిచొచ్చినన్ — పెక్కు ప్రతులు.

404. 1. బులు చెప్పి — కొన్ని ప్రతులు.

405. 1. తన్మార్గముననగా జనదొడగెన్ — కొన్ని ప్రతులు; తన్మార్గమునకు గా జనదొడగెన్ — ఇ. ఏ. గ. ఝ. ల; తన్మార్గమునను గడకంజనియెన్ — చ.

407. 1. శ్వాసమై దైన్యమున్ — ఔ. 2. మూర్ఛంజెంది యొక్కింత — ఔ.

408\. వ. పదంపడి డెందంబు[1]న ధృతి పొందుపఱచుకొని యతం డన్నలువుర నుపలక్షించి
నలుదెసలుం బరికించి యాత్మగతంబున.

409\. తే. ఒరులు వచ్చిన చొప్పు లే దరిగినట్టి, చొప్పు లేదు పెనంగిన చొప్పు లేదు
ఘనభుజుల యంగకంబులు గనుఁగొనంగ, [1]నక్షతంబు లేలకో యిట్లయిరి వీరు.

410\. ఉ. క్రూరుఁడు ధార్తరాష్ట్రుఁ డతి[1]కుత్సితుఁ డెంతయుఁ బాపబుద్ధి గాం
ధారుఁడు పెక్కు మాయలకుఁ దావల మక్కట యద్దురాత్మకుల్
వారక యెద్దియేని యొకవంచనమై యిటు సేసి రొక్కొ యె
వ్వారల్కు నాత్మ నమ్ముదురె వక్రవిచారులఁ [2]బాపకర్ములన్.

411\. క. వదనంబుల తెలివియుఁ గర,పదరుచియుం జెడదు వీరు వడుటకుఁ గత మీ
యుదకము విష[1]దుష్ట మనియు, మదిఁ దలఁపం బోల దేమిమాయయొ
[2]యెఱుఁగన్.

412\. చ. పుడమియు [1]సర్వసంపదలుఁ [2]బొల్పఱ వైరుల పాలు సేసి యీ
యడవికి వచ్చి భీకరమృగావలి[3]పొందున నున్న వీరి వె
న్నడికొని యిట్లు సేసెనె [4]యనాథులఁబోలె విధాతృఁ డింక నె
క్కడ జనువాఁడ నేద[5]గడగాఁ దరియింతు దురంతదుఃఖమున్.

413\. సీ. పుత్త్రులు దుఃఖార్తిఁ [1]బొగులుట కనిశంబుఁ[2]బొక్కుచునున్న యప్పుణ్యచరిత
మాతల్లి పాండుని మహిషి నాకెదురుగా వచ్చి కౌఁగిటఁ జేర్చి వత్స నాఁడు

---

408\. 1. ధృతి పొందున నిడికొని-వా. పెక్కు ప్రతులు; న ధృతి పొందుపరచుకొని – ల.

409\. 1. నక్షతములేల యొక్కొ యిట్ల యిది వీరు – వా. కొన్ని ప్రతులు; నక్షతంబులే లొకొ యిట్లైరివీరు – ఈ. ఎ. ఐ. త. కొన్ని ప్రతులు.

410\. 1. కోపను డెంతయు – అ. ఉ. ఊ. ఒ. ఓ. ఔ. గ. ఘ. చ. ద. స. 2. బావ కారులన్ – వా. పెక్కు ప్రతులు; బాపకర్ములన్ – ఆ. ఈ. ఐ. త.

411\. 1. దిగ్ధంబని – వా; దుష్టమనియు – పెక్కు ప్రతులు. 2. దలపన్, వగవన్, యరయన్ – అని భిన్నప్రతులు.

412\. 1. రాజ్య సంపదయు – ల; నర్థసంపదయు – పెక్కు ప్రతులు. 2. బొల్పుగ – ఉ. డ. ద. ల. 3. పొత్తున – వా. పెక్కు ప్రతులు; పొందున – ఉ. ఔ. ద. శ. వ. 4. యనాథల – ఆ. ఇ. ఎ. ఏ. ఒ. ఔ. ఘ. చ. త. ద. శ. 5. తుదిగా భరియింతు – ఆ. ఇ. ఏ. శ; తుదిగా – ల.

413\. 1. బొందుట కనిశంబు – ఆ. ఉ. ఓ. ద. పీ. శ. వ. 2. బొగులుచు – అ. ఉ.

[3]నీతమ్ముఁగుఱ్ఱలు నీవును నడవుల కరిగితి రిప్పుడయ్యనఘు లెందుఁ
జనిరి నీ[4]వొంటడవ చనుదెంచి తిది యేమి యనిన నాయమతోడ [5]నప్పు డేమి

ఆ. యనఁగ నేర్చువాఁడ నాచార్యవిదుర శాం, తనవకృపులు ననుముదంబుతోడఁ
గుశల మడిగి రేనిఁ గుశల మేమనువాఁడ, [6]నెందు దలగరాని యెడరు[7]దగిలె.

414. వ. అని పెక్కు తెఱంగుల వగచి యాధర్మజుండు దప్పి కోర్వక నీళ్ళు ద్రావుటకై
సరోవరంబులోనికి [1]డిగ్గుటయు నెప్పటియట్ల నశరీరభూతం బి ట్లనియె.

415. మ. విను మే నొక్క బకంబ నిక్కొలను పృథ్వీనాథ నా సొమ్ము నీ
యనుజుల్ మద్వచనంబు గైకొనక తోయాస్వాదు లై యివ్విధం
బునఁ బ్రాణచ్యుతిఁ బొంది రీవును గడున్ మోహంబునన్ సాహసం
బునకుం జొచ్చిన నట్ల[1]యయ్యెదు సుమీ మున్మట్ట వారించితిన్.

416. క. ఏ[1]నడిగిన యర్థములకు, భూనుత యుత్తరము లిచ్చి పొలుపొందఁ బయః
[2]పానంబు సేయు మనవుడు, నా నిర్మలచరితుఁ డంబరాభిముఖుం డై.

417. వ. అయ్యా నీవు బకరూపధరుండ వైన రుద్రుండవో పావకుండవో పవనుండవో
యట్లు గానినాఁడు కులపర్వతప్రతిము లయిన నాతమ్ములం బడఁద్రోచునట్టి
బలంబు పులుఁగుల[1]కెందునుం గలుగదు దేవాసురగంధర్వయక్షాదులకు

---

3. నీతమ్ము గుఱ్ఱలు నీవును నడవుల కరిగితిరి – ఆ. ఇ. ఏ. ఐ. ఝ. త. ల; తమ్ము గుఱ్ఱలు నీవుఁ దగ విపినంబున – ప్రా. వా. కొన్ని ప్రతులు. 4. వొక్కండ-వా వొకడవ–పీ. శ. ష. పెక్కు ప్రతులు. 5. నకటా యేమి – వా. కొన్ని ప్రతులు; నప్పుడేమి – ఈ. ఐ. త. శ. ష. 6. దలుగరాని యెడరు దగిలె నాకు– వా. కొన్ని ప్రతులు; నెందు దలగరాని యెడరు దగిలె – ఈ. ఐ. త. 7. గలిగె – అ. ఆ. ఉ. ఊ. ఎ. ఒ. ఘ. ఝ.

414. 1. దిగుటయు నశరీర భూతం – వా. కొన్ని ప్రతులు; డిగ్గుటయు నెప్పటియట్ల నశరీర – ఈ. ఐ. న.

415. 1. యయ్యెదు – వా. కొన్ని ప్రతులు; యయ్యెతు – పెక్కు ప్రతులు.

416. 1. నడిగెదు – అ. ఆ. ఈ. ఎ. ఐ. ఒ. ఔ. గ. చ. త. ద. 2. పానము సేయుము నావుడు – వా. కొన్ని ప్రతులు; పానంబు సేయు మనవుడు – ఇ. ఎ. ఏ. ఝ.

417. 1. కుం గలదె – వా. కొన్ని ప్రతులు; కెందునుం గలుగదు – పెక్కు ప్రతులు.

దుర్జయు లైన యవ్వీరుల నిట్లు సేసి నీవు గానివాఁడవపోలెం దొలంగి [2]యున్నవాఁడవు నాకు నద్భుత[3]భయకౌతుకంబు లొక్కటం బొడమెడు నీ వెవ్వండవు నీతలం పెయ్యది చెప్పి నాహృదయవేదన నపనయింపవే యనిన నదృశ్య[4]భూతంబు.

418. ఆ. కౌరవేంద్ర [1]బకముఁ గాను నే విను మొక్క, యక్షవరుఁడ నిచట నస్మదీయ
నికృతిఁ జేసి పడిరి నీతమ్ము లందఱు, ననుచు నక్షణంబ యతని యెదుర.

419. మ. నిలిచెం దాళ[1]సముచ్ఛ్రితాంగుఁడు మహానిర్ఘోషసంతర్జితా
ఖిలభూతప్రకరుండు దీర్ఘవిపులగ్రీవుండు దంష్ట్రాసము
జ్జ్వలవక్త్రుండు విరూపలోచనుఁడు దీవ్రస్ఫారతేజోఘనుం
డలఘుం డా సరసీ[2]తటాంతమున నయ్యాతుండు ఘోరాకృతిన్.

420. వ. ఇట్లు నిలిచి కౌంతేయాగ్రజున కి ట్లనియె.

421. క. నాయనుమతి లేకుండఁగ, నీయుదకము ద్రావి రేని యెవ్వా రైనన్
ధీయుత చత్తురు నీ వటు, సేయవు సమ్యగ్విచారశీలుఁడ వగుటన్.

422. వ. కావున మదీయంబు లగు ప్రశ్నంబుల కుత్తరంబు సెప్పు మనిన [1]నతండు మహాత్మా నీచిత్తంబునకు వచ్చునట్లుగాఁ జెప్ప నాబోఁటివానికి శక్యం బగునే యైనను నానేర్చువిధంబునఁ జెప్పెద నడుగు మనిన నయ్యక్షుం డి ట్లనియె.

---

2. యున్నాఁడవు - వా; యున్నవాడవు - పెక్కు ప్రతులు. 3. భయంబు లొక్కటం - శ. ష. 4. భూతంబిట్లనియె - వా. శ. ష. కొన్ని ప్రతులు; భూతంబు - కొన్ని ప్రతులు.

418. 1. బకముగా నేను విను - కొన్ని ప్రతులు.

419. 1. సమున్నతాంగుడు - ఓ. వీ. శ. ష. 2. తటాగ్రమున - వా. కొన్ని ప్రతులు; తటాంతమున - ౬. చ.

422. 1. నతండు - కొన్ని ప్రతులలో లేదు.

-: ధర్మరాజు యక్షప్రశ్నముల కుత్తరంబు లిచ్చుట :-

సం. 3 – 297 – 26

423. క. దినకరు నెయ్యది నడపును, దినకరు నెవ్వారు గొలిచి తిరుగుదు రద్దే
వుని యస్తమించు శేమిట, ననఘ తదాధారభూత మది [1]యెద్ది యొకో.

424. తే. అనిన ధర్మజుఁ డిట్లను నబ్జహితుని, నడపు బ్రహ్మంబు సురకోటి నడచుఁ గొలిచి
[1]ధర్మమువున నస్తమితుఁ డగుఁ దపనుఁ డమ్మ, హాత్మునకు సత్య మాధార
మండ్రు బుధులు.

425. వ. అనిన విని యక్షుం డి ట్లనియె.

426. క. ఏమిట శ్రోత్రియుఁ డనఁజను, నేమిటఁ గడు మహిమ వడయు నిమ్మగఁ
బురుషుం
డేమిట సహాయయుతుఁ డగు, నేమిట[1]నగు బుద్ధిమంతుఁ డేర్పడఁ జెపుమా.

427. వ. అనిన నతం డి ట్లనియె.

428. క. శ్రుతమువలన శ్రోత్రియుఁ డగు, నతుల[1]తపోయుక్తిఁ గడు మహత్త్వము
వడయుఁ
ధృతిచే సహాయయుతుఁ డగు, నతిశయముగ [2]బుద్ధిమంతుఁ డగు బుధసేవన్.

429. వ. అని చెప్పిన [1]నప్పార్థివోత్తమున కప్పురుషుండు వెండియు ని ట్లనియె.

430. తే. ఏమికతమున భూదేవుఁ డెసఁగు దేవ, భావమున నాతనికి సాధుభావ మెవ్వి
ధమున నగు నసాధుత్వ మెద్దానఁ జెందు, మానుషుం డగు నాతఁ
డేదానఁ జెపుమ.

---

423. 1. యెయ్యదియో–వా. కొన్ని ప్రతులు; యెద్దియొకో–ఈ. ఉ. ఐ. ఒ. ఘ. చ. త.

424. 1. ధర్మమచే – వా. కొన్ని ప్రతులు; ధర్మమువున – అ. ఆ. ఒ. ఔ. ద. పి. శ. ష.

426. 1. తా బుద్ధిమంతు – ఈ. ఐ. త; కడు బుద్ధిమంతు – ఔ. చ.

428. 1. తపోవృత్తి – చ. 2. బుద్ధియుక్తుడగు – ఇ. ఈ. ఐ. ఒ. ఔ. త.

429. 1. నప్పరదేవోత్తముని – ఈ. త. పి. శ. ష

431\. చ. అనవుడు ధర్మజుం డనియె నధ్యయనంబున దేవభావముం
గను [1]నవనీసుపర్వుఁ డధికవ్రతశీలత సాధుభావ మా
తనికి విశిష్టవృత్తి దిగఁ ద్రావి యసాధు వనంగ నుండు శౌ
చనియతి లేక మృత్యుభయసంగతి నాతఁడు మానుషుం డగున్.

432\. క. [1]నావుడు నతఁ డాతనితో, జీవన్మృతుఁ డెట్టివాఁడు సెప్పు మనుటయున్
దేవాతిథిపితృభృత్యజ, [2]నావళులకు నిడక కుడుచు నతఁ డని చెప్పెన్.

433\. చ. [1]విని మగుడంగ వాఁడు పృథివీపతిఁ జూచి ధరిత్రికంటెఁ బ్రేఁ
[2]గన జనుదాని నాకసముకంటెఁ గడుం బొడవైన దాని గా
డ్పునకును నెక్కుడై జవము పొంపిరివోయెడుదానిఁ బూరికం
టెను[3]దఱచైన దానిని ఘటింపఁగ జెప్పుము నాకు నావుడున్.

434\. వ. అమ్మనుజోత్తముం డయ్యుత్తమున కిట్లనియె.

435\. ఆ. తల్లి బ్రేఁగు సుమ్మె ధరణికంటెను నాక, సంబుకంటెఁ బొడవు జనకుఁ[1]డరయ
గాడ్పుకంటె మనసు గడు శీఘ్రగతి [2]తృణో, త్కరముకంటెఁ
జింత గరము దఱచు.

436\. వ. అనిన నంబరచరుం[1]డు మఱియు నిట్లనియె.

437\. తే. మొనసి నిద్రించియును గన్ను మూయ దెద్ది
పుట్టియును జేతనత్వంబుఁ బొరయ దెద్ది
యరయ రూపు గల్గియు హృదయంబులేని
దెద్ది వేగంబుకతనమున నెద్ది[1]వొదలు.

---

431\. ధరణీసుపర్వు - ఎ. ఘ.

432\. 1. నావిని యత-వా. కొన్ని ప్రతులు; నావుడు నత-కొన్ని ప్రతులు. 2. నావళి కిన్ని (నియి) డక - ఇ. ఈ. ఎ. ఏ. ఐ. త. శ.

433\. 1. విను - ఊ. ఏ. ఓ. ఔ. చ. ఝ. ద. శ. ష. 2. కనయగు - వా. కొన్ని ప్రతులు; గనజను - ఓ; గనదగు - కొన్ని ప్రతులు. 3. దరుచైన - ఒ. ల. శ. ష.

435\. 1. డనఘ - పెక్కు ప్రతులు. 2. తృణాంకురము - ఈ. ఐ. త.

436\. 1, డతని కిట్లనియె - వి. శ. ష; డమ్మహీవరున కిట్లనియె - వా. కొన్ని ప్రతులు; డు మరియు నిట్లనియె - ఇ. ఈ. ఎ. ఏ. ఐ. ఝ. త.

437\. 1. వొలుచు - వా. కొన్ని ప్రతులు; వొదలు - పెక్కు ప్రతులు.

438. తే అనినఁ[1]గన్ను మూయదు సుప్త మయ్యు మీను
పుట్టియును గ్రుడ్డు చేతనఁ బొరయ కుండు
హృదయరహితంబు రారూప మేఱు రయము
కతన [2]వర్ధిల్లు నని చెప్పెఁ గౌరవుండు.

439. వ. చెప్పిన నయ్యక్షుం డతనితోఁ దెరువు నడుచువానికి రోగార్తునకు గృహస్థునకు మృతిఁ బొందినవానికి [1]నెవ్వరు చుట్టంబు లనిన నప్పుడమిఱేఁ డన్నలు వురకుం గ్రమంబున సార్థంబును వైద్యుండును సద్భార్యయుఁ గృతం బైన ధర్మంబును బరమ[2]మిత్త్రు లని నిర్దేశించుటయు [3]నయ్యక్షుండు పాండవే యున కిట్లనియె.

440. క. ఎయ్యది ధర్మువునకుఁ గుదు, రెయ్యది యాశ్రయము గీర్తి కిమ్మగు మార్గం
బెయ్యది పురలోకమునకు, నెయ్యది సుఖమునకు[1]నిక్క యేర్పడఁ జెపుమా.

441. వ అని యడుగుటయు.

442. క. అమరంగ దాక్షిణ్యము ధ, ర్మమునకుఁ గుదు రంద్రు కీర్తిమహిమ నెలవు దా
నము సత్యము సురపురిమా, ర్గము శీలము [1]సంశ్రయము సుఖంబుల కెల్లన్.

443. వ. అని యుధిష్ఠిరుం డెఱింగించిన [1]వెండియు.

444. చ. నరునకు నాత్మ యెవ్వఁడు ఘనంబుగ దైవిక మైన చుట్ట మె
వ్వ రతనికిం దదీయ మగు వర్తన మేమిట నిర్వహించు భూ
వర యతఁ డేమి వూని యనవద్యతఁ బొందు నెఱుంగఁ జెప్పు [1]మీ
వరుదుగ నన్న నక్కురుకులాగ్రణి యాతనితోడ నిట్లనున్.

---

438. 1. గను మూయదది – ఓ. ల. 2. వర్ధిల్లు – ఇ ఏ. చ. ఝ; వర్ధించు – ఉ.

439. 1. నెవ్వరెవ్వరు – వా. కొన్ని ప్రతులు; నెవ్వరు – ఊ. ఎ. ఏ. ఐ. ఓ. త. 2. మిత్త్రంబులని – వా; మిత్రులని – పెక్కు ప్రతులు. 3. వాడు వెండియు నిట్లనియె – వా. కొన్ని ప్రతులు; నయ్యక్షుండు పాండువేయున కిట్లనియె – పెక్కు ప్రతులు.

440. 1. నింక యేర్పడ – ఒ. ఔ; మూల మేర్పడ – ఓ. ల.

442. 1. సంశ్రయంబు – అ. చ. ధ.

443. 1. నతండు – వా. కొన్ని ప్రతులు; వెండియు – కొన్ని ప్రతులు.

444. 1. మింపరుదుగ నన్న – కొన్ని ప్రతులు.

445. తే. ఆత్మజుఁడు సువ్వె పురుషున కాత్మ యయ్యె
నాతనికి భార్య దైవిక మైన యట్టి
మతని జీవిక పర్జన్యుఁ కతనఁ జెల్లు
నతఁడు దానము [1]గొనియాడి యతిశయిల్లు.

446. చ. [1]అనవుడు మేటి ధర్మ మగు నట్టిది యెయ్యది [2]యేది యెప్పుడున్
[3]దనియఁగఁ బండి యుండు [4]నెసకంబున నెయ్యది నిగ్రహించినం
దనరుఁ బ్రమోదసిద్ధి నియతంబుగ నెవ్వర[5]తోడి సంధి యొం
దును వికలంబు గాదు పరితోష మెరల్ప నుపన్య[6]సింపుమా.

447. వ. అని దివ్యుండు వలికిన నాదివ్యబోధనుం డిట్లనియె.

448. ఆ. విను మహింస మేటి యనఁ జను ధర్మంబు
యాగకర్మ మెపుడు నమరఁ బండి
యుండు మనసు క్రొవ్వు ఖండింపఁగా మోద
మెసఁగు సుజనసంధి యెడల [1]నెందు.

449. తే. అనిన నతఁడు లోకమున[1]కు నెయ్యది దిక్కు
జలము [2]నన్నంబు నెద్దాన సంభవించు
విష మనంగ నెయ్యది శ్రాద్ధవిధికి నెద్ది
సమయ మనిన నిట్లని చెప్పె జనవిభుండు.

---

445. 1. గొనియాడ నతిశయిల్లు - కొన్ని ప్రతులు.

446. 1. అనిన విని - వా. కొన్ని ప్రతులు; అనవుడు - పెక్కు ప్రతులు. 2. యెట్టి దెప్పుడున్ - వీ. ష. స. సూ. 3. గనియగ బండియుండు నెసకంబుగ - అ. ఆ. ఉ. ఎ. ఘ. ష. 4. బ్రమదంబున - ఈ. ఐ. త. శ; విదితంబుగ - వా. కొన్ని ప్రతులు; నెసకంబున - పెక్కు ప్రతులు. 5. తోడ - కొన్ని ప్రతులు. 6. సింపవే - ద. వీ. శ. ష. స.

448. 1. దెపుడు - ఆ. ఇ. ఎ. ఏ. ఓ. ఔ. గ.

449. 1. కునెయ్యది దిక్కు - ఆ; కెయ్యదియు - వా. పెక్కు ప్రతులు. 2. నన్నము- వా. కొన్ని ప్రతులు; నన్నంబు - పెక్కు ప్రతులు.

450. తే. సజ్జనులు దిక్కు[1]సూవె యీసర్వమునకు
నభము ధరణియు జలము నన్నమ్ము నుద్భ
[2]వించు నెలవులు విష మగు విప్రపధనము
లనఘ శ్రాద్ధకాలము బ్రాహ్మణాగమంబు.

451. వ. అని తెలిపిన నయ్యతుండు ధర్మనందనుతో మనుజుం డెయ్యది పరిత్యజించి సర్వజనప్రియుండును నిశ్శోకుండును నర్థవంతుండును సుఖియును నగు ననిన నమ్మహీపతి యిట్లనియె.

452. తే. సర్వజనసమ్మతుం డగు గర్వ ముడిగి
క్రోధ మడఁచి [1]శోకమునకుఁ గుదురుగాఁడు
వినవె యర్థాఢ్యుఁ డగు లోభ మొనర విడిచి
తృష్ణ వర్జించి సౌఖ్యంబు [2]తెరువుఁ గాంచు.

453. వ. అనిన యనంతరంబ [1]యద్దివ్యుం డతనితోఁ బురుషశబ్దవాచ్యుం డెట్టివాఁడు మఱి సర్వధని యగువాఁ డెవ్వండు నిశ్చయింపు మనినఁ బాండవజ్యేష్ఠుం డి ట్లనియె.

454. క. దివిముట్టి ధరణి[1]యంతట, నివిడి మెఱయుచుండు నెవ్వని యశో[2]రమ య ట్టి విశిష్టచరిత్రుఁడు య, తు వరా [3]పురుషుండు నాఁ బ్రకాశత నొందున్.

---

450. 1. వినవె - కొన్ని ప్రతులు. 2. విప్రునలిగింప జేయుట విషము సూవెయనఘ - ఆ. ఇ. ఎ. గ. ద. (ఈపాఠమున వెనుకటిపంక్తి యన్వయించుటలేదు); నలవిప్రు నలుకయ విషము సువ్వె - ఈ. త.

452 1. శోకమునకు గుదురుగాడు - ఇ. ఎ. ఐ. చ. వి. శ; శోకమునకుఁ గొలువుఁ గాఁడు - వా. కొన్ని ప్రతులు; విశోకుడై కొమరు మిగులు - ల. 2. తెరగు- ఈ. ఐ. ఝ. త. ద.

453. 1. యద్దివిజుం డతనితోడ - ఊ. ఒ. ఔ. గ. చ. ల.

454. 1. యంత న్దివిరి మెరయు - ఇ. ఏ. ద 2. గుణమ యట్టి - ఆ. ఇ. ఏ. ఔ. ఘ. ఝ. ట. ల. 3. పురుషుడనం - అ. ఈ. ఎ. ఒ. ఓ. ఘ. చ. ద; పురుషవాచ్యు డనప్రకాశత - ఈ. ఐ. త. శ. ష.

455. ఆ. ప్రియము నప్రియంబుఁ బెల్లగు సౌఖ్యదుః, ఖములు భూతభావి
కార్యములును
నెవ్వనికి సమంబు [1]లివి సర్వధని యనఁ, బరగుఁ జువ్వె యట్టి భవ్యుఁ డనఘ[2].

456. వ. అని వివరించిన విని యుధిష్ఠిరుదెసఁ బ్రసాద[1]మధురం బైన యాలోకనంబు నిగుడ నయ్యక్షవరుండు మహాత్మా మదీయంబు లైన ప్రశ్నంబు లన్నింటికి సదుత్తరంబు లిచ్చితి నీవలనం బ్రీతుండ నైతి నీతమ్ముల[2]యం దొక్కరుని ప్రాణంబు లిచ్చెద [3]నడుగు మనిన నతండు.

457. సీ. శ్యామాంగు నారక్తజలరుహా[1]నేత్రు సాలప్రాంశు నున్నతలలితబాహు
నకులుని [2]బ్రతికింపు నావుడు యక్షుండు భీమ ఫల్గును లతిభీమబలులు
ప్రియులు నీ కెంతయుఁ బృథివీశ వీరిలో [3]నొకనిఁ గోరక యిట్లు నకులుఁ గోరి
తనుడు ధర్మాత్మజుం డనియెను మాతండ్రి యగు పాండువిభునకు
మగువ లిరువు

ఆ. రందు గొంతి కొడుకు లైన మువ్వురిలోన, నేను బ్రతికినాఁడ నింక మాద్రి
తనయు లిరువురందుఁ దగ[4]నొక్కరుం డిప్డు, బ్రతుకవలదె
చెపుమ పాడి తెఱఁగు.

---

455. 1. లిల – వా. కొన్ని ప్రతులు; లివి – ఆ. చ. ఝ. త. వీ. శ. ష. 2. ఈ పద్యమునకు తరువాత 'ద' ప్రతిలో కొన్ని శ్లోకములు కలవు. కాని యవి యనన్వితములుగా నున్నవి. వానికి మూలమును దెలియవచ్చుట లేదు.

456. 1. మహితంబైన యవలోకంబు–ఈ. త. వీ. శ. ష. 2. లం దొక్కని ప్రాణంబు– వా. కొన్ని ప్రతులు; లయం దొక్కరును – పెక్కు ప్రతులు. 3. వేడు – వా. కొన్ని ప్రతులు; నడుగు మనిన – పెక్కు ప్రతులు.

457. 1. నేత్రు నద్రిసమాను నున్నతదీర్ఘబాహు – ఆ. ఎ. జ. ద; నేత్రు సుధీయుక్తు నున్నతదీర్ఘబాహు – ఇ. ఏ. 2. బ్రదికింపు – వా; బ్రతికింపు – పెక్కు ప్రతులు. 3. నొకరి – కొన్ని ప్రతులు. 4. దగ నిపు డొకరుండు–ఒ. ర. డ. ల; దగ నిప్పు డొక్కడు – వా. కొన్ని ప్రతులు; దగ నొకరుం డిప్డు – ఎ. శ. ష.

458. ఆ. ధర్మనందనుండు ధర్మాత్ముఁడ నియెప్డుఁ దగిలి [1]జగము నన్నుఁ బొగడుచుండు
నట్టి యేను ధర్మహానికి [2]నోర్వఁ జు, మ్మెంత వచ్చెనేని యింత నిజము.

459. వ. అనిన నతండు నీదైన ధర్మజ్ఞతకు మెచ్చితి నీతమ్ము లందఱు లబ్ధజీవితు
[1]లయ్యెద రనిన నక్షణంబ [2]విగతక్షుత్పిపాసు లై యన్నలువురు నిద్రవోయి
[3]మేల్కనిన తెఱంగున సముత్థితు లై నం జూచి విస్మితుం డై [4]ధర్మపుత్త్రుం
డి ట్లనియె.

460. చ. నిను నొక యక్ష[1]మాత్రుఁ డని నెమ్మది నమ్మఁగ నేర నయ్యెదన్
జననుత నీవు నిక్కముగ శక్రుఁడవో [2]యలకాధిపుండవో
యనలుఁడవో సమీరుఁడవో [3]యట్లునుగాక జగన్నుతుండు మ
జ్జనకుఁడు [4]నైన ధర్ముఁడవో సత్కృపఁ జెప్పుము నాకు [5]నావుఁడున్.

461. వ. అమ్మహాత్ముండు మందస్మితాననుం డై.

462. మత్తకోకిలము.

ఏను ధర్ముఁడఁ జువ్వె రాజకులేంద్ర సత్యము శౌచమున్
[1]దానముం దపమున్ శమంబును దాంతియున్ యశముం బరి
జ్ఞానయుక్తియు నాదుమూర్తులు సమ్మదంబున నిష్ఠ మ
త్సూను నుత్తమధార్మికు న్నినుఁ జూచు వేడుక వచ్చితిన్.

---

458. 1. జనము - వా. కొన్ని ప్రతులు; జగము - పెక్కు ప్రతులు. 2. నోర్వంగ నిపుడు చాలనయ్య యింతనిజము - ఇ. ఏ.

459. 1. లయ్యెద రనిన - అ. ఇ. ఎ. ఏ. చ; లయ్యెడమని-త. ద; లయ్యెదువనిన - వా. కొన్ని ప్రతులు. 2. విగతప్రాణులై పడియున్న...మేల్కని - వా; విగత క్షుత్పిపాసులై - పెక్కు ప్రతులు. 3. మేల్కనినట్లు - వా. కొన్ని ప్రతులు; మేల్కనిన తెరంగున - పెక్కు ప్రతులు. 4. ధర్మపుత్రుం - పెక్కు ప్రతులు; ధర్మజుం - వా.

460. 1. మాత్రుడుగనే మది - వా. కొన్ని ప్రతులు; మాత్రుడని నెమ్మది - పెక్కు ప్రతులు. 2. పురసూదనుండవో - పెక్కు ప్రతులు. 3. యట్టులుగాక - వా. సం. కొన్ని ప్రతులు; యట్లును - పెక్కు ప్రతులు. 4. ధర్మదేవతవో - వా. కొన్ని ప్రతులు; నైన ధర్ముడవో - ఇ. ఎ. ఏ. 5. నేర్పడన్. అనిన - వా. కొన్ని ప్రతులు; నావుడున్ - పెక్కు ప్రతులు.

462. 1. దానధర్మ తపోక్షమంబులు - ద; ధర్మతపోదమంబును శాంతియున్ యశమున్ ఝు.

463. వ. నన్నాశ్రయించిన జనంబులు దుర్గతిం బొరయరు గావున [1]నభిమతంబు లైన వరంబు లిచ్చెద నడుగు మనినఁ బాండవాగ్రజుండు సంభ్రమభక్తి[2]పరుం డగుచు దండప్రణామంబు సేసి యద్దేవోత్తముం బ్రస్తుతించి దేవా మదీయాశ్రమ వాసుం డైన భూసుర[3]వరు నరణి యొక్క హారిణంబుచేత నపహృతం బయ్యె నతనికిం గర్మలోపంబు గాకుండ నయ్యరణిం గరుణింపవే యనినఁ బ్రీత చిత్తుం డగుచు ధర్మదేవుండు.

464. క. వినుమేను నీమనోగతి, యనఘా యెఱుఁగంగ వేఁడి యరణీహరణం
బొనరించితి మృగ మెక్కడి, దని యమ్మహనీయవస్తు వతనికి నిచ్చెన్.

465. వ. ఇచ్చి మఱియు [1]నిట్లనియె పదుమూఁడవయేఁడు సనుదెంచె నింక మీ రజ్ఞాత వాసంబు సలుపవలయు నందు [2]మీ రెవ్వ రెక్కడ నేరూపంబునం జరియింపం గోరిన నయ్యేరూపంబు లలవడియెడు నెట్లున్నను మిమ్మెవ్వరు నెఱుంగ కుండునట్లుగా వరం బిచ్చితి నింక నొం డెయ్యది వలసిన నడుగు మనిన నమ్మనుజేశ్వరుం డిట్లనియె.

466. మత్తకోకిలము.

ఆదిదేవుఁడ వైన నీవు దయామతిం బొడసూపి న
న్నాదరించుటఁ జేసి ధన్యుఁడ నైతి నింతకు నెక్కు డొం
డేది [1]కలునె యైన నామది యెల్లనాఁడును గ్రోధమో
హాదులం బెడఁ బాసి ధర్మువునంద నెక్కొనఁ జేయవే.

467. వ. అనిన నద్దేవుం[1]డతనికి నవ్వరం బొసంగి [2]యంతర్హితుండయ్యెఁ గౌంతేయులు గ్రమ్మఱి నిజాశ్రమంబున కరిగి ధరణీదేవునకు నరణీప్రదానంబు సేసి

---

463. 1. నభిమతవరం బిచ్చెద వేఁడు మనిన - వా. కొన్ని ప్రతులు; నభిమతంబు లైన వరంబులిచ్చెద నడుగు మనిన-కొన్ని ప్రతులు. 2. భరితుం - వా. కొన్ని ప్రతులు; పరుండగు - అ. ఉ. ఎ. ఏ. ఝ. ద. 3. వరు - ఈ. ఉ. త. శ. ష; ముఖ్యు - వా. కొన్ని ప్రతులు.

465. 1. నిట్లనియె - పెక్కు ప్రతులు; నిట్లను నిదె - వా. కొన్ని ప్రతులు. 2. మీరెవ్వ రెక్క డెక్కడెయ్యే రూపంబులు - పీ. శ.

466. 1. గల్గునె యైన - కొన్ని ప్రతులు; గల్గెడు నైన - వా. కొన్ని ప్రతులు.

467. 1. డావరం బొసగి-కొన్ని ప్రతులు. 2. యనంతరంబ యంతర్హితుం డయ్యె-వా.

తత్ప్రయుక్తాశీర్వాదంబులు గైకొని పరమానందంబు[3]నం బొందిరని యిట్లు పాండుతనయుల వనవాసప్రకారంబు సవిస్త[4]రమధురంబుగా నుపన్యసించి.

468. క. అనఘుండు కృష్ణద్వైపా, యనశిష్యుండు బోధనిధి సమంచిత మేధా
ఘనునకుఁ [1]బారిక్షితునకు, ననవరతానందసుఖసమగ్రత యొసఁగెన్.

469. సీ. భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుండు శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యానసంసక్తచిత్తుఁడు [1]సూరనార్యునకును బోతమాంబికకును
నందనుఁ డిలఁ [2]బాకనాటిలో నీలకంఠేశ్వరస్థానమై యొసక మెసఁగు
[3]గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు ధన్యుండు ధర్మైకతత్పరాత్ముఁ

తే. డెఱ్ఱనార్యుండు సకల[4]లోకైకవిదితుఁ, డయిన నన్నయభట్టమహాకవీంద్రు
సరస[5]సారస్వతాంశప్రశస్తి దన్నుఁ, జెందుటయు సాధుజనహార్షసిద్ధిఁగోరి.

470. క. ధీరవిచారుఁడు తత్కవి, తా[1]రీతియుఁ గొంత దోప దద్రచనయకా
నారణ్యపర్వశేషము, పూరించెఁ గవీంద్రకర్ణపుట [2]పేయముగాన్.

471. క. వీరావతార విమలా, చార మహోదార శుభవిచార సుజనమం
దార [1]నవకీర్తిమౌక్తిక, హార హరపదాబ్జమధుకరాత్మ[2]విహారా.

---

3. నంబొందిరని – పెక్కు ప్రతులు; మానందంబునుంబొందిరి – వా. 4. రంబుగా– కొన్ని ప్రతులు.

468. 1. జనమేజయునకు – ఇ. ఏ.

469. 1. పోతనార్యునకును సూరమాంబికకును – ఈ. ఐ. త. 2. బ్రాకనాటిలో – ఆ. ఇ. ఏ. ద. 3. గుడ్లూరి – పెక్కు ప్రతులు. 4. కవీంద్రవినుతు డైన – ఓ. 5. సారస్వతాంశు – ఘ; సారస్వతాంశప్రసక్తి – ఇ. ఏ. ఔ. గ. ఘ. చ.

470. 1. రీతియ (యొ) – కొన్ని ప్రతులు; రీతి యొకింత దోప – ఓ. 2. మోదము గాన్ – ఈ; సేవ్యముగాన్ – ఒ.

471. 1. నవశుక్తి – ఘ. 2. విచారా – ఇ. ఏ.

472. తరలము.

అమితవైభవ లోభమోహ[1]మదాదిదుర్లభ మంజువి
భ్రమ [2]విలాసితకామినీజనపంచబాణ నిరంతరా
నమదశేషనృపాలమౌళి [3]పినద్ధముగ్ధమణిప్రభా
క్రమ [4]సమంచిత విస్ఫురత్పదకాంతినిర్జితపంకజా.

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతంబునం
దారణ్యపర్వంబునందు సీతాన్వేషణంబును లంకాభిగమనంబును రామరావణ
యుద్ధంబును రాఘవాభ్యుదయంబును సావిత్రీచరిత్రంబును సూర్యుండు
గర్ణునకు హితోపదేశంబు సేయుటయుఁ గర్ణు[1]జన్మంబును
నింద్రుడు విప్రరూపంబునఁ గర్ణుకవచకుండలంబులు
హరించుటయు నారణేయంబును యక్షప్రశ్నలును
ధర్ముండు ధర్మజునకు వరంబు లొసంగుటయు
నన్నది సర్వంబును సప్తమాశ్వాసము.

*శ్రీమదాంధ్రమహాభారతమునందలి యారణ్యపర్వము సమాప్తము*



472. 1. మదాది - ఈ. త. వీ; భయాది - వా. పెక్కు ప్రతులు. 2. వికాసి విలాసినీ- వా. కొన్ని ప్రతులు; విలాసితకామినీ - పెక్కు ప్రతులు. 3. కనద్విశుద్ధ - ఇ. ఏ. 4. సమర్పిత (?) - అ. ఈ. ఔ. గ. ఘ. త. ద. శ. ష; పమంచిత - ఇ. ఏ. చ; సమర్పిత - వా. కొన్ని ప్రతులు.

473. 1. జన్మకథనంబును - వా; జన్మంబును నింద్రుండు - పెక్కు ప్రతులు.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము

### గద్య పద్య ప్రథమ పాద సూచి

న

ప

